# వేదసార రత్నావళి

## ద్వితీయ భాగము

గ్రంథకర్త

"సాంఙ్గవేదార్థ వాచస్పతి"

**బ్ర. వే. ఉప్పలూరి గణపతిశాస్త్రి**

**సం॥ 2000**

**ప్రాప్తిస్థానము:**
**వేదసారరత్నావళి**©
శ్రీ వీరవేంకట సత్యనారాయణస్వామివారి దేవస్థానం
అ. అన్నవరం
తూర్పు గోదావరి జిల్లా
ఆంధ్రప్రదేశ్

**తృతీయ ముద్రణ**
ప్రతులు : 1000 (రెండు భాగములు)

**డి.టి.పి.**
నిర్మల
గాంధినగర్, హైద్రాబాద్.
ఫోన్: 7600272

**కవర్ డిజైన్**
త్రిసంధ్య
పుష్పలత

**ప్రకాశకులు:**
బండారు సత్యనారాయణ
అంబా కమ్యూనికేషన్స్
హైదరాబాదు.

**మూల్యము: రూ.100/-**

# విషయసూచిక

## 10. రాజ్యతంత్రము.

## 11. స్నాన ప్రకరణము.

## 12. రుద్రాక్ష ఉత్పత్తి

## 13. నమకము



## 14. చమకము



## 15. ఆర్షవ్యవసాయ పద్ధతులు

## 16. కన్యకాంబ చరిత్ర



## 17. అథర్వ వేదము.

## 18. దేవశునీ వృత్తాంతము.



## 19. సువర్ణోత్పత్తి

## 20. అన్నదాన మహిమ



## 21. వేదప్రాశస్త్యము



## 22. ఉపోద్ఘాత (వేద) భాష్యమునకు ఆంధ్రానువాదము

## 23. జ్ఞానులు, యోగులు



## 24. మేఘాది వివరణము



## 25. సద్గురువుల విశిష్టత



## 26. ఉపనిషద్వివరణము.



## 27. సంస్కృతము, దేవభాష



శ్రీ మహాగణాధిపతయే నమః ।

# వేదసార రత్నావళి

## రెండవ భాగము

## 10. రాజ్యతంత్రము.

వర్తమానకాల మందలి రాజ్యతంత్రములో ప్రముఖులగు నాయకులు కొందరు అనుయాయులను సేకరించుచు, తమకు ప్రాముఖ్యమును కోరుచు, అనేక వ్యూహములుగ కాంగ్రెసు, కమ్యూనిష్టు స్వతంత్ర మున్నగు పార్టీలుగా విడిపోవుట మనకు తెలిసిన విషయమే. ఇట్లే దేవతలు గూడ మధ్యమధ్య అనేక వ్యూహములుగ విభిన్నులైనట్లు శ్రుతులు వక్కాణించుచున్నవి.

"దేవాసురా స్సంయత్తా ఆస న్తే దేవా మిథో
విప్రియా ఆసన్ తే౽న్యోన్యస్మై జ్యైష్ఠాయా తిష్ఠమానా
శ్చతుర్ధా వ్యక్రామ న్నగ్ని ర్వసుభి స్సోమో రుద్రై
రింద్రో మరుద్భి ర్వరుణ ఆదిత్యై స్స ఇంద్రః ప్రజాపతి
ముపాధావ త్త మేతయా సంజ్ఞాన్యా యాజయ
దగ్నయే వసుమతే పురోడాశ మష్టాకపాలం నిరవప
త్సోమాయ రుద్రవతె చరు మింద్రాయ మరుత్వతే
పురోడాశ మేకాదశకపాలం వరుణా యాదిత్యవతె
చరుం తతో వా ఇంద్రం వా జ్యైష్ఠ్యాయాభిసమ
జానత ।" (కృ.య.సం. 2-2-11).

తా॥ ఒకప్పుడు దేవాసురులు యుద్ధమునకు సన్నద్ధులు కాగా, దేవతలు పరస్పరము ప్రీతిరహితులై అంతర్భేదముచే ప్రతినాయకుడును తనకంటె ఇతరునకు జ్యేష్ఠ్యమును (అనగా నాయకత్వమును) అంగీకరింపక, నాలుగు వ్యూహములుగ విడిపోయిరి. అనగా, వసుగణములతో అగ్ని ఒక వ్యూహముగాను, రుద్రులుతో సోముడు రెండవ వ్యూహముగాను, మరుద్గణములతో ఇంద్రుడు మూడవ వ్యూహము గాను, ఆదిత్యులతో వరుణుడు నాల్గవ

వ్యూహముగాను విభక్తులైరి. పిమ్మట ఇంద్రుడు ప్రజాపతి వద్దకు జని, ఈ విషయమును ప్రజాపతికి తెలియజేసెను. అప్పుడు ప్రజాపతి ఇంద్రునిచే ఐక్యమత్య సంపాదక మగు సంజ్ఞానీనామక మగు ఇష్టిని చేయించెను. ఆ ఇష్టిలో వసుగణసమేతు డగు అగ్నికి అష్టాకపాలపురోడాశ భాగమును, రుద్రగణసమేతు డగు సోమునకు చరుభాగమును (అన్నమును), మరుద్గణసమేతుడగు ఇంద్రునకు ఏకాదశకపాలపురోడాశ భాగమును, ఆదిత్య గణసమేతు డగు వరుణునకు చరుభాగమును (అన్నమును), ఏర్పరచెను. దానివలన నాలుగు వ్యూహములకు అంతర్యమందు గల భేదభావములు తొలగి, అన్ని వ్యూహముల వారును ఇంద్రునకు జ్యైష్ఠ్యమును అంగీకరించినట్లు ఈ శ్రుతి బోధించుచున్నది.

లోకములో అనేక పార్టీల వారికి భేదభావము కలిగిన నాడు మధ్యస్థుడగు పెద్దమనిషి వారికి సామంజస్యమును చేకూర్చుటకై వారందరకును ఒక నాయకునిచే టీపార్టీ ఏర్పాటు చేయించి, దాని ద్వారా వారలను తృప్తి పరచి, అందరకును ఐకమత్యమును సంపాదించు విషయము అనుభవసిద్ధము. అట్లే ప్రజాపతి కూడ ఇంద్రునిచే సంజ్ఞానీనామక మగు ఇష్టిని చేయించి, తన్మూలకముగ అన్ని వ్యూహముల వారికిని అంతర్భేదములను పోగొట్టి, అందరును ఏకగ్రీవముగ ఇంద్రునకు జ్యైష్ఠ్యమును అంగీకరించునట్లు చేసెను.

## సంజ్ఞానీష్టి విధానము.

*'య స్సమానై ర్మిథో విప్రియ స్స్యా త్త మే*
*తయా సంజ్ఞాన్యా యాజయే దగ్నయే వసుమతే*
*పురోడాశ మష్టాకపాలం నిర్వపే త్సోమాయ రుద్రవతే*
*చరు మింద్రాయ మరుత్వతే పురోడాశ మేకాదశ*
*కపాలం వరుణా యాదిత్యవతే చరు మింద్ర మేవై*
*సంభూతం జ్యైష్ఠ్యాయ సమానా అభిసంజానతే వసిష్ఠ*
*స్సమానానాం భవతి ।* (కృ.య.సం. 2.కాం. 2.ప్ర. 11.అను.)

తా॥ లోకములో సంఘనాయకులతో విరోధగ్రస్తుడగు పురుషుడు ఈ సంజ్ఞానీష్టిని చేసినచో, యాగీయదేవతా కటాక్షముచే సమానులందరును ఇతనికి జ్యైష్ఠ్యము నంగీకరింతురు. సమాను లందరకును స్వామి (వాసయిత) యగును.

ఇదే విధముగ కాలాంతరమున దేవతలలో తిరిగి వ్యూహములు బయల్దేరినట్లు ఈ క్రింది శ్రుతి బోధించుచున్నది -

*"దేవాసురా స్సంయత్తా ఆస న్తే దేవా మిథో*
*విప్రియా ఆస న్తే_న్యోన్యస్మై జ్యైష్ఠ్యా యాతిష్ఠ*

మానాః పంచధా వ్యక్రామ న్నగ్ని ర్వసుభి స్సోమో
రుద్రైరింద్రో మరుద్భి ర్వరుణ ఆదిత్యై ర్బృహస్పతి
ర్విశ్వై ర్దే వైః ।" (కృ.య.సం. 6.కాం. 2.ప్ర. 2. అను.)

తా॥ కాలాంతరమున దేవాసురులు యుద్ధమునకు సన్నద్ధులు కాగా, దేవతలు పరస్పరప్రీతిరహితులైరి. వారిలో ప్రధానులు తమ కంటె ఇతరులకు జ్యేష్ఠత్వమును అంగీకరింపక, ఐదు వ్యూహములుగ విడిపోయిరి. పూర్వము వలె వసుగణములతో అగ్ని ఒక వ్యూహముగను, రుద్ర గణములతో సోముడు రెండవ వ్యూహముగను మరుద్గణములతో ఇంద్రుడు మూడవ వ్యూహముగను, ఆదిత్య గణములతో వరుణుడు నాల్గవ వ్యూహముగను, విశ్వేదేవతలతో బృహస్పతి ఐదవ వ్యూహముగను విభక్తులైరి. ఇట్లు ఐదు వ్యూహము లైన పిదప కొంత కాలమునకు వారీ క్రింది విధముగ నాలోచించిరి.

"ఈ విధముగ మనము ప్రీతిరహితులమై పరస్పరభేదభావముతో నైదువ్యూహములుగ నుండినచో శత్రువులగు అసురులకు జయరూపమగు కార్యమును మనము స్వయముగ (చేతులార) సంపాదించినవారమగుదుము. ఎందులకన, ఐదు వ్యూహములుగ విడిగా నుండుటచే ఒక్కొక్క వ్యూహమును జయించుట అసురులకు చాలా సులభము. గాన, ఇట్లు వ్యూహములుగా నుండుట మాని, అందరము కలసి ఐకమత్యముగా నుందుము" అని నిశ్చయమునకు వచ్చిరి.

అనంతరము ఐదు వ్యూహముల వారికి పరస్పర విశ్వాసము కొరకు (అనగా తిరిగి విడిపోయెద రను భీతి లేకుండుటకై) అన్ని వ్యూహముల వారును వారి సంబంధమైన ప్రియమైన మణిముక్తాది ద్రవ్యములను ఒకే స్థలమందుంచి, వారిలో ఎవరైన విడిపోయినచో వారి సంబంధమగు మణిముక్తాది ద్రవ్యములను ఇతరు లందరును తీసికొనుటకు శపథము చేసికొనిరి. రాజకీయ తంత్రములో వివిధ దేశముల వారు పరస్పర విశ్వాసము కొరకు ఇట్లే అనేక విధములుగ శపథములు చేయుచుండుటను మనము చూచుచున్నాము.

## దేవతలలో సామాద్యుపాయములు.

"దేవా మనుష్యాః పితర స్తే౽న్యత ఆస న్న సురా
రక్షాగ్ంసి పిశాచా స్తేన్యత స్తేషాం దేవానా ముత
యదల్పం లోహిత మకుర్వన్ త ద్రక్షాగ్ం సి రాత్రీభి
రసుభ్నన్ తాన్ త్సుబ్ధా న్మృతా నభివ్యౌచ్ఛత్తే దేవా
అవిదుర్యో వై నోయం మ్రియ తే రక్షాగ్ంసి వా ఇమం
ఘ్నంతీతి తే రక్షాగ్ స్యుపా - మంత్రయంత తా

న్యబ్రువన్ వరం వృణామహై య దసురాన్ జయామ
త న్న స్సహాసదితి తతో వై దేవా అసురా నజయన్
తె౽సురాన్ జిత్వా రక్షాగ్ స్యపా౽నుదంత." (కృ.య.సం. 2.కాం. 4.ప్ర. 1. అను)

తా॥ ఒకప్పుడు దేవాసురులకు యుద్ధము ప్రసక్త మైనపుడు దేవతలు, మనుష్యులు, పితృదేవతలు ఒక పక్షముగను, అసురులు, రక్షస్సులు, పిశాచములు మరియొక పక్షముగను ఏర్పడిరి. ఇట్లు సైన్యద్వయము యుద్ధమునకు సన్నద్ధము కాగా, అసురపక్ష సైనికులు స్వల్ప ప్రహారముచే దేవతల శరీరమందు కొంచెము రక్తమును ప్రసరించునట్లు చేయసాగిరి. రక్షస్సులు ప్రతిదినము రాత్రులందు వచ్చి ఆ దేవతల శరీరమందలి లోహిత ప్రదేశమును విషాదిప్రయోగముచే క్షుభితమైనదానినిగా చేయదొడగిరి. ఇట్లు రక్తప్రదేశమందు విష ప్రయోగముచే వెంటనే వారు మృతు లయ్యెడివారు. అనంతరము ప్రభాతము కాగానే దేవతలు ఇది రక్షస్సుల కృత్యమని తెలిసికొనిన వారై రక్షస్సులను ఉత్కోచప్రదానముచే స్వాధీనము చేసికొనిరి. దీని ఫలితముగ రక్షస్సులు అసుర విజయఫలమందు తమకు భాగమును కోరి అసురసైన్యము నుండి నిర్గతులై దేవసైన్యమును ప్రవేశించిరి. రక్షస్సుల సహాయముచే దేవతలు అసురులను జయించిరి. కాని, విజయఫలమందు ప్రతిజ్ఞానుసారము రక్షస్సులకు భాగమును ఇవ్వకయే వారిని వెళ్ళగొట్టిరి.

అంతట రక్షస్సులు, దేవతలు అనృతమును చేసిరని (అనగా ప్రతిజ్ఞానుసారము భాగము నివ్వలేదని) దేవతలను ప్రహరణమును చేయుటకు నిశ్చయించుకొని, నలుదిక్కులను దేవతలను ముట్టడించిరి. అప్పుడు దేవతలు అగ్నియందు తమ కార్యసిద్ధిని యాచించి, మూడు హవిస్సులు గల ఇష్టిని నిర్వాపము చేసిరి. వాటిలో ప్రథమహవిస్సును 'ప్రవాన్' అను అగ్నిదేవతకును, ద్వితీయహవిస్సును 'ఇబాధవాన్' అను అగ్నిదేవతకును, మూడవ హవిస్సును 'ప్రతీకవాన్' అను అగ్నిదేవతకును ఉద్దేశించి యాగము చేసిరి. వీటిలో ప్రథమహవిర్యాగముచే పూర్వదిక్కున నున్న రక్షస్సులను ప్రణోదనమును చేసిరి. (జయించిరి) ద్వితీయహవిర్యాగముచే దక్షిణోత్తరపార్శ్వములందలి రక్షస్సులను బాధించిరి (జయించిరి) తృతీయహవిర్యాగముచే పశ్చిమదిక్కు నందలి రక్షస్సులను ఆపనోదనము చేసిరి. (జయించిరి).

ఈ విధముగ లోకములో శత్రువులు తటస్థించినపుడు ఈ మూడు హవిర్యాగములను చేసినచో, ప్రథమహవిర్యాగముచే తన కంటె బలిష్ఠుడగు శత్రువును నిరాకరించును. ద్వితీయహవిర్యాగముచే తనతో సదృశు డగు శత్రువును విశేషముగ బాధించును. తృతీయహవిర్యాగముచే తనకంటె నికృష్టుడగు శత్రువు ఇతనిని పొందలేదు. అనగా, ఇతనితో పోరాడుటకు అసమర్థుడగును.

ఫలితము: ఈ విధములగు శత్రుజయసాధనము లగు కర్మలను (యాగములను) విధించెడి వేదభాగములను అధ్యయనము చేయుట వలన, ఆ క్రతువుల నాచరించిన ఫలము సిద్ధించునని ఈ క్రింది శ్రుతి బోధించుచున్నది -

'యం యం క్రతు మధీతే తేన తేనా స్యేష్టం భవతి ' (స్వాధ్యాయబ్రాహ్మణము)

దీనివలన తెలిసికొన దగిన విషయమేమన, వేదము నధ్యయనము చేసిన ప్రతి వేద విద్వాంసుడును వివిధ ఫలసాధనము లగు వేదభాగములను పారాయణ చేయుచున్నచో, ఆయా వేదభాగములందు ప్రతిపాదించబడిన సర్వక్రతువుల అనుష్ఠాన ఫలమును దేశమునకు చేకూర్చిన వాడగును. కాన, వేదపారాయణము వలన లోకము నకు చాల శ్రేయస్సు చేకూరునని 'యం యం' అను శ్రుతియే వక్కాణించుచున్నది.

## దేవతలలో కలహములు, సంధులు.

ప్రజాపతి రకామయతా౭_త్మన్వ న్మే జాయేతేతి ।
సో౭_జుహోత్ । తస్యాత్మన్వ దజాయత । అగ్నిర్వాయు
రాదిత్యః । తే౭_బ్రువన్ । ప్రజాపతి రహౌషీ దాత్మన్వ
న్మే జాయేతేతి । తస్య వయ మజనిష్మహి । జాయ
తాం న ఆత్మన్వదితి తే౭_జుహువుః । ప్రాణానా మగ్నిః ।
తనువై వాయుః । చక్షుష ఆదిత్యః । తేషాగ్ం హుతా
దజాయత గౌరేవ" । (కృ.య.బ్రా. 2, కాం. 1. ప్ర. 6. అను)

తా॥ పూర్వము ప్రజాపతి అచేతనము లగు నదులు, పర్వతములు మున్నుగువాటిని సృజించి, జీవాత్మతో కూడిన చేతన మగు వస్తుజాతము అగ్నియందు ఉత్పన్న మగు గాక యని కోరి అగ్ని యందు ఉత్పత్తికి సాధనభూత మగు హోమమును చేసెను. ఆ హోమప్రభావముచే చేతను లగు అగ్ని, వాయువు, ఆదిత్యుడు జనించిరి.

అనంతరము ఆ అగ్న్యాదులు పరస్పరము విచారించి ప్రజాపతి హోమమువలన చేతనుల మగు మన మెట్లు జనించితిమో, అట్లే మనకు గూడ జీవాత్మోపేత మగుచే తనవస్తువు పుట్టుగాక యని సంభాషణ చేసికొని, కృతనిశ్చయులై హోమము సలిపిరి. ఆ ఉత్పాద్యమాన వస్తువులలో అగ్ని "ప్రాణేభ్యస్స్వాహా" అను మంత్రముచే ప్రాణముల కొరకు హోమము చేసెను. శరీరము కొరకు వాయువు హోమము గావించెను. చక్షుస్సుల కొర కాదిత్యుడు హోమము చేసెను. ఆ ముగ్గురియొక్క హోమమువలన గోవు ఒక్కటియే ఉత్పన్న మయినది.

# గోపయస్సును గూర్చి కలహము.

"తస్యై పయసి వ్యాయచ్ఛంత । మమ హుతా
దజని మమేతి । తే ప్రజాపతిం ప్రశ్న మాయన్ । స
ఆదిత్యో౽గ్ని మబ్రవీత్ । యతరో నౌ జయాత్ తన్నౌ
సహాసదితి । కస్యైకో౽హౌషీదితి ప్రజాపతి రబ్రవీత్క
స్యైక ఇతి । ప్రాణానా మహ మిత్యగ్నిః । తను వా
అహ మితి వాయుః । చక్షుషో౽హమిత్యాదిత్యః । య
ఏవప్రాణానా మహౌషీత్ । తస్య హుతా దజనీతి । అగ్నే
ర్హుతా దజనీతి । త దగ్నిహోత్ర స్యాగ్నిహోత్రత్వం ।
గౌ ర్వా అగ్నిహోత్రం । య ఏవం వేద గౌ రగ్ని హోత్ర
మితి । ప్రాణాపానాభ్యా మేవాగ్నిగ్ం సమర్ధయతి । అవ్య
ర్ధుకః ప్రాణాపానాభ్యాం భవతి । య ఏవం వేద ।" (కృ.య.బ్రా. 2.కాం. 1.ప్ర. 6.అను.)

తా॥ ఈ విధముగ అగ్ని, వాయు, ఆదిత్యుల హోమముల వలన ఉత్పన్న మయిన గోవు యొక్క క్షీరముల విషయములో ముగ్గురును ఈ క్రింది విధముగ వివాదగ్రస్తులైరి.

కలహప్రకారము:

"నా హోమమువలననే ఆ గోవు జనించినది. గావున, ఆక్షీరములు నావియే. మీకు సంబంధము లేదు." అని అగ్ని పలికెను.

"అట్లు కాదు. నా హోమప్రభావమువలననే పుట్టినది. గాన, ఆ పాలతో మీకు సంబంధము లే"దని వాయు వనెను.

"మీ ఇద్దరి హోమమువలన గాదు. నా హోమమహిమ చేతనే ఈ గోవు పుట్టినదిగాన, ఈ పాలు నా ఒక్కనివే" అని ఆదిత్యుడు పలికెను.

అనంతరము అగ్నివాయ్వాదిత్యులు యెవరి హోమమువలన ఈ గోవు పుట్టెనో ఆ విషయమును నిర్ణయించుటకు ప్రజాపతి యొద్దకు వెళ్ళిరి. అట్లు ప్రజాపతిని గూర్చి పోవుచుండగా, ప్రజాపతి వ్యతిరేకముగ తీర్పు చెప్పినచో తన కుపయోగ ముండదని యోచించి, ఆదిత్యుడు ప్రజాపతి నిర్ణయముకు పూర్వము అగ్నిని గూర్చి ఈ క్రింది విధముగ బలికెను.

"ఓ అగ్నీ! మన ఉభయులలోను యే ఒక్కరికి ప్రజాపతి అనుకూలముగ నిర్ణయించినను ఆ వస్తువును మన మిద్దరము సమముగా చూచుకొందము (అనగా, సమానహక్కుగా అనుభవింతుము), అని ఆదిత్యుడును, అగ్నియు నిర్ణయించుకొనిరి.

అనంతరము వీరు ముగ్గురును ప్రజాపతిని గోవిషయమును నిర్ణయించుమని కోరిరి. అంతట ప్రజాపతి ఈ క్రిందివిధముగ వారి హోమప్రకారమును తెలిసికొని, నిర్ణయించుటకు ప్రశ్నించెను.

ప్రజాపతి: ఓ అగ్న్యాదిత్యులారా! మీలో యెవరు దేనికొరకు హోమము చేసిరి?

అగ్ని: నేను ప్రాణములకొరకు హోమము చేసితిని.

వాయువు: నేను శరీరము కొరకు హోమము చేసితిని.

ఆదిత్యుడు : చక్షుస్సుల కొరకు నేను హోమము చేసితిని.

ప్రజాపతి నిర్ణయము: ఓ అగ్న్యాదిత్యులారా! శరీర చక్షుస్సులు రెండును ప్రాణాధీనములు. ప్రాణములు ముఖ్యములు. ప్రాణవిషయక హోమమువలన గోవు ఉత్పన్నమైనది. ప్రాణముల కొరకు హోమము నగ్ని చేసెను. అందువలన అగ్నిసంబంధమైన హోమము వలన గోవు ఉత్పన్నమైనది. అందుచే గోవున కగ్నిహోత్రమను నామ సంపన్న మయినది.

## నామవేదన ఫలము.

ఈ విధముగ అగ్నిసంబంధమగు హోమమువలన గోవు జనించుటచే గోవునకు అగ్నిహోత్ర మని పేరు. అని ఈ విషయమును తెలిసికొన్న యజమానుడు అగ్నిని ప్రాణాపానములతో సమృద్ధుని చేయును. మరియు వేదితకూడ ఉత్పత్తికాలమందు ప్రజాపతిచే నిర్ణయించబడిన ఆయుస్సుకు పూర్వము యే అపమృత్యువు వలనను ప్రాణాపానములతో వియుక్తుడు కానేరడు. అనగా, సంపూర్ణాయుస్సు కలవాడగు నని తాత్పర్యము.

ఈ విధముగ ప్రజాపతియొక్క నిర్ణయానుసారము గోవుయందు సంపూర్ణాధికారము అగ్నికి సిద్ధించినను, ప్రజాపతి నిర్ణయమునకు పూర్వమే ఆదిత్యుడు అగ్నితో సంధి చేసికొనిన కారణముచే, ఆదిత్యునకును, అగ్నికిని ఆ గోవుయందు సమానహక్కు ఏర్పడెను. అనంతరము వాయువు తనకు కూడ భాగ మీయుడని అగ్నిసూర్యులను కోరినట్లు ఈ క్రింది శ్రుతి బోధించుచున్నది –

'తౌ వాయు రబ్రవీత్ । అను మా భజత మితి ।
యదేవ గార్హపత్యే__ధిశ్రిత్యా ౭__ హవనీయ మభ్యు
ద్రవాన్ । తేన త్వాం ప్రీణానీ త్యబ్రూతాం । తస్మా
ద్యద్గార్హ పత్యేధిశ్రిత్యాహవనీయ మభ్యుద్రవతి । వాయు
మేవ తెన ప్రీణాతి ' (కృ. య.బ్రా. 2. కాం. 1.ప్ర. 6 అను.)

తా॥ అనంతరము అగ్నిసూర్యులు వాయువును గూర్చి ఈ క్రింది విధముగ బల్కిరి. "ఈ గోక్షీరములను పాకార్థము గార్హపత్యమందుంచి అహవనీయము వద్దకు తీసికొని వెడలుటకు 'వాతాయ త్వా' అను మంత్రముచే గార్హపత్యము నుండి ఉద్ధరణము చేసెదరు. ఆ ఉద్ధరణ వ్యాపారము చేతనే నీవు తృప్తి చెందవలెను. అదియే నీకు భాగము. నిత్యాగ్ని హోత్రములో ఈ విధముగ ఉద్ధరణ వ్యాపారము చేతనే యజమానులు వాయువును సంతోష పెట్టుచుండిరి.

ఈ విధముగ దేవతలలో భాగవిషయక మైన కలహములు జనించినపుడు ప్రజాపతి పరిష్కారము చేతను, సంధివిగ్రహాదుల చేతను వ్యాపారములను నిర్వర్తించుకొనుచున్నట్లు శ్రుతుల వలన స్పష్టమగుచున్నది.

## దేవతలలో సమ్మెలు.

*"చందాగ్ంసి దేవేభ్యో౽పాక్రామ౽న్న వో౽భా*
*గాన హవ్యం వక్ష్యామ ఇతి తేభ్య ఏత చ్చతురవత్త*
*మధారయన్ పురోనువాక్యాయై యాజ్యాయై దేవతా*
*యై వషట్కారాయ య చ్చతురవత్తం జుహోతి*
*ఛందాగ్ స్యేవ త త్ప్రీణాతి తా న్యస్య ప్రీతాని దేవేభ్యో*
*హవ్యం వహంతి ।"* (కృ.య.సం.2.కాం.6. ప్ర.3.అను)

లోకములో కార్యాములలోను, కర్మాగారములలోను పని చేయువారివలె పూర్వము దేవతలలో గూడ సమ్మె చేయునలవాటు గలదని ఈ పై శ్రుతివలన స్పష్టమగుచున్నది.

తా॥ పూర్వము దేవతలలో నానావిధచ్ఛందోయుక్తములగు పురోనువాక్యాద్యభిమాని దేవతలగు గాయత్ర్యాదిఛందో దేవతలు, హవిర్భాక్కులగు దేవతల నుంచి అపరక్తులగుచు (అనురాగరహితులగుచు) నిట్లు పలికిరి.

"ఓ దేవతలారా! భాగరహితుల మగు మేము మాకు భాగము లేనిదే మీకు హవిస్సులను పొందించువారము కాము.' ఇట్లు పలికి, గాయత్ర్యాది ఛందో దేవతలు హవిర్వహనమును మాని వెడలిపోయిరి.

అంతట భాగస్వాము లగు దేవతలు విచారించి హోమకాలమందు చతురవత్త హోమమును ఛందోదేవతలకు ప్రీతికరమగు భాగముగ నేర్పరచిరి. ఈ విధమగు చతురవత్తహోమముచే 'పురోనువాక్యా' 'యాజ్యా', 'దేవతా', 'వషట్కార' అను శబ్దములచే

చెప్పబడెడి ఛందోదేవతలను సంతోష పరచిరి. పై శబ్దములలో మూడవది యగు దేవతా శబ్దమునకు ఆహుత్యాధారభూత మగు అగ్నిదేవత యర్థము. వెంటనే ఆ ఛందోదేవతలు సమ్మెను మాని, దేవతలకు హవిర్వహనము చేసినట్లు ఈగాథ వలన స్పష్టమగుచున్నది.

## భూలోకవిషయకస్పర్ధ.

లోకములో దేశాధిపతులు సన్నిహితదేశాధిపత్యమును గూర్చి విరోధించునట్లే, పూర్వము భూలోకాధిపత్యమును గూర్చి దేవతలకును యమునకును స్పర్ధ జనించినట్లు ఈ క్రింది శ్రుతి బోధించుచున్నది.

"దేవాశ్చ వై యమ శ్చా స్మిన్ లోకే__స్పర్ధంత
స యమో దేవానా మింద్రియం వీర్య మయువత త
ద్యమస్య యమత్వం తే దేవా అమన్యంత యమో వా
ఇద మభూ ద్యద్వయగ్గ్ స్మ ఇతి తె ప్రజాపతి ముపధా
వన్ త్స ఏతౌ ప్రజాపతి రాత్మన ఉక్షవశౌ నిరమి
మీత.... ఐంద్రేణైవా స్యేంద్రియం వృఙ్క్తే భవ
త్యాత్మనా పరాస్య భ్రాతృవ్యో భవతి ।" (కృ. య. సం. 2. కాం. 1. ప్ర. 4. అను.)

తా॥ పూర్వము భూలోకాధిపత్యమును గూర్చి దేవతలకును యమునకును విరోధము వాటిల్లెను. యముడు దేవతలయొక్క ఇంద్రియ సామర్థ్యమును పృథక్కరించెను (వేరు చేసెను). "య మిశ్రణే అమిశ్రణే చ" అను ధాత్వర్థానుసారము "య" అను ధాతువుకు వేరుచేయుట అర్థము. కావున, "యౌతీతి యవః" (అనగా వేరుచేయువాడు యవుడు) అని పేరు వచ్చెను. అతనినే యముడని వ్యవహరించుచుండిరి. అనగా, దేవతల యొక్క చక్షురాదీంద్రియముల యొక్క సామర్థ్యమును వేరుచేయువాడు గనుక యము డని పేరు వచ్చెను. ఈ విధముగ దేవతలు తమ ఇంద్రియగత మగు సామర్థ్యము పోయిన పిదప యముని జయించుటకు అసమర్థులగుచు, తమలో తాము (పరస్పరము) ఈ వక్ష్యమాణ విధముగ సంభాషణ చేసికొనిరి. ఎట్లన "పూర్వము ఏ భూలోకాధిపత్యమును పొంది మనము ఉత్కర్షగ నుంటిమో, అట్టి భూలోకాధిపత్యమును యముడు పొంది ఉత్కర్షగా నుండెను". ఇట్లు సంభాషించుకొనుచు, తాము స్వయముగ జయించుట కసమర్థులగుటచే, యముని జయించుటకు తగు ఉపాయార్థమై ప్రజాపతి వద్దకు జని, ఈ వృత్తాంతమును ప్రజాపతికి తెలిపిరి. అపుడు ప్రజాపత్యుపదేశానుసారము దేవతలు విష్ణువు, వరుణుడు ఉభయులును దేవతగా గల ఒక యాగమును, కేవల ఇంద్ర దేవతాక

మగు ఒక యాగమును చేసిరి. ఆ యాగదేవతలలో వరుణ దేవతాకటాక్షముచే యముని వరుణ పాశగ్రస్తునిగా చేసిరి. విష్ణుదేవతా ప్రభావముచే యముని భూలోకమునుండి తొలగించిరి. ఇంద్ర దేవతా ప్రభావముచే యముని ఇంద్రియ సామర్థ్యమును నశింప జేసిరి.

ఫలితము: ఇట్లు శత్రువినాశకరము లగు యాగములను విధించెడి వేదభాగములను అధ్యయనము చేయించినచో ఆ కృత్యనుష్ఠానుఫలము సిద్ధించును గాన, ప్రకృతములో వేదపారాయణలు చేయించుటచే శత్రు పరాజయ ద్వారా దేశమునకు క్షేమము సమకూరుటకు వేదములు ఉపకరించు నని స్పష్ట మగుచున్నది.

## లోకత్రయ స్పర్ధ.

పూర్వము దేవతలు, అసురులు మూడు లోకములను గురించి వివాదగ్రస్తులైనట్లు ఈ క్రింది శ్రుతి బోధించుచున్నది -

"దేవాసురా ఏషులోకే ష్వస్పర్ధంత స ఏతం విష్ణు
ర్వామన మపశ్యత్తగ్గ్ స్వాయై దేవతాయా అలభత
తతో వై స ఇమాన్ లోకా నభ్యజయ ద్వైష్ణవం వామన
మాలభేత స్పర్ధమానో విష్ణురేవ భూత్వేమాన్ లోకా నభి
జయతి ।"

(కృ. య. సం. 2. కాం. 1. ప్ర. 3. అను.)

దేవతలు కేవలయుద్ధముచే అసురులను జయించుట కశక్తులైరి. అంతట విష్ణువు విష్ణుదేవతాక మగు వామనపశుయాగమును జయసాధనముగ నిశ్చయించెను. వెంటనే వామన పశువును (హ్రస్వపశువును) పూర్వకల్పమందలి విష్ణుదేవత కొరకు ఆలంభము (యాగము) చేసెను. ఆ యాగసామర్థ్యముచే విష్ణువు అసురులను జయించి, మూడు లోకములను వశము చేసికొనెను.

## గృహక్షేత్రాదిస్పర్ధలో ఈ యాగము జయహేతువు.

"వైష్ణవం వామన మాలభేత స్పర్ధమానో విష్ణురేవ
భూత్వేమాన్ లోకా నభిజయతి ।"

(కృ. య. సం. 2. కాం. 1. ప్ర. 3. అను)

తా॥ లోకములో గృహములు, భూములు మున్నగువాని విషయములో వివాదగ్రస్తుడైన పురుషుడు విష్ణుదేవతాక మగు ఈ వామన పశుయాగమును చేయవలెను. ఈ యాగమును చేయు యజమానుడు విష్ణువుకు ప్రియమగు హవిస్సును ఇచ్చుచున్నాడు గాన, ఇతడు విష్ణురూపుడై ఈ లోకములను జయించును.

ఈ యాగమునకు దేశవిధానము:

సామాన్యముగ "సమే యజేత" అను విధి ననుసరించి సమ ప్రదేశమందు యాగమును చేయవలెను. ఈ విధి ననుసరించి ఈ వైష్ణవ పశుయాగము సమప్రదేశమందు చేయవలసి యుండగా, దానిని బాధించి విశేష విధి ఈ క్రింది విధముగా నున్నది.

*'విషమ ఆలభేత విషమా ఇవ హీమే లోకా*
*సమృద్ధ్యై "* *(కృ.య.సం. 2.కాం. 1.ప్ర. 3.అను.)*

తా॥ లోకముల జయముకొరకు చేసెడి యాగముగాన, లోకములు సమముగా నుండక ఒకదానిపై నొకటి విషమముగ నుండుటచే విషమప్రదేశ మందీయాగమును చేసినచో అది సమృద్ధ మగును.

## యుద్ధమందు విజయమునకు పశువిధానము.

*"ఇంద్రాయ మన్యుమతే మనస్వతే లలామం*
*ప్రాశృంగ మాలభేత సంగ్రామే సంయత్త ఇంద్రియేణవై*
*మన్యు నా మనసా సంగ్రామం జయ తీంద్రమేవ మన్యు*
*మంతం మనస్వంతగ్గ్ స్వేన భాగధేయేనోపధావతి స ఏ*
*వాస్మి న్నింద్రియం మన్యుం మనో దధాతి జయతి*
*తగ్ం సంగ్రామం"* *(కృ.య.సం. 2.కాం. 1.ప్ర. 3.అను)*

యుద్ధమునకు వెళ్ళబోయెడి సమయమున ఈ క్రింది పశు యాగమును చేయవలసినదిగా పై శ్రుతి బోధించుచున్నది.

తా॥ ధైర్యవంతుడు, క్రోధయుక్తుదు నగు ఇంద్రుని కొరకు ముఖమందు తెల్లని బొట్టువంటి వెంట్రుకలు కలిగినట్టియు, ముఖము వైపుకు వాలిన కొమ్ములు గల ఋషభమును ఆలంభము చేయవలెను. ఈ యాగమును చేయుటవలన శరీరబలము, శత్రు విషయకక్రోధము, ధైర్యము గలవాడై యుద్ధమందు విజయమును పొందును. ఈ విధములగు క్రతువులను చెప్పెడి వేదభాగములను అధ్యయనము చేసినచో యాగానుష్ఠానఫలము సిద్ధించును. గాన. వేదపారాయణాదికము దేశక్షేమసంపాదకము.

## ఒకపుడు అసురుల విజయము.

*"దేవాసురా స్సంయత్తా ఆసన్ తాన్ దేవా నసురా*
*అజయత్తే దేవాః పరాజిగ్యానా అసురాణాం వైశ్యము*

పాయన్ తేభ్య ఇంద్రియం వీర్య మపాక్రామ త్తదింద్రో
ఽ_చాయత్త దన్వపాక్రామ త్తదవరుంధ నాశక్నోత్త
త్తదస్మా దభ్యర్థో౽_చర త్స ప్రజాపతి ముపాధావ త్త
మేతయా సర్వపృష్ఠయా౽_యాజయ త్తయైవాస్మి
న్నింద్రియం వీర్య మదధాత్ ।" (కృ.య.సం. 2-3-7)

తా॥ ఒకప్పుడు దేవాసురుల యుద్ధములో అసురులు దేవతలను జయించిరి. అప్పుడు దేవతలు పరాజితులై అసురులకు బానిసలుగ సేవ చేయుచుండిరి. దేవతల యొక్క శరీర సామర్థ్యము, ఇంద్రియ సామర్థ్యము వారినుండి తొలగిపోయెను. ఇంద్రుడు ఆ వృత్తాంతమును తెలిసికొని, ఆ ఇంద్రియ శరీరసామర్థ్యములను స్వాధీనము చేసికొనుటకు వెడలెను. కాని, ఆ సామర్థ్యద్వయము నంతను అతడు స్వాధీనము చేసికొనుటకు సమర్థుడు కాకపోయెను. అప్పుడు ఆ సామర్థ్యద్వయములో సగము బాగము మాత్రము సంప్రాప్త మాయెను. అనంతరము మిగిలిన సగము బాగమును పొందుటకు ప్రజాపతిని సేవించి సర్వపృష్ఠేష్టి అను యాగముచే ఆసామర్థ్య ద్వయమును సంపూర్ణముగ ఇంద్రుడు పొందెను.

ఆయాగములో రథంతరము, బృహత్, వైరూప, వైరాజ, శాక్వర, రైవతము లను ఆరును ప్రధానమైన సామలు. అట్టి సామ సాధ్యములగు పృష్ఠస్తోత్రములతో కూడుకొనిన ఇంద్రుడు ఆ సర్వ పృష్ఠేష్టిలో దేవత. (ఇచ్చట స్తోత్రపార మనగా రథంతరాదిసామల గాన మని యర్థము కాదు. మరేమన, ఇట్టి స్తోత్రాభిజ్ఞుడగు ఇంద్రుడని ఇంద్రదేవతకు విశేషణము) కావున, ఆ ఇష్టికి "సర్వపృష్ఠేష్టి" అను నామము సిద్ధించెను.

## సర్వపృష్ఠేష్ట విధానము.

"య ఇంద్రియకామో వీర్యకామ స్స్యాత్త మేతయా
సర్వపృష్ఠయా యాజయే దేతా ఏవ దేవతా స్స్వేన
భాగధేయో నోపధావతి తా ఏవా౽_స్మి న్నింద్రియం
వీర్యం దధతి ।" (కృ.య.సం. 2-3-7)

తా॥ లోకములో చక్షురాదీంద్రియసామర్థ్యమును, శరీర సామర్థ్యమును కోరువాడు ఈ సర్వపృష్ఠేష్టిని చేయవలెను. (రథంతరాది విశేషణములతో కూడిన ఆరుగురు ఇంద్ర విశేషములు ఈ క్రతువులో దేవతలు). ఈ ఇష్టిచే ఆ ఇంద్రదేవతలను స్వకీయభాగప్రదాన ముచే సేవించినవాడగును. ఆ దేవతలే ఈ యాగకర్తయగు యజమానియందు సామర్థ్య ద్వయమును స్థాపన చేయుదురు.

## దేవతావిశేషవిధి.

"యదింద్రియ రాథంతరాయ నిర్వపతి య దేవ్యా__
గ్నేస్తే జ స్త దెవావరుంధే య దింద్రాయ బార్ హతాయ
య దేవేంద్రస్య తేజస్త దేవావరుంధే య దింద్రాయ
వైరూపాయ యదేవ సవితు స్తేజ స్తదేవావరుంధే
య దింద్రాయ వైరాజా దింద్రాయ రైవతాయ
యదేవ బృహస్పతే స్తే జ స్త దేవావరుంధ ఏతావంతి
వై తేజాగ్ంసి తాన్యేవ్యా__వరుంధే ।" (కృ.య.సం. 2-3-7.)

తా॥ పృష్ఠస్తోత్రమును (ప్రధానస్తోత్రమును) సంపాదించెడి రథంతరసామను తెలిసినవాడు గనుక 'రాథంతరుడు' అని ఇంద్రునకు పేరు. ఇట్లే పృష్ఠస్తోత్రనిష్పాదక మగు బృహత్సామను తెలిసిన వాడు గావున బార్హతుడు. వైరూపసామను గుర్తెరిగినవాడు గావున, వైరూపుడు. ఇట్లే పృష్ఠస్తోత్రనిష్పాదకము లగు వైరాజ, శాక్వర, రైవతసామలను గుర్తెరిగినవాడు గావున, వైరాజుడు, శాక్వరుడు, రైవతుడు అని ఇంద్రునకు విశేషణములు.

ఈ ఇష్టిలో రాథంతరేంద్రుడు, బార్హతేంద్రుడు, మున్నగు దేవతలకు హవిర్నిర్వాపము (హవిర్దానము)చే అగ్ని తేజస్సును, ఇంద్రతేజస్సును, సవితృ తేజస్సును, ధాతృతేజస్సును, మరుద్గణముల తేజస్సును, బృహస్పతి తేజస్సును, అందరి తేజస్సులను (యజమానుడు) స్వాధీనము చేసికొనును. అనగా, సంపాదించవలసిన తేజస్సు లన్నింటిని సంపాదించిన వాడగును.

## దూతల ఆవశ్యకత.

**లో**కములో ఏదైన కార్యాలయములో ఉద్యోగ పదవులు కాళీ వచ్చినపుడు అనేకులు వాటికొరకు ఆశింతురు. అట్లే దర్శపూర్ణమాసే ష్టులలో దేవతలను ఆహ్వానము చేయుటకు దూతల (నౌకర్ల) ఆవశ్యకత వచ్చెను. ఆ పదవి కొరకు ముగ్గురు అగ్నులు (అనగా హవ్యవాహనుడు, కవ్యవాహనుడు, సహరక్షస్సు,) ఆశించిరి. దేవతలకు హవ్యవహనము చేయు వహ్నికి హవ్యవాహను డని పేరు. పితృదేవతలకు హవిర్వహనము చేయు వహ్నికి కవ్యవాహను డని పేరు. అసురులకు హవిర్వహనము చేయు వహ్నికి సహరక్షస్సు అని పేరు. ఈ ముగ్గురు వహ్నులును దేవతలకు హవిర్వాహనము చేసెడి దూత పదవికి ఎవరికి వారు తననే వరించెద రని ఆశించుచుండగా, హవ్యవాహను డను అగ్నినే దూతగా వరించినట్లు ఈ క్రింది శ్రుతి బోధించుచున్నది.

త్రయో వా అగ్నయో హవ్యహవానో దేవానాం
కవ్యవాహనః పితృణాగ్ం సహరక్షా అసురాణ్ణా త ఏతర్

హ్యేశగ్ంసంతే మాం వరిష్యతే మా మితి వృణీధ్వగ్ం
హవ్యవాహన మిత్యాహ య ఏవ దేవానాం తం వృణీతే'

(కృ. య. సం. 2. కాం. 5. ప్ర. 8. అను)

ఇదే విధముగ మరియొకప్పుడు దేవతలు తమ కార్యములందు అగ్నిని దూతగా పంపుచుండెడివారు. అసురులు కవిపుత్రుడగు ఉశనుని తమ కార్యములందు దూతగా ప్రేషణ చేయుచుండెడివారు. వీరుభయులును దేవతలకు దూతగా నుండవలెనను తలంపుతో ప్రజాపతి వద్దకు వెడలి -

"సంధివిగ్రహాది కార్యములందు నేర్పుగలవానిని దూతగా స్వీకరించవలెను గావున, మా యిద్దరిలో అట్టి నేర్పు ఎవరికి గలదు?" అని ప్రజాపతి నడిగిరి. అంతట ప్రజాపతి, "అగ్నిం దూత వృణీ మహే" అను మంత్రముచే సమాధానము చెప్పి, వెంటనే ఉశనుని నుండి పరాఙ్ముఖుడై అగ్నికి అభిముఖు డాయెను. అనగా, అగ్నిని దూతగా పరిగ్రహించెను. సంధివిగ్రహాదులందు నేర్పరి యగు అగ్నిని దూతగా స్వీకరించుటచే దేవతలు విజయమును పొందిరి. అసురులు పరాజయమును పొందిరి. ఈ విషయమునే ఈ క్రింది శ్రుతి బోధించుచున్నది.

"అగ్ని ర్దేవానాం దూత ఆసీ దుశనా కావ్యో__
సురాణాం తౌ ప్రజాపతిం ప్రశ్న మైతాగ్ం స ప్రజాపతి
రగ్నిం దూతం వృణీమహ ఇత్యభిపర్యావర్తత తతో దేవా
అభవ న్పరా సురాః ।" (కృ. య. సం. 2. కాం. 5. ప్ర. 11. అను.)

ఫలితము: దీనివలన, సంధివిగ్రహాదులందు కుశలులగు దూతలు విజయమునకు హేతుభూతు లగుదు రని తెలియుచున్నది. అట్టి వారిని రాజకీయములో రాయబారులుగా నుంచుకొనుటవలన విజయము చేకూరునని నీతి బోధిత మగుచున్నది.

## దూతలలో కలహములు, ప్రజాపతి తీర్పు.

"వాక్చ మనశ్చా__ర్తీయేతా మహం దేవేభ్యో
హవ్యం వహామీతి వా గబ్రవీ దహం దేవేభ్య ఇతి మన
స్తౌ ప్రజాపతిం ప్రశ్న మైతాగ్ం సో బ్రవీ త్ప్రజాపతి
ర్దూతీ రేవత్వం మనసో__సి యద్ధి మనసా ధ్యాయతి త
ద్వాచా వదతీతి తత్ఖలు తుభ్యం న వాచా జుహవ న్నిత్య
బ్రవీ త్త స్మా న్మనసా ప్రజాపతయే జుహ్వతి మన ఇవ హి
ప్రజాపతిః ప్రజాపతే రాప్త్యై ॥" (కృ. య. సం. 2. కాం. 5. ప్ర. 11. అను.)

తా॥ వాగింద్రియము, మనస్సు రెండును దేవతలకు హవిర్వహనమును గూర్చి పరస్పరము తమ తమ ఉత్కర్షను ప్రకటింపసాగిరి. అనంతరము వాఙ్మనస్సులు రెండును హవిర్వహనమును ఎవరు చేయుటయో నిర్ణయించుకొనుటకు ప్రజాపతి వద్దకు వెడలిరి. అప్పుడు ప్రజాపతి వాగింద్రియమును గూర్చి ఈ క్రిందివిధముగ బల్కెను.

ప్రజాపతి: ఓ వాగింద్రియమా! నీవు మనస్సుకు దూతవు గాని, స్వతంత్రురాలవు గావు. కారణ మేమన; లోకములో పురుషుడు ముందుగ దేనిని మనస్సులో ధ్యానించునో అనంతరము దానిని వాక్కుచే బలుకును. ముందుగ మనస్సులో చింతించని విషయములను వాక్కుచే బలుకలేదు. గావున నీవు మనస్సుకు దాసివి.

ఈ విధముగ ప్రజాపతి మనస్సు పక్షమున తీర్పు చెప్పిన వెంటనే వాగింద్రియము క్రోధగ్రస్త మగుచు ప్రజాపతిని గూర్చి ఈ క్రింది విధముగ బల్కెను.

వాగింద్రియము: ఓ ప్రజాపతీ! నేను మనస్సునకు దూతి నైనచో, ఎవరును వాక్కుచే మంత్రము నుచ్చరించి నీకు హోమమును చేయకపోవుగాక.

కావుననే "మనసాౣ౾ఘారయతి" అను విధివాక్యము మనస్సు చేతనే ప్రజాపతికి ఆఘారహోమమును చేయవలసినదిగా విధించినది. ఆవిధిబలమువలన వాక్కుచే మంత్రము నుచ్చరించకయే, మనస్సుచే ప్రజాపతిని ధ్యానించుచు ప్రజాపతికి ఆఘార మనియెడి హోమమును చేసెదరు.

ఈ ఆఘారహోమమునందే గాక, జయాదులు మున్నగు సర్వప్రదేశములందును ప్రజాపతికి (మనస్సు చేతనే ధ్యానించుచు) హోమమును చేయు నాచారము కలదు. ఇంతేగాక, మనస్సు సంకల్పముచే కార్యము నెట్లు సాధించునో, అట్లే ప్రజాపతి కూడ సంకల్పముచే కార్యమును సాధించును గావున, మనస్సునకును ప్రజాపతికిని సాదృశ్యము గలదు. అందుచే ప్రజాపతి సదృశమగు మనస్సుచే ధ్యానించి ఆఘారహోమమును చేయుటచే ఆ హోమము ప్రజాపతిప్రాప్తి కొరకగును.

## తిరిగి దూతవరణ.

"అగ్ని ర్దేవానాం దూత ఆసీ ద్దై వ్యోౣసురాణాం
తౌ ప్రజాపతిం ప్రశ్న మైతాంగ్ం స ప్రజాపతి ర్బ్రా
హ్మణ మబ్రవీ దేత ద్విబ్రూహీ త్యాశ్రావయేతీదు దేవా
శ్శృణుతేతి వావ త దబ్రవీ దగ్ని ర్దేవో హోతేతి య

ఏవ దేవానాం త మవృణీత తతో దేవా అభవ న్పరాసురా
యస్యైవం విదుషః ప్రవరం ప్రవృణతే భవత్యాత్మనా
పరాస్య భ్రాతృవ్యో భవతి ।"

తా॥ పూర్వము 'ఆర్షేయం వృణీతే" అను శ్రుత్యనుసారము సామిధేనీ ప్రస్తానము (ప్రకరణము)లో 'హోత' అనే ఋత్విక్కు అగ్నిని వరించుట యీ క్రింది విధముగా చెప్పబడినది –

'భార్గవ, చ్యావనా॒॒ ॒ ప్నవా నౌర్వ జామదగ్న్యేతి '

ఇచ్చుట, అధ్వర్యుడు యజమానుని ప్రవరలోని ఋష్యపత్యము లను ఉత్తముని (చివరగాని) లగాయతు వీనికి పై పై ఉత్తరోత్తరులను వరించవలెను.

ఉదాహరణ: 'అగ్ని ర్దేవో హోతా దేవాన్ యక్ష
ద్విద్వాగ్శ్చికిత్వ న్మ నుష్వద్భరతవత్ '

ఇంతవరకు ఈ మంత్రమును పఠించి, అనంతరము ఈ క్రింది దానిని పఠించవలెను.

'జమదగ్ని వ దూర్వవ దప్న వానవ చ్యనవ ద్భృగువత్ ' ఇతి.

ఇచ్చుట అధ్వర్యుకర్తృకహోతృ విషయకవరణలో (ప్రకృతము) అగ్ని మానుషుడు, దైవ్యుడు అని రెండు విధములు. భూలోకవాసి యై యజ్ఞసాధన భూతు డగు అగ్ని మానుషుడు. అతడు దేవతలకు (హవిర్వహనముచే) దూత అయెను.

"దివి నాకో నామాగ్నిః" అను శ్రుత్యనుసారము ద్యులోక మందుండెడి 'నాకుడు' అను అగ్ని దైవ్యుడు. అతడు అసురులకు హితమును చేయుచు వారికి దూతగా నుండెను.

ఆ యిద్దరు అగ్నులును తమలో యెవరికి దేవదౌత్యముచిత మను విషయము నడుగుటకై ప్రజాప్రతివద్దకు వెళ్లిరి. ఇచ్చుట మానుషాగ్నికి ఈ క్రింది విధముగ బ్రాహ్మణు డని పేరు.

'బ్రహ్మణి వేదే విహితం కర్మ సాధయితుం ప్రవృత్తత్వాత్ బ్రాహ్మణః'

ఇచ్చుట బ్రాహ్మణశబ్దములోని బ్రహ్మశబ్దమునకు వేద మని యర్థము. వేదమందు విధించబడిన కర్మను సాధించుటకు ప్రవర్తించువా డగుటచే మానుషాగ్ని బ్రాహ్మణుడు నాకనామకు డగు దైవ్యాగ్ని అసురుల యొక్క కర్మను సాధించుటకు ప్రవర్తించువా డగుటచే ఆసురు డని చెప్పబడును. అట్టి ఇద్దరు అగ్నులలోను బ్రాహ్మణాగ్నిని గూర్చి ప్రజాపతి ఈ క్రింది విధముగ బలికెను.

ప్రజాపతి: ఓమానుషాగ్నీ! నీవే దేవదాస్యమున కర్హుడవు. కావున, నీవే యాగమందు చెప్పదగిన సర్వమును చెప్పుము. అని మానుషాగ్నినే దూతగా ప్రజాపతి వరించెను.

## దేవతలలో అధికారుల మార్పు.

**లో**కములో అధికారులను భిన్నభిన్న ప్రదేశములకు ట్రాన్సుఫరు చేసినట్లే దేవతలలోఁగూడ అధికారుల మార్పులను శ్రుతులు తెల్పుచున్నవి.

"అగ్ని రముష్మిన్ లోక ఆసీ దాదిత్యో౽స్మిన్ తా
విమౌ లోకా వశాంతా వాస్తాం తే దేవా అబ్రువ న్నేతే
మౌ విపర్యూహామే త్యగ్న ఆయాహి వీతయ ఇత్య
స్మిన్ లోకేగ్ని౽ మదధు ర్బృహదగ్నే సువీర్య మిత్య
ముష్మిన్ లోక ఆదిత్యం తతో వా ఇమౌ లోకా
వశామ్యతాం ॥" (కృ.య.సం. 2.కాం. 5.ప్ర. 8.అను.)

తా॥ పూర్వము స్వర్గలోకమునందగ్నియు, భూలోకమునందాదిత్యుడును యుండెడివారు. అప్పుడు రెండు లోకములును శాంతి రహితములై యుండెను. ఎందులకన, స్వర్గమునం దమృతమును భుజంచెడి దేవతలకు పాకాపేక్ష లేకపోవుటచే అగ్న్యపేక్ష లేకుండెను. భూలోక నివాసులకు ఆహారనిష్పాదనకై పాకము ముఖ్య ప్రయోజనము గావున, పాకమునకు అగ్న్యపేక్ష గలదు. ఈ విధముగ, స్వర్గమందు ప్రకాశాపేక్ష గల దేవతలకు ప్రకాశకు డగు ఆదిత్యుడు లేక పోవుట చేతను, భూలోకమందు పక్వాహారులగు మానవులకు పాకనిష్పా కు డగు అగ్ని లేకపోవుట చేతను రెండు లోకములును శాంతి రహితములై క్షోభను పొంద సాగెను. ఈ క్షోభనివారణకై దేవతలు పరస్పరము ఈ వక్ష్యమాణవిధముగ బలికిరి –

"ఈ అగ్న్యాదిత్యులను విపరివృత్తులనుగా చేయుదము. అనగా, స్వర్గలోకమునం దాదిత్యుని, భూలోకమం దగ్నిని మార్చి స్థాపన చేయుదము. గాన మీరందరును రండు.'

ఇట్లు పలికి, అనంతరము 'అగ్న ఆయాహి' అను మంత్ర సామర్థ్యముచే అగ్నిని భూలోక మందును, 'అచ్ఛాదేవ వివాససి' ఇత్యాది మంత్రప్రభావముచే ఆదిత్యుని స్వర్గలోకమందును వ్యత్యాసముగ మార్చి స్థాపన చేసిరి. దానివలన రెండు లోకములును శాంతములై క్షోభరహితము లైనవి.

ఫలితము: లోకములో రెండు వేరు వేరు ప్రదేశములలో నున్న ఇద్దరు అధికారులను, వారు ఆప్రదేశములలో నుండుటచే అచ్చటి నివాసులకు సుఖము, శాంతి వారివలన లేనపుడు వారిని ఉభయులను వ్యత్యాసముగ వీరి ప్రదేశమందు వారిని, వారి ప్రదేశమందు

వీరిని మార్పు చేయుట మనకు అనుభవసిద్ధ మైన విషయము. ఇట్టి సంప్రదాయము దేవతలలోగూడ గలదను విషయము ఈ పైన వ్రాసిన అగ్న్యాదిత్యుల పరస్పరమార్పును బట్టి మనకు విశదమగుచున్నది.

## బిరుదదానములచే అధికారుల మార్పు.

పూర్వము అగ్ని స్వర్గలోకమందును, యముడు భూలోకమందును ఉండెడివారు. అప్పుడు భూలోకములో మనుజులకు అగ్ని లేకపోవుటచే పాకాదినిష్పత్తి లేకపోవుట చేతను, పితృలోకములో పితృదేవతలకు రాజు లేకపోవుట చేతను, అగ్ని, యములకు విపరి వర్తనము చేయుటకై దేవతలు ఇచ్ఛయించిరి. అనగా, అగ్నిని భూలోకము నందును, యముని పితృలోకమునందును మార్పు చేయుటకు తలంచి దేవతలందరును సమావేశ మయిరి. ఆ సన్నివేశములో, స్వర్గ లోకములో సుఖముగ నుండెడి అగ్ని భూలోకమునకు వచ్చుటకు సమ్మతించుటకై అగ్నికి 'అన్నాదుడు' అను బిరుదము నిచ్చి సమాధాన పరచిరి. కావుననే దేవతలలో అగ్ని 'అన్నాదుడు' అనగా బహ్వన్న భక్షకు డాయెను.

పితృదేవత లన్ననో, రాజ్యరూప మగు ఉత్కోచముచే యముని తమలోక గమనమందు ఆసక్తి గలవానినిగ జేసిరి. కావుననే యముడు పితృదేవతలకు రాజయ్యెను.

ఈ వృత్తాంతమును తెలిసికొన్నవారు భక్షణ యోగ్య మగు అన్న సమృద్ధి, రాజ్య సంపత్తి రూప మగు ఫలములను పొందెదరు. ఈ విషయము నీ క్రింది శ్రుతి బోధించుచున్నది.

> 'అగ్ని రముష్మిన్ లోక అసీ ద్యమో౽స్మిన్ తే
> దేవా అబ్రువ న్నేతేమా విపర్యూహామే త్యన్నాద్యేన
> దేవా అగ్ని ముపా౽మంత్రయంత రాజ్యేన పితరో
> యమం తస్మా దగ్ని ర్దేవానామన్నాదో యమః పితౄ
> ణాగ్ం రాజా య ఏవం వేద ప్రరాజ్య మన్నాద్య
> మాప్నోతి "

(కృ. య. సం. 2. కాం. 6. ప్ర. 6. అను)

## దేవతలలో అఘాయిత్యము (విరుద్ధాచరణము)

ఆధునికులలో రాజకీయతంత్రములలో అధికారపదవి నభిలషించెడి వ్యక్తులు ప్రజలకు బాధకరము లగు కృత్యములను (అకార్యకరణములను) చేయుట ప్రకృతములో చూచుచునే యుంటిమి. ఇట్లే పూర్వకాలములో గూడ యాగములలో భాగముల నభిలషించు దేవతలు బాధకములగు కృత్యములను సలిపి భాగములను పొందుచున్నట్లు శ్రుతులు బోధించుచున్నవి.

పూర్వము చతుర్థవేదప్రవర్తకాచార్యుండగు అంగిరోమునివంశీయులగు అంగిరస్సులు సత్రయాగమును చేయునపుడు ప్రవర్గ్య మను కర్మలో హవి ర్థమగు క్షీరములనిమిత్తము వారలకు తెల్లని గోవు ఉండెడిది. ఆ గోవుకు ఆహారమునకు అరణ్యమందు తృణములు (పచ్చిక) లేకపోవుటచే రసమును తీసిన సోమలత యొక్క ఋజీషము (పిప్పి) ను తిని జీవించుచుండెడిది. అప్పుడు భక్షణకు తృణమైనను లేక ఋజీషముతో (సోమలత యొక్క పిప్పితో) జీవించుచుండెడి గోవును చూచి దయాశీలు రగు అంగిరస్సులు ఈ విధముగ సంభాషణ గావించిరి.

"ఒక్క గోవునకు తినుటకు తృణవిశేషములను ఉత్పాదన చేయుట కసమర్థుల మగు మనము సత్రయాగానుష్ఠానము చేయు టెందులకు? సమృద్ధి కొరకు గదా సత్రయాగ మాచరించవలెను? గోగ్రాసమును గూడ సంపాదించుట కసమర్థుల మగు మనకు ఇతర సమృద్ధు లెట్లు లభించును?"

ఈ విధముగ సంభాషించుకొని, అంగిరస్సులు వృష్టికొరకు కారీర్యాది యాగముల నాచరించి వృష్టిని సంపాదించగా, ఎన్ని వృష్టి బిందువులు భూమియందు పడినవో అన్ని తృణము లుత్పన్న మైనవి. ఇట్లు తృణము లుత్పన్నము కాగానే తమ గోవునకు భక్షణకై తృణ సమృద్ధి సంభవించినదని సంతుష్టులై అంగిరస్సులు సత్రయాగము నాచరించుచుండిరి. ఇంతలో భాగార్థులగు పితృదేవతలు అంగిరస్సుల చే గోభక్షణ నిమిత్తమై ఉత్పన్నము చేయబడిన తృణజాతమును విష సంసృష్టము చేసిరి. అనగా ఆ పచ్చగడ్డిపై విషమును బూసిరి. పిమ్మట ఆకలి గొనియున్న ఆ గోవు విషలిప్త మగు తృణజాతమును భక్షించి, విషదోషముచే పీడితురాలై, క్లేశపడుచు సత్ర యాగప్రదేశమున కేతెంచెను. అంతట, అంగిరస్సు లా గోవును చూచి విషలేపరూప మగు ఈ పని నెవరు చేసి రని విచారింపగా, పితృదేవతలు "అగ్నిహోత్రమను కర్మలో మాకు కూడ భాగము కావలెనను తలంపుతో మేము చేసితిమి" అని బల్కిరి. వెంటనే కార్యసాధన చతురులగు దేవతలు పితృదేవతలకు అగ్నిహోత్రకర్మలో "స్వధా పితృభ్యః పితౄన్ జిన్వ" అను మంత్రముచే "దక్షిణేన వేదిం భూమ్యాం లేపం నిమృజ్య" అను సూత్రోక్త ప్రకారము వేదిక దక్షిణభాగమున హవిర్లేపమార్జన రూప మగు భాగము నిచ్చిరి.

ఆ భాగముచే సంతసించి వెంటనే పితృదేవతలు ఓషధిసంలగ్న మైన విషమును తీసివేసి, తృణజాతమును స్వాభావిక స్వాదురసో పేతము గావించిరి. ఈ యర్థము నీ క్రింది శ్రుతి బోధించుచున్నది.

అంగిరసో వై సత్ర మాసత । తేషాం పృశ్ని
ర్ఘర్మధు గాసీత్ । సర్జీషేణా౽జీవత్ । తే౽బ్రువన్ ।
కస్మైను సత్ర మాస్మహే । య్యే౽స్యా ఓషధీ ర్న జన
యామ ఇతి । తే దివో వృష్టి మసృజంత । యాదంత
స్తోకా అవాపద్యంత । తావతీ రోషధయో౽జాయంత ।
తా జాతాః పితరో విశేషణాలింపన్ । తాసాం జగ్ధ్వా
రుప్యం త్నైత్ । తేఽబ్రువన్ । క ఇద మిత్థ మకరితి ।
వయం భాగధేయ మిచ్ఛమానా ఇతి పితరోఽబ్రువన్ ।
కిం వో భాగధేయ మితి । అగ్నిహోత్ర ఏవ నో ప్యస్త్వి
త్యబ్రువన్ । తేభ్య ఏత ర్భాగ ధేయం ప్రాయచ్ఛన్ ।
య ద్ధుత్వా నిమ్మార్ష్టి । తతో వై త ఓషధీ రస్వదయన్ । (కృ. య. బ్రా. 2. కాం. 1. ప్ర. 1. అను)

ఈ విధముగ దిఙ్మాత్రముగ చూపబడిన విషయములలో దేవతలతో వ్యవహారసామ్యమే గాక, నిఖిల లౌకిక రాజ్యాంగ తంత్రములలోను అట్టి సామ్యము గలదని ఋజువు చేయుటకు మరికొన్ని విషయములు సంగ్రహింపబడుచున్నవి.

## దిగ్విభాగము.

ప్రకృతములో ఆసియా, ఐరోపా, ఆఫ్రికా మున్నగు ఖండము లను విభాగము గావించుకొన్నట్లు పూర్వము దేవతలు, మనుష్యులు, పితృదేవతలు, రుద్రులు దిక్కులను విభాగము గావించుకొనిరి. ఆ విభాగములో తూర్పుదిక్కు దేవతలకును, దక్షిణదిక్కు పితృదేవతలకును, పశ్చిమ దిక్కు మనుష్యులకును, ఉత్తరదిక్కు రుద్రులకును, యేర్పాటు చేసికొనిరి.

కావుననే దేవతల నుద్దేశించి సోమయాగములు చేయునపుడు శాలానిర్మాణములో (దేవతలది తూర్పు దిక్కు గావున) తూర్పు అగ్రములుగ వెదుళ్లు ఉండునట్లు ప్రాగ్వంశ మను శాలను నిర్మించవలసి నదిగ శ్రుతులు బోధించుచున్నవి. ఆచారములో నట్లే జరుగుచున్నది. యజ్ఞములోనే గాక నికిలదేవకర్మలలోను, స్మార్తాదిశుభకర్మలలోను ఉపక్రమము మొదలు సమాప్తి వరకును తూర్పుదిక్కు శిష్టులచే స్వీకరింపబడుచున్నది.

ఇదే విధముగ దక్షిణ దిక్కు యమునిది గావున, సర్వపిత్ర్యకర్మలందును 'దక్షిణాగ్రాన్ దర్భా నాస్తీర్య' ఇత్యాదివిధముగ దక్షిణ దిక్కు ఉపయోగింపబడుచున్నది. ఈ అర్థము నీ క్రింది శ్రుతి బోధించుచున్నది.

'ప్రాచీనవగ్ంశం కరోతి దేవమనుష్యా దిశో వ్యభ
జంత ప్రాచీం దేవా దక్షిణాం పితరః ప్రతీచీం మనుష్యా
ఉదీచీగ్ం రుద్రా యత్ప్రాచీనవగ్ంశం కరోతి దేవలోక
మేవ త ద్యజమాన ఉపావర్తతే ।                (కృ.య.సం. 6-1-1)

## యజ్ఞములో అవాంతర దీక్ష.

యజ్ఞములో ప్రథమదివసమున యజమానుడు ముండనాది సంస్కారములచే దీక్షాయుతుడై ద్వితీయ దినమున అవాంతర దీక్షను పొందెను. అనగా, ప్రథమ దినమున పొందిన మహాదీక్షామధ్యలో మరియొక అవాంతరదీక్షను పొందును.

## అవాంతరదీక్షోపగమనము (దీక్షాప్రాప్తి).

'అగ్నే వ్రతపతే త్వం వ్రతానాం వ్రతపతి రసి యా
మమ తనూ రేషా సా త్వయి యా తవ తనూ రియగ్ం
సా మయి సహ నౌ వ్రతపతే ప్రతినో వ్రతాని ।'        (కృ.య.సం. 1-2-11)

తా॥ ఈ అవాంతరదీక్షామంత్రములో యజమానుడు తన శరీరమును అగ్నియందును, అగ్ని శరీరమును తనయందును నుంచినట్లు మనస్సుచే భావన చేసి అగ్నిని సంబోధించి, 'వ్రతపాలకుడ వగు ఓ అగ్నీ! నీవు సమస్త వ్రతములకు పాలకుడవు. ఈ నా శరీరము నీ యందును, నీ శరీరము నాయందును ఉండుగాక. వ్రతయుక్తుల మగు ఉభయుల యొక్కయు కర్మలు సాహిత్యముగా ప్రవర్తించుగాక" అని పలికినట్లు పై మంత్రము బోధించుచున్నది.

## అవాంతరదీక్షా విసర్జనము.

ఈ విధముగ ద్వితీయదివసమున యజమానుడు అవాంతరదీక్షను పొంది, నాల్గవ దినమున (అగ్నీషోమియ్యా__హస్సునందు) ఆ దీక్షను ఈ క్రింది మంత్రముచే విడిచి పెట్టును.

'అగ్నే వ్రతపతే త్వం వ్రతానాం వ్రతపతి రసి యా
మమ తనూ స్త్వ య్యభూ దియగ్ం సా మయి
యా తవ తనూ ర్మ య్యభూ దేషా సా త్వయి యథా
యథం నౌ వ్రతపతే వ్రతినో ర్వ్రతాని ।' (కృ.య.సం. 1-3-5).

తా॥ వ్రతపాలకుడవగు ఓ అగ్నీ! ఏ నానీశరీరములు కలవో, అట్టి శరీరములు రెండును ఎవరి శరీరము వారియందే ప్రవర్తించుగాక. వ్రతయుక్తుల మగు మన యిరువురి కర్మలు స్వస్వోచితముగ ప్రవర్తించుగాక.

## ఐశ్వర్యవంతుల చేత జిక్కిన సొత్తు.

*'కో హి త ద్వేద య ద్వసీయాన్ త్స్వే వశే భూతే*
*పునర్వా దదాతి న వేతి ।'* (కృ.య.సం. 6-3-2)

తా॥ పూర్వము అవాంతరదీక్షా సమయమున మంత్రపూర్వక ముగ అగ్నియం దుంచిన తన శరీరమును అగ్ని నుండి తిరిగి తాను మంత్రపూర్వకముగ స్వీకరించవలెను. ఎందులకన, లోకములో ధనికుడు ఇతరుల సొత్తు తన అధీనమైన నాడు తిరిగి ఆ సొత్తును వారికి ఇచ్చునో, లేదో ఎవరికి తెలియును? కావున, యజమానుడు పూర్వము అవాంతర దీక్షాకాలమున గొప్పవా డగు అగ్నియందుంచిన తన శరీరమును తిరిగి తీసికొనవలె నని అభిజ్ఞులు చెప్పియుండి రని ఈ పై శ్రుతి బోధించుచున్నది. ఈ విషయమునకు దేవతలలోనే అనేక తార్కాణములు గలవు. వాటిలో కొన్ని ఈ దిగువ నుదహరించబడినవి.

## అగ్నికి చిక్కిన సొత్తు.

*'దేవాసురా సంయత్తా ఆసన్ తే దేవా విజయ ముప*
*యంతోఽగ్నౌ వామం వసు సంన్యదధతేదమునో భవి*
*ష్యతి యది నో జేష్యం తీతి త దగ్ని ర్న్యకామయత*
*తేనాఽపాక్రామ త్త ద్దేవా విజిత్యా వరురుత్సమానా*
*అన్వాయ న్త దస్య సహసాఽఽదిత్సంత సోఽరోదీ ద్యద*
*రోదీ త్త ద్రుద్రస్య రుద్రత్వం యదశ్రృశీయత తద్ర*
*జతగ్ం హిరణ్య మభవ త్తస్మా ద్రజతగ్ మద*
*క్షిణ్య మశ్రుజగ్ం హి యో బర్హిషి దదాతి పురాఽస్య*
*సంవత్సరా ద్గృహే రుదంతి తస్మా ద్బర్హిషి న దేయమ్ ।'* (కృ.య.సం. 1-5-1)

తా॥ పూర్వము దేవాసురులు ఒక కార్యార్థమై యుద్ధము కొరకు సన్నద్ధులైరి. అప్పుడు వారి సంబంధమగు మణులు, ముత్యములు మొదలగు ప్రశస్తమగు సొత్తులను (అసురులు వారిని జయించినచో ఆ ధనము ఆపత్కాలమందు వారి రక్షణకొరకు ఉపయోగించు నను భావముచే) అగ్ని వద్ద నుంచి యుద్ధమునకు వెళ్లిరి.

## అగ్నికృత్యము.

**అ**నంతరము ఆధనమును చూడగనే అగ్నికి వ్యామోహము గలిగి, అది యంతయు తనకే ఉండవలె నను కోరిక జనించెను. పిమ్మట తాను ఉన్నయెడల దేవతలు తిరిగి ఆధనమును తీసికొనెదరను భావముతో అగ్ని ఆధనముతో గూడ ప్రయాణము సాగించెను.

## దేవతల కృత్యము.

ఇంతలో దేవతలు యుద్ధమందు విజయమును పొంది ఆ సొమ్ముకొరకై తిరిగి వచ్చిరి. అగ్ని యొక్కడే ఈ ధనము నంతను అపేక్షించి వెడలుచున్నట్లు వారు గ్రహించిరి. అగ్నిని జయించి ఆ ధనమును స్వీకరింపవలె నను తలంపుతో పలాయమాను దగు అగ్నిని వెంబడించిరి. అగ్ని ముందు పరుగిడుచుండగా వెనుక దేవతలు పరుగిడ నారంభించిరి. ఇట్లు కొంతదూరము పరుగిడగా, అగ్ని దేవతలకు అందుబాటులోనికి వచ్చెను. అంత దేవతలు ఆధనమును బలాత్కారముగ తీసికొనుటకు ప్రయత్నించగా, అగ్ని రోదనమును చేసెను.

## రజతోత్పత్తి.

ఇట్లు రోదనమును చేయుచున్న అగ్ని యొక్క కన్నీరు భూమి యందు పడి రజతరూపముగ పరిణమించెను.

## రజత దక్షిణానిషేధము.

ఇట్లు రోదనమును చేయుచున్న అగ్నియొక్క కన్నీరువలన పుట్టిన దగుటచే, రజతము యజ్ఞములో దక్షిణక్రింద నిచ్చుట కనర్హము. ఈ రీతిగ నిషేధింపబడిన రజతమును ఎవరైన యజ్ఞాదుల యందు దక్షిణగ నిచ్చినచో, సంవత్సరమునకు లోపల అతని గృహమందు రోదనమునకు నిమిత్తము సంభవించును. కావున, యజ్ఞ మందు రజతమును దక్షిణగా నీయరాదు. ఏ కర్మయందును వెండిని దక్షిణగ నీయరాదని తాత్పర్యము. కనుకనే వెండి నాణెములను దక్షిణగా నీయవలసి వచ్చినపుడు మన పెద్దలు దానితో ఒక రాగినాణెమును గూడ దక్షిణగా నిచ్చెడి సంప్రదాయము గలదు.

## అగ్నివచనము, పునరాధేయము.

"సో గ్ని రబ్రవీ ద్భాగ్యసాన్యథ వ ఇద మితి పున
రాధేయంతే కేవల మిత్యబ్రువన్నృధ్నవత్ఖలు స ఇత్య
బ్రవీ ద్యో మద్దేవత్య మగ్ని మాదధాతా ।" ఇతి. (కృ.య.సం. 1-5-1)

తా॥ అనంతరము దేవతలు చుట్టుముట్టి ఆ ద్రవ్యమును తీసి కొనెద రని మనంబున నిశ్చయించి, అగ్ని ఈ విధముగ బలికెను. "ఓ దేవతలారా! నాకు ముందుగ అసాధారణ మగు (ఇతరులకు భాగములేని) భాగము నిచ్చినచో, అనంతరము ఈ ధనమును మీ కిచ్చెదను". వెంటనే దేవత లంగీకరించి పునరాధేయ మను కర్మను అగ్నికొరకై ప్రత్యేకముగ నేర్పరచెద మని బల్కిరి. దానిచే అగ్ని సంతుష్టుడై అగ్ని దేవతాక మగు ఈ పునరాధేయ మను

కర్మను ఎవడు చేయునో అతడు సమృద్ధుడగు నని అగ్ని పలికెను. దీని వలన, ప్రథమాధానముచే సమృద్ధి లేని యజమానుడు సమృద్ధి కొరకు పునరాధేయమును చేయవలె నని తాత్పర్యము.

ఉదాహరణ: పూర్వము పూష, త్వష్ట, మనువు, ధాత అను వారు ఈ పునరాధేయ మను కర్మను ఆచరించి సమృద్ధి యుక్తులైరి.

## వేదనఫలము.

ఈ విధముగ పునరాధేయము యొక్క సమృద్ధిని తెలిసికొన్న వారు సమృద్ధియుక్తు లగుదురు. పూష, త్వష్ట మున్నగు అగ్ని యొక్క బంధుసమూహమును తెలిసికొన్న వారు బంధుయుక్తు లగుదురు.

## అగ్నికృతోపద్రవము.

'భాగధేయం వా అగ్ని రాహిత ఇచ్ఛమానః ప్రజాం
పశూన్ యజమాన స్యోపదో ద్రావోద్వాస్య పునరాదధీత
భాగధేయే నై వైగ్ం సమర్థయ త్యధో శాంతి
రేవా స్యైషా ।'  (కృ.య.సం. 1-5-1)

తా॥ రాజకీయ రంగములో ప్రవర్తించు నాయకులు ఉన్నత పదవి మొదలగు వాని నపేక్షించి లోకములో ఉపద్రవములను తీసి కొని వచ్చుటను మనము చూచుచునే యుంటిమి. అట్లే ప్రథమా ధానముచే ఉత్పాదితుడైన అగ్ని తనకు అసాధారణ భాగమును (అనగా పునరాధేయమును) ఆపేక్షించుచు, యజమానియొక్క సంతానమును పశువులను హింసించెను.

## ఉపద్రవశాంతి.

అందుచే ప్రథమాధానానంతరము సమృద్ధిరహితుడగు యజమాని ఉద్వాసనేష్టిచే పూర్వాగ్నులను తీసివేసి, పునరాధేయ మను కర్మచే అహవనీయాద్యగ్నులను తిరిగి ఉత్పాదన చేసినచో పూర్వోక్త దోషము శాంతించును.

## పునరాధేయ కాలము.

"పునర్వస్వో రాదధీ తై తద్వై పునరాధేయస్య
నక్షత్రం యత్పునర్వసూస్వాయామేవైనం దేవతాయా
మాధాయ బ్రహ్మవర్చసీ భవతి ।"  (కృ.య.సం. 1-5-1).

తా॥ పునరాధేయ కర్మకు పునర్వసూనక్షత్ర దేవత స్వకీయ మైన దేవత. అందుచే పునర్వసూ నక్షత్రమందు ఈ కర్మానుష్ఠానము చేసినచో స్వకీయదేవతయందు పునరాధానము చేసినవాడగుచు, బ్రహ్మవర్చసఫలయుక్తుడగును.

## అగ్నీషోములకు చిక్కిన సొమ్ము.

"దేవాసురా స్సంయత్తా ఆసన్న్ । తే దేవా విజయ
ముపయంతః । అగ్నీషోమయో స్తే జస్వినీ స్తనూ
స్సంన్యదధత । ఇదము నో భవిష్యతి । యది నో జేష్యం
తీతి । తేనాగ్నీ షోమా వపాక్రామతాం । తేదేవా విజిత్య ।
అగ్నీ షోమా వన్వైచ్ఛన్ । తే౽గ్ని మన్వవిందన్నృతు
షూత్సన్నం । తస్య విభక్తీభి స్తే జస్వినీస్త నూ రవా
౽రుంధత । తే సోమ మన్వవిందన్ । త మఘ్నన్ తస్య
యథాభిజ్ఞాయం తనూ ర్వ్యగృహ్ణత । తే గ్రహా అభ
వన్ । త ద్గ్రహాణాం గ్రహత్వం । యస్యైవంవిదుషో
గృహా గృహ్యంతే । తస్యత్యేవ గృహీతాః ।" (కృ.య.బ్రా. 1-3-1).

తా॥ పూర్వమందు దేవతలు అసురులు యుద్ధమున కుద్యుక్తులైనపుడు దేవతలు విజయప్రాప్తిని కోరుచున్నవా రగుచు యజ్ఞమందు జయపరాజయములు దుర్లక్ష్యములు గాన, అసురులు తమ్ములను జయించే యెడల ఆనాడు ఈ ధనమే తమ జీవనమున కుపకరించునను భావముతో (దేవతలు) తమ తమ ప్రియమగు ఉత్తమ ధనములను అగ్నీషోముల వద్ద రక్షణకొరకుంచిరి.

## అగ్నీషోముల కృత్యము.

ఆ ధనమును చూడగనే అగ్నీషోములకు వ్యామోహము కలిగెను. వెంటనే, ఆధనముతో అగ్నీషోములు పరుగిడిరి. అంతట దేవతలు అదృష్టవశముచే అసురులను జయించి విజయమును పొందిన వారై, తమ ధనములను తిరిగి స్వీకరించుటకు అగ్నీషోముల కొరకంతటను వెదకి, ఒకానొక స్థలమున ఋతుదేవతలయందు మారువేషముతో నున్న అగ్నిని తెలిసికొనిరి.

## ఉత్కోచము.

అగ్ని అసహాయుడుగ నుండక, ఋతుదేవతల బలమునాధారముగ చేసికొని యుండుటచే బలాత్కారముగా (దేవతలు) తమ సొమ్ములను తీసికొనజాలరైరి. అందుచే ఆ

అగ్నికి ఉత్కోచ (లంచ) రూపముగ నాలుగు విభక్తులను ఈ క్రింది విధముగ నిచ్చి, స్వకీయములగు ధనములను స్వీకరించిరి.

## విభక్తి నిరూపణ.

"సమిధో అగ్న ఆజ్యస్య వియంతు, తనూనపా
దగ్న ఆజ్యస్య వేతు ।"

మొదలగు మంత్రములలో సంబుధ్యంత మగు అగ్నిపదముకు పూర్వము సంబుధ్యంత విభక్తి ప్రయోగము, సప్తమ్యంత విభక్తి ప్రయోగము, తృతీయాంత విభక్తి ప్రయోగము, ద్వితీయాంత విభక్తి ప్రయోగము ఈ క్రింది విధముగ ప్రయోగించవలెను.

సమిధో అగ్నే౽గ్న ఆజ్యస్య వియంతు; తనూనపా
దగ్నా వగ్న ఆజ్యస్య వేతు; ఇదో అగ్నినా గ్న ఆజ్యస్య
వియంతు; బర్ హి రగ్ని మగ్న ఆజ్యస్య వేతు".

ఈ విధమగు విభక్తుల ప్రయోగ రూపమగు దానముచే అగ్ని సంతసించి, దేవతల యొక్కప్రియ శరీరస్థానీయములగు ధనములను ఇచ్చి వేసెను. లోకములో రావుబహద్దూర్, పద్మభూషణ్, ఇత్యాది బిరుదముల దానముచే మానవుడు సంతసించినట్లు, అగ్నికూడ పై విభక్తుల దానముచే సంతసించె నని భావము.

ఈ ప్రకారము దేవతల అగ్ని నుండి తమ ధనములను తీసికొని, అనంతరము సోముని వెదకి, ఆత దసహాయుడగుటచే ఆతనిని హననము చేసి (కొట్టి), ఆతని వద్ద నుండి తమ ధనములను గుర్తులచే యెవరి సొమ్మేదియో తెలిసికొని, ఎవరి ధనములను వారు స్వీకరించిరి.

## సోమస్వీకృత ధనస్వరూప నిరూపణము.

**సో**మునిచే అపహృతములైన దేవధనములు ఐంద్రవాయవాది గ్రహరూపము లైనవి. 'దేవైః గృహ్యంతే" అను వ్యుత్పత్తిచే (దేవతలచే గ్రహించబడుట వలన), వాటికి గ్రహము లను పేరు సంపన్నమైనది. ఏ యజమానుడు ఈ వృత్తాంతమును తెలిసికొని యజ్ఞములో సోమగ్రహములను గ్రహించునో, ఆతని గ్రహములే యథాశాస్త్రముగ గ్రహించబడిన వగును.

## అగ్ని భాగాపేక్షతో ఉద్యోగము మానుట.

**పూ**ర్వము చయన మను క్రతువులో అగ్ని తనకు భాగమును కోరుచు, దేవతల నుండి వెడలెను. అంతట దేవతలు "సప్త తే అగ్నే సమిధః" అను మంత్రముచే హోమమును

అగ్నికి భాగముగ నొసంగిరి. దేవతలచే అగ్నికి ఇవ్వబడిన ఈ ఆహుతిరూప మగు భాగముహోమరూపము గావున, ఈ హోమమునకు అగ్నిహోత్ర మని పేరు వచ్చెను. ఈ విషయమును ఈ క్రింది శ్రుతి భోధించుచున్నది.

"అగ్ని ర్దేవేభ్యో పాక్రామ ద్భాగధేయ మిచ్ఛ
మానస్తస్మా ఏత ద్భాగధేయం ప్రాయచ్ఛ న్నేతద్వా
అగ్నే రగ్ని హోత్ర మేతర్హి ఖలువా ఏష జాతో యర్హి
సర్వశ్చితో జాతాయైవాస్మా అన్న మపిదధాతి స ఏనం
ప్రీతః ప్రీణాతి వసీయాన్ భవతి ।" (కృ.య.సం. 5-7-4)

ఫలితము: ఈ శ్రుత్యనుసారము ఉత్పన్నమైన ఇష్టకాచితి రూపమగు అగ్నికి ఆహుతి రూప మగు అన్నమును సంపాదించుటచే అతడు (అగ్ని) సంతృప్తుడై, యజమానుని సంతోష పరచును. దాని వలన ఆయజమానుడు ధనవంతుడగును.

## కీర్తినిమిత్తము సత్రము.

"దేవా వై సత్ర మాసత । బుద్ధిపరిమితం యశ
స్కామాః । తే ऽబ్రువన్ । యం నః ప్రథమం యశ
ఋచ్ఛాత్ । సర్వేషాం న స్తత్సహాऽసదితి । సోమ
శ్చతుర్హోత్రా । అగ్నిఃపంచహోత్రా । ధాతాషడ్ఢోత్రా ।
ఇంద్ర స్సప్తహోత్రా । ప్రజాపతి ర్దశహోత్రా । తేషాగ్ం
సోమగ్ం రాజానం యశ అర్చత్ । త న్న్యకామయత ।
తేనాపాక్రామత్ । తే న ప్రలాయ మచరత్ । తం దేవాః
ప్రేషైః ప్రైషమైచ్ఛన్ । తత్ప్రైషాణాం ప్రైషత్వం ।
నివిద్భి ర్న్యవేదయన్ । తన్నివిదాం నివిత్వం । అప్రీభి
రాప్నువన్ । తదాప్రీణా మాప్రిత్వం । త మఘ్నన్ ।"

తా॥ పూర్వము సోముడు, అగ్ని మున్నగు దేవతలు ధనాది సమృద్ధితో కూడిన కీర్తిని కోరుచున్న వారగుచే సత్రయాగమును అనుష్ఠానము చేయుటకు ప్రారంభించిరి. అప్పుడు వారు ఆదియందే పరస్పరము ఈ క్రిందివిధముగ ప్రతిజ్ఞను చేసికొనిరి. "మనలో ఏ పురుషుని ఆదియందు ధనాది సమృద్ధ మగు కీర్తి పొందునో ఆ పురుషుని యొక్క ఆ కీర్తి మనలకు అందరకును సమానమగుగాక."

శపథానంతరము, సోముడు "పృథివీ హోతా" ఇత్యాది చతుర్హోతృమంత్రము చేతను; అగ్నిదేవత "అగ్నిర్హోతా" ఇత్యాది పంచహోతృమంత్రము చేతను; ధాత "సూర్యం

తే చక్షుః" ఇత్యాది షడ్ఢోతృమంత్రముచేతను; ఇంద్రుడు "మహాహవిర్హోతా" ఇత్యాది సప్తహోతృమంత్రము చేతను; ప్రజాపతి "చిత్తి స్స్రుగ్రి" త్యాది దశహోతృమంత్రము చేతను అనుష్ఠానము చేసిరి.

## సోముని కృత్యము.

అంతట వారిలో సోముని ఆదియందు ధనసమృద్ధి కీర్తి పొందెను. వెంటనే అధన సమృద్ధి యుక్త మగు కీర్తి తనకొక్కనికే ఉండవలె నను విశేష తృష్ణచే ఆ ధనముతో కూడ అగ్న్యాదుల నుండి వెడలిపోయి దేవతలకు తాను కనుపించినచో వారాధనమును తీసి కొనెదరను భావముతో, దేవతలు తనను తెలిసికొనుటకు వీలు లేకుండునట్లు అత్యంతము లీనుడై (అదృశ్యుడై) సంచరించెను.

## అగ్న్యాదిదేవతల కృత్యము.

అనంతరము అగ్న్యాదులు "హోతాయక్షత్" ఇత్యాది ప్రైషమంత్రములచే ప్రకృష్టముగ (విశేషముగ) సోమునియొక్క అన్వేషణమును చేసిరి. "ప్రేష్యతే ఏభి రితి", (అనగా ప్రకర్షగ అన్వేషణముకు సాధనము లగు మంత్రములు ప్రైషశబ్దమునకు అర్థము) అను వ్యుత్పత్తిచే ప్రైషశబ్దము చెప్పబడినది.

## నివిచ్ఛబ్ద నిర్వచనము.

ప్రైషమంత్రాన్వేషణముచే సోముడు కనుపించకపోవుటచే అనంతరము "అగ్నే మహాగ్ం అసి" ఇత్యాది నివిన్మంత్రములచే ఈ వృత్తాంతమును అచ్చుటచ్చుట తెలియజేసిరి. "నివేద్యతే ఏభి రితి నివిదః" అను వ్యుత్పత్తిచే అత్యంతము తెలియజేయుటకు సాధనము లగు మంత్రములు "నివిత్" శబ్దమునకు అర్థము. ఈ విధముగ నివిన్నామ సంపన్నమైనది.

## ఆప్రీనామ నిర్వచనము.

ఈ మంత్రములచే కూడ సోముడు లభించకపోవుటచే 'సమిద్ధో అద్య మనుషో దురోణే' ఇత్యాది ఆప్రీనామకము లగు మంత్రములచే ఆసోముని పొందిరి. "ఆప్యతే ఏభి రితి" అను వ్యుత్పత్తిచే ప్రాప్తి సాధనము లగు మంత్రములు ఆప్రీశబ్దమునకు అర్థము. ఈ విధముగ ఈ మంత్రములకు ఆప్రీనామ సంపన్నమైనది.

## అనంతర దేవచర్య.

దీనివలన, అనేకులు కలసి సమిష్టిగ వ్యాపారమును చేసినపుడు ఆ లాభమును ఏ ఒక్కడైన అపహరించినచో మిగిలిన భాగస్వాములు అతనిని వెదకి, దొరకనిచో ఆ

వృత్తాంతమును అంతటను తెలియ చేయుదురు. అట్లును దొరకనిచో, ఉపాయాంతరములచే బహుప్రయాసచే నైనను అతనిని పట్టుకొనిన నాడు (ఇన్ని ప్రయత్నములచే గాని దొరకలేదను క్రోధముతో) వానిని హింసించి ఆ ధనమును పంచుకొనెదరు. అట్లే బహు ప్రయత్నము చేత గాని సోముడు దొరకక పోవు టచే తీవ్ర క్రోధగ్రస్తులైన అగ్న్యాది దేవతలు వెంటనే సోముని జంపి, యశోహేతు వగు అతని ధనమును విభజించి తీసికొనిరి.

'తస్య యశో వ్యగృహ్ణత । తే గ్రహా అభవన్ । తద్గ
హాణాం గ్రహత్వం । యస్యైవం విదుషో గ్రహా
గృహ్యంతే । తస్యత్యేవ గృహీతాః ।' (కృ.య.బ్రా. 2-2-8)

తా॥ అతని (యశోపేతువగు) ధనమును విభజించి తీసి కొనిరి. ఆ భాగములు ఐంద్రవాయవము, మైత్రావరుణము మున్నగు సోమరసమును గ్రహించెడి పాత్ర రూపము లాయెను. "గృహ్యంత ఇతి గ్రహాః' అను వ్యుత్పత్త్యనుసారము వీటిచే సోమరసము గ్రహించ బడును. అందుచే ఈసోమ పాత్రలకు గ్రహము లను పేరు వచ్చెను. ఈ వృత్తాంతమును తెలిసికొని యాగమును చేసెడి యజమానికి ఈ సోమగ్రమహము గ్రహణము వలన అధిక ఫలము సిద్ధించును.

## ప్రాసంగికము.

"తే బ్రువన్ । యోవై న శ్రేష్ఠో_భూత్ । త మవ
దిష్మ । పున రిమగ్ం సువామ హా ఇతి । తం ఛందోభి
రసువంత । తచ్ఛందసాం ఛందస్త్వం । సామ్నా సమాన
యన్ । త త్సామ్న స్సామత్వం । ఉక్థై రుదస్థాప
యన్ । త దుక్థానా ముక్థత్వం । య ఏవం వేద ।
ప్రత్యేవ తిష్ఠతి । సర్వ మాయు రేతి ।" (కృ.య.బ్రా. 2-2-8).

తా॥ ధనమును అపహరించి, కనుపించక, గూఢముగ నిలీనుడై బహు ప్రయత్నముచే గాని దొరకలేదను తీవ్రక్రోధముతో సోముని జంపిన పిదప, అగ్న్యాదులు పశ్చాత్తప్తులై పరస్పరము ఈ క్రింది విధముగ విచారించిరి. "మనలో ఎవడు అత్యంతము ప్రశస్త మైనవాడో, అతనిని జంపితిమి. అనగా, దేవతలలో భేదభావములు, అంతర్భేదములు జనించి వ్యూహముల క్రింద విడిపోయినపుడు ఈ సోముడు ఒక పార్టీకి ప్రాధాన్యమును వహించి రుద్రాదిగణములతో గూడి ప్రధాన నాయకు డగుడచే అత్యంత శ్రేష్ఠుడు. అట్టి వానిని చంపితిమి. ఇది చాల అనుచిత మగు కృత్యము. అందుచే తిరిగి ఈ సోముని

ఉత్పాదన చేసెదము" అని విచారించి గాయత్ర్యాది ఛందస్సులను అనుష్ఠానము చేసి ఆ ఛందస్సామర్థ్యము వలన సోముని ఉత్పాదన చేసిరి.

## ఛందోనామనిర్వచనము.

ఇచ్చట ఛందశ్శబ్దమునకు ఇచ్చు అర్థము. "ఉత్పాదన విషయా ఇచ్ఛాః సిధ్యం త్యేభి రితి ఛందాంసి" అను వ్యుత్పత్తిచే ప్రకృతములో సోముని యొక్క ఉత్పాదన విషయకమైన ఇచ్ఛలు సిద్ధించుటకు సాధనము లని ఛందశ్శబ్దార్థము. అనగా అభీష్ట సిద్ధికి సాధనము లని ఛందోనామ సంపన్నమైనది.

## సామశబ్ద నిర్వచనము.

అనంతరము ఉత్పన్నమైన సోముని సామగానసామర్థ్యముచే తీసికొని వచ్చిరి. "సమానీయతే ऽనేనేతి సామ" అను వ్యుత్పత్తిచే 'సామ' నామ సంపన్నమైనది.

## ఉక్థశబ్ద నిర్వచనము.

ఉక్థనామకశబ్ద సామర్థ్యముచే భూమియందు ఉపవిష్టుడైన సోముని లేవదీసిరి (నిలిచుండబెట్టిరి). "ఉత్థాప్యతే సోమః అనేనేతి" అను వ్యుత్పత్తిచే ఉక్థనామ సంపన్నమైనది.

వేదనఫలము: ఈ ప్రకారముగ సోముని వృత్తాంతమును తెలిసికొనిన పురుషుడు భూమియందు ప్రతిష్ఠితుడై (ఉనికిగలవాడై) సంపూర్ణమైన ఆయుస్సును పొందును.

## సోమయాగగమనవిధి.

'సోమో వై యశః । య ఏవం విద్వాన్ త్సోమ
మాగచ్ఛతి । యశ ఏవైన మృచ్ఛతి । తస్మా దాహుః ।
య శ్చైవం వేద యశ్చ న । తా వుభౌ సోమ మాగ
చ్ఛ తః । సోమో హి యశః । త్వం త్వా వ యశ ఋచ్ఛ
తీత్యాహుః । య స్సోమే సోమం ప్రాహేతి । తస్మా
త్సోమే సోమః ప్రోచ్య । యశ ఏవైన మృచ్ఛతి ।' (కృ.య.బ్రా. 2-2-8)

తా॥ సోమయాగప్రశంసా ప్రసంగవశమున పురుషార్థముగ (అనగా క్రతుసంబంధముతో నిమిత్తము లేకుండగ) సోమయాగమును గూర్చి వెళ్లుటను శ్రుతి బోధించుచున్నది. దీనిని మూలముగ చేసి కొనియే "అనాహూతోధ్వరం గచ్ఛేత్" అను స్మృతి బయలు వెడలినది. పిలువకుండ యజ్ఞమును గూర్చి వెళ్లవలెను.

సోమయాగము యశస్సుకు కారణమైనది గావున యశ స్స్వరూపము. ఈ విషయమును తెలిసికొనిన పురుషుడు సోమ యాగము చేయు స్థానమును గూర్చి రావలెను. అచ్చట ఆ యజ్ఞానుష్ఠాను ప్రకారమును ఉపదేశించుటచే అతనిని కీర్తి పొందును. అనగా, ఈతడు అభిజ్ఞుడు, (యజ్ఞప్రయోగమును తెలిసినవాడు) మహాత్ముడు, అని అందరును ఈతనిని ప్రశంసింతు రని తాత్పర్యము.

ఇంతేగాక, సోమయాగము యశోహేతు వగుటచేతనే లోకములో ఈ వృత్తాంతమును తెలిసిన వారును, తెలియని వారును గూడ యజ్ఞస్థానమును గూర్చి వచ్చెదరు. ఇరువురిలోను యజ్ఞ ప్రయోగము తెలిసిన వానిని అభిజ్ఞులు శ్లాఘింతురు. అందుచే అభిజ్ఞుడు సోమయాగ మునకు పోయి యజ్ఞ ప్రయోగమును ప్రకర్షగ చెప్పవలెను. యశస్సు ఇతనిని తప్పక పొందును.

# దేవతలలో స్త్రీ పురుష వైద్యులు

దేవతలలో అశ్వినీదేవతలు ప్రధానమైన చికిత్సకులు. అనగా, కంఠములు తెగిపోవుట మున్నగు తీవ్రములగు బాధలు సంభవించు నపుడు అశ్వినీదేవతలే ప్రతి క్రియ చేయుచున్నట్లు శ్రుతుల వలన స్పష్ట మగుచున్నది.

## ఉదాహరణకు ఉపోద్ఘాతము.

*'దేవా వై సత్ర మాసత । బుద్ధి పరిమితం యశ*
*స్కామాః । తే౽బ్రువన్ । యం నః ప్రథమం యశ*
*ఋచ్ఛాత్ । సర్వేషాం న స్తత్సహాస దితి ।'* (కృ. య. ఆ. పెదబ్రా. 1. అను)

తా॥ పూర్వము దేవతలు యశస్కాము లగుచు సమృద్ధమగు సత్రయాగమును చేయుటకు నిశ్చయించిరి. యాగారంభ కాలమందు ఆ యాగమువలన వచ్చెడి కీర్తిని తామందరును సమముగా పంచుకొనుటకు నిశ్చయించుకొనిరి.

## వేదనిరూపణము.

*'తేషాం కురుక్షేత్రం వేది రాసీత్ । తస్యై కాండవో*
*దక్షిణార్ధ ఆసీత్ । తూర్ఘ్న ముత్తరార్ధః । పరీణ జ్జఘ*
*నార్ధః । మరవ ఉత్కరః । తేషా ముఖం వైష్ణవం యశ*
*అర్ఛత్ । తన్న్యకామయత । తేనా౽పాక్రామత్ । తం*
*దేవా అన్వాయన్ । యశో౽వరురుత్సమానాః ।'* (కృ. య. ఆ. బ్రా. 1. అను)

తా॥ అనంతరము దేవతలు సత్రయాగమును చేయుట కనుకూలమగు యాగప్రదేశమును నిశ్చయించుకొను సందర్భములో కురుక్షేత్రమును మహావేదిగా నిశ్చయించుకొనిరి. కాండవ మను ప్రదేశమును వేదికి దక్షిణార్థముగను, తూర్ఘ్న మను ప్రదేశమును ఉత్తరార్ధముగను, 'పరీణత్' అను ప్రదేశమును జఘనార్ధముగను (పశ్చిమ భాగముగను), మరుప్రదేశములు (చవుడు ప్రదేశములు) ఉత్కరప్రదేశముగను నిర్మించిరి. యజ్ఞములో వేదిని నిర్మాణము చేయునపుడు నిర్మాణస్థలమందలి గడ్డితో కూడిన మన్ను మొదలగు వానిని, అనవసర మగు దర్భలు మున్నగువానిని ఉంచుటకు విధించబడిన స్థాన విశేషమును ఉత్కరప్రదేశ మందురు.

ఇట్టి వేది ప్రదేశమున దేవతలు సత్రయాగము చేయగా, ఆ యాగమునకు విష్ణుదేవతాక మగు యశస్సు సంప్రాప్తమాయెను. అనగా, దేవతలందరును సత్రయాగము చేయుచుండి రను కీర్తికి బదులుగా విష్ణువు సత్రయాగమును చేయుచుండె నను కీర్తి లోకములో బయల్దేరెను. ఈ విధముగ లోకములో విష్ణుదేవతాక మగు కీర్తి బయల్దేరిన తోడనే, ఆ కీర్తి తనకొక్కనికే ఉండవలెనను కోరికతో విష్ణువు ఆకీర్తితో పరుగిడ నారంభించెను. దేవతలు గూడ ఆ కీర్తిని నిరోధించుటకు విష్ణువును వెంటాడిరి.

## ధనుర్బాణముల ఉత్పత్తి.

"తస్యా__న్వాగతస్య । సవ్యా ద్ధను రజాయత ।
దక్షిణా దిషవః । తస్మా దిషు ధన్వం పుణ్యజన్మ । యజ్ఞ
జన్మా హి । తమేకగ్ం సంగం । బహవో నాభ్యధృష్ణు
వన్ । తస్మా దేక మిషుధన్వినం । బహవో__నిషుధన్వా
న్__భిధృష్ణువంతి । సో__స్మయత । ఏకం మా సంతం
బహవో నాభ్యధర్ షిషుః ।" (కృ.య.ఆ. పెదబ్రాహ్మణం 4.ప్ర. 1.అను.)

తా॥ ఇట్లు దేవతలచే వెంబడింపబడిన యజ్ఞరూపుడగు విష్ణువు యొక్క వామహస్తము నుండి ధనుస్సును, దక్షిణ హస్తము నుండి అనేకము లగు బాణములును (దేవతలను జయించుటకు) ఉత్పన్నము లైనవి. ఈ విధముగ ధనుర్బాణములు పుణ్యమూర్తి యగు యజ్ఞపురుషుని నుంచి ఉత్పన్నము లగుటచే నవి పుణ్య జన్మలుగ ప్రసిద్ధి గాంచినవి. ఈ విధముగ ధనుర్బాణములు హస్త మందుండుటచే ఏకాకి యైనను విష్ణువును ధనుర్బాణరహితులగు దేవతలు బహుసంఖ్యాకులైనను జయించ లేకపోయిరి.

## విష్ణువు నవ్వుట.

"తస్య సిష్మి యాణస్య తేజో౽పాక్రామత్ । త ద్దేవా
ఓషధీషు న్యమృజు । తే శ్యామాకా అభవన్ । స్మయా
కా వై నామైతే । త త్స్మయాకానాగ్ స్మయాకత్వం ।
తస్మా ద్దీక్షితేనా౽పి గృహ్యా స్మేతవ్యం । తేజసో
ధృత్యై ।" (కృ.య.ఆ. పెదబ్రాహ్మణం 4. ప్ర. 1. అను.)

తా॥ అధిక సంఖ్యాకులై యుండియు అసహాయుడ నైన తనను దేవతలు జయించ లేకపోయి రను గర్వముచే విష్ణువు పక్కున నవ్వెను. నవ్వుటచే అతని తేజస్సు అతని నుండి బయటకు జనుదెంచెను. అనగా, గర్వముచే ప్రయత్నము శిథిలము కాగా, సామర్థ్యము అపగతమాయెను (పోయెను). విష్ణువు తిరిగి ఆ సామర్థ్యమును యే విధముగ నైన స్వీకరించు నని తలంచి, వెంటనే దేవతలు ఆ తేజస్సు విష్ణువునకు చిక్కకుండుటకై దానిని (తేజస్సును) ఓషధుల యందు మార్జనమును చేసిరి (తుడిచి వేసిరి). అట్లు విష్ణు తేజస్సుచే వ్యాప్తములైన ఓషధులే శ్యామకములు (చామలు) అను పేరుతో వ్యవహరింపబడుచున్నవి. విష్ణువు యొక్కస్మయము వలన ఉత్పన్నములైనవి గావున, శ్యామాకములకు స్మయాకములను అన్వర్థ నామము సంభవించెను.

## స్మయనిషేధము.

ఈ విధముగ సత్రదీక్షలో నున్న విష్ణువు నవ్వుటచే తేజస్సు పోయినది గాన, యజ్ఞ దీక్షలో నున్న యజమానుడు నవ్వకూడదు. అట్లు శక్యముగాని నాడు,

"అపి గృహ్యా స్మేతవ్యం" అను శ్రుత్యనుసారము హస్తముచే నోటిని మూసికొని నవ్వవలెను. అట్లు చేసినచో, తేజస్సును పోకుండ ధరించినవాడగును. సోమదీక్షా ప్రకరణములో విధించిన ఈ విషయమునే ప్రాసంగికముగ నిచ్చుట ననువదించిరి.

## అచ్చుటి విషయము.

"య ద్ధస్తేన కండూయేత పామనంభావుకాః ప్రజా
స్స్యు ర్య త్స్మ యేత నగ్నం భావుకాః కృష్ణ విషాణయా
కండూయతే౽పి గృహ్యా స్మయతే ప్రజానాం గోపీ
థాయ ।" (కృ.య.సం. 6.కాం. 1. ప్ర. 3. అను.)

తా॥ యజ్ఞములో యజమానుడు హస్తముచే కండూయనము (గోకుట) చేసికొనరాదు. అట్లు హస్తముచే కండూయనము చేసి కొనినచో, ఆ యజమానుని సంతానము (పుత్రాదులు)

దురదచే నిరంతరము ఒడలు గోకుకొను స్వభావము గలవారగును. కావున, అట్టి దోషము లేకుండుటకై కృష్ణ విషాణముచే కండూయనము చేసి కొనవలెను.

ఇట్లే యజ్ఞ దీక్షలో నవ్వుట వలన ఇతని ప్రజలు దారిద్ర్యముచే ధరించుటకు వస్త్రములు లేక వస్త్ర విసర్జనముగ నుండెడివా రగుదురు. కావున, అట్టి దోషము లేకుండటకై హస్తముచే నోటిని మూసికొని నవ్వవలెను.

దాని వలన యజమానుని ప్రజలకు (సంతానమునకు) పూర్వోక్తమైన దురదరోగము, దారిద్ర్యముచే వస్త్ర విసర్జనము లేకుండ సంతానము సురక్షితముగ నుండు నని సోమదీక్షలో ఆస్యమును పిధానము చేసికొని నవ్వుట, కృష్ణవిషాణముచే కండూయనము విధించబడినవి.

ప్రకృతము: అనంతరము యజ్ఞ పురుషుడు యుద్ధము చేయవలెనను తలంపుతో ఇరుప్రక్కల నున్న దేవతలను నిరీక్షించుచున్న వాడగుచు, (లోకములో నిలబడుటకు శక్తి లేని మానవుడు గెడ్డము క్రింద నేదైన నొక కఱ్ఱ మున్నగు వానిని బోటు పెట్టుకొని నిలువ బడినట్లు) నవ్వుచే తేజోవిహీను డగుటచే నిలచుటకు శక్తిలేక, నారి బంధనముచే వంగిన ధనస్సును గెడ్డము క్రింద కంఠ సమీపమున దృఢముగ నుంచుకొని, అట్లే నిలబడెను. (శ్రు. స ధనుః ప్రతి ఽ_భ్యా తిష్ఠత్)

## ఉపదీకల (చదపురుగుల) వరము.

"తా ఉపదీకా అబ్రువన్ వరం వృణామహై ।
అథవ ఇమగ్ం రంధయామ । యత్ర క్వచ ఖనామ । త
దపో్ఽ_భి తృణదామేతి । తస్మా దుపదీకా యత్ర క్వచ
ఖనంతి । తదపో్ఽ_భితృందంతి । వారే వృతగ్గ్ హ్యాసాం ।
తస్యజ్యా మప్యాదన్ । తస్య ధను ర్విప్రవమాణగ్ ం
శిర ఉదవర్తయత్ ।" (కృ.య.ఆ. పెదబ్రాహ్మణం 4.ప్ర. 1.అను.)

ఆ సమయమున విష్ణువుకు ప్రతీకారము విచారించుచున్న దేవతలను గూర్చి లోక ప్రసిద్ధములగు ఉపదీకము లీ విధముగ బలికెను. "ఓ దేవతలారా! ముందుగ మేమొక వరమును ప్రార్థించుచుంటిమి. ఆ వరమును మాకు దయచేసిన తోడనే మీకొరకీ యజ్ఞ పురుషుని సాధించెదము" అని పలికి, వరస్వరూపమును ఈ క్రింది విధముగ వివరించినవి. "ఓ దేవతలారా! ఎంత శుష్కభూమియందైనను మేము ముఖముచే త్రవ్వుట తోడనే అచ్చుట నీరుద్భవించి ఆ ప్రదేశమును ద్రవయుక్తముగ చేయుదుము గాక'.

దీనికి దేవత లంగీకరించిరి. కావుననే లోకములో చద పురుగులు ఏ క్షేత్రమును త్రవ్వునో ఆ క్షేత్రమును ఉదకములు పొంది ద్రవయుక్తముగ చేయుచుండుట అనుభవ సిద్ధము.

అనంతరము, దేవతానుగ్రహముచే పొందబడిన వరము గల చదపురుగులు మెల్లగా భూమియందు యజ్ఞపురుషుని సమీపమున కేతెంచి, ఆతని గెడ్డముక్రింద నున్న ధనస్సు యొక్క క్రింది భాగము నందలి నారిని భక్షించెను. బిగించి కట్టబడిన ఆనారి తెగిన వెంటనే పైకి తన్ని, ఊర్ధ్వముగ ప్రవర్తమానమగుచు, యజ్ఞపురుషుని శిరస్సును ఛేదించి, ఊర్ధ్వముగ (శిరస్సు) ప్రవర్తించునట్లు చేసెను. ఆ శిరస్సు ఊర్ధ్వముగ ద్యులోక పర్యంతము పోయి, భారముచే క్రిందుగ భూమి యందు పడెను. ఇట్లు, ఆ యజ్ఞ శిరస్సు ద్యావాపృథివులను అను క్రమముగ ప్రవర్తించుటచే దానికి 'ప్రవర్గ్య' అను పేరు వచ్చెను. ఆ యజ్ఞ శిరస్సు భూమియందు పడు సమయమున బయల్దేరిన ధ్వనికి అనుకరణము 'ఘ్రాం' అను శబ్దముతో నుండుటచే ఆ శిరస్సునకు 'ఘర్మము' అను పేరు వచ్చెను. మహోత్ముడగు యజ్ఞ పురుషుని నుంచి సారభూతమగు శిరస్సు పై విధముగ పడుటచే ఆ శిరస్సునకు 'మహావీర' మను పేరు సంభవించెను.

పృథివి నుండి ఆ శిరస్సును స్వీకరించి దేవతలు పోషించుటచే సమ్యక్ రాజమాన మగుటచే (యోగ్యముగ ప్రకాశమాన మగుటచే) దానికి 'సమ్రాట్' అను పేరు వచ్చెను. ఈ విషయము నీ క్రింది శ్రుతి బోధించుచున్నది –

త ద్యావాపృథివీ అనుప్రా వర్తత । యత్ప్రా వర్తత ।
త త్ప్రవర్గ్యస్య ప్రవర్గ్యత్వం । యద్ఘ్రాం ఇత్యపతత్ ।
త ద్ఘర్మస్య ఘర్మత్వం । మహతో వీర్య మపప్త దితి ।
త న్మ హావీరస్య మహావీర్త్రవం । యదస్యా స్సమభవన్ ।
తత్సమ్రాజ్ఞ స్సమ్రాట్త్వం । (కృ.య. ఆ. 1. అను)

తా। ఈ విధముగ యజ్ఞశిరస్సుకు ప్రవర్గ్య, ఘర్మము, మహా వీరము, సమ్రాట్ అను నామచతుష్టయమును నిర్వచనపూర్వకముగా చెప్పి, శిరోరహితమగు (అనగా, సవనత్రయాత్మక మగు) యజ్ఞ పురుషుని అనుష్ఠానముచే ఫలాభావమును ఈ క్రింది శ్రుతి చెప్పుచున్నది.

తగ్గ్ స్తృతం దేవతా స్త్రేధా వ్యగృహ్ణత । అగ్నిః
ప్రాతస్సవనం । ఇంద్రో మాధ్యందినగ్ం సవనం । విశ్వే
దేవా స్తృతీయ సవనం । తేనా౽పశీర్ష్ణా యజ్ఞేన యజ

> మానాః । న్వా౽౽శీషో వారుంధత । న సువర్గం లోక
> మభ్యజయన్ ।'                                        (కృ.య.అ. పెదబ్రా. 1. అను)

తా॥ శిరోరాహిత్యముచే హింసితమైన యజ్ఞ పురుషుని సవన త్రయాత్మక మగు దేహమును అగ్న్యాది దేవతలు మూడు విధములుగ గ్రహించిరి. ఎట్లన, వారిలో అగ్ని ప్రాతస్సవన మను యజ్ఞభాగ మును గ్రహించెను. ఇంద్రుడు మాధ్యందినసవన మను యజ్ఞభాగమును గ్రహించెను. విశ్వేదేవతలు తృతీయసవన మను యజ్ఞ భాగమును గ్రహించిరి. అనగా అందుచే అగ్నియు, ఇంద్రుడును, విశ్వే దేవతలును ఆయా భాగముల కభిమానదేవత లని అర్థము.

ఈ ప్రకారము ప్రవర్గ్య అనెడి శిరస్సు లేని ప్రాతస్సవనము, మాధ్యందినసవనము, తృతీయ సవనములతో గూడిన యజ్ఞము యొక్క అనుష్ఠానముచే యజ్ఞము చేసెడి యజమానులు కర్మఫలమును పొంద లేకపోయిరి. స్వర్గలోకమును గూడ జయించ లేని వారైరి. అనంతరము 'ప్రవర్గ్య' యను శిరస్సుతో గూడిన సవనత్రయరూప మగు యజ్ఞము నకు ఫలహేతుత్వమును ఈ క్రింది శ్రుతి చెప్పుచున్నది.

> 'తే దేవా అశ్వినా వబ్రువన్ । భిషజౌ వై స్థః । ఇదం
> యజ్ఞస్య శిరః ప్రతిధత్తమితి । తా వబ్రూతాం వరం
> వృణావహై । గ్రహ ఏవ నా వత్రాపి గృహ్యతా మితి ।
> తాభ్యా మేత మాశ్విన మగృహ్ణన్ । తా వేత ద్యజ్ఞస్య
> శిరః ప్రత్యధత్తాం । య త్ప్రవర్గ్యః । తే స శీర్ష్ణా యజ్ఞేన
> యజమానాః । అవా౽౽శిషో౽రుంధత । అభిసువర్గం
> లోక మజయన్ ।                                        (తై. ఆ. పెదబ్రా. 4. పు.)

తా॥ అనంతరము దేవతలు (యజ్ఞ శిరోరూప మగు ప్రవర్గ్య రహితమగు యజ్ఞమును చేయుటచే ఫలమును పొందనివారై, అశ్వినీ దేవతలను గూర్చి ఈ క్రింది విధముగ బల్కిరి. 'ఓ అశ్వినీ దేవతలారా! మీరు మాకు గొప్ప చికిత్సకులు గావున, ఈ ఛిన్నమైన యజ్ఞ శిరస్సును యజ్ఞశరీరము నందు సంధానము చేయుడు' ఇట్లు దేవతలు బల్కగా అశ్వినీదేవతలు ఉత్కోచరూప మగు వరమును కోరిరి.

## ఉత్కోచ నిర్ణయము.

అశ్వినీదేవతలు – 'ఓ దేవతలారా! ఈ సోమయాగమునందు (చికిత్సకుల మగు మా ఉభయులకును, (ఇద్దరు సోదరులకును) మీతో సమముగ సోమగ్రహము గ్రహించ

బడవలెను.' అనగా, పితృదేవతలకు వలె అల్పమగు (తుచ్ఛమగు) లేపాదికముగాక, దేవతలతో సమముగ ప్రధానమగు సోమగ్రహమును ఈయవలెనని కోరిరి. అనగా, పూర్వము అగ్నిహోత్రమను కర్మలో హోమము చేయగా మిగిలిన ఆజ్యశేషమును –

'దక్షిణేన వేదిం భూమ్యాం లేపం నిమృజ్య'

అను సూత్ర వినియోగానుసారము వేదికి దక్షిణ భాగమున అంగుళిచే మార్జనము చేసి దానినే పితృదేవతలకు బాగముగ నొసంగిరి. అట్లు తుచ్ఛ మగు లేపాదికము గాక ప్రధాన మగు సోమగ్రహమును తమకు భాగముగ నీయవలెనని అశ్వినీదేవతలు కోరిరి. అనంతరము వారి ఇచ్ఛాను సారము అశ్వినీదేవతలకు అశ్వినగ్రహ మను పేరు గల సోమగ్రహమును దేవతలు గ్రహించిరి.

## చికిత్స.

ఈ విధముగ ఉత్కోచమును ఇవ్వగనే, అశ్వినీదేవతలు చికిత్సచే సవనత్రయాత్మక మగు యజ్ఞ శరీరమునందు ప్రవర్గ్యరూప మగు యజ్ఞ శిరస్సును తిరిగి సంధానము చేసిరి. అనంతరము, 'ప్రవర్గ్య' అను పేరు గల యజ్ఞ శిరస్సుతో గూడిన యజ్ఞమును అనుష్ఠానము చేసి, దేవతలు ఇతర ఫలములను, స్వర్గమును పొందిరి.

## ప్రవర్గ్య విధానము.

య త్ప్రవర్గ్యం ప్రవృణక్తి ।, యజ్ఞస్యైవ తచ్ఛిరః ప్రతి
దధాతి । తే సశీర్ష్ణా యజ్ఞేన యజమానః । అవా॒ ॒శిషో
రుంధే । అభిసువర్గం లోకం జయతి । తస్మా దేష అశ్విన
ప్రవయా ఇవ । య త్ప్రవర్గ్యః ।" (కృ. య. ఆ. పె. బ్రా. 1. అను.)

తా॥ లోకములో యజ్ఞానుష్ఠానము చేయు యజమానుడు యజ్ఞశిరోరూప మగు ప్రవర్గ్యతో కూడిన సవనత్రయాత్మక మగు యజ్ఞానుష్ఠానముచే, "ఏకైక స్యై కా మాయాన్యే ... అనుష్ఠీయంతే సర్వేభ్యో జ్యోతిష్టోమః" అను విధ్యనుసారము, ఇతర ఫలములను, స్వర్గము కూడ పొందును. ప్రవర్గ్యరూప మగు యజ్ఞ శిరస్సును అశ్వినీ దేవతలు సంధానము చేయుటచే ఈ ప్రవర్గ్య – కర్మ –

"ఈడే ద్యావా పృథివీ ... తాభి రూషు ఊతిభి
రశ్వినా గతోం ।"

ఇత్యాది అశ్వినమంత్రములచే బహుళమై యున్నది.

ఈ రీతిగా అశ్వినీ దేవతలు యజ్ఞశిరస్సును సంధానము చేసిన పిదప ఆ యజ్ఞమును దేవతలు విభాగము చేసికొనిరి. అనగా, యజ్ఞకర్మలో ప్రాతస్సవనభాగమునకు అగ్నియు, మాధ్యందినసవన భాగమునకు ఇంద్రుడును, తృతీయసవన భాగమునకు విశ్వేదేవతలును దేవతలని యర్థము.

## సౌత్రామణి, స్త్రీ పురుష వైద్యులు.

లోకములో అవిపాలకులు, గొల్లలు ఊర్ణాసూత్రముచే కంబలమును నేయునట్లు బుద్ధిమంతులు, విద్వాంసులును అగు ఋత్విక్కులు సీసముచే కొనబడిన వ్రీహ్యంకురాది కముచే సౌత్రామణి యజ్ఞ విస్తారమును నిష్పాదన చేయుచుండిరి.

## వైద్యులు.

*"సీ సేన తంత్రం మనసా మనీషిణః । ఊర్ణా సూత్రేణ*
*కవయో వయంతి । అశ్వినా యజ్ఞగ్ం సవితా సరస్వతీ ।*
*ఇంద్రస్య రూపం వరుణో భిషజ్యన్ ।"* (సౌత్రామణి. కృ.య.బ్రా. 2-6-4)

తా॥ ఈ మంత్రములో అశ్వినీదేవతలు, సవిత, సరస్వతి, వరుణుడును ఇంద్రుని యొక్క స్వరూపభూత మగు ఈ సైత్రామణి అను పేరు గల యజ్ఞమును ఓషధిసదృశము లగు పశ్వవయవములచే చికిత్స చేసిరి.

భావము: లోకములో వైద్యులు ఔషధములచే (అనగా ఓషధివికార మగు ద్రవ్యములచే) చికిత్స చేయుట సుప్రసిద్ధము. అట్లే ఇచ్చట అశ్విన్యాదులు ఓషధిసదృశము లగు పశ్వంగములచే చికిత్స చేయుచున్నట్లు వర్ణింపబడినది.

*"తదస్య రూప మమృతగ్ం శచీభిః । తిస్రొ దధు*
*ర్దేవతా స్సగ్ం రరాణాః । లోమాని శష్పై ర్బహుధాన*
*తోక్మభిః । త్వ గస్య మాగ్ం స మభవ న్న లాజాః ।"* (కృ.య.బ్రా. 2.కాం. 6ప్ర. 4.అను.)

తా॥ లోకములో వైద్యు లనేకులు కలసి ఒక శరీరమునకు శస్త్ర చికిత్స చేయునపుడు పరస్పరము భేదభావము లేకుండ ఐకమత్యముతో చేయుదురు. అట్లే, ప్రకృతములో అశ్వినిదేవత లిద్దరును సరస్వతియు ( ఈ ముగ్గురును కలసి) స్వకీయశక్తులచే ఇంద్రుని యొక్క యజ్ఞాత్మక మగు స్వరూపమును వినాశము లేకుండునట్లుగ సంపాదించిరి (చికిత్స చేసిరి).

## చికిత్సా ప్రకారము.

అంకురిత వ్రీహుల చేతను (తోక్మములు లేక మొలకలు వచ్చిన ధాన్యము చేత) శష్పముల చేతను, (వ్రీహ్యంకుర రూపము లగు బాలతృణముల చేత), అనేక విధములుగ

ఇంద్రశరీరమందు లోమములను సంపాదించిరి. లాజలు (అంకుర ప్రాదుర్భావమునకు కారణములగు బీజములు) యజ్ఞరూపు డగు ఇంద్రునికి చర్మస్థానీయము, మాంసస్థానీయములు అయినవి.

*"తదశ్వినా భిషజా రుద్రవర్తనీ । సరస్వతీ వయతి*
*పేశో అంతరః । అస్థి మజ్జానం మాసరైః । కారోతరేణ*
*దధతో గవాం త్వచి ।"* *(కృ. య. బ్రా. 2. కాం. 6. ప్ర. 4. అను)*

రుద్రుడు ఎట్లు హింసించుటకు సమర్థుడో, అట్లే వ్యాధిని నశింపచేయుటకు సమర్థులగు అశ్వినీదేవతలు ఆ యజ్ఞ శరీరచికిత్స యందు ప్రధాన వైద్యులు. అనగా శరీరమును తయారు చేయువారు.

## స్త్రీ వైద్యులు.

సరస్వతి, శరీరమధ్యమందు రసమును (అనగా రూపమును) నిష్పాదన చేయుచున్నది. అనగా, మాసరము (దధిమిశ్రమములై దర్భలచే ఆచ్ఛాదన చేయబడు యవలయొక్క సన్నని పిండి) చేతను, కారోతరము (చుట్టకుదురు - వెదురు బద్ధలచే నిర్మిత మైనట్టియు, అంతటను చర్మచే వేష్టిత మైనట్టియు, సురాభాండా ధారమగు అవటస్థానీయ మగు పదార్థ విశేషము) చేతను, శరీరమధ్య యందు మజ్జను, యెముకలను సంపాదించుచున్నది.

*"సరస్వతీ మనసా పేశలం వసు । నాసత్యాభ్యాం*
*వయతి దర్శతం వపుః । రసం పరిస్రుతా నరోహితం ।*
*నగ్నహుర్ధీ రస్తసరం న వేమ ।"* *(కృ. య. బ్రా. 2. కాం. 6. ప్ర. 4. అను.)*

- తా॥ లోకములో కువిందుడు (సాలెవాడు) వేమచే (ప్రహార దండముచే) నూతన వస్త్రమును తయారుచేయునట్లే, సరస్వతి అశ్వినీ దేవతలతో కలసి, మృదువైనట్టియు, దేవతాత్మకు నివాసయోగ్య మైనట్టియు, దృష్టిప్రియమైన (రమ్యమైన) ట్టియు, శరీరమును నిష్పాదన చేయుచున్నది. మరియు, ధారగా స్రవించుచుండెడి సురాద్రవ్యముచే శరీరమందు రక్తమును నగ్నహుద్రవ్యముచే (స్థూలయవ చూర్ణవిశేషముచే) అవయవాంతరమును, బుద్ధికౌశలముచే నిష్పాదన చేయుచున్నది.

## శుక్రపురీషములు ఉత్పత్తి.

*"పయసా శుక్ర మమృతం జనిత్రం । సురయా*
*మూత్రాజ్జనయంతి రేతః । అపామితం దుర్మతిం బాధ*
*మానాః । ఊవధ్యం వాతగ్ం సబువం త దారాత్ ।"* *(కృ. య. బ్రా. 2. కాం. 6. ప్ర. 4. అను.)*

తా॥ అమతిని (కర్తవ్య విషయజ్ఞానాభావమును), దుర్మతిని (విపరీతజ్ఞానమును) బాధించెడి ఈ దేవతలు, పయోద్రవ్య, సురా ద్రవ్యములు రెండిటిచేతను మూత్రద్వారము ద్వారా నిర్గమనయోగ్య మైనట్టియు, దీప్యమాన మైనట్టియు, శ్వేతవర్ణ మైనట్టియు, వినాశ రహిత మైనది గనుకనే అపత్యోత్పాదక మగు (సంతానమును పుట్టించెడి) వీర్యమును పుట్టించెడి వీర్యమును పుట్టించుచున్నారు. మరియు, ఆ దేవతలు సంపాదయితవ్య మగు శరీరమందు సమీపమందు (ఉదరమధ్య మందు) పురీషమును పయస్సు రాద్రవ్యము చేతనే పుట్టించుచుండిరి. మరియు, శ్వాసకాలమందలి ధ్వనితో గూడిన ప్రాణవాయువును నిష్పాదన చేయుచుండిరి.

## జ్ఞానశక్తి, యకృత్ క్లోమాద్యుత్పత్తి.

*"ఇంద్ర స్సుత్రామా హృదయేన సత్యం । పురోడాశేన*
*సవితా జజాన । యకృత్క్లో మానం వరుణో__భిషజ్యన్ ।*
*మతస్నే వాయవ్యైర్న మినాతి పిత్తమ్ ।"* (కృ. య. బ్రా. 2. కాం. 6. ప్ర. 4. అను. )

తా॥ శోభనముగా రక్షించెడి ఇంద్రుడు పశువు యొక్క హృదయ ద్రవ్యము చేత సత్యమును (యథార్థజ్ఞానశక్తిని) పుట్టించెను. సవిత (సూర్యుడు) పురోడాశము చేత శరీరములో 'యకృత్' అను అవయవమును పుట్టించెను. వరుణుడును పురోడాశము చేత క్లోమను నిష్పాదన చేసెను. మరియు, వరుణుడు వాయవ్యముల చేత (అనగా సోమరసమును గ్రహించెడి కల్లపాత్రలచేత) మతస్నలను (యకృత్ క్లోమలకు సమీపమున నుండెడి మాంస విశేషములను), పిత్తమును సంపాదించెను.

## ఆంత్ర, గుద, ప్లీహ, నాభి, ఉదర నిరూపణము.

"ఆంత్రాణి స్థాలీ మధు పిన్వమానా । గుదాపాత్రాణి
సుధుఘాన ధేనుః । శ్యేనస్య పత్రం న ప్లీహా శచీభిః ।
ఆసందీనాభి రుదరం న మాతా ।" (కృ. య. బ్రా. 2. కాం. 6. ప్ర. 4. అను.)

తా॥ శోభన మగు క్షీరముల నిచ్చెడి ధేనువుతో సమానమగు (క్షీరాదిరసమును ధరించెడి) స్థాలి శరీరములో ఆంత్రస్థానీయము. ఆంత్రము లనగా చిన్న ప్రేగులు. ఇతరములగు (పిష్టము, మున్నగు వాటిని ధరించెడి) పాత్రలు గుదస్థానీయములు. శ్యేనపక్షి యొక్క రెక్కలవలె నుండెడి, ప్లీహ మనెడి అవయవము స్వకీయవ్యవహార శక్తులతో గూడ పాత్రలచేత సంపాదించబడినది. అభిషేకార్థ మగు 'ఆసంది' (కుర్చీ లేక ఆసనము) నాభిస్థానీయము. భూమిరూప మగు వేది ఉదరస్థానీయము.

## వనిష్ఠునాశికాచ్ఛిద్ర నిరూపణము.

"కుంభో వనిష్ఠు ర్జనితా శచీభిః । యస్మి న్నగ్రే
యోన్యాం గర్భో అంతః । ప్లాశీ ర్వ్యక్త శ్శతధార
ఉత్సః । దుహేన కుంభీగ్ స్వధాం పితృభ్యః ।" (కృ.య.బ్రా. 2.కాం. 6. ప్ర. 4. అను.)

తా॥ ఉలూకపక్షి సదృశ మగు మాంసవిశేషము వనిష్ఠు ద్రవ ద్రవ్యస్థాపనార్థమగు కుంభము వనిష్ఠుస్థానీయము. ఏవనిష్ఠునందు అగ్రభాగమున మధ్య యోనియందు గర్భ ముండునో అట్టి గర్భమును వనిష్ఠువు తన శక్తులచే పుట్టించును. సురాపనయనము కొరకు శతచ్ఛిద్రయుక్త మైనది గావున, బహుధారోపేతమైన సురాప్ర స్రవణోపేతమైన శతాతృణ్ణా స్థాలి నాసికాచ్ఛిద్రస్థానీయము. ద్రవ ద్రవ్యధారణార్థమైన కుంభిని అధ్వర్యుడు పితృదేవతల కొరకు అమృతమును దోహనమును చేయుచున్న వాడువలెనే యుండెను.

## ముఖ, శిర ఆది నిరూపణము.

"ముఖగ్ం సదస్య శిర ఇత్సదేన । జిహ్వా పవిత్ర
మశ్వినా సగ్ం సరస్వతీ । చప్పంన పాయు ర్భిష గస్య
వాల । వస్తి ర్న శేషో హరసా తరస్వీ ।" (కృ.య.బ్రా. 2.కాం.సౌత్రామణి 4. అను)

తా॥ "సీదతి అత్రేతి సదః, దేవయజనస్థానం" అను భాష్యానుసారము 'సదః' అను పదమునకు దేవయజనస్థానము అర్థము. నిరూప్యమాణ మగు శరీరమునకు దానిచేత ముఖము, శిరస్సు సంపన్న మైనవి. ద్రవ్యధనార్థమగు వస్త్రము జిహ్వాస్థానీయము. ఈ సర్వమును, అశ్వినీదేవతలు, సరస్వతి (ముగ్గురును) సంపాదించిరి. పిష్టపాత్ర (చప్పము) గురుస్థానీయము, ద్రవ్యశోధనార్థమైన వాలము భవిష్యచ్ఛరీరమునకు చికిత్సకస్థానీయము, అనగా, వాలము చేత వ్యాధిసదృశమైన ద్రవ్యదోషము పోగొట్టబడును. పశువు యొక్క శేపము వస్తి (మూత్రస్థానము). నిరూప్యమాణమగు దేహము వహ్నిజ్వాలారూప మగు తేజస్సుచే వేగము కలదిగానున్నది.

## చక్షుఃపక్ష్మాది నిరూపణము.

"అశ్విభ్యాం చక్షు రమృతం గ్రహాభ్యాం । ఛాగేన
తేజో హవిషా శృతేన । పక్ష్మాణి గోధూమైః కువలైరు
తాని । పేశోన శుక్ల మసితం వసా తే ॥" (కృ.య.బ్రా. 2.కాం. 6.ప్ర. 4.అను)

తా॥ అశ్విసంబంధము లగు గ్రహావయవముల చేత వినాశ రహితమగు చక్షుస్సు సంపాదించబడినది. పక్వమైన హవిస్స్వరూపమైన భాగముచేత చక్షుర్గత మగు తేజస్సు

సంపాదించబడినది. సక్తునిష్పాదనార్థ మగు గోధుమల చేతను, బదరఫలవిశేషముల చేతను పరస్పరము సంబద్ధము లైన అక్షిరోమములు సంపన్నమైనవి. పశు గత రూపమును భావిశరీరము యొక్క చక్షుర్గత మైన శుక్ల కృష్ణ మండల రూపముగ జేసి అశ్వినీదేవతలు కనురెప్పలచే ఆ రెండు మండలములను ఆచ్ఛాదించుచున్నారు.

## నాసికాగత శ్వాసప్రవృత్తి సామర్థ్యము.

*"అవిర్నమేషోవసి వీర్యాయ । ప్రాణస్య పంథా*
*అమృతో గ్రహాభ్యాం । సరస్వత్యుపవాకై ర్వ్యా నం ।*
*నస్యాని బర్హిర్బదరైర్జజాన ।" (కృ.య.బ్రా. 2.కాం. 6. ప్ర. 4. అను.)*

తా॥ "సారస్వతం మేష మితి (విహితః) సారస్వతం మేషం" అను శ్రుతిచే విహితమైన అవిజాతీయ మగు సారస్వత మేషము నాసికయందు శ్వాసప్రవృత్తి సామర్థ్యము కొరకు ప్రవర్తించు చున్నది. ఈ నాసిక, ప్రాణవాయువుకు నాశరహిత మగు గమనా గమనములకు హేతువగు మార్గముగ పయస్సురాగ్రహముల చేత నిష్పాదితము. ఈ సరస్వతి ఉపవాకముల చేత (అనగా హరితయవసక్తువులచేత) వ్యానవాయువును పుట్టించుచున్నది. సక్తునిష్పాదన కొరకు సంపాదితములైన బదరఫలములచేత నాసికయందలి లోమములను సంపాదించెను.

## శారీరమగు శ్రోత్రాది నిరూపణము.

*"ఇంద్రస్య రూప మృషభో బలాయ । కర్ణాభ్యాగ్*
*శ్రోత మమృతం గ్రహాభ్యాం । యవాన బర్హి ర్భువి*
*కేసరాణి । కర్కంధు జజ్ఞే మధుసారఘం ముఖాత్ ।" (కృ.య.బ్రా. 2.కాం. 6.ప్ర. 4. అను)*

తా॥ ఇంద్రదేవతాక మగుటచే ఇంద్రరూప మగు ఋషభము భావిశరీరముకు సామర్థ్యము కొరకు సంపన్న మగుచున్నది. పశు సంబంధి కర్ణముల చేతను, పయస్సు రాగ్రహముల చేతను బాధిర్య రహిత మగు శ్రోత్రేంద్రియము సంపాదిత మగుచున్నది. భూమి యందు ఉత్పన్నము లైన యవలవలె, వేదియందు ఆసాదితము లైన (పరవబడిన) బర్హిస్సులు కేసరములుగా( అనగా, అత్యంతము ప్రవృద్ధము లగు లోమములుగా) సంపన్నములైనవి. తేనెటీగలచే సేకరించబడిన మధుసదృశమగు కర్కంధు (అనగా, అతిస్థూల బదరఫల పిష్టము), యజ్ఞప్రారంభస్థానీయముగా (యజ్ఞముఖముగా) సముత్పన్న మైనది.

## శ్మశ్ర్వాది నిరూపణము.

*"ఆత్మ న్నుపస్థేన వృకస్యలోమ । ముఖే శ్మశ్రూణి*
*న వా ఘ్రలోమం । కేశా నశీర్షన్ యశసే శ్రియై శిఖా ।*
*సిగ్ం హస్య లోమత్విషి రింద్రియాణి ।" (కృ.య.బ్రా. 2. కాం. 6.ప్ర. 4. అను.)*

తా॥ చోదకప్రాప్తములగు "త్రయాణి లోమాని" అను వాక్యవిహిత మగు వృక, వ్యాఘ్ర, సింహలోమములు గ్రహత్రయ మందు ప్రక్షేపణ చేయబడును (ఉంచబడును). ఆ లోమములలో వృక (తోడేలు) లోమములు సంపాద్య మానవ శరీరమందు గుహ్యప్రదేశమందలి లోమములు, వ్యాఘ్రలోమములు ముఖమంది శ్మశ్రులోమ స్థానీయములు. సింహలోమములు శిరస్సునందలి కేశరూపములు. అట్టి కేశనిష్పన్నమైనది శిఖ.

"అనుష్ఠానకాలే నశిఖత్వేన యశః ।
వ్యవహారకాలే రమణీయత్వేన శ్రీః ॥"

అనురీతిని కర్మానుష్ఠానకాలమందు కీర్తికి కారణము. లోక వ్యవహారములో రమణీయ మగుటచే శోభకు కారణము. మరియు, లోమగత మగు దీప్తి (కాంతి) సంపాద్యశరీరమునకు ఇంద్రియ స్థానీయము.

## వైద్యులగు అశ్వి, సరస్వతులు చేయు కృత్యవివరణము.

"అంగా న్యాత్మన్ భిషజా తదశ్వినా । ఆత్మాన
మంగై స్సమధా త్సరస్వతీ । ఇంద్రస్య రూపగ్ం శత
మాన మాయుః । చంద్రేణ జ్యోతి రమృతం దధానా ।" (కృ.య.బ్రా. 2-6-4)

తా॥ ఆ యాగసమయమందు చికిత్సకు లగు అశ్వినీదేవతలు సంపాద్య శరీరమందు హస్తములు, పాదములు మున్నగు అవయవములను సంపాదించిరి. వర్తమాను డగు ఇంద్రునియొక్క రూపమును సంపాదించునట్టియు, ఆహ్లాదకరరూపముతో గూడిన శాశ్వత మగు తేజస్సును సంపాదించునట్టిదియు నగు సరస్వతి (స్త్రీ వైద్యురాలు) అశ్వినీదేవతలు సంపాదించిన హస్తపాదాద్యంగములచే (శరీరభాగములచే) సంపూర్ణ దేహమును నిష్పాదన చేసెను.

ఫలితము: ఈ మంత్రములో అశ్వినీదేవతలు శరీరమందలి అవయవములను (భాగములను) తయారుచేసినట్లును, సర్వసతి ఆ భాగములచే మొత్తము శరీరమును తయారుచేసినట్లును స్పష్టమగుచున్నది.

## తిరిగి అశ్వి, సరస్వతుల కృత్యము.

"సరస్వతీ యోన్యాం గర్భమంతః । అశ్విభ్యాం పత్నీ
సుకృతం బిభర్తి । అపాగ్ం రసేన వరుణో న సామ్నా ।
ఇంద్రగ్గ్ శ్రియై జనయ న్నప్సు రాజా ।" (కృ.య.బ్రా. 2-6-4.)

తా॥ అశ్వినీదేవతలచే యోగ్యముగ సంపాదించబడిన ఉత్పాదనీయ శరీరరూప మగు గర్భమును పరిపాలించెడి సరస్వతి, గర్భాశయమందు (మధ్యమందు) పోషించుచున్నది. జలమధ్య యందు వరుణరాజు అబ్దేవతయందు పుత్రుని పుట్టించినట్లు అనుష్ఠీయమాన మగు యాగము ఈ యజమానుని సంపదను భవము కొరకు ఇంద్ర సమానమగు శరీరమును పుట్టించుచున్నది. అనగా, యాగములో నుండెడి పదార్థములచే అశ్వినీదేవతలు మున్నగువారు ఇంద్రశరీరమును ఉత్పాదన చేయుచున్నారుగాన యాగము పుట్టించుచున్నది యని తాత్పర్యము.

*"తేజః పశూవాగ్ం హవి రింద్రియావత్ । పరి*
*స్రుతా పయసా సారఘం మధు । అశ్విభ్యాం దుగ్ధం*
*భిషజా సరస్వత్యా సుతా సుతాభ్యాం । అమృత స్సోమ*
*ఇందుః ।"* (కృ.య.బ్రా. 2-6-4.).

తా॥ చికిత్సకు లగు అశ్వినీదేవతలచే ఇంద్రియాభివృద్ధికరము, పశువుల యొక్క సారభూతము, మధుసదృశము అగు హవిస్సు సురాద్రవ్యము చేతను, క్షీరము చేతను సంపాదించబడినది. అనంతరము సరస్వతిచే (అభిషవసదృశవ్యాపారముచే సంపాదించబడిన) సురాద్రవ్యము చేతను, అట్టి ప్రయాసరహితమగు క్షీరముచేతను, తత్ఫలభూతమగు ఇంద్రసదృశ మగు దేహము యజమానునకు సంపాదించబడినది.

ఈ విధముగ దేవతలలో అశ్విన్యాదులు వైద్యులుగ నుండి చికిత్సలు చేయుచున్నట్లు ప్రదర్శితశ్రుతుల వలన స్పష్టమ గుచున్నది.

## ఇంద్రుని రాజ్యపాలనము.

సర్వకాలములందును రాజులు రాజ్యపాలన మొనర్చునపుడు ప్రజలు రాజుకు పన్నుల నిచ్చుటయు, దానివలన ప్రజల కనుకూలములగు సదుపాయములను రాజులు చేయుచు నిరుపద్రవముగ రాజ్యమును పాలించుటయు రాజధర్మమై యున్నది.

ఇంద్రుని రాజ్యపరిపాలనాసందర్భములో ఈ విషయమును శ్రుతి విపులముగ వక్కాణించుచున్నది.

*"ప్రజాపతి రింద్ర మసృజతా॒ऽనుజా వరం దేవా*
*నాం । తం ప్రాహిణోత్ । పరేహి । ఏతేషాం దేవానా*
*మధిపతి రేధీతి । తం దేవా అబ్రువన్ । కస్త్వ మసి ।*
*వయం వై త్వచ్ఛ్రేయాగ్ంసస్స్మ ఇతి । సో॒ऽబ్రవీత్ ।*

*కస్స్వ మసి వయం వై త్వచ్ఛ్రేయాగ్ంస స్మ*
*ఇతి । మా దేవా అవోచ న్నితి ।'* (తై.బ్రా. 2.కాం. 2.ప్ర. 10.అను.)

ప్రజాపతి దేవతలను సృజించి, వారిలో అవరు డగు (నికృష్టుడగు) ఇంద్రుని సృజించెను. (సోదరులలో ఆఖరున పుట్టి నవాడెట్లు నికృష్టుడో, అట్లే నికృష్టుడు) లేక, అనుజునివలె అవర కర్మను చేయుచున్న ఇంద్రుని సృజించెను). పిదప, "ఓ ఇంద్రా, నీవు స్వర్గమును గూర్చి వెడలి నాచే సృజింపబడిన ఈ దేవతలకు అధిపతి వగుము". అని పలికి ప్రజాపతి ఇంద్రుని పంపెను.

ఇట్లు ప్రజాపతిచే ప్రేషితుడైన ఇంద్రుని దేవతలు నీ వెవ్వరవని యడిగిరి. అంతట ఇంద్రుడు "ప్రజాపతిచే మీకు ఆధిపత్యము నిమిత్తము నేను పంపబడితిని" అని బదులు చెప్పెను. అనంతరము స్వామిత్వము నిమిత్తము వచ్చిన ఇంద్రుని దేవతలు "స్వామిత్వమునకు నీ వెవ్వడవు? నీ కంటె మేము చాల ప్రశస్తులము" అని పలికిరి. ఆ వాక్యము వినిన వెంటనే ఇంద్రుడు ప్రజాపతి సమీపమున కేతెంచెను. వెంటనే ప్రజాపతి "నీవేల తిరిగి వచ్చితి" వని ఇంద్రునడిగెను. అప్పుడు ఇంద్రుడు "మాకు స్వామిత్వమునకు నీ వెవ్వడవు? అని దేవతలు నన్ను గూర్చి పలికిరి" అని ప్రజాపతితో చెప్పెను.

## అఖ్యాయికా పురస్సరముగ వేదనఫలము.

*"అథవా ఇదం తర్హి ప్రజాపతౌ హర అసీత్ । య*
*దస్మి న్నాదిత్యే । తదేన మబ్రవీత్ । ఏత న్మే ప్రయచ్ఛ ।*
*అథాహ మేతేషాం దేవానా మధిపతి ర్భవిష్యామీతి ।*
*కోహగ్గ్స్యా మిత్యబ్రవీత్ । ఏ తత్ప్రదాయేతి । ఏత*
*త్స్యా ఇత్యబ్రవీత్ । యదేత ద్బ్రవీషీతి । కోహ వై*
*నామ ప్రజాపతిః । య ఏవం వేద । విదు రేనం నా*
*మ్నా । తదస్మై రుక్మం కృత్వా ప్రత్యముంచత్ ।*
*తతో వా ఇంద్రో దేవానా మధిపతి రభవత్ । య ఏవం*
*వేద । అధిపతి రేవ సమానానాం భవతి ।'* (తై.బ్రా. 2.కాం. 6.ప్ర. 10.అను.)

తా॥ ప్రజాపతి యెదుట ఇంద్రుడు తన తిరస్కారమును చెప్పిన పిదప జరిగిన వృత్తాంతము – ఇప్పుడు ఆదిత్యునియందు మనచే చూడబడియెడి తేజస్సు ఆ కాలమున ప్రజాపతియందుండెను. అనగా ఆదిత్యుడు అంధకారమును పారద్రోలుటయం దెట్లు సమర్థుడో అట్లే ప్రజాపతి కూడ దుష్టశిక్షణ యందు సమర్థుడాయెను. ఆ ప్రజాపతి యందలి

తేజస్సు నుద్దేశించి ఇంద్రుడు ప్రజాపతిని గూర్చి "ఓ ప్రజాపతీ! ఈ తేజస్సును నా కొరకు ఇమ్ము. అనంతరము నేను తేజశ్శాలి నగుచు ఆ దేవతలకు అధిపతిని కాగలను" అనెను. అనంతరము ప్రజాపతి "ఓ ఇంద్రా! ఈ తేజస్సును నీకొరకు ఇచ్చి నేను ఎవ్వడిని కాగలను? అనగా తేజస్సును నీకు ఇచ్చుటచే తేజో విహీనుడ నగు నన్ను ఎవరు పరిగణింతురు (లెక్కచేయుదురు)?" అని పలికెను.

## ఇంద్రవచనము.

అనంతరము ఇంద్రుడు ప్రజాపతినిగూర్చి, "ఓ ప్రజాపతీ! "కోహం స్యాం" అను వాక్యములో 'క' శబ్దముచే ఏ దేనిని పలికితివో అదియే నీవగుము" అని పలికెను. 'క' శబ్దము ప్రజాపతి వాచక మగుట వలన ఇక్కడ ఇంద్రునిచే ఏది పలుకబడెనో అది యుక్తము.

వివరము: ఇచ్చట కిమ్ శబ్దము, కశబ్దము, మకారాంత అకారాంతములు రెండింటికిని పుంలింగైకవచనము 'కః' అనియే అగును. వాటిలో అకారాంత కశబ్దము ప్రజాపతి వాచకము. మకారాంత శబ్దము ప్రశ్నార్థకము. వాటిలో మకారాంతక శబ్దమును మనంబున నుంచుకొని ప్రజాపతి 'కః' అని ప్రయోగించెను. ప్రజాపతి తాత్పర్య మేమన, "ఓ ఇంద్రా! తేజోబలమును బట్టియే ప్రాణులకు గూడ గౌరవము. అట్టి తేజస్సును నీకిచ్చినచో, నా ప్రజాపతి త్వ గౌరవమే పోవును. అందుచే తేజస్సును నీకిచ్చి నేనేమి కావలెను." అనగా, తన ప్రజాపతిత్వమే నశించునని ఆక్షేపము. (ఇది ప్రజాపతి తాత్పర్యము).

ఇంద్రుని శబ్దమిషవలన అకారాంత 'క' శబ్దత్వము నాశ్రయించి 'కోహం స్యాం' అను ప్రజాపతి వచనమునకు 'ప్రజాపతిని నేను అయ్యెదను' అను అర్థమును వివక్షచేసి, 'దేనిని నీవు పలుకుచుంటివో అదియే అగుము. అనగా ప్రజాపతివే అగుము అనెను.

ఇట్లనుటలో ఇంద్రుని ఆశయమేమన, నీప్రజాపతిత్వము అనగా ప్రజాజనకత్వము తేజోనిమిత్తముగ నూహించుకొని, తేజస్సును నాకిచ్చినచో ప్రజాపతిత్వము పోవునని అనుకొనుచుంటివి. నీ ప్రజాపతిత్వము (ప్రజాస్రష్టృత్వరూప మగు ప్రజా పతిత్వ ముండవచ్చును. ప్రజాస్రష్టృత్వము స్వాభావికము. అందుచే నీ తేజస్సు నాకు ఇచ్చినను నీ స్వభావము అవగతము కానేరదు. (మారదు). కావున, నీ తేజస్సును నాకిమ్ము, అని తాత్పర్యము.

## వేదనఫలము.

ఈ విధముగ ఇచ్చటి 'కః' అనుశబ్దము ప్రజాపతి వాచకము. అని తెలిసికొనిన వారి పేరును అందరును తెలిసికొనెదరు. అనగా, ప్రఖ్యాత, ప్రసిద్ధపురుషుడగు నని తాత్పర్యము.

## ప్రజాపతి తేజస్సు నిచ్చుట.

అనంతరము ప్రజాపతి తన తేజస్సును పట్టమును ఆభరణముగ జేసి ఇంద్రుని లలాటమందు బంధించెను. ఆ పట్టబంధమువలన ఇంద్రుడు దేవతల కధిపతి యయ్యెను.

## ఇంద్రాధిపత్యవేదనఫలము.

ఈ విధమగు ఇంద్రాధిపత్యవృత్తాంతమును తెలిసికొనిన పురుషుడు సమానులందరకును అధిపతి యగును. ఈ విధముగ ప్రజాపతి ఇంద్రునకు దేవాధిపత్యము నిమిత్తము లలాటమందు పట్టబంధము నలంకరించుటచే, అప్పటినుండియు మూర్ధాభిషిక్తుని చేయదలచిన పురుషునకును, వివాహములో వరునకును, సువర్ణ రుక్మమును (భాషికమును) అలంకరించు సంప్రదాయము ప్రవృత్త మైనది.

## చంద్రమశ్శబ్దనిర్వచనము.

"సో౽మన్యత । కిం కిం నా అకరమితి । స చంద్రం
మ అహరేతి ప్రాలపత్ । త చ్చంద్రమస శ్చద్రమస్త్వం ।
య ఏవం వేద । చంద్రవా నేవ భవతి ॥" (తై.బ్రా. 2.కాం. 2.ప్ర. 10.అను.)

తా॥ అనంతరము (అనగా ఇంద్రుని దేవాధిపత్యమందు స్థాపనచేసిన పిమ్మట) ఆ ప్రజాపతి ఈ విధముగ తలంచెను. "దేవాధిపత్యమందు స్థాపితుడైన ఇంద్రునకు ఇంకను పర్యాప్తమగు ఏ యే ఘనకార్యములను నేను చేయగలను?" ఇట్లు ఆలోచించుచుండెడి ప్రజాపతిని జూచి ఆ ఇంద్రుడు "ఆహ్లాదకరమగు తేజస్సును (చంద్రం) నా కొరకు తీసికొనిరమ్ము". అని బాలునివలె ప్రలాపము చేసెను అందుచే ఆహ్లాదవాచక మగు చంద్రశబ్దోచ్చారణవలనను, స్వవాచకమగు 'మే' అను అస్మచ్ఛబ్దోచ్చారణవలనను, ఆ అక్షర సదృశ మగు "చంద్రమాః" అను నామ సంపన్నమైనది. (చంద్రం ఆహ్లాదకరం తేజః మీయతే పరిచ్ఛిద్యతే౽త్రేతి చంద్రమాః). అహ్లాదకరమగు తేజస్సు ఇతనియందు పరిచ్ఛిద్యమాన మగుచున్నది (స్థాపన చేయబడుచున్నది).

## వేదన ఫలము.

ఈ వృత్తాంతమును తెలిసికొనిన పురుషుడు అహ్లాదకరమగు తేజస్సు కలవాడే యగును.

# ఇంద్రునకు సూర్యనామనిర్వచనము

'తం దేవా అబ్రువన్ । సువీర్యో౽ మర్యా యథా
గోపాయత ఇతి । త త్సూర్యస్య సూర్యత్వం । య ఏవం
వేద । నై నం దభ్నోతి ।' (తై.బ్రా. 2.కాం. 2.ప్ర. 10.అను.)

తా॥ పూర్వోక్త విధముగ ఇంద్రుడు స్వర్గరాజ్యమందు పట్టాభిషిక్తుడైన పిమ్మట దుష్టులను శిక్షించుటయందు సమర్థమైన సూర్య తేజస్సుతోను, శిష్టులను పరిపాలించుట యందు సమర్థమైన చంద్ర తేజస్సుతోను కూడుకొనిన ఇంద్రుని జూచి దేవతలు పరస్పరము ఈ క్రింది విధముగ సంభాషణ మొనర్చిరి.

'మరణరహితులగు ఓ దేవతలారా! సువీర్యోపేతు డగు ఈ ఇంద్రుడు మనలను రక్షించుచున్నాడు. అనగా, యోగ్యముగ రక్షించుటకు సమర్థు డగుచున్నాడు.' గాన సువీర్య శబ్దములోని అక్షర సామ్యమున ఈతనికి సూర్యనామ సంపన్నమైనది.

## నామవేదనఫలము

ఈ నామను తెలిసికొనిన వారిని శత్రువులు హింసింపజాలరు.

## ఇంద్రశబ్ద నిర్వచనము.

'కశ్చనా౽స్మిన్ వా ఇద మింద్రియం ప్రత్యస్థా దితి ।
తదింద్రస్యేంద్రత్వం । య ఏవం వేద । ఇంద్రియా
ద్యేవ భవతి ।' (తై.బ్రా. 2.కాం. 2.ప్ర. 10.అను)

తా॥ మరియు 'మనకు అధిపతి యగు ఇంద్రుని యందున్న ఇంద్రియమును (సామర్థ్యమును) ఎవ్వడును నిరాకరించుటకు సమర్థుడు కాదు అని దేవతలు పరస్పరము అనుకొనిరి. ఇద మింద్రియం అని దేవతలు అనుటచే ఇంద్రనామ సంపన్నమైనది.

## నామవేదనఫలము.

'ఇద మింద్రియం' అని దేవత లనుటచే అక్షరసామ్యమున ఇంద్రనామ సంపన్నమైదని తెలిసికొనిన పురుషుడు సామర్థ్యాతి శయము కలవాడగును.

## ఇంద్రునకు పరమేష్ఠినామ నిర్వచనము.

"అయం వా ఇదం పరమోభూ దితి । త త్పర
మేష్ఠినః పరమేష్ఠిత్వం । య ఏవం వేద । పరమా మేవ
కాష్ఠాం గచ్ఛతి ।" (తై.బ్రా. 2-2-10)

తా॥ ఇంద్రుని పాలనాచాతుర్యముచే సంతోషముతో దేవతలు తిరిగి ఇట్లు పలికిరి. "సర్వోత్తముడైన ప్రజాపతియే (పరముడు) ఇంద్రరూపమును ధరించెను." అను దేవతల సంభాషణలో 'పరమే స్థితః' అని యనుటచే అక్షరసామ్యమువలన ఇంద్రునకు పరమేష్ఠినామ సంపన్నమాయెను.

## నామవేదనఫలము.

ఈ విధమగు ఇంద్రుని నామను తెలిసికొనిన పురుషుడు ఐశ్వర్యము యొక్క కాష్ఠను పొందును (గొప్ప ఐశ్వర్యవంతు డగును).

## సర్వదేవతలు ఇంద్రుని సేవించుట.

"తం దేవా స్సమంతం పర్యవిశన్ । వసవః పుర
స్తాత్ । రుద్రా దక్షిణతః । ఆదిత్యాః పశ్చాత్ । విశ్వే
దేవా ఉత్తరతః అంగిరసః తత్ర్యంచం । సాధ్యా పరాం
చం । య ఏవం వేద । ఉపైనగ్ం సమానా స్సంవిశంతి ।" (తై.బ్రా. 2-2-10)

తా॥ లోకములో మహారాజు మూర్ధాభిషిక్తుడైనపుడు కవీశ్వరులు మున్నగువారు పద్యములు మున్నగు వాటిచే స్తుతి చేయునట్లే ఇంద్రుడు స్వర్గరాజ్యమందు స్థాపితుడు కాగానే సర్వదేవతలు చంద్రమాః, సూర్యః, ఇంద్రః, పరమేష్ఠి అను పదములచే అర్థనిర్వచనపురస్సరముగ ఇంద్రుని స్తుతించిరి.

పట్టాభిషేకానంతరము సభామధ్యమందు ఉపవిష్టుడైన మహారాజుకు నలువైపులను పెద్దలు ఉపవిష్టులై ఎట్లు సేవింతురో అట్లే ఇంద్రునకు దేవాధిపత్యము సంప్రాప్తమైన పిమ్మట సభాస్థలి యందు సింహాసనాసీనుడైన ఇంద్రుని వస్వాది దేవగణములు సర్వదిశ లందును ఉపవిష్టులై సేవించిరి.

సేవాప్రకారము: ఇంద్రునకు తూర్పుదిక్కున వసువులు, దక్షిణదిక్కున రుద్రులు, పశ్చిమదిక్కున ఆదిత్యులు, ఉత్తరదిక్కున విశ్వేదేవతలును (ఈ విధముగ గణదేవతలు) ఉపవిష్టులై సేవించు చుండిరి. అంగిరస్సు మొదలుగా గల మహర్షులు యే దిక్కునను కూర్చొనక, ఇంద్రునకు సంముఖముగ నిలుచుండి సేవించుచుండిరి. సాధ్య నామకులగు గణదేవతలు పృష్ఠభాగమున నిలుచుండి సేవించుచుండిరి.

వేదనఫలము: ఈ సేవా ప్రకారమును తెలిసికొనిన పురుషుని సర్వప్రజలు సమీపమున కూర్చొని సేవింతురు.

## ఇంద్రుడు రాజనీతిచే పన్నులు వసూలు చేయుట.

'స ప్రజాపతి రేవ భూత్వా ప్రజా అవయత్ । తా
అస్మైనా_తిష్ఠంతా_న్నాద్యాయ । తా ముఖం పురస్తా
త్పశ్యంతీః । దక్షిణతః పర్యాయన్ । స దక్షిణతః పర్య
వర్తయత । తా ముఖం పురస్తాత్పశ్యంతీః । ముఖం
దక్షిణత । పశ్చా త్పర్యాయన్ । స పశ్చా త్పర్యవర్త
యత । తా ముఖం పురస్తా త్పశ్యంతీః । ముఖం
దక్షిణతః । ముఖం పశ్చాత్ । ఉత్తరతః పర్యా
యన్ । స ఉత్తరతః పర్యవర్తయత । తా ముఖం
పురస్తా త్పంశ్యంతీః । ముఖం దక్షిణతః । ముఖం
పశ్చాత్ । ముఖ ముత్త రతః । ఊర్ధ్వా ఉదాయన్ ।
స ఉపరిష్టా న్న్యవర్తయత । తా స్సర్వతో ముఖో
భూత్వా వయత్ । తతో వై తస్మై ప్రజా అతిష్ఠంతా
న్నాద్యాయ ।' (తై.బ్రా. 2-2-10)

తా॥ ఇట్లు వస్వాదిగణములచే సేవించబడుచుండెడి ఇంద్రుడు ప్రజాపతితో సమానమైన సామర్థ్యము కలవాడై ఆప్రజలను స్వాధీనము చేసికొనెను. స్వస్వోచిత మగు (వారి వారికి ఉచితమగు) పన్నును ఇచ్చుటకు ఆజ్ఞాపించెను. ఆ సర్వప్రజలును ఏకీభవించి ఈ ఇంద్రునకు అన్నభోగకరమగు పన్నును ఇచ్చుటకు అంగీకరింపరైరి.

అంతట ఇంద్రుడు పన్నులు వసూలు చేయుటకు సమర్థుడగు ఒక ముఖ్యపురుషుని పంపెను. ఆ ముఖ్యపురుషుడు తూర్పుదిక్కున కరప్రదానవిముఖు లగు (పన్నుల నిచ్చుట కంగీకరించని) ప్రజలను గూర్చి వెడలెను. ఆ తూర్పుదిక్కునందలి ప్రజలు ఇంద్రప్రేరితుడగు ముఖ్యపురుషుని జూచి, భయముచే ఆ దిక్కునుండి పరుగిడి దక్షిణదిక్కున కేగిరి. ఆ వృత్తాంతమును తెలిసికొని ఇంద్రుడు వెంటనే (తన ముఖసమానుడగు) ప్రబలు డగు పురుషుని దక్షిణ దిక్కునకు వెళ్ళవలసినదిగ ప్రేరణ చేసెను. ఇంద్రుని ప్రేరణానుసారము దక్షిణ దిక్కుకు పోయిన ముఖ్యపురుషుని చూచి, అచ్చటి ప్రజలు దిగ్ద్వయమందు (అనగా తూర్పుదక్షిణ దిక్కులు రెండింటి యందును) ఇంద్రుని ముఖ్యపురుషు లుండుటచే పశ్చిమదిశ కేగిరి. ఈ విషయమును ఇంద్రుడు తెలిసికొని, ప్రబలుడగు మరియొక ముఖ్యపురుషుని పశ్చిమదిశకు పంపెను. అచ్చటి ప్రజలు ముఖ్య పురుషుని జూడగనే పూర్వదక్షిణపశ్చిమదిక్కులు మూడిటియందును ఇంద్రప్రేషితులగు ప్రబల పురుషు లుండుటచే ఉత్తర దిశకు పరుగిడిరి.

ఈ వార్తను తెలిసికొని ఇంద్రుడు వెంటనే ప్రబలుడగు మరియొక పురుషుని ఉత్తరదిశకు పంపెను. అచ్చటి ప్రజలు ఇంద్రప్రేషితుడగు ఆ పురుషుని జూచి (తూర్పు, దక్షిణ, పశ్చిమోత్తర దిశలు నాల్గింటియందును రాజప్రేషితులగు పురుషులుండుటచే) ఊర్ధ్వ దిశ కేగిరి. ఆ సంగతి తెలిసికొని వెంటనే ఇంద్రుడు ప్రబలుడగు మరియొక వీరపురుషుని ఊర్ధ్వదిశకు పంపెను. అచ్చటి ప్రజ లా పురుషుని జూచి భయగ్రస్తులయ్యును, పరుగిడుటకు దిక్కు లేక అచ్చటనే పలాయనమునుండి నివృత్తులైరి. ఇంద్రుడును తన పురుషుని నివారించెను.

అనంతరము ఆ ఇంద్రుడు పూర్వాదిఊర్ధ్వాంతము లగు ఐదు దిక్కులందును స్వకార్యమందు భృత్యుల నుంచి తద్వారా సర్వతోముఖుడై సర్వప్రజలను వశము చేసికొనెను. పిమ్మట ఆ ప్రజలు పరుగిడుటకు దిక్కులేనివారై ఆ ఇంద్రునికి అన్నాద్యరూపమగు పన్నును ఇచ్చుటకు అంగీకరించిరి.

## వేదనప్రశంస.

*య ఏవం విద్వా న్పరి చ వర్తయతే నిచ । ప్రజా*
*పతి రేవ భూత్వా ప్రజా అత్తి । తిష్ఠంత్యే__స్మై ప్రజా*
*అన్నాద్యాయ । అన్నాద ఏవ భవతి ।"* (తై.బ్రా. 2.కాం. 2.ప్ర. 10.అను.)

తా॥ ఏ పురుషుడు ఈ విధముగ ఇంద్రునియొక్క పరిపాలన ప్రకారమును తెలిసికొని పరివర్తన, నివర్తనములను చేయునో అతడు ప్రజలకు పరిపాలకుడై సర్వప్రజలను అనుభవించును. "శిక్షకస్య ప్రేరణం పరివర్తనం, శిక్షి తాభ్యః ప్రజాభ్యః స్వపురుషనివారణం నివర్తనం" అనగా శిక్షకుని పంపుటయందును శిక్షితులగు ప్రజల నుండి తన పురుషుని నివారణయందును కుశలుడగు పురుషుడు ప్రజలకు పరిపాలకుడై సర్వప్రజలను అనుభవించునని తాత్పర్యము. ఆ ప్రజలు ఈ వేదితకు (అనగా, ఈ వృత్తాంతమును తెలిసికొనినవారికి) పన్నుల నిచ్చుటకు అంగీకరింతురు. ఇతడు కూడ నిస్సంశయముగ భోగసంపన్నుడగును. ఇహలోకములో రాజ్యపరిపాలనలో సంభవించెడి ప్రతికూలప్రక్రియలకు ప్రకృతకాలములో లౌకికోపాయములచే (యుద్ధాదికముచే) ప్రతిక్రియలను జరుపుచున్నట్లే, దేవతలలో సంప్రాప్త మయ్యెడి ప్రాతికూల్యములకు దేవతలు లౌకిక, వైదిక ప్రతిక్రియలు రెండిటిచేతను ప్రతీకారమును సలుపుచు అనర్గళముగ రాజ్యపాలనమును నిర్వహించుచున్నట్లు శ్రుతులు ప్రతిపాదించుచున్నవి.

ఇంతవరకు యింద్రుడు స్వర్గరాజ్యమున కధిపతి యై పరిపాలించు నపుడు ప్రజలు పన్నుల నీయక వ్యతిరేకించగా, వారిని లౌకికప్రక్రియచే (అనగా పన్నులు వసూలు చేయుటకు సమర్థులగు ప్రబల పురుషుల ప్రేరణ ద్వారా) సమస్త దిక్కులందును వారిని నిరోధించి స్వాధీనము చేసికొని పన్నులను వసూలు చేసి రాజ్యపాలన మొనర్చినట్లు వెనుకటి శ్రుతిచే ప్రతిపాదిత మైనది.

ఇట్లు కొంతకాలము గడచిన పిమ్మట తిరిగి ప్రజలు పన్నుల నీయక వ్యతిరేకించగా, యింద్రుడు వైదిక ప్రక్రియచే (అనగా విగనమను యాగానుష్ఠానముచే) పన్నులు వసూలు చేసి రాజ్యపాలనము నిష్కంటకముగ చేసినట్లు ఈ క్రింది శ్రుతి ప్రతిపాదించుచున్నది.

*"ఇంద్రం వై స్వావిశో మరుతో న్నా__పాచాయన్ ।*
*సో__నప చాయ్యమాన ఏతం విఘన మపశ్యత్ । త మాహ*
*రత్ । తేన్నా__జయతి । తే నైనాపాం తగ్ం సగ్స్తంభం*
*వ్యహ ౯ । యద్వ్యహన్ । త ద్విఘనస్య విఘనత్వం ।*
*విపాప్మానం భ్రాతృవ్యగ్ం హతే । య ఏతేన యజతే ।*
*య ఉచైన మేవం వేద ।"* (*తై. బ్రా. 2-7-18*)

తా॥ సర్వదేవాధిపతి యగు యింద్రుడు రాజ్యపాలన చేయుచుండగా, ఒకప్పుడు యింద్రసంబంధులగు ప్రజలు (పన్నులు కట్టవలసినవారగు మరుద్గణములు), పూర్వపు గౌరవాతిశయమును జూపక, ప్రతికూలురై, కరప్రదానముచే యింద్రుని పూజింపరైరి. అనగా, పన్నుల నీయక, వ్యతిరేకించిరి. (మరుద్గణముల జన్మ వృత్తాంతము ఈ ప్రకరణములో చివర వ్రాయబడినది). ఇట్లు ప్రజలచే ఎదుర్కొనబడిన యింద్రుడు ప్రజల ప్రాతికూల్యమును (అనగా తిరుగుబాటును) నివారించుటకు విఘనమను సోమయాగమును సమర్థమైనదానినిగ నిశ్చయించి, ఆ యాగమున కనుకూలమగు సామగ్రిని సంపాదించి ఆయాగానుష్ఠానము చేసెను. దాని ప్రభావముచే తన ప్రజల యొక్క ప్రాతికూల్యాచరణమును కొట్టి వేసెను. అనగా ప్రజలను అనుకూలురుగా చేసికొనెను.

## విగనశబ్దనిర్వచనము.

ఈ యాగముచే ప్రజలయొక్క స్తంభనరూప మగు ప్రాతి కూల్యాచరణము కొట్టి వేయబడును గాన, విఘన మను పేరు ఈ కర్మకు సంప్రాప్తమయ్యెను (విహన్యతే__నేనేతి విఘనః).

## విఘనక్రతువిధానము.

(వి పాప్మానమిత్యాది) ఏ పురుషుడు ఈ యాగమును చేయునో అతడు పాపు డగు శత్రువును హింసించును. ఈ విషయమును తెలిసికొనిన పురుషునకు కూడ అఫలమే లభించును. అనగా, శత్రువధకాముడు ఈ క్రతువును చేయవలెను.

## ఈ క్రత్వనుష్ఠానమునకు అధికారినిరూపణ.

*"యగ్ం రాజానం విశో నాపచాయేయు ః ।*
*యో వా బ్రాహ్మణ స్తమసా పాప్మనా ప్రావృత స్స్యాత్ ।*
*స ఏతేన యజేత । విఘనేనై వైన ద్విహత్య । విశా*
*మాధిపత్యం గచ్ఛతి ।"* (తై.బ్రా. 2.కాం. 7.ప్ర. 18.అను.)

తా॥ ఏ రాజును ప్రజలు కరప్రదానముచే పూజించరో (అనగా, పన్నులను చెల్లింపక వ్యతిరేకింతురో), ఏ బ్రాహ్మణుడు తమోరూపమగు పాపముచే ఆవృతుడగునో, వారుభయులును ఈ క్రతువును చేయుటకధికారులు. రాజు ఈ క్రతువును చేసినచో ప్రజల తిరుగుబాటును నశింపజేసి నిష్కంటకముగ రాజ్యమును పాలించును. బ్రామ్మణుడు చేసినచో, తమోరూప పాపరహితుడగును.

ఈ యాగములో సామగానములో సామవృత్తి సంఖ్యారూపమగు స్తోత్రవిశేషమును ఈ క్రింది శ్రుతి విధించుచున్నది.

*"తస్య ద్వే ద్వాదశే స్తోత్రే భవత । ద్వే చతు*
*ర్విగ్ంశే । ఔద్భిద్య మేవ తత్ । ఏత ద్వై క్షత్ర స్యౌద్భి*
*ద్యం । య దస్మై స్వావిశో బలిగ్ం హరంతి ।"* (తై.బ్రా. 2.కాం. 7.ప్ర. 18.అను.)

తా॥ ఆ విగనక్రతువుకు ద్వాదశస్తోమయుక్తము లగు స్తోత్రములు రెండును, చతుర్విగ్ంశ స్తోమయుక్తము లగు స్తోత్రములు రెండును అనుష్ఠానము చేయవలెను. ఈ నాలుగుస్తోత్రములును ఉద్భేదనసాధనములు. అనగా ప్రాతికూల్యనివారణకు సాధనము. ఈ స్తోమచతుష్టయానుష్ఠానముచే ప్రజలు వ్యతిరేకభావమును విడనాడి రాజుకు పన్నుల నిచ్చెదరని తాత్పర్యము.

## వేదనఫలము.

*"హరం త్యస్మైవిశో బలిం । ఐన మప్రతిఖ్యాతం*
*గచ్ఛతి । య ఏవం వేద ।"* (తై.బ్రా. 2.కాం. 7.ప్ర. 18.అను)

తా॥ ఈ వృత్తాంతమును అనగా స్తోమచతుష్టయానుష్ఠానము వలన ప్రజలు తిరుగుబాటు లేకుండ పన్నుల నిచ్చెద రను విషయమును తెలిసికొనిన పురుషుని ప్రజలు పూజింతురు. ఎవ్వరిచేతను తిరస్కరించబడని కీర్తి ఈ వేదితను పొందును.

## విఘనక్రతుయాగము, వేదనము యొక్క ప్రశంస.

"ప్రబాహుగ్వా అగ్రే క్షత్రాణ్యాతేవుః । తేషా మిం
ద్రః క్షత్రా ణ్యాదత్త । న వా ఇమాని క్షత్రా ణ్యభూవ
న్నితి । త న్నక్షత్రాణాం నక్షత్రత్వం । ఆశ్రేయసో
భ్రాతృవ్యస్య తేజ ఇంద్రియం దత్తే । య ఏతేన య
జతే । య ఉ చైవ మేవం వేద ।" (తై.బ్రా. 2.కాం. 7.ప్ర. 18.అను.)

తా॥ పూర్వము ఒకప్పుడు క్షత్రియవంశములో జనించిన పురుషులు బాహుళ్యముగ (అత్యధికముగ) తపంబునాచరించిరి, అప్పుడు ఇంద్రుడు ఈ విఘనయాగానుష్ఠానముచే ఆ క్షత్రియుల బలములను స్వీకరించెను. దానిచే వారు బలరహితులైరి. సర్వజనులును వీరికి బలములు లేవని బలికిరి. ఇచ్చట క్షత్రశబ్దమునకు బలము అర్థము. గనుక, "క్షత్రాణి బలాని నైవా౽భూవ న్నిత్యేవం జనా ఉక్తవంతః".

ఈ యాగానుష్టానమహిమచే ఇంద్రవిరోధులకు బలము లేక పోవుటచే బలరాహిత్య రూపమగు అర్థమును చెప్పెడి 'నక్షత్ర' నామవారలకు సంప్రాప్త మయ్యెను. నక్షత్రులు, లేక బలరహితులు అను పేరు వచ్చెను. ఇంద్రునివలె ఏ పురుషుడు యాగమును చేయునో, ఎవరు ఈ విషయమును తెలిసికొందురో, వారుభయులును తనకంటె అధికుడగు శత్రువుయొక్క తేజస్సును (ఆజ్ఞాశక్తిని), ఇంద్రియమును (శరీరబలమును) స్వీకరింతురు.

## పూర్వోక్తద్వాదశ, చతుర్విగ్ంశ, స్తోమములకు స్థాననిర్దేశము

"త ద్యథాహ వై స చక్రిణౌ కప్లకా వుపావహితౌ
స్యాతాం । ఏవ మేతౌ యుగ్మం తౌస్తోమౌ । ఆయుక్షు
స్తోమేషు క్రియేతే । పాప్మనోపహత్యై ।" (తై.బ్రా. 2.కాం. 7.ప్ర. 18.అను.)

తా॥ కపి (కోతి) వలె గమనసమర్థులగు యిద్దరు రథికులు గమనముకొరకు ఎట్లు సావధానులై యుందురో, అట్లే సమసంఖ్యా యుక్తములగు ద్వాదశ, చతుర్వింశ, స్తోమములు క్రతువుయొక్క సమాప్తిని పొందుట యందు సమర్థములు. అట్టి రెండు స్తోమములు విషమ సంఖ్యాకము లగు (బేసి సంఖ్యగల) త్రివృత్, సప్తదశ, స్తోమముల స్థానమందు చేయవలెను. దానివలన పాపవినాశ మగును.

## వివరణము.

**య**జ్ఞములు ప్రకృతు లనియు, వికృతులనియు రెండు విధములు. ఏ క్రతువులందు సంపూర్ణముగ అన్ని అంగములను (చేయ వలసినవాటిని) శ్రుతి ఉపదేశించునో, అది ప్రకృతి. ఎచ్చట విశేషాంగములను మాత్రమే శ్రుతి ఉపదేశించునో, అవి (ఆక్రతువులు) వికృతులు. వికృతులందు మిగిలిన అంగము లన్నియు ప్రకృతిక్రతువు నుండి వచ్చును ("ప్రకృతివ ద్వికృతిః కార్యా" అను శాస్త్రానుసారము).

ప్రకృతములో విఘన మన్ననది సోమయజ్ఞము. ఇది వికృతి యజ్ఞము. దీనికి అగ్నిష్టోమమనునది ప్రకృతియజ్ఞము. ఐదు రోజులు చేయవలెను. ప్రకృతియజ్ఞ మగు అగ్నిష్టోమములో ఐదవరోజున ఉద్గాత, ప్రస్తోత, ప్రతిహర్త అను ముగ్గురు ఋత్విక్కులు సామగానము చేసెదరు. ఆ ఐదవరోజున బహిష్పవమానము, మాధ్యందిన పవమానము, ఆర్భవపవమానము అను పేర్లు గల సామసంనివేశములో పై ఉద్గాత్రాదులు సామగానము చేయునపుడు త్రివృత్ స్తోమము, పంచ దశస్తోమము, సప్తదశస్తోమము, ఏకవిగ్ంశస్తోమము అను నామములు గల స్తోత్రములతో గానము చేయవలెను.

బహిష్పవమానములో త్రివృత్‌స్తోమముతోను, మాధ్యందిన పవమానములో పంచదశస్తోమముతోను, ఆర్భవపవమానములో సప్తదశస్తోమముతోను, యజ్ఞాయజ్ఞియ సామను ఏకవింశస్తోమము తోను, సామలను గానము చేయవలెను.

## స్తోమలక్షణము.

**ఋ**గ్వేదమువలనను, ఆవృత్తి భేదమువలనను నిష్పన్న మగు సామసమూహము స్తోత్రము. లోకములో సంగీతశాస్త్రములో ప్రసిద్ధములగు తోడి, రేగుప్తి, కళ్యాణి మున్నగు రాగవిశేషములను ఒక పద్యమందుగాని, ఒక కృతియందుగాని ఎట్లు గానము చేయుదురో అట్లే ఈ సామలను గూడ ఋఙ్మంత్రము లందు గానము చేయుదురు. త్రివృత్ స్తోమములో మూడు సూక్తములు. ఒక్కొక్క సూక్తములో మూడేసి ఋక్కుల చొప్పున మొత్తము తొమ్మిది ఋక్కులకు త్రివృత్‌స్తోమ మని పేరు. ఆ తొమ్మిది ఋక్కులకు ఆ వృత్తి లేకుండ గానము చేయుటయే త్రివృత్‌స్తోమము.

పంచదశస్తోమములో ఆ సామను మూడు పర్యాయములు గానము చేయవలెను. ఆ సామకు మూడు ఋక్కులుండును. ప్రథమ పర్యాయములో మొదటి ఋక్కును మూడు సార్లును, రెండవ ఋక్కును ఒక సారియు, మూడవ ఋక్కును ఒకసారియు, (ఈ విధముగ) పంచసంఖ్య సంపాదించవలెను. ద్వితీయపర్యాయములో పంచసంఖ్యా సంపత్తి.

తృతీయపర్యాయములో మొదటి రెండు ఋక్కులును ఒక్కొక్క పర్యాయమును, మూడవఋక్కును మూడు సార్లును గానము చేయవలెను. ఈ విధముగ పంచసంఖ్యాసంపత్తి. ఈ విధముగ సామను మూడు పర్యాయములు గానము చేసినచో పంచదశ స్తోమములో పంచదశసంఖ్యాసంపత్తి.

సప్తదశస్తోమములో ఋగావృత్తి ప్రకారము సామను మూడు పర్యాయములు ఈ క్రిందివిధముగ గానము చేసి సప్తదశసంఖ్యను సంపాదించవలెను. వెనుకటివలెనే సామకు మూడు ఋక్కులుండును. వాటిలో ప్రథమపర్యాములో మొదటి ఋక్కును మూడుసార్లును, రెండవ ఋక్కును ఒకసారియు, మూడవ ఋక్కును ఒకసారియు గానము చేయవలెను. ద్వితీయపర్యాయములో మొదటి ఋక్కును ఒకసారియు, రెండవ ఋక్కును మూడుసార్లును, మూడవ ఋక్కును ఒక సారియు సామగానము చేయవలెను. ఈ విధముగ పంచసంఖ్యాసంపత్తి. మూడవపర్యాయములో మొదటి ఋక్కు ఒకసారియు, రెండు మూడు ఋక్కులు రెండును (ఒక్కొక్కటి) మూడు పర్యాయములును గానము చేయవలెను. ఈ విధముగ తృతీయపర్యాయములో సప్తసంఖ్యాసంపత్తి. ఈ విధముగ సామనుగానము చేసినచో సప్తదశస్తోమములో సప్తదశసంఖ్యాసంపత్తి.

ఏకవిగ్ంశస్తోమమునకు గానప్రకారమును గమనింతము. మొదటి పర్యాయములో మొదటి రెండు ఋక్కులును మూడేసి సార్లును, మూడవ ఋక్కు ఒకసారియు సామగానము చేయవలెను. ఈ విధముగా సప్తసంఖ్యాసంపత్తి. ద్వితీయపర్యాయములో మొదటి ఋక్కును ఒకసారియు, రెండు, మూడు ఋక్కులను మూడేసి పర్యాయములును గానము చేయవలెను. ఈ విధముగ సప్తసంఖ్యాసంపత్తి, తృతీయపర్యాయములో మొదటి ఋక్కును మూడవ ఋక్కును మూడేసి సార్లును, రెండవ ఋక్కును ఒకసారియు గానము చేయవలెను. ఈ విధముగ తృతీయపర్యాయములో పప్తసంఖ్యాసంపత్తి. ఈ విధముగ ఉద్గాత, ప్రస్తోత ప్రతిహర్తలు సామగానము చేసినచో స్తోత్రసాధనము లగు ఋక్కులు సంఖ్య ఇరువది యొకటి అగును.

సర్వ వికృతి యజ్ఞములకు ప్రకృతి యగు అగ్నిష్టోమము అను యజ్ఞములో ఈ విధముగ త్రివృత్స్తోమము, పంచదశస్తోమము, సప్తదశస్తోమము, ఏకవిగ్ంశస్తోమము అను నాలుగు స్తోమములు విహితములు. ఈ ప్రకృతి యజ్ఞమగు అగ్నిష్టోమమునుండి వికృతి యజ్ఞములన్నిటిలోకి అన్ని అంగములును అతిదేశముచే సంప్రాప్త మగును.

ప్రకృతములో విఘన మను ఈ వికృతి యజ్ఞములోనికి ప్రకృతి యగు అగ్నిష్టోమములోని త్రివృదాదిస్తోమములు అతిదేశముచే ప్రాప్తమగుచుండగా, అతిదేశమును బాధించి, "తస్య

ద్వేద్వాదశే స్తోత్రే భవతః। ద్వే చతుర్విగ్ంశే।" అను ప్రత్యక్షోప దేశముచే త్రివృదాదిస్తోమములను బాధించి ఆ స్తోమముల స్థానము లందు రెండు ద్వాదశస్తోమములును, రెండు చతుర్విగ్ంశస్తోమములును విహితము లైనవి.

త్రివృదాదిస్తోమముల స్థానమందు విహితములైన ఈ ద్వాదశ, చతుర్విగ్ంశ స్తోమములు వరుసగ గానము చేయక, జేసి స్థానములందు అనగా త్రివృత్, పంచదశ, సప్తదశ, ఏకవిగ్ంశ, అను స్తోత్రక్రమములో త్రివృత్, సప్తదశ, స్తోత్రస్థానములందు ద్వాదశస్తోమములు రెండును, పంచదశ, ఏకవిగ్ంశస్తోమస్థానము లందు రెండు చతుర్విగ్ంశస్తోమములును గానము చేయవలెను.

ఫలితము: ఈ విఘన యజ్ఞములో పై విధముగ సామ గానము చేసినచో ప్రజలు తిరుగుబాటును వీడి రాజుకు పన్నుల నిచ్చెదరని తాత్పర్యము.

## విఘనాऽనుష్ఠాన, వేదనముల ప్రశంస.

*"అపపాప్మానం భ్రాతృవ్యగ్ం హతే। య ఏతేన*
*యజతె। య ఉ చైన మేవం వేద।"* (తై.బ్రా. 2.కాం. 7.ప్ర. 18.అను.)

ఈ విఘనయజ్ఞమును అనుష్ఠానము చేసిన పురుషునకును, తెలిసికొనిన వానికిని, పాపరూప మగు శత్రువు నశించును. అనగా, పాపవినాశ మగును.

## స్తోమస్వరూపము.

**ఋ**క్కుల యొక్క భేదముచేతను, ఆవృత్తిభేదముచేతను, నిష్పన్నమైన స్తోత్రసాధన మగు ఋగ్గతసంఖ్యను స్తోమ మనెదరు (అనగా స్తోత్రగత సంఖ్యావిశేషము.)

## ద్వాదశ, చతుర్వింశ, స్తోత్రములకు ఋగ్విశేషవిధి.

*"తద్యథా హవై సూతగ్రామణ్యః। ఏవం ఛందా*
*గ్ంసి। తే ష్వసావాదిత్యో బృహతీ రభ్యూఢః। సతో*
*బృహతీషు స్తు వతే సతో బృహన్। ప్రజయా పశుభి*
*రసానీత్యేవ।"* (తై.బ్రా. 2.కాం. 7.ప్ర. 18.అను.)

తా॥ లోకములో రథస్వామి సూతులలో రథమును నడుపుటకు సారథిగ ఎవనిని అంగీకరించునో, అతడు రథమును ఎట్లు నడుపునో, మరియు గ్రామపాలనకు అనేకులు ఆశించినపుడు రాజు ఎవనిని గ్రామణిగ (గ్రామపరిపాలకునిగ) అంగీకరించునో, అతడు గ్రామమును ఎట్లు పాలించునో, అట్లే ఆదిత్యుడు ప్రకృతములో ఈ సామగానమునకు

ఆధారమగు ఋగ్విశేషములను నిర్ణయించవలెను గాన, ఛందస్సులలో బృహతీఛందోయుక్తము లగు ఋక్కులను ద్వాదశ, చతుర్వింశస్తోమయుక్తములగు స్తోత్రములకు ఆధారభూతమైన వాటినిగ నిర్ణయించెను. అనగా, "ఋచ్యధ్యూఢం సామ గీయతే" అను వచనానుసారము ఋక్కునందు సామగానము చేయవలెను. గాన ఈ విఘనక్రతువులో బృహతీఛంద స్కములగు ఋక్కులను ఆదిత్యుడు సామగానమున కాధారముగ నంగీకరించెను. అందుచే బృహతీఛందోయుక్తములగు ఋక్కులందు ఉద్గాతలు సామగానము చేయవలెను.

సతోబృహతీఛందో యుక్తఋక్కులందు గానము చేయటుకు అభిప్రాయమేమనగా, ఈ స్తోత్ర కర్తలు (ఉద్గాత్రాదులు) సన్మార్గ వర్తియగు పురుషుని కంటె ప్రజాపశువులచే అధికుడను కావలెను" (సతః సన్మార్గ వర్తినః పురుషాత్ అధికః భవానీ త్యేవస్తోతారః ప్రవర్తంతే) అనియే స్తోత్రము చేయుదురు గాన ఇచ్చట ఈసతోబృహతీ ఋక్కులు గానాధార మని భావము. ఈ ఋత్విక్కులు కోరెడి ఫలము, 'మహాగ్నీవర్చః' అను స్థలములో పూర్వ మీమాంసలో నిర్ణయించిన సిద్ధాంత ప్రకారము వారి యజమానులకు గాని ఋత్విక్కులకు కాదని అభిప్రాయము.

## గానకాలమందు విశేషము.

*"వ్యతిషక్తాభి స్తువతే । వ్యతిషక్తం వై క్షత్రం*
*విశా । విశై వైనం క్షత్రేణ వ్యతిషజతి ।" (తై. బ్రా. 2. కాం. 7. ప్ర. 18. అను.)*

నతోబృహతీఛందో యుక్తము లగు ఋక్కులు ఇతర చ్ఛందోయుక్తము లగు ఋక్కులతో వ్యతిషక్తముగ సంబంధ ముండు నట్లుగ గానము చేయవలెను. అనగా, ఒక ఋక్కు నతోబృహతి, తరువాత ఋక్కు మరియొక ఛందస్సు. తిరిగి సతోబృహతి, తరువాత ఋక్కు ఛందాంతరయుక్తము. (ఇది వ్యతిషంగము) ఈ విధములగు ఋక్కులందు గానము చేయవలెను.

లోకములో క్షత్రియజాతి వైశ్యజాతితో మిశ్రమమై యుండును. అనగా క్షత్రియుడు వైశ్యులవన పన్నును తీసికొని రాజ్యమును చేయును. ఈ క్రతువులో ఈవ్యతిషక్తస్తోత్రముచే యజమానుని క్షత్రియవైశ్యులతో సంబంధము కలవానినిగ చేయును.

## ప్రకారాంతరముగ వ్యతిషంగప్రశంస.

*"వ్యతిషక్తాభిస్తువతే । వ్యతిషక్తోవై గ్రామణీ*
*స్వజాతైః । సజాతైః రేవై నం వ్యతిషజతి ।      (తై. బ్రా. 2. కాం. 7. ప్ర. 18. అను.)*

లోకములో గ్రామాధికారి సహోత్పన్నులగు భ్రాత్రాదులతోను, ఆ గ్రామనివాసులగు ప్రజలతోను కలసి మెలసి యుండును. అందువలన ఈ విఘనక్రతువులో వ్యతిషక్త

స్తోత్రముచే ఈ యజమానుని సజాతులతో మిశ్రీభూతునిగ చేయును. దీనివలన గ్రామాధికారి గ్రామవాసులగు ప్రజలతో ఐకమత్యముగ నుండుట బోధిత మగుచున్నది.

## ప్రకారాంతరముగ వ్యతిషంగప్రశంస.

"వ్యతిషక్తాభి స్తువతే । వ్యతిషక్తో వై పురుషః
పాప్మభిః వ్యతిషక్తాభి రేవాస్య పాప్మనో నుదతె ।" (తై.బ్రా. 3.కాం. 1.ప్ర. 18.అను)

తా॥ పురుషుడు అనేకపాపములతో సంసృష్టుడై యుండును. అందుచే ఈ విఘనక్రతువులో వ్యతిషక్తఋుక్కులచే ఈ పురుషుని యొక్క పాపములను నశింపచేయును.

ఫలితము: దీనివలన దేవలోకములో గూడ ఇంద్రాదుల రాజ్యపాలనలో ప్రజలు పన్నుల నీయక వ్యతిరేకులైనట్లును, ఆ ప్రజావ్యతిరేకమును వైదికలౌకికోపాయములచే తొలగించుకొని ప్రజలను వశపరచుకొని పన్నుల (కర) గ్రహణము చేయుచు నిష్కంటకముగ రాజ్యపాలనము చేయుచున్నట్లును స్పష్ట మగుచున్నది.

## మరుద్గణముల జన్మవృత్తాంతము.

పూర్వ మొకపుడు ఇంద్రుడు దితి కుమారులను సంహరించు చుండెను. ఆమె పుత్ర శోకసంతప్తురాలై ఇంద్రుని సంహరింపగల పుత్రుని పొంద గోరి భర్త యగు కశ్యపుని ప్రార్థించెను. కశ్యపానుగ్రహముచే దిగి గర్భవతి యయ్యెను. ఇంద్రుడీవృత్తాంతము తెలిసికొని, ఒక బాలుని రూపమును ధరించి వచ్చి దితికి పరిచర్యలు చేయుచుండెను.

ఒకనాడామె యశుచి యై నిదురించుచుండగా ఇంద్రుడామె గర్భమును ప్రవేశించి శిశువును ఏడు ముక్కలుగ ఖండించెను. ఆ యేడు ముక్కలును శివువులై ఏడ్పు మొదలిడినవి. మరల ఇంద్రుడు ఒక్కొక్కని నేడు ముక్కలుగ గోసెను. ఈ ముక్కలనియ్నయు శివువులై ఏడువసాగెను. ఇంతలో దితి మెలుకువ జెంది శిశువులను జంపవలదని గోరెను.

ఇంద్రుడు బయటకేతెంచి, పుట్టబోవు శిశువు తనకు శత్రువు కాబోవు నని ఇట్లు చేసితి నని చెప్పెను. "వీరు నీకు శత్రువులు గారు మిత్రులేయగుదురు. వీరిని నీవే కాపాడుము" అని దితి వారిని ఇంద్రున కొసంగెను. వారెంతకును మృతులు కాకుండుటచే వారును దేవతలే యని ఇంద్రుడు బలికి వారికి మరుత్తులను నామ మిడెను. వారే మరుద్గణములు.

## ఉష్ణీషధారణము.

వర్తమానకాలములో పోలీసుడిపార్టుమెంటులోని అధికారిక పురుషులు (ఉద్యోగస్థులు) శిరస్సునందు లోహితోష్ణీషములను (ఎఱ్ఱని పాగాలను) ధరించి పనిచేయుటయు, మిగిలిన

ఆఫీసులలోని అధికారిక పురుషులు (జడ్జీలు మున్నగువారు) శ్వేతోష్ణీములను (తెల్లనిపాగాలను) ధరించి పని చేయుటయు ఆచరణలో నున్నది. శ్రౌతకర్మ లగు యజ్ఞములలో గూడ నిది ఆచరణలో నున్నది. దాని ననుసరించియే లోకములో గూడ నిభిన్నముగ ఉష్ణీషధారణము ఆచారములో ప్రవర్తించుచున్నట్లు సుబోధ మగుచున్నది.

## యజ్ఞములో ఉష్ణీషధారణవిధి.

"సకర్ణప్రావృతా అకర్ణప్రావృతా వా యజ్ఞా యజ్ఞి
యేన స్తువతె । యే ప్రసృప్తా స్స్యుస్తే సర్వే౽గ్ని
ష్టోమ ముపగాయేయుః ।" (ఆ.శ్రౌ.సూ.)

తా॥ యజ్ఞములో 5వ దినమున రాత్రి ఉద్గాతలు (అనగా, ఉద్గాత, ప్రస్తోత, ప్రతిహర్త అను ముగ్గురు ఋత్విక్కులు) యజ్ఞా యజ్ఞియము అను సామను గానము చేయవలెను. ఇది యజ్ఞములో ఆఖరి సామగానము.

యజ్ఞములో 5వ దినమున గానము చేయవలసిన అన్ని సామలను పై ఉద్గాతలును, ఉపగాతలును గానము చేసెదరు.

"చత్వారో౽వరార్థ్యా ఉపగాతారః" (శ్రౌ. సూ.)

ఉపగాతలు అనగా యజ్ఞములో ఉద్గాతలకు సహాయముగ గానము చేయువారు. వీరిని 5వ దినమున గానములో సహాయము కొఱకు నల్గురకు తక్కువ కాకుండా వరించెదరు. అనగా ప్రథమదివసమున యజ్ఞసంకల్పములో వరించిన పదునెనిమిది ఋత్విక్కుల కంటె వీరు వేరు. వీరిని 5వ దినముననే వరించెదరు. ఈ యజ్ఞాయజ్ఞియసామను వీరలే గాక, ప్రసర్పకులు గూడ గానము చేయవలెను. అనగా, ఉద్గాత్రాదులును, ఉపగాతలును, ప్రసర్పకులును గానమ చేయవలెను. యజ్ఞమును చూడవచ్చిన శిష్టులు ప్రసర్పకులు. దక్షిణాదానకాలములో ఋత్విక్కులతో పాటు ఈ ప్రసర్పకులకు గూడ యథాశక్తిగ దక్షిణను ఇవ్వవలసినదిగ శ్రౌతసూత్రము బోధించుచున్నది.

"ప్రసర్పకాః లోమాని వో దదామి । తాని వో
యథాశక్తి దానేన నిష్క్రీణామి ।" (ఆ.శ్రౌ.సూ.)

తా॥ యజ్ఞములో యజమాని ఋత్విక్కులకు తన సర్వశరీరావయవములను దక్షిణగా నిచ్చి, తిరిగి వాటిని ఋత్విక్కుల నుండి వారి వారి దక్షిణభాగముల దానములచే తాను కొనును. ప్రకృతములో ప్రసర్పకులకు లోమముల నిచ్చి, వాటిని ప్రసర్పకులకు యథాశక్తి ద్రవ్యదానముచే యజమాని కొనును.

## శ్వేతోష్ణీషము.

వీరందరును ఉష్ణీషములను (పాగాలను) ధరించియే యజ్ఞా యజ్ఞియసామను గానము చేయవలసినదిగ పై సూత్రము భోధించుచున్నది.

"య న్న ధౌతం నవం శ్వేతం సదశం య న్న ధారితం ।
అహతం త ద్వ్విజానీయా త్సర్వ కర్మసు శోభనం ।"

ఈ విధముగ శ్వేతవస్త్రములను ధరించి వాటినే పై సామగానసమయమున పాగాలనుగ ధరించుటచే ప్రకృతి యజ్ఞములో తెల్లనిపాగాలను ధరించెదరని అర్థసిద్ధము.

## లోహితోష్ణీషము.

"శ్యేనే నాభిచర న్యజేత" అను విధివాక్యానుసారము శత్రువధకాముడు 'శ్యేనము' అను పేరు గల యజ్ఞమును చేయవలెను. ఇది అభిచారికక్రతువు. అనగా శత్రువులను జంపుటకు చేయు యజ్ఞము గావున, ఆ క్రతువులో "లోహితోష్ణీషా ఋత్విజః ప్రచరింతి" అను విధివాక్యానుసారము ఎఱ్ఱని పాగాలను (ఉష్ణీషము లను) ధరించవలెను.

ఇట్లు అభిచారిక యజ్ఞములో ఎఱ్ఱని పాగాలను (ఉష్ణీషము లను) పై శ్రుతి విధించుచున్నది గాన పై శ్యేనయాగమువలె హింసా ప్రధానమైన క్రిమినల్ డిపార్టుమెంటులో అధికారిక పురుషు లందరును ఎఱ్ఱని ఉష్ణీషములను ధరించుటయు, ఇతర సివిలుడిపార్టు మెంటులో అధికారిక పురుషులు శ్వేతోష్ణీషములను ధరింయుటయు పై శ్రుత్యాచారపూర్వక మని స్పష్ట మగుచున్నది.

ఈ విధముగ ఆఫీసులలో శ్వేత, లోహిత భేదముచే ఉష్ణీషధారణము గూడ వైదిక కర్మలలో ఉష్ణీషధారణమూలక మని స్పష్ట మగుచున్నది.

## దూతల చిహ్నధారణము.

లోకములో ఆఫీసులలో ఉత్తమాధికారుల దూతలు (బంట్రోతులు) యజ్ఞోపవీతమువలె దూతచిహ్నాల నలంకరించుకొనుచుండు టను మనము చూచుచుంటిమి. ఈ విధముగ దూతలు చిహ్నాలను ధరించుట దేవతలలో గూడ నున్నట్లు వేదములో గనపడుచున్నది.

"యక్షచ్చుపి ప్రయచ్చ నో విప్రో దూతః పరి
ష్కృతః ।"

"అగ్ని ర్దేవానాం దూత అసీత్ ।"

*"త్వా మగ్నే సమిధానం యవిష్ఠ । దేవా దూతం*
*చక్రిరే హవ్యవాహం ।"* *(కృ. య.సం. 3. కాం. 2. ప్ర. 11. అను.)*

తా॥ ఇత్యాది శ్రుత్యనుసారము దేవతలకు దూత యగు అగ్నికి దూతచిహ్నాధారణము కంఠోక్తిగ వక్కాణింపబడుటచే, ఆధునాతనులగు దూతలు చిహ్నాలను ధరించుట తన్మూలకమే యని విదిత మగుచున్నది. (దూత యనగా, పరవృత్తాంత జ్ఞాపనకుశలుడు).



ఓం

శ్రీ మహాగణాధిపతయే నమః ।

# వేదసార రత్నావళి

## 11. స్నాన ప్రకరణము.

"ఇతిహాసపురాణాభ్యాం వేదార్థ ముపబృంహయేత్ ।"

తా॥ వేదములో చెప్పెడి విషయములను ఇతిహాసపురాణాదులచే విపులముగ తెలిసికొనవలెను. అనగా, సంకుచితముగ చెప్పబడు విషయములను ఇతిహాసపురాణాదులు విస్తరించి చెప్పునుగాన, వాటి ద్వారా వేదప్రతిపాద్య మగు అర్థములను సాకల్యముగ తెలిసికొన వలెను.

ఈ న్యాయము ననుసరించి వేదోక్త మగు స్నానము, వపనము మున్నగువాటిని వివరించెడి స్మృత్యాదులను ఉల్లేఖ చేసి వ్రాయుట అత్యవసరము. అందుచే స్మృత్యాదులందలి శ్లోకములు మున్నగు వాటిని తరచుగ వివరించుచు అర్థము వ్రాయబడుచున్నది.

### స్నానావశ్యకత.

శ్లో॥ "అస్నాతో నాచరే త్కర్మ జపహోమాది కించన ।
స్నాత్వాధికారీ స్యాదేవ దైవే పిత్ర్యే చ కర్మణి ॥
అత్యంతమలినః కాయో నవచ్ఛిద్రసమన్వితః ।
స్రవత్యేవ దివారాత్రం ప్రాతస్స్నానం విశోధనం ।"

తా॥ నవచ్ఛిద్రములతో గూడిన ఈ శరీరము అత్యంతము మలినమైనది. అహోరాత్రములు ఛిద్రముల ద్వారా మాలిన్యమును స్రవించుచునే యుండును. అట్టి శరీరమునకు ప్రాతఃకాలమందు స్నానము పరిశుద్ధి చేయును. స్నానరహితు డగుచు, జపహోమాదికర్మలను చేయరాదు. చేయుటకు అధికారము లేదు. స్నానము చేసినచో, ఆ కర్మలను చేయుటకు అధికారి యగును. విశేషించి అధాన మను శ్రౌతకర్మ చేయబోవునపుడు పూర్వాంగములో దశవిధస్నానములు ఈ క్రింది విధముగ జెప్పబడినవి.

## దశవిధస్నానములు.

శ్లో॥ భస్మ, గోమయ, మృ, ద్వారి, పంచగవ్యై స్తతః పరం ।
గోమూత్రం, గోమయం, క్షీరం, దధి, సర్పిః, కుశోదకం ॥"

"అగ్ని రస్మి జన్మనా ఘృతం మే చక్షురమృతం న ఆగన్ ।
అర్క స్త్రీ ధాతూ రజసో విమానో జస్రో ఘర్మో హవి రస్మి
నామ ।"

అను మంత్రముచే భస్మస్నానము చేయవలెను. 'గంధద్వారాం' అను మంత్రముచే గోమయస్నానము చేయవలెను. "స్యోనాపృథివీ" అను మంత్రముచే మృత్తికాస్నానము చేయవలెను. "అపో హిష్ఠే" త్యాది మంత్రములచే వారిస్నానము చేయవలెను. గాయత్రీమంత్రముచే గోమూత్రస్నానము చేయవలెను. "ఆప్యాయస్వ" అను మంత్రముచే క్షీరస్నానము, "దధిక్రావ్ణ్ణో" అను మంత్రముచే దధిస్నానమును చేయవలెను. "శుక్రమసి" అను మంత్రముచే ఆజ్యస్నానమును, "దేవస్య త్వా" అను మంత్రముచే కుశోదకస్నానమును చేయవలెను. ఈ విధముగ దశవిధస్నానములు చేసిన పిమ్మట ఆధానము మున్నగు కర్మలు చేయవలెను. ఇట్లు ఆ ధానాద్యంగములుగ విహితములైన దశవిధస్నానములే గాక, నిత్య స్నానములో కూడ అధికారితారతమ్యముచే ఆచరణ చేయుటకు సప్తవిధస్నానములు ఈ క్రింది విధముగ ప్రతిపాదింపబడినవి.

## సప్త విధస్నానములు.

**వా**రుణము, ఆగ్నేయము, వాయువ్యము, బ్రాహ్మము, కాపిలము, మానసము, దివ్యము, అని స్నానములు సప్తవిధములు.

"జలావగాహో వారుణం, భస్మనా ఆగ్నేయం, గోరజసా
వాయవ్యం, ఆపోహిష్ఠాదిమంత్రై ర్బ్రాహ్మం, నాభే రధః
ప్రక్షాళన మూర్ధ్వం చార్ద్రవాససా శరీరసమ్మార్జనం కాపిలం,
అధ్యయానందవిద్రూపవిష్ణుచింతనం మానసం । సాతపవర్షే
దివ్యం స్నానం ।"

జలములో మునిగి స్నానము చేయుట వారుణస్నానము.

శ్లో॥ నాభిమాత్రజలే స్థిత్వాకృత్వా కేశాన్ శిఖాం ద్విజః
నిరుద్ధకర్ణనాస స్తు త్రివారం మజ్జనం చరేత్ ।"

తా॥ బొడ్డులోతు గల జలమున నుండి, జుట్టు ముడివేసికొని, చెవులు ముక్కు మూసికొని, మూడుసార్లు మునగవలెను. ఇది వారుణము.

శరీరమంతటను భస్మ పూసికొనుట అగ్నేయస్నానము. గోవు యొక్క పాదరజస్సును శరీర మంతటను రాసికొనుట వాయవ్య స్నానము. అపోహిష్ఠేత్యాది మంత్రములచే ప్రోక్షణము చేసికొనుట బ్రాహ్మము. బొడ్డుక్రింద ఉదకముచే ప్రక్షాళన చేసికొని, ఊర్ధ్వ కాయమును తడిబట్టచే తుడుచుకొనుట కాపిలస్నానము. మనస్సుచే విష్ణుస్మరణ చేయుట మానసము. ఎండకాయునపుడు వర్షము కురియుచో దానిలో స్నానము దివ్యస్నానము.

ఎండలో కురిసిన వర్షములో స్నానము చేసిననో కాశీగంగలో స్నానము చేసిన పుణ్యము లభించునని ప్రతిపాదిత మైనది. మానసిక స్నానము ప్రశస్తము. ఇంతేగాక, మానసిక పూజ, మానసిక యజ్ఞము మున్నగు సర్వమానసిక కర్మలును ప్రశస్తములు. యజ్ఞాది ప్రౌఢకర్మలలో గూడ దీక్షకు పూర్వము స్నానము విహితమై యున్నది. దానితో దీక్ష ప్రారంభమగును. ఈ విషయమునే ఈ క్రింది శ్రుతి విదించుచున్నది -

*"అంగిరస స్సువర్గం లోకం యంతో౽ప్సు దీక్షా*
*దపసీ ప్రవేశయ న్నప్సు స్నాతి సాక్షాదేవ దీక్షా తపసీ*
*అవరుంధే తీర్థే స్నాతి తీర్థే హితే తాం ప్రావేశయ*
*న్తీర్థే స్నాతి తీర్థ మేవ సమానానాం భవతి ।"* (కృ.యు.సం.6-1-1).

తా॥ పూర్వము అంగిరస్సు లను మహర్షులు యజ్ఞానుష్ఠానముచే స్వర్గలోకమును గూర్చి వెడలుచు, దీక్షాతపోభిమాని దేవతలను ఉదకములందు ప్రవేశబెట్టిరి. అందుచే ఉదకములందు స్నానము చేయవలెను. దానిచే శీఘ్రముగ దీక్షాతపస్సులను బొందుదురు. ఈ విధముగ స్నానమును విధించిన పిమ్మట స్నానప్రదేశవిధానము చెప్పబడుచున్నది.

*"తీర్థే స్నాతి తీర్థే హితే తాం ప్రావేశయన్ తీర్థే*
*స్నాతి తీర్థ మేవ సమానానాం భవతి ।*

తా॥ అంగిరస్సులు దీక్షా తపస్సులను తీర్థమందు ప్రవేశబెట్టిరి గాన, తీర్థమందే (రేవుయందే) స్నానము చేయవలెను. తీర్థమందు స్నానము చేయుటచే తన సఖులు మున్నగువారికి తాను తీర్థమువలె సేవించదగినవాడగును. ఈ విధముగ యజ్ఞములో స్నానమును పై శ్రుతి విధించుచున్నది.

అచ్చటి స్నానమంత్రములో స్నానము వలన పాపవిమోచన మును శ్రుతి బోధించుచున్నది.

*'అపో అస్మా న్మా తర శ్శుంధంతు ఘృతేన నోఘృతం*
*పునః పునంతు విశ్వ మస్మ త్ప్రవహంతు రిప్రం ।' (కృ.య.సం. 1-2-1)*

తా॥ మాతృస్థానీయము లగు ఉదకములు మమ్ములను పరిశుద్ధలను చేయుగాక, పర్జన్యాదులు ఘృతముచే (అనగా, స్రవించుచుండెడి ఉదకముచే) మమ్ములను శుద్ధులను చేయుగాక. ఈ ఉదకములు సమస్త పాపమును మా వల్లనుండి పోగొట్టుగాక. స్నానము వలన పాపనాశమును ఈశ్రుతి కంఠోక్తిగా వక్కాణించుచున్నది.

## అశ్వమేధములో స్నానవిధి.

*'స్నాతి । అహతం వాసః పరిధత్తే । పాప్మనోప*
*హ్వాత్యై ।* *(కృ.య.బ్రా. 3-8-1)*

తా॥ అశ్వమేధదీక్షాప్రక్రమములో కూడ దంతధావనోత్తరమున స్నానము చేసి అహతవాసస్సును ధరించవలెను. (అనగా నూతన వస్త్రమును ధరించవలెను). ఈ స్నానము పాపనాశముకొరకగును. అనగా స్నానమువలన పాపనాశనమై ఉత్తరకర్మకు అధికారి యగు నని తాత్పర్యము.

## అహతలక్షణము.

"ఈష ద్ధౌతం నవం శ్వేతం సదశం య న్న ధారితం ।
అహతం త ద్విజానీయా త్సర్వకర్మసు పావనం । (ప్రచేతసుతుడు)

తా॥ కొంచెము శుభ్రముచేయబడినది (ఉతుకబడినది) యు, దశతో (బద్దితో) కూడినదియు, ఇతరులచే ధరించబడనిదియు, నూతన మైనదియు నగు వస్త్రము అహతవస్త్రము. అది సర్వకర్మలందును పావనమైన దగుటచే అశ్వమేధములో స్నానోత్తరమందు ఆ వస్త్రమును ధరించవలెను. ఈ శ్రుతి స్పష్టముగ స్నానమువలన పాపనాశనమును బోధించుచున్నది.

## ఉదకములు శ్రద్ధాజనకములు.

*'అపః ప్రణయతి । శ్రద్ధా వా అపః శ్రద్ధా మేవారభ్య*
*ప్రణీయ ప్రచరతి ।" (కృ.య.బ్రా. 3-2-5).*

దర్శపూర్ణమాసేష్టులు శ్రౌతకర్మలో 'ప్రణీతాప్రణయనము' అను పేరు గల దీర్ఘచతురస్ర మగు దారుపాత్రలో ఉదకమును గ్రహించి, ఆ ఉదకమును అహవనీయసమీపమునకు తీసికొని వెళ్ళి, ఆహవనీయమునకు ఉత్తరభాగమున దర్భలందు ఉంచెదరు. దీనినే అపాం

ప్రణయనమందురు. పై శ్రుతి, ఉదకములను ఆహవనీయ సమీపమును పొందించ వలసినదిగ విధించి, ఉత్తరవాక్యముచే (అనగా, 'శ్రద్ధా వా ఆపః' అను వాక్యముచే) ఉదకములు శ్రద్ధా జనకములు గావున, శ్రద్ధారూపము లని వక్కాణించుచు, ఈ విషయము శ్రుత్యంతరములో ప్రసిద్ధమనట్లు 'వై' శబ్దముచే సూచించుచున్నది.

*శ్రు॥ అపో హాస్మై శ్రద్ధాం సంనమన్తే పుణ్యాయ*
*కర్మణే "*

తా॥ ఉదకములు పుణ్యకర్మానుష్ఠానమునకు శ్రద్ధను కలుగ జేయును. కావున, శ్రద్ధారూపములగు ఉదకముల ప్రణయనముచే శ్రద్ధను స్వీకరించి ప్రణయనమును చేసి కర్మను చేసినవాడగును.

*"యోవై శ్రద్ధా మనారభ్య యజ్ఞేన యజతే*
*నాస్యేష్టాయ శ్రద్ధధతే౽పః ప్రణయతి శ్రద్ధా వా ఆప*
*శ్రద్ధా మేవారభ్య యజ్ఞేన యజత ఉభయేస్య దేవ*
*మనుష్యా ఇష్టాయ శ్రద్ధధతే ।"* (కృ.య.సం. 1-6-8).

తా॥ ఏ యజమానుడు మనస్సునందు దేవతాదివిషయక మగు శ్రద్ధను ధరించక యాగము చేయునో, ఆతని యాగమును దేవతలు, ఋత్విక్కులు కూడ విశ్వసించరు. లోకములో స్నానా చమనాదియుక్తుడగు మానవునకు దేవపూజాదులందు విశేషముగ ఏకాగ్రత దృష్టమగుచున్నది. కావున, ఉదకప్రణయనముచే శ్రద్ధ ఉపస్థాపిత మగుచుండుటచే దేవతలకును, ఋత్విక్కులకును ఈ యజమాని యజ్ఞమందు విశ్వాసము యుక్తము. ఈ విధముగ పై శ్రుతుల వలనను, అనుభవమువలనను ఉదకములు శ్రద్ధాజనకములు గావున, స్నానమునకు ఆవశ్యకత్వము సిద్ధమైనది.

## స్నానమునకు కాలనిరూపణము.

*"అపవాసే నక్షత్రాణా మపవాస ఉషసా ముత ।*
*అపాస్మ త్సర్వం దుర్భూత మపక్షేత్రియ మృచ్ఛతు ।"* (అ.వే. 3.కాం. 2.అ. 8.సూ. 7.మం.)

తా॥ నక్షత్రముల యొక్క అపగమనకాలమందు (అనగా ఉషః కాలప్రారంభ మందు) గాని, ఉషః కాలముయొక్క అపగమనకాలమందు (అనగా ప్రభాతకాల మందు) గాని చేయబడు స్నానాదికముచే సర్వరోగములకు కారణమగు పాపసమూహము (దుష్కృతము) మా వల్లనుంచి పోవుగాక. అనగా, సకలరోగజాతము నివృత్త మగుగాక యని భావము.

ఇట్లు స్నానముచే పాపనాశద్వారా ("పూర్వజన్మకృతం పాపం వ్యాధిరూపేణ బాధతే" అను వచనానుసారము) సర్వరోగములు నశించునని శ్రుతిజాతము వక్కాణించు చున్నది. మరియు, యజ్ఞములో స్నానప్రకరణములో ఉదకప్రాశనచే ఆంతర్యమందలి పాప నాశనద్వారా పవిత్రత ప్రతిపాదించబడుచున్నది.

*"అపోశ్నా త్యంతరత ఏవ మేధో భవతి "* *(కృ.య.సం. 6-1-1).*

స్నానముచే బాహ్యశుద్ధియు, ఆచమనముచే అంతశ్శుద్ధియు శ్రుతులచే బోధించబడుచున్నది.

భావము: దీనివలన ఉషఃకాలమందుగాని, ప్రభాతకాలమందుగాని (అనగా సూర్యోదయముకు పూర్వకాలమందు) స్నానాచనమనములచే సర్వ రోగములు నివృత్తము లగు నని శ్రుతి వక్కాణించుటవలన ఆధునికుల తొట్టిస్నానము, ఉషఃపానము, మున్నగు వాటిచే రోగములను పోగొట్టుట అనాదినుంచియు వచ్చుచున్న విషయమే కాని, క్రొత్త విషయము కాదని స్పష్టమగుచున్నది.

## ఉదకములు సర్వరోగనివారకములు.

*"అప ఇ ద్వా వ ఉ భేషజీ రాపో అమీ వ చాతనీః ।*
*అపో విశ్వస్య భేషజీస్తా స్త్వా ముంచంతు క్షేత్రియాత్ ।" (ఋగ్వేదము).*

తా॥ ఉదకములే స్నానము, ఆచమనము మున్నగు వాటిచే సుఖహేతువులు. లేక, ఓషధిరూపముగ పరిణతము లగుచు రోగములను ఉపశమింపజేయును. కనుకనే, ఉదకములు సర్వరోగములను నశింపజేయుటకు కారణములు. మరియు, కొంతమంది ప్రాణులకేగాక, సర్వప్రాణులకు ఔషధరూపములు. అట్టి ఉదకములు ఓరుగ్ణుడా! నీకు రోగచికిత్సను చేయుగాక.

*"అప ఇ ద్వా వ భేషజీ రాపో అమీ వ చాతనీః । అపో*
*విశ్వస్య భేషజీ స్తా స్త్వా ముంచంతు క్షేత్రియాత్ ॥" (అ.వే. 3-2-7)*

తా॥ ఉదకములే స్నానపానాదులచే సుఖసంపాదకములు. మరియు, ఉదకములే ఓషధిరూపముగ పరిణమించి రోగములను నశింపజేయును. ఉదకములే సర్వరోగములను నివారించును. లోకములో ఇతర ఔషధములు ఒక్కొక్కటి ఒక్కొక్క రోగమునకే నివారకములు. ఉదకము లన్ననో, సర్వరోగనివారణ సమర్థములు. మరియు నివి కొందరు ప్రాణులకు మాత్రమేగాక, సర్వప్రాణులకు రోగ నివారకములు. అట్టి ఉదకములు ఓరుగ్ణుడా! నిన్ను

(తల్లిదండ్రుల ద్వారా సంక్రమించిన) క్షయ, కుష్ఠు మున్నగు క్షేత్రియవ్యాధుల నుండి తొలగించుగాక.

## ఉదకములందు రోగనివారకౌషధములు.

"అప్సు మే సోమో బ్రవీత్ । అంత ర్విశ్వాని భేష
జా । అగ్నిం చ విశ్వశంభువం । ఆపశ్చ విశ్వభేషజీః ।" (కృ.య.బ్రా. 5-2-8.)

తా॥ ఉదకములందు సమస్తౌషధములు ఉన్న వని సోముడు చెప్పెను. అనగా, అపమృత్యునివారకములు, రోగనివారకములు అగు సమస్తమైన ఔషధములు ఉన్నవి. మరియు, సమస్త జగత్తుకు సుఖమును సంపాదించెడి అగ్ని కూడా ఉదకములందున్నట్లును, ఉదకములు సమస్త అనిష్టములకు ఔషధరూపములనియు సోముడు చెప్పెను.

మరియు వాజపేయప్రకరణములో ఈ క్రింది విధముగ చెప్పబడినది :

"అప్స్వంత రమృత మప్సు భేషజ మపా ముత
ప్రశస్తి ష్వశ్వా భవథ వాజినః ।" (కృ.య.సం. 1-7-7.)

తా॥ వాజపేయములో అశ్వములను జలమందు కడుగు పై మంత్రములో ఉదకములందు అపమృత్యు నివారకమును, రోగనివారకమును అగు సారము కలదని శ్రుతిచే స్పష్టముగ చెప్పబడినది. అందుచేతనే మనపూర్వులు అఘమర్షణస్నానమును ఆచరించెడివారు.

## ప్రకృతి చికిత్స.

వర్తమానకాలములో నీటిలో ఉన్న మన్నుతోను, తొట్టెవైద్యము మొదలగువానితోను "ప్రకృతి చికిత్స" అను పేరుతో చికిత్సను చేయుచుండిరి. మన పూర్వులు (శిష్టులు) "అఘమర్షణ స్నానము" అను పేరుతో వీటిని ఆచరణలోపెట్టియుండిరి. వేదములో స్నాన ప్రకరణములో ఈ విషయము మంత్రపురస్సరముగ చెప్పబడియున్నది. ఆధునికులు "ప్రకృతి చికిత్స" అను నామతో మన్నుతోను, ఉదకముల తోను చేయు చికిత్స కార్యమాత్ర చికిత్సయే. అనగా, రోగమునకు చికిత్సయే గాని, రోగకారణ మగు పాపమునకు చికిత్స కాదు. వేదములో చెప్పిన మంత్రయుక్త మగు అఘమర్షణ స్నానరూప మగు చికిత్సచే రోగము, (దానికి కారణమగు పాపముతో కూడ) నివృత్తమగును.

## సంకల్పము.

స్నానమునకు పూర్వము తీరమున గూర్చొని, 'పుండరీకాక్ష' యని శిరంబున ఉదకమును ప్రోక్షించుకొని, స్నానమునకు సంకల్పము చేసిన పిదప, చెరువులు మున్నగు

స్థిరజలములలో స్నానము చేసే యెడల నీటిలోని మన్నును గట్టుమీది కృత్యను ఉద్దేశించి ఈ క్రింది శ్లోకమును పఠించి పడవేయవలెను. ప్రవాహయుక్తము లగు నదులలో స్నానము చేయునపుడు గట్టుపై నున్న మన్నును నీటిలో (కృత్యను ఉద్దేశించి) వేయవలెను.

శ్లో॥ "పిప్పలాదా త్సముత్పన్నే కృత్యే లోకభయంకరి ।
మృత్తికాం తే మయా దత్తా మాహారార్థం ప్రకల్పయ ॥" ఇతి।

పిప్పలాదు డను మహర్షి కృత్యను దేవతల వధ కొరకు ఆజ్ఞాపించగా, శివుడు ఆకృత్యను బడబరూపముగ ఉదకములలో నుండు మని ఆజ్ఞాపించెను. ఆకృత్య స్నానమునకు దిగువానిని బాధించును. అందుచే మృత్తికను దానికి ఆహారార్థము ఇచ్చినచో దాని బాధ నివృత్త మగును.

## రాళ్ళను ఉంచుట.

పర్వములలో సముద్ర స్నానము చేయునపుడు కృత్యకు సముద్రములో రాళ్ళను ఉంచవలెను. ఇతర జలములలో మృత్తును వేయవలెను. ఈ కృత్యనుగూర్చిన ఆఖ్యాయిక శివపురాణములో కలదు. దాని నిచ్చట సంక్షేపముగ ఉల్లేఖ చేయడమైనది. శిష్టాచార ప్రమాణము ననుసరించి ఈ మృత్తికాక్షేపము ప్రవృత్తమైనది.

పూర్వము దధీచి యను మహర్షికి సువర్చ యను భార్య యుండెడిది. దేవతలు దధీచిని అతని యెముకల నిమ్మని కోరిరి. వెంటనే అతడు తన భార్యను ఇంటిలోనికి బంపి, తాను ప్రాణములను వీడి, తన యస్థులను దేవతల కిచ్చెను. అనంతరము సువర్చ బయటకు వచ్చి, గతప్రాణు డగు భర్తను చూచి, శోకసంతప్తురాలై, దేవతలను పశువులను కమ్మని శపించి, భర్తతో కూడ సహగమనము చేయుట కుద్యుక్తురాలయ్యెను. అంతట, అశరీరవాణి, నీ గర్భమున శిశువు కలడు గాన, నీవు సహగమనముచేయకు మని పలికినను, ఆమె వెనుదీయక చితినెక్కగా గర్భము నుండి బాలుడు ఈవలపడెను. అతడే పిప్పలాదుడు.

కాలక్రమమున నాతడు పెద్దవాడైన పిమ్మట, తన తండ్రి మరణమునకు దేవతలు కారణమని తెలిసికొని, వారిని జంపు టెట్లని చంద్రుని సంప్రతించెను. చంద్రుడు "గౌతమీ తీరంబున కేగి శివునారాధించి, నుతింపు" మని పిప్పలాదుని గూర్చి బలికెను. పిప్పలాదుడు అట్లు గావించగా, శివుడు ప్రత్యక్షమై, పిప్పలాదుడు కోరుటచే కృత్యను పంపెను. దేవతలను సంహరించి రమ్మని పిప్పలాదుడీకృత్య నాజ్ఞాపించెను. దేవతలందరు గజగజ వణకుచు శివుని యొద్దకు పరుగిడి అతనిని ప్రార్థించిరి. శివుడు కృత్యను బడబరూపముగ గంగలో నుండు మని చెప్పి, పిప్పలాదుని యొద్దకు వచ్చి, "నీ వేల దేవతలను జంపెదవు? వారు

మరణించినను నీ తండ్రి మరలి రాడుకదా, నీ వాయత్నము మాను" మని చెప్పెను. "ఇపు డాకృత్యనాపుట నాశక్యము కాదు. అయినను నా యత్నముచే నాపెదను. నా తల్లిని, తండ్రిని పితృలోకమున జూడ గల్గునట్లు నాకు వరమిమ్ము' అని పిప్పలాదుడు పలికెను. దేవతలందరును కృత్యనే ప్రార్థించిరి. ఆమె, "నేను బడబరూపమున గంగలో నుందు" ననెను. హిరణ్మయ కలశములో నామె నుంచి, గంగ కడకు తీసికొని వెళ్ళిరి. గంగ యొకతెయే యామెను భరింపజాలక యమున, సరస్వతీనదులందు గూడ నామె నుంచెను. వారు ముప్పురును ఆమెను సముద్రమునకు తీసికొనిపోయిరి. అందువలన కృత్యకు మృత్తికాక్షేపము చేయవలెను. పిప్పలాదుని యాశ్రమము లోనికి అనరణ్యుని కుమార్తె పద్మ యను చిన్నది వచ్చెను. ఆమెను పిప్పలాదుడు చూచి, వలచి, ఆమెను పరిణయము చేసికొనెను. (శివపురాణము).

## ప్రకృతము - స్నానప్రకరణము.

ప్రకృతి చికిత్సలో తొట్టెలో నీరు పోసి ఆ నీటిలో బొడ్డువరకు నీరు ఉండునట్లు కూర్చొని, పొత్తి కడుపును గుడ్డతో రాయుదురు. వేదోక్త మగు అఘమర్షణస్నానములో నాభిప్రమాణమగు జలములో ప్రవాహమున కెదురుగ నిలువబడి మంత్రములతో స్నానము చేయుటచే ప్రవాహవేగమునకు పొత్తికడుపుకు (గుడ్డతోరాయుట కంటె అధికముగ) సహజ మగు రాపిడి కలిగి, రోగమునకు కారణమగు పాపముతో కూడ రోగము నివృత్త మగును. ఈ క్రింది మంత్ర జాతముచే అట్టి స్నానము చేయనగును. దీనిలో, ప్రకృతి చికిత్సలోని తొట్టిస్నానము, మృత్తికాస్నానము అంతర్భూతములను విషయము గమనింపదగినది.

## కృత్యకు మృత్తికాప్రక్షేపముచేసిన పిమ్మట.

"శిరసి మృత్తికయా సహ దూర్వాం ధారయితుం
దూర్వాభిమంత్రణ మంత్రానాహ ।" (వి. భా.)

తా॥ శిరస్సునందు మృత్తికతో కూడ దూర్వలను (గరికపోచలను) ధరించి స్నానము చేయవలెను. అందుచే ముందుగ దూర్వలను, మృత్తికను కూడ మంత్రములచే అభిమంత్రణ చేసి, అనంతరము ఆ రెండింటిని మంత్రములచే పాదములు మొదలు శిరస్సు వరకును రాసికొని, పిమ్మట, మంత్రపూర్వకముగ స్నానము చేయవలెను. వాటిలో, ముందుగ దూర్వలను అభిమంత్రించుటకు మూడు మంత్రములు గలవు.

*"సహస్రపరమా దేవీ శతమూలా శతాంకురా । సర్వ*
*గ్ం హరతు మే పాపం దూర్వా దుస్స్వప్న నాశనీ ।"*

*(కృ. య. ఉపనిషత్తునారాయణము. 1. అను)*

తా॥ ఈ దూర్వాభిమాని దేవత నాపాపమునంతను తొలగించుగాక. అనగా, పావనహేతు వగునట్టిదియు, పవిత్రముచేసెడి అనేక వేల ద్రవ్యముల కంటె ఉత్త మమైనదియు (అనగా, విశేషముగ పవిత్రము చేసెడిదియు), ప్రకాశమాన మైనట్టిదియు, శతసంఖ్యాకము లగు మూలములు కలదియు, అనేకము లగు అంకురములు కలదియు, దుష్టస్వప్నముల వలన సంప్రాప్తమయ్యెడి అనిష్టఫలములను నశింప జేయునదియు నగు దూర్వ (తృణవిశేషము) నాసమస్త పాపములను బారద్రోలు గాక.

*"కాండా త్కాండా త్ప్రరోహంతీ పరుషఃపరుషఃపరి ।*
*ఏవానో దూర్వే ప్రతను సహస్రేణ శతేన చ ।"* (2 మం.)

తా॥ దూర్వతి హినస్తి పాప మితి దూర్వా" అనగా పాపము లను నశింపజేయునదియే 'దూర్వ' అనబడును. అట్టి ఓదూర్వా! నీవు ప్రతికాండమునుంచియు, ప్రతి పర్వనుండియు ఉత్పన్న మయ్యెడి దానవు (అనగా, దూర్వకు ప్రతిపర్వకును భూమిసంబంధము వలన వ్రేళ్ళు ప్రసరించును). వ్రేళ్ళు ప్రసరించగానే ఆ పర్వమే మూలమగును. ఆ మూలమునుండియే తిరిగి అంకురోదయ మగును. ఆ అంకురములే తిరిగి దూర్వాలత లగును. ఆ తీగెలనుండియే తిరిగి పర్వ పరంపర బయల్దేరును. ఈ విధముగ ఉత్పద్యమాన మయ్యెడి ఓ లతా విశేషమా! ఈ చెప్పిన రీతిగ నీవంశవృద్ధి ఎట్లున్నదో, అట్లే మావంశమును పౌత్ర, దౌహిత్రాదులచే వృద్ధి యుక్తమైన దానినిగ చేయుము.

*"యా శతనే ప్రతనోషి సహస్రేణ విరోహసి ।*
*తస్యా స్తే దేవీష్టకే విధేమ హావిషా వయం ।"* (3. మం.)

తా॥ అభీష్టము లగు మంత్రములచే స్తుతి చేయబడుచున్న దానవును, ఆకుపచ్చని కాంతిచే దీప్యమాన మగుచున్న దానవును నగు ఓ ఓషధి దేవతా! నీవు నీ వంశమును బహుప్రకారములుగ ఎట్లు విస్తరింప జేయుచుంటివో, సహస్రప్రకారములుగ ఎట్లు ఉత్పన్న మగు చుంటివో, అదే విధముగ మా వంశమును వృద్ధి చేయుము. హవిస్సుచే నిన్ను పరిచర్య చేయుదుము. ఈ విధముగ దూర్వలను అభిమంత్రించి, అనంతరము ఈ దిగువ మంత్రములచే మృత్తును (నాల్గుమంత్రములచే) అభిమంత్రించవలెను.

*"అశ్వక్రాంతే రథక్రాంతే విష్ణుక్రాంతే వసుంధరా ।*
*శిరసా ధారయిష్యామి రక్షస్వ మాం పదే పదే ।"* (కృ.య. నారాయణము.)

తా॥ శుద్ధిహేతువు లగు అశ్వములు తమ పదములచే భూమి యందు పాదవిక్షేపము చేయుచున్నవి. (ఆక్రమణము చేయుచున్నవి) గావున, ఈ భూమి అశ్వక్రాంత యనబడుచున్నది.

శుద్ధిహేతుత్వము: అగ్నిచయన మను క్రతువులో 'ఉఖ' అను నలుపలకల గోలెమువలె నుండు కుండను నిర్మించుటకు మృత్తికను తీసికొనివచ్చుటకు (అధ్వర్యుడు, బ్రహ్మ, యజమానుడు) ఈ ముగ్గురును అశ్వమును, గర్దభమును తీసికొని వెళ్ళెదరు. మృత్ప్రదేశమును పాదాక్రమణముచే పవిత్రముగ చేయుటకు అశ్వమును, ఉఖానిర్మాణము కొరకు త్రవ్విన మన్నును తీసికొనివచ్చుటకు గర్దభమును ఉపయోగించెదరు.

పిమ్మట, ఏ ప్రదేశము నుండి మృత్తి కనుతీసికొనదలచిరో ఆ ప్రదేశమును శుద్ధిచేయుట కొరకు అశ్వము యొక్క పాదములచే మంత్రపూర్వకముగ త్రొక్కించెదరు. దీనివలన అశ్వములు శుద్ధి హేతువు లని ధ్రువపడుచున్నది. అనంతరము అశ్వము త్రొక్కిన మన్నును మంత్రపురస్సరముగ కృష్ణా జినతామరాకులలో కట్టి, గర్దభము యొక్క పృష్ఠభాగముపై నుంచి యాగదేశమునకు తీసికొని వచ్చెదరు.

ఈ విధముగ అశ్వా ౨ క్రమణముచే శుద్ధమైన ఓమృత్తికా! రథసంచారముచే క్షుణ్ణ మగుచు పరిరుద్ధమైనదానా! త్రివిక్రమావతారములో విష్ణువు తన పాదములచే ఆక్రమించుటవలన శుద్ధమైన దానా! (అనగా, అశ్వ, రథ, విష్ణువుల ఆక్రమణముచే పరిశుద్ధమైన ఓ భూమిదేవతా!) ధనములను ధరించెడి (అనగా, రత్నగర్భవైన) నిన్ను ఈ స్నానకర్మయందు ధరించుచుంటిని. ఇట్లు ధరించబడిన నీవు స్నానము కొరకు జలమధ్యయందు వెడలుచుండెడి నన్ను ప్రతిపదమందును రక్షింతువు గాక.

"భూమిర్ధేను ర్ధరణీ లోకధారిణీ । ఉద్ధృతాసి వరా
హేణ కృష్ణేన శతబాహునా ।" (2. మం.)

తా॥ ఓ మృత్తికా! నీవు ప్రళయ కాలమందు సప్తసముద్రములును ఏక సముద్ర మైనపుడు, కృష్ణ వర్ణమైనట్టియు, నూరు బాహువులు గల వారాహావతారముచే ఉద్ధరింప బడితివి. అనగా, నీటిలో మునిగి యున్న నీవు బయటకు (పైకి) తీసికొని రాబడితివి. ఓ మృత్తికా! నీవు భూమిస్వరూపురాల వగుచు కామధేనువు వలె సంతోషపరచు దానవు; సమస్త సస్యములను, సర్వప్రాణులను ధరించుదానవు. ఇట్టి నీవు వరాహముచే ఉద్ధరింపబడితి వని తాత్పర్యము.

## వరాహరూపముచే భూమ్యుద్ధరణము.

'ఆపోవా ఇద మగ్రే సలిల మాసీ త్తస్మి న్ప్రజాపతి
రాయవు ర్భూత్వా౨చర త్స ఇమామ పశ్యత్తాం వరాహో
భూత్వా హారత్తాం విశ్వకర్మా భూత్వా వ్యమార్ట్ త్సా
ప్రథత సా పృథి వ్యభవ త్త త్పృథివ్యై పృథివీత్వం ।' (కృ.య.సం. 7-1-7)

తా॥ అవాంతర ప్రళయములో ఇప్పుడు మనచే చూడబడెడి గిరి, నదీ, సముద్రాది రూప మగు సమస్త జగత్తును పృథివి యొక్క ఉత్పత్తికి పూర్వము ఉదకముగానే యుండును. అప్పుడు ప్రజాపతి మూర్తరూప మగు శరీరము ఉండుటకు స్థానము లేకపోవుటచే వాయురూపుడై ఆ ఉదకమునందు అంతటను సంచరించెను. అనంతరము ఉదకమందు మునిగియున్న భూమిని చూచి, తాను వరాహరూపమును దాల్చి, దంష్ట్రాగ్రముచే ఆ భూమిని పైకి తీసికొనివచ్చెను.

పిమ్మట వరాహరూపమును విడచి, విశ్వకర్మరూపుడై ఆ భూమిని విశేషముగ మార్జనము చేసెను (తుడిచెను). దానిచే ఆ భూమి విస్తృత మాయెను. (ప్రథవిస్తారే ప్రథనాత్ పృథివీ). అందుచే 'పృథివీ' అను పేరు వచ్చెను. ఈ విధముగ వరాహరూపముచే ఉద్ధరింపబడిన భూమిని తన పాపమును నశింపజేయు మని పై మంత్రముచే ప్రార్థించు చుండెను.

## మృత్తికాభిమంత్రణము.

*"మృత్తికే హన మే పాపం య న్మయా దుష్కృతం*
*కృతం । మృత్తికే బ్రహ్మదత్తాసి కాశ్యపేనాభిమం*
*త్రితా । మృత్తికే దేహి మేపుష్టిం త్వయి సర్వం ప్రతిష్ఠితం ।"   (3. మం.)*

తా॥ ఓ మృత్తికా! నేను చేయకూడని యే పాపమును చేసియుంటినో దానిని నశింప జేయుము. ఓ మృత్తికా! నీవు పరమాత్మచే భూమిరూపముగ స్థాపన చేయబడితివి, కాశ్యపుని చేతను, తదుపలక్షితులగు మహర్షుల చేతను స్నానాది కాలమందు అభిమంత్రణ చేయబడి, వారి దుష్కృతములను నశింపజేసితివి. (కావున, ఈ అభిమంత్రణము శిష్టా___చార ప్రాప్తము గాన, మేము కూడ అభిమంత్రణము చేయు చుంటి మని భావము). ఓ మృత్తికా! ఏ కారణమున పృథివీరూపమగు నీ యందు నాలుగు విధములగు ప్రాణిజాత మంతయు ప్రతిష్ఠితమై ఉన్నదో, అట్టి నీవు నాకు పుష్టిని ఇమ్ము. (నాలుగు విధముల వివరములు: 1. జరాయుజములు, (మావివలన పుట్టునవి;) మనుష్యులు, పశువులు మున్నగునవి. 2. అండజములు, (గ్రుడ్డువలన పుట్టునవి:) పాములు, పక్షులు మున్నగునవి. 3. స్వేదజములు, (చమటవలన పుట్టునవి) నల్లులు, పేలు మున్నగునవి. 4. ఉద్భిజ్జములు, (భూమిని బ్రద్దలు చేసుకొని పుట్టునవి;) చెట్లు, లతలు మున్నగునవి.

*"మృత్తికే ప్రతిష్ఠితే సర్వం త న్మే నిర్ణుద మృత్తికే ।*
*తయా హతేన పాపేన గచ్ఛామి పరమాం గతిం ।" (4 మం.)*

తా॥ (ప్రతితిష్ఠంతి ప్రాణినో౽స్యా మితి ప్రతిష్ఠితా). సర్వ ప్రాణుల యొక్క ఉనికికి ఆధారమగు ఓ మృత్తికా! నీవు నా సంబంధమగు సర్వపాపమును నశింపజేయుము. ఓ మృత్తికా! సుప్రసిద్ధ మగు నీచేత నా పాపము నశింపజేయబడినదగుచునుండగా, నేను ఉత్తమ గతిని పొందుచున్నాను.

ఈ విధముగ దూర్వను, మృత్తికను కుడిహస్తమందుంచి అభిమంత్రణము చేసి (నదిలో దిగుచుండుటచే) రెండు మంత్రములచే ఇంద్రుని వలన గూడ అభయమును కోరుచుండెను.

*"యత ఇంద్ర భయామహే తతో నో అభయం*
*కృధి మఘవన్ ఛగ్ధి తవ తన్న ఊతయే విద్విషో వి*
*మృథో జహి ।"* *(1. మం.)*

తా॥ ఓ ఇంద్రుడా! స్నానమునకు ఉద్యుక్తులమగు మేము యే పాపము, నరకము, శత్రువులు వీనివలన భయపడుచుంటిమో ఆపాపాదుల వలన మాకు అభయమును చేయుము. అనగా, నీ అనుగ్రహము వలన మేము పాపరహితులము, శత్రురహితులము, నరకబాధ లేనివారము అగుదుము గాక యని తాత్పర్యము.

ఓ ఇంద్రా! కేవలము పాపాదుల నుండి అభయప్రదానమే గాక, వాటిని నశింపజేయుము. నీ భక్తుల మగుటచే నీ సంబందుల మగు మా యొక్క రక్షణ కొరకు మా శత్రువులను, బాధించెడి యోద్ధలను సంహరించుము.

*స్వస్తిదా విశస్పతి ర్వృత్రహా విమృధో వశీ ।*
*వృషేంద్రః పుర ఏతు న స్స్వస్తిదా అభయంకరః । (2. మం.)*

తా॥ ఇంద్రుడు స్నానము కొరకు ఉద్యుక్తుల మగు మాకు పురోభాగమందు వెడలు గాక. ఇహలోకసుఖముల నిచ్చువాడును, భక్తులగు ప్రజలను రక్షించువాడును, శత్రువులను సంహరించువాడును, హింసించెడి యోధులను జయించువాడును, స్వాధీనము చేసికొనబడిన రక్షస్సంఘము కలవాడును, పుష్కలా౽౽వర్తకమేఘముల ద్వారా వర్షించువాడును, పరలోకసుఖము నొసంగువాడును, అభయమును చేయువాడును అగు ఇంద్రుడు మాకు పురోభాగమున రక్షించుచు నడచు గాక.

ఈ క్రింది మంత్రముచే నదిలోని మొసళ్ళు మొదలగు వాటి బాధ లేకుండుటకు ఇంద్రాది దేవతల నుండి స్వస్తిపోషము యాచించ బడుచున్నది.

"స్వస్తిన ఇంద్రో వృద్ధశ్రవా స్స్వస్తి నః పూషా
విశ్వ వేదాః । స్వస్తి న స్తార్క్ష్యో అరిష్టనేమి స్స్వస్తి నో
బృహస్పతి ర్దధాతు ।" (మం.)

తా॥ గొప్ప కీర్తి గల ఇంద్రుడు లేక పురాణాదులయందు మహాత్ములచే శ్రూయమాణు డగు ఇంద్రుడు మాకు క్షేమమును సంపాదించుగాక. బహుధనములుగాని, బహుజ్ఞానముగాని కల పూష దేవతయు మాకు క్షేమమును చేయుగాక. సర్వాదికృత మగు హింస లేకుండుటకు రథచక్రమునకు నేమివంటివాడగు (అనగా, హింసలు లేకుండ చేయువాడగు) తార్క్ష్యుడు క్షేమమును చేయుగాక. బృహస్పతి కూడ బ్రహ్మవర్చసమును పాలించి రక్షించుగాక. ఈ దిగువ మంత్రముచే సోమేంద్రులు ప్రార్థించబడుచుండిరి.

"అపాతమన్యు స్తృపలప్రభ ర్మా ధుని శ్శిమీ
వాన్ ఛరుమాగ్ం ఋజీషీ । సోమో విశ్వా న్యతసా
వవాని న్యా__ర్వా గింద్రం ప్రతి మానాని దేభుః ।" (మం.)

తా॥ ఈ మంత్రములో మూడు పాదములచే సోముని, నాల్గవ పాదముచే ఇంద్రుని ప్రార్థించుచున్నాడు. సోముడు సమస్త ఓషధులను వనస్పతులను రక్షించుచున్నాడు. అపాతక్రోధము కల వాడును, (భక్తులను అనుగ్రహించుటకై పైకి క్రోధ మున్నట్లుగ నటించువాడే కాని, మనస్సునందు క్రోధము లేనివాడును) సర్వవిధ ముల వినష్టమైన క్రోధము కలవాడును, చంద్రకాంతమణులవంటి కాంతిగలవాడును (తృపలప్రభః) వసంత ఋతుసంబంధమైనవాడును (మాధునిః) ఆ ఋతువులో మేఘాదులు లేకపోవుటచే ప్రకాశించు వాడును, (లేక, మధుప్రియుడును, అథవా యజ్ఞములో ప్రాతస్సవనము, మాధ్యందినసవనము, తృతీయసవనము అను మూడు సవనము లందు ఉపలపములయొక్క (రాళ్ళ యొక్క) ప్రహారము కలవాడును (అనగా, సోమరసమును సోమలతను మూడు సవనములందు తీయుటకు రాళ్ళతో దంపెదరు. అందుచే లతాత్మకు డగు సోమునితో అభేదముగ వర్ణనము) కంపమానుడును (ధునిః) శమీవృక్షప్రియుడును (శమివాన్ అనగా బిల్వపత్రివలెనే శమీపత్రికూడ ఈశ్వరునకు పూజచేసెదరు గావున, ఈశ్వర శిరస్సునందు చంద్రుడును, జమ్మియు, ఇద్దరును ఒకే స్థలమందుండుటచే శమీప్రియు డని తాత్పర్యము), బహుసౌఖ్యము కలవాడును, అతిదీప్తి కలవాడును అగు సోముడు ఆకాశమందు తన గమనముచే సమస్త ఓషధులను రక్షించుచుండెను.

## ఇంద్ర ప్రార్థన.

నికృష్టము లగు ఉపమానములు ఇంద్రుని హింసించుట లేదు. గొప్పవాండ్రకు తక్కువ వాండ్రతో గాని, సమానులతోగాని ఉపమానము బాధను కలిగించును. అందుచే అట్టి ఉపమానులు లేనివాడు ఇంద్రుడు. స్తుతిచే రక్షణకొరకు ప్రార్థన చేయబడుచున్నాడు. అందుచే నిరుపమానుడగు ఇంద్రుడు మమ్ములను రక్షించుగాక యని భావము.

ఈ క్రింది మంత్రముచే పరమాత్మను ప్రార్థన చేయుచున్నాడు.

"బ్రహ్మ జజ్ఞానం ప్రథమం పురస్తా ద్విసీ మత
స్సురు చోవేన ఆవః । సబుధ్నియా ఉపమా అస్య విష్ఠా
స్సతశ్చ యోని మసతశ్చ వివః ।" (మం.)

తా॥ సర్వదేవాదిభూతుడును, తూర్పుదిక్కున సూర్యరూపుడుగ ఉత్పన్ను డగువాడును నగు బ్రహ్మ ముల్లోకములను తన తేజస్సుచే అమృతములుగ చేసెను. మరియు (ఉపసమీపే మాంతి తిష్ఠంతి భూ తానీతి ఉపమాః సావకాశా ఇత్యర్థః) సావకాశములై వివిధముగ నున్న దిక్కులను, విద్యమానమగు ఘట, పటాదికారణమును, అమూర్తమగు వాయ్వాదికారణమును విశేషముగ ప్రకాశింపజేసెను.

ఇట్లు బ్రహ్మను ప్రార్థించి, తిరిగి రెండు మంత్రములచే పూర్వము గ్రహించిన మృత్తికాశుద్ధి కొరకు పృథివి ప్రార్థించబడుచున్నది.

## పృథివీ ప్రార్థనా మంత్రములు.

"స్యోనా పృథివీ భవా నృక్షరా నివేశనీ । యచ్ఛాన
శ్శర్మ సప్రథాః ।" (1 మం.)

తా॥ ఓ పృథివీ జరాయుజాదిభేదముచే నాలుగు విధము లగు ప్రాణిజాతమును ఉత్పాదన చేసి ఆభూతజాతమును ధరించునట్టియు, మలమూత్రగండూషనిష్ఠీవనాదులను సహించుచున్న కీర్తి గలిగి నట్టియు, దుఃఖములను నశింపజేయు నీవు మాకు ఐహికా- మూష్మిక సుఖముల నిమ్ము.

"గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీం ।
ఈశ్వరీగ్ం సర్వభూతానాం తా మిహోవహ్వయే శ్రియం ।" (2. మం.)

తా॥ పూర్వోక్తవిధముగ నాచే స్తుతి చేయబడిన భూదేవతను ఈ స్నానకర్మయందు నా సమీపమునకు ఆహ్వానముచేయుచుంటిని. భూ దేవతకు విశేషణములు: గంధము

పృథివీగుణముగాన (ఇయం పృథివీ గంధవత్త్వాత్), గంధరూపగుణముచే పృథివిగా తెలిసికొనుటకు వీలయినదియు, ఖననసాధనాదులచే కంపింపచేయుటకు శక్యము కాని దియు, నిత్యము అనేక విధములగు సస్యములచేతను, నగరగ్రామాదుల చేతను గిరి, నదీ, సముద్రద్వీపాదుల చేతను పుష్టియుక్తమైనదియు, వ్యవసాయకులచే విత్తనములు జల్లు నిమిత్తమై దున్నబడుచున్నదియు (లేక గవాదిపశుయుక్తమైనదియు), సర్వభూతములకు ఈశ్వరియునగు భూదేవతను ఆహ్వానము చేయుచుంటిని.

ఈ మంత్రములచే అభిమంత్రణ చేయబడిన మృత్తికను (మన్నును) ఆపాదమస్తకము (అనగా, నఖ, శిఖా పర్యంతము) లేపనము చేసికొని జలములో ప్రవేశించుటకు ప్రార్థనా మంత్రములను శ్రుతి చెప్పుచున్నది.

## జలప్రార్థనామంత్రములు.

*"శ్రీ ర్మే భజతు । అలక్ష్మీ ర్మే నశ్యతు । విష్ణు ముఖా*
*వై దేవా శ్ఛందోభి రిమా౯ లోకా ననపజయ్య మభ్య*
*జయన్ । మహాగ్ం ఇంద్రో వజ్ర బాహు ష్షోడశీ శర్మ*
*యచ్ఛతు ।"* (తై. ఉ. నారా. 1. మం.)

తా॥ గజాద్యైశ్వర్య సంపత్తి నన్ను పొందుగాక. అలక్ష్మి (దరిద్రదేవత) దూరముగ పోవుగాక. అనగా, మా వంశస్థులను, మా బంధువులను, మా గ్రామమును, మా రాష్ట్రమును విడచి దూరముగా పోవుగాక. విష్ణువు మున్నగు దేవతలు ఛందోయుక్తమంత్రములచే ఈ లోకములను (రక్షస్సులు మొదలగువారిచే జయించుటకు శక్యము కాకుండునట్లు) జయించిరి. అట్టి దేవతలు మాకు అభీష్టప్రదులు అగుదురు గాక. వజ్రాయుధ ధారియు, షోడశసంఖ్యాపూరక మగు స్తుతశస్త్రములు గలిగినవాడును నగు మహేంద్రుడు మాకు సుఖమును ఇచ్చుగాక.

*"స్వస్తినో మఘవా కరోతు హంతు పాప్మానం యో*
*ఽ__స్మాన్ ద్వేష్టి ।"* (2. మం.)

తా॥ ఇంద్రుడు మాకు సుఖమును చేయుగాక. మమ్ములను ద్వేషించు శత్రువులను హింసించుగాక.

*'సోమానగ్గ్ స్వరణం కృణుహి బ్రహ్మణస్పతే కక్షీ*
*వంతం య ఔశిజం । శరీరం యజ్ఞశమలం కుసీదం*
*తస్మిన్ త్సీదతు యో౽__స్మాన్ ద్వేష్టి ॥" (3. మం.)*

తా॥ శాఖోపశాఖా సహితము లగు వేదములకు పరిపాలకుడ వగు ఓ పరమాత్మా! నీవు నన్ను సోమలతను అభిషవము చేయువానిని గను, సర్వశాఖలందును ఉదాత్తాది స్వరములకు నేతనుగను చేయుము. నీ అనుగ్రహమువలన స్వరాదియుక్తముగ వేదములను అధ్యయనము చేసి సోమాదియాగములను చేయగలను. లేక, సోమయాగములకు ప్రేరకునిగ చేయుము. 'ఉశిక్' అను స్త్రీ యొక్క సంతాన మగు కక్షీవంతుడను పేరుగల మహర్షి నా శరీరమును యజ్ఞశ్రమను సహించుదానినిగ చేయుగాక! (కక్షీవంత మితి విభక్తి వ్యత్యయః)

అథవా, ప్రవృద్ధమైన కర్మకు ప్రభువగు ఓ అగ్నీ! ఏ నీవు 'ఉశిక్' అను ఋషికి పుత్రుడగు కక్షీవాన్ అను ఋషిని కర్మప్రవర్తకునిగ చేసితివో, అట్టి నీవు నన్ను సోమయాగములకు ఉపదేష్టనుగ చేయుము.

'కుసీదము' అనగా నరకము (కుత్సితం యథా తథా సీదంతి పాపినః అస్మి న్నితి వ్యుత్పత్తిః) నన్ను ద్వేషించు శత్రువు నరక మందు చిరకాలముండుగాక! లేక, మమ్ములను ద్వేషించు పురుషుని యందు యజ్ఞానుష్ఠానరహితమైన ధనవృద్ధ్యార్జనము (వడ్డీవ్యాపారము) చే జీవన ముండుగాక! అనగా, మాకు శత్రువగు పురుషుడు యజ్ఞానుష్ఠానము నందు విముఖుడై కేవలము కుసీదవృత్తిచే (వడ్డీవ్యాపారముచే) ఏదో ఒక విధముగ ఉండుగాక!

జానుదఘ్నప్రమాణ మగు (మోకాలులోతుగల) నీటియందు ప్రవేశించి జపము చేయదగిన రెండు మంత్రములను శ్రుతి చెప్పుచున్నది.

'చరణం పవిత్రం వితతం పురాణం యేన పూత
స్తరతి దుష్కృతాని । తేన పవిత్రేణ శుద్ధేన పూతా అతి
పాప్మాన మరాతిం తరేమ । (ఉ.మం.)

తా॥ విష్ణువు యొక్క చరణము పవిత్రమైనది. విస్తీర్ణమైనది. ప్రాచీనమైనది. విష్ణువు పురాణపురుషు డగుటచే తదవయవములు గూడ ప్రాచీనమైనవి. ఏ చరణముచే మానవుడు పవిత్రమైన అంతః కరణ గలవాడగుచు సమస్త దుష్కృత్యములను దాటునో, అట్టి పవిత్రము, శుద్ధము అగు చరణముచే మేము పవిత్రుల మగుచు శత్రు సమానమగు పాపమును అతిక్రమింతుము గాక!

"సజోషా ఇంద్ర సగణోమ రుద్భి స్సోమం పిబ
వృత్రహాన్ ఛూరవిద్వాన్ । జహి శత్రూగ్ం రపమృధో
నుద స్వాథా__భయం కృణు హ విశ్వతో నః ।" (2. మం.)

తా॥ శూరుడవును, వృత్రాసురఘాతివియును అగు ఓ ఇంద్రా! ప్రీతిసహితుడవును, మరుద్గణములతో యుక్తుడవును నగు నీవు యజమానభక్తిని తెలిసికొన్న వాడ వగుచు సోమపానమును చేయుము. మమ్ములను మారణము చేయ నుద్యుక్తులగు శత్రువులను హింసించుము. ఇతరులగు శత్రువులను నిరాకరించుము. అనంతరము మాకు సర్వప్రకారముల చేతను భయరాహిత్యము చేయుము.

అవతరణిక: నాభిప్రమాణ మగు నీటియందు ఉండి జపము చేయదగిన మంత్రములు.

*"సుమిత్రా న ఆప ఓషధయ స్సంతు దుర్మిత్రా*
*స్త స్మై భూయాసు ర్యో౽స్మాన్ ద్వేష్టి యం చ*
*వయం ద్విష్మః ।"* (ఉ.మం. 1)

తా॥ ఉదక దేవతలను, ఓషధిదేవతలును మాకు సుఖమును చేయుదురు గాక. మే మెవనిని ద్వేషింతుమో, ఎవ్వడు మమ్ములను ద్వేషించునో, అట్టి ద్వివిధమైన శత్రువులకును దుఃఖమును చేయుదురు గాక.

*అపోహిష్ఠామయో భువ స్తాన ఊర్జే దధాతన । మహే*
*రణాయ చక్షసే ।"* (2. మం.)

తా॥ ఓ అబ్దేవతలారా! మీరు సర్వప్రాణులకు సుఖమును చేయువారు గాన, మీ సంబంధమగు రసానుభవము కొరకు మమ్ములను స్థాపన చేయుడు. పూజ్యమైనట్టియు, రమణీయ మగునట్టి పరమాత్మ దర్శనము కొరకు మమ్ములను పోషించుడు. అనగా, స్నాన పానాదులచే మమ్ములను పరిశుద్ధులను గావించి, పరతత్వసాక్షాత్కార మునకు యోగ్యులనుగ చేయుడు.

*"యో వ శ్శివతమో రస స్తస్య భాజయతే హనః ।*
*ఉశతీ రివ మాతరః ।"* (3. మం.)

తా॥ లోకములో తల్లులు అస్థాయుక్తలగుచు (సంతానమందు ప్రీతిగలవారగుచు) స్వకీయస్తన్యరసమును పిల్లలకు ఎట్లు ఇత్తురో, అట్లే ఓ అబ్దేవతలారా! మీ శాంతమగు రసమును మమ్ములను పొందించుడు.

*"తస్మా అరం గమామ వో యస్య క్షయాయ జిన్వ*
*థ । అపో జనయథా చ నః ।"* (4. మం.)

తా ॥ ఓ అబ్దేవతలారా! ఏ రసముయొక్క నివాసముచే (అనగా, ఏ రసము మీయం దుండుటచే) మీరు ప్రీతియుక్తు లగుచున్నారో, అట్టి రసప్రాప్తి కొరకు మిమ్ములను

అత్యంతము శరణు పొందు చుంటిమి. ఓ ఉదక దేవతలారా! మమ్ములను ప్రజోత్పాదన సమర్థులనుగ చేయుడు.

అవతరణిక: ఈ మంత్రములను నాభిప్రమాణజలమందు జపించి, అచ్చటనే యుండి, అనంతరము జలాధిష్ఠానదేవత యగు వరుణుని రెండు మంత్రములచే ప్రార్థించుచున్నాడు.

"హిరణ్యశృంగం వరుణం ప్రపద్యే తీర్థం మే దేహి
యాచితః । య న్మయా భుక్త మసాధూనాం పాపే
భ్యశ్చ ప్రతిగ్రహః । య న్మే మనసా వాచా కర్మణా వా
దుష్కృతం కృతం । త న్న ఇంద్రో వరుణో బృహస్పతి
స్సవితా చ పునంతు పునః పునః ।" (1. మం.)

తా॥ సువర్ణమయ మగు శృంగమువలె ఊర్ధ్వభాగమందు (శిరస్సునందు) కిరీటము గల జలాధిపతి యగు వరుణుని అనుగ్రహము కొరకు శరణు పొందుచుంటిని. అట్టి నీవు నాచే ప్రార్థించబడిన వాడ వగుచు స్నానము కొరకు తీర్థమును (అవతరణ ప్రదేశమును, అనగా రేవును) ఇమ్ము.

మరియు, పాపుల ద్రవ్యభోజనముచేతను, పాపుల వలన ధనాదిప్రతిగ్రహము వలనను ఏ పాపము సంభవించెనో, ఇంకను మనస్సుచేతను, వాక్కుచేతను, శరీరముచేతను ఏ పాపమును చేసితినో, ఆ పాప జాతమును ఇంద్ర, వరుణ, బృహస్పతి, సవితలు మున్నగు దేవతలు మాటి మాటికి నశింపజేసి నన్ను పవిత్రుని చేయుదురు గాక!

ఇట్లు జలాధిపతి యగు వరుణుని ప్రార్థించి జలమందలి అగ్న్యాదిదేవతలకు నమస్కార మంత్రము చెప్పబడుచున్నది.

"నమో౽గ్నయే౽ప్సుమతే నమ ఇంద్రాయ, నమో
వరుణాయ, నమో వారుణ్యై నమో౽ద్భ్యః ।" (మం.)

('ఆప్' శబ్దముకంటె సప్తమికి, "అపోయోనియ న్మతుప్" అను వ్యాకరణ సూత్రముచే అలుక్. అందుచే 'అప్సుమతే' అను రూపము సిద్ధించును). ఉదకములందు నిగూఢముగ నున్న అగ్నికి, ఇంద్రునకు, వరుణునకు, వరుణపత్నికి, అబ్దేవతలకు నమస్కారము.

## నిమజ్జనప్రదేశమందు (మునుగుచోట). దుష్టజలమును పోగొట్టు మంత్రము.

'య దపాం క్రూరం య దమేధ్యం య దశాంతం త దపగచ్ఛతాత్ । (మం.)

తా॥ ఉదకసంబంధ మగు ("క్రూరం" మరణకారణ మగు ఆవర్తాదికము (సుడిగుండము మొదలగునవి), కాంక్షించి ఉమ్మివేయుట (నిష్ఠీవనాదికము) మున్నగువాటిచే దుష్టమగు స్వరూపము (అమేధ్యము) వాత, శ్లేష్మాదిజనక మగు స్వరూపము (అశాంతము), ఈ విధముగ క్రూరము, అమేధ్యము, అశాంతము నగు నీ స్వరూపములు ఈ నిమజ్జన ప్రదేశము నుండి పోవుగాక.

ఇట్లు మునిగే ప్రదేశమునందు దోషములు పోవుటకు మంత్రమును జెప్పి, మునుగుటకు మంత్రమును చెప్పుచున్నాడు.

*'అత్యాశనా దతీపానా ద్య చ్చ ఉగ్రా త్ప్రతిగ్రహాత్ ।*
*త న్నో వరుణో రాజా పాణినా హ్యవమర్శతు । సోహ*
*మపాపో నిరజో నిర్ముక్తో ముక్త కిల్బిషః । నా కస్య*
*పృష్ఠ మారుహ్య గచ్ఛే ద్బ్రహ్మసలోకతామ్ ।'* (1 మం.)

తా॥ దేవ, పిత్రి, మనుష్య యజ్ఞములను చేయకుండ (అనగా, వైశ్వదేవములో ఇవి అంతర్భూతము లగుటచే వైశ్య దేవము చేయ కుండ) చేయు భోజనము (అత్యాశనము), అట్లే దేవ, ఋషి, పితృ తర్పణము చేయకుండ చేయు ఉదకపానము (అతీపానము), వేద శాస్త్రములను ఉల్లంఘన చేసి స్వేచ్ఛగా సంచరించెడి పురుషునివలన ధనాదిప్రతిగ్రహము (ఉగ్రప్రతిగ్రహము) లవలన (అనగా, ఈ అత్యాశనమువలనను, అతాపానమువలనను, ఉగ్రప్రతిగ్రహమువలనను) సంభవించెడి పాపమును జలస్వామి యగు వరుణ దేవుడు తన హస్తముచే అపనయనము చేయుగాక (తీసివేయుగాక).

ఈ విధముగ పాపరహితుడ నైన నేను రజోగుణ రహితుడనగుచు సంసారకారణ మగు రాగద్వేషాది దోషమునుండి నిర్ముక్తుడ నైతిని, అందుచే అత్యాశనాదిపాపరహితుడనై స్వర్గముయొక్క ఉపరి భాగమును పొంది హిరణ్యగర్భుని లోకమును పొందుదును గాక.

*'య శ్చాప్సు వరుణ స్స పునా త్వఘ మర్షణః ।'* 2. మం.

తా॥ అఘమర్షణుడు, అనగా మహాపాతకములను నశింప జేయునట్టి నదీ, సముద్రాది సర్వజలాధిష్ఠాత యగు వరుణుడు నన్ను పవిత్రుని చేయుగాక.

## గంగాయమునాదిసర్వతీర్థముల ఆవాహనము.

*"ఇమం మే గంగే యమునే సరస్వతి శుతుద్రిస్తో*
*మగ్ం సచతాపరుష్ణియా । అసిక్నియా మరుద్వృధే*
*విత స్త యా ర్జీకీ యే శృణుహ్యాసుషో మయా ।"* (మం.)

ఈ మంత్రములోని నదులకు బొంబాయిపత్రిక (Bhavan's Journal) లో వ్రాసిన నామాంతరములు ఆంగ్లభాషాద్యేత లగు ఆధునికులకు తెలియుటకై ఈ క్రింద వ్రాయబడుచున్నవి. గంగా, యమునా, సరస్వతీ నదులు సుప్రసిద్ధములు. శుతుద్రి, లేక శతద్రు అనగా, పంజాబ్‌లోని సట్లేజినది. పరుష్ణీ లేక ఐరావతి యనునది రావినది. అసిక్నీ లేక చంద్రభాగా అనునది చేనాబునది. మరుద్వృధా అనునది కాశ్మీరులోనిది. వితస్తా అనునది ఝీలంనది. ఆర్జీకీయా అనునది ఇండసునది యొక్క ఉత్తరభాగములోనిదని కొందరి ఆశయము. విపాసా లేక ఉరుంజిరా అనునది బియాస్‌నది. ఆర్జీకీయా అనునది విపాసా (లేక బియాస్) అని కూడా నొక వ్యవహారము గలదు.

తా॥ గంగా, యమునా, సరస్వతీ, శతుద్రీ, పరుష్ణీ, అసిక్నీ, మరుద్వృధా, వితస్తా, ఆర్జీకీయా, సుషోమ అను మహానదులను సంభోదించి, "ఓ నదీవిశేషములారా! నాచే మనఃపూర్వకముగ పఠించ బడియెడి మంత్రసంఘమును వినుడు. విని, మీరు మీ స్థానముల నుండి నా స్నానదేశమునకు వత్తురుగాక.

"ఓ నదీవిశేషములారా! నేను ప్రత్యేకముగ తమ తమ వద్దకు వచ్చి స్నానము చేయుటకు శక్తుడను గాను. కావున, ఈ మంత్ర ప్రార్థనచే తామందరు నిచ్చటకు విచ్చేసి, నా పాపములను బారద్రోలి, నన్ను కృతార్థుని చేయుడు" అని ప్రార్థన చేయబడుచున్నది.

లోకములో దూరదేశమున నున్న ఉత్తమవర్గీయులను ఉత్తరములు టిల్లి గ్రాములు మొదలగువాటి ద్వారా ఆహ్వానించినట్లే, మంత్రములచే ఆహ్వానించినచో ఆ ఆహ్వానమును విని ఆ దేవతలు వత్తురనుటలో తగిన ఉపపత్తులు, మంత్రములు లోగడ వ్రాయడమైనది.

జలమందు మునిగిన పిమ్మట ప్రాణాయామము కొరకు అఘమర్షణసూక్తము ఈ క్రింద వివరించబడుచున్నది.

*"ఋతం చ సత్యం చాభీద్ధా త్తపసో ధ్యజాయత ।*
*తతో రాత్రి రజాయత తత స్సముద్రో అర్ణవః । సము*
*ద్రా దర్ణవా దధిసంవత్సరో అజాయత । అహోరాత్రాణి*
*విదధ ద్విశ్వస్య మిషతో వశీ । సూర్యాచంద్రమసౌ*
*ధాతాయథా పూర్వ మకల్పయత్ । దివం చ పృథివీం*
*చాంతరిక్ష మథో సువః ।"* (మం.)

తా॥ అంతటను ప్రకాశమాను డగు పరమేశ్వరుని వలన (సృజించదగిన పదార్థముల యొక్కపర్యాలోచనరూప మగు తపస్సు యొక్క అనంతరము మానసిక యథార్థ సంకల్పరూప మగు) ఋతము, (వాచిక యథార్థ భాషణరూపమగు) సత్యము ఉత్పన్నము లైనవి. ఋత,

సత్యముల ఉత్పత్త్యనంతరము అహోరాత్రములు, సప్తసముద్రములు, సంవత్సరోపలక్షితము లగు కాలవిశేషములు ఉత్పన్నమైనవి. ఈ విధముగ ఉత్పాదకు డగు పరమేశ్వరుడు సంవత్సరోపలక్షితము లగు కాలవిశేషములను సృజించుచు, నిమేష యుక్త మగు సర్వప్రాణిజాతముకు స్వామియై వర్తించుచుండెను. మరియు, సూర్య చంద్రాదిదేవతలు, పృథివ్యాదిలోకములను యథాపూర్వముగ సృజించెను. అనగా, పూర్వసృష్టియందు ఎవనికి యెటు వంటి రూపాదులు గలవో అట్టివానిని సంకల్పమాత్రముచే సృజించెను. ('దివం' అనగా, స్వర్గము, 'సువః' అనగా, భోగవిశేషము). పై మంత్రములచే అఘమర్షణమును జపించిన పిమ్మట స్నానార్థము మూడు ఋక్కులు చెప్పబడుచున్నవి.

*'య త్పృథివ్యాగ్ం రజ స్స్వ మాంతరిక్షే విరో*
*దసీ । ఇమాగ్ స్త దాపో వరుణః పునా త్వఘమర్షణః ।*
*పునంతు వసవః పునాతు వరుణః పునా త్వఘమర్షణః ।*
*ఏషభూతస్యమధ్యే భువనస్య గోప్తా । ఏషపుణ్యకృతాం*
*లోకా నేషమృత్యోర్ హిరణ్మయం । ద్యావాపృథివ్యో*
*ర్హిరణ్మయగ్ం సగ్ంశ్రితగ్ం సువః । స న స్సువ*
*స్సగ్ం శిశాధి ।'* (ఉ. నారాయణం)

తా॥ 'రోదసీ' అను పదముచే ద్యావాపృథివులు చెప్పబడుచున్నవి. గాన, పృథివీశబ్దముచే అధోలోకములగు పాతాళాదులు చెప్పబడుచున్నవి. పృథివీ, అంతరిక్ష, స్వర్గ పాతాళాదిలోకములందు తత్తజ్జన్మలను అనుభవించుచున్న మేము ఏ పాపము చేసితిమో, ఆ పాపమును బోగొట్టి, జలస్వామి యగు వరుణడు (అఘమర్షణుడైన వరుణుడు) మమ్ములను శుద్ధులనుగ చేయుగాక! ఈ వరుణుడు అతీతమైన జగత్తునకును, రాబోయెడి జగత్తునకును రక్షకుడు. ఇంతేగాక, ఈ వరుణుడు పుణ్యకర్మలను చేసిన వారలకు ఉత్తమలోకములను ఇచ్చుచున్నాడు. పాపాత్ములకు సర్వప్రాణిమారకు డగు యముని సంబంధమైన హిరణ్మయ మను లోకవిశేషమును ఇచ్చుచున్నాడు. మరియు, ద్యావాపృథివులయందు ఆశ్రితమై యున్న బ్రహ్మాండరూపమైన స్వర్గలోకమును (ఓ వరుణదేవా!) మాకు ఇమ్ము. "ద్యావాపృథివ్యో ర్హిరణ్మయగ్ం సగ్ంశ్రితం సువః ।" అను పదజాతమును వరుణదేవునకు విశేషణముగ భట్టభాస్కరుడు ఈ క్రింది విధముగ వ్రాసెను. "ఓదేవా! ద్యులోక భూలోకములను ఆశ్రయించినట్టియు, హిత, రమణీయ, సుఖస్వరూపుడవగు నీవు మమ్ములను పాప రహితులను చేయుము".

# స్నానానంతరము ఆచమనమంత్రములు.

"ఆర్ద్రం జ్వలతి జ్యోతి రహ మస్మి । జ్యోతి ర్జ్వలతి
బ్రహ్మాహ మస్మి । యోహ మస్మిబ్రహ్మాహ మస్మి । అహ
మస్మి బ్రహ్మాహ మస్మి । అహ మేవాహం మాం. జుహో
మి స్వాహా ।"

(తై. ఉ. నారాయణం. 5 పన్నం. 1. అను.)

తా॥ ఆర్ద్రం జ్వలతి: ఉదకస్వరూపము స్వాధిష్ఠానచైతన్యముచే ప్రకాశించుచున్నది. భ్రాంతి స్థలములలో కల్పితమైన వస్తువునకు అధిష్ఠానమే స్వరూపము. ఎట్లన, మందాంధకారములో (కనుచీకటిలో) రజ్జువును చూచి సర్పమని భ్రమ చెందినపుడు కల్పితమైన సర్పమునకు అధిష్ఠానమైన రజ్జువే స్వరూపము. అధిష్ఠానమగు రజ్జువుచేతనే సర్పస్వరూపము భాసించుచున్నది. లోకములో ఎచ్చటను నిరధిష్ఠాన విభ్రాంతి యుండనేరదు. అనగా, అధిష్ఠానము లేని వస్తుభ్రాంతి యుండదు. రజ్జుసర్పభ్రాంత్యాదిస్థలములలో సర్పాదిభ్రాంతికి అధిష్ఠానము రజ్జువు. శుక్తిరజతభ్రాంతిస్థలములో (అనగా ముత్యపు చిప్పను చూచి రజత మని భ్రాంతి చెందిన సందర్భములో) రజత భ్రాంతికి అధిష్ఠానము శుక్తి (ముత్యపుచిప్ప). ముత్యపుచిప్పచేతనే వెండి భాసించుచున్నది.

అట్లే, సర్వజగత్తును బ్రహ్మచైతన్యమందు అధ్యస్తము (కల్పితము) గాన, జగతందఃపాతి యగు ఉదకము ఉదకకల్పనకు అధిష్ఠానమగు బ్రహ్మచైతన్యముచేతనే ప్రకాశించుచున్న దని భావము.

## జ్యోతి రహ మస్మి జ్యోతిర్జ్వలతి బ్రహ్మాహమస్మి ।

ఆ జలాధిష్ఠాన చైతన్యస్వరూప మగు జ్యోతిస్సును నేనైతిని. ఏ జ్యోతిస్సు ప్రకాశించుచున్నదో, ఆజ్యోతిస్సు బ్రహ్మయే కావున, 'జ్యోతి రహ మస్మి' అను దానికి 'బ్రహ్మను నేనైతిని' అని యర్థము. దేహేంద్రియాదులనుంచి వేరుచేయబడిన నాకు బ్రహ్మయే స్వరూపమని ఫలితము.

యోహ మస్మి బ్రహ్మాహ మస్మి: । "బ్రహ్మను నేను ఐతిని" అనుటలో పూర్వసిద్ధమగు జీవాత్మయొక్క స్వరూపమును నశింప జేసి బ్రహ్మత్వలక్షణ మగు రూపాంతరప్రాప్తి కాదు. మరే మన, ఏ నేను పూర్వమందు జీవరూపుడనో, ఆ నేనే ఇప్పుడు బ్రహ్మరూపుడ నైతిని. అనగా, వాస్తవములో బ్రహ్మరూపుడ నైన నా యందే పూర్వము అజ్ఞానమువలన జీవత్వము ఆరోపించబడినది. ఆ అజ్ఞానము వివేకముచే పోగొట్టబడగా, వాస్తవములో పూర్వమందున బ్రహ్మస్వరూపమునే ఇప్పుడు అనుభవించుచుంటిని గాని నూతనమగు బ్రహ్మస్వరూపము రాలేదు.

అహ మస్మి బ్రహ్మాహ మస్మి నేను 'అహం అనగా అహం కారసాక్షినే ఐతినిగాని అహంకారరూపుడను గాను. నేను బ్రహ్మానైతిని.

**అహ మేవాహం మాం జుహోమి స్వాహా ।**

నేను బ్రహ్మతత్వానుసంధానకాలములో గూడ పూర్వసిద్ధమైన బ్రహ్మ స్వరూపుడనే గాని "యోషి త్యగ్నిధ్యానము" వలె ఔపచారిక మగు బ్రహ్మరూపుడను గాను. అనగా, పంచాగ్ని విద్యోపాసనలో స్త్రీయందు అగ్నిని ధ్యానము చేసినట్లు జీవునియందు బ్రమ్మరూపత్వధ్యానము గాదు. అట్టి నేను జలరూపుడనగు నన్ను ఉదరాగ్నియందు ప్రక్షేపము చేయుచున్నాను. అనగా, నా దేహమందుండెడి ప్రాణాద్యభిమాని దేవతలకొఱకు హవిస్సు ఇవ్వబడిన దని యర్థము.

## ఆచమనానంతరము తిరిగి స్నానమంత్రము.

"అకార్యకా ర్యవకీర్ణీ స్తేనో భ్రూణహా గురుతల్పగః
వరుణో ఽ పా మఘమర్షణ స్తస్మా త్పాపా త్ప్రముచ్యతే ।"

తా॥ శాస్త్రముచే నిషేధింపబడిన వస్తువులను భుజించుట, నిషేధింపబడిన స్త్రీ గమనము గలిగియుండుట, బ్రాహ్మణ సువర్ణమును అపహరించుట, వేదవేదాంగవేత్త యగు బ్రాహ్మణునిగాని, గర్భస్థశిశువునుగాని హననము చేయుట, గురుదారగమనము చేయుట, మున్నగు పాపములను చేయునట్టి నన్ను పాపనాశకుడును, ఉదక స్వామియు నగు వరుణుడు పూర్వోక్తపాపముల నుండి విముక్తుని చేయుగాక.

## రహస్య పాపక్షయమునకై స్నానమంత్రము

'రజో భూమి స్త్వమాగ్ం రోదయస్వ ప్రవదంతి
ధీరాః । (తై.ఉ.నారాయణం 5. పన్నం 1. అను.)

తా॥ ఓ పరమాత్మా! నేను పాపములకు స్థానభూతుడను. అయినను, నాపాపఫలమును అనుభవింపజేయుటకు నన్ను రోదనము చేయించకుము. ఇక నేమన, పాపములను నశింపజేయుటకు అనుగ్రహింపుము. ఈ విధముగ శాస్త్రవేత్తలు చెప్పుచుండుటచే నేనుగూడ చెప్పుచుంటిని. (ఈ అర్థములో 'త్వ' వద్ద అనుస్వారములోపము 'రోదయస్వ' వద్ద నకారాధ్యాహారము).

రెండవ అర్థము 'రజోభూమి, తు, అమాం' ఇతి పదచ్ఛేదః. పాపకర్మఫలభోగస్థానము నాకంటె ఇతరుని రోదనమును చేయించుగాక. (తు, వైలక్షణ్యార్థకః) పుణ్యఫలభోగభూమి నన్ను సంతోషపరచుగాక.

మూడవ అర్థము: ఓ పరమాత్మా! రజోభూమ్యాత్మకుడ వగు నీవు ఇతరుని రోదనమును చేయించుము. ఈ విధముగ అఘమర్షణ స్నానమాచరించిన నన్ను విడచి నాకంటె ఇతరుని రజోభూమి దుఃఖింపజేయుగాక! ఇట్లు చేయవలెనని బుద్ధిమంతులు చెప్పుచుండిరి. అందుచే నన్ను బాధింపవల దని తాత్పర్యము.

## స్నానానంతరము జప్యమంత్రము.

*'అక్రాన్ త్సముద్రః ప్రథమే విధర్మన్ జనయన్*
*ప్రజా భువనస్య రాజా । వృషా పవిత్రే అధిసానో అవ్యే*
*బృహత్సోమో వా వృధే సువాన ఇందుః ।'* (తై. ఉ.నారాయణం 5.పన్నం 1. అను)

తా॥ 'సముద్రవ త్యస్మా ద్విశ్వ మితి సముద్రః, పరమాత్మా । సముద్రవత్ ప్రౌఢత్వా ద్వా సముద్రః ।'

పూర్వకల్పమందు ప్రాణులచే చేయబడిన వివిధకర్మలు భోగోన్ముఖము లగునపుడు, పరమేశ్వరునకు సృష్టిచేయవలెనను సంకల్పము జనించును. సృష్టి ప్రారంభమగును. అట్టి సృష్టియొక్క ఆదికాలమందు భువనములకు పరిపాలకుడును, భక్తులకు సమస్త కోరికలను వర్షించువాడును, సర్వజగత్కారణ భూతుడును, ప్రౌఢిమచే సముద్ర సదృశుడును నగు పరమాత్మ ప్రజలను ఉత్పాదన చేయుచు సమస్తజగత్తును ఆక్రమించెను.

బ్రహ్మసాక్షాత్కారయోగ్య మగు ఈ దేహము ఒక పర్వతము. దానియొక్క సానువు (చరియ) లేక అవయవ మగు హృదయ పుండరీకమందు పరమాత్మ సమృద్ధిని పొందెను.

## హృదయవిశేషణములు

**హృ**దయపుండరీకము బాహ్యదేహావయవములవలె ఉచ్ఛిష్ట స్పర్శలేకపోవుటచే పరిశుద్ధమైనది. పురుషార్థహేతువగు ధ్యానము నకు స్థానమగుటచే ఇతరావయవములకంటె అధికమైనది. అందుచే ధ్యానము చేయువారికి పరిపాలనకు కారణమైనట్టిది. ఇట్టి హృదయ పుండరీకమందు పరమాత్మ వృద్ధిని పొందెను.

భావము: పూర్వము అజ్ఞానముచే ఆవృతుడగుట వలన సంకుచితుడగు జీవునిగా ఉండి, ఆ అజ్ఞానము జ్ఞానముచే నివృత్తము కాగా, బ్రహ్మత్వావిర్భావమువలన ప్రవృద్ధుడైనట్లు భాసించుచుండెను. అట్టి పరమాత్మ ధర్మాధర్మములకు (అనగా, పుణ్యపాప కర్మలకు) ప్రేరకు డగుచు ఫలదానముచే ఆహ్లాదకరు డగుచు వృద్ధి పొందెను.

## 'పవమానస్సువర్జనః' అను అనువాకము.

**జ్యో**తిష్టోమములో 21 దర్భలను మూడు సప్తకములు క్రింద విభజించి, యజమానియొక్కనాభికి ఊర్ధ్వభాగమందు రెండు సప్తకములచే (అనగా, సప్తసంఖ్యాయుక్తము లగు రెండు కట్టలచే) ఊర్ధ్వముగ మార్జనము చేయవలెను (తుడవవలెను). సప్తసంఖ్యా క దర్భయుక్తమగు మూడవ కట్టచే నాభి క్రింది భాగమున క్రిందుగా మార్జన చేయవలెను.

"అథైన ముత్తరేణ బహిఃప్రాగ్వగ్ంశాత్ దర్భపుం
జీలైః పవయతి ద్వాభ్యాం పవయతి త్రిభిః పవయతీత్యుక్తం
ఏకవిగ్ంశత్యా త్రేధా విభక్తయా సప్తభి స్సప్తభి ర్ద్వి రూర్ధ్వం
నాభే రూర్ధ్వ మున్మార్ష్టి. సకృ దవా జన్వంచం పావయతీ
త్యేకే. యం ద్విష్యాత్తం తిర్యంచ మక్ష్ణయా వా పావయేత్ ।" (ఆ.శ్రౌ.సూ.)

తా॥ ఈ విధముగ అధ్వర్యునిచే 'చిత్పత్తిస్త్వేత్యాది' మంత్రములచే దర్భపుంజీలములచే శోధ చేయబడుచున్న సమయమున యజమానుడు "పవమాన స్సువర్జనః" అను అనువాకమును జపము చేయవలెను.

"పావ్యమానో జపతి" (ఆ.శ్రౌ.సూ.)

ఈ విధముగ యజ్ఞములో దర్భపుంజీలముచే యజమానుని మార్జనము చేయుటను ఈ క్రింది శ్రుతి విధించుచున్నది.

"ఇంద్రోవృత్ర మహన్ త్సో౽౽ పో౽౽భ్యమ్రి
యత తాసాం య న్మేథ్యం యజ్ఞియగ్ం స దేవ మాసీ
త్తదపోదక్రామత్తే దర్భా అభవన్ య ద్దర్భపుంజీలైః
పవయతి యా ఏవ మేధ్యా యజ్ఞియా స్స దేవా అప
స్తాభి రేవైనం పవయతి ।" (కృ.య.సం. 6-1-1)

## దర్భల మహత్వము

**తా॥** పూర్వము ఇంద్రుడు వృత్రాసురుని వధించినపుడు ఆ అసురుడు ఉదకములకు అభిముఖముగ మరణించెను. ఉదకాభిముఖముగ ఆ పాపుడు మరణించుటచే ఉదకముయొక్క సారము బహిర్నిర్గత మయ్యెను. ఆసారము రెండువిధములు – దైవము, మానుషము. వాటిలో మలప్రక్షాలనకు ఉపయోగించెడిది మానుషము. దైవము తిరిగి రెండు విధములు: స్నానా౽౽చమనాదులచే పాప శోధకము, ప్రోక్షణాదికముచే ద్రవ్యశోధకము.

ఈ ద్వివిధ మగు సారము పై మంత్రములో "తాసాం య న్మేధ్యం యజ్ఞియం" అని "మేధ్య" "యజ్ఞియ" శబ్దములచే వివక్షించబడుచున్నది. ఈసారము బహిర్నిర్గతమై దర్భరూపముగ ఉత్పన్నమయ్యెను. కావున, దర్భస్తోమముచే యజమానుని మార్జన (శోధనము) చేయుటచే దర్భలు ఉదకసారములు గాన పాపశోధకములు, యజ్ఞయోగ్యములు, దేవతా ప్రియములు అగు ఉదకములచే యజమానుని శుద్ధుని చేయును.

## దర్భస్తోమమునకు సంఖ్యావిశేషములు.

*'ద్వాభ్యాం పవయ త్యహోరాత్రాభ్యా మేవైనం*
*పవయతి త్రిభిః పవయతి త్రియ ఇమే లోకా ఏభి*
*రేవైనం లోకైః పవయతి పంచభిః పవయతి పంచా*
*క్షరా పజ్క్తిపాజ్క్తో యజ్ఞో యజ్ఞాయైవైనం పవయతి*
*షడ్భిః వపయతి ష ద్వా ఋతవ ఋతుభి రే వైనం పవ*
*యతి సప్తభిః పవయతి సప్త ఛందాగ్ంసి ఛందోభి*
*రేవైనం పవయతి నవభిః పవయతి నవ వై పురు*
*షే ప్రాణా స్సప్రాణ మేవైనం పవయ త్యేకవిగ్ం*
*శత్యా పవయతి దశహస్త్య అంగులయో దశ పద్యా*
*త్మైకవిగ్ంశో యావా నేవ పురుషస్త మపరివర్గం*
*పవయతి ।* (కృ.య.సం. *6-1-1.*)

తా॥ రెండు దర్భలచే మార్జనము చేసినచో అహోరాత్రములచే యజమానుని శుద్ధుని చేయును. ఇట్లే మూడు దర్భలచే మార్జనము వలన మూడు లోకములచే పవిత్రుని చేయును. ఐదుదర్భలచే శోధనము వలన పంచత్వ సంఖ్యాసామ్యముచే (పజ్క్తిచ్ఛందస్సు పాదమునకు ఐదు అక్షరములు గావున, పంజ్క్తిచ్ఛందో ద్వారా పాజ్క్తమగు యజ్ఞముకొరకు యజమానుని శుద్ధుని చేయును. యజ్ఞములో ఐదవ దినమున సవనీయహవిస్సులు ఐదు ఉండుటచే యజ్ఞము పాజ్క్తము. ఈ విషయమునే ఈ క్రింది శ్రుతి చెప్పుచున్నది –

*"ధారాః కరంబః పరివాపః పురోడాశః పయస్యా*
*తేన పజ్క్తి రాప్యతే త ద్యజ్ఞస్య పాజ్క్తత్వం ।"*

దర్భగత పంచత్వసంఖ్యచే ఈ విధముగ పాజ్క్తమగు యజ్ఞము కొరకు ఈ యజమానుని శుద్ధునిచేయును. ఆరు దర్భలచే యజమానుని పవనము చేసినచో (ఋతువులు ఆరు

గావున,) ఈ ఆరు సంఖ్యచే యజమానుని ఆరు ఋతువుల చేతను శుద్ధునిగ చేయును. ఏడుదర్భలతో పవనము చేయుటచే, "గాయత్రీ త్రిష్టుప్ జగతీ" అను మంత్రములో ఉష్ణిక్, కకుప్, ఛందస్సులు రెండును కలసి ఒక ఛందస్సుగా లెక్కపెట్టుటచే గాయత్ర్యాది ఛందస్సులు ఏడు గావున, సప్త ఛందస్సులచే యజమానుని శుద్ధుని చేయును. తొమ్మిది దర్భలతో ఉన్మార్జనము చేసినచో సంచారస్థానభూతఛిద్రభేదముచే ప్రాణములు 9 గావున, 9 ప్రాణములతో (ఇంద్రియములతో) సంయుక్తుడగు యజమానుని శుద్ధునిచేయును. ఈ విధముగ అనేకములగు పక్షములను జెప్పి, అనుష్ఠానము చేయ దగిన పక్షమును చెప్పుచున్నాడు.

("ఏకవిగ్ంశత్యా పవయతి" ఇత్యాదినా) 21 దర్భలచే పవనముచే (యజమానికి హస్తముల 10 వ్రేళ్ళును, పాదముల 10 వ్రేళ్ళును మిగిలిన కాయమంతయు ఒక దానిక్రిందను లెక్కపెట్టగా పురుషుడు ఏకవింశతి సంఖ్యాయుక్తుడు గావున) దర్భ గత మగు 21 సంఖ్యచే ఏకవింశతిసంఖ్యాయుక్తుడగు యజమానుని సంపూర్ణముగ శుద్ధునిగా చేయును. "ఏకవిగ్ంశత్యా దర్భపుంజీలైః పవయతి" అని ఋగ్వేదములో 21 దర్భలచే పవనము చేయమని విధించుటచే ఈపక్షమే అనుష్ఠానములో నున్నది. వెనుకటి పక్షములు (అనగా, 2,3,5,7,9 సంఖ్యాపక్షములు) "శతే పంచాశత్" (అనగా, 100 సంఖ్యలో 50 సంఖ్య ఇమిడియున్నట్లు) అను న్యాయానుసారము, 21 సంఖ్యలో 2,3 మున్నగు సంఖ్యలు అంతర్భూతములుగాన, ఆ ఫలములు కూడ సిద్ధించునుగాన, అవయుత్యానువాదలు. (21 లో నుంచి వేరుచేసి చెప్పుట) అని భావము.

ఈ విధముగ యజ్ఞదీక్షలో ఉదకసారమగు దర్భలచే యజమానుని అధ్వర్యుడు ఉన్మార్జనము చేయు సమయమున యజమాని "పవమాన స్సువజ్జనః" అను అనువాకమును శుద్ధికొరకు (పవిత్రతా సంపత్తి కొరకు) జపముచేయును.

*పావ్యమానో జపతి.* *(ఆ.శ్రౌ.సూ.)*

భావము: పై విధముగ యజ్ఞములో పరిశుద్ధ్యర్థము జపము చేయవలసినదిగ విధింపబడిన ఈ అనువాకముచే మార్జన చేసికొను ఆచారము కలదు. అందుచే ఈ అనువాకమునకు అర్థము ఈ దిగువ వ్రాయబడుచున్నది.

*'పవమాన స్సువర్జన । పవిత్రేణ విచరుషణిః ।*
*యః పోతా స పునాతు మా ।* *(కృ.య.బ్రా. 1-4-8)*

ఈ అనువాకమునకు యజ్ఞములోను, స్మార్తకర్మలందు కూడ, స్నానాదికమందును, మార్జనయందును వినియోగమును శ్రీవిద్యారణ్యులవారును భట్టభాస్కరులును కూడా వ్రాయుటచే ప్రకృతాఘమర్షణస్నానములో దీని అరజానము అవసరము.

తా॥ సర్వప్రాణిజాతము యొక్క సుకృతదుష్కృతములను చూచుటయందు కుశలుడైనట్టియు, పాపశోధనయందు నేర్పు గలిగి నట్టియు, స్వర్గమందే నివసించెడి యేజనము పాపములను శోధన చేయునో, ఆజనము పాపశోధక మగు తేజస్సుచే నన్ను పవిత్రునిగ చేయుగాక!

*'పునంతు మా దేవజనాః । పునంతు మనవో ధియా ।*
*పునంతు విశ్వ ఆయువః ।'* *(2. మం.)*

తా॥ దేవతారూపు లగు జనులు "దేవానాం జనః ప్రాదు ర్భావః యేషాం యజ్ఞే ష్వితి దేవజనాః" అనగా యజమానులు లేక దేవగణములు నన్ను పవిత్రుని చేయుగాక! స్వాయంభువమన్వాదులు బుద్ధి విశేషములచే, లేక తమ కర్మ విశేషములచే నన్ను పవిత్రుని చేయుదురుగాక! కర్మవశమున మనుష్యలోకమున కేతెంచెడి మనుష్యులు నన్ను శుద్ధుని చేయుదురుగాక!

*'జాతవేదః పవిత్రవత్ । పవిత్రేణ పునాహి మా ।*
*శుక్రేణ దేవదీద్యత్ అగ్నే కృత్వాక్రతూగ్ం అను ।* *(3 మం.)*

తా॥ ఉత్పన్నులైన సర్వప్రాణులను తెలిసినవాడు, పవిత్రార్హుడ నగు నన్ను (అనగా, పవిత్రవస్తువులు శోధ చేయుటకు అర్హుడనైన నన్ను), పవిత్రమగు దర్శనాదికముచే పవిత్రుని చేయుము.

ఓ అగ్నీ! నిర్మల మగు తేజస్సుచే దీప్యమానుడ వగు నీవు మాసంబంధ మగు కర్మలను (లేక ప్రజ్ఞావిశేషములను) గూర్చి నీ ప్రజ్ఞచే (లేక కర్మవిశేషముచే) దీప్యమానుడ వగుచు నన్ను పవిత్రునిగ చేయుము.

*'య త్తే పవిత్ర మర్చిషి । అగ్నే వితత మంతరా ।*
*బ్రహ్మ తేన పునీమహే । (4. మం.)*

తా॥ ఓ అగ్నీ! నీ జ్వాలలమధ్యమందు విస్తృతము, ప్రవృద్ధము అగు పవిత్రస్వరూపముచే మా ఆత్మను పవిత్రముగ చేసికొనుచుంటిమి. లేక, జ్వాలలయందలి నీ పవిత్రరూపముచే మా సంబంధమగు బ్రహ్మవర్చసమునుగాని, ఋగాదిమంత్రజాతమునుగాని, ఆత్మనుగాని, పవిత్రముగ చేసికొనుచుంటిమి.

*"ఉభాభ్యాం దేవసవితః । పవిత్రేణ స వేన చ । ఇదం*
*బ్రహ్మ పునీమహే ।"* *(5. మం.)*

తా॥ సర్వముకు ప్రేరకుడ వగు ఓ దేవా! పాపశోధక మగు నీ తేజస్సుచేతను, సోమాభిషవము చేతను, లేక నీ సంబంధ మగు అనుజ్ఞ లేక ప్రేరణ చేతను, ఈ రెండిటి చేతను (అనగా, తేజస్సు మరియు సోమాభిషవముల చేతను) నా సంబంధమగు శుద్ధిసాధన మగు బ్రహ్మవర్చసమును గాని, ఋగాదికమునుగాని, ఆత్మనుగాని, పరిబృఢ మగు కర్మనుగాని పవిత్రముగ చేసికొనుచుంటిని.

*వైశ్వదేవీ పునతీ దేవ్యాగాత్ । యస్యై బహ్వీ*
*స్తనువో వీతపృష్ఠాః । తయా మదంతస్సధ మాద్యేషు ।*
*వయగ్గ్ స్యామ పతయో రయీణాం ।' (6 మం.)*

తా॥ సర్వదేవసంబంధ మగు యే దేవి శోధనకుశలురాలో, ఆదేవి మమ్ములను శోధన చేయుచున్న దగుచు వచ్చుగాక! ఏ దేవి యొక్క శుద్ధిహేతువు లగు దేహవిశేషములు కమనీయమైన స్తుతి కలవో, ఆ దేవిచే అనుగ్రహీతుల మగుచు ఋత్విక్కులతో గూడ హర్షయోగ్యము లగు కర్మలందు హర్షయుక్తుల మగు మేము ధనములకు పతుల మగుదుము గాక!

*వైశ్వానరో రశ్మిభి ర్మా పునాతు । వాతః ప్రాణే*
*నేషిరో మయోభూః । ద్యావాపృథివీ పయసాం పయోభిః ।*
*ఋతావరీ యజ్ఞియే మా పునీతాం ।' (7. మం.)*

తా॥ సర్వమనుష్యులకు హితుడగు అగ్ని (లేక ఆదిత్యుడు) స్వకీయ రశ్మలచే నన్ను శోధనచేయుగాక! వాయుదేవుడు ప్రాణ రూపముగ దేహములందు గమనము చేయుచు, సుఖముకు ఉత్పాదయిత అగుగాక! సత్యయుక్తములగు ద్యావాపృథివులు యజ్ఞమునకు హితవైన వగుచు, జలముచేతను, క్షీరాదిరసములచేతను నన్ను పవిత్రుని చేయుగాక!

*'బృహద్భిః స్సవితస్తృభిః । వర్షి పై ర్దేవమన్మభిః ।*
*అగ్నే దక్షైః పునాహి మా ।' (8. మం.)*

తా॥ కర్మల యందు ప్రేరకుడవగు ఓ అగ్నిదేవా! మా అనుగ్రహ విషయములగు మననములచే నన్ను పవిత్రుని చేయము. ఆదర యుక్తము లైనట్టివియు, పాపతరణసాధనము లైనట్టివియు చిరకాలానువృత్తిచే అత్యంతము ప్రవృద్ధములైనట్టివియు, శోధన కుశలములైన అనుగ్రహమననములచే నన్ను పవిత్రుని చేయుమని భావము.

*'యేన దేవా అపునత । యేనాపో దివ్యం కశః । తేన*
*దివ్యేనబ్రహ్మణా । ఇదం బ్రహ్మ పునీమహే ।" (9. మం.)*

తా॥ యే శుద్ధి సాధనముచే దేవతలు పూర్వపుయజమానులను పవిత్రులను గావించిరో, యే శుద్ధిసాధనముచే అబ్దేవతలు ద్యులోక విషయమగు గతిని శోధన చేసినవో, ద్యులోకయోగ్య మైనట్టియు, పరిబృఢమైన అశుద్ధిసాధనముచే అనుష్ఠీయమాన మగు పరిబృఢమైన ఈ కర్మను పవిత్రముగ చేయుచుంటిమి.

*"యః పావమానీ రధ్యేతి । ఋషిభి స్సంభృతగ్ం*
*రసం । సర్వగ్ం స పూత మశ్నాతి । స్వదితం మాతరి*
*శ్వనా ।"* (10. మం.)

తా॥ ఏ జనుడు శోధకదేవతాసంబంధమగు ఈ ఋక్కులను పఠించునో, లేక అర్థానుస్మరణము చేయునో, ఆ పురుషుడు సారభూతమైన సర్వఫలమును అనుభవించును. మంత్రములచేతను, మంత్రాభిజ్ఞులగు మునుల చేతను సంపాదించబడినది గనుకనే పరిశుద్ధ మైనట్టిదియు, వాయువుచే స్వాదుగా చేయబడినట్టి ఫలమును సర్వమును అనుభవించునని భావము.

10. మం. రెండవ అర్థము: ఏ జనుడు పవమానదేవతాకములగు ఋగాత్మకమైనట్టియు, మధుచ్ఛంద ఆది ఋషులచే సంపాదించ బడినట్టిదియు, వేదసార రూప మగు సూక్త సంఘమును అధ్యయనము చేయునో, ఆ జనుడు సర్వభోగ్యజాతమును పరిశుద్ధమైనదానినే, (అనగా పరిపూతమైన అన్నమునే) అశనముకంటె పూర్వమే వాయుదేవునిచే స్వాదూకృతమైన అన్నమునే భుజించును.

*"పావమానీ ర్యో అధ్యేతి । ఋషిభి స్సంభృతగ్ం*
*రసం । తస్మై సరస్వతీ దుహే । క్షీరగ్ం సర్పి ర్మధూ*
*దకం ।"* (11. మం.)

తా॥ ఏ పురుషుడు ఈ శోధకదేవతాకసంబంధ మగు ఋక్కులను అధ్యయనము చేయునో, ఆ పురుషుని కొరకు సరస్వతి యాగసాధనమైన క్షీరమును, ఘృతమును, మధురమగు ఉదకమును (సోమమును) దోహనము చేయును. అనగా, ఈ ఋగధ్యేత యగు పురుషుని యాగాద్యనుష్ఠానపరునిగను, వేదశాస్త్రవిదునిగను సరస్వతీదేవత చేయునని భావము.

*"పావమానీ స్స్వస్త్యయనీః । సుదుఘాహి పయ*
*స్వతీః । ఋషిభి స్సంభృతో రసః । బ్రాహ్మణేష్వమృ*
*తగ్ం హితం ।"* (12. మం.)

తా॥ క్షేమమును పొందించునట్టివియు, శోభనమగు ఫలము నిచ్చునట్టివియు, క్షీరాదిరసహేతువు లైనట్టివియు, సుప్రసిద్ధము లగు ఆ పావమానీ ఋక్కులు మమ్ములను అనుగ్రహించుగాక. మంత్ర దర్శులగు ఋషులచే ఫలసారము మాయందు సంపాదిత మగుగాక! బ్రాహ్మణుల మగు (అనగా మంత్రపాఠకుల మగు) మాయందు వినాశరహిత మగు ఫలము సంపాదిత మగుగాక.

*'పావమానీ ర్దిశంతు నః । ఇమం లోక మథో*
*అముం । కామాన్ త్సమర్ధయంతు నః । దేవీ ర్దేవై*
*స్సమాభృతాః ।* (13. మం.)

తా॥ ఇంద్రాదిదేవతలచే సంపాదించబడిన పవమానమంత్రా__భిమానిదేవతలు మాకు లోకద్వయమును ఇచ్చెదరుగాక! లోకద్వయమందలి భోగములను సమృద్ధములనుగ చేయుదురుగాక!

*'పావమానీః స్వస్త్యయనీః । సుదుఘా హి ఘృత*
*శ్చుతః । ఋషిభి స్సంభృతో రసః । బ్రాహ్మణే ష్వమృ*
*తగ్ం హితం ।'* (14 మం.)

తా॥ క్షేమప్రాపకము లైనట్టియు, శోభనఫలము నిచ్చునట్టివియు, ఘృతమును స్రవింపచేయునట్టి పవమానదేవతలు మమ్ములను అనుగ్రహించుగాక. మంత్రద్రష్టలగు ఋషులచే ఫలసారము మా యందు సంపాదిత మగుగాక! మంత్రపాఠకులమగు మాయందు వినాశరహిత మగు ఫలము సంపాదిత మగుగాక!

*'యేన దేవాః పవిత్రేణ । ఆత్మానం పునతే సదా ।*
*తేన సహస్రధారేణ । పావమాన్యః పునంతు మా । (15. మం.)*

తా॥ ఇంద్రాదిదేవతలు ఏ శుద్ధి సాధనముచే ఎల్లప్పుడును తమ దేహమును శుద్ధముగ చేసికొనుచుండిరో, సహస్ర సంఖ్యాకములగు అవాంతరభేదములతో నున్న ఆశుద్ధిసాధనముచే పావమానీ ఋక్కులు నన్ను పవిత్రుని చేయుగాక!

*'ప్రాజాపత్యం పవిత్రం । శతోద్యామగ్ం హిరణ్మ*
*యం । తేన బ్రహ్మవిదో వయం । పూతం బ్రహ్మ*
*పునీమహే ॥'* (16. మం.)

తా॥ శుద్ధిసాధన మైనట్టియు, ప్రజాపతి సంబంధ మైనట్టియు, శతసంఖ్యాకము లగు దర్భలతో కూడినట్టియు, పాపహరణ సాధనమగు ద్రవ్యముచే నిర్మితమైన పవిత్రముచే

వేదార్థవిదుల మగు మేము ఇంతకు పూర్వమే పవిత్రమైనట్టి (పరిబృఢమైనట్టి) ప్రవృద్ధమైన ఈ కర్మను తిరిగి పరిశుద్ధముగ చేయుచుంటిమి.

*'ఇంద్ర స్సునీతీ సహ మా పునాతు । సోమ స్స్వస్త్యా*
*వరుణ స్సమీచ్యా । యమో రాజా ప్రమృణాభిః పునాతు*
*మా । జాతవేదా మోర్జయంత్యా పునాతు ।'* (17. మం.)

తా॥ ఇంద్రుడు శోభనఫలముల నిచ్చెడి దేవితో కూడ నన్ను పవిత్రుని చేయుగాక. సోముడు క్షేమమును పొందించెడి దేవితో కూడ నన్ను పవిత్రుని చేయుగాక! వరుణుడు అనుకూలురా లగు దేవితో కూడ నన్ను పవిత్రుని చేయుగాక! యముడు అధికముగ మారణము చేసెడి దేవులతో గూడ నన్ను పవిత్రుని చేయుగాక! జాతవేదస్సు క్షీరాదిరసములను పొందించెడి దేవితో గూడ నన్ను పవిత్రుని చేయుగాక!

ఈ విధముగ సమస్తపాపములను తొలగించి పరిపూతుని చేసెడి పావమానీ ఋక్కులచే అఘమర్షణస్నానము చేసినచో, పవిత్రత, ఐహికాముష్మిక సుఖములు సంభవించు నని ఆ మంత్రములవలననే స్పష్టముగ తెలియుచున్నది.

ఈ అఘమర్షణస్నానములో (పూర్వము చెప్పినరీతిని) తొట్టె స్నానము, మృత్తికా స్నానము అంతర్భూతము లని స్పష్ట మగుచున్నది.లోకములో చేయు తొట్టెస్నాన, మృత్తికాస్నానములలో మంత్రములు లేకపోవుటచే కేవలకార్య చికిత్సయే యగును. వైదికము లగు అఘమర్షణ స్నానాదులవలన మంత్రసంబంధముచే వ్యాధికారణ భూతమగు పాపనాశనము కూడ సంభవించునుగాన, చాల వైలక్షణ్యము (ఫలవిశేషము) వ్యక్త మగుచున్నది.

## నియమవిశేషములు.

*"తస్యైత ద్వ్రతం । వర్షతి న ధావేత్ । అమృతం*
*వా అపః । అమృత స్యానంతరిత్యై ।"* (అరుణము. 26. అను.)

అరుణకేతుకాగ్ని చయనమును ఆచరించిన పురుషునకు కొన్ని నియమవిశేషములు ఈ ప్రక్రమములో చెప్పబడుచున్నవి. ఇతరులు కూడ వీటిని ఆచరించుటలో విశేష ముండుటచే ఈ స్నాన ప్రకరణములో వాటిని ఉల్లేఖ చేయడమగుచున్నది.

తా॥ (తస్యైత ద్వ్రత మిత్యాది) అరుణకేతుకాగ్నిచయన మును చేసిన పురుషుడు మార్గమున పోవుచుండగా మేఘుడు వర్షించుచున్నచో తడిసిపోయెద నను భీతిచే (క్లేదభీతిచే) పరుగిడరాదు. ఎందులకన, ఉదకములు అమృతరూపములు. అందుచే అట్టి ఉదకముల

పరిత్యాగముచే స్వర్గసుఖరూప మగు అమృతము వ్యవహితమగును గాన, స్వర్గసుఖమునకు వ్యవధానము లేకుండుటకు పరుగిడ రాదు.

## ఉదకములకు అమృతత్వము.

ఉదకములకు అమృతరూపత్వము ద్విషాహస్రక్రతువులో కుంభేష్టకాప్రస్తావములో ఈ క్రింది విధముగ శ్రుతి బోధించుచున్నది.

*'అమృతం వా ఆప స్తస్మా దద్భి రవతాంత మభి*
*షించంతి ।'* *(తై. సం. 5-2-2)*

తా॥ ఉదకములు అమృతరూపములుగావుననే లోకములో మూర్ఛా రోగగ్రస్తుని ఉదకములచే స్నానము చేయించెదరు. ఈ విధముగ లోకప్రసిద్ధోదాహరణచే ఉదకములకు అమృతరూపత్వమును ఈ శ్రుతి వక్కాణించుచున్నది. అందుచే వర్షము కురియుచున్నపుడు పరుగిడరాదు. (ఇతరులకు కూడ ఈ నియమమును పాటించుట శ్రేయస్సు).

## నియమాంతరములు.

*'నాప్సు మూత్రపురీషం కుర్యాత్ । న నిష్ఠీవేత్ । న*
*వివసన స్స్నాయాత్ । గుహ్యో వా ఏషో౽గ్నిః । ఏత*
*స్యాగ్నే రనతిదాహాయ ।'* *(అరుణం. 26. అను.)*

తా॥ ఈ అరుణకేతుకాగ్ని అభీష్టకలచే నిష్పాదన చేయబడును గావున, ఉదకములందు గూఢముగ నుండును. అట్టి అగ్ని, ఉదకము లందు మూత్రపురీషములను చేయువానిని దహించునుగాన, ఆదహనము లేకుండుటకై ఉదకములందు మూత్రపురీషములను చేయరాదు. మరియు, ఉదకములందు నిష్ఠీవనము (కాండ్రించి శ్లేష్మమును ఉమ్మి వేయుట) చేయరాదు. వివసనుడై (వస్త్ర విసర్జన చేసి) ఉదకములందు స్నానము చేయరాదు. అట్లు చేసినచో, ఉదకములందు నిగూఢమైన అగ్ని వీనిని దహించును.

శాస్త్రములందు ఈ పనులు పురుషార్థము (పురుషుని కొరకు) నిషేధించబడినవి గావున, అరుణకేతుకచయనమును చేయని పురుషుడు గూడ పై నియమములను ఆచరించవలెను. శాస్త్రములందు అందరకును ఈ పనులు నిషేధించబడినచో ఈ క్రతుప్రకరణములో తిరిగి యెందులకు నిషేధించబడినవి? కారణమేమన, ఇవి క్రతువులో చేసినచో, శ్రౌతప్రాయశ్చిత్తము చేసికొనవలెనను తాత్పర్యముతో ఇచ్చట తిరిగి నిషేధించడమైనది.

*'న పుష్కరపర్ణాని హిరణ్యం వాధితిష్ఠేత్ । ఏత*
*స్యాగ్నే రనభ్యారోహాయ ।'* *(అరుణం. 26. అను.)*

తా॥ తామరాకునుగాని, హిరణ్యమునుగాని పాదముచే అక్రమణము చేయరాదు. అనగా, కాలితో త్రొక్కరాదు. త్రొక్కినచో అగ్నిని త్రొక్కినవాడగును. ఆదోషరాహిత్యము కొరకు త్రొక్కరాదని తాత్పర్యము.

## కోడిగ్రుడ్డు తినరాదు.

*"రేతః పీతా అండపీతాః । అంగారేషు చ యే హు*

*తాః । ఉభయాన్ పుత్రపౌత్రకాన్ । యువే౾హం*

*యమరాజగాన్ "* (అరుణం. 27. అను. 14. మం.)

తా॥ అరుణకేతుక చయనములో "అప్లవస్వేతి సప్తదశ క్షపణ్యాః" అను సూత్రవిహితములైన 17 క్షపణీష్ట కామంత్రములలో ఇది 14వ మంత్రము.

ఈ చయనస్థానమునుండి రేతఃపానము చేయువారును (అండస్పృష్టోదకపాయులు), కోడిగ్రుడ్డు మొదలగు వాని రసమును పానము చేయువారును, అభక్ష్యవస్తువులను భక్షించువారును, వెడలిపోవుదురుగాక! మరియు ఏపశ్వాదులు అశాస్త్రీయముగ హోమము గావింపబడి పిశాచాదిరూపముగ జగత్తునందున్నవో, లేక పిపీలికాదులు (చీమలు, మున్నగునవి) అగ్నియందు బడి పిశాచాది రూపముగ నున్నవో, అవి యన్నియు ఈ ప్రదేశము నుండి పోవుగాక! (అపగతము లగు గాక!) మరియు, వేదశాస్త్రాధ్యయనము, సదాచార సంపత్తియు లేక దురాచారాది తత్పరులగుటచే నింద్యు లగు పుత్ర పౌత్రులను ఈ స్థానము నుండి పృథక్కరించుచుంటిని. ఇంకను యమునిచే శిక్షింపదగిన పాపుల నందరను ఈ స్థానమునుండి పృథక్కరించుచుంటిని.

ఈ మంత్రములో కోడిగ్రుడ్డు రసపానము మున్నగు అభక్ష్యభక్షణ చేయు పాపులను ఈ ప్రదేశమునుండి పృథక్కరించుచుంటినని స్పష్టముగ విశేషించి చెప్పుటచే ఇది అశాస్త్రీయ మని తెలియుచున్నది.

## అర్కపర్ణములు (జిల్లేడి ఆకులు) రేగిపండు శిరంబున నుంచి స్నానము.

స్నానప్రసంగమున శిష్టులు రథసప్తమిరోజున జిల్లేడి ఆకు, రేగిపండు, శిరంబున నుంచుకొని మహానదులలో స్నానము చేసెడి ఆచారమునకు కారణము నిరూపించబడుచున్నది. జిల్లేడి, రేగిపండ్ల యొక్క ఉత్పత్తి ప్రతిపాదకము లగు శ్రుతులవలన వీటి మహత్త్వము స్పష్టముగ తెలియును.

## అర్కవృక్షముయొక్క ఉత్పత్తికి ఉపోద్ఘాతము.

వ్యవసాయ ప్రకరణములో దంపుడు బియ్యము యొక్క మహత్త్వ ప్రతిపాదక ప్రసంగములో గాయత్రి యొక్క శిరస్సును వషట్కార దేవత ఛేదించినట్లు వివృతమైనది. సంక్షేపముగ దానిని ప్రతిపాదించి, మేకయొక్క ఉత్పత్తిని నిరూపించి, అనంతరము అర్కపర్ణముయొక్క ఉత్పత్తి వివరించబడును.

## గాయత్రీసోమాహరణము.

పూర్వము కశ్యపప్రజాపతికి కద్రువు, సుపర్ణి అను ఇరువురు భార్యలుండెడివారు. వారు పరస్పర సౌందర్యవిషయములో స్పర్ధాయుక్తులై, విజయమును పొందినవారికి పరాజితురాలు దాసీత్వము చేయునట్లు శపథము చేసికొనిరి. అనంతరము స్త్రీ సభా సన్నివేశములో కద్రువు సౌందర్యవతిగ నిర్ణీతయైనది. సుపర్ణి పరాజితురాలగుటచే కద్రువుకు దాసీత్వము చేయవలసిరాగా, కద్రువు సుపర్ణిని గూర్చి ఈ విధముగ బల్కను. “ఓ సుపర్ణీ! స్వర్గలోకమునుండి సోమలతను దెచ్చి ఇచ్చినచో, నిన్ను దాసీత్వమునుండి విముక్తురాలను జేసెదను”.

సుపర్ణి వెంటనే తన పుత్రులగు గాయత్రీ, త్రిష్టుప్, జగతీ ఛందస్సులతో నీవృత్తాంతమును తెలియజెప్పెను. అంతట జ్యేష్ఠులగు త్రిష్టుప్, జగతీ ఛందస్సులు ప్రత్యేకముగ సోమాహరణము కొరకుస్వర్గమునకు జని, అచ్చటి సోమరక్షకులగు స్వానాదులచే పరాజితులై తిరిగి వచ్చిరి. వెంటనే కనిష్ఠురాలగు గాయత్రీ ఛందస్సు స్వర్గమున కేగి, సోమమును తీసికొనివచ్చి తల్లి కిచ్చెను. ఆమె దానిని కద్రువుకు అర్పించి, ఆమె దాసీత్వము నుండి తాను విముక్తురాలయ్యెను.

అనంతరము గాయత్రీ ఛందస్సు ఇతర ఛందస్సులకు శక్యముకాని సోమాహరణమును తాను చేసితినని గర్వయుక్తురాలయ్యెను. గాయత్రియొక్క గర్వమును చూచి వషట్కారదేవత క్రోధయుక్తురాలై, అభిముఖముగ జనుదెంచి, గాయత్రీ దేవతయొక్క శిరంబును ద్రుంచెను. ఆ ఛిన్న ప్రదేశమునుండి రసము భూమియందును, పశువులందును, రెండు విధములగ పతన మాయెను. భూమియందు పడిన రసము యొక్క అర్థభాగము ఖదిరవృక్షముగ (చంద్రచెట్టుగ) నుద్భవించెను. పశువులందు పడిన గాయత్రియొక్క అర్థరసభాగము (అజ, గా) మేకగా ప్రాదుర్భవించెను. ఈ వృత్తాంతమువలన మేక (అజ) గాయత్రీఛందస్సు యొక్క సారమని స్పష్ట మగుచున్నది.

## అర్కవృక్షము - ఉత్పత్తి.

ఈ వృత్తాంతము నమకమునకు ఆంధ్రానువాదములో వివరించబడినది. “రుద్రో వా ఏష యదగ్నిః” అని బ్రాహ్మణ కథన ప్రస్తావనల నివృతమైనది. అందుచే సంక్షేపముగ ప్రకృతప్రసంగానుకూలముకు ప్రతిపాదించబడుచున్నది.

పూర్వము అంగిరస్సులను మహర్షులు కృత్వనుష్ఠాన మహిమచే ఫలీభూత మగు స్వర్గమును గూర్చి పోవుచు అజయందు ఘర్మమును (మహావీర మను మట్టికూజాలో సలసల మరుగుచున్న నెయ్యిని) సేచనముచేసిరి (పోసిరి). ఆ మేక అరచుచు, పర్ణసదృశమగు రోమ సంఘమును పరిత్యజించెను. అనగా, ఆ అతితప్తమగు నెయ్యి పడుటచే ఆ మేక యొక్క తొడుగు ఊడిపడెను. అదియే అర్కవృక్షముగ (జిల్లేడిచెట్టుగ) ఆవిర్భవించెను.

"అర్చ గతి పూజనయోః" అను పాణినీయశాస్త్రానుసారము, గాయత్రీ ఛందస్సారరూప మగుచటే పూజ్యమైన మేకయొక్క శరీరము నుంచియు, మంత్రసంస్కృత మగుటచే పూజ్యమైన తప్తఘృతము నుంచియు ఆవిర్భూత మగుటచే అర్కవృక్షము పూజ్యమైనది.

## బదరఫలము (రేగిపండు) ఉత్పత్తి.

*'ఇంద్రస్య సుషువాణస్య దశధేంద్రియం వీర్యం*
*పరాపతత్ । స యత్ప్రథమం నిరష్ఠీవత్ । త త్క్వల*
*మభవత్ । య ద్వి తీయం త ద్బదరం । య త్తృతీ*
*యం త త్కర్కంధు ।' ఇత్యాది.* (తై.బ్రా. 1-8-5)

తా॥ పూర్వము సోమలతను అభిషవమును చేయుచున్న (అనగా, రసము కొరకు సోమలతను దంపుచున్న ఇంద్రుని యొక్క ఇంద్రియసామర్థ్యము పది విధములుగ బహిర్భూతమాయెను. (పతిత మాయెను). "ఘ్నంతి వా ఏత త్సోమం యదభిషుణ్వంతి" అను శ్రుత్యనుసారము, అభిషవము వధరూపము గావున, సోమహననముచే పతనము యుక్తము.

ఆ ఇంద్రుడు ముఖముచే మూడుసార్లు నిష్ఠీవనము చేసెను. (అనగా, కాండ్రించి ఉమ్మివేసెను). వాటిలో ప్రథమనిష్ఠీవనముచే క్వలము (బాలఖర్జూరఫలము) నిష్పన్న మాయెను. ద్వితీయనిష్ఠీవన ముచే క్రముక (పోకపండు) పరిమాణమగు సూక్ష్మ బదరీఫలము (రేగిపండు) నిష్పన్న మాయెను. తృతీయనిష్ఠీవనముచే హరీతకీ (కరక్కాయ) పరిమాణ మగు స్థూలబదరఫలము (రేగిపండు) నిష్పన్నమాయెను.

ఈ విధముగ గాయత్రీఛందస్సు యొక్క సారరూప మగు అజ యొక్క రోమసంఘము అర్కవృక్షరూపముగ ప్రాదుర్భవించినదిగాన, అర్కపర్ణము గాయత్రీఛందస్సు యొక్క స్వరూపము.

ఇంద్రుని యొక్క ఇంద్రియసామర్థ్యము బదరీఫలరూపమగుట వలన, బదరఫలము ఇంద్రుని ఇంద్రియసామర్థ్య రూపము.

ఇట్టి అర్కపర్ణమును, బదరీఫలమును శిరస్సునందుంచి స్నానము చేసినచో గాయత్రీచ్ఛందస్సారముతోను, ఇంద్రుని ఇంద్రియసామర్థ్యముతోను, సంయుక్తములగు ఉదకములు తన శరీరమునందు వ్యాపించుటచే ఆ రెండును శరీరమందు సంక్రమించు నను తాత్పర్యముతో ఈ శిష్టాచారము ప్రవృత్తమైనది.

## దీపావళీ - గుగ్గిలము.

శిష్టాచారా ప్రసంగమున దీపావళీ రాత్రియందు మైనపు వత్తిని వెలిగించి దానిపై గుగ్గిలమును జల్లెడి ఆచారము కలదు. దానికి కారణము నీ క్రింది శ్రుతి చెప్పుచున్నది.

"అగ్నే స్త్రయో జ్యాయాగ్ంసో భ్రాతర ఆసన్ తే
దేవేభ్యో హవ్యం వహంతః ప్రామీయంత సోఽగ్ని రబిభే
దిత్థం వా వస్య ఆర్తి మారిష్యతీతి స నిలాయత స
యాం వనస్పతి ష్వవస త్తాం పూతుద్రౌయా దోష
దీషు తాగ్ం సుగంధితేజినేయాం పశుషుతాం పేత్వ
స్యాంతరా శృంగే తం దేవతాః ప్రైష మైచ్ఛన్త మన్వ
వింద స్త మబ్రువ న్నుప న అవర్త స్వ పతీవ్యం నో
వహేతి సోఽబ్రవీ ద్వరం వృణై యదేవ గృహీతస్యా॒
హుతస్య బహిః పరిధిస్కందాత్త న్మేభ్రాతృణాం భాగ
ధేయ మసదితి తస్మా ద్యద్గృహీత.స్యాహుతస్య బహిః
పరిధి స్కందతి తేషాం తద్భాగధేయం తానేవ తేన
ప్రీణాతి సోమన్యతా॒స్థస్వంతో మే పూర్వే భ్రాతరః
ప్రామేషతా స్థాని శాతయా ఇతి స యా వ్యస్థాన్యశాత
యత తత్పూతుద్రభవ ద్యన్మాగ్ం స ముపమృతం
తద్గుగ్గులు యదేతాన్ త్సంభారాన్ త్సంభర త్యగ్ని
మేవ త త్సంభరతి।" (తై. సం. 6-2-8.)

తా॥ పూర్వము అగ్నికి పెద్దవా రగు సోదరులు ముగ్గురుండెడివారు. వారు దేవతలకు హవిర్వహనము చేయుచు, ఆ ప్రయాసచే మృతులైరి. ఈ విధముగనే తానుకూడ దేవతలకు హవిర్వహనము చేయుచో ఆ ప్రయాసచే మృతి నొందగలనని యోచించి, అగ్ని భయగ్రస్తుడగుచు, ఒకరాత్రి వనస్పతులలో దేవదారువృక్ష మందును, రెండవరాత్రి, ఓషధులలో సుగంధి తేజనమందును (అనగా, గుబ్బపుచెంగలి గడ్డియందును), మూడవ రాత్రి పశువులలో మేక యొక్క శృంగముల మధ్యమునను నిలీనుడై నిగూఢముగ నుండెను. అంతట దేవతలు అగ్నిని హవిర్వహనమందు ప్రేరణచేయుటకు ఇచ్ఛకలవా రగుచు, వెదకి,

అగ్నిని తెలిసికొని, తమ వద్దకు వచ్చి హవిర్వహనము చేయుమని బలికిరి. అనంతరము అగ్ని ఈ క్రింది విధముగ వరమును కోరెను.

"ఓ దేవతలారా! ఋత్విక్కులు హోమము చేయుటకు స్రుక్కు యందు గ్రహించబడిన హవిర్లేశము అగ్నికి చుట్టును (రక్షోనిరహరణము కొరకు) ఉంచిన పరిధులకు బహిః ప్రదేశమందు (బయట) పడినచో, అది మృతులైన నాభ్రాతలకు భాగ మగుగాక" యని కోరెను. అట్లు దేవతలు వరప్రదానము చేయుటచే అగ్నికి మూడు దిశల నుండెడి పరిధులకు బహిఃప్రదేశమందు పడిన హవిర్లేశము అగ్నిసోదరులకు భాగముగాన, దానిచే వారిని సంతోషపరచును.

అనంతరము అగ్ని ఈ క్రింది విధముగ అనుకొనెను. "నా సోదరులు త్వగస్థిమాంసములతో యుక్తులై మృతులైరి. వారి సంబంధమగు అస్థులు, మాంసములు పరిత్యజించబడినవి. పరిత్యక్తములైన అస్థులు దేవదారురూపములైనవి. మాంసము గుగ్గిల (గుగ్గులు) రూపమాయెను.

అచ్చట యజ్ఞములో ఉత్తరవేదియందు సూత్రోక్తములగు గుగ్గిలము మున్నగు సంభారములను ఉత్తరవేదియందు ఉంచవలెను.

*'గుగ్గులు సుగంధితేజనగ్గ్ శ్వేతా మూర్ణాస్తుకాం ।' (ఆ.శ్రౌ.సూ.)*

ఈ సంభారములు అగ్నుల మాంసాస్థిరూపములు గావున, వీటిని ఉత్తరవేదియందుంచుటచే సంపూర్ణమగు అగ్నిని ఉంచినట్లగును.

## ప్రకృతము.

నరకచతుర్దశిరోజున శ్రీకృష్ణుడు నరకాసురుని సంహరించి, సత్యభామాసమేతుడై వచ్చునపుడు ఆరతులచే అభినందించెదరు. ఆ సమయములో గుగ్గిలము పై విధముగ అగ్నుల మాంసరూపము గావున, సంపూర్ణ మగు అగ్ని స్వరూపముచే (ప్రకాశచే) ఆరతి ఇచ్చుటకై, గుగ్గిలమును ప్రజ్వలించెడి మైనపువత్తియందు వేసెదరు. దానివలన అధిక మగు అగ్ని స్ఫులింగములు బయలువెడలి, ప్రకాశాధిక్యము గన్నపట్టుచునే యున్నది. సాధారణదీపపు వత్తియందు గుగ్గిల ప్రక్షేపము చేసినచో, ఆ దీపము నిర్వాణ మగును. అందులకై గుగ్గిల ప్రక్షేపము ను సహించి జ్వాలాధిక్యము సంపాదించుటకు మైనపువత్తి దీపముపై ఈ గుగ్గిలమును ప్రక్షేపణ చేయు ఆచారము ప్రవృత్తమగుచున్నది.

ఈ విధముగ, ప్రసంగానుప్రసంగ సమాగతవిషయవివరణ పురస్సరముగ అఘమర్షణ స్నానము అనతివిస్తరముగ ఉల్లేఖ చేయబడినది.





శ్రీ మహాగణాధిపతయే నమః ।

# వేదసార రత్నావళి

## 12. రుద్రాక్ష ఉత్పత్తి.

మన పూర్వులగు శిష్టులు రుద్రాక్షలను ధరించెడి ఆచారము నేటివరకు బహులముగ ప్రవృత్త మగుచున్నది. ఆచారములు శ్రుతి, స్మృతి మూలకములు గావున, ప్రమాణము లని పూర్వమీమాంసా శాస్త్రములో సిద్ధాంతీకరించిరి. ఈ సదాచారమునకు మూలము ఉపనిషత్తునందు కలదు.

పూర్వము భుసుండు డను మహర్షి (జాబాలుడు) కాలాగ్ని రుద్రుని రుద్రాక్ష యొక్క ఉత్పత్తిని గూర్చి ప్రశ్నించెను. అంతట కాలాగ్ని రుద్రుడు భుసుండునకు ఈ క్రింది విధముగ జెప్పెను.

'పూర్వము త్రిపురవదార్థము దేవమానముచే వేయి సంవత్సరములు నేత్రములను మూసికొని తెరచితిని. అప్పుడు అక్షిపుటముల నుండి జలబిందువులు భూమియందు పడెను. అశ్రుబిందువులు భక్తులను అనుగ్రహించుటకు స్థావరరూపమును దాల్చి మహారుద్రాక్ష వృక్షములుగ ఉత్పన్నము లయ్యెను. "రుద్రస్య నయనా దుత్పన్నా రుద్రాక్షాః" అను నిర్వచనానుసారము, రుద్రుని నేత్రములనుండి ఉత్పన్నములగుటచే 'రుద్రాక్షలు' అను పేరు వచ్చెను.

మరియొక ప్రక్రమములో సనత్కుమారుడు కాలాగ్నిరుద్రుని రుద్రాక్షధారణ విధి నడిగెను. ఆ సమయమునందే నిదాఘుడు, జడభరతుడు, దత్తాత్రేయుడు, కాత్యాయనుడు, భారద్వాజుడు, కపిలుడు, పిప్పలాదుడు మున్నగువారు కాలాగ్ని రుద్రుని యొద్ద కేతెంచిరి. కాలాగ్నిరుద్రుడు వారలను ఆగమనమునకు కారణమును ప్రశ్నించగా, వారు "మహాప్రభూ! మేమందరము రుద్రాక్షధారణ విధిని వినుటకు తమ సన్నిధి కేతెంచితిమి" అని జవాబు చెప్పిరి. అప్పుడు కాలాగ్ని రుద్రు డీ విధముగ పలికెను.

సదాశివుడు సంహారకాలమందు సర్వమును సంహరించి సంహారనేత్రమును ముకుళింపజేసెను. అప్పుడు ఆ నేత్రమునుండి అశ్రుబిందువుల ద్వారా రుద్రాక్షలు ఉత్పన్నమైనవి. వాటి మహిమ చెప్పెదను. వాక్కుచే రుద్రాక్ష అను శబ్దమును ఉచ్చరించిన మాత్రమున పది గోవులను దానము చేయుటవలన లభించెడి ఫలము ప్రాప్తమగును. రుద్రాక్షలను హస్తముచే స్పృశించి ధారణమాత్రమున రెండు సహస్రగోదానముల ఫలము సంభవించును. రుద్రాక్షలను కర్ణములందు ధరించుటవలన పదకొండు వేల గోదానముల ఫలము లభించును. మరియు, ఏకాదశరుద్రరూపత్వము కూడ లభించును. రుద్రాక్షలను శిరంబున ధరించినచో కోటి గోదానముల ఫలము సంప్రాప్త మగును. ఈ స్థానము లన్నిటిలోను కర్ణస్థానమున ధారణఫలము చెప్ప నలవి కాదు. ఈ విధముగ రుద్రాక్షదర్శన, ధారణ, జపములకు ఉత్తరోత్తరాభివృద్ధిగ అపరిమిత ఫలములను శ్రుతి చెప్పుచున్నది.

పరిమాణ వివరణము: ఉసిరిపండు ప్రమాణము గల రుద్రాక్ష చాల ప్రశస్తము. రేగిపండు ప్రమాణము గలది మధ్యమము శలగగింజ ప్రమాణము గలది అధమము.

## రుద్రాక్ష మహత్త్యము.

'దివ్యవర్షసహస్రాణి చక్షు రున్మీలితం మయా ।
భూమా పక్షి పుటాభ్యాం తు పతితా జలబిందవః ॥
తత్రాశ్రుబిందవో జాతా మహారుద్రాక్షవృక్షకాః ।
స్థావరత్వ మనుప్రాప్య భక్తానుగ్రహకారణాత్ ॥
భక్తానాం ధారణా త్పాపం దివారాత్రకృతం హరేత్ ।
తజ్జపా ల్లభతే పుణ్యం నరో రుద్రాక్షధారణాత్ ॥
ధాత్రీఫల ప్రమాణం య చ్ఛ్రేష్ఠ మేత దుదాహృతం ।
బదరీఫలమాత్రం తు మధ్యమం ప్రోచ్యతే బుధైః ॥
అధమం చణమాత్రం స్యాత్ ప్రక్రియైషా మయోచ్యతే ।
రుద్రాక్షధారణా త్సద్యః సర్వపాపైః ప్రముచ్యతే ॥

## రుద్రాక్ష జప మహిమ

'రుద్రాక్షమాలయా జప్తో మంత్రోఽనంతఫలప్రదః ।
అరుద్రాక్షో జపః పుంసాం తావన్మాత్రఫలప్రదః ॥
యస్యాంగే నాస్తి రుద్రాక్ష ఏకోపి బహుపుణ్యదః ।
తస్య జన్మ నిరర్థం స్యాత్త్రి పుండ్రరహితం యది ॥

రుద్రాక్షం మస్తకే బధ్వా శిరస్స్నానం కరోతి యః ।
గంగాస్నానఫలం తస్య జాయతే నాఽత్ర సంశయః ।
రుద్రాక్షం పూజయే ద్యస్తు సదా తోయాభిషేచనం ॥
యత్ఫలం లింగపూజాయా స్తదేవాఽఽప్నోతి నిశ్చితం ।
రుద్రాక్షమూలం త ద్బ్రహ్మ తన్నాళం విష్ణు కేవచ ॥
తన్ముఖం రుద్ర ఇత్యాహు స్తద్బిందు స్సర్వదేవతాః ।
రుద్రాక్షధారణా త్సద్య స్సర్వపాపైః ప్రముచ్యతే ॥
బ్రాహ్మణో బిభృయా చ్ఛ్వేతాన్ రక్తాన్ రాజా తు ధారయేత్ ।
వై శ్యస్తు బిభృయా త్పీతాన్ కృష్ణాన్ శూద్రస్తు ధారయేత్ ।' (జా. ఉ.)

## రుద్రాక్షమహత్వబోధక మగు అఖ్యాయిక.

పూర్వము కాశ్మీరదేశములో చంద్రసేనుడను మహారాజు ఉండెడివాడు. అతనికి సుధర్ము డను కుమారుడు సుగుణాకరుడు గలడు. అతని అమాత్యునకు సద్గుణశాలి యగు తారకుడను సుతుడు కలదు. వారిరువురును పరస్పరమైత్రితోచెలంగుచుండెడివారు. వారు మహాలక్ష్మీ సంపన్నులయ్యును స్వర్ణాఽఽభరణాదులందు ప్రీతి లేక నిరంతరము భస్మరూపితసర్వాంగు లగుచు, రుద్రాక్షలనే శిరంబున, కంఠమున, బాహువులందును మరియు ఇతరములైన సర్వాంగము లందును ఆభరణములుగ ధరించి, విచిత్రవేషులై సర్వజనాఽఽశ్చర్య కరులుగ సంచరించుచుండెడివారు.

తండ్రులును, ఇరుగుపొరుగు వారును, "సువర్ణాభరణములను ధరించక రుద్రాక్షధారణ మేల?" యని యెంత చెప్పినని వారికి రుచించలేదు. ఇట్లుండ, యొకనాడు ఆ మహారాజు గృహమునకు భాగ్యవశమున పరాశరు దేతెంచెను. వెంటనే చంద్రసేన మహారాజు వారిని యథాశాస్త్రముగ సపర్యలొనర్చి, సుఖాసీనులైన పిదప తన పుత్రుడగు సుధర్ముడును, మంత్రికుమారుడగు తారకుడును రత్నాఽఽభరణాదులందు వాంఛ లేక రుద్రాక్షధారణ మంటే ఆసక్తి గల వారై సంచరించుటను వారికి విన్నవించి, దివ్యదృష్టి గల మహర్షి పుంగవులగు తాము ఈ విధమైన వారి ప్రవృత్తికి కారణమును సెలవిండని ప్రార్థించెను.

వెంటనే ఆ ఋషిపుంగవుడు దివ్యదృష్టిచే వారల పూర్వజన్మ వృత్తాంతమును బరికించి, "ఓ మహారాజా! అభూతపూర్వమగు వీరల పూర్వజన్మవృత్తాంతమును దెలిపెదను. సావధానముగ విను" మని ఈ క్రింది విధముగ చెప్ప దొడంగెను.

పూర్వము నందిగ్రామములో మహానంద యను వేశ్య యుండెడిది. ఆమె సర్వైశ్వర్యములతో తులతూగుచు, స్వేచ్ఛాసంచారిణి యయ్యును. శివభక్తురాలై నిరంతరము

శివునినే ధ్యానించుచు, శివనామపఠనమందా౽౽సక్తితో నుండెడిది. ఆమె ఒక వానరమును, ఒక కుక్కుటమును, పెంచుచుండెడిది. ఆమె కడు సంతసముతో ఆ వానరముకు హస్తముకు కంకణములుగ రుద్రాక్షలను గట్టి, కంఠమాలికగ గూడ రుద్రాక్షల నలంకరించి శిరంబున గూడ రుద్రాక్షలనే కిరీటస్థానీయములుగ జేసి, కుక్కుటమునకు గూడ శిరంబున రుద్రాక్షల నలంకరించి రెండింటిని నృత్త, గీత, వాద్యములచే ప్రేక్షకులాశ్చర్యమందగ నాట్యములు చేయుచుండెడిది.

ఇట్లుండ నొకనాడు పరమశివభక్తుండగు నొక వైశ్యుడు త్రిపుండ్రధారియై హస్తమున అపూర్వరత్నఖచిత మగు కంకణము లను ధరించి, ఆ మహానంద యను వేశ్యగృహమున కేతెంచెను. అంతట నా వారకాంతయు నాతనిని సుఖాసీనుని గావించి కుశల ప్రశ్నానంతరమున ఆ వైశ్యుని కరకంకణములను జూచి, ఆశ్చర్యపడి, "ఆర్యా! ఈ కంకణము లదృష్ట పూర్వములు. ఇట్టి రత్న కంకణములను ఎన్నడును జూచి యుండలేదు. చాల మనోహరముగ నున్నవి. నాకు ఇచ్చెదరా" యని అడిగెను. పిమ్మట నా శైవుడు చిరునగవుతో "దీనికి తగు మూల్యము నిచ్చెదవా?" యని ఆమెను బ్రశ్నించెను. వెంటనే ఆ వేశ్య యువతి, "మహాశయా! మేము గణికలము, పతివ్రతలము గాము, స్వేచ్ఛా చారిణులము. కావున, మూడు రాత్రులు నీకు బత్నిగ నుండుదాన నని బల్కెను.

అనంతర మా వైశ్యపుంగవుడు ఆ వారవనితచే అట్లు ప్రమాణము చేయించి,.తన చేతి రత్నకంకణములు నొసంగుచు, వానితోబాటు ఒక సువర్ణమయ మగు శివలింగమును గూడ నిచ్చి, 'ఈ లింగము నాప్రాణముసుమా! దీనిని బహుభద్రముగ నుంచుము. దానికి హాని కలిగినచో నా ప్రాణహానియే" యని నుడివెను. ఆ వేశ్యవనితయు, నాశివలింగమును నాట్యమందిరమున భద్రముగ నుంచి తన శయ్యా గృహమున కేగెను. అచ్చట నిజకేళీ గృహమున హంసతూలికా తల్పమున మన్మథకేళి విశ్రాంతయై గాఢనిద్ర నొందెను. అర్ధరాత్రమున ఆ నాట్యమందిరము అగ్నిదగ్ధ మగుచు, తీక్ష్ణజ్వాలలు ప్రజ్వరిల్ల, నామె యకస్మాత్తుగ లేచి, ఆమందిరముకడ కేగి, వానరమునకును కుక్కుటమునకును గట్టిన త్రాళ్ల నూడదెంచెను. కాని, ఆ అగ్నికణప్రసారముచే నామె భీతినొంది శివలింగమును మాత్రము దీయకయే పరుగిడెను. గృహ మంతయు సర్వపరికరములతో నిర్మూలముగ దగ్ధమై, శివలింగముకూడ భగ్నమాయెను. దానిని జూచి ఆ వైశ్యశ్రేష్ఠియు, నావారవనితయు మిక్కిలి విచారించిరి.

అనంతరము ఆవైశ్యపుంగవుడు తన ప్రాణసమాన మగు లింగము భగ్న మగుటచే తానుకూడ ప్రాణపరిత్యాగముకు కృతనిశ్చయుడాయెను. అతని యజ్ఞానుసారము ఆమహానంద పట్టణము నకు బహిఃప్రదేశమున చితి నేర్పరుప మని తన యనుచరుల నాజ్ఞాపించెను.

అంతట నాశైవుడు అచట కేగి ప్రజ్వలించుచుండెడి చితికి ముమ్మారు ప్రదక్షిణము గావించి పురజను లెల్లరును చూచుచుండ, శివనామస్మరణతో అగ్నికుండమున ప్రవేశించి దగ్ధుడయ్యెను. పిమ్మట మహానందయు ఆకస్మిక మగు నాతని మరణముచే కడు దుఃఖితురాలై జనసమక్షమున నిట్లు బలికెను.

"ఓ మహాజనులారా! నేను మూడు రాత్రులు ఆశివదీక్షావ్రతునితో ఆ శైవునకు పత్నిగా నుండెదనని ప్రమాణము చేసి యుంటిని. నా దురదృష్టవశమున ప్రథమదివసముననే ఇట్టి విప్లవము చేకూరినది. నా సత్యవచనానుసారము మూడు రాత్రులు ఈతనికి పత్నిని గావున, పత్నికి పతిసహగమనము శాస్త్రసమ్మతము గనుక, నేనుకూడ ఈ చితియందు నా దేహమును దగ్ధము గావించుకొనెదను" అని బల్కి, ఎంతమంది చెప్పినను "నాసత్యవచనమును నే నుల్లంఘన చేయజాల" నని బల్కి, తన సర్వస్వమును దానధర్మములు చేసి, నిశ్చల భక్తితో (శివభక్తురాలగుటచే దృఢభక్తితో తన ఇష్టదైవమగు శివుని ధ్యానించుచు) శివనామమునే జపించుచు అగ్నిలో దుముక నుద్యుక్తురాలయ్యెను.

అంతలో పరమేశ్వరుడు ఆమె నిశ్చలభక్తికి సంతసించి ప్రత్యక్షమై, ఆమెను సహగమనము నుండి నివారించెను. వేశ్యకాంతయు నమ్మహేశ్వరుని నిజరూపంబు దర్శించి, భయచకితురాలై ఆనంద బాష్పములతో నమస్కారవినమ్రయై నిలువబడెను. అనంతరము ఆ మహాదేవుడు మహానందను గూర్చి మృదుమధురము లగు వచనములతో నిట్లు పలికెను.

"ఓ భక్తశిఖామణీ! నీ భక్తికిని, నీసత్యవ్రతమునకును చాల సంతసించితిని. నీ భక్తిని పరీక్షించుటకే నేనిట్లు చేసితిని. నామాయా ప్రభావముచేతనే మందిరము దగ్ధమైనది. శివలింగము కూడ భిన్న మైనది. నీ భక్తిని పరీక్షించుటకు శివవ్రతరూపుడనై వచ్చితిని. వేశ్య వనితలు సమయానుకూలముగ సంభాషించుటయే గాని, సత్యవాగ్మి నులుగ నుండుట దుర్లభము. నీవన్ననో, పరమపవిత్ర చరిత్రురాలవై సత్యవాక్యపరిపాలనమందు దృఢదీక్ష కలదానవై అగ్నిని ప్రవేశించుట కుద్యుక్తురాలవైతివి. నీకు దివ్యభోగములను, ఆయురారోగ్యైశ్వర్య సంతానాదికమును ఇవ్వగలవారము. నీకు కావలసిన కోరికలను కోరుకొనుము నీ కొసగెదను."

ఇట్లు భక్త రక్షణ పరాయణుం డగు నమ్మహేశ్వరుదు బలుక, శివభక్తి పరాయణురాలగు నమ్మహానంద "పరమేశ్వరా! నాకు తుచ్ఛములగు విషయసుఖములందు వాంఛ లేదు. నాకును, నా బంధుమిత్రాదిపరిజనముకును పరమపురుషార్థసాధన మగు తమ పాదశరణ్యము దయచేయు మని కోరగా, నాపరమశివు దనుగ్రహించెను.

నాడు నాట్యశాలాదాహకాలమున వహ్నిజ్వాలల నుంచి తప్పించు కొనిన మర్కట, కుక్కుటములు నానాదేశములు తిరిగి కొంతకాలమునకు మరణించినవి. ఆరెండిటిలో మర్కటము నీకుమారుడుగను, కుక్కటము మంత్రిపుత్రుడుగను ఉద్భవించిరి. పూర్వజన్మయందలి సంస్కారబలముచే వారిరువురును ఈ జన్మమందుకూడ మణిముక్తాద్యాభరణములందు విరక్తులై రుద్రాక్షధారణాసక్తులైరి. ఇంకను శివారాధన చేసి సద్గురుశరణ్యముచే జ్ఞానద్వారా పరమపురుషార్థమగు మోక్షమును పొందగలరు. పూర్వజన్మ యందలి రుద్రాక్షధారణ మహిమచే నిట్టి ఉత్తమోత్తమ జన్మలు వీరలకు సంప్రాప్తము లైనవి.

ఈ విధముగ పరాశరమహర్షి చంద్రసేన మహారాజుకు కుమారుల పూర్వజన్మ మందలి రుద్రాక్షధారణామహత్త్వఫలమును నివేదించి, యాతనిని పరమానందనిమగ్నుని గావించెను.

ఈ ప్రకారము ఉపనిషత్తులందును, స్కాందపురాణాదులందును రుద్రాక్షల మహిమ అత్యధికముగ ప్రతిపాదించబడినది. అందుచే మన పూర్వులు రుద్రాక్షలను నియతముగ ధరించుట, వాటితో జపము చేయుట మున్నగునవి శిష్టాచారప్రాప్తముగ నేటి వరకు వచ్చుచున్నవని తేటతెల్లమగుచున్నది. మరియు, మహా వ్యాధులకు కారణము లగు పూర్వజన్మకృతము లగు పాపములను బారద్రోలి తద్ద్వారా మహావ్యాధినివారకము లని గూడ సుబోధమగుచున్నది.





శ్రీ మహాగణాధిపతయే నమః ।

# వేదసార రత్నావళి

## 13. నమకము.

శ్లో॥ అనంతగుణసంపన్న మనంత భజనప్రియమ్ ।
అనంతరూపిణం వందే గురు మానందరూపిణిమ్ ॥

రుద్రప్రశ్న అనగా నమకము. వేద మంతటిలోను సారభూతమైనది. దీని ప్రయోగము రెండు విధములు: 1. అగ్నిచయన మందు ప్రయోగము, 2. జపహోమార్చనాదుల యందు ప్రయోగము.

### రుద్రశబ్దనిర్వచనము.

1. "రోదయతి సర్వం అంతకాలే ఇతి రుద్రః (రుదేర్ణిలుక్చ) "

తా॥ ప్రళయకాలమందు సంహారముచే సర్వమును రోదనము చేయించువాడు కావున రుద్రుడు. రుద్రశబ్దమున కర్థమును పౌరాణికాదులు అనేక విధములుగ చెప్పుచుండిరి. ఇత ఉత్తర మందు పృషో దరాదిత్వేన అభిమతప్రత్యయవికారా ర్థవిశేష లాభములు రుద్రశబ్దమునకు గమనించవలెను.

2. "రుతౌ నాదాంతే ద్రవతి ద్రావయతీతి నా రుద్రః "

తా॥ ప్రణవోపాసనలో అకార, ఉకార, మకార నాదాత్మక మగు ప్రణవములో అకారాదులందు విరాట్, హిరణ్యగర్భ, అవ్యాకృతములను భావనచేసి, అకారరూపమైన విరాట్స్వరూపమును ఉకారాత్మక మగు హిరణ్యగర్భునందు ప్రవిలాపము చేసి, దానిని మకారాంత్మమగు అవ్యాకృత మందు ప్రవిలాపము చేసి, దానిని నాదమందు ప్రవిలాపనను చేసిన పిమ్మట ఆనాదాంతమందు గోరించువాడు (లేక అంతర్యామి రూపముగ ప్రేరణ చేయువాడు) గాన రుద్రుడు.

3. "రుత్యా వేదరూపయా వాచా ధర్మాదీ— అవలోకయతి ప్రాపయతీతి వా రుద్రః'

తా॥ వేదరూప మగు వాక్కుచే ధర్మాధర్మాదులను తెలియజేయువాడు గావున రుద్రుడు.

4. రుత్ లౌకికీ వాక్; తయా వాచ్య మర్థం ద్రావయతీతి రుద్రః"

తా॥ లౌకిక వాగ్రూపముగ అర్థమును బోధించువాడు రుద్రుడు.

5. "రుత్యా ప్రణవరూపయా స్వాత్మానం ప్రాపయతీతి రుద్రః "

తా॥ ప్రణవరూప మగు వాక్కుచే ప్రణవప్రతిపాద్య మగు పరమాత్మ తత్వమును పొందించువాడు (తెలియజేయువాడు) గావున, రుద్రుడు.

6. "రౌతీతి రుద్రః, రోరూయమాణః ద్రవతి ప్రవిశతి మర్త్యా నితి రుద్రః "

తా॥ ఇచ్చట ప్రణవము వృషభరూపముగ వర్ణింపబడుచున్నది. ప్రణవరూపమగు వృషభము తేజోరూప మగు బ్రహ్మతత్వమును చెప్పుచు మనుష్యులను ప్రవేశించును గనుక రుద్రుడు. 'స ఏష ఇహ ప్రవిష్ట అనఖాగ్రేభ్యః" అను శ్రుతివలన ప్రణవప్రతిపాద్య మగు పరమాత్మ నఖాగ్రపర్యంతము మనుష్యులను ప్రవేశించె నని తాత్పర్యము.

7. 'రుక్ తేజః భూమ్ని నిత్యయోగే వా రప్రత్యయః, వర్ణ వ్యావృత్యా రుద్రః, తేజస్వీత్యర్థః "

తా॥ "రుక్" శబ్దమునకు తేజస్సు అర్థము. అధికతేజస్సు కలవాడను అర్థమందు ర ప్రత్యయము వర్ణవ్యావృత్తిచే 'రుక్' లో 'క' కారమునకు దకారము చేయుటచే 'రుద్రః' అని అయినది.

8. 'రుత్ రోధికా బంధికా మోహికా వా శక్తిః, తద్వాన్ తస్యాః, ద్రావయితా భక్తేభ్య ఇతి రుద్రః '.

తా॥ భక్తుల నుండి జ్ఞాన ప్రతిబంధకము, మోహకము అగు శక్తిని తొలగించువాడు రుద్రుడు.

9. 'రుదం సంసారదుఃఖం ద్రావయతీతి రుద్రః'

తా॥ జ్ఞానప్రదానముచే సంసారదుఃఖమును తొలగించువాడు రుద్రుడు.

10. 'రుతిం శబ్దం రాతి దదాతీతి ప్రాణో రుద్రః'

తా॥ శబ్దమును ఇచ్చునట్టి ప్రాణమే రుద్రుడు. ప్రాణ మున్నపుడే శబ్దము బయలుదేరును గాన, శబ్దప్రదము ప్రాణము.

11. 'రుతిం శబ్దం వేదాత్మానం బ్రహ్మణే దదాతి కల్పాదా వితి రుద్రః' 'యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై' 'ఇతి శ్రుతేః'

తా॥ సృష్ట్యాదియందు హిరణ్యగర్భుని సృజించి, అతనికి వేదములను ఉపదేశించిన వాడు గావున రుద్రుడు.

12. రోదనా ద్రుద్రః

తా॥ పూర్వము దేవతలు అసురులు, యుద్ధమునకు సన్నద్ధు లైనపుడు దేవతలు తమ సంబంధ మగు మణిముక్తాదిరూప మగు ధనమును అగ్నియందుంచి యుద్ధమునకు వెడలిరి. యుద్ధమందు జయ పరాజయములు దైవాయత్తములు గాన, అసురులు మనలను జయించినచో ఈ ధనము మనకు ఆ సమయమున నుపకరించు" నను భావముతో నిట్లు జేసిరి. అనంతరము దేవతలు యుద్ధములో విజయమును పొంది తిరిగి వచ్చుసరికి ఈ అగ్ని ఆ ధనముల నపహరించు తలంపుతో వాటిని తీసికొని పరుగిడ నారంభించెను. దేవత లాతనిని వెంటాడిరి. అప్పుడు దేవత లా సొమ్మును అతనియొద్దనుండి తీసి కొనుటకు సంసిద్ధులు కాగా, ఆ యగ్ని అశక్తుడై బాలునివలె రోదనము చేసెను. "రుద్రో వా ఏష యదగ్నిః" అను శ్రుత్యనుసారము అగ్నియు, రుద్రుడును ఒక్కటియే. "సో_రోదీ ద్య దరోదీత్త ద్రుద్రస్య రుద్రత్వం" అను శ్రుతినిర్వచనానుసారము, రోదనము చేయుటచే రుద్రు డని సిద్ధమైనది.

## నమక మహత్త్వము.

నమకము యొక్క మహత్త్వము, అయజ్ఞ సంయుక్త ప్రయోగము, (ఈ రెండును) శ్రుతి, స్మృతి, పురాణములందు విపులముగ చెప్పబడుచున్నవి. జాబాలోపనిషత్తులో ఈ క్రింది విధముగ దీని మహత్త్వము చెప్పబడుచున్నది.

"అథ హైవం బ్రహ్మచారిణ ఊచుః । కిం జప్యే
నామృతత్వ మశ్నుత ఇతి । బ్రూహీతి సహోవాచ
యాజ్ఞవల్క్యః శతరుద్రీయేణేతి । ఏతాని హ వా అమృ
తస్య నామధేయాని భవంతి ఏతై ర్హ వా అమృతో భవ
తీతి. " (జా. ఉ.)

తా॥ బ్రహ్మచారులు యాజ్ఞవల్క్య మహర్షిని గూర్చి ఈ క్రింది విధముగ ప్రశ్నించిరి.

ప్ర: మానవునకు దేనియొక్క జపముచే మోక్షము లభించును?

జ: శతరుద్రీయముచే (అనగా, నమకముచే) మోక్షము లభించును. మరియు ఈ నమకములోని నామములు మరణరహితు డగు పరమేశ్వరుని నామములు. ఈనామములచే మానవుడు అమృతుడగును.

కైవల్యోపనిషత్తులో ఈ క్రింది విధముగ చెప్పబడినది.

"య శ్శతరుద్రీయ మధీతే సో__గ్నిపూతో భవతి
స్వర్ణస్తేయా త్పూతో భవతి, సురాపానా త్పూతో
భవతి, బ్రహ్మహత్యాయాః పూతో భవతి, కృత్యా
కృత్యా త్పూతో భవతి, సర్వదా సకృద్వా జపే దనేన
జ్ఞాన మాప్నోతి, సంసారార్ణవనాశనం తస్మా దేవం విది
త్వైనం కై వల్యం ఫల మశ్నుతే ।" (కై. ఉ.)

తా॥ శతరుద్రీయమును (నమకమును) అధ్యయనము చేయు మానవుడు గృహదాహాది పాపమునుండి ముక్తుడగును. మరియు, సువర్ణాపహారదోషము, సురాపానము, బ్రహ్మాహత్య, అభిచారము (ప్రయోగము) మున్నగు సమస్త పాపముల నుండియు విముక్తుడగును. నిరంతరముగాని, ఒక్కసారి అయిననుగాని నమకజపము చేసినచో జ్ఞానము కల్గును. సంసార సముద్రమును తరింపజేయును. ఈ మహిమను తెలిసికొని జపము చేయు మానవుడు కైవల్యమును పొందును.

"స్తేయం కృత్వా, గురుదారాంశ్చ గత్వా, మద్యం పీత్వా,
బ్రహ్మహత్యాం చ కృత్వా । భస్మచ్ఛన్నో భస్మశయ్యాశయానో
రుద్రాధ్యాయీ ముచ్యతే సర్వపాపైః " (శాతాతపుడు)

తా॥ చౌర్యము (దొంగిలించుట), గురుదారగమనము, మద్యపానము, బ్రహ్మాహత్య మున్నగు సర్వపాపముల నుండి భస్మ శరీరమంతయు పూసికొని, భస్మశయ్యయందు శయనించుచు నమక పారాయణ చేయువాడు పై పాపముల నుండి విముక్తుడగును.

"సురాపః స్వర్ణహారీ చ రుద్రజాపీ జలే స్థితః ।
సహస్రశీర్షాజాపీ చ ముచ్యతే సర్వ కిల్బిషైః ॥
శుక్రియా__రణ్యకజపో గాయత్ర్యాశ్చ విశేషతః ।
సర్వపాపహరా హ్యేతే రుద్రై కాదశినీ తథా ॥
వేద మేకగుణం జప్త్వా తదహ్నైవ శుద్ధ్యతి ।
రుద్రైకాదశినీం జప్త్వా తదహ్నైవ విశుద్ధ్యతి ॥ (యాజ్ఞవల్క్యుడు)

తా॥ సురాపానము, సువర్ణాపహారము చేసిన దోషములు జలమందుండిన మకజపము, పురుషసూక్త జపము చేసిన వానికి నశించును. మంత్రబ్రాహ్మణ, పెదబ్రాహ్మణ, అరుణాదిజపము, గాయత్రీజపము, ఏకాదశరుద్రము, పురుషసూక్త జపములచే సర్వ

పాపముల నుండి శుద్ధుడగు నని యాజ్ఞవల్క్యుడు చెప్పెను. మరియు, ఒకసారి వేదపారాయణ చేసినచో ఆ రోజుననే శుద్ధుడగును. ఇట్లే ఏకాదశరుద్రముచే కూడ ఆయహస్సునందే శుద్ధుడగును. విశేషించి వేదపారాయణకు, ఏకాదశరుద్రమునకు, ఆ రోజుననే శుద్ధుడగు నని స్మృతికర్త యగు యాజ్ఞవల్క్యుడు చెప్పెను.

## శంఖస్మృతి.

సువర్ణమును దొంగిలించిన దోషమునుండి నమకపారాయణచే ముక్తుడగు నని ఈ క్రింది వచనముచే స్మృతి కర్త యగు శంఖుడు చెప్పెను -

'సువర్ణస్తేనో రుద్రాధ్యాయీ ముచ్యతే ।'

అత్రి, అంగిరస్సులు ఈ క్రింది విధముగా చెప్పిరి.

"ఏకాదశగుణా న్వాపి రుద్రా నావృత్య ధర్మవిత్ ।
మహాపాపై రపి స్పృష్టో ముచ్యతే నాత్ర సంశయః ॥"

తా॥ నమకము పదకొండుసార్లైనను అవృత్తి చేసినచో, మహాపాపకారి యైనను పాపముల నుండి విముక్తుడగును. సంశయము లేదు.

## వాయుపురాణములో నమకమహిమ.

'య శ్చ రుద్రాన్ జపే న్నిత్యం ధ్యాయమానో మహేశ్వరం ।
యశ్చ సాగరపర్యంతాం సశై లవనకాననాం ॥
సర్వాన్నాత్మగుణోపేతాం సువృక్షఫలశోభితాం ।
దద్యా త్కాంచనసంయుక్తాం భూమిం చౌషధిసంయుతాం ।
తస్మా దప్యధికం తస్య సకృ ద్రుద్రజపా ద్భవేత్ ।
మమభావం సముత్సృజ్య యస్తు రుద్రాన్ జపే త్సదా ।
స తే నైవ చ దేహేన రుద్ర స్సంజాయతే ధ్రువం ।
జపే నానేన విప్రేంద్రా నృపాశ్చాన్యే ద్విజాయతః ।

హిత్వైవం కేవలం పాపం గతా శ్శివపురం పురా ।
అహం చ పరమేశస్య సామీప్యం లబ్ధవాం స్తథా ।" ఇతి. (వా.పు.)

నమకం చమకం చైవ పురుషసూక్తం తథైవ చ ।
నిత్యం త్రయం ప్రయుంజానో బ్రహ్మలోకే మహీయతే ॥ (తథా)
నమకం చమకం హోతృాన్పురుషసూక్తం జపే త్సదా ।
ప్రవిశే త్స మహాదేవం గృహం గృహపతి ర్యథా ॥ (తథా)

భస్మదిగ్ధశరీరస్తు భస్మశాయీ జితేంద్రియః ।
సతతం రుద్రజాప్యోసౌ పరాం ముక్తి మవాప్నుతి ।
రోగవా న్పాపవాంశ్చైవ రుద్రం జప్త్వా జితేంద్రియః ।
రోగా త్పాపా ద్వినిర్ముక్తో హ్యతులం సుఖ మశ్నుతే ।

తా॥ ఏ మానవుడు మహేశ్వరుని ధ్యానముచేయుచు నిత్యము నమకపారాయణమును చేయునో, ఆ పురుషునకు సమస్త పర్వతముల తోను, వనములతోను, సమస్త ఫలోపేతములగు వృక్షములతోను, సమస్త ఓషధులతోను, సువర్ణముతోను, సర్వముతోను కూడుకొనిన చతుస్సముద్రపర్యంత మగు భూమిని దానము చేసినదానికంటె అధిక ఫలము లభించును. మరియు, మమకారరహితముగ నిత్యము నమకమును (రుద్రమును) జపము చేయు మానవుడు ఆ దేహముతోనే రుద్రుడగును. దేహపాతానంతరము శివపురమును పొందును. మరియు, నమకమును, చమకమును, పురుషసూక్తమును (ఈ మూడిటిని) నిత్యము పారాయణ చేయువాడు బ్రహ్మలోకములో నివసించును.

మరియు, నమకమును, చమకమును, చిత్తి స్స్రుగిత్యాది హోతృమంత్రములను, నిరంతరము జపించువాడు, గృహయజమానుడు తన గృహమును ప్రవేశించునట్లు, మహాదేవుని ప్రవేశించును.

మరియు, శరీర మంతటను భస్మను ధరించి, భస్మయందు శయనించుచు, జితేంద్రియుడై, నిరంతరము నమకమును జపించు పురుషుడు ముక్తి పొందును.

మరియు, రోగవంతుడు, పాపాత్ముడు, అయినవాడు జితేంద్రియుడై (రుద్రమును), నమకమును జపించినచో సమస్త రోగముల నుంచియు, పాపములనుంచియు ముక్తుడై నిరుపమాన మగు సుఖమును పొందును.

"రహసి కృతానాం మహాపాతకానా మపి శతరుద్రీయం ప్రాయశ్చిత్తం ।" (శంఖుడు.)

తా॥ రహస్యముగా చేయబడిన మహాపాతకములకు గూడ నమకము ప్రాయశ్చిత్త మని శంఖుడు చెప్పెను.

"యస్య రుద్రః ప్రజాం పశూ నాభిమన్యేతోద ఙ్పరేత్య రుద్రాన్ జపం శ్చరే దిత్య యజ్ఞ సంయుక్తః కల్ప ।" (ఆపస్తంబుడు.)

తా॥ ఎవని సంతానమును, పశువులను రుద్రుడు హింసించునో, అతడు ఉదఙ్ముఖుడై రుద్రమును జపించవలెను.

ఇట్లు జాబాల, కైవల్యోపనిషత్తులు, శాతాతపుడు, యాజ్ఞవల్క్యుడు, శంఖుడు, అత్రి, అంగిరసుడు, వాయుపురాణము, ఆపస్తంబుడు మున్నగువారల వచనములవలన నమకము

యొక్క మహత్త్వము వర్ణనాతీత మని తెలియుచున్నది. సమస్త పాపములను, సమస్త దోషములను, సమస్త పీడలను తొలగించి, సమస్త భూదానాదిమహాఫల ప్రాప్తిని, ఐహిక సమస్త భోగముల నిచ్చి ముక్తిని ఇచ్చునని పై శ్రుతి, స్మృతులవలన స్పష్టముగ తెలియుచున్నది. కావుననే మన పూర్వులును, సదాచారసంపన్నులగు శిష్టులును, ప్రతియింటను పంచాయతన పూజ (దేవతార్చన) చేయుచు నమకచమకాదులచే ప్రతి దినము అభిషేకము చేయు నాచారము కలదు.

దేవతార్చన లేనివారల గూడ ప్రతిదినము నమకపారాయణ, ఆలయములలో ఈశ్వర లింగములకు అభిషేకము చేయుట, చేయించుట సదాచారప్రాప్త మగుచున్న సంగతి అందరకును తెలిసిన విషయమే. ఇట్లు చేయుటయే గాక, నిత్యము ఆలయములలో నమక చమకాదులచే స్వామికి అభిషేకము చేయించుచు తద్వారా ఆ గ్రామవాసులకు క్షేమ సంపత్తి కొరకు తరచు ప్రతి గ్రామములోను మన పూర్వులు ఆలయములను స్థాపించిరి. ఆలయము లేని గ్రామమును కుగ్రామముగ భావించెడివారు. ఇట్లు సర్వలోక క్షేమంకర మగు శతరుద్రీయమునకు అయజ్ఞ సంయుక్తము లగు జపహోమార్చ నాభిషేకాదులందు పూర్వోక్తము లగు శ్రుతి, స్మృతి, శిష్టాచారము లచే వినియోగము చూపబడినది.

ఇటుపైన ఈ శతరుద్రీయమునకు యజ్ఞసంయుక్త విని యోగము ప్రదర్శింపబడుచున్నది.

"శతరుద్రీయం జుహోతి జర్తిలయవాగ్వాగ వీధుకయవా గ్వా వా జర్తిలై ర్గవీధుకై స్సక్తుభిః కుసయ సర్పిషా౽జాక్షీ రేణ మృగీక్షీరేణ వా ర్కపర్ణే నోదఙ్ముఖ స్తిష్ఠ న్నుత్త రస్య వక్షస్యో త్త రాపరస్యాగ్ స్రక్త్యాం వికర్ణ్యాగ్ స్వయ మాతృణ్ణాయా మను పరిచారం వా నమస్తే రుద్ర మన్యవ ఇత్యేతాననువాకాగ్ స్త్రైధం విభజ్య జుహోతి । జర్తిలయవాగ్వాదీనా మన్యతమేన కుసయసర్పిమృగీక్షుఖురం మహిషీక్షీర మేషా మన్యతమే నోత్తరా౽పరకోణ సమీపే లౌకికాభి రిష్టకాభిః పీఠం కృత్వా తత్రస్థ ఏవ దక్షిణే నార్కపర్ణేన జుహోతి తస్మిన్నన్యః పయ ఆనయతి... వేణుదండం దీర్ఘవగ్ంశం భిత్వా౽న్తర్గతపర్వస్థలాని ఛిత్వా అగ్రతో౽ర్కపర్ణం బధ్వా ధారయమాణో జుహోతి... సంతతా ధారా ఏతా ననువాకాగ్ స్త్రైధం విభజ్య జుహోతి అపివా ప్రథమా దుపక్రమ్య నమ స్తే రుద్ర మన్యవే నమస్త క్షభ్య స్వాహా । జానుదఘ్నే ధారయమాణో జుహోతి, రథకారే భ్యశ్చ వో నమః – నమ స్స్వాయు ధాయ చ స్వాహా । నాభి దఘ్నే ధారయమాణః సుధన్వనే చ నమః – పరాచీనా ముఖా కృధిస్వాహా । ఆస్యదఘ్నే ధారయమాణః జుహోతి ఆస్యదఘ్న ఏవ సాహస్రాణీత్యాది."

(ఆ. శ్రౌ. సూ.)

అగ్నిచయన మను క్రతువునందు ఇష్టకలచే (ఇటుకలచే) గరుడపక్షి ఆకారముగ (శ్యేనచితి) మంత్రములచే చితిని కూర్చవలెను. అనగా, ఒక్కొక్క మంత్రమును ఉచ్చరించి

ఒక్కొక్క ఇటుకను ఉపధానము చేయవలెను. ఇట్లు ఒక వరుస గరుడపక్షి ఆకారముగ మంత్రములచే ఉపధానము చేసిన (కూర్చిన) చితికి ప్రస్తారమని యాజ్ఞికవ్యవహారము. అనగా, ఒక్కొక్క వరుసను ప్రస్తార మని వ్యవహరింతురు. అనంతరము మరునాడు ఆ వరుసపైన రెండవ వరుస అదే అకారముగ మంత్రభేదముచే ఉపధానము చేయవలెను. ఈ విధముగ మంత్రభేదముచే ఒక వరుసపై మరియొక వరుస చొప్పున 5 వరుసలు ఉపధానము చేయవలెను. ఇట్లు 5 వరుసలుగ ఉపధానము చేసిన గరుడపక్షి ఆకారమగు ఇష్టకానివహమునకు (శ్యేనచితికి). ఇష్టకాసమూహము యొక్క ఊర్ధ్వ ప్రమాణము మోకాలు ఎత్తు (జానుప్రమాణము) ఉండును. ఈ జానుప్రమాణమగు శ్యేన చితికి 'అగ్ని' అను నామచే వ్యవహారము వేదబోధితము.

## శ్యేనచితికి అగ్నినామ నిరూపణము.

ఈ విధమగు శ్యేనచితికి 'అగ్ని' అను నామచే వ్యవహారమును ఈ క్రింది శ్రుతి విమర్శపూర్వకముగ నిర్ణయించినది.

*"బ్రహ్మవాదినో వదంతి య న్మృదా చాద్భి శ్చాగ్ని*
*శ్చీయతే౽థ కస్మా దగ్ని రుచ్యత ఇతి య చ్ఛందోభి*
*శ్చినో త్యగ్నయో వై ఛందాగ్ంసి తస్మా దగ్ని రుచ్య*
*తే౽థో ఇయం వా అగ్ని ర్వైశ్వానరో య న్మృదా*
*చినోతి తస్మా దగ్ని రుచ్యతే ।"* (కృ.య.సం.)

తా॥ ప్రశ్న: లోకములో ఇష్టకలు (ఇటుకలు) మృత్తు జలములచే తయారుచేయబడును. ప్రకృతములో 'అగ్ని' అను పేరు గల ఈ చితిప్రదేశము ఇటుకలచే కూర్చబడును గాన, మృత్తు (మన్ను) ఉదకములచే ఉత్పాదన చేయబడునుగాని అంగారములచేత గాని, జ్వాలల చేత గాని, ఉత్పాదన చేయబడదు గదా! ఇట్లు మృత్తుతోను, నీటితోను తయారుచేయబడిన (ఇటుకలచే కూర్చబడిన) చితికి 'అగ్ని' అను పేరు ఎట్లు వచ్చెను?

జవాబు: లౌకిక ప్రపంచములో గోడలవలె ఈ చితి ప్రదేశము కేవలము మృజ్జలము చేతనే కూర్చబడదు. మరేమన అగ్నివలె ప్రకాశించెడి ఛందోయుక్తము లగు మంత్రములచే కూడ కూర్చబడునుగాన ఛందోద్వారా ఈ చితికి అగ్నిరూపత్వము. మరియు ఈ భూమి వైశ్వా నరాగ్ని రూపము గావున వైశ్వానరాగ్ని రూపమగు మృత్తుచే నిష్పాదిత మైన ఈ చితి అగ్నిరూప మైనది.

భూమికి అగ్నిరూపత్వమును శాస్త్రీయ లౌకిక దృష్టాంతములచే ఈ క్రింది శ్రుతి దృఢపరచుచున్నది -

"ఇయం వా అగ్నిః పంచేష్టక స్తస్మా ద్య దస్యాం
ఖనం త్యభీష్టకాం తృందం త్యభిశర్కరాగ్ం సర్వా వా
ఇయం వయోభ్యో నక్తం దృశో దీప్యతే తస్మా దిమాం
వయాగ్ంసి నక్తం నాధ్యాసతే ।" (కృ.య.సం. 5 కాం. 6ప్ర. 4అను.)

తా॥ ఇప్పుడు అందరిచేతను చూడబడియెడి భూమి పూర్వము ప్రజాపతిచే ప్రౌఢములగు ఐదు ఇష్టకలచేత కూర్చబడిన అగ్ని.

ఈ భూమి అగ్నిరూప మగుటవలన ఈ వృత్తాంతమును గుర్తెరుంగని ప్రాణులు ఈ భూమియందు ఖననము చేసినచో ప్రజాపతిచే ఉపహితమైన (కూర్చబడిన) ఇష్టకను హింసించిన వారగుదురు. అనగా చూర్ణము చేసినవారగుదురు. అట్టి ప్రత్యవాయము వారికి సంభవించును. మరియు ప్రజాపతి చేత ఉపహితమైన గువ్వరాతిని (శర్కరను) గూడ హింసిచింనవారగుదురు. (చూర్ణము చేసినవారగుదురు) అనగా చయనక్రతువులో ఇష్టకలను ఉపధానము చేయునట్లు శర్కరలను (గువ్వరాళ్ళను) కూడా ఉపధానము చేసెదరు. కావున భూమిని త్రవ్విన ప్రాణులు ఇష్టకలను (గువ్వరాతిని) గూడ చూర్ణము చేసినవారగుదురని తాత్పర్యము. ఈ చూర్ణము చేయుట శాస్త్రదృష్టిచే చెప్పిన విషయము.

ఇక లౌకిక దృష్టిచేత భూమికి అగ్నిరూపత్వము చెప్పబడుచున్నది -

ఈ భూమి ప్రజాపతిచే అగ్నిచే దీప్యమానములగు ఛందో మంత్రములచే ఉపహితమైనది గాన, పక్షుల దృష్టిలో ఈ భూమి అంతయు రాత్రిభాగమందు అగ్నివలె దీప్యమాన మగును. (ప్రకాశించును.) గనుకనే రాత్రియందు పక్షులు భూమిని ఆశ్రయించవు. వృక్షాగ్రములనే ఆశ్రయించును.

ఎన్నడో ప్రజాపతి అగ్నిసమాన తేజస్సు గల మంత్రములచే భూమిని ఉపధానము చేయుటచే నేటివరకు ఈ భూమి అగ్నివలె భాసించుచున్నది. అందుచే, మంత్రముల మహిమ ఎంత గొప్పదో దీనివలన స్పష్ట మగుచున్నది.

మానవదృష్టికి గోచరించని విషయములు పక్షుల దృష్టికి గోచరించును గావున, మనుష్య దృష్టికి అగ్నివలె ఎందులకు గోచరించుట లేదు? అను శంకకు తావు లేదు. పగటి భాగమందు అగ్ని ఆదిత్యుని ప్రవేశించు ననియు, రాత్రిభాగమందు అగ్నిని ఆదిత్యుడు ప్రవేశించుననియు అందుచే పగటి భాగమందు ఇండ్లు తగుల బడుచున్నను ధూమమే

కనుపించుననియు, రాత్రిభాగ మందు (అగ్ని, ఆదిత్యుల తేజస్సులు రెండును కలియును గావున) బహుదూర ప్రదేశమందు చిన్నదీప మున్నను ప్రకాశించు ననియు, ఈ దిగువ శ్రుతి బోధించుచున్నది -

*"అగ్నిం వా వాదిత్య స్సాయం ప్రవిశతి । తస్మా*
*దగ్ని ర్దూరా న్నక్తం దదృశే । ఉభే హి తేజసీ సంపద్యేతే*
*ఉద్యంతం వా వాదిత్య మగ్ని రనుసమారోహతి । తస్మా*
*ద్ధూమ ఏవాగ్నే ర్దివా దదృశే ।"* (కృ.య.బ్రా. 2.కాం. 1.ప్ర.)

దీనివలన పక్షుల దృష్టిలో ఈ భూమి రాత్రిభాగముననే అగ్ని వలె ఎందులకు ప్రకాశించును? పగటి భాగమందు గూడ అగ్నివలె ఏల ప్రకాశించుట లేదు? అను శంకకు తావులేదు. పైన చెప్పిన రీతిగ రెండు తేజస్సులును రాత్రియందు కలియునుగాన, భూమి రాత్రియందే అగ్నివలె ప్రకాశించును.

అనుప్రసంగసంగత్యా ఇష్టకలచేత చయనమును (కూర్పును) ఈ క్రింది శ్రుతి ప్రశంసించుచున్నది --

*"బ్రహ్మవాదినో వదంతి య న్మృచ్చాప శ్చాగ్నే*
*రవాద్య మథ కస్మా న్మృదా చాద్భి శ్చాగ్ని శ్చీయత*
*ఇతి య దద్భి స్సంయౌత్యాపో వై సర్వా దేవతాభి*
*రేవై నగ్ం సగ్ం సృజతి యన్మృదా చినోతీయం వా*
*అగ్నిర్వైశ్వానరో గ్నినైవ తదగ్నిం చినోతి ॥"* (కృ.య.సం.5.కాం.7.ప్ర.9.అను.)

తా॥ ప్రశ్న: ఇష్టకలు మృత్తికచేతను జలముచేతను, నిర్మింపబడునుగదా! ఇష్టకారూపములగు మృత్తు, జలము (రెండును) అగ్నికి భక్షణయోగ్యములగు పదార్థములు కావుగదా! అగ్నికి భక్షణ యోగ్యములగు ఆజ్యపురోడాశాదులను విడచిపెట్టి ఇష్టకారూపములగు మృజ్జలములచే చిత్యగ్ని (అగ్ని) ఎందులకు చయనము (కూర్పు) చేయబడుచున్నది?

జవాబు: ఉదకములు అగ్నికి భక్షణయోగ్యములు కావనునది సత్యమే. కాని, ఉదకములు సర్వదేవతారూపములు. కావున, అట్టి ఉదకములతో మృత్తికను మిశ్రణ చేయుటచే, సర్వదేవతలతోను అగ్నిని యోజన చేసినవాడగును (కూర్చినవాడగును).

గమనిక: ఉదకములకు సర్వదేవతారూపత్వము మరియొక ప్రక్రమములో వివరణ చేయబడును. పూర్వము ఇంద్రునకు వృత్రాసురవధలో ఉదకములు సహకరించినవి. అందుచే అవిసర్వదేవతలకు ఉపకారములు గావున సర్వదేవతారూపములు.

అందుచే సర్వదేవతాసంయోజన కొరకు ఉదకములచే చయనముచేయుట యుక్తమే మృత్తు, "ఇయం వా అగ్ని ర్వైశ్వానరః" అను శ్రుత్యనుసారము అగ్నిరూపము గావున, మృద్రూప మగు అగ్నిచే ఇష్టకాచితిరూప మగు ప్రకృత అగ్నిని చయనము చేసినవాడగును.

భావము: వృత్రవధయందు ఉదకములు ఇంద్రునికి సహాయకారులు గావున, సర్వదేవతారూపము లగు ఉదకములతోను, మృద్రూప మగు అగ్నిచేతను తయారు చేయబడిన ఇష్టకలచే చయనము చేయుటచేత సర్వదేవతలతోను, అగ్నితోను చయనము చేయుట యగును గాని కేవలమ్మృత్తి కా జలముల చేత చయనము చేసినట్లు కాదు. కావున, అభక్ష్య పదార్థములతో చయనము చేసినట్లు గాదు. అందుచే, ఇష్టకలతోనే చయనము చేయవలె నని సిద్ధాంతము.

ఈ విధముగ శ్యేనచితికి ప్రసంగానుప్రసంగముగ అగ్నినామను, ఇష్టకలతచే చయనమును, శ్రుతి ప్రదర్శనపురస్సరముగ నిరూపించి, ప్రకృత మగు శ్యేనచితినామక మగు అగ్నికి శతరుద్రీయ హోమమును ఈ క్రింది శ్రుతి విధించుచున్నది -

"రుద్రో వా ఏష యదగ్ని స్స ఏతర్హి జాతో యర్హి
సర్వ శ్చిత స్స యథావ త్సోజాత స్తనం ప్రేప్స త్యేవం
వా ఏష ఏతర్హి భాగధేయం ప్రేప్సతి తస్మై యదా
హుతిం న జుహుయా దధ్వర్యుంచ యజమానంచ
ధ్యాయే చ్ఛతరుద్రీయం జుహోతి భాగధేయే నై వై
నగ్ం శమయతి నార్తి మార్ఛ త్యధ్వర్యు ర్నయజ
మానః ॥"                    (కృ. య. సం. 5. కాం. 4. ప్ర. 3. అను.)

తా॥ ఎప్పుడు చీయమాన మగు (స్థండిలరూప మగు) ఈ అగ్ని 5 ప్రస్తారములు (5 వరుసలు) ఉపధానముచేత (సంపూర్ణచితి నిష్పాదనముచేత) సంపూర్ణముగ చితుడగునో (కూర్చబడినవాడగునో) అప్పుడు (ఈ అగ్ని) ఉత్పన్ను దగును. ఈ విధముగ ఉత్పన్నుడయిన ఈ అగ్నియే రుద్రుడు.

లోకములో ఉత్పన్ను దయిన శిశువు అప్పుడే స్తన్యరసమును పొందే కొరకు ఎట్లు ఇచ్ఛయించునో, అట్లే చితి సంపూర్తి కాలమందు ఉత్పన్నుడైన రుద్రనామకు డగు ఈ అగ్ని తనకు భాగమును కోరును. ఇట్లు భాగమును కోరెడి అగ్నికి (రుద్రునికి) ఏదైన ద్రవ్యమును హోమము చేయకపోయినచో, ఆకలిగొనిన ఆ రుద్రనామకుడగు అగ్ని అధ్వర్యుని, యజమానుని భక్షించేకొరకు ధ్యానము చేయును. అందుచే, తత్పరిహారము కొరకు శతరుద్రీయ (నామకమగు) హోమమును చేయవలెను. 'శతరుద్రీయ' శబ్దములోని శత

శబ్దము 'నూరును) చెప్పదు. అపరిమితమును చెప్పును అందుచే, అనేక రుద్రులను చెప్పెడి అధ్యాయము అని అర్థము. అనగా నమకమని యర్థము. దీనిచేత ఈ చిత్యగ్నికి హోమమును చేసినచో, ఆచిత్యగ్నిరూపుడగు రుద్రుడు తన భాగముచే శాంతించి, అధ్వర్యు, యజమానులను హింసించడు. ఈ క్రింది శ్రుతి హోమద్రవ్యమును విధించుచున్నది -

"యద్గ్రామ్యాణాం పశూనాం పయసా జుహుయా
ద్గ్రామ్యాన్పశూన్ ఛుచార్పయే ద్యదారణ్యానా మార
ణ్యాన్ జర్తి లయవాగ్వా వా జుహుయా ద్గవీధుకయ
వాగ్వా న గ్రామ్యా న్పశూన్ హినస్తి నా౽౽రణ్యాన్ ॥

*(కృ. య. సం. 5. కాం. 4. ప్ర. 3. అను.)*

తా॥ గో, అశ్వ, అజ, అవి, పురుష, గర్దభ, ఉష్ట్రములు ఏడును గ్రామ్య పశువులు. ద్విఖుర, శ్వాపద, పక్షి, సరీసృప, హస్తి, మర్కట, నాదేయములు ఏడును అరణ్య పశువులు. వీటిలో గ్రామ్యపశువుల యొక్క క్షీరములతో హోమము చేసినచో, గ్రామ్య పశువులను సంతాపముతో కూర్చినవాడగును.

ఇదే విధముగ, అరణ్యపశువుల క్షీరములతో హోమము చేసినచో అరణ్య పవువులకు సంతాపము కలుగచేసినవాడగును.

లోకములో మానవుడు అమేధ్యాదులందు ఉమ్మి వేసినచో కంఠము నొప్పి చేయును. అట్లే, సంతాపయుక్తుడగు అగ్నియందు గ్రామ్యారణ్య పవువుల క్షీరములను హోమము చేసినచో, ఆ పశువులకు సంతాపము కలుగునని తాత్పర్యము.

అందుచే జర్తిలలు (అడవి నువ్వులు), గవీధుకములు (అరణ్య గోధుమలు) వీటిలో ఏ ఒకదానియొక్క గంజి చేతనైననూ హోమము చేయవలెను. అట్లు చేసినచో గ్రామ్య పశువులకు, అరణ్యపశువులకు హింస సంభవించదు. ఈ క్రింది శ్రుతి పక్షాంతరమును విధించుచున్నది.

అథో ఖల్వాహు రనాహుతి ర్వై జర్తి లాశ్చ గవీ
ధుకా శ్చేత్యజక్షీరేణ జుహో త్యాగ్నేయీా వా ఏషా
యదజాహుత్యైవ జుహోతి న గ్రామ్యా న్పశూన్
హినస్తి నారణ్యాన్ ।" *(కృ. య. సం. 5. కాం. 4. ప్ర. 3. అను.)*

తా॥ వెనుకటి జర్తిల, గవీధుక, యవాగూహోమపక్షమును నిరాకరించి (నిషేధించి) పక్షాంతరమును శ్రుతి బోధించుచున్నది. మనచే భక్షించుటకు యోగ్యమగు ద్రవ్యము

హోమయోగ్యము. "యదన్నః పురుషో భవతి తదన్నాస్తస్య దేవతాః" అను స్మృత్యనుసారము పురుషుడు ఏ అన్నమును భక్షించునో, ఆ అన్నమునే అతని దేవతలకు హోమము చేయవలెను. ప్రకృతములో జర్తిల, గవీధుక ద్రవ్యములు మనచే అదనయోగ్యములు కావుగావున, వాచేటి హోమము చేయగూడదు. ఇక, ఏ ద్రవ్యముతో హోమము చేయవలెను? అజ క్షీరములతో హోమము చేయవలెను. గ్రామ్యారణ్య పశువుల క్షీరముతో హోమము చేయుట వలన అగ్నిసంతాపము క్షీరముల ద్వారా పశువులకు సంక్రమించు నని ఇదివరలో చెప్పబడినది. అట్లే, మేకపాలతో హోమము చేసినచో మేకకు ఆసంతాపము కలుగదా? యను శంక పై మేకకు సంతాపము లేకపోవుటకు కారణమును ఈ క్రింది శ్రుతి చెప్పుచున్నది.

*"ప్రజాపతి రకామయత ప్రజాయేయేతి స ముఖత*
*స్త్రివృతం నిరమమీాత త మగ్ని ర్దేవతా అజః పవూనాం ।"*

*(కృ. య. సం. 7. కాం. 1. ప్ర. 1. అను.)*

తా॥ ప్రజాపతి ముఖమునుండి అగ్నియు, మేకయు సహోత్పన్నము లగుటచే మేక అగ్ని సంబంధమైనది. కాన, మేకపాలను హోమము చేయుటచే (అగ్ని) తన సంబంధ మగు మేకకు సంతాపమును కలుగజేయదు. మేకపాలు అదనయోగ్య మగు ద్రవ్యము గాన ఆహుతియోగ్యమైన ద్రవ్యము. గ్రామ్యాఽఽరణ్య పశువుల పయస్సులను హోమము చేయుటలేదుగాన, వాటికి హింస కలుగదు.

## అర్కపర్ణము (జిల్లేడి ఆకు) తో హోమము.

*"అంగిరస స్సువర్గం లోకం యంతో్ఽజాయాం*
*ఘర్మం ప్రాసించన్ థ్సా శోచంతీ వర్ణం పరాజిహీత*
*సో్ఽర్కోభవత్త దర్క స్యార్కత్వమర్కపర్ణేన జుహోతి*
*సయోనిత్వాయ ।"* *(కృ. య. సం. 5. కాం. 4. ప్ర. 3. అను.)*

తా॥ యజ్ఞములో 'ప్రవర్గ్య' అను కర్మలో మహావీర మను పాత్ర (మట్టికూజా)లో అతివేడిగా (సంతప్తము) మరగిన ఘృతము ఘర్మము. పూర్వము అంగిరస్సులు స్వర్గలోకమును గూర్చి వెడలుచు, ప్రయాణతొందరలో ప్రమాదవశమున పూర్వోక్త ఘర్మమును మేకయందు (వేడినేతిని) సేచనము చేసిరి (పోసిరి.). ఉష్ణఘృతము పడుటచే ఆ మేక తప్యమానమై (ఒడలుకాలి) అరచుచు, పర్ణసదృశ మగు రోమసంఘమును విడచిపెట్టెను. అనగా, వేడిచమురు పడుటచే తొడుగు ఊడిపడెను. అదియే జిల్లేడిచెట్టుగా మొలచెను. సంస్కృతములో జిల్లేడిని అర్కము అందురు. ఈ పేరు ఎందుకు వచ్చె ననగా, "అర్చ గతి పూజనయోః" అను

ధాతుపాఠానుసారము, అర్చధాతువు పూజనార్థకము. అర్చనీయమైన, (అనగా పూజ్యమైన) ప్రవర్గ్యఘృతమువలనను పూజ్యమగు మేకయొక్క రోమసంఘాతము వలనను ఉత్పన్నమైనది గావున, స్థావరరూపమగు ఈ వృక్షమునకు అర్కము అనునామ సిద్ధమనది. 'అర్క' మనగా పూజ్యమైన వృక్ష మని ఫలితము.

ఈ విధముగ అర్కవృక్షము (జిల్లేడిచెట్టు) పూజ్యమైనది గనుక, అర్కపర్ణముచేత అజాపయస్సును నమకము (శతరుద్రీయము) చేత హోమము చేసినచో, అర్కపర్ణము, అజాపయస్సు ( ఈరెండును) అజ్ఞానశరీరమువలననే ఉత్పన్నము లయినవి. గాన, ఈ రెండిటికిని సయోనిత్వము (అనగా ఒకే కారణమువలన పుట్టుట) సంభవించును. అందుచే, జుహువుతో చేయక, అర్కపర్ణముతో చేయవలెను. ఈ విషయమునే వెనకటి ఆపస్తంబ సూత్రము ("అగ్రతోర్కపర్ణంబధ్వా॥") అని చెప్పినది.

దీర్ఘ మగు వేణుదండమును (వెదురుకఱ్ఱను) రెండుబద్దలుగా చేసి, లోపలి (అంతర్గతములగు) కణుపులను చెక్కి ఆ వెదురుబద్దకు చివరిభాగమునందు (అగ్రమందు) అర్కపర్ణమును కట్టెదరు. దీనిని స్రుక్కు అందురు. దానిని అధ్వర్యుడు పట్టుకొని, చిత్యగ్నికి వాయవ్యదిశయందు లౌకిక ఇష్టకలచేత పీఠము నేర్పరచి, దానియందు అధ్వర్యుడు ఉదఙ్ముఖుడుగ నిలుచుని, శతరుద్రీయ హోమమును చేయవలెను. ఆ వెదురుబద్దలో ఇతరుడు మేకపాలను పోయును. ఆధార, ఆచితిలో ఆఖరున ఉపధానముచేసిన ఇష్టకయందు పడులాగున హోమము చేయవలెను. ఈ విషయములను ఈ దిగువ శ్రుతి బోధించుచున్నది.

*"ఉదఙ్తిష్ఠ — జుహో త్యేషా వై రుద్రస్య ది క్స్వా*
*యా మేవ దిశి రుద్రం నిరవదయతే చరమాయా మిష్ట*
*కాయాం జుహో త్యంతత ఏవ రుద్రం నిరవదయతే ॥"*

*(కృ.య.సం.5.కాం.4.ప్ర.3.అను)*

తా॥ ఉత్తరదిక్కు రుద్ర సంబంధమైనది గావున ఉత్తరదిక్కుగా నిలుచుని హోమము చేయుట చేత, రుద్రసంబంధమైన దిక్కునందే రుద్రుని భాగప్రదానముచే సంతోషపరచినవా డగును. చరమేష్టక యందు హోమము చేత అంత్యప్రదేశమందు రుద్రుని నిస్సారణ చేసి నవాడగును.

ఈ నమకమును మూడు ఖండములుగ విభజించి, హోమము చేయవలసినదిగ ఈ దిగువ శ్రుతి విధించుచున్నది.

*"త్రేధా విభక్తం జుహోతి త్రయ ఇమే లోకా*
*ఇమానేవ లోకాన్ త్సమావ ద్వీర్యాన్ కరోతి ।" (కృ.య.సం.5.కాం.4.ప్ర.3.అను)*

తా॥ ఈ శతరుద్రీయమును, 'నమస్తే రుద్ర మన్యవే" లగా యతు 'నమ స్త క్షభ్య స్స్వాహా" వరకు ఒక ఖండము.

'రథకారేభ్యశ్చ వో నమః' లగాయతు 'నమ స్స్వాయుధాయ చ స్వాహా' వరకు రెండవ ఖండము.

'సుధన్వనే చ నమః' లగాయతు 'పరాచీనా ముఖా కృధి స్వాహా' వరకు మూడవఖండము.

ఇట్లు మూడు ఖండములుగ విభజించి హోమము చేయుట చేత, మూడు లోకములను తుల్యమైన సామర్థ్యము కలవాటినిగా చేయును.

పై విధముగ విభజించి చేయు మూడు ఆహుతులందును హోమ సాధనమగు అర్కపర్ణస్రుక్కును, క్రమముగ, జానుదఘ్నాది ప్రదేశములందు ధరించి హోమము చేయవలసినదిగ ఈ దిగువ శ్రుతి విధించుచున్నది.

'ఇయ త్యగ్రే జుహో త్యతేయత్యథేయతి త్రయ
ఇమే లోకా ఏభ్య ఏవైనం లోకేభ్య శ్శమయతి '॥ (కృ.య.సం. 5.కాం. 4.ప్ర. 3. అను.)

తా॥ న మస్తే రుద్ర మన్యవే.. నమస్త క్షబ్య స్స్వాహా" అను ప్రథమఖండముచే హోమము చేయునపుడు అర్కపర్ణస్రుక్కును జానుప్రమాణదేశమందు (అనగా, మోకాలు ఎత్తున) ధరించి, దానిచే మేకపాలను హోమము చేయవలెను.

"రథకారేభ్యశ్చ వో నమ: .......... నమస్స్వాయుధాయ చ స్వాహా" అను ద్వితీయఖండముచే హోమము చేయునపుడు నాభి ప్రమాణ ప్రదేశమందు (అనగా బొడ్డు ఎత్తున) స్రుక్కును దరించి, దానిచే హోమము చేయవలెను.

"సుధన్వనే చ నమః ............ పరాచీనా ముఖా కృధి స్వాహా" అను తృతీయభాగముచే హోమముచేయునపుడు కంఠప్రమాణ ప్రదేశమందు (అనగా, మెడ ఎత్తున) స్రుక్కును ధరించి, దానిచే హోమము చేయవలెను.

ఇట్లు, జాను, నాభి, కంఠప్రదేశము లందు స్రుక్కును ధరించి హోమము చేయుటచే భూలోక, అంతరిక్ష, స్వర్గలోకములు మూడింటికొరకు, రుద్రరూపుడగు ఈ చిత్యగ్నిని శాంతునిగా చేయును.

ఈ విధముగ "పరాచీనా ముఖాకృధి" వరకు మూడవభాగమును కంఠప్రమాణదేశ మందు స్రుక్కును ధరించి మూడవ హోమమును చేసిన పిమ్మట, "సహస్రాణి సహస్రశో యే రుద్రాః" లగాయతు "య ఏతావంతశ్చ భూయాగ్ంసశ్చ - ధన్వాని తన్మసి" వరకు పది

మంత్రములచే చేయు హోమములను కంఠప్రమాణదేశమందే స్రుక్కును ధరించి చేయవలెను. దీనికి సూత్రము ఈ క్రింద నీయబడినది.

"అస్య దఘ్నే ఏవ సహస్రాణి సహస్రశ ఇతి । దశావతా
నాన్ హుత్వా అన్వారోహన్ జుహోతి 'నమో రుద్రేభ్యో యే
పృథివ్యా' మితి జానుదఘ్నే ధారయమాణః 'నమో రుద్రేభ్యో
యేంతరిక్షే' ఇతి నాభిదఘ్నే, 'నమో రుద్రేభ్యో యే దివి
త్యాస్యదఘ్నే' ఇతి ఏతానేవ యజమానం వాచయిత్వైతా
నేవ - విపరీతా స్న్రత్యవరోహన్ జుహోతి. అసంచరే పశూనా
మర్కపర్ణ ముద్వాసయతి యం ద్విష్యాత్తస్య సంచరే ॥" ఇతి । (ఆ.శ్రౌ.సూ.)

తా॥ పై పదిమంత్రములచే హోమానంతరము 'నమో రుద్రేభ్యో యే పృథివ్యాం' అను మంత్రముచే జానుప్రమాణదేశ మందు స్రుక్కును ధరించి హోమము చేయవలెను. తరువాత, 'నమో రుద్రేభ్యో యేఽంతరిక్షే' అను మంత్రముచే నాభిప్రమాణ దేశమందు స్రుక్కును ధరించి హోమము చేయవలెను. అనంతరము, 'నమో రుద్రేభ్యో యే దివి' అను మంత్రముచే కంఠప్రమాణదేశ, మందు అర్కపర్ణస్రుక్కును ధరించి మూడవ హోమము చేయవలెను.

ఈ పై మూడు మంత్రములచేత అవరోహణక్రమముగ కంఠ, నాభి, జాన, ప్రమాణదేశములందు క్రమముగ స్రుక్కును ధరించి 'నమో రుద్రేభ్యో దివి' అను మంత్రముచే ప్రథమహోమమును, 'నమో రుద్రేభ్యో యేంతరిక్షే' అను మంత్రముచే రెండవహోమమును, 'నమో రుద్రేభ్యో యే పృథివ్యాం' అను మంత్రముచే మూడవ హోమమును చేయవలెను. ఈ విధముగ 'నమో రుద్రేభ్య' ఇత్యాది మంత్ర వినియోగమును ఈ క్రింది శ్రుతి విధించుచున్నది.

*"తిస్ర ఉత్తరా ఆహుతీ ర్జుహోతి షట్ థ్సంపద్యంతే*
*షడ్వా ఋతవ ఋతుభి రేవైనగ్ం శమయతి ॥" (కృ.య.సం. 5. కాం. 4. ప్ర. 3. అను.)*

తా॥ "నమోరుద్రేభ్య" ఇత్యాది మంత్రములకు ఆరోహ ప్రత్యవరోహణములచే ఆరు ఆహుతు లగును. ఈ షట్త్వసంఖ్యచేత ఋతువులు ఆరు గావున, ఋతుసంపత్తిని సంపాదించి ఆ ఆరు ఋతువులచేతను ఈ రుద్రరూప మగు చిత్యగ్నిని శాంతుని చేయును.

పూర్వోత్తరపక్షరీతిగ అనుపరిక్రమణముచే హోమమును ఈ క్రింది శ్రుతి బోధించుచున్నది

"యదను పరిక్రామం జుహుయా దంతరవచారిణగ్ం
రుద్రం కుర్యాదథో ఖల్వాహుః కస్యాం వా హ దిశి

*రుద్రః కస్యాం వే త్యనుపరిక్రామ మేవ హోతవ్య మప*
*రివర్గమేవైనగ్ం శమయతి ॥"* ఇతి (కృ.య.సం. 5.కాం. 4.ప్ర. 3.అను.)

తా॥ అనుక్రమముగ చితికి అంతటను భ్రమణము చేసి హోమము చేసినచో ఆరుద్రుని అగ్నిక్షేత్రముయొక్క మధ్యయందు ప్రవేశించి సంచరించువానినిగా చేయును. అట్లు ప్రవేశించిన రుద్రుడు క్రూరుడు గావున, ఉపద్రవమునే చేయును. అందువలన పరిభ్రమణము చేయతగదు. అని పూర్వపక్షము రాగా, సిద్ధాంతము.

పూర్వపక్షిచే చెప్పబడిన విషయము సంభవించదు. ఎందులకన, ఈ రుద్రుడు అంతటను సంచరించును. ఎప్పుడు ఏదిక్కుయందుండునో ఏ దిక్కునందుండడో ఎవడు తెలిసికొనగలుగును? అందుచే రుద్రుని అన్వేషణ చేయుటకు పరిభ్రమణమును చేసియే హోమము చేయవలెను. అట్లు చేసినయెడల, అంతటను ఎక్కడ ఉన్న రుద్రుని విడచిపెట్టకుండ శాంతుని చేయును. శాంతు డగుటచే చితిక్షేత్ర మధ్యమందు ప్రవేశించి అంతటను సంచరించుచు ఉపద్రవమును చేయడు.

"నమో రుద్రేభ్యో యే పృథివ్యాం" ఇత్యాది ఆరోహమంత్రములచే మూడు ఆహుతలను హోమము చేసినవెంటనే ఆ మంత్రములను యజమానుని చేత చెప్పించవలసినదిగా ఈ క్రింది శ్రుతి బోధించుచున్నది.

*'ఏతా వై దేవతా స్సువర్గ్యాయా ఉత్త మా స్తా*
*'యజమానం వాచయ తాభిరేవైనం వాచయతి తాభి*
*రేవైనగ్ం సువర్గం లోకం గమయతి ॥"* ఇతి. (కృ.య.సం. 5.కాం. 4.ప్ర. 3.అను.)

తా॥ "నమో రుద్రేభ్య" ఇత్యాదియజస్సులచేత చెప్పబడియెడి దేవతలు స్వర్గదేహేతువులు, కావుననే ఉత్కృష్టులు, లేక, చరమ (చివర) మంత్రముచే చెప్పబడుచుండిరిగాన ఉత్తములు. అట్టి దేవతాప్రతిపాదకములగు యజుస్సులను యజమానునిచేత చెప్పించ వలెను. ఇట్లు చెప్పించినచో ఆ దేవతల చేత ఈ యజమానుని స్వర్గలోకమును పొందించును.

అర్కపర్ణపరిత్యాగమునకు దేశమును ఈ క్రింది శ్రుతి విధించుచున్నది -

"యం ద్విష్యాత్తస్య సంచరే పశూనాం న్యస్యేత్
యః ప్రథమః పశు రభితిష్ఠతి స అర్తి మార్ఛతి ॥ఇతి (కృ.య.సం. 5.కాం. 4.ప్ర. 3.అను.)

తా॥ యజమానుడు ఎవనిని ద్వేషించునో ఆ శత్రువు యొక్కపశుసంచరప్రదేశమునందు ఈ అర్కపర్ణమును పరిత్యజించవలెను. ఇట్టి అర్కపర్ణమును ఏ పశువు ఇతర పశువులకంటె ముందుగా పాదముల చేత ఆక్రమించునో, ఆ పశువు మరణించును. ఇది కామ్యపక్షము. నిత్యములో -

"అసంచరే పశూనా మర్కపర్ణ ముద్వాస్య" (ఆ.శ్రౌ.సూ.) అను సూత్రానుసారము పశువులు సంచరించని ప్రదేశమందు ఈ అర్కపర్ణమును పరిత్యజించవలెను.

ఈశతరుద్రీయమునకు రుద్రకల్పములోను, మేరుతంత్రాదులందు అనేక విధములగు అయజ్ఞసంయుక్తప్రయోగములు చెప్పబడినవి. మరియు, మహాపాతకములను తొలగించి సమస్త కోరికలను సిద్ధింపజేయుటకు కామనానుగుణము లగు వివిధ ప్రక్రియలు స్మృత్యాగమపురాణములందు చెప్పబడినవి.

ప్రకృతములో బ్రాహ్మణములో (రుద్రో వా ఏష యదగ్నిః) అని వర్ణితమగు కర్మాంగత్వ బోధన కొరకు శతరుద్రీయప్రశ్నకు అర్థనిరూపణ చేయబడుచున్నది –

*"నమస్తే రుద్ర మన్యవ ఉతోత ఇషవే నమః ।*
*నమస్తే అస్తు ధన్వనే బాహుభ్యా ముత తే నమః ।*

*పదము: నమః । తే ః రుద్ర ః మన్యవే ః ఉతోఇతి । తే ।*
*ఇషవే । నమః నమః । తే ః అస్తు । ధన్వనే । బాహుభ్యా*
*మితిబాహు – భ్యాంఉత । తే । నమః ॥* *(సంహిత 4-5-1)*

హేరుద్ర తే త్వదీయో యో మన్యుః క్రోధః తస్మై
నమోస్తు । స మన్యు రస్మద్వైరిష్వే వప్రసరతు నత్వస్మాసు ।
ఉతో అపిచ తే తవ ఇషవే నమః త్వదీయాయ బాణాయ
నమోస్తు । తథా తే ధన్వనే త్వదీయాయ ధనుషే నమోస్తు ।
ఉత అపిచ తే బాహుభ్యాం త్వదీయాభ్యాంధనుర్బాణోపేతా
భ్యాం హస్తాభ్యాం నమోస్తు । ఏతత్సర్వం వైరిష్వేవ ప్రవ
ర్తతాం । న తు మయీత్యభిప్రాయః । (సా1. భా.)

తా॥ ఈశ్వరునకు ఘోరాశరీరము, శివా శరీరము అను రెండు శరీరములు గలవు. వాటిలో ఘోరాశరీరము, శతరుద్రీయ హోమముచే శాంతిని పొందును. ఈ విషయములో శ్రుతి ఈ క్రింది నీయ బడినది –

*రుద్రో వా ఏష యదగ్ని స్త స్యైతే తనువౌ ఘో*
*రాన్యా శివాన్యా య చ్ఛతరుద్రీయం జుహోతి యైవాస్య*
*ఘోరా తనూ స్తాం తేన శమయతి ॥ ఇతి.* *(కృ.య.సం. 5.కాం. 7:ప్ర. 8.అను.)*

ఈ శ్రుత్యనుసారము చిత్యగ్నిరూపు డగు రుద్రుని ఘోరా శరీరశాంతి కొరకు అగ్నిచయన మను క్రతువులో ఐదు ప్రస్తారములు (ఐదువరుసల ఇటుకలు) పూర్తి అయిన పిమ్మట ఆఖరున ఉపధానము చేసిన చరమేష్టకయందు వెనుక చెప్పిన రీతిని వేఋదండమును

రెండు బ్రద్దలుగ చీరి, అంతర్గతపర్వలు ఛేదించి, అగ్రభాగమున అర్కపర్ణమును (జిల్లేడి ఆకును) కట్టి, ఆస్రుక్కుచేత మేకపాలను హోమము చేయవలెను. శతరుద్రీయమును పూర్వము చెప్పినరీతిని మూడు భాగములుగ విభజించి ఒక్కొక్క భాగముచేత జాను, నాభి, కంఠప్రమాణ దేశములందు ఆస్రుక్కును ధరించి హోమము చేయవలెను.

రుద్రుని ఘోరశరీరము క్రోధ ప్రధానమైనది. కావున, ప్రసన్నతను సంపాదించుటకు నమశ్శబ్దముతో మంత్రము ప్రారంభమైనది.

తా॥ ఓ రుద్రుడా! నీ క్రోధముకొరకు నమస్కారము. లేక, క్రోధరూపుడవగు నీ కొరకు నమస్కారము. నీ క్రోధము మాయందు ప్రవర్తించకుండ మా శత్రువుల యందే ప్రవర్తించుగాక యని తాత్పర్యము. మరియు, ఘోరశరీరము ధనుర్బాణములతో కూడినది గావున, నీ బాణమునకు ధనస్సుకు నమస్కారము. ధనుర్బాణయుక్తము లగు నీ బాహువులకొరకు నమస్కారము. ఈధనుర్బాణాదికము సర్వము మా విషయములో శాంతమగుచు, మా శత్రువులయందే ప్రవర్తించుగాక (అని నమస్కారపూర్వకముగ ప్రార్థన).

*"యాత ఇషు శ్శివతమా శివం బభూవతే ధనుః ।*

*శివా శరవ్యాయా తన తయా నో రుద్ర మృదయ ॥ ఇతి. (2.మం.కృ.య.సం. 4-5-1).*

తా॥ ఓ రుద్రా! అత్యంతము శాంతమగు నీబాణము ఏది కలదో, నీ సంబంధమగు శాంతమైన ధనుస్సు ఏది కలదో, శాంతమైన నీ సంబంధమగు ఏబాణాధారము (అంబులపొది) కలదో, అట్టి ఇషువు, ధనస్సు, బాణాధారములచే మమ్ములను సుఖయుక్తులను చేయుము. నీ బాణాదులు భక్తులయందు ప్రవర్తించక పోవుటచే శాంతములైనవి యని తాత్పర్యము.

*"యా తే రుద్ర శివా తనూ రసోరా పాపకాశినీ ।*

*తయా న స్త నువా శం తమయాగిరి శంతాభిచాకశీహి ।" (3. మం.)*

తా॥ కైలాసపర్వతమునుండి సర్వప్రాణులకు సుఖమును విస్తరింపజేయుచున్న ఓ గిరిశంతా, మాయందు అనుగ్రహమును చేయునట్టిదియు, హింసారూప మగు అనిష్టమును చేయునదియు, అత్యంత సుఖకరమును నగు శరీరమును స్వీకరించి నన్ను సుఖవంతుని చేయుము.

*యా మిషుం గిరిశంతహస్తే బిభర్ష్యస్తవే । శివాం*

*గిరిత్రతాం కురు మాహిగ్ం స్తీ పురుషం జగత్ ।" (4. మం.)*

తా॥ కైలాసపర్వతమును పాలించుచుండెడి (నివాసముగ బహూకరించుచున్న) ఓ రుద్రా! (హేగిరిశంత!), నీవు శత్రువులందు ప్రక్షేపము చేయుటకు హస్తమందు ధరించుచున్న

బాణమును మా విషయములో శాంతమైనదానినిగ చేయుము. మా సంబంధమగు మనుష్యుని, గవాదికమును, హింసించకుము.

శివేన వచసా త్వా గిరిశా__చ్ఛావదా మసి । యథా
న స్సర్వ మి జ్జగ దయక్ష్మగ్ం సుమనా అసత్ ।" (5 మం.)

తా॥ హేగిరిశ ("గిరిరస్యాస్తీతి గిరిశః" లేక, కైలాసమందుదెడివాడా!) పరమమంగళమైన స్తుతిరూప మగు వేదవాక్కుచే నిన్ను పొందేకొరకు ప్రార్థించుచుంటిమి. అభిముఖముగ స్తుతి చేయుచున్నాము. మా సంబంధమైన మనుష్య పశ్వాదిజంగమజాత మంతను రోగరహితముగను, సౌమనస్యోపేతముగను చేయుము.

"అధ్యవోచ దధివక్తా ప్రథమో దైవ్యో భిషక్ ।
అహీగ్ శ్చ సర్వాన్ జంభయన్ త్సర్వాశ్చ యాతుధాన్యః ।" (6 మం.)

తా॥ (రుద్ర విశేషణములు) రుద్రుడు అధివదనసమర్థుడు. అనగా సర్వదేవతల యెదుటను ' ఈ యజమానుడు అందరికంటె యధికుడని' చెప్పగల సమర్థుడు. అతడట్లు చెప్పుటచే యజమానికి సర్వాధిక్యము వెంటనే లభించును. మరియు, సర్వదేవతలలోను ముఖ్యుడును, సర్వదేవతలను పాలించుటకు సమర్థుడును, (రుద్రధ్యానమాత్రముచే సర్వ రోగములు ఉపశమించును గావున) చికిత్సకుడును నగు రుద్రుడు సర్వవ్యాఘ్రాది సర్వఘాతుక జంతువులను, సమస్త రాక్షసజాతులను నశింపజేయుచు, నన్ను సర్వాధికునిగ చెప్పుగాక!

"అసౌ యస్తామ్రో అరుణ ఉత బభ్రుస్సుమంగలః ।
యే చేమాగ్ం రుద్రా అభితో దిక్షు శ్రితా స్సహస్రశో
వైషాగ్ం హేడ ఈమహే ।" (7 మం.)

తా॥ సూర్యమండలవర్తి యగు ఆదిత్యరూపు డగు (రుద్రుడు) ఉదయకాలమందు అత్యంతము రక్తవర్ణుడు. అనంతరము క్రమక్రమ ముగ పింగళాది అనేక వర్ణములతో గూడిన రుద్రుడు నానావర్ణములు గలవాడగుచు, అంధకారాదులను బారద్రోలుటచే అత్యంతమంగళప్రదుడు. అట్టి రుద్రుడును, ఆయన రశ్మిరూపు లగు రుద్రులును, ఈ భూమికి అంతటను ప్రాచ్యాదిదిక్కులందు అనేక సహస్రసంఖ్యాకులుగ నుండిరి.

అట్టి ఆదిత్యరూపుడగు రుద్రుని యొక్కయు, తద్రశ్మిరూపులగు సర్వరుద్రులయొక్కయు క్రోధసదృశ మగు తీక్ష్ణత్వమును భక్తినమస్కారాదికముచే నివారించుకొనుచుంటిమి.

*"అసౌ యో౽వసర్పతి నీలగ్రీవో విలోహితః ।*
*ఉతైనం గోపా అదృశ న్నదృశ న్నుదహార్యః । ఉతైనం*
*విశ్వా భూతాని స దృష్టో మృడయాతి నః ।"* (8 మం.)

తా॥ కాలకూటవిషధారణచే నల్లనైన కంఠము కలవాడును, (లేక, గ్రసంతి ఉదక మితి గ్రీవాః రశ్మయః నీలవర్ణాఃగ్రీవాః రశ్మయః యస్య స నీలగ్రీవః"), నల్లని రశ్ములు గలవాడును నగు రుద్రుడు అత్యంతము ఎఱ్ఱనైనవాడగుచు, ఆదిత్యమండలవర్తియై, ఉదయాస్తమయములను సంపాదించుటకు ప్రవర్తించుచున్నాడు. ఆ రుద్రునకు మండలవర్తిస్వరూపధారణ మందు ప్రయోజనము చెప్పబడుచున్నది. వేదశాస్త్ర సంస్కారరహితులై అజ్ఞులగు గోపులగూడ ఆదిత్యరూపు డగు రుద్రుని చూచుచున్నారు. (పశువులను గ్రామనగ రాదులకు తోలుకొని వెళ్ళుటకై, అస్తమయమునకు పూర్వము, అస్తమయమును పొందుచున్న ఆదిత్యరూపు డగు రుద్రుని చూచుచుండిరి). గొల్లలకంటె అజ్ఞులగు స్త్రీలు గూడ అస్తమయమునకు ముందుగ (పూర్వము ఉదకములను తటాకములనుండి తీసికొనివచ్చునపుడు ఆదిత్యరూపుడగు రుద్రుని చూచుచుండిరి. సూర్యాస్తమయమైన పిదప ఉదకమును తీసికొనివచ్చుట శాస్త్ర నిషిద్ధ మగుట చేతను, అస్తమయ సమయమున సూర్యదర్శనము నిషిద్ధ మగుట చేతను, ఆదిత్యరూపు డగు రుద్రుని చూచుచుండిరి. ఇంతేగాదు, పశు, పక్ష్యాది, సర్వ ప్రాణులు అస్తమయమునకు పూర్వము తమ కులాయములకు చేరుటకు ఆదిత్యుని చూచుచున్నవి.

ఫలితము: కైలాసవర్తి యగు ఈశ్వరరూపము శాస్త్రజ్ఞులకే గోచరించునుగాన, సర్వప్రాణులకు దర్శనమిచ్చుటకు రుద్రుడు ఆదిత్యరూపమును ధరించెనని స్పష్టమగుచున్నది. అట్టి రుద్రుడు మమ్ములను సుఖయుక్తులను చేయుగాక! దీనినిబట్టి, స్త్రీలు నిరంతరము గృహమునందే యుండి గేహీయకృత్యములను నిర్వహించెదరనియు, ఉదకమును తెచ్చుటకే వీధిలోనికి వెళ్ళెదరనియు తెలియుచున్నది.

*"నమో అస్తు నీలగ్రీవాయ సహస్రాక్షాయ మీఢుషే ।*
*అథో యే అస్య సత్వానోఽహం తేభ్యో౽కరం నమః ।"*

తా॥ కాలకూటవిషధారణముచే నల్లని కంఠము గలవాడును, ఇంద్రమూర్తిని ధరించుటచే సహస్రాక్షుడును, పర్జన్యమూర్తి (మేఘ) ధారణముచే వృష్టికర్తయు నైన రుద్రునకు నమస్కారము. మరియు, ఈ రుద్రునకు భృత్యులగు ప్రాణులందఱకును నమస్కారము చేయుచుంటిని.

*"ప్రముంచ ధన్వన స్త్వ ముభయోరార్త్ని యో ర్జ్యాం ।*
*యాశ్చ తే హస్త ఇషవః పరాతా భగవో వప ।"* (10 మం.)

తా॥ పూజ్యుడవును, మహదైశ్వర్యసంపన్నుడవును నగు ఓ రుద్రా! నీవు నీ ధనుస్సుయొక్క అగ్రముల (కోటుల) యందున్న నారిని దింపివేయుము. మరియు నీ హస్తమందున్న బాణములను పరిత్యజించుము.

*"అవతత్య ధను స్త్వగ్ం సహస్రాక్ష శతేషుధే ।*
*నిశీర్య శల్యానాం ముఖా శివో న స్సుమనాభవ ।" (11 మం.)*

తా॥ ఇంద్రరూపుడవై సహస్ర సంఖ్య కల నేత్రములను, కార్త్య వీర్యార్జునరూపముగ శతసంఖ్యాకము లగు అమ్ములపొదులును కల ఓ రుద్రా, ధనుస్సు యొక్క నారిని క్రిందికి దింపి, బాణములయొక్క అగ్రములను ఇషుధులందు క్రిందవైపు కుండునట్లు జేసి, మా విషయములో అనుగ్రహము కలవాడవై శాంతుడ వగుము.

*"విజ్యం ధనుః కపర్దినో విశల్యో బాణవాగ్ం ఉత ।*
*అనేశ న్న స్యేషవ అభు రస్య నిషంగధిః ।" (12. మం.)*

తా॥ జటాజూటమును ధరించిన రుద్రుని యొక్క ధనుస్సు నారి లేనిదై అగుగాక! అమ్ములపొది (ఇషుగతములగు శల్యములు ఇషుధియొక్క ఉదరమందు గోపితములగుటచే) దృష్టిగోచరము కాని శల్యములు కలదై అగుగాక! ఈ రుద్రుని యొక్క బాణములు (ఇషుధియందు నిక్షిప్తములగుచు) హింసించుట కసమర్థము లగుగాక! ఈ రుద్రుని యొక్క ఇషుధి (బాణాధారము) కొంచెము సమర్థమగు గాక! అనగా, గోడయందు కొట్టిన శంకయందు లగ్న మగుటచే బాణములను ధరించుటకే సమర్థ మగుగాక! బాణములను తీయుటకు యోగ్యమ కాకుండనుండవలెను. లేక, ఇషుధి (ఖడ్గకోశము) ఒకానొక ప్రదేశమందుండుటచే ఖడ్గమును ధరించుటకే సమర్థమగుగాక! ఖడ్గాకర్షణయోగ్యము కాకపోవుగాక!

మొదటి అర్థములో ఇషుశబ్దమునకు బాణాధార మని యర్థము. రెండవ అర్థములో ఇషుధశబ్దమునకు ఖడ్గకోశ మని యర్థము.

"యాతే హేతి ర్మీఢుష్టమహస్తే బభూవ తే ధనుః ।
తయాస్మాన్ విశ్వతస్త్వ మయక్ష్మయా పరిబ్భుజ ।" (13 మం.)

తా॥ విశేషముగ సర్వకాలములలోను వర్షించెడి ఓ రుద్రా! నీ సంబంధమగు యే ఆయుధము, నీ హస్తమందు యే ధనుస్సు కలదో అనుపద్రవకారి యగు ఆ ఆయుధముచేతను, అనుపద్రవకారి యగు ఆ ధనుస్సుచేతను నీవు మమ్ములను అంతటను పరిపాలింపుము.

"నమస్తే అస్త్వాయుధాయా__నాతతాయ ధృష్ణవే ।
ఉభాభ్యా ముత తే నమో బాహుభ్యాం తవ ధన్వనే ।" (14. మం.)

తా॥ ఓ రుద్రా! ధనుస్సునందు సంధానము లేకపోవుటచే అప్రసారిత మైనట్టియు, స్వరూపతః హింసించుటకు సమర్థమైన నీ బాణముకొరకు నమస్కారము. మరియు, నీ రెండు బాహువులకును, నీ ధనుస్సునకును నమస్కారము.

"పరి తే ధన్వనో హేతి రస్మాన్ వృణక్తు విశ్వతః ।
అథో య ఇషుధి స్తవారే అస్మ న్ని ధేహి తం ।" (15. మం.)

తా॥ ఓ రుద్రా! నీ ధనుస్సు సంబంధమైన బాణశల్యరూప మగు ఆయుధము అంతట మమ్ములను బాధించకపోవుగాక! మరియు, నీ ఇషుధిని (అనగా బాణాధారమును) మాకు దూరమం దుంచుము. లేక, (అరీణాం సమూహః ఆరం) మాశత్రుసమూహమం దుంచుము.

## ద్వితీయానువాకము.

ప్రథమానువాకముచే రుద్రుని ప్రసాదయుక్తునిగా జేసి, అతని ధనుర్బాణాదిసాధనములను కూడ ఉపసంహరింపజేసి, ఇత ఉత్తరమందు యెనిమిది అనువాకములచే రుద్రుని విశ్వరూపత్వముచే స్తుతి చేసి నమస్కరించుచున్నాడు. వాటిలో మూడు అనువాకములు ఉభయతో నమస్కారమంత్రములు. ఐదు అనువాకములు అన్యతో నమస్కార మంత్రములు.

ప్రథమానువాకములో భగవంతు డగు రుద్రుని యొక్క ప్రధాన భూతమగు శరీరమును, ఇషు, ధనుర్వస్త్రాదులను అనేక ప్రకారములుగ ప్రసాదింప జేసికొని, ఆరుద్రుని యొక్క జగన్నిర్వాహ హేతువు లగు లీలావిగ్రహములను యెనిమిది అనువాకములచే నమస్కారపూర్వకముగ ప్రసాదింప జేసికొనుచున్నాడు. ఇవి అన్నియు, యజుర్మంత్రములే. ఈ ఎనిమిది అనువాకములలోను ఉభయతో నమస్కారమంత్రములు 3 అనువాకములు. ఐదు అనువాకములు అన్యతో నమస్కారమంత్రములు. ద్వితాయానువాకములో పదమూడు మంత్రములు.

"నమో హిరణ్యబాహవే సేనాన్యే దిశాంచ పతయే నమః ।" (1. మం.)

సువర్ణాలంకృతము లైన బాహువులు కలిగినట్టియు, యుద్ధము నందు సేనానాయకు డైనట్టి రుద్రుని కొరకు నమస్కారము. మరియు, దిక్కులకు పాలకుడైన రుద్రునకు నమస్కారము.

"నమో వృక్షేభ్యో హరికేశేభ్యః పశూనాం పతయే నమః ।" (2. మం.)

తా॥ ఆకుపచ్చని రంగుగల ఆకులు అనియెడి కేశములు గల వృక్షరూపులగు రుద్రులకు నమస్కారము. మరియు, పశువులకు పాలకుడగు రుద్రునకు నమస్కారము.

"నమ స్సస్పింజరాయ త్విషిమతే పథీనాం పతయే
నమః ।" (3. మం)

తా॥ బాలతృణమువలె పీతరక్తవర్ణుడైనట్టియు, దీప్తి మంతుడగు రుద్రునకు నమస్కారము. శాస్త్రోక్తదక్షిణోత్తరతృతీయమార్గ ములకు పాలకుడగు రుద్రునకు నమస్కారము.

"నమో బభ్లుశాయ వివ్యాధినే౽న్నానాం పతయే నమః ।" (4. మం.)

తా॥ వృషభవాహనుడైనట్టియు, విద్వేషులను బహువిధములుగ పీడించునట్టి రుద్రునకు నమస్కారము. మరియు అన్నములకు పాలకుడగు (అనగా, అన్నదానముచే జీవులను సంతోషపెట్టువాడగు) రుద్రునకు నమస్కారము.

నమో హరికేశా యోపవీతినే పుష్టానాం పతయేనమః । (5. మం.)

తా॥ నల్లని తలవెంట్రుకలు కలిగినట్టియు, మంగళార్థము యజ్ఞోపవీతమును ధరించిన రుద్రునకు నమస్కారము. సంపూర్ణమగు సద్గుణములు కలవారిని పాలించెడి రుద్రునకు నమస్కారము.

"నమో భవస్య హేత్యై జగతాం పతయే నమః ।" (6 మం.)

తా॥ సంసారార్ణవమును దాటించెడి రుద్రునకు నమస్కారము. సమస్త జగత్తులకు పాలకుడగు రుద్రునకు నమస్కారము.

"నమో రుద్రాయా౽౽తతావినే క్షేత్రాణాం పతయే
నమో నమ స్సూతాయా౽హంత్యాయ వనానాం పతయే
నమః ।" (7,8 మం.)

తా॥ విస్తరింపజేయబడిన ధనుస్సుచే రక్షించెడి రుద్రునకు నమస్కారము. శరీరమునకు పాలకుడు (లేక, అవిముక్తాది పుణ్య క్షేత్రములకు పాలకుడు) అగు రుద్రునకు నమస్కారము. శత్రువులచే హింసించుటకు శక్యము గాని సారధిరూపు డగు రుద్రునకు నమస్కారము. లేక, జగద్యంత్రరూప మగు రథముకు నియంత యగు రుద్రునకు నమస్కారము. (అహ మేవ సర్వ మితి భావః అహంతా తత్ర భవః అహంత్యః) సర్వాత్మత్వరూపు డగు (లేక హింసించుటకు శక్యముగాని) రుద్రునకు నమస్కారము.

"నమో రోహితాయ స్థపతయే వృక్షాణాం పతయే
నమో నమో మంత్రిణే వాణిజాయ కక్షాణాం పతయే
నమో నమో భువంతయే వారి వస్కృతా యౌష ధీనాం
పతయే నమో నమ ఉచ్చైర్ఘోషా యాక్రందయతే పత్తీ
నాం పతయే నమో నమః కృత్స్నవీతాయ ధావతే
సత్వానాం పతయేనమః ।" (9,10,11,12,13 మం.)

తా॥ లోహితవర్ణుడైనట్టియు, ప్రభువగు రుద్రునకు నమస్కారము. వృక్షములకు పాలకుడగు రుద్రునకు నమస్కారము. రాజసభయందు మంత్రాలోచనకుశలడైనట్టియు, వర్తకులకు స్వామియగు రుద్రునకు నమస్కారము. వనగతములైన తరుగుల్మాదులకు పాలకుడైన రుద్రుని కొరకు నమస్కారము.

భూమిని విస్తరింప చేయునట్టియు, వారి వస్కృతాయ, ధనకర్త యగునట్టియు, (లేక, ధనమును సంపాదించువారికి సంబంధియైనట్టియు), సపర్య చేయు భక్తుల ననుగ్రహించువాడును, (అనగా భక్తవత్సలుడైనట్టి) రుద్రునకు నమస్కారము. (అనగా, గ్రామ్యారణ్యరూపములగు ఓషధులకు పాలకుడగు రుద్రునికి నమస్కారము.

యుద్ధకాలమందు గంభీరమగు ధ్వనిచేయునట్టియు, వైరులను (శత్రువులను) రోదనముచేయించునట్టి రుద్రునకు నమస్కారము. పాదచారులగు యోధులకు పాలకుడగు రుద్రునకు నమస్కారము. పత్తులకు (పత్తియనగా, 1 రథము, 1 గజము, 5 పాదచారి పురుషులు 3 గుఱ్ఱములు) పాలకుడగు రుద్రునకు నమస్కారము.

సంపూర్ణ సైన్యమును వేష్టన చేయునట్టియు, పలాయమానులగు శత్రువులకు పృష్ఠభాగమందు పరుగిడి, వారలను తరుమువాడును నగురుద్రునకు నమస్కారము. సాత్వికులకు (అనగా, శరణాగతులకు) పరిపాలకు డగు రుద్రునకు నమస్కారము.

## తృతీయానువాకము.

"నమ స్సహమానాయ నివ్యాధిన అవ్యాధినీనాం
పతయె నమో నమః కకుభాయ నిషంగిణే స్తేనానాం
పతయె నమః ।" (1,2 మం.)

తా॥ విరోధులను తిరస్కరించెడివాడును, అత్యంతము శత్రువులను హింసించెడి వాడును అగు రుద్రునకు నమస్కారము. శూరసేనలకు పాలకుడగు రుద్రునకు నమస్కారము. ప్రధానభూతుడై నట్టియు, ఖడ్గ హస్తుడైనట్టి రుద్రునకు నమస్కారము. గుప్తచోరులకు

పాలకుడగు రుద్రునకు నమస్కారము. రుద్రుడు నటునివలె విలాసగ తత్తద్వేషములను ధరించుచున్నాడు. లేక, రుద్రుడు సర్వజగత్స్వరూపుడు గాన, ఎవరు ఎక్కడ ఏ రూపముగ ఉండుచుండిరో అక్కడ ఆ రూపముగ రుద్రుడే ఉండుచుండెను. రుద్రునకు సర్వాత్మ స్వరూపత్వమును అనుసంధానము చేసికొనుటకు మంత్రములచే ఈ విధముగ చెప్పబడుచున్నది.

స్తేనాదిశరీశములందు రుద్రుడు రెండు ప్రకారములుగ (అనగా, జీవరూపముగను, ఈశ్వరరూపముగను) నివసించును. ఆ రెండింటిలో జీవరూపము స్తేనాదిశబ్దములచే చెప్పబడుచున్నది. (అనగా, వాచ్యార్థము). అదియే శాస్త్రములందు నిషేధింపబడుచున్నది.

స్తేనాదిశరీరములందుండెడి ఈశ్వరరూపము స్తేనాదిశబ్దములచే లక్షణావృత్తిచే చెప్పబడును. అట్టి ఈశ్వరరూపమును అనుసంధానము చేసికొనుటచే మానవునకు సర్వపాపక్షయ మగును. గావున, పరమపురుషార్థ సాధన మగు ఈశ్వర రూపవివక్షచే లక్ష్యార్థబోధకము లగు స్తేనాదిశబ్దములు మంత్రములందు ప్రయోగించబడినవని తాత్పర్యము.

లోకములో చంద్రుని స్వరూపము నెరుగని మానవుడు "అస్మిన్ జ్యోతిర్మండలేక శ్చంద్రమాః" (అనగా ఈ కనుపించెడి నక్షత్రమండలములో చంద్రుడెవ్వడు?) అని ప్రశ్నించగా, అనంతరము 'శాఖాగ్రే చంద్రమాః' (అనగా, చెట్టుకొమ్మయొక్క అగ్రభాగమునందున్న వాడు చంద్రుడు) అని సమాధానము చెప్పిరి. ఇచ్చట, చెట్టుకొమ్మ ఛివర (ద్వారా) చంద్రుడు తెలిసికొనుటకు శక్యుడని తాత్పర్యముగాని, చెట్టుకొమ్మయందు చంద్రుడుండె నని తాత్పర్యము గాదు. అట్లే స్తేనాదిశబ్దములకు రహస్యముగ దొంగిలించెడి మనుష్యశరీరము ముఖ్యార్థము. అముఖ్యార్థమగు జీవశరీరము ద్వారా లోపల అంతర్యామి రూపముగ ప్రేరణ చేసెడి ఈశ్వరస్వరూపమును చెప్పవలెనను తాత్పర్యముతో లక్ష్యార్థ బోధకములగు స్తేనాది శబ్దములు మంత్రములలో చెప్పబడినవి. అనగా, స్తేనాదిజీవవాచక శబ్దముల ద్వారా అంతర్య మందలి ఈశ్వర స్వరూపము మూఢులకు గూడ శీఘ్రముగ తెలిసికొనుటకు అవకాశ ముండు నని స్తేనాదిశబ్దములు శ్రుతిలో చెప్పబడినవి.

"నిషంగిణ ఇషుధిమతే తస్కరాణాం పతయె నమః ।" (3. మం.)

తా॥ ధనుస్సునందు సంధానము చేయుటకు చేతిలో ధరించిన బాణము ఇషువు, పృష్ఠభాగమందు బద్ధమైన బాణాధారము ఇషుధి. ఈ రెండింటితో కూడుకొనిన రుద్రునకు నమస్కారము పూర్వము స్తేనశబ్దముచే రహస్యముగ దొంగిలించెడి వ్యక్తి చెప్పబడినది. ఇచట తస్కరశబ్దముచే ప్రకటమగు అపహరించెడి వ్యక్తి చెప్పబడినది. అట్టి తస్కరులకు పాలకుడగు రుద్రునకు నమస్కారము.

*"పంచతే పరిపంచతే స్తాయూనాం పతయె నమః ।"* *(4. మం.)*

తా॥ యజమానునకు ఆప్తునిగానుండి, ఆతని సంబంధమగు క్రయవిక్రయాది వ్యవహారములందు అప్పుడప్పుడు కొంచెముగా ద్రవ్యముల నపహరించుట వంచనము. సర్వవ్యవహారములలోను అపహరించుట పరివంచనము. తదుభయక్త యగు రుద్రునకు నమస్కారము. గుప్తచోరులు రెండువిధములుగ నుందురు. స్తేనులు, స్తాయువులు, దూరము నుండి వచ్చి, రాత్రులందు తలుపులు పెల్ల గించి, కన్నములను త్రవ్వి, పరులచే తెలియబడకుండ దొంగలించు వాడు స్తేనుడు. యజమానునకు బంధువులుగా నుండి, రాత్రిగాని, పగలుగాని, అవకాశము ననుసరించి, ఇతరులకు తెలియకుండ దొంగిలించువాడు స్తాయువు. అట్టివారికి పాలకు డగు రుద్రునకు నమస్కారము.

*"నమో నిచేరవే పరిచరా యారణ్యానాం పతయె*
*నమః ।"* *(5. మం.)*

తా॥ స్వామి యనగా యజమానుడు. అతని గృహమందే అపహరించుట కవకాశ మెప్పుడు లభించునా యని నిరంతరము సావధానుడై సంచరణస్వభావముగలవాడు నిచేరువు. యజమాని గృహమందేగాక, వీధులు మొదలగు సర్వప్రదేశములందును అపహరించవలెనను బుద్ధితో సంచరించువాడు పరిచరుడు. అట్టి ఉభయ రూపుడగు రుద్రునకు నమస్కారము. బాటసారులను ద్రవ్యాపహారముచే బాధించుటకు నిరంతరము అరణ్యమందుండెడి చోరులు అరణ్యులు. వారిని పాలించెడి రుద్రునకు నమస్కారము.

*"నమ స్సృకావిభ్యో జిఘాగ్ంసద్భ్యో ముష్ణతాం*
*పతయే నమః ।"* *(6. మం.)*

తా॥ వజ్రముచే తమ శరీరమును రక్షించుకొనుచు ప్రాణులను హింసించుట కిచ్ఛయించెడి చోరులు 'జిఘాంసంతః' అని చెప్పబడెదరు. వ్యవసాయము చేయుచు (కృషికులగుచు) యజమానుల ధాన్యముల నపహరించెడి చోరులు 'ముష్ణంతః' అని చెప్పబడెదరు. వారికి పాలకుడగు రుద్రునకు నమస్కారము.

*'నమో౽సిమద్భ్యో నక్తం చరద్భ్యః ప్రకృంతానాం*
*పతయే నమో నమ ఉష్ణీషిణే గిరిచరాయ కులుంచానాం*
*పతయే నమః ।"* *(7, 8 మం.)*

తా॥ ఖడ్గహస్తులై రాత్రులందు (గృహమునుండి బయటకు వచ్చెడి వారలను హింసించుటకు) వీధులందు సంచరించెడి చోరరూపు లగు రుద్రులకు నమస్కారము.

పరులను హింసించియే ధనమును అపహరించెడి చోరులకు పాలకుడగు రుద్రునకు నమస్కారము. 'ఉష్ణీషి' యనగా తలపాగచుట్టుకొనినవాడు. పెద్దమనిషివలె తలపాగ చుట్టుకొని జనమధ్యయందు ప్రవేశించియున్న చోరుడు 'ఉష్ణీషి' పర్వతమందు పుల్లలు వగైరాలను సంపాదించుకొనువారి యొక్క వస్త్రాదికము నపహరించేకొరకు సంచరించెడి చోరుడు గిరిచరుడు. ఈ ఉభయరూపుడగు రుద్రునకు నమస్కారము. పరుల గృహక్షేత్రాది కము నపహరించువారు కులుంచులు. వారికి పాలకుడగు రుద్రునకు నమస్కారము.

*"నమ ఇషుమద్భ్యో ధన్వావిభ్యశ్చ వో నమో నమ*
*అతన్వానేభ్యః ప్రతిదధానేభ్యశ్చ వో నమః ।"* (9, 10 మం.)

తా॥ ప్రాణులను భయపెట్టుటకు హస్తమందు బాణములను ధరించిన చోరులు (ఇషుమంతః), ప్రాణులను భయపెట్టుటకు హస్తమందు ధనుస్సును ధరించిన చోరులు (ధన్వావినః), యొక్క రూపులగు రుద్రులకు నమస్కారము. ధనుస్సునందు నారిని ఆరోపణ చేయు రుద్రమూర్తులగు మీ కొరకు నమస్కారము. ధనుస్సునందు బాణమును సంధానము చేసెడి రుద్రమూర్తులగు మీ కొరకు నమస్కారము.

*'నమ ఆయచ్ఛద్భ్యో విసృజద్భ్యశ్చ వో నమో*
*నమో౽స్యద్భ్యో విధ్యద్భ్యశ్చవో నమో నమ ఆసీ*
*నేభ్య శ్శయానేభ్యశ్చ వో నమో నమ స్స్వపద్భ్యో జాగ్ర*
*ద్భ్యశ్చ వో నమో నమ స్తిష్ఠద్భ్యో ధావద్భ్యశ్చ వో నమో*
*నమ స్సభాభ్య సభాపతిభ్యశ్చవో నమో నమో అశ్వేభ్యో*
*౽శ్వపతిభ్యశ్చ వో నమః ।"* (11. మం.)

తా॥ బాణమును ఆకర్షణ చేయుచుండెడివారును, బాణమును విడచిపెట్టుచున్న వారును, విడచిన బాణమును లక్ష్యపర్యంతము వెళ్లు నట్లు చేయువారును, ఆ బాణమును లక్ష్యమందు ప్రవేశించునట్లు చేయువారును, కూర్చొన్నవారును, పరున్నవారును, నిద్రపోవు చున్నవారును, నిదురనుండి లేచినవారును, నిలబడినవారును, పరుగిడువారును, సముదాయముగ కూర్చొన్నవారును, సంఘాతములకు స్వామిరూపులు, అశ్వవిగ్రహరూపులు (లేక, న విద్యతే శ్వస్తనం ధనం యేషాం తే అశ్వాః) మరునాటికి ధనములేని వారును, అశ్వాధ్యక్ష రూపులును నగు ఓరుద్రులారా! మీ కొరకు నమస్కారము.

## నాల్గవ అనువాకము.

'నమ అవ్యాధినీభ్యో వివిధ్యంతీభ్యశ్చ వో నమో నమ
ఉగణాభ్య స్తృగ్ంహ తీభ్యశ్చ వో నమో నమో గృత్సేభ్యో

*గృత్సపతిభ్యశ్చ వో నమో నమో వ్రాతేభ్యో వ్రాతపతిభ్యశ్చ*
*వో నమో నమో గణేభ్యో గణపతిభ్యశ్చ వో నమో నమో*
*విరూపేభ్యో విశ్వరూపేభ్యశ్చ వో నమో నమో మహ*
*ద్భ్యః క్షుల్లకేభ్యశ్చ వో నమో నమో రథిభ్యో౽రథేభ్యశ్చ*
*వో నమో నమో రథేభ్యో రథపతిభ్యశ్చ వో నమః ।"*

తా॥ అంతటను హింసించుటకు సమర్థములగు స్త్రీమూర్తులు (అవ్యాధినులు), విశేషముగ హింసించుటకు సమర్థములగు స్త్రీమూర్తి విశేషములు (నివిధ్యంతులు), లేక, అంతటను హింసించుటకు సమర్థము లగు రుద్ర సేనాజాతి విశేషములు, (ఇట్టి) రుద్రమూర్తు లగు మీకొరకు నమస్కారము.

ఉత్కృష్టగణరూపము లగు సప్తమాతృకాదులు (ఉగణములు) హింసించెడి దుర్గాద్యుగ్రదేవతలు (తృంహతులు), ఏతద్రూపులగు మీకొరకు నమస్కారము. గృత్సులకు (అనగా, విషయములందు ఆసక్తి గలవారికి) ప్రభువులు గృత్సపతులు, గృత్సులు, గృత్సపతుల రూపులునగు మీ కొరకు నమస్కారము. నానాజాతీయుల సంఘములు వ్రాతములు, వాటికి పాలకులు వ్రాతపతులు, తద్రూపులగు రుద్రులకు నమస్కారము. ఈశ్వరునకు అనుచరులగు భూతవిశేషములు గణశబ్దమున కర్థము. వారికి పాలకులు గణపతులు. తదుభయరూపులగు మీ కొరకు నమస్కారము. నగ్నముండాది వికృతరూపులగు దిగంబరులును, ముండితశిరస్కులు మున్నగువారు (విరూపులు)ను, తురంగవక్త్రులు, గజవక్త్రులు మొదలగు నానావిధరూపధారులగు భృత్యరూపులును నగు మీ కొరకు నమస్కారము. అణిమాద్యైశ్వర్యో పేతులైనట్టియు, తద్రహితులైనట్టియు, రథారూఢులైనట్టియు, రథరహితులైన పదాతిరూపులైనట్టియు మీ కొరకు నమస్కారము. "రథేభ్యః" అను పదమునకు విశేషార్థము 'రథావయవములు". అనగా, మహాభారతములో "హయాంశ్చ చతురో వేదాన్ సర్వదేవమయం రథం" అను శ్లోకానుసారము ఈశ్వరునకు నాలుగు వేదములు గుఱ్ఱము లనియు, సమస్తదేవమయమైన రథమనియు చెప్పుటచే "రథేభ్యః" అను పదమునకు రథావయవభూతులగు దేవతలు అర్థము. తద్రూపులగు మీ కొరకు నమస్కారము.

మరియు, భవిష్యత్పురాణములో నిట్లు చెప్పబడెను.

*"అర్కాబ్జనేమి ర్వేదాశ్వః త్రయస్త్రింశమరున్మయః ।*
*పురారేః కల్పితో దేవై స్స రథో బ్రహ్మ సారథిః ॥" (భ.పు.)*

తా॥ ఈశ్వరుని రథమునకు సూర్యచంద్రులు రథచక్రముల నేమిలు (చక్రములకు పైన ఉండెడి లోహమయ మగు బద్దెవంటి వారు). వేదములు అశ్వములు. ముప్పది మూడు దేవతలు రథము. ఇట్టి రథము ఈశ్వరునకు దేవతలచే కల్పితమైనది.

ఈ భవిష్యత్పురాణవచనానుసారము గూడ దేవమయ మగు రథము ఈశ్వరునకు ప్రతిపాదించబడుటచే రథశబ్దమునకు రథావయవములగు దేవత లర్థము.

రుద్రులారా! పూర్వోక్త సర్వస్వరూపులగు మీ కొరకు నమస్కారము.

"నమ స్సేనాభ్య స్సేనానిభ్యశ్చ వో నమో నమః
క్షత్తృభ్య స్సంగ్రహీతృభ్యశ్చ వో నమో నమ స్తక్షభ్యో
రథకారేభ్యశ్చయ వో నమః కులాలేభ్యః కర్మారేభ్యశ్చ వో
నమో నమః పుంజిష్టేభ్యో నిషాదేభ్యశ్చ వో నమో నమ
ఇషుకృద్భ్యో ధన్వకృద్భ్యశ్చ వో నమో నమో మృగయు
భ్య శ్శ్వనిభ్యశ్చ వో నమో నమ శ్శ్వభ్య శ్శ్వపతి భ్యశ్చ
వో నమః ।" (మం.)

తా॥ సేనారూపముగ క్రీడించువారు, సేనానాయకరూపులు, యష్టిహస్తులగు అంతఃపురాధ్యక్షరూపులు, కోశాధ్యక్షరూపులు, వడ్రంగి రూపులు (శిల్పులు, జాతివిశేషములు), యోగ్యముగ రథములను నిర్మించెడివారు, కుమ్మరులు (కులాలేభ్యః: కుం, మృదం, లాలయంతే; లల ఈప్సాయాం), లోహకారరూపులు, పక్షి పుంజములను కొట్టువారు, మత్స్యములను హింసించువారు (నిషాదులు), యోగ్యముగ బాణకర్తలు, యోగ్యముగ ధనుస్సులను నిర్మించువారు, మృగవ్యాధులు, శునకముల యొక్క కంఠములందు కట్టబడిన త్రాళ్లను ధరించువారు, శునకరూపులు, శునకములను పెంచువారు; ఇన్ని శరీరములందు అంతర్యామిరూపముగ నున్న ఓరుద్రులారా! మీ కొరకు నమస్కారము.

## ఐదవ అనువాకము - అన్యతరతో నమస్కార మంత్రములు.

నమో భవాయ చ రుద్రాయ చ నమ శ్శర్వాయ చ
పశుపతయే చ నమో నీలగ్రీవాయ చ శితికంఠాయ చ
నమః కపర్దినే చ వ్యుప్తకేశాయ చ నమ స్సహస్రాక్షాయ
చ శతధన్వనే చ నమో గిరిశాయ చ శిపివిష్టాయ చ
నమో మీఢుష్టమాయ చేషుమతే చ నమో హ్రస్వాయ
చ వామనాయ చ నమో బృహతే చ వర్షీయ సే చ నమో
వృద్ధాయ చ సంవృధ్వనే చ । నమో అగ్రియాయ చ
ప్రథమాయ చ నమ ఆశవే చాజిరాయ చ నమ శ్శీఘ్రి
యాయ చ శీభ్యాయ చ నమ ఊర్మ్యాయ చావస్వ
న్యాయ చ నమ స్స్రోతస్యాయ చ ద్వీప్యాయ చ ।' (మం.)

తా॥ ప్రాణ్యుత్పాదకుడైనట్టియు, రోదనముకు హేతువగు దుఃఖమును పోగొట్టెడి రుద్రునకు నమస్కారము. పాపమును నశింపజేయువాడును, పశుసమాను లగు అజ్ఞానులను పాలించునట్టి రుద్రునకు నమస్కారము. కాలకూటవిషమును కంఠమందు ధరించుటచే నల్లని కంఠము గలవాడును, తెల్లని మిగిలిన కంఠభాగము గల రుద్రునకు నమస్కారము. పాశుపతాదిరూపముగ జటాజూటము కల్గినవాడును యత్యాదివేషముచే ముండితశిరస్కుడును నగు రుద్రునకు నమస్కారము. ఇంద్రరూపముగ వేయి నేత్రములు కలవాడును, కార్తవీర్యార్జునరూపముగ అనేక ధనుస్సులను ధరించెడి రుద్రునకు నమస్కారము. కైలాసమందు నివసించువాడును, విష్ణుమూర్తి రూపుడును నగు రుద్రునకు నమస్కారము. మేఘరూపముగ అత్యంతము వర్షించువాడును, బాణమును ధరించినట్టియు రుద్రునకు నమస్కారము. శరీరమందు అల్పప్రమాణము కలవాడును, (అనగా పొట్టివాడును), అంగుళులు (వ్రేళ్ళు) మొదలగు అంగములందు అల్పప్రమాణము కలవాడును (మరుగుజ్జువాడును), అయిన రుద్రునకు నమస్కారము. ఆకారముచే ప్రౌఢుడును (అనగా ఉన్నతుడును), గుణములచే సమృద్ధుడును (సద్గుణములు కలవాడును) నైన రుద్రునకు నమస్కారము. అధికవయస్సు కలవాడును, యోగ్యముగ స్తుతులచే వృద్ధి పొందించబడియెడివాడును నగు రుద్రునకు నమస్కారము. జగదుత్పత్తికి పూర్వమందున్నవాడును, సభయందు ప్రధానుడైనట్టియు రుద్రునకు నమస్కారము. సర్వవ్యాపకుడును, గమనకుశలుడును నగు రుద్రునకు నమస్కారము. శీఘ్రముగ ప్రవహించెడి ఉదకములందుండువాడు శీఘ్రగామి. "శీభశబ్దః ఉదకప్రవాహ వాచీ" ఉదకప్రవాహమందున్నట్టి రుద్రునకు నమస్కారము. ప్రవాహమం దున్నవాడును, ద్వీపమందు (జలద్వయ మధ్యవర్తి ప్రదేశమందు) ఉండునట్టియు రుద్రునకు నమస్కారము. తరంగములం దుండువాడును, ధ్వనిరహితము లగు స్థిరజలములందుండు రుద్రునకు నమస్కారము.

## ఆరవ అనువాకము.

"నమో జ్యేష్ఠాయ చ కనిష్ఠాయ చ నమః పూర్వ
జాయ చాపరజాయ నమో మధ్యమా య చాపగల్భా
య చ నమో జఘన్యాయ చ బుధ్నియాయ చ నమ
స్సోభ్యాయ చ ప్రతిసర్యాయ చ నమో యామ్యాయ చ
క్షేమ్యాయ చ నమ ఉర్వర్యాయ చ ఖల్యాయ చ నమ
శ్లోక్యాయ చావసాన్యాయ చ నమో వన్యాయ చ
కక్ష్యాయ చ నమ శ్రవాయ చ ప్రతిశ్రవాయ చ నమ

అశుషేణాయ చాశురథాయ చ నమ శ్శూరాయ
చావభిందతే చ నమో వర్మిణేచ వరూధినే చ నమో బిల్మి
నే చ కవచినే చ నమ శ్రుతాయ చ శ్రుతసేనాయ చ ।" (మం.)

తా॥ విద్యైశ్వర్యాదులచే అధికుడు (జ్యేష్ఠుడు)ను, విద్యైశ్వర్యాదిరహితుడు (కనిష్ఠుడు)ను నగు రుద్రునకు నమస్కారము. సృష్ట్యాదియందు హిరణ్యగర్భరూపుడును, ప్రళయకాలమందు కాలాగ్ని రూపుడును నగు రుద్రునికి నమస్కారము. మధ్యకాలమందు దేవతిర్యగాదిరూపముగ నుత్పన్నుడును, అత్యంత శిశురూపుడును నగు రుద్రునకు నమస్కారము. గోవులు మున్నగు వాటి పృష్ఠభాగమందు వత్సరూపుడుగ నుండువాడును, వృక్షాదుల మూలప్రదేశమందు శాఖాదిరూపముగ నున్నవాడును నగు రుద్రునకు నమస్కారము. పుణ్యపాపమిశ్రమ మగు మనుష్యులలోకమందు వర్తమానుడును, వివాహాదులందు హస్తమందు ధరించబడియెడి రక్షాబంధనయుక్తుడును నగు రుద్రునకు నమస్కారము. యమలోకమందు పాపులను శిక్షించెడి యమరూపుడును, మోక్షప్రదుడును నగు రుద్రునకు నమస్కారము. సర్వసస్యశోభితమగు క్షేత్రమందు ధాన్యవిశేషరూపుడును, ధాన్యవివేచనదేశమందు (కళ్ళమందు) శోధకరూపుడుగ వర్తమానుడును, వైదికమంత్రములచే స్తుతిచేయబడువాడును, ఉపనిషదేక వేద్యుడును, వనమందు వృక్షాదిరూపముగ వర్తమానుడును, పొదలయందు లతాదిరూపముగ నున్నవాడును నగు రుద్రునకు నమస్కారము. శబ్దరూపుడును, ప్రతిధ్వనిరూపుడును, శీఘ్రగామి యగు సేన, రథము గలవాడును, యుద్ధములందు ధైర్యశాలియు శత్రువులను కొట్టెడివాడును, కంచుకోపేతుడును, గృహోపేతుడును నగు రుద్రునకు నమస్కారము. యుద్ధమందు శిరస్సును రక్షించెడి బిలోపేత మగు పదార్థవిశేషము కలవాడును, కవచము కలవాడును, వేదములందు ప్రసిద్ధమైనవాడును, వేదములందు ప్రసిద్ధమైన సేన కలవాడును నగు రుద్రునకు నమస్కారము.

## ఏడవ అనువాకము.

"నమో దుందుభ్యాయ చాహనన్యా చ నమో
ధృష్ణవే చ ప్రమృశాయ చ నమో దూతాయ చ ప్రహి
తాయ చ నమో నిషంగిణే చేషుధిమతే చ నమస్తీక్ష్ణ షవే
చాయుధినే చ నమ స్స్వాయుధాయ చ సుధన్వనే చ
నమ స్స్రుత్యాయ చ పథ్యాయ చ నమః కాట్యాయ చ
నీప్యాయ చ నమ స్సూద్యాయ చ సరస్యాయ చ నమో
నాద్యాయ చ వైశంతాయ చ । నమః కూప్యాయ

చా౽__వట్యాయ చ నమో వర్ష్యాయ చా౽__వర్ష్యాయచ నమో
మేఘ్యాయ చ విద్యుత్యాయ చ నమ ఈ(ధ్రియాయ చాత
ప్యాయ చ నమో వాత్యాయ చ రేష్మియాయ చ నమో
వాస్త వ్యాయ చ వాస్తుపాయ చ ।" (మం.)

తా॥ భేరీయందలి శబ్దరూపుడును, భేరీని కొట్టుటకు సాధనమగు దండమునందు తాడనరూపుడును, యుద్ధమునందు భీతిరహితుడును, శత్రుసేనల వృత్తాంతమును తెలుసుకొనువాడును, వాటివృత్తాంతమును తెలియజెప్పుటయందు నేర్పు గలవాడును, ప్రభువుచే పంపబడిన పురుషరూపుడును నగు రుద్రునకు నమస్కారము. దౌత్యాదికమును కూడ చేసి భక్తులను రక్షించువాడును, ఖడ్గయుక్తుడును, బాణాధార (ఇమధి) యుక్తుడును, తీక్ష్ణము లగు బాణములు కలవాడును, అనేకాయుధములు గలవాడును, భూత రక్షణకొరకు ఆయుధగ్రహణమును గూడ చేయువాడును, శోభనమగు త్రిశూలరూప మగు ఆయుధము గలవాడును, శోభనమైన పినాకరూప మగు ధనుస్సు గలవాడును (సువర్ణవికార మగుటచే ధనుస్సుకు శోభనత్వము) నగు రుద్రునకు నమస్కారము. భృత్యరక్షణ విషయమై అంతటను ఉండి, నియమించుచున్నాడని యర్థము.

పాదములచేతనే సంచరించుటకు యోగ్యమగు ప్రదేశము (స్రుతు)ల వంటి క్షుద్ర మార్గములందు ఉండువాడు (స్రుత్యుడు)ను, రథా౽__శ్వాదిసంచారయోగ్య మగు రాజమార్గములందుండు వాడు (పథ్యుడు)ను, అల్పప్రవాహయోగ్య మగు కుల్యాప్రదేశము లందు జలరూపముగ నుండువాడు (కాట్యుడు)ను, పర్వతాగ్రము నుండి క్రిందుగ జలము పడియెడి ప్రదేశమందు జలరూపముగ నుండువాడు (నీప్యుడు)ను నగు రుద్రునకు నమస్కారము. కర్దమ ప్రదేశమందు (బురద ప్రదేశమందు) జలరూపముగ నుండువాడును, సరస్సులందు జలరూపముగ నుండువాడు (సరస్యుడు) ను, నదీగత జలరూపుడు (నాద్యుడు) ను, అల్పసరస్సునందలి జలరూపుడు (వైశంతుడు)ను, కూపమందలి జలరూపుడు (కూప్యుడు)ను, గోతుల యందలి జలరూపుడు (అవట్యుడు)ను, నగు రుద్రునకు నమస్కారము. వర్షజలరూపుడు (వర్ష్యుడు)ను, వర్షనిరపేక్షసముద్రాదిజల రూపుడు (అవర్ష్యుడు), ను మేఘమందలి జలరూపుడు (మేఘ్యుడు ను, మెరుపుతో సంచరించువాడు (విద్యుత్యుడు)ను, ఉదకము లేకపోవుటచే నిర్మల మగు శరత్కాలమేఘమందుండువాడు (ఈధ్రియుడు)ను, ఎండతోకూడిన వృష్టిజలమందుండువాడు (ఆతప్యుడు)ను నగు రుద్రునకు నమస్కారము. గాలివానలోని జలరూపుడు (వాత్యుడు)ను, ప్రళయకాలమందలి గువ్వరాళ్ళు, పాషాణాదులతో గూడిన వృష్టిజలవిశేషరూపుడు (రేష్మియుడు)ను, గవాశ్వాదిపదార్థములందు తత్కార్య

రూపముగ నుండువాడు (వాస్తవ్యుడును, గృహనిర్మాణార్థమగు భూమియందు తత్పాలకుడుగా నుండువాడు (వాస్తువుడు)ను నగు రుద్రునకు నమస్కారము.

## ఎనిమిదవ అనువాకము.

"నమ స్సోమాయ చ రుద్రాయ చ నమస్తామ్రాయ
చారుణాయ చ నమ శ్శంగాయ చ పశుపతయే చ నమ
ఉగ్రాయ చ భీమాయ చ నమో అగ్రే వధాయ చ దూరే
వధాయ చ నమో హంత్రే చ హనీయ సే చ నమో వృక్షే
భ్యో హరికేశేభ్యో నమ స్తారాయ నమ శ్శంభవే చ
మయోభవే చ నమశ్శంకరాయ చ మయస్కరాయ చ
నమశ్శివాయ చ శివతరాయచ । నమస్తీర్థ్యాయ చ కూల్యా
యచ నమః పార్యాయ చావార్యాయ చ నమః ప్రతర
ణాయచోత్తరణాయ చ నమ ఆతార్యాయ చాలాద్యాయ
చ నమ శ్శష్ప్యా యచ ఫేన్యాయ చ నమ స్సికత్యాయ చ
ప్రవాహ్యాయ చ ।" (మం.)

పార్వతితో కూడినవాడును, రోదనహేతువగు దుఃఖమును నశింపజేయువాడును, ఉదయకాలమందు సూర్యరూపముచే అత్యంతము రక్తవర్ణుడును, ఉదయానంతరము కొంచెము ఎర్రనివాడు (అరుణః)ను, సుఖమును పొందించువాడు (శంగ)ను, పశువులను పాలించువాడు (పశుపతి)ను, నగు రుద్రునకు నమస్కారము. శత్రువులను నశింపజేయుటకు క్రోధయుక్తుడు (ఉగ్రుడు)ను, దర్శన మాత్రముచే విరోధులకు భయహేతువైన వాడు (భీమః)ను, సమీపమునందును దూరమందును నుండు శత్రువును అనాయాసముగ చంపువాడును, లోకమందుఎక్కడ యెవ్వడు విరోధులను జంపునో ఆజంపువానిస్వరూపుడును, ప్రళయకాలమందు విశేషించి అందరను చంపువాడు (హనీయాన్)ను నగు రుద్రునకు నమస్కారము.

(గమనిక: కావుననే గీతలలో బంధువుల నెట్లు జంపవలెనని అర్జునుడు సంకోచించిన పిదప, శ్రీకృష్ణుడు అర్జనునిగూర్చి ఇట్లు పలికెను. "ఓ అర్జునా! నీకంటె పూర్వము వీరందరును నాచే చంపబడిరి. నీవు నిమిత్తమాత్రుడవు")

కేశసదృశము లగు ఆకుపచ్చని రంగు గల ఆకులు గల కల్పవృక్షాదిరూపు డగు రుద్రునకు నమస్కారము. అనగా ఈశ్వరుడు తన కభిమత మగు స్వరూపముచే వృక్షాదిరూపముగ గూడ ఆవిర్భవించి జగత్తును అనుగ్రహించుచున్నాడని తాత్పర్యము.

ప్రణవముచే చెప్పబడియెడి వాడు (తారః)ను, ఐహికసుఖమును పిత్రాదిరూపముచే చేయించువాడును, మోక్షసుఖమును ఆచార్యశాస్త్రాదిరూపముగ చేయించువాడును నగు రుద్రునకు నమస్కారము. కల్మషము లేని వాడును, తన భక్తులను గూడ నిష్కల్మషులను చేయువాడును, ప్రయాగాదితీర్థములందు సన్నిహితుడును, నదీతీరమందు స్థాపన చేయబడిన లింగరూపుడుగ నుండువాడును నగు రుద్రునకు నమస్కారము.

సంసారసముద్రమునకు పరతీరమందు ముముక్షువులచే ధ్యానము చేయబడువాడు (ధ్యేయుడు)ను, సంసారమధ్యమందు (అనగా అర్వాక్తీరమందు) కామ్యఫలముల నిచ్చువాడు (అవార్యుడు) ను, ప్రకృష్ట మగు మంత్రజపాదిరూపముగ పాపములను నశింప జేయువాడును, తత్త్వజ్ఞానరూపముచే సంపూర్ణముగ సంసారమునుండి ఉత్తరించువాడు (ఉత్తరణః)ను నగు రుద్రునకు నమస్కారము. సంసారోత్త రణహేతు వగు తత్వజ్ఞాన మున్నను, దానిని ఉపేక్షించి కామ్యకర్మల అనుష్ఠానముచే సంసారమందు తిరిగి ఆగమనము (ఆతారము)ను గూర్చి తగినవాడును, లేక సంసారపరతీరమును పొందియు కర్మశేషముచే పునరాగమనము ననుగ్రహించువాడు (అతార్యుడు) ను, సంపూర్ణముగ కర్మఫలము ననుభవించు జీవునికి అనుగ్రాహకుడును, గంగాతీరమందలి కుశాంకురాదికమును బాలతృణము (శష్పము)ను గూర్చి తగినవాడును, నదీమధ్యగతమగు ఫేనము (నురుగ)ను గూర్చి తగినవాడును, సికతను గూర్చి తగినవాడును, ప్రవాహమునుగూర్చి తగినవాడును నగు రుద్రునకు నమస్కారము. అనగా ఏ పురుషుడు శ్రద్ధకలవాడగుచు స్నానాధితత్పరుడై నిరంతరము గంగా నదీతీరమం దుండునో అట్టి పురుషరూపుడని శష్పాదిశబ్దములు నాలుగింటికిని అర్థము.

## తొమ్మిదవ అనువాకము.

"నమ ఇరిణ్యాయ చ ప్రపథ్యాయ చ నమః కిగ్ం
శిలాయ చ క్షయణాయచ నమః కపర్దినే చ పులస్తయే చ
నమో గోష్ఠ్యాయ చ గృహ్యాయ చ నమస్తల్ప్యాయచ గేహ్యా
య చ నమః కాట్యాయ చ గహ్వరేష్ఠాయ చ నమో హ్రద
య్యాయ చ నివేష్ప్యాయ చ నమః పాగ్ంసవ్యాయ చ
రజస్యాయ చ నమ శ్శుష్క్యా య చ హరిత్యాయ చ నమో
లోప్యాయ చోలప్యాయ చ నమ ఊర్వ్యాయ చ సూర్మ్యా
యచ నమః పర్ణ్యాయ చ పర్ణశద్యాయ చ నమోపగురమాణా
యచాభిఘ్నతే చ నమ అఖ్ఖిదతే చ ప్రఖ్ఖిదతే చ నమో

*వఃకిరికేభ్యో దేవానాగ్ం హృదయేభ్యో నమో విక్షీ*
*ణకేభ్యో నమో విచిన్వత్కేభ్యో నమ అనిర్హతేభ్యో నమ*
*అమీవత్కేభ్యః ।"* (శ్రు.)

తా॥ చౌడుప్రదేశమం దున్నవాడును, అనేకులచే సంచరించబడు మార్గమందుండు వాడును, శార్కరిలప్రదేశమందు (గువ్వరాళ్ళు గల దేశమందు) ఉండువాడును, నివాసయోగ్య ప్రదేశమం దుండువాడును, జటాజూటము కలవాడును, భక్తులకు పురోభాగమందుండువాడు (పులస్తిః)ను, గోస్థానమం దుండువాడు (గోష్ఠ్యః)ను, గృహమందుండువాడు (గృహ్యః)ను, మంచమందుండువాడు (తల్ప్యః)ను, ప్రాసాదమందుండువాడు (గేహ్యః)ను నగు రుద్రునకు నమస్కారము.

కంటకలతాదులచే ఆవృత మగుటవలన ప్రవేశించుటకు శక్యము కాని ప్రదేశమందుండు వాడు (కాట్యః) ను, విషమ మగు గిరిగుహాదులం దుండువాడు (గహ్వరేష్ఠః)ను, అగాధజలము లందుండువాడును, నీహారజలమందుండువాడును, పరమాణువలందుండువాడును, విస్పష్టధూళియం దుండువాడును, శుష్కకాష్ఠప్రదేశ ములందుండువాడును, ఆర్ద్రప్రదేశమందుండువాడును నగు రుద్రునకు నమస్కారము.

తృణాది రహిత మగు కఠినప్రదేశమందుండువాడును, తృణాదులందుండువాడును, పృథివియందుండువాడును, శోభనతరంగములు గల నదియం దుండువాడును, ఆకులందుండువాడును, ఎండాకుల సమూహమందుండువాడును, నగు రుద్రునకు నమస్కారము. శత్రువుల విషయములో స్వీకృతాయుధము కలవాడు (అపగురమాణః) శత్రువులను చంపువాడును, శత్రువులను కొంచెముగాను, విశేషము గాను ఖేదపరచువాడును నగు రుద్రునకు నమస్కారము.

ఓ రుద్రులారా! దేవతలకు అతిప్రియము లైనవి గనుకనే హృదయభూతము లగునట్టివియు, భక్తులకు ధనముల నిచ్చెడి ఉదారములగు రుద్రావతారరూపులగు మీకొరకు నమస్కారము. మరియు, యెన్నడును క్షయము లేనట్టివియు, భక్తుల కపేక్షితము లగు ఫలవిశేషముల నిచ్చునట్టివియు, నిశ్శేషముగ సమస్తపాపములను నశింపజేయునట్టివియు, విశేషముగ స్థౌల్యమును బొందినట్టివియు నగు మీ రూపములకొరకు నమస్కారము.

## పదవ అనువాకము.

*'ద్రాపే అంధసస్పతే దరిద్ర న్నీలలోహిత । ఏషాం*
*పురుషాణా మేషాం పశూనాం మాభే ర్మారోమో ఏషాం*
*కించ నామమత్ ।"* (1. మం.)

తా॥ పాపాత్ములను నరకప్రదానముచే క్లేశపెట్టువాడవును, భక్తులయొక్క అన్న పరిపాలకుడవును, విరక్తుడవును, కంఠమందు నలుపుయు ఇతరప్రదేశమందు లోహితవర్ణము గలవాడవును నగు ఓ రుద్రుడా! మా సంబంధమగు పురుషుల యొక్కయు, (అనగా పుత్ర పౌత్రాదులయొక్కయు), గోమహిషాదిపశువుల యొక్కయు సమూహమును భయపెట్టకుము. వీటిలో ఏ ఒక్క వస్తువుయు పోకుండునట్లు చేయుము. రోగగ్రస్తము కాకుండ కాపాడుము.

*"యా తే రుద్ర శివా తనూ శ్శివా విశ్వా.హ భేషజీ ।*
*శివా రుద్రస్య భేషజీ తయా నో మృడ జీవసే ।"* *(2. మం.)*

తా॥ ప్రతిదినమును ఔషధమువలె రోగదారిద్ర్యాదికమును నశింపచేయునట్టిదియు, రుద్రునియొక్క తాదాత్మ్యప్రాప్తికి ఔషధమగునట్టిదియు (అనగా జ్ఞానప్రదానముచే జన్మమరణాదిదుఃఖమును నివారింపజేయునట్టిదియు) నీ శివాశరీరము (శాంతస్వరూపమగు శరీరము)చే మమ్ములను జీవింపచేయుటకు సుఖపెట్టుము.

*"ఇమాగ్ం రుద్రాయ తవసే కపర్దినే క్షయద్వీ*
*రాయ ప్రభరామహే మతిం । యథా న శ్శమసద్ద్విపదే*
*చతుష్పదే విశ్వం పుష్టం గ్రామే అస్మి నన్నాతురం ।"* *(3. మం.)*

తా॥ ఏ ప్రకారముగ మా సంబంధమగు పుత్రపౌత్రాదులకు సుఖము సిద్ధించునో మరియు ఈ గ్రామమందు సర్వప్రాణిజాతము సుఖపూర్ణము, ఉపద్రవరహితము ఎట్లగునో, ఆ ప్రకారముగ మేము రుద్రుని కొరకు పూజాధ్యానాదివిషయకమగు బుద్ధిని విశేషముగ పోషించెదము.

బలయుక్తుడును, (అనగా, మా అభీష్టమును సంపాదించుటకు సమర్థుడైన వాడును), జటాజూటము కలవాడును (అనగా, తాపస వేషము కలవాడును), క్షయమును పొందుచున్న శత్రుపురుషుడు కలవాడును (అనగా అన్యథాభానరూప మగు పాపమును నశింప జేయువాడును)నగు రుద్రుని కొరకు పూజాదివిషయకమగు బుద్ధిని సంపాదించుచుంటిమి.

*"మృడా నో రుద్రో తనో మయస్కృధి క్షయ*
*ద్వీరాయ నమసా విదేమ తే । యచ్ఛం చ యో శ్చ*
*మను రాజయజే పితా తదశ్యామ తవ రుద్ర ప్రణీతౌ ।"* *(4. మం.)*

తా॥ ఓ రుద్రుడా! మాకు ఇహలోకమందు పుత్రధనాదిసమృద్ధి చే సుఖమును, పరలోకమందు నిరతిశయానందరూపమగు సుఖమును చే కూర్చుము. మాపాపములను నశింపజేసినట్టి నీకొరకు నమస్కారముచే పరిచర్యను చేసెదము. ఓ రుద్రా! నీ స్నేహాతిశయ

మున్నచో పాలకుడగు ప్రజాపతి మాకు సంపాదించిన సుఖమును, దుఃఖవియోగమును పొందెదము.

'మా నో మహాంత ముత మానో అర్భకం మాన
ఉక్షంత ముత మా న ఉక్షితం । మా నోవధీః పితరం
మోత మాతరం ప్రియా మా న స్త నువోరుద్ర రీరిషః ।' (5. మం.)

తా॥ ఓ రుద్రా! మా సంబంధమగు జ్యేష్ఠుని, కనిష్ఠుని, సేచన సమర్థుడగు యువకుని, గర్భస్థశిశువును హింసించకుము. మరియు, మా తల్లిదండ్రులను, మా ప్రియశరీరములను హింసించకుము.

'మా నస్తోకే తనయే మాన ఆయుషి మా నో గోషు
మా నో అశ్వేషు రీరిషః । వీరా న్మానో రుద్ర భామితో
వధీర్హవిష్మంతో నమసా విధేమ తే ।' (6. మం.)

తా॥ ఓ రుద్రా! సామాన్యముగ నా సంతానవిషయములోను, విశేషించి పుత్రుని విషయములోను, (లేక పుత్రుని విషయములోను పౌత్రుని విషయములోను) హింసను చేయకుము. మరియు, మా ఆయుర్విషయములోను, గోవుల అశ్వముల విషయములోను హింసను చేయకుము. ఓ రుద్రా! నీవు క్రోధగ్రస్తుడ వగుచు మా భృత్యులను హింసించకుము. మేము హవిర్యుక్తుల మగుచునీకొరకు నమస్కారముచే పరిచర్యను చేసెదము.

అరా త్తే గోఘ్న ఉత పూరుషఘ్నే క్షయద్వీ
రాయ సుమ్న మస్మేతే అస్తు । రక్షాచ నో అధి చ దేవ
బ్రూ హ్యధాచ న శ్శర్మ యచ్ఛ ద్విబర్హాః । (7. మం.)

తా॥ ఓ రుద్రా! గోవులను, పుత్రపౌత్రాదిపురుషులను, భృత్యులను హింసించెడి నీ ఉగ్రరూపము దూరమందు ఉండుగాక! సుఖకరమగు నీ శాంతరూపము మాయందుండుగాక! మమ్ములను రక్షించుము. మమ్ములను ఇతర యజమానులకంటె అధికులనుగ చెప్పుము. (నీవు చెప్పినచో మేము అధికులము కాగల మని భావము). మరియు, ఇహ, పరలోకములు రెండింటిలోను వృద్ధి గల నీవు మాకు సుఖమును ఇమ్ము.

'స్తుహి శ్రుతం గర్తసదం యువానం మృగం న భీమ
ముపహత్ను ముగ్రం । మృడాజరిత్రే రుద్ర స్తవానో
అన్యం తే అస్మన్ని వపంతు సేనాః ।' (8. మం.)

తా॥ నాసంబంధమగు ఓ వాగింద్రియమా!, సుప్రసిద్ధుడగునట్టియు, గర్తసదృశమగు హృదయపుండరీకమందు నిరంతరము ఉండునట్టియు, నిత్యయౌవనుడగునట్టియు,

గజవిదారణ కొరకు ఉగ్రముగ సింహమువలె ప్రళయకాలమందు సర్వజగత్తును సంహరించుటకు ఉగ్రుడగునట్టి రుద్రుని స్తుతిచేయుము. ఓ రుద్రుడా! మా మంత్రరూప మగు వాక్కుచే స్తుతి చేయబడుచు దినదినము క్షీణించు చుండెడి మా శరీరమందు సుఖమును చేయుము. నీ సేనలు మా కంటె ఇతరు డగు శత్రువును నశింపజేయుగాక.

*"పరిణో రుద్రస్య హేతి ర్వృణక్తు పరి త్వేషస్య*
*దుర్మతి రఘాయోః । అవస్థిరా మఘవద్భ్య స్తనుష్వ*
*మీఢ్వస్తోకాయ తనయాయ మృడయ ।"* (9. మం.)

తా॥ రుద్రునియొక్క ఆయుధము మమ్ములను అంతటను విడచి పెట్టుగాక. ఎప్పుడును హింసించకపోవుగాక. క్రోధోజ్జ్వలితుడైనట్టియు, ప్రహారరూప మగు పాపమును ఇచ్ఛయించుచుండెడి రుద్రుని యొక్క ఉగ్రబుద్ధి మమ్ములను విడచిపెట్టుగాక. ఓ రుద్రా! విరోధులను నశింప చేయుటకు స్థిరమగు నీ ఉగ్రబుద్ధిని హవిర్లక్షణ మగు అన్నయుక్తులగు యజమానులనుండి అపనీతమైనదానినిగా చేయుము. కామాభివర్షకుడు వగు ఓ రుద్రా! నా పుత్రులకు పౌత్రులకు సుఖమును ఇమ్ము.

*"మీ ఢుష్టమ శివతమ శివో న స్సుమనా భవ । పర*
*మే వృక్ష ఆయుధం నిధాయ కృత్తిం వసాన ఆచర*
*పినాకం బిభ్రదాగహి ।"* (10. మం.)

తా॥ విశేషముగ అభీష్టములను వర్షించువాడా! అత్యంతము శాంతస్వరూపుడ వగు ఓ రుద్రా! మమ్ములను గూర్చి శాంతుడవు, స్నేహయుక్తుడవు అగుము. త్రిశూలాదిరూప మగు నీ ఆయుధమును అత్యున్నత మగు మఱ్ఱి, రావి మున్నగు వృక్షములందు మాకు కనుపించకుండ నుండునట్లు ఉంచి, వ్యాఘ్ర చర్మను మాత్రము ధరించిన వాడవగుచు మాకు అభిముఖముగ రమ్ము. వచ్చునపుడు అలంకారము కొరకు బాణములు లేని ధనుస్సును మాత్రము ధరించి రమ్ము.

*"వికిరిద విలోహిత నమస్తే అస్తు భగవః । యాస్తే*
*సహస్రగ్ం హేతయో__న్య మస్మ న్ని వపంతు తాః ।"* (11. మం.)

తా॥ విశేషముగ భక్తులకు ధనముల నిచ్చువాడా! శ్వేతవర్ణుడా! లేక మిక్కిలి ఎఱ్ఱనివాడా! హే భగవాన్! (షడ్గుణైశ్వర్య సంపన్నుడా) అనగా, సంపూర్ణమగు ఐశ్వర్యము, ఇంద్రియసామర్థ్యము, కీర్తి, లక్ష్మి, జ్ఞానము, వైరాగ్యము ఈ ఆరుగుణములు కలవాడా!), లేక ఉత్పత్తి వినాశములు, భూతములయొక్క గమనాగమనములు, విద్యా__విద్యలు, అను

నారింటిని దెలిసినవాడా! ఓ రుద్రా! నీకు నమస్కారము. ఓ రుద్రా! సహస్రసంఖ్యాకము లగు నీ ఆయుధములు మా శత్రువును నశింపజేయుగాక!

*"సహస్రాణి సహస్రధా బాహువో స్తవ హేతయః ।*
*తాసా మీశానో భగవః పరాచీనా ముఖా కృధి ।" (12. మం.)*

తా॥ ఓ రుద్రా! నీ బాహువులందు ధనుస్సు, ఖడ్గము, త్రిశూలము ఇత్యాది జాతిభేదముచే సహస్రవిధము లగు యే నీ ఆయుధములు గలవో, ఒక్కొక్క జాతియందు సహస్రసంఖ్యాకము లగు యే ఆయుధములు గలవో, ఆ ఆయుధముల యొక్క శల్యములను (ఓడ్గుణైశ్వర్య సంపన్నుడా!) సమర్థుడ వగుచు మాకు పరాఙ్ముఖములుగ జేయుము.

## పదకొండవ అనువాకము.

*"సహస్రాణి సహస్రశో యే రుద్రా అధి భూమ్యాం ।*
*తేషాగ్ం సహస్రయోజనే__వధన్వాని తన్మసి ।" (1. మం.)*

తా॥ భూమియొక్క ఉపరిభాగమందు యేరుద్రులు జాతిభేదముచే సహస్రసంఖ్యాకులు, ఒక్కొక్క జాతియందు సహస్ర సంఖ్యాకులు కలరో, ఆ రుద్రుల యొక్క ధనుస్సులను వెయ్యి యోజనముల దూరమందు దింపివేయబడిన నారి కలవాటినిగ (అవతతజ్యాకములుగ) చేసి స్థాపన చేయుచుంటిమి. (అనగా, స్తుతులచేతను, నమస్కారములచేతను, హవిస్సులచేతను రుద్రులను ప్రసాదింప చేసికొను చున్నామని తాత్పర్యము).

*"అస్మి న్మహ త్యర్ణవే__ంతరిక్షే భవా అధి ।" (2. మం.)*

తా॥ మనచేత చూడబడుచున్న ప్రౌఢమగు సముద్రసమాన మైన అంతరిక్షమందు ఆశ్రయించియున్న రుద్రుల యొక్క ధనుస్సు లను అవతతజ్యాకములుగ చేసి బహుదూరమందు ఉంచుచుంటిమి.

*నీలగ్రీవా శ్శితికంఠా శ్శర్వా అధః క్షమాచరాః ।" (3. మం.)*

తా॥ నీలవర్ణమగు గ్రీవైకదేశము, ప్రదేశాంతరమందు శ్వేత వర్ణమగు కంఠములు గల యేరుద్రులు భూమికి క్రిందుగ పాతాళ లోకములందు గలరోవారి ధనుస్సులను అవతతజ్యాకములుగ జేసి బహుదూరమందుంచుచుంటిమి.

*"నీలగ్రీవా శ్శితికంఠా దివగ్ం రుద్రా ఉపశ్రితాః ।" (4. మం.)*

తా॥ నీలగ్రీవులు, శితికంఠులు, అగు యేరుద్రులు స్వర్గమందుండిరో, వారి ధనుస్సులను అవతతజ్యాకములగ జేసి బహుదూరమందుంచుచుంటిమి.

'యే వృక్షేషు సప్పింజరా నీలగ్రీవా విలోహితాః ' (5. మం.)

తా॥ పృథివ్యాదిలోకములందువలెనే వృక్షములందు కూడ రుద్రులు గలరు. వారిలో కొందరు బాలతృణమువలె పింజరవర్ణము గలవారు. కొందరు నల్లని కంఠైకదేశము గలవారు. కొందరు అధికముగ ఎర్రని రంగు కలవారు. అట్టి రుద్రుల ధనుస్సులను అవతత జ్యాకములుగ జేసి బహుదూరమందుంచుచుంటిమి.

'యే భూతానా మధిపతయో విశిఖాసః కపర్దినః ' (6. మం.)

తా॥ అంతర్హితశరీరు లగుచు మనుష్యులకు ఉపద్రవమును చేసెడి గణవిశేషములు భూతశబ్దమున కర్థము. అట్టి భూతగణముల కధిపతులగు రుద్రులలో కొందరు ముండిత శిరస్కులు, కొందరు జటా బంధములు కలవారు. వారియొక్క ధనుస్సులను అవతతజ్యాకములుగ జేసి బహూదూరమం దుంచుచుంటిమి.

'యే అన్నేషు వివిధ్యంతి పాత్రేషే పిబతో జనాన్ ।

తా॥ ఏ రుద్రులు ప్రాణులచే భుజించబడియెడి అన్నములందు గూఢముగ నుండి జనులను విశేషముగ ధాతువైషమ్యముచే బాధింతురో, మరియు పానము చేయదగిన (పాతవ్యములు) ఉదకము క్షీరములు మున్నగు ద్రవపదార్థములందు గూఢముగ నుండి పానము చేయువారలను విశేషముగ బాధింతురో అట్టి రుద్రుల ధనుస్సులను అవతతజ్యాకములు జేసి బహుదూరమందుంచుచుంటిమి.

'యే పథాం పథి రక్షయ ఐలబృదా యవ్యుధః' (8. మం.)

తా॥ ఏ రుద్రులు లౌకికవైదిక సర్వమార్గములను రక్షించెదరో, అన్నదానముచే పోషింతురో, శత్రువులతో యుద్ధము చేయుదురో అనగా శత్రువియోజకులో, మా అనిష్టములను నివారింతురో, అట్టి రుద్రుల ధనుస్సులను అవతతజ్యాకములుగ జేసి బహుదూరమందుంచుచుంటిమి.

'యే తీర్థాని ప్రచరింతి సృకావంతో నిషంగిణః' (9. మం.)

తా॥ యేరుద్రులు కాశీ, ప్రయాగ మున్నగు తీర్థములను రక్షించుటకు తీక్ష్ణాగ్రములగు ఆయుధ విశేషమును కొరడాలు వగైరాలను ధరించుచు సంచరింతురో, మరికొందరు ఖడ్గయుక్తులగుచు సంచరింతురో అట్టి రుద్రుల ధనుస్సులను అవతతజ్యాకములుగ జేసి బహుదూరమందుంచుచుంటిమి.

'య ఏతావంతశ్చ భూయాగ్ంసశ్చదిశో రుద్రా వితస్థికే
తేషాగ్ం సహస్రయో జనేవ ధన్వాని తన్మసి ॥' (10. మం.)

తా॥ "సహస్రాణి సహస్రశః" మొదలు "యే తీర్థాని" వరకు ఉండెడి మంత్రజాతముచే చెప్పబడిన రుద్రులు యెవరు గలరో, వీరి కంటె అధిక సంఖ్యాకులగు అనేకరుద్రులు సర్వదిక్కులను వ్యాపించి యుండిరో, ఈ రుద్రులందరియొక్క ధనుస్సుల నారులను దింపి బహుసహస్రయోజనపరిమిత దూరదేశమందు స్థాపన చేయుచుంటిమి.

## మూడు యజుర్మంత్రములు.

*"నమో రుద్రేభ్యో యే పృథివ్యాం యేషా మన్న*
*మిషవః నమో రుద్రేభ్యో యేంతరిక్షే యేషాం వాత ఇషవః*
*నమో రుద్రేభ్యో యే దివి యేషాం వర్ష మిషవ స్తేభ్యో*
*దశ ప్రాచీ ర్దశ దక్షిణా దశ ప్రతీచీ ర్దశోదీచీ ర్దశోర్ధ్వా*
*స్తే భ్యో నమస్తే నో మృడయంతు తే యం ద్విష్మో*
*యశ్చ నో ద్వేష్టి తం వో జంభే దధామి ।"* (మం.)

పృథివ్యాదిలోక భేదముచేతను, అన్నవాతాది ఇషుభేదముచేతను మూడు యజుర్మంత్రము లయినవి.

*"నమో రుద్రేభ్యో యే పృథివ్యాం ।"* (1. మం.)

తా॥ పృథివీలోకమందు ఏ రుద్రులు కలరో, ఆ రుద్రుల మధ్య యే రుద్రవిశేషములకు అన్నమే బాణములో, (అనగా అపథ్యాన్న భక్షణమందు పురుషుని ప్రవర్తింప చేసి ఆ అన్నద్వారా పురుషుని హింసించెదరు గాన అన్నమే బాణములు) లేక, అన్నము కొరకు చౌర్యము చేయించి బాధించెదరు గావున అన్నమే బాణములో, అట్టి రుద్రులకు నమస్కారము. అనగా, పృథివియందలి అన్న బాణక రుద్రులకు నమస్కారము.

*"నమో రుద్రేభ్యో యేంతరిక్షె యేషాం వాత ఇషవ*
*స్తేభ్యో దశ ప్రాచీ । రిత్యాది సమానం, ।* (2. మం.)

తా॥ అంతరిక్షలోకమందలి రుద్రులలో యే రుద్రవిశేషములకు వాయువే బాణములో, (అనగా తీవ్రమగు వాయువుచే రోగములను ఉత్పాదన చేసి హింసించెదరుగాన, ఆ రుద్రులకు వాతమే బాణములు), అట్టి వాతబాణకు లగు అంతరిక్షలోకవర్తి రుద్రులకు నమస్కారము.

*'నమో రుద్రేభ్యో యే దివి యేషాం వర్ష మిషవ*
*స్తేభ్యో దశ ప్రాచీ, రిత్యాదిసమానం ।*

తా॥ ద్యులోకమం దేరుద్రులు కలరో, వారిలో ఏ రుద్ర విశేషములకు వర్షమే బాణములో, (అనగా అతివృష్టి అనావృష్టులచే ప్రాణులను హింసించెదరుగాన, ఆ రుద్రులు వర్షేషువులు), అట్టి వర్షేషువులగు ద్యులోకవర్తి రుద్రులకు నమస్కారము.

## నమస్కార వివరణము.

ప్రాఙ్ముఖముగ అంజలి కూర్చి నమస్కరించునపుడు పది అంగుళులు ప్రాగగ్రము లగును. ఇదే విధముగ దక్షిణదిక్కు మొదలు ఊర్ధ్వాంతములగు దిక్కులందు తత్తద్దిక్కులకు అభిముఖముగ అంజలిని కూర్చినచో అంగుళులు తత్తదభిముఖము లగును. అట్టి వ్రేళ్ళతో గూడిన అంజలివిశేషములచే అట్టి రుద్రులకు నమస్కారము. ఆ రుద్రులు మమ్ములను సుఖయుక్తులను చేయుగాక.

నమస్కృతరుద్రుల మగు మేము ఎవనిని ఉదాసీనుడైనను ద్వేషించుచుంటిమో, ఏ శత్రువు ఉదాసీనులమైనను మమ్ములను ద్వేషించునో, అట్టి ఉభయవిధము లగు శత్రువులను ఓ రుద్రులారా! మీ యొక్క తెరుపబడిన ముఖమందు స్థాపన చేయుచుంటిని.

## త్రిపురాసురసంహారము.

'నమస్తే రుద్ర' అను అనువాకములో రుద్రునియొక్క ధనుర్బాణముల ప్రస్తావనచే ప్రసంగసంగత్యా త్రిపురాసురసంహారము అనువదించబడుచున్నది -

'తేషా మసురాణం త్రిసః పుర అస న్న యస్మ
య్యవమాథ రజతాథ హరిణీ దేవా జేతుం న్నా__
శక్నువ న్తా ఉపసదైవ్వా__జిగీష న్తస్మా దాము ర్య
శ్చైవం వేద యశ్చ నోపసదా వై మహాపురం జయం
తీతిత ఇషుగ్ం నమస్కుర్వతా__గ్ని మనీకగ్ం సోమగ్ం
శల్యం విష్ణుం తేజనం తే__బ్రువ న్క ఇమా మశిష్యతీతి
రుద్ర ఇత్యబ్రువ న్రుద్రో వై క్రూర స్సో__స్యత్వితి
సో౽బ్రవీ ద్వరం వృణా అహ మేవ పశూనా మధిపతి
రసానీతి తస్మా ద్రుద్రః పశూనా మధిపతి స్తాగ్ం రుద్రో
__వాసృజ త్స తిస్రః పురో భిత్త్వై భ్యో లోకేభ్యో
__సురా న్ప్రాణుదత యదుపసద ఉపసద్యం తే భ్రాతృ
వ్యపరాణుత్త్యై ।"

(తై.సం. 6.కాం. 2.ప్ర. 3.అను)

తా॥ పూర్వానువాకములో దేవాసురులు యుద్ధసన్నద్ధులై నపుడు దేవతలు అసురులవలన భీతి జెంది పరకాయప్రవేశవిద్యచే అగ్నిని ప్రవేశించిరి. దేవతలు అగ్నిని ప్రవేశించుటచే 'అగ్ని స్సర్వా దేవతాః' (అగ్ని సర్వదేవతారూపుడు) అని శ్రుతులు చెప్పుచున్నవి.

అనంతరము ఆ అగ్నిని వరూధముగ (గృహముగ) చేసికొని (లేక శత్రునివారకమగు ప్రాకారముగ చేసికొని) అనగా అగ్ని యందు ప్రవేశించి బాధారహితులగుచు అసురులను జయించిరి. దానిని చూచి దేవతలచే పరాభూతులై వారికంటె అధికమును చేయుటకు సముత్సుకులైన అసురులు పూర్వానువాకములో ప్రతిపాదించబడిరి. ప్రకృతములో ఆ అసురులు 'తేషా మసురాణాం' అను మంత్రములో తచ్ఛబ్దముచే పరామర్శ చేయబడుచున్నారు.

పూర్వము అగ్నిరూప మగు వరూధముచే (ప్రాకారముచే లేక గృహముచే) పరాభూతులైన అసురులకు పృథివ్యంతరిక్షద్యులోకము లందు తమ రక్షణకొరకు దుర్గరూపము లగు మూడు పట్టణములు ఉపర్యధోభావముచే నిర్మితము లైనవి. వాటిలో పృథివీలోకమందలి పట్టణము లోహప్రాకారవేష్టితము. అంతరిక్షలోకమందలి పట్టణము రజతప్రాకారవేష్టితము. ద్యులోకమందలి పట్టణము సువర్ణప్రాకార వేష్టితము.

అట్టి పట్టణములను (అనగా పట్టణములందలి అసురులను) అగ్నిరూప మగు వరూధముచే కూడ జయించుటకు దేవతలు అశక్తులై, యుద్ధమును విడచి, ఉపసదనము చేతనే (చిరకాలము పట్టణ సమీపమందు అవస్థానముచేతనే) జయించుటకు ఇచ్ఛయించిరి. అనగా దుర్గమధ్యమందు అన్నపానాదులు క్షీణించుట వలన గాని, అంత ర్భేదమువలన గాని, బయటకు వారేతెంచినపుడు వారలను జయించవచ్చునని యోచించి దుర్గసమీపావస్థానమునే జయోపాయముగ నిశ్చయించిరి.

ఈ విధముగ దేవతలు దుర్గసమీపావస్థానమునే (ఉపసదనమునే) జయోపాయముగ నిశ్చయించుట వలన, లోకములో ఈ వృత్తాంతమును తెలిసినవారును తెలియనివారును, జయించుటకు శక్యముగాని, మహాపురమును దుర్గసమీపావస్థానముచేతనే జయించెదరని చెప్పుచుండిరి.

## బాణ నిర్మాణము.

ఈ విధముగ దేవతలు చిరకాలము దుర్గసమీపమున నుండి ప్రతీక్షించినను, పని నెరవేరకపోవుటచే ఇక కాలవిలంబము కాకూడదని విచారించి, యుద్ధముచేతనే జయించుటకు అలౌకిక మగు బాణమును సంస్కరించిరి (తయారు చేసిరి) ఆ బాణముయొక్క ప్రథమ భాగము అగ్ని, బాణహేతుభూతమగు లోహము సోముడు. అగ్రము విష్ణువు, అథవా,

బాణముయొక్క ముఖము అగ్నిదేవత, శరీరము (శల్యము) సోమదేవత, అలుగు విష్ణువు, ఈ విధముగ దేవతాత్రయ సమష్టిరూప మగు బాణమును నిర్మించినపిదప, దేవతలందరును నిట్లు పలికిరి.

"స్త్రీ, బాల, వృద్ధ సమేతు లగు అసురుల నందరను హింసించెడి దేవతామయ మగు ఈ బాణమును మనలోయెవరు క్షేపము చేయగలరు? (ప్రయోగించగలరు?) ఇట్టి బాణమును క్షేపము చేయుటకు సమర్థుడు, దయలేనివాడు (నిర్ఘృణుడు), క్రూరుడు కావలెను. అట్టివాడు మనలో రుద్రుడొక్కడే" యని దేవతలందరును ఏకగ్రీవముగ పలికిరి. వెంటనే ఈ బాణమును త్రిపురాసురులపై క్షేపమును చేయమని రుద్రుని దేవత లందరును కోరిరి.

## రుద్రుని వరవరణము.

అంతట రుద్రుడు ద్విపాచ్చతుష్పాద్రూపము లగు సర్వపశువులకు తాను అధిపతిని కావలెనని వరమును కోరెను. అనగా, సర్వపశ్వాధిపత్యమును తన కొసంగినచో తాను బాణప్రక్షేపమును చేసెదనని చెప్పెను. దానికి దేవత లందరును అంగీకరించిరి. ఈ వరదానము వలన రుద్రుడు పవువుల కధిపతి యయ్యెను. వెంటనే రుద్రుడు ఆ బాణమును విడచెను. ఆ బాణము అసురుల పట్టణములను మూడిటిని భేదించి ఈముల్లోకములనుంచి అసురులను నిస్సారణ చేసెను.

## రుద్రవరవరణ విమర్శ.

ఇచ్చట రుద్రుడు పశువుల కాధిపత్యమును కోరినట్లు శ్రుతి బోధించుచున్నది. దీనివలన ఈ వరదానమునకు పూర్వము పశ్వాధి పత్యము రుద్రునకు లేదా? యను శంక ఉదయించుచున్నది. ఇదే విధముగ యజ్ఞములో అదితి వరవరణమును ఈ క్రింది శ్రుతి బోధించుచున్నది –

"దేవా వై దేవయజన మధ్యవసాయ దిశోన
ప్రాజానన్తే__న్యోన్య ముపాధావ న్త్వయా ప్రజానామ
త్వయేతి తే దిత్యాగ్ం సమధ్రియంత త్వయా ప్రజానా
మేతి సా__బ్రవీ ద్వరం వృణై మత్ప్రాయణా ఏవ వో
యజ్ఞా మదుదయనా అసన్నితి తస్మా దాదిత్యః ప్రా
యణీయో యజ్ఞానా మాదిత్య ఉదయనీయః ।" ఇతి. (తై.సం. 6.కాం. 1.ప్ర. 5.అను.)

తా॥ పూర్వము **దేవతలు యజ్ఞము చేయు** నిచ్ఛతో యోగ్య ప్రదేశమును (దేవయజనమును) నిశ్చయించుటకు పరిభ్రమణము గావించి, సమీచీన మగు యజ్ఞ

ప్రదేశమును నిశ్చయించి, పరిభ్రమణముచే దిగ్భ్రమను పొంది, ప్రాచ్యాదిదిక్కుల విభాగము తెలియకపోవుటచే ప్రాగ్వంశ మను శాలను నిర్మించుటకు అసమర్థులైరి. అంతట వారు పరస్పరము ఒకరినొకరు దిక్కును తెలియజెప్పుమని ఒకని సమీపమున కొకరు వెడలిరిగాని వారెవరును తెలిసికొనజాలకపోయిరి. పిమ్మట వారందరును దిగ్బోధకశక్తిని అదితిదేవత యందు నిశ్చయించిరి. అనగా, అదితి ప్రాగాదిదిక్కులను తెలియజేయుటకు సమర్థురాలని నిశ్చయించి అదితిసమీపమున కేగి దిక్కులను తెలియజెప్పుమని అదితిని కోరెను. అదితి "ఓ దేవతలారా! యజ్ఞములో అద్యంతములందు చేసెడి ప్రాయణీయేష్టి, ఉదయనీయేష్టులలో నేను దేవతగా ఉండుటకు మీరు వర మొసంగినచో మీకు దిక్కులను తెలియజెప్పెదను.' ' అని వరము గోరెను. దీనికి దేవత లంగీకరించిరి.

ఆవరదానమువలన యజ్ఞములో ఆరంభసమాప్తులందు అదితి దేవతాకము లగు ప్రాయణీ యేష్టి, ఉదయనీయేష్టులు చేయబడుచున్నవి. ఈ వరప్రదానమునకు పూర్వము యజ్ఞములో ఆద్యంతము లందు 'అదితి దేవత కాదా' యని శంక కలుగుచున్నది.

ఈవరదానమునకు పూర్వము గూడ రుద్రుడు పశువుల కధిపతియే. ఇదివరలో విద్యమాన మగు అధిపత్యముకే దార్ఢ్యమును ఈ శ్రుతి బోధించుచున్నది.

ఇట్లే యజ్ఞములో అదితికి వరదానముకంటే పూర్వమే ప్రారంభ సమాప్తులందు అదితియే దేవతగా నున్నది. విద్యమాన మగు ఈ అర్థమునకే ద్రఢిమను ఈ వరదానశ్రుతి ఆపాదన చేయుచున్నది.

ఇట్లే వేదములో వరప్రదానశ్రుతిస్థలములలో ఇదివరలో ఉన్న అర్థమునకే శ్రుతి - దృఢత్వము నాపాదించుచున్న దని గ్రహించవలెను.

త్రిపురాసురసంహారార్థమగు (రుద్రుని) ధనుర్బాణముల విషయములో పురాణాదులలో విభిన్నముగ వర్ణన యున్నది. కల్పభేదములచే విరోధపరిహారములను గమనించవలెను. రుద్రుని ఘోరాశరీరశాంతి కొరకు శతరుద్రీయ హోమము పుట్టినది గావున, ఇట్టి (రుద్రుని) ధనుర్బాణములకు నమస్కారము ఆదియందే చేసినచో క్రోధశాంతికి కారణమని శ్రుతి అట్లు ప్రథమమంత్రములో చెప్పినది.





శ్రీ మహాగణాధిపతయే నమః ।

# వేదసార రత్నావళి

## 14. చమకము.

"అగ్నావిష్ణూ సజోష సేతి చతుర్గృహీతం గృహీత్వా
జుహోతి అపరం చతుర్గృహీతం గృహీత్వా ఔదుంబరీగ్ స్రుచం
వ్యాయామమాత్రీం మృదా ప్రదిగ్ధాం పశ్చా దాసేచనవతీం
ఘృతస్య పూరయిత్వా వాజశ్చ మ ఇతి సంతతాం వసోర్ధారాం
జుహోతి ।" (ఆ. శ్రౌ. సూ.)

ఓమ్ అగ్నావిష్ణూ సజోషసే మా వర్ధంతు వాం
గిరః । ద్యుమ్నై ర్వాజే భిరాగతం ।" (కృ. య. సం. 4. కాం. 6. ప్ర. 1. అను.)

తా॥ ఓ అగ్నావిష్ణువులారా! మీరు పరస్పరము సమాన మగు ప్రీతికలవారలు అగుదురు గాక! లేక, మీయందు మాకు ఎట్టి ప్రీతి గలదో, మాయందు మీరుగూడ అట్టి ప్రీతికలవారగుదురుగాక! మీ సంబంధ మగు ఈ స్తుతి రూపము లగు వాక్కులు వృద్ధిని పొందుగాక! మీరును ధనములతోను అన్నములతోను కూడుకొనినవా రగుచు ఇచ్చటకు దయచేయుడు.

"అథైకాదశానువాకాత్మకో మంత్ర ఉచ్యతే । అనువాక
భేదస్తు అయజ్ఞసంయుక్తే కర్మణి పృథ జ్మంత్రత్వే నానుష్ఠే
యత్వా దుపద్యతే ।" (సా. భా.)

తా॥ 'వాజశ్చ మే' మొదలు పదకొండు అనువాకములు అగ్నిచయన మందలి వసోర్ధారాహోమమందు ఒకే మంత్రము. అగ్నిచయనముకంటె భిన్నకర్మలందు వేరు మంత్రములుగ అనుష్ఠానము చేయుటకు ఉపయోగించును గాన అనువాకభేదము యుక్తము.

ఇంతవరకు రుద్రునియొక్క ఘోరాశరీరమును శాంతిపరచుటకు శతరుద్రీయ హోమము చెప్పబడినది. ఇత ఉత్తరమందు శివాశరీరమును 'వాజశ్చ మ' ఇత్యాది వసోర్ధారాహోమముచే

తృప్తిపరచి అభీష్టవస్తు సంపత్తిని ప్రార్థించుటకు ఈ క్రింది మంత్రములు వ్యాఖ్య చేయబడుచున్నవి.

## 1. అనువాకము.

"వాజశ్చ మే ప్రసవశ్చ మే ప్రయతిశ్చ మే ప్రసి
తిశ్చ మే ధీతిశ్చ మే క్రతుశ్చ మే స్వరశ్చ మే లోకశ్చ
మే(శ్రావశ్చమే (శ్రుతిశ్చ మే జ్యోతిశ్చ మే సువశ్చ
మే ప్రాణశ్చమే__పానశ్చ మే వ్యానశ్చమే __సుశ్చ మే
చిత్తం చ మ ఆధీతం చమే వాక్చ మె మనశ్చ మె
చక్షుశ్చమే శ్రోత్రం చ మె దక్షశ్చ మె బలం చ మ ఓజ
శ్చ మే సహశ్చ మ ఆయుశ్చ మె జరా చమ ఆత్మా చ
మె తనూశ్చ మె శర్మ చ మె వర్మ చ మే__ంగాని చ
మె__స్థాని చ మె వరూగ్ంషి చ మె శరీరాణి చ మె ।"

తా॥ ఓ రుద్రా! నీకటాక్షముచే అన్నము మున్నగు పదార్థములు మాకు సంపన్నము లగుగాక పదార్థముల వివరణ మేమన, "అన్నం దీయతాం భుజ్యతాం" ఇత్యాదిరూప మగు అన్న ప్రేరణము, అన్న పరిశుద్ధి, అన్న విషయక మగు ఔత్సుక్యము, అన్నధారణము, అన్న హేతువగు యజ్ఞము ఉదాత్తాదిస్వరజాతము, స్తుతి, వినిపించెడి సామర్థ్యము, శ్రవణ సామర్థ్యము, ప్రకాశము, స్వరము, ప్రాణాపాన వ్యానవృత్తులు, ఆవృత్తులు కల వాయువు, మనోజన్య మగు జ్ఞానము, ఆ జ్ఞానములో విషయభూత మగు ద్రవ్యము, వాగింద్రియము, మనస్సు, చక్షురింద్రియము, శ్రోత్రేందియము, జ్ఞానేంద్రియ కౌశలము, కర్మేంద్రియ సామర్థ్యము, బలహేతు వగు అష్టమధాతువు, శత్రుతిరస్కరణ సామర్థ్యము, ఆయుస్సు, ముసలితనము, శాస్త్రసిద్ధమగు పరమాత్మ, శోభనసన్నివేశము గల శరీరము, సుఖము, శరీర రక్షక మగు కవచాదికము, సంపూర్ణమగు అవయవములు, స్వస్వ స్థాపిత మగు అస్థిజాతము, అంగుళ్యాదిపర్వలు, అనుక్త సర్వావయవములు మాకు సంపన్నము లగుగాక.

## 2. అనువాకము.

"జ్యేష్ఠ్యం చ మ ఆధిపత్యం చ మే మన్యుశ్చ మే
భామశ్చమె__ంభశ్చ మె జేమాచమె మహిమా
చమె పరిమా చ మె ప్రథిమా చ మె వర్ష్మా చ మే
ద్రాఘుయా చ మే వృద్ధం చ మే వృద్ధి శ్చ మే సత్యం
చ మే శ్రద్ధా చ మే జగచ్చ మే ధనం చ మే వశశ్చ మే

త్విషిశ్చ మే క్రీడా చ మే మోదశ్చ మే జాతం చ మే
జనిష్యమాణం చ మే సూక్తం చ మే సుకృతం చ మే
విత్తంచ మే వేద్యం చ మే భూతం చ మే భవిష్యచ్చ
మే సుగం చ మే సుపథం చ మ బుద్ధం చ మ బుద్ధి
శ్చ మే క్షప్తంచ మే క్షప్తిశ్చ మే మతిశ్చ మే సుమతిశ్చమే ।"

తా॥ అత్యంతప్రాశస్త్యము, స్వామిత్వము, మానసికక్రోథము, అక్షమాదిలింగజన్య మగు బాహ్యక్రోథము, శత్రువులు నాశక్తి సామర్థ్యమును తెలిసికొనలేకుండుట, శైత్యమాదుర్మయలుతో కూడిన ఉదకము, శత్రువులను జయించు సామర్థ్యము, జయసంపాదిత మగు ధనసంపత్తి, పూజ్యత్వము, గృహక్షేత్రాదివిస్తారము, పుత్రపౌత్రాది శరీరములు, అవిచ్ఛిన్నమగు సంతతి, అధికమగు అన్నధనములు, విద్యైశ్వర్యాదిగుణములచే ఉత్కర్ష, యథార్థభాషణము, పరలోకాదికము ఉన్నదను బుద్ధి, జంగమా_జంగమాత్మక మగు గవాశ్వాదికము, సువర్ణాదికము, అందరు స్వాధీనులుగా నుండుట, శరీరకాంతి, అక్షద్యూతాది క్రీడా, తజ్జన్యమగు సంతోషము, పూర్వమందున్న సంతానము, ముందు పుట్టబోయెడి సంతానము, ఋక్సమూహము, దానివలన పుట్టెడి అపూర్వము, పుణ్యవిశేషము, పూర్వలబ్ధ మగు ద్రవ్యజాతము, ఇటుపైన పొంద దగిన ద్రవ్యజాతము, పూర్వసిద్ధగృహాదికము, ముందు సంపాదించబడియెడి గృహాదికము, గమనానుకూల మగు బంధువర్గముతో గూడిన గ్రామాంతరాదికము, చోరాదిరహిత మగు మార్గము వృద్ధి పొందించిన దనాదికము, లేక నాచే ఆచరించబడిన కర్మల ఫలము, ముందు ఆచరించబోయెడి సత్రయాగాదుల ఫలము, సమర్థమగుద్రవ్యము, అనగాస్వకార్యములను నెరవేర్చుకొనుటకు సమర్థమగు ద్రవ్యము, స్వకీయసామర్థ్యము, పదార్థమాత్రనిశ్చయము, దుర్ఘట మగు రాజకార్యాదినిశ్చయము సంపన్న మగుగాక.

## 3. అనువాకము.

"శం చ మే మయ శ్చ మే ప్రియం చ మే_నుకామ
శ్చమే కామశ్చ మే సౌమనసశ్చ మే భద్రంచ మే శ్రేయశ్చ
మే వస్యశ్చ మే యశశ్చ మే భగశ్చ మే ద్రవిణం చ మే
యంతాచమె ధర్తా చ మే క్షేమశ్చమే ధృతిశ్చమే విశ్వంచ
మే మహశ్చ మే సంవిచ్చ మే జ్ఞాత్రం చ మే సూశ్చ
మే ప్రసూశ్చ మే సీరం చ మేల యశ్చ మ ఋతం చ మే_
మృతం చ మే_యక్ష్మం చ మే_నామయశ్చ మే జీవాతు

శ్చ మే దీర్ఘాయుత్వం చ మే౽నమిత్రం చ మే౽భయం చ
మే సుగం చ మే శయనం చ మే సూషా చ మే సుదినం
చ మే ।"

తా॥ ఐహికసుఖము, ఆముష్మికసుఖము, ఇహలోకసంతోష జనకమగు వస్తువు, ఇహలోకములోనే అనుకూలత్వబుద్ధిచే కోరబడియెడి పదార్థము, కామ్యమాన మగు స్వర్గాదికము, మనస్సుకు సుఖమును చేకూర్చెడి బంధువర్గము, ఇహలోక రమణీయము, పరలోకహిత మగు సత్కర్మాదికము, నివాసహేతువగు గృహాదికము, కీర్తి, సౌభాగ్యము, ధనము, నియమించెడి ఆచార్యాదులు, పోషించెడి పిత్రాదులు, ఉండెడి ధనమును రక్షించుకొని యెడి శక్తి, ఆపత్సమయ మందు కూడ ధైర్యము, సర్వజనానుకూల్యము, పూజ, వేదశాస్త్రాది జ్ఞానము, వేదశాస్త్రాదులను ఇతరులకు తెలియజెప్పెడి సామర్థ్యము, పుత్రభృత్యాదులను ప్రేరణ చేయు సామర్థ్యము, ఎడ్లు, నాగళ్ళు మున్నగు వ్యవసాయ సాధనముల సంపత్తి, తత్ప్రతిబంధములు లేకుండుట, యజ్ఞాదికర్మలు, వాటి ఫలము, క్షయాది ప్రబల రోగములు, జ్వరము మున్నగు అల్పవ్యాధులు లేకుండట, వ్యాధినివారణకు ఔషధము, అపమృత్యువులు లేకుండుట, శత్రురాహిత్యము, భయ రాహిత్యము, అందరును సమ్మతించునట్టి ఆచరణము, సుఖశయనముకు సాధన మగు పరుపు, తలగడ మున్నగు వస్తుసంపత్తి, స్నాన సంధ్యావందనాద్యనుష్ఠానముతో కూడిన ప్రాతఃకాలము, దిన మంతయు యజ్ఞములు, అధ్యయనము, దానము మున్నగువాటి సంపత్తియు మాకు సంపన్న మగుగాక.

## 4. అనువాకము.

'ఊర్చ్ మే సూనృతా చ మే పయశ్చ మే రసశ్చ
మేఘృతం చ మే మదు చ మే సగ్ధిశ్చ మె సపీతిశ్చ మె
కృషిశ్చ మె వృష్టిశ్చ మె జైత్రం చ మ ఔద్భిద్యం చ
మె రయిశ్చ మెరాయశ్చ మె పుష్టం చ మె పుష్టిశ్చ మె
విభు చ మె ప్రభు చ మె బహు చ మె భూయశ్చ మె
పూర్ణం చ మె పూర్ణతరం చ మె క్షితిశ్చ మె కూయవాశ్చ
మె౽న్నం చ మె౽క్షుచ్చ మె వ్రీహయశ్చమె యవాశ్చ మె
మాషాశ్చ మె తిలాశ్చ మె ముద్గాశ్చ మె ఖల్వాశ్చ మె
గోధూమాశ్చ మె మసురాశ్చమె ప్రియంగివశ్చమె౽ణవశ్చ
మె శ్యామాకాశ్చ మె నీవారాశ్చ మె ।'

తా॥ అన్నసామాన్యము (ఊర్క్), ప్రియవచనములు పలుకుట, క్షీరము, అందలి సారము, ఘృతము, తేనె, బంధువులతో కలసి భోజనము, కలసి క్షీరాదిపానము, వ్యవసాయము, వర్షము సర్వసస్యములు ఫలించెడి సుక్షేత్రము, తరుగుల్మాదుల ఉత్పత్తి. సువర్ణము, మణిముక్తాదికము, విశేషించి సువర్ణసమృద్ధి, శరీరపుష్టి, బహువిధ తారతమ్యోపేత ధాన్యాభివృద్ధులు (విభు, ప్రభు, బహు, భూయః, పూర్ణం, పూర్ణ తరం, అక్షితిః, ఈ శబ్దములు ధాన్యవిషయక మగు ఉత్తరోత్తరాభివృద్ధి వాచకములు). ప్రవృద్ధధాన్య సంపత్తియే గాక, అల్పధాన్యసంపత్తి కూడ చెప్పబడుచున్నది). పూచిపోయినయవలు, ప్రసిద్ధ మగు అన్నము, అన్నసాధ్య మగు క్షత్పరిహారము (ఆకలి లేకపోవుట, అనగా అజీర్ణాది రోగములచే ఆకలి లేకపోవుట కాక సంపూర్ణముగ భుజించుటచే ఆకలి లేకపోవుట), వ్రీహి, యవ, మాష, తిల, ముద్గములు, (పెసలు) ఖల్వలు (కందులు), గోధుమలు, మసురలు (ధాన్య విశేషములు) ప్రియంగువులు, సూక్ష్మ శాలులు (సన్నధాన్యము), చామలు, నివర ధాన్యములును మాకు సంపన్న మగు గాక (ఖల్వ లనగా, శలగ లని అధర్వవేదభాష్యములో నున్నది).

## 5. అనువాకము.

"అశ్మా చ మె మృత్తికా చ మె గిరయశ్చ మె పర్వతాశ్చ
మె సికతాశ్చమె వనస్పతయశ్చ మె హిరణ్యం చ మే__
యశ్చ మె సీసం చ మె త్రపుశ్చ మె శ్యామం చ మె లోహం
చమే__గ్నిశ్చమ ఆపశ్చమె వీరుధశ్చ మ ఓషదయశ్చమె
కృష్టపచ్యం చ మే__కృష్టపచ్యం చ మె గ్రామ్యా
శ్చ మె పశవ అరణ్యాశ్చ యజ్ఞేన కల్పంతాం విత్తం చ మె
విత్తిశ్చ మె భూతం చ మె భూతిశ్చ మె వసు చ మె వసతిశ్చ
మె కర్మ చ మె శక్తి శ్చ మే__ర్థశ్చమ ఏమ శ్చమ ఇతిశ్చ
మె గతిశ్చ మె ।"

తా॥ ప్రసిద్ధములగు అశ్మాదిపదార్థములు, ఇనుము (శ్యామం, కృష్ణాయనం), లోహము (కాంస్య, తామ్రాదికము), అగ్న్యాదులు (అగ్ని, ఉదకములు,) లతలు, ఓషధులు, దున్నగా పండిన ధాన్యములు దున్ననక్కర లేకుండ పండెడి ధాన్యములు), గ్రామ్య పశువులు (గో, అశ్వ, అజ, అవి, పురుష, గర్దభ, ఉష్ట్రములు), అరణ్య పవువులు (ద్విఖుర, శ్వాపద, పక్షి, సరీసృప, హస్తి, మర్కట, నాదేయ) ను, మాయజ్ఞము నిమిత్తము సమర్థము లగు గాక. పూర్వమందు పొందబడిన ద్రవ్యము (విత్తము) భావిలాభము (విత్తి) ఐశ్వర్యోపేతమగు పుత్రాదికము (భూతం), స్వకీయమైన, ఐశ్వర్యము (భూతిః) నివాససాధన మగు గవాదికము,

నివాసాధార మగు గృహాదికము, అగ్నిహోత్రాది కర్మ, తదనుష్ఠాన సామర్థ్యము, ప్రయోజన విశేషము, పొందదగిన సుఖము, ఇష్టప్రాప్త్యుపాయము, ఇష్టప్రాప్తియు నాకు సంపన్న మగు గాక.

## 6. అనువాకము.

"అగ్ని శ్చ మ ఇంద్రశ్చ మె సోమశ్చ మ ఇంద్రశ్చ
మె సవితా చ మ ఇంద్రశ్చ మె సరస్వతీ చ మ ఇంద్రశ్చ
మె పూషా చ మ ఇంద్రశ్చ మె బృహస్పతిశ్చ మ ఇంద్రశ్చ
మె మిత్రశ్చ మ ఇంద్రశ్చ మె వరుణశ్చ మ ఇంద్రశ్చ
మె త్వష్టా చ మ ఇంద్రశ్చ మె ధాతా చ మ ఇంద్రశ్చ మె
విష్ణు శ్చ మ ఇంద్రశ్చమెఽశ్వినౌ చ మ ఇంద్రశ్చమె మరు
తశ్చ మ ఇంద్రశ్చ మె విశ్వేచ మె దేవా ఇంద్రశ్చ మే పృథి
వీ చ మ ఇంద్రశ్చ మెఽంతరిక్షం చ మ ఇంద్రశ్చ మె ద్యౌశ్చ
మ ఇంద్రశ్చ మె దిశశ్చ మ ఇంద్రశ్చ మె మూర్ధా చ మ
ఇంద్రశ్చ మె ప్రజాపతిశ్చ మ ఇంద్రశ్చ మె ।"

తా॥ అగ్నీంద్రాదిదేవతలు సుప్రసిద్ధులు. అందరు దేవతల తోను ఇంద్రుడు సమానభాగము కలవాడగుటచే ప్రతిదేవతతోను ఇంద్రుడు పఠించబడెను. దిక్శబ్దమునకు ప్రాచ్యాది నాల్గుదిక్కులును, మూర్ధశబ్దమునకు ఊర్ధ్వదిక్కును అర్థము.

## 7 అనువాకము.

"అగ్ంశుశ్చమే రశ్మిశ్చ మేఽదాభ్యశ్చ మేఽధిపతిశ్చ
మ ఉపాగ్ంశుశ్చ మేఽంతర్యామశ్చ మ ఐంద్రవాయ
వశ్చ మే మైత్రావరుణశ్చ మ అశ్వినశ్చ మే ప్రతిప్రస్థా
నశ్చ మే శుక్రశ్చ మే మంథీ చ మ అగ్రయణశ్చ మే వైశ్వ
దేవశ్చ మే ధ్రువశ్చ మే వైశ్వానరశ్చ మ ఋతుగ్రహా
శ్చ మేఽతిగ్రాహ్యాశ్చ మ ఐంద్రాగ్నశ్చ మె వైశ్వదే
వశ్చ మె మరుత్వతీయాశ్చ మె మాహేంద్రశ్చ మ ఆది
త్యశ్చ మే సావిత్రశ్చ మె సారస్వతశ్చ మె పౌష్ణశ్చ మె
పాత్నీవతశ్చ మె హారియోజనశ్చ మె ।"

తా॥ యజ్ఞములో సోమరసమును గ్రహించెడి పాత్రల నామములు అంశు, రశ్మీత్యాదులు, యజ్ఞములో రశ్మిగ్రహము లేకున్నను, అదాభ్యగ్రహగ్రహణమంత్రములో రశ్మిశబ్ద ముండుటచే

గృహ్యా మాణత్వావస్థను పురస్కరించుకొని రశ్మిశబ్దముచే గృహ్యామాణ మగు అదాభ్యగ్రహము చెప్పబడుచున్నది. అధిపతి శబ్దమునకు దధిగ్రహ మర్థము. ప్రతిప్రస్థాన శబ్దమునకు ఐంద్రవాయవాది ద్విదేవత్యగ్రహములతో సాహిత్యముగ 'ప్రతిప్రస్థాత' అను ఋత్విక్కు గ్రహించెడి ప్రతినిర్గ్రాహ్యము (సోమపాత్ర) అర్థము. 'హోత' అను ఋత్విక్కు వైశ్వానరసూక్తమును పఠించునపుడు ధృవగ్రహములో నుంచెడి సోమరసమును 'హోతృచమస' అను పరిమండలాకార మగు దారుమయ పాత్రలో 'ప్రతిప్రస్థాత' అను ఋత్విక్కు అవనయనము చేయును. (పోయును) ఇట్టి అవనయనదశాపన్న మగు ధృవగ్రహము వైశ్వానర శబ్దమున కర్థము. ప్రాతస్సవనములో నొకటియు, తృతీయ సవనములో నొకటియు కలసి మొత్తము రెండు వైశ్వదేవగ్రహములు కలవు. అభిషేచనీయ మను సోమయాగములోనిది సారస్వతగ్రహము. వికృతియాగములోనిది పౌష్ణగ్రహము.

## 8. అనువాకము.

"ఇధ్మశ్చ మె బర్హిశ్చ మె వేదిశ్చ మె ధిష్ణియాశ్చ
మె స్రుచశ్చ మె చమసాశ్చమె గ్రావాణశ్చమె స్వరవశ్చ
మ ఉపరవాశ్చ మ్మె__ధిషవణే చ మె ద్రోణకలశశ్చ మె
వాయవ్యాని చ మె పూతభృచ్చ మ అధవనీయశ్చ మ
అగ్రీధ్రం చ మె హవిర్ధానం చ మె గృహాశ్చ మె సదశ్చ
మె పురోడాశాశ్చ మె పచతాశ్చ మ్మె__వభృథశ్చ మె స్వగా
కారశ్చ మె ।"

తా॥ ఇధ్మము, బర్హిస్సు మున్నగునవి యజ్ఞాంగము లగు ద్రవ్యములు యజ్ఞ ప్రకరణములో ప్రసిద్ధములు. గృహశబ్దముకు పత్నికూర్చుండెడి పత్నీశాలాదులు అర్థము. పచత, శబ్దమునకు పశువును అలంభన చేసెడి స్థలము (శామిత్రము) అర్థము. స్వగాకార శబ్దమునకు శంయువాకమంత్రము అర్థము.

## 9. అనువాకము.

"అగ్ని శ్చ మె ఘర్మశ్చ మ్మె__ర్కశ్చ మె సూర్యశ్చ మె
ప్రాణశ్చ మ్మె__శ్వమెధశ్చ మె పృథివీ చ మ్మె__దితిశ్చ మె
దితిశ్చ మె ద్యౌశ్చ మె శక్వరీ రంగులయో దిశశ్చ మె
యజ్ఞేన కల్పంతా మృక్చ మె సామ చమె స్తోమశ్చ మె
యజుశ్చ మె దీక్షా చ మె తపశ్చ మ ఋతుశ్చ మె వ్రతం

చ మ్మే__హోరాత్రయో ర్వృష్ట్యా బృహద్రథంతరే చమే
యజ్ఞేన కల్పేతాం ।"

తా॥ (యజ్ఞము చేసిన పిమ్మట చైన మను (క్రతువు చేయునపుడు) ఇటుకలచే కూర్చబడిన ప్రదేశమును అగ్ని యని పేరు. ఇచ్చట అగ్ని శబ్దమునకు ఆ అగ్ని అర్థము. ఘర్మము (అనగా, యజ్ఞములో చేయబడియెడి ప్రవర్గ్యకర్మ), అర్కయాగము, సౌర్య యాగము, ప్రాణాయస్వాహేతివిహిత మైన హోమము, అశ్వమేధము, పృధివ్యాదిదేవతా విశేషములు, శక్వరీఛందస్సును, విరాట్పురుషుని యొక్క అవయవవిశేషములును, ప్రాచ్యాది దిక్కులును విదిక్కులును (ఇవి యన్నియు) మాయజ్ఞము నిమిత్తము స్వస్వవ్యాపారసమర్థము లగు గాక. ఋగాదిమంత్రవిశేషములు, సామావృత్తి రూప మగు స్తోత్రము, యజుర్మంత్రములు, యజమానసంబంద మగు ముండనాది సంస్కారము, పాపక్షయార్ధ మగు అనశనము, యజ్ఞాంగ మగు కాలము, ఏకస్తనాదివ్రతము, అహోరాత్ర సంబంధమగు వృష్టిచే మా సస్యము సంపన్న మగుగాక. బృహద్రథంతర సామలు మా యజ్ఞము నిమిత్తము స్వస్వవ్యవహార సమర్థములగుగాక.

## 10. అనువాకము.

'గర్భాశ్చ మే వత్సాశ్చ మే త్ర్యవిశ్చ మే త్ర్యవీ చ
మేదిత్యవాచ మే దిత్యౌహీ చ మే పంచావిశ్చమే పంచావీ
చ మే త్రివత్సశ్చ మే త్రివత్సా చ మే తుర్యవాట్చ మే
తుర్యౌహీ చ మే షష్ఠవాచ్చమే షష్ఠౌహీ చ మ ఉక్షా చ మె
వశా చ మ ఋషభశ్చ మే వేహచ్చ మ్మే__నడ్వాన్చ మే
ధేనుశ్చ మ ఆయు ర్యజ్ఞేన కల్పతాం ప్రాణో యజ్ఞేన
కల్పతా మపానో యజ్ఞేన కల్పతాం వ్యానోయజ్ఞేన కల్ప
తాం చక్షు ర్యజ్ఞేన కల తాగ్ శ్రోత్రం యజ్ఞేన కల్పతాం
మనో యజ్ఞేన కల్పతాం వా గ్యజ్ఞేన కల్పతా మాత్మా
యజ్ఞేన కల్పతాం యజ్ఞో యజ్ఞేన కల్పతాం.

తా॥ గర్భములు వత్సలు ప్రసిద్ధములు. 18 మాసములు వయస్సు గల వత్సరూప మగు పుంగవము (త్ర్యవిః), 18 మాసములు వయస్సుగల గోవు (త్ర్యవీ), ఇదే విధముగ రెండు సంవత్సరములు వయస్సుగల పుంగవము (దిత్యచాట్), గోవు (దిత్యౌహి), రెండున్నర సంవత్సరములు వయస్సు గల పుంగవము (పంచావి), గోవు (పంచావీ), మూడు సంవత్సరములు వయస్సు గల పుంగవము (తివ్రత్సః) గోవు (త్రివత్సా), మూడున్నర

సంవత్సరములు వయస్సు గల పుంగవము (తుర్యవాట్), గోవు (తుర్యౌహీ), నాలుగు సంవత్సరములు వయస్సు గల పుంగవము (షష్ఠవాత్) గోవు (పష్ఠౌమీ), సేచనసమర్థ మగు వయస్సు గల పుంగవము (ఉక్షా), గొడ్డు ఆవు (వశా), ఉక్షకంటె అధికవయస్సుగల పుంగవము (ఋషభము), గర్భఘాతియైన గోవు (వేహత్), బండిని లాగు పుంగవము (అనడ్వాన్) క్రొత్తగా ప్రసవించిన గోవు (ధేనుః), ఆయురాదులు ప్రసిద్ధములు. ఇవి యన్నియు నాయజ్ఞముచే స్వకార్యనిర్వహణ సమర్థము లగుగాక.

## 11. అనువాకము.

ఏకా చ మే తిస్రశ్చ మే పంచ చ మే సప్త చ మే నవ
చ మ ఏకాదశ చ మే త్రయోదశ చ మే పంచదశ చ
మే సప్తదశ చ మే నవదశ చ మ ఏకవిగ్ంశతిశ్చ మే
త్రయోవిగ్ంశతిశ్చ మే పంచవిగ్ంశతిశ్చ మే సప్తవిగ్ం
శతిశ్చ మే నవవిగ్ంశ తిశ్చ మ ఏకత్రిగ్ంశచ్చ మే త్రయ
స్త్రిగ్ంశచ్చ మే చతస్రవ్చ మే౽ష్టౌ చ మే ద్వాదశ చ మే
షోడశ చ మే వింశతిశ్చ మే చతుర్విగ్ంశతిశ్చ మే
౽ష్టావిగ్ంశతిశ్చ మే ద్వాత్రిగ్ంశచ్చ మే షట్త్రిగ్ంశచ్చ
మే చత్వారిగ్ంశచ్చ మే చతుశ్చత్వారిగ్ంశచ్చ మే ౽ష్టా
చత్వారిగ్ంశచ్చ మే వాజశ్చ ప్రసవశ్చా౽పిజశ్చ క్రతుశ్చ
సువశ్చ మూర్ధాచ వ్యశ్నియశ్చాంత్యాయన శ్చాం
త్యశ్చ భౌవనశ్చ భువన శ్చాధిపతిశ్చ ।

తా॥ ఏకాదిశబ్దములు సంఖ్యావాచకములు. వాజాదిశబ్దములు చైత్రాదిమాసముల పేర్లు (అనికొందరు). చకారములచే పరస్పర సముచ్చయము, లేక, అనుక్తమగు కాలాదిదేవతల సముచ్చయము చెప్పబడును. ఈ కాలదేవతలు, (అథవా) అన్నము (వాజః), అన్నము యొక్క ఉత్పత్తి (ప్రసవః) పునః పునః ఉత్పత్తి (అపిజః) భోగాది విషయసంకల్పము, లేక యాగము (క్రతుః), తదుత్పత్తిహేతు వగు ఆదిత్యుడు (సువః), ద్యులోకము (మూర్ధా), ఆకాశమందలి పదార్థము (విశేషేణఅశ్నుతే వ్యాప్నోతీతి వ్యశ్నః తత్రభవః వ్యశ్నియః), అంతమందు జనించిన వాడు (ఆంత్యాయనః), అంతమందున్నవాడు (ఆంత్యః), భువనమందైనవాడు (భౌవనః), జగదాత్మకుడు (భువనః), సర్వమును అధిష్ఠించి పాలించువాడు (అధిపతిః); ఈవాజాదులు అన్నియు మాకు సంపన్న మగుగాక.

## స్ట్రైకులు (సమ్మెలు)

"అగ్ని ర్దేవేభ్యో పాక్రామ ద్భాగధేయ మిచ్ఛ
మాన స్తం దేవా అబ్రువ న్నుప న అవర్తస్వ హవ్యం
నో వహేతి స్తో__బ్రవీ ద్వరం వృణై మహ్యా మేవ వాజ
ప్రసవీయం జుహవన్నితి తస్మా దగ్నయే వాజప్రస
వీయం జుహ్వతి యద్వాజప్రసవీయం జహో త్యగ్ని
మేవ తద్భాగధేయేన సమర్ధయత్యథో అభిషేక ఏవాస్య సః ।"

(కృ. య. సం. 5. కాం. 4. ప్ర. 9. అను)

తా॥ లోకములో మిల్లులు వగైరాలలో పనిచేయువారు తమకు భాగముకొరకు పనులు మాని సమ్మె చేయునట్లు, పూర్వము అగ్ని చయన మను క్రతువులో హవిర్వహనము చేసెడి అగ్ని తనకు భాగము నపేక్షించి హవిర్వహనమును మాని దేవతల నుంచి వెడలెను. అంతట దేవతలు అగ్నిని పిలచి హవిర్వహనమును చేయవలసినదిగ పలికిరి. అప్పుడు అగ్ని ఆ క్రతువులో వాజప్రసవీయహోమమును తన కొక్కనికే భాగముగ నిమ్మని (అనగా ఇతర దేవతలకు ఆ హోమ ములో భాగములేకుండ తనకే హోమమును చేయమని) వరమును కోరగా, దానికి దేవత లంగీకరించిరి. ఇట్లు వరమును కోరుటచే చయనక్రతువులో వాజప్రసవీయ మను హోమమును యజమానులు అగ్నికొరకు చేయుచుండిరి. ఆ హోమముచే యజమానుడు అగ్నిని సమృద్ధునిగ చేయును. ఇంతేగాక, ఆవాజప్రసవీయ హోమము అగ్నికి అభిషేకస్థానీయము.

## వాజప్రసవీయహోమము.

"వాజప్రసవీయం జుహోతి సప్తగ్రామ్యా ఓషధయ
స్సప్తారణ్యాః పృథగన్నాని ద్రవీకృత్య ఔదుంబరేణ స్రువేణ
తిలమషాదియవాగూం జుహోతీ వాజస్యేమం ప్రసవస్సు
షువే అగ్ర ఇతి సప్తగ్రామ్యా హుత్వా అథారణ్యా జుహోతి
వాజో న స్సప్తేతి "

(ఆ. శ్రౌ. సూ.)

భావము : లోకములో సర్వప్రాణులకు అన్నము ముఖ్యముగ ఆపేక్షితము. అన్నము లేనిచో ప్రాణము నిలువబడదు. ఈ విషయమునే యజ్ఞదీక్షలో యజ్ఞము చేయు యజమానుడు యజ్ఞశాలలో ప్రవేశించిన పిమ్మట భోజనము చేయవలెనని ఈ క్రింది శ్రుతి బోధించుచు స్పష్టముగ చెప్పినది.

*"బహిః ప్రాణో వైమనుష్య స్తస్యాశనం ప్రాణో౽*
*శ్నాతి సప్రాణ ఏవ దీక్షిత అశితో భవతి యావానేవాస్య*
*ప్రాణ స్తేన సహమేధ ముపైతి ।"* (కృ.య.సం. 6.కాం. 1.ప్ర. 1.అను.)

ఈ శ్రుతిలో అన్నము ప్రాణస్థితికి హేతువుగాన అన్నము ప్రాణరూపముగ చెప్పబడినది. అట్టి ప్రాణరూప మగు అన్నము బహిఃప్రదేశమం దుండును గావున మనుష్యుడు బహిఃప్రాణుడు (అనగా బహిఃప్రదేశమం దున్న ప్రాణము గలవాడు). అందుచే భోజనము చేసి యజ్ఞ దీక్షను చేసినచో ప్రాణముతో కూడుకొని దీక్ష చేసినవాడగును.

"మిత్రబంధ్వాదిభిః ప్రార్థితో బహు భుంజీత" అను సూత్రానుసారము సమృద్ధిగ భోజనము చేయవలెను. అట్లు చేసినచో, సంపూర్ణ మగు ప్రాణముతో యజ్ఞదీక్షను పొందినవాడగును.

ఇట్టి అన్న సమృద్ధికి వ్యవసాయము, వైదిక కర్మ అనునవి రెండు సాధనములు. కావుననే అన్న సంపాదనకు పూర్వము ఇంద్రుడు వ్యవసాయ మొనర్చినపుడు సరస్వతీనది నుండి కాలువలను నిర్మించి వ్యవసాయము చేసినట్లు శ్రుతులవలన తెలియవచ్చుచున్నది ఈ విషయము ఆర్య వ్యవసాయప్రకరణములో వివరించచడమైనది.

## వైదికోపాయము.

అన్నసమృద్ధికి వేదోక్తకర్మల నాచరించుట వైదిక సాధనము. ప్రకృతములో వాజప్రసవీయహోమము వలన అన్ననిష్పత్తి ప్రతి పాదిత మగుచున్నది. చయనక్రతువులో ఈ దిగువమంత్రములచే (తిలమషాదిపదునాఱుగు ఓషధులయొక్క యవాగు (గంజి) చే) హోమమును చేయవలెను. ఈ హోమసాధన మగు మంత్రములలో తిలమషాది సప్తసంఖ్యాకము లగు గ్రామ్య ఓషధుల హోమమునకుమంత్రములు వాజపేయ ప్రకరణములో 'వాజస్యేమం' ఇత్యాదులు సప్తమంత్రములు చెప్పబడినవి. ఇక అరణ్యాఓషధులు, అనగా,

*"వేణు శ్యామాక నీవారా జర్తిలాశ్చ గవీధుకాః ।*
*అరణ్యజా మర్కటకా విజ్ఞేయా స్సప్త ధా స్మృతాః ॥"*

అను శ్లోక ప్రతిపాదితమైన సప్త ఓషధుల యవాగును ఈ క్రింది సప్తమంత్రముల చేతను హోమము చేయవలెను.

## వేణుయవాగూహోమ మంత్రము.

*"వాజో న స్సప్త ప్రదిశ శ్చతస్రో వా పరావతః ।*
*వాజో నో విశ్వై ర్దేవై ర్ధనసా తా విహావతు ।"* (కృ.య.సం. 4.కాం. 7.ప్ర. 12.అను.)

తా॥ తూర్పు మొదలగు నాల్గు దిక్కులును, ఊర్ధ్వ, అధో, మధ్య దిక్కులు మూడును, మొత్తము ఈ సప్త దిక్కులును ఆగ్నేయా విదిక్కులు నాలుగును మాకు అన్నప్రదము లగుగాక. ఆ అన్నము సర్వదేవతలచే ప్రేరిత మగుచు ధనప్రద మగు ఈ యజ్ఞమందు మమ్ములను రక్షించుగాక.

## శ్యామాకయవాగూహోమమంత్రము.

*"విశ్వే అద్య మరుతో విశ్వ ఊతీ విశ్వే భవం త్వగ్న*
*య స్సమిద్ధాః । విశ్వే నో దేవా అవసా గమంతు విశ్వ*
*మస్తు ద్రవిణం వాజో అస్మే ।"* (2. మం.)

తా॥ ఈ దినమందు సర్వమరుద్గణములు, సర్వదేవతలును మా రక్షణకొరకు ప్రవర్తింతురు గాక. మరియు, సర్వ అగ్నులు యోగ్యముగ ప్రజ్వలించుగాక. సర్వదేవతలు మమ్ములను రక్షించుటకు వత్తురుగాక. వారి కటాక్షముచే సమస్త ధనము మనకు చేకూరుగాక.

## నీవారహోమమంత్రము.

*"వాజస్య ప్రసవం దేవా రథై ర్యాతా హిరణ్యయైః*
*అగ్ని రింద్రో బృహస్పతి ర్మరుత స్సోమపీతయే ।"* (3. మం.)

తా॥ ఓ దేవతలారా! మాకు అన్నమును ప్రేరణ చేయుటకు అగ్న్యాదిదేవతలు, మరుద్గణములు సువర్ణ నిర్మితము లగు రథములతో మా యాగస్థానమును గూర్చి సోమపానము కొరకు వత్తురుగాక.

## "జర్తిల హోమమంత్రము.

*"వాజే వాజే__వత వాజినో నో ధనేషు విప్రా*
*అమృతా ఋతజ్ఞా! । అస్య మధ్వః పిబత మాదయధ్వం*
*తృప్తా యాత పథిభి ర్దేవయానైః ।"* (4. మం.)

తా॥ అన్నసంపాదకు లగు దేవతలారా! సర్వవిధములగు అన్న నిమిత్తము, ధన నిమిత్తము మమ్ములను రక్షింపుడు. మరియు, బ్రాహ్మణునివలె పరిశుద్ధులైనట్టియు, మరణరహితు లైనట్టియు, సత్యమును, యజ్ఞమును, తెలిసినట్టి మీరు మధురమగు ఈ హవిస్సును భుజింతురు గాక. భుజించుటచే హర్షయుక్తులగుదురుగాక. అనంతరము సంతృప్తు లగుచు స్వస్థానముల కేగుదురుగాక.

## గవీధుకహో మంత్రము.

*"వాజః పురస్తా దుత మధ్యతో నో వాజో దేవాగ్ం*
*ఋతుభిః కల్పయాతి । వాజస్యహి ప్రసవో నన్న మీతి*
*విశ్వా ఆశా వాజపతి ర్భవేయం ।"* (5 మం.)

తా॥ ఓ దేవతలారా! మాకు పూర్వవయస్సునందును, మధ్య వయస్సునందును సమృద్ధమగు అన్నము మీ కటాక్షమువలన ఉండుగాక. అన్నసంపత్తిచే దేవతల యాగములు చేయుటకు శక్యమగును గాన, భవత్ప్రసాదలబ్ధ మగు ఈ అన్నము తత్తత్కాలములందు యాగములచే పూజించదగిన దేవతలను సంపాదించును. మరియు, అన్న సమృద్ధి సర్వదిగ్వర్తు లగు ప్రజలను స్వాధీనము చేయునుకాన, నేను అన్న సమృద్ధికలవాడును (వాజపతిః) అగుదును గాక.

## మర్కటధాన్య హోమమంత్రము.

*"పయః పృథివ్యాం వయ ఓషధీషు పయో ది వ్యంత*
*రిక్షే పయోధాం । పయస్వతీః ప్రదిశ స్సంతు మహ్యం ।"* (6. మం.)

తా॥ అన్నసమృద్ధికి జల మవసరముగాన, పృథివ్యంతరిక్ష ద్యులోకములందు, సమస్త ఓషధులందు ఉదకమును యాగమహిమచే సంపాదింతునుగాక. మరియు, సమస్త దిక్కులు నాకొరకు ఉదక యుక్తములగుగాక.

## గార్మత (కులుత్థ) హోమమంత్రము.

*"సం మా సృజామి పయసా ఘృతేన సం మా సృ*
*జా మ్యప ఓషధీభిః । సోహం వాజగ్ంపనేయ మగ్నే ।"* (7. మం.)

తా॥ ఓ అగ్నీ! నీ కటాక్షముచే క్షీరముతోను, ఘృతముతోను సంయుక్తుడ నగుచుంటిని. మరియు ఉదకములను ఓషధులతో సంయోజనము చేయుచుంటిని. ఈ విధముగ క్షీరాదులతో సంయుక్తుడనగు నేను నీ ప్రసాదమువలన లబ్ధమైన అన్నము ఇతరులకు ఇత్తును గాక. ఇంతవరకు అరణ్యౌషధుల హోమమంత్రములు యేదును చెప్పబడినది. ఇదివరలో ప్రథమకాండలో వాజపేయ ప్రకరణములో పఠింపబడిన "తిలమాష వ్రీహియవాః ప్రియం గ్వణు గోధూమాః" అను శ్లోకోక్తములగు తిల, మాషాది ధాన్య హోమమంత్రుములు ప్రసంగసంగత్యా ఇచ్చట వివరించబడుచున్నవి. అనగా, ఇచ్చట బ్రాహ్మణములో 'చతుర్దశభి ర్జుహోతి' అని వాజపేయోక్తములగు సప్తమంత్రముల సంఖ్యతో నిచ్చట సప్తసంఖ్యను విధించుచుండుటచే ఆ మంత్రవ్యాఖ్య ఇచ్చట ప్రసక్త మని తాత్పర్యము.

## తిలధాన్యహోమమంత్రము.

*"వాజస్యేమం ప్రసవ స్సుషువే అగ్రే సోమగ్ం*
*రాజాన మోషధీ ష్వప్సు । తా అస్మభ్యం మధుమతీ*
*ర్భవంతు వయగ్ం రాష్ట్రే జాగ్రియామ పురోహితాః ।"* (1.మం.కృ.యు.సం.1.7.10)

తా॥ అన్నమున కుత్పాదకుడగు పరమేశ్వరుడు సృష్ట్యాది యందు ఓషధులలోను, ఉదకములలోను సారభూత మగు సోమలతా రూపమగు దీప్యమానపదార్థమును సృజించెను. అట్టి ఓషధులు, ఉదకములు మా కొరకు మాధుర్యోపేతము లగుగాక! మేము కూడ రాష్ట్ర మందు యాగానుష్ఠానాదికమందు అగ్రగాముల మగుచు జాగరూకులమై మెలగుదుముగాక.

## మాషధాన్యయివాగూ హోమమంత్రము.

*"వాజస్యేదం ప్రసవ ఆ బభూవే మా చ విశ్వా*
*భువవాని సర్వతః । స విరాజం పర్యేతి ప్రజానన్*
*ప్రజాం పుష్టిం వర్ధయమానో అస్మే ।"* (2. మం.కృ.యు.సం. 1.7.10)

తా॥ అన్నమున కుత్పాదకుడగు పరమేశ్వరుడు మాచే అనుష్ఠానము చేయబడుచున్న ఈ కర్మను ఈ సమస్త భువనములను అంతటను ఉత్పాదన చేసెను. ఆ పరమేశ్వరుడు మా అభిప్రాయమును సంపూర్ణముగ తెలిసికొనినవాడగుచు, మాకు పుత్రాదిప్రజను, ధనాది పుష్టిని వృద్ధి చేయుచున్న వాడగుచు మాచే చేయబడియెడి ఈ హవ్యమును సంపూర్ణముగ పొందుగాక!

## వ్రీహియవాగూమంత్రము.

*"వాజస్యేమం ప్రసవ శ్శిశ్రియే దివమిమా చ విశ్వా*
*భువనాని సమ్రాట్ । అదిత్సంతం దాపయతు ప్రజాన*
*న్రయిం చ న స్సర్వవీరాం నియచ్ఛతు ।"* (3.మం.కృ.యు.సం. 1.7.10.)

తా॥ అన్నోత్పాదకుడగు పరమేశ్వరుడు ఈద్యులోకమును, ఇతరములగు సర్వభువనములను, ఆశ్రయించి యుండెను. అట్టి పరమేశ్వరుడు సమస్త భువనములకు రాజయి హవిర్ధానమందు ఇచ్ఛా రహితుడనగు నన్ను (నా బుద్ధిని ప్రేరణ చేసి) హవిస్సును ఇప్పించుగాక. అనగా, కర్మ శ్రద్ధ గలవానినిగా చేయుమని భావము. మరియు మా కొరకు పుత్రభృత్యాదులతో కూడుకొనిన ధనమును నియమముగ ఇచ్చుగాక.

*"అగ్నే అచ్ఛావదేహ నః ప్రతి న స్సుమనా భవ ।*
*ప్రణో యచ్ఛ భువస్పతే ధనదా అసి న స్త్వం ।"*(4.మం.కృ.యు.సం.1.కాం.7.ప్ర.10.అను.)

తా॥ ఓ అగ్నీ! ఈ కర్మయందు మాకు అభిముఖుడవై హితవును బోధింపుము. మా విషయములో దయార్ద్రహృదయుడ వగుము. ఓ భూమిపతే! ప్రభువగు నీవు మాకు ధనదాతవు గావున, అత్యధికముగ ధనమును ఇమ్ము.

*"ప్రణో యచ్ఛ త్వర్యమా ప్రభగః ప్ర బృహస్పతిః*
*ప్ర దేవాః ప్రోత సూనృతా ప్ర వాగ్దేవీ దదాతు నః ।"* (5. మం.0

తా॥ అర్యమ, భగ, బృహస్పతులు, ఇతరులు అగు అందరు దేవతలు మాకు ధనము నిత్తురుగాక. మరియు, ప్రియనాగభిమాని దేవతయు, వాఙ్మాత్రాభిమానిదేవతయు మాకు ధనము నిత్తురుగాక. విప్రపరివ్రాజకన్యాయముచే "విప్రానానయ, పరివ్రాజకమానయ" అను నిర్దేశములో, పరివ్రాజకుడుకూడ విప్రుడైనను, పృథఙ్నిర్దేశముచే పరివ్రాజకుడు విప్రులలో ఉత్తముడను సామాన్య విశేషభావము ద్యోతమాన మగుచున్నది. అట్లే, ప్రకృతములో గూడ దేవతలలో అర్యమాదులు ఉత్తము లనియెడి భావముచే దేవతలకంటె అర్యమాదులు శ్రుతిచే వేరుగ నిర్దేశించబడిరి.

*"అర్యమణం బృహస్పతి మిత్రందం దానాయ చోద*
*య వాచం విషుగ్ం సరస్వతీగ్ం సవితారం చ వాజినం ।"* (6. మం.)

తా॥ ఓ పరమేశ్వరా! నీవు అర్యమాది దేవతలను మాకు ధనము నిచ్చుకొరకు ప్రేరణ చేయుము. (ఇచ్చట వాక్సరస్వతీశబ్దములు వాఙ్మాత్రాభిమానదేవతను, ప్రియవాగభిమానిదేవతను చెప్పును). వాజినపదమునకు అన్నాధిపతి యర్థము.

*"సోమగ్ం రాజానం వరుణ మగ్ని మన్వారభామహే ।*
*ఆదిత్యాన్ విష్ణుగ్ం సూర్యం బ్రహ్మాణం చ బృహస్పతిం ।"* (7. మం.)

తా॥ ఋత్విక్కుల మగు మేము ప్రథమముగ కర్మారంభకులగు సోమరాజాదుల ననుసరించి కర్మారంభమును చేయుచుంటిమి. అందుచే వారందరును మమ్ముల ననుగ్రహింతురుగాక.

ప్రథమకాండోక్తము లగు ఈ పై వాజస్యేమమిత్యాది సప్త మంత్రములతోను ఇచ్చట "వాజోనస్సప్తే" త్యాది మంత్ర సంఖ్యనుఈ క్రింది శ్రుతి విధించుచున్నది.

*"చతుర్దశభిర్జుహోతి సప్తగ్రామ్యా ఓషధయ స్సప్తా*
*రణ్యా ఉభయేషా మవరుద్ధ్యై ।"*

తా॥ తిల, మాష మున్నగు సప్తగ్రామ్యఓషధులు, వేణు, శ్యామాకాదిసప్త అరణ్యఓషధులు (కలసి మొత్తము పదునాలుగు) ఈ ఉభయ విధములగు ధాన్యముల సమృద్ధికొరకు

పదునాలుగు మంత్రములచే హోమము చేయవలెను. ఒక్కొక్క మంత్రముచే ఒక్కొక్క హోమము చేయవలెను.

"అన్న స్యాన్నస్య జుహో త్యన్న స్యాన్న స్యావరుద్ధై "

తా॥ అన్ని మంత్రములను ఉచ్చరించి ఒకే హోమమును చేయకుండ ఒక్కొక్క మంత్రము నుచ్చరించి ఒక్కొక్క హోమమును చేయవలెను. అట్లు చేసినచో సాంకర్యము లేకుండ సర్వాన్నములు లభించును.

ఈ విధముగ అగ్నిచయనక్రతువులో వాజప్రసవీయహోమముచే అన్ని ధాన్యములు సమృద్ధిగా సంభవించు నని శ్రుతి వక్కాణించుటచే ఈ హోమము అన్నసమృద్ధికి వైదికసాధన మని స్పష్టమగుచున్నది.

## చమకబ్రాహ్మణము.

"వసో ర్ధారాం జుహోతి వసో ర్మే ధారా సదితి వా
ఏషా హూయతే ఘృతస్య వా ఏన మేషా ధారాముష్మిన్
లోకే పిన్వమానోపతిష్ఠతే ।"

తా॥ ధనముయొక్కసాంతత్యముకు హేతుభూత మగు ఆహుతి గావున, ఈ ఆహుతికి 'వసోర్ధారా' అను పేరు వచ్చినది. ఏకాదశానువాకాత్మక మగు చమకముచే వసోర్ధారా హోమమును చేయవలెను. ఉక్త వసోర్ధారానామనిర్వచనమును శ్రుతి చేయుచున్నది. ధనముయొక్కసాంతత్యము నాకు అగుగాక యను కామనచే యజమానునిచే ఈ హోమము చేయబడుచున్నది. కావున, ఈ హోమముచే ఘృతధార స్వర్గలోకమందు ఈ యజమానుని సంతోషపరచుచు సేవించును.

## హోమద్రవ్యము.

"ఆజ్యేన జుహోతి తేజో వా ఆజ్యం తేజో వసోర్ధారా
తేజ సై వాస్మై తేజోవరుంధే ।" (కృ.య.సం.5.కాం.4.ప్ర.8.అను.)

తా॥ ఈ వసోర్ధారాహోమము ఆజ్యముతో చేయవలెను. ఆజ్యహోమముచే జ్వాల బయల్దేరునుగాన, ఆజ్యము తేజోహేతువు గనుక, తేజోరూపము. ధనసమృద్ధి కూడ తేజోరూపము గనుక, వసోర్ధార తేజోరూపము. గాన తేజోరూప మగు ఆజ్యముచే హోమము చేయుటచే తేజోరూప మగు ధనసమృద్ధిని పొందును.

## వసోర్ధారాహోమము వలన కామప్రాప్తి.

"అధో కామా వై వసోర్ధారా కామా నేవావరుంధే ।"

తా॥ ధనసమృద్ధి కామశబ్దవాచ్య మగు సమస్త భోగములకు హేతువుగాన, కామరూపము దాని హోమముచే కామములను పొందును.

## వసోర్ధారామంత్రమునకు సాంతత్యము.

"యం కామయేత ప్రాణా నస్యాన్నాద్యం విచ్ఛింద్యా
మితి విగ్రాహం తస్య జుహుయా త్ప్రాణా నేవాస్యాన్నా
ద్యం విచ్ఛినత్తి యం కామయేత ప్రాణానస్యాన్నాద్యగ్ం
సంతనుయామితి సంతతాం తస్య జుహుయా త్ప్రాణా
నేవాస్యాన్నాద్యగ్ం సంతనోతి ।"

తా॥ యజమానునియొక్క ప్రాణములను, అన్నమును విచ్ఛిన్నమును చేయవలె నని ద్వేషించెడి అధ్వర్యుడు ఈ వసోర్ధారామంత్రమును మధ్యయందు విచ్ఛిత్తిచేసి హోమము చేయవలెను. ఆ మంత్రవిచ్ఛిత్తిచే యజమానుని ప్రాణములు, అన్నము విచ్ఛిన్నమగును. యజమానుని ప్రాణములకు, అన్నముకు విచ్ఛిత్తి లేకుండ సాంతత్యమును కోరెడి అధ్వర్యుడు మంత్రమును విచ్ఛిత్తి లేకుండ హోమము చేయవలెను. ఆమంత్ర సాంతత్యమువలన అన్న ప్రాణములు యజమానికి సంతతముగ నుండును.

"ద్వాదశద్వాదశాని జుహోతి ద్వాదశమాసా స్సంవ
త్సర స్సంవత్సరే ణై వాస్మై అన్న మవరుంధే ।" *(కృ.య.సం.5.కాం.4.ప్ర.8.అను.)*

తా॥ 'వాజశ్చ మే' మొదలు "అన్నం చ మే క్షుచ్చ మే" అను వాక్యమువరకు గల నూటనలుబది నాలుగు వాక్యములను ద్వాదశ సంఖ్యచే విభజించి (శ్రుతి) స్తుతి చేయుచున్నది. పంద్రెండు వాక్యముల సమూహము ద్వాదశము. అట్టి ద్వాదశ వాక్యసమూహములు తిరిగి పంద్రెండు. అట్లు మొత్తము నూటనలుబది నాలుగు అగును. దానిలో అంతర్గత మగు ద్వాదశ సంఖ్య మాసద్వారా సంవత్సర రూపము గావున, సంవత్సర సాధ్య మగు అన్నమును (ఈ ద్వాదశ సంఖ్య ద్వారా) యజమానుడు పొందును.

'అన్నం చ మే__క్షుచ్చ మ ఇత్యాహైత ద్వా అన్నస్య
రూపగ్ం రూపే ణైవాన్న మవరుంధే ।' (మం.)

తా॥ పూర్వమంత్రములో వాక్యసమూహగత మగు ద్వాదశసంఖ్యచే (పంద్రెండు మాసములు గనుక) సంవత్సర రూపత్వమును సంపాదించి సంవత్సర సాధ్యమగు

అన్నప్రాప్తి (ఈపరంపరగ) చెప్పబడుచున్నది. 'అన్నం చ మే' ఇత్యాది వాక్యములలో సాక్షాత్తుగ అన్నవాచకము అన్నపదము, అన్నసాధ్య మగు క్షుత్పరిహారమును చెప్పెడి "అక్షుత్" పదము, అన్నసాధనమును చెప్పెడి వ్రీహ్యాది పదములు కొన్ని అన్న సాధ్యములను, కొన్ని అన్న సాధనములను చెప్పుచున్నవి గాన ఇవన్నియు అన్నవాచకములే. ఈ విధముగ ఈ పదములచే అన్నరూపము చెప్పబడుచున్నదిగాన స్వరూపముచే అన్నప్రాప్తిని ఈ మంత్రవాక్యములు చెప్పుచున్నవి.

'అగ్ని శ్చ మ అపశ్చ మ ఇత్యాహైషా వా అన్నస్య
యోని స్స యోన్యే వాన్న మవరుంధే ।' (మం.)

తా॥ అగ్నివలన అన్నము ఉత్పన్న మగునుగాన అగ్ని అన్నమునకు కారణము. ఉదకములు వ్రీహ్యాద్యోషధులకు ఉత్పాదకములు గాన ఉదకములు అన్నమునకు కారణము. ఈ మంత్రపాఠముచే అనేక ప్రకారము లగు కారణములతో కూడిన అన్నమును పొందును. ఈ విధముగ పంచమానువాక వాక్యప్రశంస.

## షష్ఠానువాక వాక్యప్రశంస.

'అర్ధేంద్రాణి జుహోతి దేవతా ఏవావరుంధే య
త్సర్వేషా మర్ధ మింద్రః ప్రతి తస్మా దింద్రో దేవతానాం
భూయిష్ఠభా క్తమ ఇంద్ర ముత్తర మాహేంద్రియ
మేవాస్మి న్నుపరిష్టా ద్దధాతి ॥' (మం.)

తా॥ అర్ధభాగమందు ఇంద్ర శబ్దము పఠించబడు వాక్యములు అర్ధేంద్రములు. ఆ వాక్యములలో పూర్వార్ధములందు అగ్నీషోమాది దేవతలు చెప్పబడుచుండిరిగాన, యజమానుడు ఆ మంత్రపాఠముచే ఆ దేవతలను పొందును సర్వవాక్యములలో సగము భాగమందు ఇంద్రశబ్దము పఠించబడుటచే ఇంద్రుడు అత్యంతము అధికభాగము కలవాడు. మరియు, ఈ మంత్రములలో ఉత్తరార్ధమందు ఇంద్రశబ్ద పాఠముచే యజమాని ఉపరిష్టాత్ప్రదేశమందు (శిరోభాగమందు) చక్షురాదీంద్రియసామర్థ్యమును స్థాపన చేయును.

"యజ్ఞాయుధాని జుహోతి యజ్ఞో వై యజ్ఞా
యుధాని యజ్ఞ మేవావరుంధే__ధో ఏత ద్వై యజ్ఞస్య
రూపగ్ం రేపేణై వ యజ్ఞమవరుంధే ।" (మం.)

తా॥ "అగ్ంశుశ్చ మే" అను వాకములో అంశు, అదాభ్య, ఉపాగ్ంశు పాత్రలు ప్రత్యక్షముగ యజ్ఞనిష్పాదకములుగాన యజ్ఞ స్వరూపములు. "ఇధ్మశ్చ మే బర్హిశ్చమే" అను

వాకములోని ఇధ్మా, బర్ హిరాదులు పరంపరగా యజ్ఞనిష్పాదకములు గాన అవియు యజ్ఞ స్వరూపములు. అనగా సాక్షాత్తుగా గాని, పరంపరగాగాని యజ్ఞ సాధనమగు పాత్ర లన్నియు యజ్ఞస్వరూపములు. ఇట్టి యజ్ఞరూపమగు యజ్ఞాయుధమంత్రములచే హోమము చేయుటచే స్వరూపముచే యజ్ఞమును పొందుచున్నాడు.

## స్వగాకార వాక్యతాత్పర్యము.

*"అవభృధశ్చ మే స్వగాకారశ్చ మ ఇత్యాహ సర్వా కృత్యై ।"* (మం.)

తా॥ ఇదివరలో దేవతల కిచ్చిన హవిస్సులు సాంకర్యము లేకుండ తత్తద్దేవతలకు స్వాధీనము ఈ మంత్రహోమముచే అగును.

*"అగ్నిశ్చ మే ఘర్మశ్చ మ ఇత్యాహైత ద్వై బ్రహ్మ*
*వర్చసస్య రూపగ్ం రూపేణైవ బ్రహ్మవర్చస మవ రుంధే ।"* (మం.)

తా॥ అగ్న్యాదులచే బ్రాహ్మణ కర్మలు నిష్పన్నమగుచున్నవి గాన, అగ్న్యాదులు బ్రహ్మవర్చస స్వరూపము. అందుచే ఈ మంత్ర హోమముచే బ్రహ్మవర్చస ప్రాప్తి యగును.

## 9వ అనువాకములో ఉత్తరార్ధవాక్య ప్రశంస.

*"ఋక్చ మే సామ చ మ ఇత్యాహైత ద్వై ఛంద*
*సాగ్ం రూపగ్ం రూపేణైవ ఛందాగ్ స్యవరుంధే ।"(మం.)*

తా॥ ఋగాదులు వేదరూపములుగాన, ఈ మంత్రహోమముచే వేదస్వాధీనత్వము సంప్రాప్తమగును.

## 10వ అనువాకములో పూర్వార్ధగత వాక్యప్రశంస.

*"గర్భాశ్చ మే వత్సాశ్చ మ ఇత్యాహైత ద్వై పశూనాగ్ం*
*రూపగ్ం రూపేణైవ పశూ నవరుంధే ।"* (మం.)

తా॥ గర్భవత్సాదులు పశువులు గాన, ఏతన్మంత్రహోమముచే పశుప్రాప్తి యగును.

## 10వ అనువాకములో ఉత్తరార్ధగతవాక్య ప్రశంస.

*"కల్పాన్ జుహో త్యక్ప్తస్యక్ప్త్యై ।"* (మం.)

తా॥ "ఆయు ర్యజ్ఞేన కల్పతాం" ఇత్యాది హోమమంత్రకల్పముచే స్వకార్య నిర్వహణ మందు అసమర్థమైన యజమానియొక్క వస్తు జాతము స్వస్వకార్యములను చేయుటకు సమర్థ మగును.

## 11వ అనువాకములో పూర్వార్ధ వాక్యప్రశంస.

"యుగ్మదయుజే జుహోతి మిధునత్వాయ ।" (మం.)

తా॥ నాలుగు, యెనిమిది, మున్నగునవి యుగ్మరాశులు. ఒకటి, మూడు, మున్నగునవి అయుగ్మరాశులు. ఈ రెండు రాశులును స్త్రీ పురుషులవలె విలక్షణములు గాన, ఈ మంత్రహోమముచే మిథునత్వ సంపత్తి సిద్ధించును.

## రెండు రాశులందు ఉత్తరోత్తరాధిక్యప్రశంస.

"ఉత్తరావతీ భవతో౽భిక్రాత్యై ।" (మం.)

తా॥ బేసి సంఖ్యా రాశిలో 1,3,5 మున్నగునవి 33 వరకును, సమసంఖ్యా రాశిలో 4,8,12 మున్నగునవి 48 వరకును, (ఈ విధముగ) రెండు రాశులలోను ఉత్తరోత్తరత్వముచే యజమానికి సర్వతః వ్యాప్తి లభించును.

## సమ, విషమసంఖ్యావాచక శబ్దములకు తాత్పర్యము.

"ఏకా చ మే తిస్రశ్చమ ఇత్యాహ దేవఛందసం వా
ఏకా చ తిస్ర శ్చ మనుష్య ఛందసం చతస్ర శ్చాష్టౌ చ
దేవ ఛందసం చైవ మనుష్య ఛందసం వావరుంధే ।" (మం.)

తా॥ బేసి సంఖ్య దేవతలకు ప్రియ మగు ఛందస్సులు. సమ సంఖ్య మనుష్య ప్రియము లగు ఛందస్సులు. అందుచే సమ, విషమ సంఖ్యా వాచకశబ్దములచే హోమమువలన దేవ, మనుష్య ఛందస్సులను రెండిటిని స్వీకరించిన వాడగును.

## రెండు రాశులకు సంఖ్యావృద్ధికి అవధి ప్రశంస.

"అత్రయ స్త్రిగ్ంశతో జుహోతి త్రయస్త్రిగ్ంశ
ద్వై దేవతా దేవతా ఏవావరుంధ అష్టాచత్వారిగ్ంశతో
జుహో త్యష్టాచత్వారిగ్ంశ దక్షరా జగతీ జాగతాః పశవో
జగత్యై వాస్మై పశూ నవరుంధే ।" (మం.)

తా॥ దేవతలు 33రు కావున, 1 మొదలు బేసి సంఖ్యలు 33 వరకు హోమము చేయుటచే దేవతలను స్వాధీనము చేసికొనినవాడగును. జగతీఛందస్సు 48 అక్షరములు కలది గావున, సరిసంఖ్యలు 4 మొదలు 48 వరకు హోమము చేయుటచే జగతీ ఛందస్సంపత్తి ద్వారా పశుప్రాప్తి యగును.

## 11వ అనువాకములో ఉత్తరార్ధవాక్యప్రశంస.

"వాజశ్చ ప్రసవశ్చేతి ద్వాదశం జుహోతి ద్వాదశ
మాసా స్సంవత్సర ఏవ ప్రతితిష్ఠతి ।" (మం.)

తా॥ ఈ పంద్రెండు మంత్రములచే ఒక హోమము చేయవలెను. అట్లు చేయుటచే ద్వాదశ సంఖ్యచే మాసద్వారా సంవత్సరమందే ప్రతిష్ఠితుడగును.





శ్రీ మహాగణాధిపతయే నమః ।

# వేదసార రత్నావళి

## 15. ఆర్షవ్యవసాయ పద్ధతులు.

### ఉపోద్ఘాతము

విద్యారణ్యయతీంద్రులవారు కృష్ణయజుర్వేద ప్రథమకాండ సంహితాభాష్యములో "ఋషి మార్షేయం" (కృ.య.సం.1-4-43) అను స్థలమున 'ఋషిః వేదార్థజ్ఞః' అని అర్థము వ్రాసియుండిరి. అందుచే 'ఋషి' శబ్దమునకు వేదార్థమును తెలిసినవా రని యర్థము. వారి సంబంధమైనవి ఆర్షములు. 'ఆర్షవ్యవసాయపద్ధతు' అనగా వేదములో చెప్పబడిన వ్యవసాయ పద్ధతులని యర్థము.

వాటిని ముఖ్యముగ వివరించుచు, ప్రసంగానుప్రసంగముగ కృషివివరము, ఎఱువులు, పంటలు, ధాన్యపుకోతలు, దంపు, వంట, వంటకు పాత్ర విశేషము, భోజన విషయమును మున్నగువాటికి సంబంధించినవియు, ప్రకృతకాలోపయోగులు, అపూర్వములు నగు అనేక విషయములు శ్రుతి, స్మృతి, శిష్టాచారప్రమాణ ప్రదర్శన పూర్వకముగ వివరింపబడినవి.

ఈ కృష్యాదులు మన దృష్టికి గోచరములగు కార్యములను నెరవేర్చుచున్న వను విషయము అందరకును అనుభవసిద్ధమే. ఇంతే గాక, అలౌకికములును, శ్రుత్యాదులవలననే తెలిసికొనదగినట్టివియు నగు విషయవిశేషములు గూడ వీటిలో నున్న వను విషయము దృష్టిలో నుంచుకొనదగినది.

### జీవనార్థము వృత్తులు.

పూర్వకాలములో బ్రాహ్మణునకు జీవనార్థము వృత్తులను చెప్పు సందర్భములో మనుస్మృతిలో -

"ఋతా మృతాభ్యాం జీవేత మృతేన ప్రమృతేన వా। సత్యా నృతాభ్యాం జీవేత న శ్వవృత్త్యా కదాచన।" అని చెప్పబడియున్నది. ఈ వచనానుసారము ఋతవృత్తి, అమృతవృత్తి,

మృతవృత్తి. ప్రమృత వృత్తి, సత్యానృతవృత్తి అను ఐదు వృత్తులు జీవనోపాయముగ విధించ బడి యున్నవి. ఇచ్చట ఋతశబ్దమునకు –

"ఋత ముంఛశిలం జ్ఞేయం। ఉంఛః కణశ ఆదానం। కణి కాద్యార్జనం శిలం।" అను నిర్వచనానుసారము' కోసిన చేలలో వెన్నులను, గింజలను ఏరుకుని వాటిచే జీవించుట ఋతమని అర్థము. "అయాచితం స్యా దమృతం" అను వాక్యానుసారము అమృతవృత్తి యనగా ఇతరులను యాచించకుండ తనకు సంప్రాప్తమైన దానిచే జీవనము చేయుట యని యర్థము. "మృతం తు యాచితం జ్ఞేయం" అను నిర్వచనానుసారము మృతవృత్తి యనగా యాచ్నావృత్తిచే జీవించుట. నాల్గవది యగు ప్రమృతవృత్తి యనగా, 'ప్రమృతం కర్షణం స్మృతం' అను నిర్వచనానుసారము, వ్యవసాయవృత్తిచే జీవించుట యని యర్థము. (సత్యానృతే తు వాణిజ్యం) అనువచనానుసారము (సత్యానృతవృత్తి యనగా వాణిజ్యము).

వీటిలోని మొదటి వృత్తిత్రయము సార్వత్రికముగ నీకాలమునకు అననుకూలముగ గోచరించుటచే నాల్గవది యగు ప్రమృతవృత్తిని గూర్చియే యిచ్చట విమర్శించుదము. ప్రకృతములో ప్రభువులు గూడ ప్రాజెక్టుల నిర్మాణములు మున్నగు ప్రయత్నాతిశయములచే ఈ కృషివృత్తియెడలనే శ్రద్ధ చూపుటచే దీని ప్రాచీన విశేషములను తెలిసికొనవలసిన ప్రసక్తియు, ఆధునిక ప్రాచీనపద్ధతుల యొక్క అంతరమును గమనించవలసిన యవసరమును గల్గినది.

## అర్షవ్యవసాయ సంప్రదాయము.

ప్రకృతకాలములో వ్యవసాయ శాస్త్రజ్ఞులు దున్నుటకును, తదితర వ్యవసాయ వ్యాపారములకును ఉపయోగకరము లగు లోహమయ మైన అపూర్వ యంత్రములను (ట్రాక్టర్లు వగైరాలను) తయారు చేయుచున్నారు. వాటికి భూమిని దున్నుటకు ఇనుప కోలలను అనేకముల నమర్చి అట్టి యంత్రముచే ఒకసారి దున్నినచో పూరవకర్షకులు (ఒక ఇనుపకోలగల దారుమయమగు నాగలిచే) అనేకసార్లు దున్నిన పని శీఘ్రముగ జరుగుట, యంత్రముతో దున్నుటచే ఎడ్లకు శ్రమ లేకుండుట, లోతుగ దున్నుట మున్నగు సౌకర్యము లుండునని వీరి యాశయము.

ఇక అర్షవ్యవసాయసాంప్రదాయమును గమనింతము. పూర్వ కాలములో ఒక నాగలికి ఇప్పటివలె ఒక కాడి, దానికి రెండు యడ్లను గట్టుటయేగాక, ఒకే నాగలికి 3, 6, 12 కాడులను కట్టుటయు, క్రమముగ కాడి ఒక్కంటికి రెండు ఎడ్ల చొప్పున 6, 12, 24 ఎడ్లను కట్టి దున్నెడి సంప్రదాయము శ్రుతిలో గనబడుచున్నది.

# వివరణము.

మహాగ్నిచైన మనెడి యజ్ఞక్రతువులో భూమిని దున్ని ఓషధులను చల్లవలసియున్నది. అచ్చట దున్నెడి నాగలికి కాడులను (యుగములను) కట్టుటకు రెండు మంత్రములు, వాటిని వినియోగ సూత్రములు గలవు.

1. *'సీరా యుంజంతి కవయో యుగా వితన్వతే*
   *పృథక్ । ధీరా దేవేషు సుమ్నయా ।'*

2. *యునక్తసీరా వియుగా తనోత కృతే యోనౌ*
   *వపతేహ బీజం । గిరా చ శ్రుష్టి స్సభరా అసన్నో*
   *నేదీయ ఇత్సృణ్యా పక్వ మాయత్' (కృ. య. సం. 4. కాం. 2. ప్రశ్న. 5. అను)*

"ద్వాభ్యాగ్ం సీరం యునక్తి షడ్గవం ద్వాదశగవం చతుర్విగ్ంశతిగవం వా" (ఆ. శ్రౌ. సూ)

తా॥ పై రెండు మంత్రములను ఉచ్చరించి దున్నబోయెడి నాగలికి 6 లేక, 12 లేక, 24 ఎడ్లను కట్టుటకు అనుకూల మగునట్లు 3 లేక 6 లేక 12 కాడుల నమర్చవలె నని పై సూత్రమునకు తాత్పర్యము.

పై మంత్రముల కర్థము.

దేవతలకు హవిస్సంపాదన ద్వారా సుఖమును చేకూర్చవలెనని యిచ్ఛయించెడి వారును, అనలసులును నగు కర్షకులు నాగలికి 3, 6, 12 కక్ష్యావిశేషములందు ఎడ్లను గట్టుటకు కాడులను వేరు వేరుగ విస్తరింపజేయుచున్నారు. (1. మం.)

ఓ కర్షకులారా! దున్నుటకు నాగలిని గూర్చుడు. ఆ నాగలికి కాడులను (యుగములను) 3, 6, 12 కక్ష్యావిశేషములందు విస్తరింప జేసి, 6, 12, 24, ఎడ్లను గట్టి, అట్టి నాగలిచే దున్నిన భూముయందు ఓషధులను జల్లుడు. పెద్దల యాశీర్వాదముచే వాటి యంకురములు స్తంబములై (దుబ్బు చేసి) పండిన పిదప కొడవళ్ళచే కోయబడిన ఫలము దేవతాహవిర్భాగము కొరకు మన సమీపమునకు వచ్చుగాక! (2. మం.)

భావము: పై శ్రుతి, సూత్రమువల వలన ఒకే నాగలికి 12 కాడుల నమర్చి 24 యెడ్లను గట్టి ఒకేసారి దున్నెడి సౌకర్యము లున్నట్లును, ఒక పర్యాయమునకే 12 సీతలు (నాగలి చాళ్ళు) ఏర్పడు ననియు స్పష్ట మగుచున్నది. మరియు, అచైన ప్రకరణములో వెనుకటి మంత్రములచే గట్టిన నాగళ్ళచే దున్నుటకు మరి రెండు మంత్రములును, వాటికి వినియోగ సూత్రమును గలవు.

*"లాగలం పవీరవగ్ం సు శేవగ్ం సుమతి త్సరు ।*
*ఉదిత్కృషతి గా మవిం ప్రఫర్వ్యం చ పీవరీం । ప్రస్థావ*
*ద్రథవాహనం ।"* *(1. మం.)*

*"శునం నః ఫాలా వితుదంతు భూమిం శునం*
*కీశానా అభియంతు వాహాన్ । శునం పర్జన్యో మధునా*
*పయోభి శ్శునాసీరా శున మస్మాసు ధత్తం ।"* *(2. మం.)*

"ద్వాభ్యాం కృషతి" (ఆ.శ్రౌ.సూ.)

తా॥ వజ్రమువలె తీక్ష్ణమగు ఈ నాగలి బాగుగా దున్నుగాక. ఈ దున్నుటవలన సంభవించెడి ఫలాధిక్యముచే గోవులు, గొఱ్ఱెలు, ప్రయాణసమర్థ మగు శకటములు మున్నగు వానిని యజమానులు పొందుగాక. (1. మం.)

తా॥ నాగలియొక్క అగ్రభాగములు సుఖముగా భూమిని విశేషించి దున్నుగాక! కర్షకులు యెడ్లకు శ్రమ లేకుండునట్లు తోలుచు నడచుదురుగాక. మేఘుడు మధుర రసోపేత మగు జలముచే సుఖముగా నుండునట్లు వర్షించుగాక. ఓ వాయు ఆదిత్యులారా! మాకు సుఖమును చేకూర్చుడు. (2. మం.)

మరియు రాజసూయయాగాంతర్గతము లగు చాతుర్మాస్యలలో 'శునాసీరీయ' అను పర్వలో –

*"ఐంద్రాగ్నం ద్వాదశకపాలం .... ద్వాదశగ వగ్ం సీరం దక్షిణా ।"*

*(కృ.య.సం. 1.కాం. 8.ప్ర. 7.అను.)*

అను మంత్రముచే పండ్రెండు యెద్దులచే వహించబడెడి నాగలిని (లాంగలమును) దక్షిణగా యివ్వవలసినదిగ ఈ శ్రుతి బోధించుచున్నది.

ఈ విధముగ మంత్రబ్రాహ్మణ, సూత్రములచే అనేక ఎడ్లతో ఒకేసారి అనేక కరుకోలలచే దున్నుట ఆర్షసంప్రదాయములో అనాదినుంచియు ఉన్న విషయమే గాని అపూర్వము గాదని స్పష్ట మగుచున్నది.

## ఇంద్రుడు వ్యవసాయము చేయుట.

ఈ విధముగ మహాగ్నిచైనాదులందు మానవకర్షకులు పూర్వోక్తమగు లాంగలవిశేషముచే (నాగలిచే) దున్నుచున్నట్లు స్పష్టపడుటయే గాక, ఇంద్రాదిదేవతలు గూడ వ్యవసాయము జేసినట్లును, దున్నించి నట్లును వేదములో గన్పట్టుచున్నది.

"ఏత మ్ముత్యం మధునా సంయుతం యవం సర
స్వత్యా అధిమనా వచర్క్రుషుః । ఇంద్ర అసీ త్సీరపతి
శ్శతక్రతుః కీనాశా అస న్మరుత స్సుదానవః ।" (కృ. య. బ్రా. 2. కాం. 4. ప. 8. అను. )

తా॥ పూర్వము ప్రజాపతి రాజుగా నుండి పరిపాలించెడి కాలములో నూరు అశ్వమేధ క్రతువులను చేసిన ఇంద్రుడు వ్యవసాయము జేయుచు మరుద్గణములచే దున్నించి, యవధాన్యములను జల్లించి, మధురరసోపేత మగు సరస్వతీజలముచేత తడిపించినట్లు ఈ శ్రుతి బోధించుచున్నది.

మరియు అథర్వవేదములో ఈ 'ఏతముత్యం' అను పూర్వమంత్రమే కొంచెము భేదముతో నున్నది.

ఉదా: "అధిమనావచర్క్రుషుః" అను కృష్ణయజుర్వేద మంత్రములో 'అధిమనౌ' అను పదమునకు ప్రజాపతి యని అర్థము వ్రాసిరి. అథర్వవేదమంత్రములో 'మనౌ' అను పదమునకు 'మనుష్యజాతివిషయమై' అని యర్థము వ్రాసిరి.

భావము: పూర్వము ఇంద్రుడు తాను వ్యవసాయము చేయుచు కాశీప్రాంతమందున్న సరస్వతీనదీతీరమందలి భూములను మరుద్గణములచే దున్నించి, మనుష్యజాతి కొరకు యవధాన్యమును జల్లించెను. దీనివలన ఇంద్రుడు "సీరపతి" (అనగా వ్యవసాయకుడు) అను యర్థము శ్రుతిమూలముగ మనకు లభించుచున్నది. ఎట్లన, ఈ మంత్రములో వ్యవసాయము చేయించుచున్న ఇంద్రుని సీరపతి యనియు, దున్నుచున్న మరుద్గణములను కర్షకులనియు శ్రుతి వ్యవహరించుటచే, ఇంద్రుడు తాను స్వయముగ దున్నకపోయినను, అతడే సీరపతి లేక వ్యవసాయకుడాయెను.

ఇదే విధముగ లోకములో –

"పంచభిర్హ లైః గ్రామణీః గ్రామం కర్షతి "

అను వ్యవహారము సుప్రసిద్ధమై యున్నది. అనగా, గ్రామాధికారి ఐదు నాగళ్ళచే గ్రామమును దున్నుచున్నాడని యర్థము. ఇచ్చట గూడ, ఒక మనుష్యుడు ఐదు నాగళ్ళచే ఒకే కాలమందు దున్నుట శక్యముకాదు గావున, ఐదుగురిచే దున్నించుచున్నాడను యర్థమును గ్రహించకతీరదు. ఐదుగురిచే దున్నించినను వ్యవసాయకర్తృత్వము "గ్రామణీః కర్షతి" అని గ్రామాధికారికే వ్యవహరింపబడుచున్నది.

## ఎడ్లకు శ్రమ లేకపోవుట.

ఆధునికుల యంత్రోపయోగమువలన ఎడ్లకు శ్రమ లేక పోవుట గూడ నొక అనుషంగిక సౌకర్యముగ పరిగణించుటను గూర్చి విచారింతము. ప్రకృతశాస్త్రజ్ఞుల దృష్టి

కోణానుసారము ఈ యెడ్ల వలన మన దృష్టికి గోచరించెడు ఉపయోగము భూమిని దున్నుట ఒకటియే యైనచో, వాటికి శ్రమ లేకుండ ఆ పనిని యంత్రములచే చేయించిన చాలును. కాని దీనినేగాక మన దృష్టికి, మన ఊహలకు అతీతము లైనట్టివియు, వేదైక సమధిగమ్యము లైనట్టి యనేక ఉపయోగాంతరములను అథర్వవేదము ఘోషించుచున్నది.

అథర్వవేదములో అనడుత్ (కృషి) ప్రకరణములో ఈ యెడ్లు చేయు పనులను గూర్చి అచ్చటి మంత్రమిట్లు చెప్పుచున్నది.

*"పద్భిః స్సేదిమవక్రామ న్నిరాం జంఘాభి రుత్ఖిదన్*
*క్రమేణానడ్వాన్ కీలాలం కీనాశ స్యాభిగచ్ఛతః ।" (అ.వే.స. 4ం.కాం. 3.అను. 10.మం.)*

అథర్వవేదములో ఈ మంత్రముకు పూర్వపుమంత్రద్వయములో ప్రజాపతి అనడుచ్ఛరీరమందు (ఎద్దుయొక్క శరీరమందు) ప్రవేశించి దానికి సామర్థ్యము నిచ్చి దృఢముగా చేయుచున్నట్లు వర్ణింపబడినది. మరియు అనడ్వాహము ప్రజాపతిరూపమయి నట్లును, దీనివలన వ్రీహియవాదిధాన్యము ఉత్పన్నము లగుచున్నట్లును, చెప్పబడినది. ప్రకృత మంత్రములో ప్రజాపతిరూపమగు అనడ్వాహము (ఎద్దు) దున్ను నపుడు తన నాలుగు పాదములచేతను నాశహేతువగు అలక్ష్మిని అధోముఖముగ అవక్రమణమును చేయుచు (త్రొక్కివేయుచు) దున్నుచున్న భూమిని జంఘలచేత (పిక్కలచేత) ఉత్ఖేదమును చేయుచు (కర్షణముచే చీల్చుచు), తాను శ్రమపడిన వ్యవసాయకునకు అన్నము నిచ్చుచున్న దని చెప్పబడుచున్నది.

## ఎడ్లతో గట్టిన నాగలిచే ఉగ్రవ్యాధుల చికిత్స.

**బ**లీవర్దయుక్త మగు (ఎడ్లతో గూడుకొనిన) నాగలికి మఱియొక గొప్ప ఆశ్చర్యజనక మగు అపూర్వ విషయము అథర్వవేదములో బోధించబడుచున్నది.

*'నమస్తే లాంగలేభ్యః నమ ఈషాయుగేభ్యః' (అ.వే. 2.కాం. 8.సూక్తం. 4.మం.)*

## ఈ మంత్రముచే చేయవలసిన ప్రక్రియ.

**వ**ంశానుక్రమముగ వచ్చెడి, క్షయ, కుష్ఠ మున్నగు ఉగ్రవ్యాధులచే పీడితు డగు రోగికి (రుగ్ణునకు) అట్టి రోగోపశమనమునకై పై అథర్వవేదమంత్రముచే ఉదకుంభమును అభిమంత్రణ చేసి, ఎడ్లతోగూడిన నాగలిక్రింద ఆ రోగిని కూర్చుండబెట్టి, ఆ అభిమంత్రితో దకముచే స్నానము చేయించవలెను.

మంత్రార్థము: ఓరుగ్ణుడా! నీ రోగోపశమునమునకై యెడ్లతో గూడుకొని యున్న నాగళ్ళ కొరకు నమస్కారము. నాగలికి అవయవములగు (భాగములగు) ఈషాయుగముల కొరకు (అనగా, పోలు కఱ్ఱ, కాడుల కొరకు) నమస్కారము.

ప్రశ్న: నాగళ్ళు, తదవయవము లగు పోలుకఱ్ఱలు, కాడులు అచేతనములు గదా! వీటికి నమస్కార మెట్లు సంగతమగును?

జవాబు: ఉత్తరమీమాంసా శాస్త్రములో

"అభిమానివ్యపదేశస్తు విశేషానుగతిభ్యాం"

(ఉ।మీ. 2. అధ్యాయం. 1. పాదం. 5. అధికరణం)

అను సూత్రముచే అచేతనపదార్థములందు గూడ తదభిమాని యగు దేవత యుండునని ఉత్తర మీమాంసాశాస్త్రములో వ్యాసమహర్షిచే సిద్ధాంతీకరించబడినది. అందుచే ప్రకృతములో అచేతనము లగు నాగళ్ళకు నాగలిభాగములైన ఈ షాయుగములకు నమస్కారము చేయుట యనగా వాటి యభిమానిదేవతలకు నమస్కార మని యర్థము గాన విరోధప్రసక్తి లేదు.

ఫలితము: వీటివలన, ఎడ్లతో గూడిన నాగళ్ళు దున్నుటకే గాక, శాస్త్రోక్త మగు రీతిని అలక్ష్మిని తొలగించి అన్న మిచ్చుటకును, కులక్రమాగతములై అని వార్యములగు మహావ్యాధుల యుపశమన మునకును, ఇంకను అనేక శ్రేయస్సులకు గూడ సాక్షాత్తుగను, పరంపరగను సాధనములుగ వేదుమలందు బోధింపబడినది. దీనివలన కేవలము దున్నుటకు మాత్రమే సాధనముగ నుపకరించు నవీన యంత్రముల కృత్యమ్మును, అర్వనవీన కృషిసాధనముల తారతమ్యమును, సుబోధ మగుచున్నది.

మరియు, ఎడ్లు దున్నగా ఫలించిన ధాన్యమును గూర్చి కృష్ణ యజుర్వేదములో ఈ క్రింది విధముగ వినియోగము చెప్పబడినది.

## ఎడ్లు దున్నగా ఫలించిన ధాన్యమువలన చక్షూరోగనివారణ.

'అగ్నావైష్ణవం ఘృతే చరుం నిర్వపే చ్చక్షు

ష్కామః । ధేన్వై వా ఏత ద్రేతో యదాజ్య మనడుహ

స్తండులా మిథునా దేవాస్మై చక్షుః ప్రజనయతి '

(కృ. య. సం. 2. అష్టం. 2. పన్నము. 9. అను.)

తా॥ ఇచ్చట నేత్రరోగము లుపశాంతములై దృష్టిపాటవము కావలెనని కోరువాడు అగ్ని, మరియు విష్ణువు (ఉభయులు) దేవతలుగా గల "అగ్నావైష్ణవేష్టి" అను కర్మను చేయవలసినదిగా ఈశ్రుతి విధించినది. ఆ కర్మలో ఎద్దుచే దున్ని పండించిన ధాన్యము తాలూకు బియ్యమును ఆవునేతితో వండి, ఆచరువును (అన్నము) ప్రధానదేవత లగు అగ్నావిష్ణువులకు హోమము చేయవలసిన ప్రధాన ద్రవ్యముగా విధించబడినది. ఆ అన్న నిష్పత్తికి మూలభూతము లైన ఆజ్యమునకు, తుండులములకు ఉత్పాదకము లగు గోవుయు,

అనడ్వాహమును మిథునముగా వర్ణించబడెను. అట్టి మిథునమువలన నిష్పన్నమైన ఆజ్యమును, తండులములును గోవృషభముల రేతస్సుగా వర్ణించి, ఆ రెండు రేతస్సుల యొక్కసమ్మేళనరూపమగు హోమద్రవ్యము యొక్క హోమప్రభావముచే (చక్షుష్పాటవమును కోరు యజమానియొక్క) చక్షుస్సులు ఉత్పన్న మగునని శ్రుతిచే వర్ణింపబడినది.

అనగా లోకములో స్త్రీ పురుషరూప మగు మిథునము యొక్క రెండు రేతస్సుల కలయికచే సంతానము జనించినట్లు, ఇచ్చట గోవృషభరూప మగుమిథునములో ఆజ్యరూప మగు గోరేతస్సునందు (ఎద్దు దున్నుటచే జనించినవిగాన) తండులరూప మగు వృషభరేతస్సు నుంచుటచే, ఉభయరేతస్సుల మేళనద్వారా ప్రశస్తమైన చక్షుస్సు ఉత్పన్న మగు నని తాత్పర్యము.

దీనివలన, ఎద్దు దున్నగా ఫలించిన ధాన్యము తాలూకు బియ్యమును (చక్షూరోగములను బారద్రోలి మంచి దృష్టిని చేకూర్చెడి శ్రౌతకర్మలో) ప్రధానహోమద్రవ్యముగా శ్రుతి చెప్పుటచే, అట్టి ధాన్యమందు అపూర్వవిశేష మున్నట్లు స్పష్ట మగుచున్నది.

## గోమిథునకార్య వ్యవస్థ.

**లో**కములో యెద్దు పూర్వభాగముచే (అనగా భుజమందు కాడిని వహించి) దున్నుటకును, గోవు జఘనభాగముచే క్షీరముల ద్వారా పాలిచ్చుటకును కారణమును గూడ శ్రుతి చెప్పుచున్నది.

*"పురస్తా ల్లక్ష్మా పురోనువాక్యా భవతి తస్మా*
*త్పూర్వార్ధే నానడ్వా న్భునక్త్యు పరిష్టా ల్లక్ష్మా యాజ్యా*
*తస్మా జ్జఘనార్ధేన ధేనుః ।" (కృ.య.సం. 2.కాం. 6ప్ర. 2. అను.)*

తా॥ దర్శపూర్ణమాసేష్టులను శ్రౌతకర్మలో అగ్నిదేవతకు పురోడాశమను హవిస్సును హోమము చేసెదరు. పురోడాశమనగా (బన్ను రొట్టె ఆకారము గలిగి, బియ్యపుపిండితో గాని, యవల పిండితోగాని తయారుచేయబడి, నిప్పులమీద కపాలము లను పేరుగల (కుండ పెంకులపై) కాల్చిన రొట్టె యర్థము. సూత్రములో ఇట్లే చెప్పబడి యున్నది.

*"అనుత్తుగ మనపూపా__ఽ__కృతిం కూర్మస్యేవ ప్రతికృతి*
*మశ్వశఫమాత్రం కరోతి ।"* *(ఆ.శ్రౌ.సూ.)*

తా॥ ఎక్కువ యెత్తు లేకుండ, అప్పమువలె అణిగియుండకుండ, తాబేటి యాకారముగను, గుఱ్ఱపుడెక్కయొక్క పరిమాణముగను పురోడాశమును చేయవలసినదిగ ఈ సూత్రము

బోధించుచున్నది. (అది బన్నువలె నుండునగాన, లోకసామాన్యమునకు తెలియుటకై బన్ను రొట్టను ఉదాహరణగా తీసికొంటిమి).

అట్టి పురోడాశమును అగ్నిదేవతకు ("పురోనువాక్యా" "యాజ్యా" అను సంజ్ఞలు గల రెండు మంత్రములను 'హోత' అను ఋత్విక్కు పఠించిన పిదప) హోమము చేయవలెను. ఏ మంత్రము యొక్క పూర్వ భాగములో ప్రధానదేవతను చెప్పు శబ్ద ముండునో, అది పురోనువాక్యామంత్రము. ఏ మంత్రము యొక్క ఉత్తరభాగములో ప్రధానదేవతావాచక శబ్ద ముండునో అది యాజ్యామంత్రము.

ఉదా: "అగ్ని ర్మూర్ధా...... జిన్వతి" అను మంత్రములో ప్రధాన దేవత యగు అగ్నిని బోధించెడి అగ్నిశబ్దము పూర్వార్ధములో నున్నదిగావున, ఇది పురోనువాక్యామంత్రము. పూర్వోక్తశ్రౌత కర్మలో దీని ఉచ్చారణసామర్థ్యముచే లోకములో అనడ్వాహము పూర్వభాగముచే దున్నుచున్నది.

"భువో యజ్ఞస్య... జిహ్వా మగ్నే చకృషే హవ్యవాహం" అను మంత్రములో ఉత్తరభాగమున ప్రధానదేవతావాచక మగు అగ్నిశబ్ద ముండుటచే ఇది యాజ్యామంత్రము. పూర్వోక్తశ్రౌత కర్మలో ఈ యాజ్యామంత్రోచ్చారణ సామర్థ్యముచే లోకములో గోవు జఘనభాగముచే క్షీరము నిచ్చి జగత్తును పాలించుచున్నది.

పైన ఉదహరించిన శ్రుతులచే వృషభము దున్ని, గోవు పాలు యిచ్చి, సమస్త హవ్యకవ్యాదినిష్పాదన ద్వారా లోకమును పాలించుచున్నవని స్పష్టముగ బోధింపబడుచున్నది. దేవతల కిచ్చెడి హవిస్సును హవ్య మనియు, పితృదేవతల కిచ్చు హవిస్సును కవ్యమనియు అందురు.

## నాల్గంగుళముల లోతు దున్నవలెను.

*చతురంగులం ఖేయా ! చతురంగులం ఖనతి ।*
*చతురంగులే హ్యోషధయః ప్రతితిష్ఠంతి ।"* (కృ.య.బ్రా. 3-2-9)

తా॥ దర్శపూర్ణమాసేష్టు లను శ్రౌతకర్మలో వేదిని (యాగమును చేసెడి స్థలమును) నిర్మించుటకు భూమిని త్రవ్వవలసియున్నది. భూమిలో నాలుగు అంగుళముల లోతున ఓషధులు ప్రతిష్ఠితములై యుండును గాన, భూమిని నాల్గంగుళములే త్రవ్వవలసినదిగ ఈ శ్రుతి విధించుచున్నది. ఈప్రకారము కర్షణము (దున్నుట) గూడ ఓషధులను తీసివేయుట కొరకే గావున, నాలుగు అంగుళముల లోతు దున్నినచో, అచ్చటి ఓషధులు నిర్మూలములై మనచే నాటబడు ఓషధులు బాగుగ నాటుకొనును.

## నాల్గంగుళముల లోతుకు ఎక్కువ దున్నరాదు.

"పితృదేవత్యాతిఖ్యాతా ।" (కృ. య. బ్రా. 3-2-9.)

అధికముగ త్రవ్వినచో పితృదేవతాక మగు నని ఈ శ్రుతి బోధించుచున్నది. అందుచే పై సూత్రానుసారము నాలుగంగుళములు దున్నిన చాలును. అట్లు దున్నటకు ఎడ్లతోకూడిన నాగలి చాల యనుకూలముగ నుండును. నవీనయంత్రములతో దున్నినచో ఎక్కువ లోతుగ దున్ను నను విషయము అనుభవసిద్ధము.

## పంటలు సంవత్సరమునకు రెండు.

మహాగ్నిచైన మను క్రతువులో 'ఉఖ' అను నలుపలకల కుండను కాల్చునపుడు ఈ క్రింది మంత్రములను చెప్పవలెను.

"వరూత్రయ స్త్వా దేవీ ర్విశ్వదేవ్యావతీః పృథివ్యా
స్సధస్థేంగిర స్వత్పచంతూఖె జనయ స్త్వా దేవీ ర్విశ్వ
దేవ్యావతీః పృథివ్యా స్సధస్థేంగిరస్వత్పచంతూఖే ।" (కృ. య. సం. 4-1-6.)

ఈ రెండు మంత్రములలో 'పచంతు' అను శబ్దము రెండు సార్లు చెప్పబడినది. అందుచే ధాన్యము సంవత్సరమునకు రెండు సార్లు ఫలించు నని ఈ క్రింది శ్రుతివాక్యము బోధించుచున్నది.

"ద్విః పచం త్విత్యాహ తస్మాద్ద్విః స్సంవత్సరస్య
సస్యం వచ్యతే ।" (కృ. య. సం. 5-1-1.)

## ప్రథమపంట.

ఈ విషయములో కృష్ణయజుర్వేద మీ క్రింది విధముగ చెప్పుచున్నది.

"యా వై ప్రజాభ్రగ్గంశ్యంతే సంవత్సరాత్తా భ్రగ్గ
శ్యంతే । యాఃప్రతితిష్ఠంతి । సంవత్సరేతాః ప్రతితిష్ఠంతి ।
వర్షాభ్య ఇత్యర్థః ।" (కృ. య. సం. అరుణము. 3. అను.)

తా॥ వర్షఋతువునందు విత్తనములను నాటవలెనను విషయమును ఈ శ్రుతి స్పష్టముగ బోధించుచున్నది. వర్షఋతువులో బీజావాపము (విత్తనములను జల్లుట) చేయని వారలకు గాబోవు సంవత్సరము వరకు అన్నము దుర్లభము. అనగా, యే ప్రజలు వర్ష ఋతువునందు విత్తనములను భూములందు నాటుదురో, వారికి అన్నము సులభము. అందుచే సంపూర్ణముగ సంవత్సరమంతయు వారు అన్న సమృద్ధిచే ప్రతిష్ఠితు లగుదురు.

## యవమాషాది ధాన్యకాలము.

ఈ క్రింది మంత్రములు యవ, మాషాది ధాన్యముల ఉత్పత్తికి కాలవిశేషములను సహేతుకముగ బోధించుచున్నవి -

'తేస్మై న్నై చ్ఛంత సరస మహ వసంతాయ ప్రాయచ్ఛ
ద్యవం గ్రీష్మా యొషధీ ర్వర్షాభ్యో వ్రీహీం శ్శరదే
మాషతిలా హేమంతశిశిరాభ్యామ్ । (కృ.య.సం. 7.కాం. 2.ప్ర.అను.)

తా॥ పూర్వము వసంతాదిఋత్వభిమానిదేవతలు ప్రజాపతిచే ద్వాదశాహ మను యజ్ఞమును చేయించిరి. అనంతరము ప్రజాపతి ఆ వసంతాది ఋతుదేవతలకు తేనె మున్నగు భోగ్యవస్తువుల యందలి సారమును దక్షిణగా ఇచ్చెను. అందుచే వసంతృతువు పుష్పాది సంబంధముచే మధురరసోపేత మగు పుష్పములు గలదాయెను. కావుననే, ఆ ఋతువునందు సమస్త పుష్పములు, మామిడి మున్నగు సమస్త ఫలములు ఉద్భవించుచున్నవి. ఈ విషయమునే భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడు -

## భగవద్గీత

"ఋతూనాం కుసుమాకరః" అని చెప్పెను. అనగా, ఋతువులలో సమస్త పుష్పములకు ఆధారమగు వసంత ఋతువు నేను ఐతిని" అని శ్రీకృష్ణ భగవానుడు చెప్పెను.

ప్రజాపతి గ్రీష్మ ఋతువుకు యవలను దక్షిణగానిచ్చుటచే యిప్పటికిని యవధాన్యములు గ్రీష్మఋతువునందు ఫలించుచున్నవి. వర్షఋతువుకు ఓషధులను దక్షిణగా నిచ్చుటచే ఆ ఋతువునందు నమస్త ఓషధులును ఉద్భవించుచున్నవి. ప్రజాపతి శరదృతువుకు వ్రీహులను (అనగా మనము భుజంచెడి ధాన్యమును) దక్షిణగా నిచ్చుటచే శరదృతువునందు (అనగా అశ్వయుజ కార్తీకమాసము లందు ఆ ధాన్యములు ఫలించుచున్నవి).

కావున, క్రొత్త ధాన్యము రాగానే అహితాగ్నులు (యజ్ఞము మున్నగు శ్రౌతకర్మలు చేసిన యజమానులు) శరదృతువునందు అగ్రయణేష్టి అను శ్రౌతకర్మయందు క్రొత్త ధాన్యముచే ముందుగ దేవతలకు పురోడాశమును (హవిర్భాగమును) ఇచ్చిన పిదప వారు భుజించు నాచారము నేటివరకు ప్రచారములో నున్నది. దీనినే ఆపస్తంబశ్రౌతసూత్రములో ఈ క్రింది విధముగ చెప్పిరి.

'శరది పౌర్ణమాస్యా మమావాస్యాయాం వా..........
............ వ్రీహ్యాగ్రయణేన శ్యామాకాగ్రయణగ్ం సమాన
తంత్రేణ కుర్వ న్నిష్ట్వా యక్ష్యే ।" (ఆ.శ్రౌ.సూ.)

ఈ విధముగ సంకల్పమును జేసి శరదృతువునందు క్రొత్త ధాన్యముచే హవిస్సును ముందుగ దేవతలకు ఇవ్వవలసినదిగ ఈ సూత్రము బోధించుచున్నది.

వెనుకటి అరణ్యకశ్రుతి వర్షఋతువునందు బీజాపాపమును (అనగా విత్తనములను నాటుటను) చెప్పినది. 'వ్రీహీన్ ఛరదే' అను పై శ్రుతి శరదృతువులో పంటను చెప్పినది గాన పరస్పర విరోధము లేదు.

ప్రజాపతి హేమంత శిశిర ఋతువులకు మినుగులను నువ్వులను (అనగా పైరు ధాన్యములను) దక్షిణగ నిచ్చుటచే ఆ నాల్గు మాసములందును పైరు ధాన్యములు ఫలించుచున్నవి.

భావము: పూర్వము ప్రజాపతి తన క్రతువులలో వసంతాది దేవతలకు పైన ఉదహరించిన మధు, యవాది ద్రవ్యములను దక్షిణగ నిచ్చెను. అందుచే నేటివరకు మార్పు లేకుండ ఆయా ఋతువులందు ఆయా సస్యములు ఫలించుచున్నవి. న హి దృష్టే అనుప పన్నం నామ' అను న్యాయము ప్రకారము దృష్టిగోచర మగుచున్న విషయమును గూర్చి 'ఇది యెట్లు వచ్చెను' అని శంకింపరాదు. అందుచే లోకములో నేటివరకు ఆయా ఋతువులందు అవియెట్లు ఫలించెనను శంకకు తావు లేదు.

## అన్న సమృద్ధియొక్క ఆవశ్యకత.

సృష్ట్యాదినుండియు ప్రజల కాహార మవసరమని లోకవేదములలో సుప్రసిద్ధ మగు విషయమే. దీనిని గురించి కృష్ణయజుర్వేదబ్రాహ్మణములో ఈ క్రింది విధముగ చెప్పబడినది.

*"ప్రజాపతిః ప్రజా అసృజత । తా అస్మా త్సృష్టాః*
*పరాచీరాయన్ । స ఏతం ప్రజాపతిరోదన మపశ్యత్ ।*
*సోన్నం భూతోతిష్ఠత్ । తా అన్యత్రాన్నాద్య మవిత్వా ।*
*ప్రజాపతిం ప్రజా ఉపావర్తంత । అన్న మేవైనం*
*భూతం పశ్యంతీః ప్రజా ఉపావర్తంతే ।"* (కృ. య. బ్రా. 2. కాం. 7. ప్ర. 9. అను.)

తా॥ పూర్వము ప్రజాపతి ప్రజలను సృజించినపిదప వారలు అన్నార్థులై ప్రజాపతి నుండి పరాఙ్ముఖులై వెడలిపోయిరి. అప్పుడు ప్రజాపతి అన్నసంపాదన కొరకు.

'ఓదనసవే నాన్నాద్యకామో రోహిణ్యాం యజేత'

అను శ్రుతివిహితమైన ఓదనసవ మను యాగమును చేసి అన్నమును సంపాదించెను. అంతట ప్రజలును ఇతరస్థలములందు అన్నము లభించకపోవుటచే తిరిగి అన్నయుక్తుడగు ప్రజాపతి వద్ద కేతెంచిరి. అందుచే లోకములోగూడ అన్నసమృద్ధిగల మానవునియొద్దకు

ప్రజలు వచ్చెదరు. ఈ శ్రుతి అన్నసమృద్ధియొక్క ఆవశ్యకతను ప్రజాపతి ప్రజల నిమిత్తము అన్న సంపాదనను బోధించుచున్నది.

ఇదే విధముగ ఉపనిషత్తులలో -

"న కంచన వసతౌ ప్రత్యాచక్షీత । త ద్వ్రతం । తస్మా
ద్యయా కయా చ విధయా బహ్వన్నం ప్రాప్నుయాత్ "

అని చెప్పబడియున్నది. అనగా, గృహస్తు, వసతినిమిత్తము తన గృహముకు వచ్చిన అతిథిని నిషేధించకూడదు. విహితమైన వృత్తులలో ఏదో యొక విధముచే సమృద్ధమైన అన్నమును సంపాదించవలెను. ఇట్లే మనుస్మృతిలో గూడ చెప్పబడినది.

'వృద్ధౌ చ మాతాపితరౌ సతీ సాధ్వీ సుత శ్శిశుః ।
అవ్యకార్యశతం కృత్వా భర్తవ్యా మను రబ్రవీత్ ।'

అనగా, తల్లిదండ్రులు వృద్ధులు, భార్య పతివ్రత (అనగా, అన్నసంపాదనకై వీధిలోనికి వెళ్లదు) కుమారుదు బాలుడునై యున్నపుడు నిషిద్ధవృత్తిచే నైనను అన్నమును సంపాదించి వారలను పోషించవలసినదిగ మనువు చెప్పియుండెను.

అనగా, శక్యమైననో ముఖ్యవృత్తిచేతను, శక్యము కానిచో గౌణవృత్తిచేనైనను అన్నమును సంపాదించి కుటుంబపోషణ చేయుట విధిచోదిత మని దీనివలన తెలియుచున్నది.

## ఎరువులు.

ఈ క్రింది శ్రుతివలన ప్రజాపతి అన్న సమృద్ధి కొరకు ఎరువులను వాడినట్లు స్పష్ట మగుచున్నది.

"ప్రజాపతిః ప్రజా అసృజత । తాసా మన్న ముపా
క్షీయత । తాభ్య స్సూద ముపప్రాభినత్ । తతో వై
తాసా మన్నం నాక్షీయత । యస్య సూద స్సంభారో
భవతి । నాస్య గృహే౽న్నం క్షీయతే ।"

తా॥ పూర్వము ప్రజాపతి ప్రజలను సృజించెను. కొంతకాలమున కా ప్రజలకు అన్నము క్రమక్రమముగ ఉపక్షీణ మాయెను. అనగా, భూప్రదేశములందు శక్తి తగ్గిపోవుటచే పండెడు పంట ప్రజలకు చాలదాయెను. అంతట ప్రజాపతి ప్రజలకు అన్నసమృద్ధి కొరకై సూదము (అనగా ఎన్నడును ఎండిపోకుండ నుండెడి జలప్రదేమందున్న బురదమన్ను (లేక కర్దమము) అను ఎరువును తీసికొనివచ్చు పంటకు యోగ్యమగు భూభాగములందు వేధు

వేరుగ ప్రసరింపజేసెను. దాని శక్తిచే ఆ భూభాగము లందు సస్యము సమృద్ధిగ ఫలించి, ప్రజలకు అన్న మక్షీణ మాయెను (సమృద్ధమాయెను). అందుచే ఏ యజమానియొక్క గృహమందు గార్హపత్యాదిస్థానములందు సూద మను సంభారము నుంచెదరో, ఆ యజమాని యొక్క గృహమందు అన్న మక్షయముగ నుండును.

## గార్హ పత్యాదులందు సూదము నుంచుట.

*"ప్రజాపతి సృష్టానాం ప్రజానాం । క్షుధోపహత్యై*
*సువితం నో అస్తు । ఉపప్రభిన్న మిష మూర్జం*
*ప్రజాభ్యః । సూదం గృహేభ్యో రస మాభరామి ।"* (కృ. య. బ్రా. 1. కాం. 2. ప్ర. 1. అను.)

ఈ మంత్రము నుచ్చరించి సూదమును గార్హ పత్యాదులందుంచ వలెను.

మంత్రార్థము: ప్రజాపతిచే సృజించబడిన ప్రజల కన్న సమృద్ధి ద్వారా క్షున్నివారణ కొరకు ఈ సూదము యోగ్యముగ సంప్రాప్త మగుగాక. ఈ సూదము ప్రజలకు అన్నమును, రసమును అత్యంత సామీప్యముగ సంపాదించుటకు సాధనమైనది గావున ఇది (సూదము) అన్న, రస ఉభయ సమ్మేళనరూపమైనది. అట్టి యెరువును గార్హపత్యాదివహ్నులయొక్క స్థానముకొరకు సంపాదించుచుంటిని. ఆధాన మను శ్రౌతకర్మలో గార్హపత్యము, అహవనీయము, దక్షిణాగ్ని అను మూడు అగ్నులను ఉత్పాదన చేసి, వాటియందు విధ్యనుసారముగ ఇష్టి, యజ్ఞము మున్నగువాటియందు దేవతలకు హోమము చేయుదురు. అట్టి అగ్నులను గార్హపత్యాది స్థానములందుంచుటకు పూర్వము ఆ ఆయతనములను (స్థానములను) నిర్మించు సందర్భములో పై నుదహరించిన 'ప్రజాపతిసృష్టానాం' అను మంత్రముచే సూదమును ఆస్థానములందుంచ వలెను. అనగా, సూదము అన్న సమృద్ధి కర మగుయెరువు గాన, అట్టి దానిని గార్హపత్యాదులందుంచుటచే ప్రజల కన్న సమృద్ధి లభించునని శ్రుతి బోధించుచున్నది.

*'యథా వై లాంగలే నోర్వరాం ప్రభిందం త్యేవ*
*మృక్సామే యజ్ఞం ప్రభిందంతో యన్మైత్రావరుణీం*
*దశా మాలభతే యజ్ఞాయైవ ప్రభిన్నాయ మత్యమన్వ*
*వాస్యతి శాంత్యై '* (కృ. య. సం. 6. కాం. 6. ప్ర. అను.)

తా॥ సర్వసస్యములు ఫలించుటకు యోగ్య మగు భూమిని దున్ని దానియందు మత్యమును (అనగా సంపూర్ణమైన ఫలమునిచ్చెడి శక్తిని పుట్టించుటకు సాధనమగు గోమయాదియెరువులను) జల్లుటచే దానిలో అశక్తి లక్షణ మగు దోషము శాంతించి

ఫలోత్పాదన శక్తి ఎట్లు జనించునో, అట్లే ఋక్సామ మంత్రములచే కర్షణమువలె యోగ్యతను పొందించబడిన యజ్ఞమునకు మిత్రవరుణదేవతాక మగు పశ్వాలంభము చేత మత్యప్రక్షేపము చేతనువలె ఫలజనశక్తి ఉద్భవించును. దానిచే అశక్తి లక్షణ మగు దోషము శాంతించి సంపూర్ణమైన ఫలము లభించును. దీనిని బట్టి ఎరువుల వ్యవస్థ ప్రాచీన కాలము నుండియు ఆర్షవ్యవసాయములో నున్నదిగాని ఆధునికము గాదని తేటతెల్లమగుచున్నది.

ఇంతేగాక, విద్యారణ్యస్వాములవారు 'మత్యం' అను పదమునకు 'శక్త్యాధానసాధనం గోమయాదిద్రవ్యం మత్యం' అను యర్థము వ్రాసియుండిరి. దీనిలో 'గోమయాది' అని 'ఆది' పదమును ప్రయోగించుటచే, ఇంకను మరికొన్ని యెరువులు గూడ వాడుకలోనున్నట్లు సూచన చేయబడుచున్నది. పాటిమన్ను, మేకపెంట, మున్నగు యెరువులు ఆచారములో నున్న సంగతి మన కందరకు తెలిసిన విషయమే. ఇంతేగాక ఇంకను ఇతర యెరువులు గూడ పూర్వకాలము వాడుకలో నుండి యుండవచ్చును.

## ఇంద్రుడు కాలువలను నిర్మించుట. (ఇంజనీరింగు).

**ఇం**ద్రుడు సరస్వతీనదీతీరమందు మరుద్గణములచే దున్నించి వ్యవసాయము చేసినపుడు కాలువలను నిర్మించినట్లుగ ఈ క్రింది శ్రుతి బోధించుచున్నది.

*"బుధ్నా దగ్రేణ విమిమాయ మానై ర్వజ్రేణ*
*ఖాన్యతృణ న్నదీనాం । వృథా సృజ త్పథిభి ర్దీర్ఘ*
*యాథైస్సోమస్యతామద ఇంద్ర శ్చకార ।"* (కృ.య.సం. 2-3-14.)

తా॥ లోకములో ఇంజనీర్లు కాలువలను త్రవ్వుటకు ముందు ఆ ప్రదేశము నంతను సర్వేచేసి, నిశ్చితప్రదేశమందలి ప్రవాహా_వరోధకములగు వృక్షాదులను ఛేదించెదరు. అట్లే, ఇంద్రుడు నదుల యొక్క మూలమునుండి అగ్రభాగము వరకు మానదండములచే కొలచి (త్రవ్వదగిన ప్రదేశమును) విశేషముగ నిశ్చయించెను. అనంతరమందు నదులయొక్క జలప్రవాహకములకు ప్రతిబంధకములగు పర్వతాదులను వజ్రముచే ఛేదించెను. అటు పిమ్మట నిరాటంకముగ దీర్ఘములగు ప్రవాహములు ప్రసరించుటకు అనుకూలము లగు మార్గములతో గూడిన నదీవిశేషములను సృజించెను. ఇట్లు నిర్మించుటలో ఇంద్రునకు కొంచమైనను ప్రయాస లేదను విషయమును ఈ పై శ్రుతి 'వృథాసృజత్' అను వాక్యముచే బోధించుచున్నది.

లోకములో మానవులు తృణాధికమును అనాయాసముగ ఎట్లు ఛేదింతురో, అట్లే, ఈ షన్మాత్రమైనను ప్రయాస లేకయే ఇంద్రుడు నదులను నిర్మించెను. నిర్మాణమునకు పూర్వము సోమపానము చేసి, ఆసోమపానసంబంధమగు మత్తతతో నిర్మాణ కార్యక్రమమును

జరిపెను. లోకములో గూడ ఇంజనీర్లు మున్నగు పనివాండ్రు వారి వారి పనులను ప్రారంభించుటకు ముందు ఏదైన కొంత యాహారమును తీసికొని, ఆ యాహారజనితమైన శక్తిచే పనులను చేయు సంగతి మన కందఱకును తెలిసిన విషయమే. అట్లే ఇంద్రుడు కూడ సోమపానమత్తతతో ఈ పనిని చేసినట్లు "సోమస్యతామదే" అను 'మద' పదముచే స్పష్టముగ చెప్పబడుచున్నది.

## అభ్యవహారము, ఆర్షపద్ధతి.

విషయములు: ధాన్యభేదనిరూపణము, అవహనము (దంపు), వంటకు పాత్రవిశేషము, వంట, భోజనము ప్రసక్తానుప్రసక్తము.

## ధాన్యభేదనిరూపణము.

లోకములో తారతమ్యముచే మానవులలో కొందరు జొన్నలు, మరికొందరు గంటెలు, సన్నధాన్యము, ముతక ధాన్యము, నల్ల ధాన్యము, గోధుమలు మున్నగు ధాన్య విశేషములను అన్నము, రొట్టె, జావ మున్నగు రూపభేధములచే ఎట్లు భుజించుచుందురో, అట్లే, దేవతలలో గూడ గృహపతి యగు అగ్నికి నల్లధాన్యము (కృష్ణవ్రీహులు) తో చేయబడిన పురోడాశము, సోమునకు చామబియ్యపు అన్నము (శ్యామాక చరువు), సవితకు అరువది రోజుల పంటకు చెందిన ధాన్యము (అశువ్రీహులు)తో చేయబడిన రొట్టెయు, బృహస్పతికి నివరధాన్యపు అన్నము (నైవారచరువు), ఇంద్రునకు పెద్దవరి (మహావ్రీహులు) ధాన్యముతో చేసిన పురోడాశము, వరుణునకు యవధాన్యపు అన్నము (యవమయచరువు), పూషదేవతకు దంతములు లేకపోవుటచే వరి పిండితో చేసిన జావయు (పౌష్ణచరువు) మున్నగు ఆహారభేదములు ఈ క్రింది శ్రుతులచే విధించబడియున్నవి -

*"అగ్నయే గృహపతయే పురోడాశం... కృష్ణానాం*
*వ్రీహీనాగ్ం సోమాయ వనస్పతయే శ్యామాకంచరుగ్ం*
*సవిత్రే సత్యప్రసవాయ పురోడాశం ద్వాదశకపాల*
*మాశూనాం వ్రీహీనాగ్ం.. బృహస్పతయే ... నై*
*వారం చరుమింద్రాయ ... పురోడాశం ... మహావ్రీ*
*ణాం ..... వరుణాయ .... యవమయం చరుం ।" (కృ.య.సం. 10-8-10.)*

*"తస్మా త్పూషా ప్రపిష్టభాగో౽దంతకో హి ।" (కృ.య.సం. 2-6-8.)*

## దంపుడు బియ్యము.

ప్రకృతములో పై దేవతలకు తత్తత్కర్మలందు ఆయా ధాన్యాదులచే చరుపురోడాశాదులను చేయదలచినపుడు వీటి కన్నిటికిని ప్రథమములో బియ్యమవసరముగాన, అట్టి బియ్యమును

తయారు చేయుటకు లౌకికసాధనములగు నఖవిదళనము (అనగా గోళ్లతో ధాన్యమును ఒలిచి బియ్యమును చేయుట), మిల్లులో పోయుట, దంపుట, మున్నగునవి దృష్టికి గోచరించుచున్నవి. వీటిలో ఏ ఉపాయముచే బియ్యమును తయారు చేసినను లౌకిక దృష్టికి విశేషము గానరాదు గాన, యే ఉపాయముచేతనైనను బియ్యమును తయారు చేయవచ్చునని సిద్ధ మగుచున్నది. ఇట్లుండగా, 'వ్రీహీ నవహంతి' అను విధి వాక్యమును పూర్వమీమాంసా శాస్త్రములో బహువిపులముగ విమర్శించి, దీనిని నియమవిధిగ సిద్ధాంతీకరించిరి. అందుచే అవహననము (అనగా దంపు) చేతనే బియ్యమును తయారు చేయవలెను గాని, ఉపాయాంతరములచే నిష్పాదన చేయరాదని సిద్ధమైనది.

ప్రకృత కాలములో కొలదిదినములకు పూర్వము దంపుడు బియ్యమునే ఉపయోగించెడి అలవాటు పూర్వులలో నుండెడి దనువిషయ మందరకును తెలిసినదే. కాలక్రమమున మిల్లుల సౌకర్యమున కలువడి, దంపుడు బియ్యమును, పూర్వాచారమును మరచిపోయెడి పరిస్థితి ఏర్పడినది. మరియు, నవీనబుద్ధులకు ఈ ఆచారము నిరుపయోగముగ గూడ స్ఫురించవచ్చును. అందుచే యథార్థమును తెలియజేయుచు దంపుడుబియ్యములోని విశిష్టతను వ్యక్తపరచు గాథ ఈ దిగువ పొందుపరచడమైనది.

అవహనశ్రుతి బలమువలన దంపుడు బియ్యమునకు అలౌకిక మహత్వము (అనగా మన లౌకిక దృష్టికి గోచరించని శక్తి) పైన ఋజువు చేయబడినది. ఈ దిగువ నీయబడిన శ్రుతిప్రమాణముచే దంపుడు బియ్యమునకు లౌకికమహత్వము గూడ ప్రతిపాదించబడుచున్నది.

*'వషట్కారో వై గాయత్రి యై శిరో౽ చ్ఛిన త్త స్యై*
*రసః పరాపత త్స పృథీవీం ప్రావిశ త్స ఖదిరో భవ ద్యస్య*
*ఖాదిర స్స్రువో భవతి ఛందసామేవ రసేనా౽ వద్యతి*
*సరసా అస్యాహుతయో భవంతి ।'* (కృ.య.సం. 3.కాం. 5.ప్ర. 7.అను)

తా॥ ఒకప్పుడు వషట్కారదేవత గాయత్రీ ఛందస్సు యొక్క శిరస్సును ఛేదించెను. ఆఛిన్న ప్రదేశమునుండి రసము నిర్గతమై, పృథివిని ప్రవేశించి, ఖదిరవృక్షరూపముగ నావిర్భవించెను.

అందుచే 'స్రువము' అను పాత్రను ఖదిరవృక్ష (చంద్రచెట్టు) సంబంధమైన కఱ్ఱతో నిర్మించినచో (ఖదిరము ఛందస్సారముగావున) ఇట్టి స్రువముతో ఆజ్యాదిహవిస్సులను అవదానము చేసినచో, ఛందస్సుల రసముతో అవదానము చేసినట్లగును. దానిచే అవదానము చేయుటచే ఆహుతులు రసవిశిష్టము లగును.

ఈ విధముగ క్రతువులలో హోమపాత్రల విషయములో ఖదిరము ఛందస్సారముగ శ్రుతి చెప్పుటచే యజ్ఞపాత్రలను ఖదిరముతో తయారు చేయుటయే గాక, లోకములో దంపుడు బియ్యమును (దేవతా నివేదనార్థము) చంద్రకఱ్ఱరోకళ్ళతో దంపించిన ధాన్యముతోనే శిష్టులు చేయించెడి వారు. అట్లు చేయుటచే ఛందస్సారము బియ్యము నందు సంక్రమించి (అపూర్వ ద్వారా) ఉపకరించు నని శిష్టాచారము ప్రవృత్తమైనది. ఈ విధముగ దంపుడు బియ్యమునందు ఛందస్సారము సంక్రమించునుగాన, చంద్రకఱ్ఱ రోకళ్ళతో ధాన్యమును దంపవలెనని ఫలితము.

## గాయత్రీశిరశ్ఛేద కారణము.

*"గాయత్రీ ఛందాగ్ స్యత్యమన్యత । తస్యై వషట్కా*
*రోఽభ్యయ్య శిరోఽచ్ఛినత్ । తస్యై ద్వేధా రసః పరాపతత్ ।*
*పృథివీ మర్ధః ప్రావిశత్ । పశూనర్ధః । యః పృథివీం*
*ప్రావిశత్ । సఖదిరోఽభవత్ । యః పశూన్ । సోఽజాం ।*
*యత్ఖాది ర్యభ్రి ర్భవతి । ఛందసామేవ రసేన యజ్ఞస్య*
*శిర స్సంభరతి ।"* (కృ.య.ఆ. పెదబ్రాహ్మణం.)

యజ్ఞములో రెండవరోజున ప్రవర్గ్య సంభరణమను పేరుతో ప్రవర్గ్య అను కర్మకు మహావీరము మున్నగు మృన్మయపాత్రలను తయారుచేయుటకు మృత్తును తీసికొనిరావలెను. ఆమృత్తును త్రవ్వుటకు 'అభ్రి' అను పేరుగల తీక్ష్ణాగ్ర మగు ఒక కఱ్ఱను తీసికొని పోయి దానితో త్రవ్వవలెను. ఆ అభ్రి ఖాదిరము కావలెనని పై శ్రుతి సహేతుకముగ విధించుచున్నది.

## దానికి ఉపోద్ఘాతము.

ఈ గాథ ప్రక్రమాంతరములో వివరింపబడినది గనుక, ఇచ్చట సంక్షేపముగ ఉల్లేఖ చేయబడుచున్నది -

కశ్యపప్రజాపతికి కద్రువ, సుపర్ణి అను నిరువురు భార్యలు గలరు. వారుభయులును సౌందర్యవిషయములో స్పర్ధాయుక్తలై, పరాజితురాలు విజయమును బొందిన దానికి దాసీత్వమును చేయుటకు నిర్ణయించుకొనిరి. అనంతరము సౌందర్య నిర్ణయమునకు స్త్రీ సభాసన్నివేశమును సమకూర్చిరి. అప్పుడు మధ్యస్థలు కద్రువకు జయమును బల్కిరి.

అప్పుడు కద్రువ తనకు దుర్లభమగు వస్తువును సుపర్ణి ద్వారా సంపాదించుకొని, ఆమెకు దాసీత్వవిమోచనము చేసిన బాగుండునని నిశ్చయము చేసి, "స్వర్గమందలి

## ప్రాణాగ్ని హోత్రము.

ప్రతిదినము మనము భుజించునపుడు ప్రథమములో దేవతా నివేదన చేసి, ప్రాణాహుతులు తీసికొని, అనంతరము భోజనము చేయవలెను. ప్రాణాహుతు లనగా, ప్రాణాగ్నులకు (ప్రాణాపానాది దేవతలకు) హోమ మని యర్థము. ఇది గూడ ప్రాణదేవతకు హోమము గాన, సర్వదేవతలకు దంపుడు బియ్యముతో తయారైన హవిస్సునే ఇవ్వవలెను గాన, మన భోజనమునకు పూర్వము ప్రథమములో ప్రాణాహుతులు నిత్యముగాన, మనకు నిత్యభోజనములో గూడ దంపుడు బియ్యమునే వాడవలెనని సిద్ధమగుచున్నది. ఇది మనకు చిన్నతనమునుండియు (మిల్లుబియ్యముయొక్క వ్యాప్తి లేనంత వరకు) ఆచరణలో నున్న విషయమేగాని క్రొత్త గాదు.

## అవకీర్ణిప్రాయశ్చిత్తము (ప్రాణాహుతులకు నిత్యత్వము).

ప్రాణాహుతులను మానివేసినవాడు, "ప్రాణాగ్నిహోత్ర లోపేన అవకీర్ణీ భవే న్నరః" అను స్మృత్యనుసారము అవకీర్ణి (భగ్నవ్రతుడు) అగును. అట్టివానికి "అకార్యకార్యవ కీర్ణీ" అను శ్రుత్యనుసారము ఈ అవకీర్ణిత్వదోషము నివృత్త మగుటకు ఈ మంత్రముచే అఘమర్షణస్నానము చేసి ఆ పాపమును తొలగించుకొనవలసినదిగ శాస్త్రము చెప్పుటచే ప్రాణాహుతులను మానుటకు వీలులేదు.

## వంటకు పాత్రవిశేషము.

మహాగ్నిచైన మను క్రతువులో 'ఉఖ' అను కుండలో రంపపు పొట్టు వగైరాల నుంచి, అహవనీయ మను అగ్నిపై ఆ ఉఖనుంచి, అడుగున అహవనీయాగ్నిలో బాగుగ జ్వాలలు చేయవలెను. 'ఉఖ్యేజాత ఆహవనీయ మనుగమయ్య' అను సూత్రానుసారము, ఉఖాగ్ని పుట్టినతోడనే, అడుగున నున్న అహవనీయాగ్నిని పూర్తిగా ఆర్పివేయవలెను. అనంతరమందు అహవనీయాగ్నియందు చేయవలసిన హోమాదులను ఈ ఉఖాగ్నియందే చేయుదురు. ఇట్లు సాధారణముగ జెప్పి, అనంతరమందు కామనావిశేషముచే –

> "అంబరీషా దన్నకామస్యావదధ్యా దంబరీషే వా
> అన్నంభ్రియతే స యోన్యేవాన్న మవరుంధే ।" (కృ.య.సం.5-1-10.)

అను శ్రుత్యనుసారము లోకములో మృన్మయపాత్రయందు అన్నమును ధరింతురుగాన మృన్మయపాత్ర అన్నమునకు యోని (కారణము). అందుచే అట్టి మృన్మయపాత్ర నుండి అగ్నిని తీసికొనివచ్చు, ఉఖయందు అగ్నిని ఉత్పాదన చేసినచో, అన్న కాముడగు యజమానునకు సయోనిక మగు (కారణసహిత మగు) అన్నము లభించునని చెప్పబడుచున్నది. కావుననే వంటకు మృన్మయపాత్రను మన పూర్వులు వాడెడివారు.

# నూతనమృన్మయపాత్రను మేకపాలతో తడుపుట.

లోకములో నూతనమృన్మయపాత్రలను ప్రథమములో పాలతో తడపి, వాడుచుండెడి సంప్రదాయము నేటికిని శిష్టుల గృహములలో గలదు. దీనిని సహేతుకముగ శ్రుతి విధించుచున్నది.

"అసుర్యం పాత్ర మనాచ్ఛృణ్ణ మాచ్ఛృణత్తి దేవ
త్రాక రజక్షీ రేణాచ్ఛృణత్తి పరమం వా ఏత త్పయో
యదజక్షీరం పరమే ణై వై నాం పయసాచ్ఛృణత్తి యజు
షా వ్యావృత్త్యై ।" (కృ.యు.సం. 5-1-7.)

తా॥ యజ్ఞ సాధన మగు నూతన మృన్మయపాత్రను ప్రథమములో ద్రవద్రవ్యముచే తడుపకుండగ (సేచనము చేయకుండ) వాడినచో, ఆ పాత్ర అసురయోగ్య మగును. ద్రవద్రవ్యముచే తడపి వాడినచో, ఆ పాత్ర దేవకర్మలకు యోగ్యమైన దగును. అనంతరము దేనితో తడుపవలెనను శంకపై మేకపాలు పరమపవిత్రమైనవి గావున, వాటితో తడుపవలసినదిగ పై శ్రుతి బోధించుచున్నది.

'అజక్షీరేణాచ్ఛృణత్తి పరమం వా ఏత త్పయో
యదజక్షీరం పరమేణైవైనాం పయసా౽౽చ్ఛృణత్తి
యజుషా వ్యావృత్త్యై ।'

లోకములో నూతనమృన్మయపాత్రను మంత్రరహితముగ తడిపెదరు. యజ్ఞములో నూతనమృన్మయపాత్రను మంత్రరహితముగ తడుపరాదు. లోకము వై లక్షణ్యము కొరకు మంత్రముల చేతనే తడుపవలెనని చెప్పుటచే, లోకములో గూడ మృన్మయపాత్రను మేకపాలతో (మంత్రరహితముగ) తడిపెడు ఆచార మున్నట్లు స్పష్ట మగుచున్నది.

లోకమున మేకపాలు తరచు సంభవించకపోవుటచే పాలతో మాత్రము తడుపుచుండెడి ఆచారము నేటివరకును ప్రచారమున నున్నది. ఈ విధముగ శ్రుత్యాచారప్రమాణములచే క్రొత్త కుండను ముందుగ పాలతో తడపి, అనంతరము ఆకుండతో వంట చేయవలెనని స్పష్టమగుచున్నది.

లోకమున మేకపాలు సర్వవ్యాధులను తొలగించునట్లు ప్రసిద్ధమైనవిగావున, ఉత్తమమైనవిగ పరిగణింపబడుచున్నవి. మహాగ్నిచైనమను క్రతువులో ఇటుకలచే ఐదువరుసలు మంత్రములతో కూర్చిన పిదప, ఆ ప్రదేశమును 'అగ్ని' అని వ్యవహరింతురు. దానియందు నమకముచే హోమము చేయవలసినదిగ శ్రుతి బోధించుచున్నది. ఈ సందర్భమున వివిధ

ద్రవ్యముల యొక్క హోమార్హతను విమర్శించిన పిదప, మేకపాలతో (అదనయోగ్య మగు ద్రవ్య మగుటచే) హోమము చేయవలసినదిగ ఈ క్రింది శ్రుతిచే సిద్ధాంతీకరించబడినది.

## హోమార్థ ద్రవ్య విమర్శ.

*'యద్గ్రామ్యాణాం పశూనాం పయసా జుహుయా*
*ద్గ్రామ్యాన్ పశూన్ ఛుచార్పయే ద్యదారణ్యానా మార*
*ణ్యాన్ జర్తి లయవాగ్వావా జుహుయా ద్గవీధుక యవా*
*గ్వావానగ్రామ్య న్పశూన్ హినస్తి నారణ్యాన్ ।'* (కృ. య. సం. 5-4-3)

తా॥ గవాశ్వాదిగ్రామ్య పశువుల యొక్క క్షీరములచే (నమక మంత్రములతో) చిత్యగ్నియందు హోమము చేసినచో గవాదిగ్రామ్య పశువులకు సంతాపము సంభవించును. ద్విఖురాది అరణ్య పశువుల క్షీరములచే హోమము చేసినచో అరణ్య పశువులు సంతాపయుక్తము లగును. కావున, గ్రామ్యారణ్యపశువుల క్షీరములచే హోమము చేయక, అడవి నువ్వుల గంజితో (జర్తిలయవాగ్వా) గాని, గులివిగింజల గంజితోగాని (గవీధుకయవాగ్వావా) హోమము చేసినచో గ్రామ్యారణ్య పశువులకు హింస యుండదు. అని చెప్పి, ఈ పక్షమును నిరసన చేసి అజక్షీరములతోనే హోమమును శ్రుతి విధించుచున్నది.

*"అధొ ఖల్వాహు రనాహుతి ర్వై జర్తి లాశ్చ గవీ*
*ధుకా శ్చే త్యజక్షీరేణ జుహో త్యాగ్నే యీ వా ఏషా*
*యదజా హుత్యైవ జుహోతి న గ్రామ్యా న్పశూన్ హినస్తి*
*నారణ్యాన్ ।"* (కృ. య. సం. 5-4-3.)

తా॥ పూర్వోక్త మగు గ్రామ్యారణ్య పశుసంతాపముల యొక్క నివృత్తి కొరకు విహితము లగు జర్తిలలు (అడవినువ్వులు), గవీధుకములు (గులివిగింజలు), అదనయోగ్యములు కాకపోవుటచే వాటి యవాగుచే హోమము యుక్తముకాదు. అజక్షీరములతోనే హోమము చేయవలెను. పూర్వము చెప్పిన రీతిగ (అజక్షీరములతో హోమము చేసినచో) అజకు సంతాపము కలుగవలసివచ్చుచుండగా, అజ అగ్నితో కూడ పుట్టుటచే అగ్ని సంబంధమైనది. (అనగా, అజ, అగ్నియు ఏకోదరులు) అందువలన దాని క్షీరములతో హోమము చేసినను దానికి సంతాపము కలుగ దను విషయమును అజయొక్క ఉత్పత్తి ద్వారా శ్రుతి చెప్పుచున్నది. మేకపాలయొక్క ప్రాశస్త్యము దీనివలన స్పష్ట మగుచున్నది.

## అజయొక్క ఉత్పత్తి.

*'ప్రజాపతి రకామయత ప్రజాయేయేతి సముఖత*
*స్త్రివృతం నిరమిమీత త మగ్ని ర్దేవతా న్వసృజ్యత*

*గాయత్రీ ఛందో రథంతరగ్ం సామ బ్రాహ్మణో మను*
*ష్యాణా మజః పశూనాం తస్మాత్తే ముఖ్యా ముఖతో*
*హ్యసృజ్యంత ।'* (కృ.య.సం. 7-1-1)

తా॥ ప్రజాపతి సృష్టిచేయవలె నని సంకల్పించి, ముఖము నుండి త్రివృత్ స్తోమమును, అనంతరము అగ్నిని, గాయత్రీ ఛందస్సును, రథంతరసామను మనుష్యులలో బ్రాహ్మణులను, పశువులలో మేకను సృజించెను. ఈ విధముగ ప్రజాపతి ముఖమువలన అగ్నితో కూడ మేకను సృజించుటచే అజ అగ్ని సంబంధమైనదిగను, ముఖ్యమైనదిగను శ్రుతిచే బోధింపబడు చున్నది. ఈ శ్రుత్యనుసారము అజ అగ్ని సంబంధమైనదిగావున, అజ సంబంధమైన క్షీరములచే హోమము చేయుటచే అజకు ఏ విధమైన హానియు వాటిల్లదని వెనుకటి శ్రుతి (అనగా, 'ఆగ్నేయీ వా ఏషా యదజా' అనునది) చెప్పుచున్నది.

## అన్నము వండుట.

వంట చేయునపుడు దంపుడుబియ్యమును కడుగకుండ వండవలసినదిగ శ్రౌతసూత్రములో చెప్పబడియున్నది.

*'న ప్రక్షాలయతి న ప్రస్రావయతి న గాలయతి క్షీరే*
*భవతీ త్యేకే జీవతండుల మివ స్రపయతీతి విజ్ఞాయతే ।'* (ఆ.శ్రౌ.సూ.)

తా॥ ఈ సూత్రము ననుసరించి వంట చేయు బియ్యమును కడుగ కూడదు. దానిలో పోసిన నీరును కడుగు క్రింద తీసివేయరాదు. నీరును పోసిన పిదప గాలించరాదు. అనగా, నొక్కి కడిగి నేమరాదు. అత్తిసరుగా వండవలెను. చిమడకూడదు. బిరుసుపదునుగా వంట చేయవలెను. ఈ విధముగా అగ్న్యాధాన మను శ్రౌతకర్మలో చెప్పబడి యున్నది. దీనివలన, లోకములో బియ్యమును గాలించి కడుగుటచే విటమినులు పోవు నని ఆదునిక వైద్యులు లౌకికదృష్టిచే గమనించిన విషయమును శ్రుతి సృష్ట్యాదియందే (నిషేధించి, అట్లు చేయుటచే అపూర్వోత్పత్తి యగు నను అలౌకిక దృష్టికోణముతో) బోధించినట్లు స్పష్టమగుచున్నది.

## రొట్టెను కాల్చుట.

*'యో విదగ్ధ స్స నై ఋతో యో౽శృత స్స రౌద్రో*
*య శ్శృత స్స స దేవ స్తస్మా ద విదహతా శృతంకృత్యస్స.*
*దేవత్వాయ ।'* (కృ.య.సం. 2-6-3)

తా॥ మనచే కాల్చబడియెడి పురోడాశము (రొట్టె) మాడునట్లుగ విశేషముగ కాల్చబడినచో, అది రాక్షసులకు ప్రియమైన దగును. (నిర్‌ఋతిదేవతాకము). కొంచెము పచ్చిగానుండునట్లు

కాల్చినచో అది రుద్రునకు ప్రియమైన దగును (రౌద్రము). ఎక్కువ తక్కువలు లేకుండ సమముగా శ్రపణము చేసిన యెడల (కాల్చిన యెడల), అది దేవతాప్రియ మగు హవిస్సగును. అందుచే విదాహాదులు (అనగా, అతిపక్వము లేక అపక్వము) లేకుండ సమముగ శ్రపణము చేయవలెను.

## వెన్న, నెయ్యి.

**య**జ్ఞములో ప్రథమదినమున యజమానుడు యజ్ఞశాలలో ప్రవేశించిన పిదప చేయవలసిన క్రియాకలాపములో (కర్మప్రక్రియలో) వెన్నను శరీర మంతటను (నఖశిఖపర్యంతము) పూసికొనవలసి యున్నది. అట్టి వెన్నను సంపాదించుటకు మజ్జిగ చేయునపుడు చల్లరాటకు త్రాడును గట్టి పెరుగును మథించవలెను (చిలకవలెను). అట్లు చిలికి తీసిన వెన్న దేవతలకు ప్రియమైనది. అట్లు చల్లరాట లేకుండ సాధనాంతరములచే రెండు చేతులతో మాత్రమే పెరుగును మథించి తీసిన వెన్న పితృదేవతలకు ప్రియమైన దని ఈ క్రింది శ్రుతి బోధించుచున్నది.

*"అనారభ్యోపమంథతి । తద్ధి పితౄన్ గచ్ఛతి ।"* (కృ. య. బ్రా. 1. కాం. 6. ప్ర.)

ఈ శ్రుతి ననుసరించి శిష్టాచారానుసారము స్మృత్యాదిబోధితమగు చల్లరాట సంబంధమున కవ్వముచే మథితమైన వెన్నయే దేవతాయోగ్యమని సిద్ధ మగుచున్నది. మనపూర్వులు ఈ యాచారమునే అవలంబించిన సంగతి మన కందరకును అనుభవసిద్ధమైన విషయము.

ఈ వెన్నను కాచి నెయ్యిగా తయారుచేయునపుడు పాకజన్యము లగు అవస్థాభేదములచే ఈ వెన్న సర్వదేవతలకు ప్రియమగునట్లు ఈ దిగువ శ్రుతి వక్కాణించుచున్నది.

*"ఘృతం దేవానాం మస్తు పితృణాం నిష్పక్వం*
*మనుష్యాణాం తద్వా ఏత త్సర్వదేవత్యం య నవనీతం ।"*

(సాధారణముగా కాగిన నెయ్యి దేవతలకు ప్రియమైనది. ఈ నిష్పక్వమైన నెయ్యి (అరకాకనెయ్యి) పితృదేవతలకు ప్రియమైనది. నిశ్శేషపక్వమైన నెయ్యి మనుష్యులకు ప్రియమైనది.

## పాలు.

**ఈ** వెన్నకు మూలభూతమగు పాలనుగూర్చి కృష్ణయజుర్వేదములో ఈ క్రింది శ్రుతి వివరించుచున్నది.

*"అభివాన్యాయై దుగ్ధే భవతి సా హి పితృదేవత్యందుహే ।"* (కృ. య. బ్రా. 1. కాం. 6. ప్ర.)

ఈ శ్రుతి ననుసరించి దూడ చనిపోయిన గోక్షీరములు పితృ దేవతలకు ప్రియమైనవి. సజీవమయిన దూడ గల గోక్షీరములు దేవతలకు ప్రియము లైనట్లు దర్శపూర్ణమాసాది శ్రౌతకర్మలందలి గోదోహనాదిపర్యాలోచనచే స్పష్టమగుచున్నది. కాన, పితృదేవతాకములగు కర్మలందు దూడ చనిపోయిన గోక్షీరములను దేవతలకు సజీవమగు (దూడగల) గోక్షీరములను వినియోగించవలెనని శ్రుతివలన స్పష్ట మగుచున్నది. దీనివలన, సజీవముగ దూడగల గోక్షీరములు ప్రశస్తము లనియు, మృతజీవ మగు దూడగల గోక్షీరములు సామాన్యమైన వనియు సిద్ధమగుచున్నది.

## భోజనము చేయుట.

*"ప్రాచీ మభ్యాకారం । అగ్రేరం తతః । ఏవమివ*
*హ్యన్న మద్యతే ।"* *(కృ.య.బ్రా. 3. కాం. 3. ప్ర. 1. అను.)*

తా॥ దర్శపూర్ణమాసలను శ్రౌతకర్మలో స్రువము, జుహువు, ఉపభృత్, ధృవా అను నామములచే ప్రసిద్ధములగు దారుమయము లగు హోమపాత్రలను దర్భాగ్రములచే సమ్మార్జన (అనగా తుడుచుట) చేయుదురు. ఈ సందర్భములో యెదుట నున్న భోజనపాత్రయందు హస్తమును ప్రసరింపజేసి ఇరుప్రక్కల (చుట్టును) గల వ్యంజనములను ఆకర్షించి అన్నములో మిశ్రమము జేసి ముఖబిలమునందు (నోటిలో) ఎట్లు ప్రక్షేపము చేయుదురో, అట్లే ఈ హోమ పాత్రలను తూర్పునుంచి దర్భాగ్రములచే పాత్రలయొక్క (స్రుక్కులయొక్క) మధ్యభాగమునకు సమ్మార్జన చేయవలసినదిగా శ్రుతిసూత్రములు బోధించుచున్నవి. దీనివలన ప్రాణాహుతులను తీసికొనిన పిదప వ్యంజనముల (కూరలు, పచ్చళ్ళు వగైరాల) సమ్మేళనముతో భోజనమును చేయుచున్నట్లు లోక వేదప్రసిద్ధి గానవచ్చుచున్నది.

## దధి.

ఈ విధముగ భోజనమును చేయు సందర్భములో అంత్యమున పెరుగుతో భోజనమును సమాప్తి చేయవలె ననియు, ఆ పెరుగును తయారు చేయుటలో విశేషములను ఈ క్రింది శ్రుతి బోధించుచున్నది.

"ఇంద్రస్య వృత్రం జఘ్నుష ఇంద్రియం వీర్యం
పృథివీ మనువ్యార్ఛ త్తదోషధయో వీరుధ్ధో॒ భవన్ త్స
ప్రజాపతి ముపాధావ ద్వృత్ర మే జఘ్నుష ఇంద్రియం
వీర్యం పృథివీ మనువ్యారత్త దోషధయో వీరుధో॒ భావ

న్నితి స ప్రజాపతిః పశూ న(బవీ దేత దస్మై సన్నయ
తేతి తత్పశవ ఓషధీభ్యో౽ధ్యాత్మన్థ్సమనయన్ తత్ప్రత్య
దుహన్ యత్సమనయన్ తత్సాన్నాయ్యస్య సాన్నాయ్య
త్వం యత్ప్రత్యదుహన్ తత్ప్రతిధుషః ప్రతిధుక్త్వ
గ్ం సమనైషః ప్రత్యధుక్షన్నతు మయి శ్రయత
ఇత్యబ్రవీ దేత దస్మై శృతం కురుతే త్యబ్రవీత్త దస్మై
శృత మకుర్వ న్నింద్రియం వా వాస్మిన్ వీర్యం త దశ్ర
యన్ త చ్ఛృతస్య శృతత్వగ్ం సమనైషః ప్రత్యధు
క్షన్ ఛృత మక్రన్న తు మా ధినోతీ త్యబ్రవీ దేత దస్మై
దధి కురుతే త్యబ్రవీ త్తదస్మై దధ్యకుర్వన్ తదేన మధినో
త్త ద్దధ్నో దధిత్వం ।" (కృ. య. సం. 2. కాం. 5. ప్ర. 3. అను.)

పూర్వము ఇంద్రుడు వృత్రాసురుని హననము చేయు సందర్భములో ఇంద్రుని యొక్క ఇంద్రియసామర్థ్యము పృథివిని ప్రవేశించి, ఓషధులు, లతలు రూపముగ ఆవిర్భవించెను. వెంటనే ఇంద్రుడు ప్రజాపతివద్దకు జని ఈ వృత్తాంతము చెప్పెను. అనంతరము ప్రజాపతి పశువులను పిలచి, ఓషధిలతారూపమును దాల్చిన ఇంద్రియసామర్థ్యమును ఇంద్రుని కొరకు సన్నయనమును చేయవలసినదిగ (సంపాదించవలసినదిగ) వాటితో పలికెను. అంతట నా పశువులు ఓషధిలతారూపమును దాల్చిన ఇంద్రునియొక్క ఇంద్రియ సామర్థ్యమును తమయందు క్షీరరూపముగ నుంచుకొని, ఇంద్రుని కొరకు దోహనమును చేయుచుండెడివి. అట్టి క్షీరమును ఇంద్రుడు సేవించి, ఆ క్షీరములు అతనియందు పక్వమగుట లేదని ప్రజాపతితో చెప్పెను. వెంటనే ప్రజాపతి ఆ క్షీరములను ఇంద్రునికొరకు పక్వమగునట్లు చేయమని పశువులను గూర్చి పలికెను.

ప్రజాపతి యాదేశానుసారము పశువు లాక్షీరములను పక్వమగునట్లు చేసిన పిదప ఇంద్రుడు వాటిని సేవించి, తన ఇంద్రియ సామర్థ్యమును యథాపూర్వముగ తనయందు సంపాదించుకొని తిరిగి ప్రజాపతితో నిట్లు పలికెను.

'ఓ ప్రజాపతీ, తమ యాదేశానుసారము పశువులు క్షీరములను పక్వమగునట్లు చేసినవి. అట్టి క్షీరపానముచే, నాకు సామర్థ్యము చేకూరినది. కాని, తృప్తిని నాకు చేకూర్చుట లేదు అనెను. అనంతరము ప్రజాపతి ఆతంచనకర్తలను (పాలను తోడుపెట్టు వాళ్ళను) పిలచి, ఆపాలను తోడుపెట్టి దధిగా తయారు చేయమని యాజ్ఞాపించగా, వారాక్షీరములను పెరుగురూపముగ తయారు చేసిరి.

## దధిని తయారు చేయు విధానము.

క్షీరములకు వివిధ ద్రవ్యసంయోగములచే నిష్పన్నమగు దధి వేరువేరు దేవతలకు ప్రియమగు నని ఈ క్రింది శ్రుతి వివరించుచున్నది.

"య త్పూతీకై ర్వా పర్ణవల్కై ర్వా౽౽తంచ్యా
త్సౌమ్యం త ద్యత్క్వలై రాక్షసం తద్య త్తండులై
ర్వైశ్వ దేవం త ద్యదాతంచనేన మానుషం తద్యద్దధ్నా
త త్సేంద్రం దధ్నా తనక్తి సేంద్రత్వాయ ।" (కృ.య.సం. 2.కాం. 5.ప్ర. 3. అను)

తా॥ సోమలతాసదృశములగు ఓషధివిశేషములు పూతీకములు. వాటిచే గాని, మోదుగచెట్టుయొక్క బెరడుచే గాని, క్షీరములను తోడుపెట్టగా నిష్పన్నమైన పెరుగు సోమదేవతకు ప్రియమైనది. ఇట్లే, క్షీరములకు స్థూలబదరీఫలసంబంధముచే నిష్పన్నమైన పెరుగు రాక్షసులకు ప్రియమైనది. మరియు, తండులసంపర్కముచే తోడుకొనిన పెరుగు విశ్వేదేవతలకు ప్రియమైనది. కొంచెము పులిసిన తక్రము (మజ్జిగ) చే తోడుకొనిన పెరుగు మనుష్యులకు ప్రియమైనది. క్షీరములలో పెరుగును వేయగా నిష్పన్నమైన పెరుగు ఇంద్రునకు ప్రియమైనది. అట్టి పెరుగును ఇంద్రునకు అవదానము (అనగా, హోమమును చేయుటకై పాత్రయందు గ్రహించుట) చేయునపుడు, పాలను ముందు అవదానము చేసి అనంతరము పెరుగును అవదానము చేయవలెను. అట్లు చేయుటచే ఇంద్రునకు సంతోషము జనించెను.

"దధ్నొపరిష్టా ద్ధినోతి ।" (కృ.య.సం. 2.కాం. 5.ప్ర. 3.అను.)

తా॥ దధిని అంత్యమును అవదానము చేయుటచే (అధ్వర్యుడు) ఇంద్రుని సంతోషపెట్టిన వాడగును. ఈ శ్రుత్యర్థము ననుసరించియే లోకములో అంత్యమున పెరుగుతో భోజనము చేయు ఆచారము కలదు. అనగా, సర్వపదార్థములను భుజించినపిదప చివర పెరుగుతో భోజనమును సమాప్తి చేయుట, దానితో మానవునకు సంతృప్తియు గానవచ్చుచున్నది.

## రెండుసార్లు భోజనము.

లోకములో శిష్టాచారపరాయణులు రోజుకు రెండుసార్లు మాత్రమే భోజనము చేయు విషయమీక్రింది శ్రుతివలన స్పష్టమగుచున్నది -

"ప్రజా వై సత్ర మాసత తప స్తప్యమానా అజుహ్వా
తీః । దేవా అపశ్యం చమసం ఘృతస్యపూర్ణగ్గ్ం స్వధాం ।
త ముపోద తిష్ఠ స్త మజుహువుః । తేనార్ధమాస ఊర్జ

*మవారుంధత । తస్మా దర్ధమాసే దేవా ఇజ్యంతే । పితరో*
*వశ్యం చమసం ఘృతస్య పూర్ణగ్గ్ స్వధాం । త ముపో*
*దతిష్ఠన్త మజుహువుః । తేన మా స్యూర్జ మవారుంధత ।*
*తస్మా న్మాసి పితృభ్యః క్రియతే । మనుష్యా అపశ్యం*
*చమసం ఘృతస్యపూర్ణగ్గ్ స్వధాం । తముపోదతిష్ఠ న్త*
*మజుహువుః । తేన ద్వయీ మూర్జ మవారుంధత । తస్మా*
*ద్విరహ్నో మనుష్యేభ్య ఉపహ్రియతే । పాత్రశ్చ*
*సాయం చ ।"* *(కృ.య.(బ్రా. 1. కాం. 4.(ప్ర. 9. అను.)*

తా॥ పూర్వమొకప్పుడు ప్రజలు (అనగా, దేవతలు, మనుష్యులు, పశువులు, అసురులు) హోమము లేకుండ ఉపవాసరూపమగు తపస్సును చేయుచు, సత్రయాగసదృశ మగు సుకృత మును సంపాదించిరి. ఇట్లు తపస్సు చేయుచుండగా, దేవతలకు కొంతకాలమునకు తమకు (దేవతలకు) ఉచితమగు అన్నమును ధరించునట్టి ఘృతపూర్ణ మగు చమస (దారుమయ) మగు చతురశ్రమగు పాత్రవిశేషము) గానవచ్చెను. దానిని చేతబూని, సమీపమున నిలువబడి ఆ ఆజ్యమును హోమము చేయగా, ఆ హోమ ప్రభావముచే దేవతలకు అర్ధమాసమునకు, భుజించుటకు పర్యాప్తమగు అన్నము సంప్రాప్త మాయ్యెను. కావుననే అహితాగ్నులు (ఆధానము, యజ్ఞము, చేసిన యజమానులు) అర్ధమాసమున కొక మారు (అనగా, అమావాస్య యందును, పౌర్ణమాసియందును) దర్శపూర్ణమాసేష్టులు అను యాగముచే దేవతలను హవిర్భాగముచే పూజించెదరు.

అనంతరము పితృదేవతలు తపస్సు చేయుచుండగా, కొంత కాలమునకు వారికి ఉచిత మగు అన్నమును ధరించెడి ఘృతపూర్ణమగు చమస గానవచ్చెను. దానిని చేతబూని, సమీపమున నిలువబడి, ఆజ్యములు హోమము చేయగా, ఆ హోమప్రభావముచే పితృ దేవతలకు ఒక మాసము భుజించుటకు సరిపోయెడి అన్నము సంప్రాప్తమాయెను. కావుననే లోకములో పితృదేవతలకు మాసమునకొకసారి అమావాస్యాదివసమున దర్శశ్రాద్ధము చేయబడుచున్నది. ఇదే విధముగ మనుష్యులు కూడ కొంతకాలము తపస్సు చేసిన పిమ్మట, స్వోచితమగు అన్నమును ధరించెడి ఘృతపూర్ణమగు చమస గానవచ్చెను. దానిని చేతబూని, సమీపమున నిలువబడి, ఆ ఆజ్యమును హోమము చేయగా, ఆ హోమప్రభావముచే ఒక దినమున కాలద్వయమందును (అనగా, రెండుసార్లు) భుజించుటకు పర్యాప్తమగు అన్నము సంప్రాప్త మాయెను. కావుననే లోకములో శిష్టాచారపరాయణులు (ప్రాచీన సంప్రదాయానుయాయులు) రోజునకు రెండుసార్లు మాత్రమే భోజనము చేయుదురు.

శ్లో॥ "సాయం ప్రాతర్ద్విజాతీనా మశనం శ్రుతిచోదితం ।
నాంతరా భోజనం కుర్యా దగ్నిహోత్రసమో విధిః ।"

ఇది "యావజ్జీవ మగ్నిహోత్రం జుహోతి" అను విధితో సమానమైనది గావున, దినముకు రెండుసార్లు మాత్రమే భోజనము చేయవలెను. మధ్యమున భోజనము చేయరాదు.

ఇదే విధముగ పశ్వభిమానిదేవతలు తపస్సు చేయగా, వారికి స్వోచిత మగు అన్నమును ధరించెడి ఘృతపూర్ణమగు చమస గాన వచ్చెను. దానిని చేతబూని, సమీపమున నిలువబడి హోమము చేయగా, ఆ హోమప్రభావముచే వారికి (పశ్వభిమాని దేవతలకు) దినమునకు మూడుసార్లు భుజించుటకు యోగ్యమగు అన్నము సంప్రాప్తమాయెను. కావున, పవువులు దినమునకు మూడు సార్లు ఆహారము భుజించును. (అనగా, ప్రాతఃకాల, సంగవకాల, సాయంకాలములందు భుజించును.)

## దక్షిణహస్తముతో భోజనము, దేవపూజాదికము, ఆశీర్వాదము.

*"దేవా వై య దృజ్ఞే కుర్వత త దసురా అకుర్వత*
*తే దేవా ఏతా అక్ష్ణయాస్తోమీయా అపశ్యన్తా అన్య*
*థానూచ్యా న్యథోపాదధత తదసురా నాన్వవాయన్ తతో*
*దేవా అభవన్ పరాసురాః ।"* (కృ. య. సం. 5. కాం. 3. ప్ర. 3. అను.)

తా॥ పూర్వము అసురులు దేవసామ్యమును పొందే కొరకు తమ సంబంధమగు గూఢచారుని దేవసమీపమందుంచి, వాని సహాయముచే దేవతలు యజ్ఞమందు చేయు అంగకలాపమును తెలిసికొని, అట్లే వారుకూడ ఆచరించుచుండిరి. ఈ విషయమును దేవతలు గుర్తించి, అసురులకు తాము జేయు విధానము తెలియకుండ జేయవలెనని నిశ్చయించిరి. మహాగ్నిచైన మను క్రతువులో గరుడపక్షి యాకారముగ (శ్యేనచితి) ఇటుకలను ఒక వరుసపై మరియొక వరుస ఉండునట్లు ఐదువరుసలుగ ఉపధానము చేసెదరు. ప్రతివరుసకు ప్రస్తారమని వైదిక వ్యవహారము. ప్రతిదినమునను ఉదయము 'ప్రవర్గ్య ఉపసత్' అను కర్మలను చేసి అనంతరము ఒక ప్రస్తారమును ఉపధానము చేసెదరు. మధ్యాహ్నము తిరిగి ప్రవర్గ్య, ఉపసత్ అను కర్మలను చేయుదురు. ప్రతియొక ప్రస్తారములోను ఒక్కొక్క మంత్రము నుచ్చరించి ఒక్కొక్క ఇటుకను ఉపధానము చేయుదురు. నాల్గవ ప్రస్తారములో ప్రకృతము చెప్పదలచిన 'అక్షయాస్తోమీయలు' అను ఇటుకలను ఈ క్రింది మంత్రములచే ఉపధానము చేయవలసినదిగా ఈ క్రింది శ్రౌతసూత్రము బోధించుచున్నది.

*"శ్వో భూతే పౌర్వాహ్ణికీభ్యాం ప్రచర్య చతుర్థీం చితిం చినోతి । ఆసుస్త్రిద్వృదగ్నే ర్వాగోసీ త్యేతాభ్యాం యథా బ్రాహ్మణ ముపధాయ,"* *(ఆ. శ్రౌ. సూ. )*

తా॥ ప్రాతఃకాలమందు చేయవలసిన 'ప్రవర్గ్య, ఉపసత్' అను కర్మలను జేసి, 'ఆశుస్త్రివృత్', 'అగ్నే ర్వాగోసి దీక్షాయా ఆధిపత్యం' అను రెండు అనువాకములలోని మంత్రముల చేత చతుర్థ ప్రసారమందు ఇటుకలను ఉపధానము చేయవలెను. ఈ అనువాకములచే ఉపధానము చేయవలసిన ఇటుకలకు 'అక్షయాస్తోమీయములు' అని పేరు. మంత్రముల పాఠక్రమమును ఉల్లంఘన చేసి అన్యప్రకారముగ (బ్రాహ్మణములో చెప్పిన రీతిగ) ఉపధానము చేయుటచే ఈ ఇటుకలకు అక్షయాస్తోమీయము లని పేరు వచ్చెను. ఈ విధముగ పాఠక్రమము నుల్లంఘన చేసి ఉపధానము చేయుటచే అసురుల గూఢచారికి దేవతలు చేసిన విధానము అవగాహన కాకపోయెను. దీని ఫలితముగ నసురులకు కర్మానుష్ఠానప్రక్రియ తెలియకపోవుటచే వారు పరాభూతులైరి. దేవతలు నిర్విఘ్నానుష్ఠానముచే ఫలయుక్తులైరి.

ఈ ప్రక్రమములో దక్షిణదిశయందు "వ్యోమ సప్తదశః" అనుమంత్రముచే ఇష్టకోపధానము చేయుటచే లోకములో దక్షిణ హస్తముచే అన్నము భుజింపబడుచున్నట్లు ఈ క్రింది శ్రుతి బోధించుచున్నది.

*"వ్యోమ సప్తదశ ఇతి దక్షిణతోన్నం వై వ్యోమా న్నతిం సప్తదశోన్నమేద దక్షిణతో ధత్తే తస్మా ద్దక్షిణే నాన్న మద్యతే ।"* *(కృ. య. సం. 5. కాం. 3. ప్ర. 3. అను. )*

తా॥ దక్షిణదిక్కున ఉపధానము చేయు మంత్రములో వ్యోమశబ్దమునకు, సప్తదశ శబ్దమునకు ఈ క్రింద వివరించిన ప్రకారము అన్నమర్థము. కాన, అన్నవాచకము లగు ఈ రెండు శబ్దముల చేత చతుర్థప్రసారములో దక్షిణదిక్కున ఇష్టకోపధానము చేయుటచే లోకములో మానవుడు కుడిహస్తముతో భుజించుచున్నాడు.

## వ్యోమ, సప్త దశ, శబ్దములకు, అన్నత్వ నిరూపణము.

లోకములో అవకాశయుక్త మగు క్షేత్రమందు (భూమియందు) చాల ధాన్యము పండును గావున (బహుధాన్యనిష్పత్తిచే) ఆకాశవాచక మగు వ్యోమ శబ్దమునకు అన్నమని యర్థము. సప్తదశ స్తోమము అన్నసంపాదకు లగు వైశ్యులతో గూడ ప్రజాపతి మధ్య దేశమునుండి పుట్టినది గావున, సప్తదశస్తోమమునకు అన్నత్వము చెప్పబడినది. ఈ

విధముగ అన్నవాచకములగు ఈ శబ్దములచే దక్షిణ దిక్కున ఇష్టకోపధానము చేయబడుటచే లోకములో దక్షిణహస్తముచే భోజనము చేయబడుచున్నది.

ఇదే విధముగ అన్నవాచకము లగు ఈ క్రింది మంత్రములచే దక్షిణదిక్కున ఇష్టకల నుపధానము చేయుటచే లోకములో దక్షిణ హస్తముచే భోజనము చేయబడుచున్నది.

*"అభివర్తస్సవిగ్ంశః "* (కృ. యు. సం. 5. కాం. 3. ప్ర. 3. అను.)

*గర్భాః పంచవిగ్ంశః "* (కృ. యు. సం. 5. కాం. 3. ప్ర. 3. అను.)

ఈ మంత్రములలో "అభివర్త", "సవిగ్ంశ", "గర్భ", "పంచవిగ్ంశ" అను శబ్దములకు అన్నమని యర్థము వివరించబడుచున్నది. ఎట్లన, అభివర్తశబ్ద మొకసామకు పేరు. ఆసామ అన్నమునకు సాధనమైనదిగాన, అది అన్నరూపమైనది.

వింశస్తోమములో రెండు పదిసంఖ్య లున్నవి గావున, పది సంఖ్య విరాట్ఛందోరూపము గనుక, విరాట్ఛందస్సు అన్న సాధనము గనుక, వింశస్తోమము అన్నరూపమైనది.

"గర్భాః పంచవిగ్ంశః" అను మంత్రములో గర్భములు అన్నకార్యములు గావున, గర్భశబ్దము అన్నరూపమైనది. పంచవిగ్ంశ స్తోమము అన్నహేతువు గనుక, అది అన్నరూప మైనది. ఇదే విధముగ ఉత్తరానువాకములో గూడ అన్నవాచకశబ్దములతో గూడిన మంత్రములచే దక్షిణదిక్కుయందు ఇష్టకోపధానము చేయుటచే లోకములో దక్షిణ హస్తముచే భోజనము చేయబడుచున్నది.

## కుడిహస్తముచే పూజాదికము.

**కు**డిహస్తముచే పూజాదికమును ఈ క్రింది శ్రుతి బోధించుచున్నది.

*"బ్రధ్నస్య విష్టపం చతుస్త్రిగ్ంశ ఇతి దక్షిణతోసౌ*
*వా ఆదిత్యో బ్రధ్నస్య విష్టపం బ్రహ్మవర్చసమేవ దక్షి*
*ణతో ధత్తే తస్మా ద్దక్షిణోర్ధో బ్రహ్మవర్చసితరః "* (కృ. యు. సం. 5. కాం. 3. ప్ర. 3. అను)

తా॥ 'బ్రధ్నస్య విష్టపం' అనగా ఆదిత్యుడని అర్థము. దక్షిణ దిక్కునందు ఆదిత్యసంబంధ మగు మంత్రముచే ఇష్టకోపధానము చేయుటచే దక్షిణహస్తము అధికమైన బ్రహ్మవర్చస్సుగల దాయెను. అనగా బ్రహ్మవర్చస రూపమగు వైదికహోమపూజాదికమును కుడి హస్తముచే చేయుదురు గాన దక్షిణభాగము అధికబ్రహ్మవర్చసంయుక్త మైన దాయెను. కావుననే ఆశీర్వాదము మున్నగు సత్కర్మలయందు కుడిహస్తమునకు ప్రాధాన్య మీయబడినది. వామహస్తముతో భోజనము లేనట్టుగా ఈ క్రింది శ్రుతి బోధించుచున్నది -

*'తపో నవదశ ఇత్యుత్త రత స్తస్మా త్సవ్యో హస్త*
*యోస్త పస్వితరః '* (కృ. యు. సం. 5. కాం. 3. ప్ర. 4. అను.)

తా॥ అక్షయాస్తోమీయేష్టకామంత్రములలో 'తపో నవదశః' అను తపశ్శబ్దముతో కూడిన మంత్రముచే ఉత్తరదిక్కున ఇష్టకోపధానము చేయుదురు. అందుచే రెండు హస్తములలోను ఉత్తరదిక్కున నుండెడి వామహస్తము దక్షిణహస్తమువలె భోజనశక్తి లేకపోవుట వలన చాల తపస్వి. అనగా, 'తపో నానశనా త్పరం' అను శ్రుతిచే అనశనము (భోజనాభావము) తపోరూపము గావున, వామహస్తము అనశనరూపమగు (అనగా, భోజనాభావరూపమగు) తపస్సు కలదిగా పరిగణింపబడుచున్నది. దీనివలన, ఆర్థికముగా వామహస్తముతో భోజనము లేదని ధ్రువ మగుచున్నది.

## వామహస్తముచే భిక్షాపాత్రధారణము.

**వా**మహస్తముచే భిక్షాపాత్రధారణము నీ క్రింది శ్రుతి బోధించుచున్నది.

*సంభరణ స్త్రయోవిగ్ంశ ఇత్యుత్తరత*
*స్తస్మా త్సవ్యో హస్తయో స్సంభార్యతరః ॥'* (కృ. య.సం. 5. కాం. 3. ప్ర. 4. అను)

తా॥ ఈ మంత్రముచే ఉత్తరదిక్కున అక్షయాస్తోమీ యేష్టకోపధానము చేసెదరు. అందుచే ఉత్తర దిగ్వర్తి యగు వామ హస్తము సంభార్యతరము (అతిశయముచే భిక్షాపాత్రను ధరించునది). అనగా, ఉపనయనకాలములో "భిక్షాచర్యంచర" అను గురువుయొక్క ఆదేశానుసారము భిక్షాచరణము విహితమై యున్నది గావున, భిక్షాపాత్రను వామహస్తముతో ధరించవలెనని తాత్పర్యము.

## మధ్యమప్రమాణముచే భోజనము.

**సం**వత్సరసత్రయాగములో మహావ్రత మను సోమయాగములో పంచవిగ్ంశ స్తోమమును ప్రధానముగా జెప్పి, ఆమహావ్రతమును చేయవలసిన దివసమును ఈ క్రింది శ్రుతి వక్కాణించుచున్నది.

*"మధ్యతః క్రియతే । మధ్యతో హ్యన్న మశితం ధినోతి ।*
*అథో మధ్యత ఏవ ప్రజానా మూర్జ్ఞ యతే ।"* (కృ. య. బ్రా. 1. కాం. 2. ప్ర. 6. అను)

తా॥ సంవత్సర సత్రములో సమాప్తి హేతువగు అతిరాత్రరూపమైన అంతిమదివసమునకు పూర్వదినమున మహావ్రతమును అనుష్ఠానము చేయవలెను. అట్లు చేసినచో సంవత్సరము యొక్క మధ్యయందు మహావ్రతానుష్ఠానము చేసినట్లగును. ఇట్లు మధ్యయం దనుష్ఠానము చేయుటచే లోకములో అత్యధికము, అత్యల్పము కాకుండ మధ్యమ ప్రమాణముచే భుజించబడిన అన్నము భోక్తను సంతోష పెట్టును. మరియు మానవునిచే భుజించబడిన అన్నరసము శరీరమధ్యయందే ధరించబడుచున్నది.

భావము: మహావ్రత మను సోమయాగమును సంవత్సర సత్రయాగములో మధ్యను అనుష్ఠానము చేయుటచే ఈ రెండును సంపన్నమైనవి. అనగా, మధ్యమప్రమాణముచే భోజనము, శరీరమధ్యయందు భుక్తమైన అన్నరసధారణము సంపన్నమైన వని తాత్పర్యము.

## భోజన ధర్మములు.

శ్లో॥ చతురశ్రం త్రికోణం చ వర్తులం చార్ధచంద్రకం ।
కర్తవ్య మానుపూర్వ్యేణ మండలం బ్రాహ్మణాదిషు ॥

తా॥ భోజనపాత్ర నుంచెడి స్థలమందు ఉదకముతో మండలము చేసి దానిపై భోజనపాత్ర నుంచి పాత్రాభిఘారము చేసి, వడ్డన చేయవలెను.

## మండలవిధి.

బ్రాహ్మణునకు చతురశ్రముగాను, క్షత్రియునకు త్రికోణముగాను, వైశ్యునకు వర్తులముగాను, శూద్రునకు అర్ధచంద్రాకారముగను మండలములను చేయవలెను.

## గృహస్థునకు భోజనపాత్ర విధానము.

శ్లో॥ "పాలాశం కదళీ జంబూపనసా౽౽౽మ్రాణి చంపకమ్ ।
పద్మోదుంబరపత్రాణి శస్తాని గృహిణ స్సదా ॥"

తా॥ మోదుగ, అరటి, నేరేడు, పనస, మామిడి, తామరాకు, మేడి ఈ వృక్షముల ఆకులు భోజనమునకు ప్రశస్తములు. పూర్వకాలము కుట్టినవిస్తరాకుల నుపయోగించెడివారు. అందుచే ఈ యాకులు కుట్టి, వినియోగించుకొనవలెనని తాత్పర్యము. అడ్డాకులు వగైరా కుట్టువిస్తరాకుల నిప్పటికిని చూచుచునే యుంటిమి.

## భోజనమునకు దిక్కులు.

శ్లో॥ "ఆయుష్యం ప్రాఙ్ముఖో భుఙ్క్తే యశస్వీ దక్షిణా ముఖః ।
శ్రీకామః పశ్చిమో భుఙ్క్తే న కదాచి దుదఙ్ముఖః ॥"

తా॥ తూర్పుముఖముగ భోజనము ఆయుస్సుకు హేతువు. దక్షిణముఖ భోజనము కీర్తి కారణము. పశ్చిముఖ భోజనము లక్ష్మీ హేతువు. ఈ విధముగ మూడు దిక్కులకు ఫలభేదములను జెప్పి, ఉదఙ్ముఖభోజనము ఎన్నడును చేయరాదని (కూడనిదిగ) నిషేధించబడినది.

## అభిఘారణవిధి.

శ్లో॥ "భుక్తిపాత్రస్య శుద్ధ్యర్థం చరే త్తదభిఘారణమ్ ।
పరివేషం తు నిర్వర్త్య చరే త్తదభిఘారణమ్ ॥"

## పాత్రాభిఘారణము

శ్లో॥ "పాత్రాభిఘారణం కుర్యా త్పైతృకేషు విశేషతః ।
శుభకార్యేషు సర్వేషు నా౽భిఘారణ మిష్యతే ॥"

తా॥ భోజనపాత్రకు పరిశుద్ధికొరకు వడ్డనకు పూర్వము ఘృతముచే పాత్రను స్పృశించ వలెను. అనగా, ఆకుముక్కతోగాని, నేతి గరిటెతోగాని భోజనపాత్రను ఉపస్తరణము చేయవలెను. పైతృక కర్మలందు విధిగా పాత్రాభిఘారణము చేయవలెను. శుభకార్యములందు పాత్రాభిఘారణము నిషేధింపబడినది.

## వడ్డనవిధి

శ్లో॥ "శాకాది పురత స్థాప్యం మధ్యే న్నం పరివేషయేత్ ।
దక్షిణే పాయసం సూపం భక్ష్యం చోష్యం చ వామతః ॥"

తా॥ భోజనపాత్రలో ముందుభాగమున కూరలు, మధ్యయందన్నము దక్షిణభాగమున పాయసము, సూపము (పప్పు)ను, ఎడమ భాగమున భక్ష్యాదికమును వడ్డించవలెను.

శ్లో॥ "పరివేషే తు సంపూర్ణే సర్పిషై వాభిఘారయేత్ ।
అన్నే తు పాయసే భక్ష్యే న కుర్యా ద్వ్యంజనాదిషు ॥"

తా॥ వడ్డన పూర్తి కాగానే, అన్నము, పాయసము, భక్ష్యముల యందు ఆజ్యముచే అభిఘారణము చేయవలెను. కూరలు, పచ్చళ్లు మున్నగు వాటియందు చేయరాదు.

## లవణము.

శ్లో॥ "పూర్వం నివేదనా త్పాత్రే లవణం నైవ దాపయేత్ ।
భుక్తి కాలే ప్రదాతవ్యం లవణం దధిమిశ్రితమ్ ॥"

తా॥ దేవునికి నివేదనకు పూర్వము ఉప్పు వడ్డించరాదు. పిమ్మట పెరుగుతోగాని, మజ్జిగతోగాని మిశ్రము చేసి ఉప్పు వడ్డించవలెను.

## రాత్రియందు లవణవిషయ విశేషము.

శ్లో॥ "యదా ప్రత్యక్షలణం దద్యాత్తేజో యశో హరేత్ ।
రాత్రౌ భోజనకాలే తు నోచ్చరే ల్లవణం సదా ॥
నిశి ప్రత్యక్షలవణం స దాతవ్యం కదాచన ।

ప్రమాదా ద్దీయతే భోక్తు రాయుఃక్షీణం న సంశయః ॥
తద్దోషపరిహారార్థం లవణం దీపదర్శితమ్ ।
దధ్నా జలేన సంమిశ్రం భక్షయే న్నైవ దోషకృత్ ॥”

తా॥ ప్రత్యేకముగా, లవణము నీయరాదు (అందుచే లవణదానము బియ్యముతో కూడ చేసెదరు.) ప్రత్యేకముగ లవణము నిచ్చినచో తేజస్సును, యశస్సును హరించును. రాత్రి భోజనకాలమందు 'ఉప్పు' అని ఉచ్చరించరాదు. అనగా, 'ఉప్పు వడ్డించు' అనిగాని, 'ఉప్పు కావలెనా' అనిగాని, ఏ విధముగాను 'ఉప్పు' అని ఉచ్చరించ రాదు. అవసరమైనచో పరోక్షనామతో 'బుట్టలోనిది కావలె' ననయే అడుగవలెను. మరియు, రాత్రియందు ప్రత్యేకముగ ఉప్పు వడ్డించరాదు. ప్రమాదమువలన అట్లు వడ్డించినచో, దానిని భుజించినవానికి ఆయుస్సు క్షీణమగును. ఆ దోషపరిహారము కొరకు లవణమును దీపమునకు జూపి, దధితోగాని, జలముతోగాని మిశ్రమము చేసి వడ్డించవలెను. దానిని భక్షించినచో యే దోషములును సంభవింపనేరవు. ఈ ఆచారమును ప్రాచీన స్త్రీలు జరిపెడివారు. (మా అమ్మగారు పై విధముగ చేయుట మాకు అనుభవములో నున్న విషయమే.).

## పరిషేచన విషయము.

శ్లో॥ “దక్షిణస్థాన మారభ్య భోజనస్య ప్రదక్షిణమ్ ।
అచ్ఛిన్నధారాం కుర్వీత సమంతం పరిషేచనమ్ ॥

ముష్టీకృతేన హస్తేన పరిషేచన మాచరేత్ ।
అపోశనార్థ ముదకం కరే నిక్షిప్య దక్షిణే ।

పాత్రం ధృత్వా__థ పేయం చామృతోపస్తరణేన చ ।
అపోశనార్థ ముదకం గ్రాహ్య మన్యైశ్చ బంధుభిః ।
స్వహస్తేన తు యః కుర్యా న్నరకం ప్రతిపద్యతే ।”

తా॥ గుప్పిటలో ఉదకముపోసి, భోజనపాత్రకు దక్షిణభాగము నుంచి ప్రదక్షిణముగ అవిచ్ఛిన్నోదకధారతో అంతటను పరిషేచనము చేయవలెను. అనంతరము ఇతరులచే తన దక్షిణ హస్తమందుంచబడిన ఉదకమును వామహస్తముచే భోజనపాత్రను ధరించి, అమృతోపస్తరణ మంత్రముచే పానము చేయవలెను. ఆపోశనార్థమగు ఉదక మును (ఇతరులు తన హస్తమందుంచకుండ) స్వయముగ గ్రహించి నచో నరకమును పొందును. ఇప్పటికిని పర్వములందును, శ్రాద్ధాదులందును బ్రాహ్మణులకు నియమముగ ఇతరులు వడ్డించునాచారము సర్వత్ర కలదు. (మా చిన్నతనములో సలక్షణఘనాంతస్వాధ్యాయులును

జ్యౌతిష, ధర్మశాస్త్రములయందు ప్రవీణులును, మామాతా మహులును నగు శ్రీకల్లూరి గణపతిశాస్త్రిగారు ఎన్నడును స్వయమాపోశన తీసికొనియెడివారు కారు. మా మాతామహిగాని ఇతరులు గాని, ఆపోశన వడ్డించెడివారు. పూర్వులందరును ఈ సంప్రదాయమునే పాటించెడివారు.)

## అపోశనము, శయ్య, ఆసనము, అభ్యంగనముల విషయము.

అపోశనా౭౭సనే శయ్యా త్రై లాభ్యంగం తథ్తైవ చ ।
స్వహస్తేనైవ యః కుర్యా దాయు శ్శ్రీపుత్ర నాశనం ।"

తా॥ పూర్వోక్తమగు ఆపోశనము, కూర్చొనుట కాసనము, పరుండుటకు శయ్య, తలంటు స్వహస్తముతో చేసికొనినచో ఆయుస్సు, లక్ష్మి, పుత్రులు నశించెదరు.

ఇంత దోష ముండుటచేతనే తలంటు సమయమున ఇప్పటికిని ఇతరులచే తల మీద నూనె పెట్టించుకొను సంప్రదాయము కలదు. ఆపోశనవిషయములో స్వయమాపోశన నిషిద్ధము. గనుకనే ప్రతి రోజును తెలిసియో, తెలియకయో ఈ విషయమును పాటించకపోయినను, అబ్దికాదులయందు బ్రాహ్మణులకు ఇతరులు వడ్డించు సంప్రదాయము సర్వజనప్రసిద్ధము.

## అన్నదోష నివృత్తి.

"అహం వైశ్వానరో భూత్వాహ్యన్నం బ్రహ్మరసం తథా ।
ఆసంస్పృష్ట్వాపహే ద్య స్త్వ న్నదోషా న విద్యతే ॥
దినే దినే గృహస్థస్తు దివాభాగే విశేషతః ।
అహం వైశ్వానరో భూత్వా ఇతి మంత్రం సముచ్చరేత్ ॥"

తా॥ ప్రతిదినమునను ప్రాణాహుతులకు ముందు అన్నమును స్పృశించకుండ,

శ్లో॥ 'అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః ।
ప్రాణాపానసమాయుక్తః పచా మ్యన్నం చతుర్విధమ్ ॥'

అను మంత్రము పఠించి ప్రాణాహుతులను తీసికొనినచో, అన్నదోషముండదు. శిష్టులట్లు చేయు ఆచారము కలదు. ప్రతిదినము రెండు పూటలును ఇట్లు చేయవలెను. విశేషించి పగటిభాగమందైనను తప్పక చేయవలెను.

## భోజనసమయమున మంచితీర్థము.

శ్లో॥ "జలపాత్రం తు నిక్షిప్య దక్షిణే మణిబంధకే ।
భుక్తికాలే తు విప్రో వై పిబే దన్యేన పాణినా ।"

తా॥ సామాన్యముగ "దక్షిణాచారేణ కర్తవ్యం" (అనగా, కుడిహస్తముతో చేయవలెను) అను విధ్యనుసారము కుడి హస్తముతో మంచితీర్థమును త్రాగవలెను. "దక్షిణే నాన్న మద్యతే" (అనగా, కుడి హస్తముతో భోజనము చేయవలెను) అను శ్రుత్యనుసారము, కుడిహస్తముతో భోజనము చేయుచుండుటచే, ఆ సమయమున వామహస్తముతో జలపాత్రను ధరించి, దక్షణహస్తముయొక్క మణిబంధ ప్రదేశమందు ఆ పాత్రనుంచి మంచితీర్థమును త్రాగవలెను.

## పంక్తి భోజనము.

శ్లో॥ "ఏకపంక్త్యుపవిష్టానాం విప్రాణాం సహ భోజనే ।
య ద్యేకోపి త్యజే త్పాత్రం శేష మన్నం న భక్షయేత్ ।
భుంజానేషు చ విప్రేషు యో౽గ్రే పాత్రం విముంచతి ।
న మూఢో నరకం యాతి బ్రహ్మహా స తు జాయతే ।
అప్యేకపంక్తౌ నాశ్నీయాత్ బ్రాహ్మణై స్స్వజనై రపి ।
కోహి జానాతి కిం తస్య ప్రచ్ఛన్నం పాతకం భవేత్ ।
అగ్నినా భస్మనా చైవ స్తంభేన నలిలేన వా ।
అంతరా ద్వారదేశే చ పంక్తి దోషో న విద్యతే ।
ఉదకం చ తృణం భస్మ ద్వారం పంథా స్తథైవ చ ।
ఏభి రంతరితం కృత్వా పంక్తిదోషో న విద్యతే ।"

తా॥ ఏకపంక్తియందు కూర్చొని భోజనము చేయుచున్న బ్రాహ్మణులలో యే ఒక్కడైన ముందుగ పంక్తి నుండి లేచినచో, మిగిలినవారు అన్నము భక్షించరాదు. మరియు, ఆ పంక్తిలో మిగిలిన బ్రాహ్మణుల భోజనము పూర్తికాకుండ, వారు భోజనము చేయు చుండగ యెవడు ముందు భోజనము నుండి లేచిపోవునో, ఆ మూఢుడు రౌరవనరకమును బొందును. బ్రహ్మహత్య చేసినవాడగును. అందుచే ఇట్టి దోషప్రసక్తి లేకుండుటకై స్వజనులైనను బ్రాహ్మణులతో గూడ ఏక పంక్తియందు భోజనము చేయరాదు. అనేకులతో ఏకపంక్తి యందు భోజనము చేయుటవలన వానికి రహస్యమైన (అనగా, మనకు గోచరించని) పాతక మేమి వచ్చునో ఎవనికి తెలుసును? అందువలన ఏకపంక్తి కాకుండుటకై అగ్నిచేత

గాని, భస్మ, స్తభము, ఉదకములతో దేనిచేతనైన గాని వ్యవధాన మున్నచో ఏకపంక్తి దోష ముండదు.

## పంక్తి పావనులు.

నిత్యము త్రిసువర్ణమంత్రములను పఠించువారు పంక్తి పావనులు. పంక్తిపావనులతో ఏకపంక్తి భోజనము పవిత్రతాజనకము. ఆ మంత్రార్థము ముందు వివరించబడినది.

శ్లో॥ యశ్చ వ్యాకురుతే వాచం యశ్చ మీమాంసతే౽ధ్వరం ।
తా వుభౌ పుణ్యకర్మాణౌ పంక్తిపావన పావనౌ ।"

తా॥ వేదాంగ మగు వ్యాకరణమును ఎవడు అధ్యయనము చేయునో, కర్మమీమంసను (పూర్వమీమాంసను) ఎవడు అధ్యయనము చేయునో, వారుభయులను పంక్తి పావనులను గూడ పవిత్రుల నుగ చేయుదురు.

## ఉత్తరాపోశనము.

"దక్షిణం భుజ మాశ్రిత్య సర్వా స్తిష్ఠంతి దేవతాః ।
ఉత్తరాపోశనం శేషం వామభాగే విసర్జయేత్ ।

ఉత్తరాపోశనజలం త్యజే ద్రౌరవ తీర్థతః ।
తర్జన్యగ్రేణ నిర్ముక్తం రౌరవం తీర్థ ముచ్యతే ।"

తా॥ దక్షిణబాహువు నాశ్రయించి (అనగా కుడివైపున) సర్వదేవతలు ఉండెదరు. అందువలన ఉత్తరాపోశన జలశేషమును వామభాగమందు రౌరవతీర్థమున విడచిపెట్టవలెను. తర్జని (అనగా, అంగుష్ఠమునకు సన్నిహితముగ నున్న వ్రేలు) యొక్క అగ్రముద్వారా విడువబడిన జలమును రౌరవతీర్థ మందురు.

## భోజనోత్తరపాదప్రక్షాళనము.

శ్లో॥ హస్తప్రక్షాళనం యత్రపాదౌ తత్రైవ క్షాళయేత్ ।
ప్రక్షాలయేచ్చార్ధపాదౌ భుక్త్యంతే వా యదా తదా ।
తత్కర్మ విఫలం యాతి దారిద్ర్యం సమవాప్యతే ।"

తా॥ భోజనానంతరము హస్తప్రక్షాళన చేయు స్థలమందే పాదములను కడుగవలెను. పాదప్రక్షాళన చేయవలసినపుడు సగము పాదములే కడిగినయెడల, (అనగా మడమలు తడువకుండ పాదప్రక్షాలన చేసినయెడల), ఆ కర్మ విఫల మగుటయే గాక దారిద్ర్యము కూడ సంప్రాప్తమగును( ఈ విషయము మాచిన్నతనమునుండియు మా ఇంట నాచారములో

నున్నది). మడమలు తడవకుండ కాళ్ళు కడుగుకొనినచో దరిద్రము వచ్చునని స్త్రీలు అనువారు.

## రాత్రి భోజనకాలమున దీపనాశనము.

శ్లో॥ రాత్రౌ భోజనకాలే తు యది దీపో వినశ్యతి ।
పాత్రం ధృత్వా తు పాణిభ్యాం భాస్కరం మనసా స్మరేత్ ॥
దృష్ట్వాతు స పున ర్దీపం త చ్ఛేషం భోజయే న్నరః ।
పున రన్నం న భోక్తవ్యం యది భుంజీత కిల్బిషీ ॥

తా॥ రాత్రి భోజనసమయమున దీప మారిపోయినచో, భోజన పాత్రను హస్తములచే ధరించి సూర్యుని మనంబున స్మరింపవలెను. తిరిగి దీపమును చూచి ఆశేషమును భుజింపవలెను. అటుపిమ్మట అన్నమును మారు వడ్డించుకొని తినకూడదు. తినినచో పాపి యగును.

## రాత్రి భోజనసమయమున తుమ్ము.

శ్లో॥ ।యో విప్రో భోజనే కాలే రాత్రౌ కుర్యాత్ క్షుతం యది ।
యశోహాని ర్నిర్ధనతా చాజన్మాంతం భవే ద్ధ్రువమ్ ॥
తద్దోషశమనారాయ శిరసి ప్రోక్షయే జ్జలమ్ ।
స్వజన్మధరణీం జ్ఞాత్వా దేవతాస్మరణం చరేత్ ॥
అజ్ఞానా ద్యది వా మోహాత్ యో విప్రో న స్మరే ద్యది ।
ఆయుఃక్షీణం భవే త్తస్య దారిద్ర్యం చ సమశ్నుతే ॥
అన్యాభావే స్వహస్తేన జలం సంప్రోక్ష్య మస్తకే ।
జన్మభూమిం చ విజ్ఞాయ విష్ణో ర్నామాని కీర్తయేత్ ॥'

తా॥ రాత్రికాలమున భోజనము చేయునపుడు తుమ్ము వచ్చినచో కీర్తి నాశనము, ఆజన్మాంతము నిర్ధనత్వము (దారిద్ర్యము) సంభవించును. ఆదోషపరిహారమునకై ఇతరులు తుమ్మినవారి శిరస్సు నందు జలమును ప్రోక్షించవలెను. అనంతరము తన జన్మభూమిని, అచ్చటి దేవతను స్మరణము చేయవలెను. అజ్ఞానమువలనగాని, మోహమువలనగాని అట్లు స్మరింపనిచో ఆయుస్సు క్షీణమగును. దారిద్ర్యమును పొందును. ఇతరులు దగ్గర లేనిచో తాను స్వయముగ తన హస్తముచేతనే తన శిరంబున జలమును ప్రోక్షించి, జన్మభూమిని స్మరించి, విష్ణునామకీర్తనము చేయవలెను.

## దీపలోపనము, గుమ్మడికాయ ఛేదనము.

శ్లో॥ దీపనిర్వాపణం పుంసః కుశ్మాండచ్ఛేదనం స్త్రియాః ।
అచిరేణైవ కాలేన వంశచ్ఛేదో భవే ద్ధ్రువమ్ ॥
దీపేన దీపం ప్రజ్వాల్య దరిద్రో వ్యాధిమాన్ భవేత్ ।
కంచుకోత్థేన మరుతా దీపం నైవ నివారయేత్ ॥
ఆస్యసంభూత నా తేన హస్త సంజాతవాయునా ।
విసృజేతి సముచ్చార్య లోపయే ద్దీప మంచలాత్ ॥
తావచ్చ తూష్ణీం స్థాతవ్యం యావచ్ఛేషః ప్రశామ్యతి ।

తా॥ పురుషుడు దీపమును ఆర్పినను, స్త్రీ గుమ్మడికాయను, (బూడిదగుమ్మడి కాయను), ఛేదించినను, శీఘ్రకాలములో వంశచ్ఛేదమగును. దీపముచే దీపమును వెలిగించినచో దరిద్రుడును, రోగ గ్రస్తుదును నగును. రవికెచేతను, ముఖవాయువుచేతను, హస్త వాయువుచేతను దీపమును ఆర్పకూడదు. 'హేదీప విసృజ జ్యోతిః' అని ఉచ్చరించి చీరయొక్క అగ్రభాగముతో (చంగుతో) దీపమును ఘనము చేయవలెను.

## దీపపు నీడ.

శ్లో॥ దీపే నాత్మతనుచ్ఛాయాం భర్తుశ్చోపరిచే త్త్యజేత్ ।
తౌ దంపతీ దరిద్రత్వ మాప్నువీతాం వినిశ్చితమ్ ॥'

తా॥ భార్యయొక్క దీపపునీడ భర్తమీద పడరాదు. అట్లు పడినచో ఆ దంపతులు దరిద్రులగుదురు.

## రాత్రియందు విధవాపాకభోజన నిషేధము.

శ్లో॥ 'పతిహీనస్త్రియాః పాకం న రాత్రౌ భోజయే ద్ద్విహీ ।
భుంజీత కర్మబాహ్యా స్స్యాత్ మాతరం భగినీం వినా ॥'

తా॥ భర్తలేని స్త్రీ (విధవాస్త్రీ) చే వండబడిన వంటను రాత్రియందు భుజించరాదు. భుజించినచో కర్మబాహ్యుడగును. ఏ పుణ్యకర్మకును అర్హుడు కాడు. తల్లి, సహోదరీలు విధవలైనను వారు చేసిన పాకము తినవచ్చును. దోషము లేదు.

## త్రిసుపర్ణమంత్రములు.

'బ్రహ్మ మేతు మాం । మధు మేతు మాం । బ్రహ్మ
మేవ మదు మేతు మాం । యా స్తే సోమ ప్రజావ

త్స్రేభిసో అహం । దుష్వప్నహన్ దురుష్షహ । యా
స్తే సోమ ప్రాణాగ్ స్తాం జుహోమి । త్రిసుపర్ణ మయా
చితం బ్రాహ్మణాయ దద్యాత్ । బ్రహ్మహత్యాం వా
ఏతే ఘ్నంతి । యే బ్రాహ్మణా స్త్రిసువర్ణం పఠంతి ।
తే సోమం ప్రాప్ను వంతి । అసహస్రా త్పఙ్క్తిం పునంతి ।
ఓం ।" ఇతి. (కృ.య.ఉపనిషత్తులు నారాయణము)

తా॥ జ్ఞానప్రతిబంధక మగు బ్రహ్మహత్యాదిపాపక్షయము కొరకు జపము చేయదగిన త్రిసుపర్ణ మంత్రములు చెప్పబడుచున్నవి. పరబ్రహ్మ నన్ను పొందుగాక. పరమా౽__౽__నంద మాధుర్యోపేత మగు వస్తువు నన్ను పొందుగాక. మధురమగు బ్రహ్మయే నన్ను పొందవలెను గాని ఇతర మగు క్షుద్రదైవతము పొందవలదు.

బ్రహ్మవిద్యతోకూడ వర్తమానుడ వగు ఓ పరమాత్మా! (ఉమా, బ్రహ్మవిద్యా), నీ సంబంధమ గు దేవమనుష్యాదిప్రజలలో సేవకుడనైన నేను బాలునివలె కరుణాయోగ్యుడను. సంసారరూప మగు దుస్స్వప్నమును కొట్టివేసెడి ఓ పరమాత్మా! దుస్సహ మగు సంసారమును నశింపచేయుము. తరింపచేయుము. ఓ పరమాత్మా! నా మనో వాగాదిప్రాణవృత్తులు నీచే నిర్మింతములు గాన (త్వదీయములు గాన), నీసంబంధమైనవి. అందువలన నీయందే వాటిని ఉపసంహారము చేయుచుంటిని. అనగా, విషయముల నుండి ఇంద్రియములను నిరోధించి నీ ఒక్కనియందే నా మనస్సును లగ్నము చేయుచున్నవాడ నగుచుంటిని.

## త్రిసుపర్ణమంత్రమాహాత్మ్య ప్రతిపాదకబ్రాహ్మణము.

"త్రిసుపర్ణ మయాచితంబ్రాహ్మణాయ దద్యాత్ ।
బ్రాహ్మహత్యాం వా ఏతే ఘ్నంతి । యే బ్రాహ్మణా
స్త్రిసుపర్ణం పఠన్తి । తే సోమం ప్రాప్నువంతి । ఆ
సహస్రాత్పఙ్క్తిం పునంతి ష। ఓం "

తా॥ (నా౽__పృష్టః కస్యచి ద్బ్రూయాత్). అను శాస్త్రము ననుసరించి, శిష్యుడు "ఈ విద్యను నాకు చెప్పు" మని గురువును యాచించిన పిమ్మటనే (ఇతర విద్యలను) ఉపదేశించ వలెను. ఈ త్రిసుపర్ణము నన్ననో, శిష్యుడు యాచించకుండగనే బ్రాహ్మణునకు ఉపదేశించ వలెను. ఆ ఉపదేశముచే ఏ బ్రాహ్మణులు త్రిసుపర్ణమంత్రమును నిరంతరము జపింతురో, వారు బ్రహ్మహత్యా దోషమును నశింపజేయుచుందురు. మరియు, వారు సోమయాగఫల మును పొందెదరు. వారు ఏ పఙ్క్తియందు భుజింతురో, ఆపఙ్క్తిని సహస్రపర్యంతము శుద్ధమైనదానినిగ చేయుదురు. అందుచే ప్రణవప్రతిపాద్యు డగు పరమాత్మయే త్రిసుపర్ణ మంత్రమునకు దేవతయని తాత్పర్యము.

# ద్వితీయ త్రిసుపర్ణమంత్రము.

"బ్రహ్మ మేధయా । మధు మేధయా । బ్రహ్మ మేవ
మధు మేధయా । అద్యా నో దేవ సవితః ప్రజావత్సావీ
స్సౌభగం । పరాదుష్ష్వప్నియగ్ం సువ । విశ్వాని దేవ
సవిత ర్దురితాని పరాసువ । యద్భద్రం త న్మ ఆసువ ।
మధు వాతా ఋతాయతే మధు క్షరంతి సింధవః ।
మాధ్వీ ర్న స్సంత్వోషధీః । మధు నక్త ముతోషసి
మధుమత్పార్థివగ్ం రజః । మధుద్యౌ రస్తు నః పితా ।
మధుమా న్నో వనస్పతి ర్మధుమాగ్ం అస్తు సూర్యః ।
మాధ్వీ ర్గావో భవంతు నః ।" (2. మం.)

తా॥ సర్వజగత్తుకు కారణమును, సర్వవేదాంత వేద్యమును అగు బ్రహ్మ గురువుచే ఉపదేశించబడిన మహావాక్య, తదర్థముల యొక్క ధారణశక్తి చే పొందబడుగాక. మధ్విత్యాదికము పూర్వము వలె యోచించుకొనవలెను.

ప్రేరకుడ వగు ఓ దేవా! ఈ దినమందు విద్యార్థుల మగు మాకు శిష్యప్రశిష్యాది ప్రజోపేత మగు సౌభాగ్యమును, ఆచార్యత్వమును ప్రేరణచేయుము (ఇమ్ము). దుష్టస్వప్నసదృశ మగు ద్వైతప్రతి భాసను నిరాకరించుము. మరియు ప్రేరకుడ వగు ఓ దేవా! జ్ఞానప్రతి బంధకము లగు పాపముల నన్నిటిని నశింపచేయుము. కళ్యాణమగు తత్త్వజ్ఞానమును (అనగా, సంశయ, అసంభావనా, విపరీతభావనా రహితమగు దానిని) ఉపాసకుడ నైన నా కొరకు సంపూర్ణముగ అనుగ్రహింపుము. పరబ్రహ్మను ఇచ్ఛయించెడి నాకొరకు వాయువులు సుఖముగా (శైత్య, మాంద్య, సౌరభ్యములతో) వీచుగాక. వాయువు ప్రబలమైనచో రోగోత్పత్తిచే తత్త్వజ్ఞానముకు విఘ్నము సంభవించును. అట్టి విఘ్నము లేకుండుటకు వాయువు యొక్క ఆనుకూల్యము ప్రార్థించబడుచున్నది. ఇదే ప్రకారముగ ముందు సింధ్వాదుల ఆనుకూల్యమును చూచుకొనవలెను. నదులు మధురము, ఆరోగ్యకరము అగు ఉదకమును సంపాదించుగాక. వ్రీహి, యవాద్యోషధులు కూడ మాకు (మధురములు) పథ్యరూపములగుగాక. మరియు రాత్రియందును, ఉషఃకాలమందును, దినమందును అనుకూలమగు సుఖమగుగాక. అనగా, కాలకృతమగు విఘ్నము లేకపోవుగాక. పృథివియందలి రజస్సు (అనగా శయన, ఆసనాదిస్థానములందలి రజస్సు) కంటక పాషాణాదులు లేకుండ అనుకూల మగుగాక. మాకు పితృసదృశ మగు ద్యులోకముగూడ అతివృష్ట్యాది ప్రాతికూల్య రహితమైనది అగుగాక. మామిడి, పనస మున్నగు వనస్పతులు మధుర ఫలోపేతములై

జీవన హేతువు లగుగాక. సూర్యుడు కూడ అధిక సంతాపము చేయకుండ అనుకూల ప్రకాశతో కూడినవాడగు గాక. గోవులు కూడ మమ్ములను గూర్చి జీవనహేతువగు మధుర క్షీరములతో యుక్తము లగుగాక.

"య ఇమం త్రిసువర్ణ మయాచితం బ్రాహ్మణాయ
దద్యాత్ । భ్రూణహత్యాం వా ఏతే ఘ్నంతి । యే
బ్రాహ్మణా స్త్రిసుపర్ణం పఠంతి । తే సోమం ప్రాప్ను
వంతి । అసహస్రా త్పఙ్క్తిం పునంతి । ఓం ।" (2. మం.)

తా॥ (వెనుకటివలె) ఇతర విద్యలవలె గాక, ఈ త్రిసుపర్ణ మంత్రమును శిష్య యాచన లేకుండగనే ఉపదేశించవలెను. ఈ త్రిసుపర్ణ మంత్రపఠనమువలన భ్రూణహత్యా పాపమును నశింపజేయుదురు. (వేదవేదాంగవేత్త యగు బ్రాహ్మణుని యొక్కవధనుగాని, బ్రాహ్మణగర్భము యొక్కగాని, రాజన్యగర్భముయొక్కగాని హననమును భ్రూణహత్య యందురు). మరియు సోమయాగఫలమును పొందెదరు. వారి పఙ్క్తియందు భుజించువారిని సహస్రపర్యంతము పవిత్రులను చేయుదురు. ప్రణవ ప్రతిపాద్య మగు పరబ్రహ్మయే త్రిసుపర్ణ మంత్రముకు దేవత.

## మూడవ త్రిసుపర్ణ మంత్రము.

"బ్రహ్మ మేధవా । మధు మేధవా । బ్రహ్మ మేవ మధు
మేధవా । బ్రహ్మ దేవానాం పదవీః కవీనా మృషి ర్వి
ప్రాణాం మహిషో మృగాణాం । శ్యేనో గృధ్రాణాగ్ స్వధి
ధి ర్వనానాగ్ం సోమః పవిత్ర మత్యేతి రేభన్ । హగ్ంస
శ్శుచిష ద్వసు రంతరిక్షస ద్ధోతావేదిష దతిథిర్దురోణసత్ ।
నృషద్వరస దృతసద్వ్యోమస దబ్జా గోజా ఋతజా
అద్రిజా ఋతం బృహత్ ।" ఇతి.

తా॥ బ్రహ్మ యజ్ఞము కలది. (బ్రహ్మజ్ఞానముకు యజ్ఞాదికము వివిదిషోత్పాదన ద్వారా సాధనమగుటచే బ్రహ్మ, యజ్ఞము కలది) పరమేశ్వరుడు అగ్నీంద్రాదిదేవతలలో చతుర్ముఖరూపుడై, నియామకుడగుచున్నాడు. కావ్యనాటకాదికర్త లగు కవీశ్వరులలో శబ్దసామర్థ్యవేత్త లగు వ్యాసవాల్మీక్యాదిరూపుడు. వైదికమార్గవర్తులగు బ్రాహ్మణులలో గోత్రప్రవర్తకు డగు వసిష్ఠాదిరూపుడు చతుష్పాత్పశువులలో బలాధిక్యయుక్తమగు మహిషరూపుడు. గృధ్రోపలక్షితము లగు సర్వపక్షులలో ప్రబల మగు శ్యేనరూపుడు. వృక్ష సమూహరూపము లగు వనములకు ఛేదనార్థ మగు పరశురూపుడు. యాగహేతుభూత

సోమలతారూపుడై మంత్రశబ్దయుక్తు డగుచు, శుద్ధికారణ మగు గంగాజల, కుశ, దర్భాది ద్రవ్యజాతమును అతిక్రమించుచున్నాడు. (ఇచ్చట సోమశబ్దమునకు సోమయాగము అర్థము). అనగా యజ్ఞరూపు డగుచు మంత్రశబ్దములతో యుక్తుడై పవిత్రమగు ద్రవ్యజాతమును అతిక్రమించుచున్నాడు.

(హగ్ంస శ్శుచిషత్) ఏ పురుషుడు వివేకముచే మాయను పరిత్యజించునో, ఆ పురుషునకు జగత్తంతయు బ్రహ్మరూపముగ భాసించును," అను అర్థము ఈ మంత్రము నందు ప్రదర్శింపబడుచున్నది. ఏతదర్థమై ఆదియందు జగత్తు అనువాదము చేయబడుచున్నది.

తా॥ ఎల్లప్పుడు గమనము చేయు ఆదిత్యరూపుడు (హంసః), పరిశుద్ధ మగు జ్యోతిర్మండలమం దుండువాడు (శుచిషత్), సూత్రాత్మరూపుడుగ జగన్నివాస హేతువు (వసుః) ధూమ, జ్వాలా రూపముగ అంతరిక్షమందుండువాడు (అంతరిక్షసత్), హోమనిష్పాదకుడగు ఆహవనీయాద్యగ్నిరూపుడు (హోతా) అగుచు, సోమ యాగసంబంధమగు వేదియం దుండువాడు (వేదిషత్), అతిథి సదృశుడగుచు యాగగృహములం దుండువాడు (దురోణసత్), మనుష్యులందు జాఠరాగ్ని రూపుడుగ నుండువాడు (నృషత్), శ్రేష్ఠ మగు శ్రోత్రియగృహమం దుండువాడు (వరసత్), యజ్ఞమందు తన్నిష్పాదకు డగుచు నుండువాడు (ఋతసత్), ఆకాశమందు సూర్యరూపుడుగ నుండువాడు (వ్యోమసత్), వృష్టిధారా రూపములగు ఉదకములందు వైద్యుతరూపముగ జనించువాడు (అబ్జాః), గోకార్యమగు ఘృతమందు జ్వాలారూపముగ నావిర్భవించువాడు (గోజాః), యజ్ఞము కొరకే సముత్పన్నమైనవాడు (ఋతజాః), పాషాణముపై పాషాణాంతర సంఘర్షణచే ఉత్పన్నుడు (అద్రిజాః), ఇవి అన్నియు సత్య మగు పరబ్రహ్మమే. లేక, ఇట్టి అగ్ని ప్రౌఢమగు యజ్ఞమును నిష్పాదన చేయుగాక. ఈ ప్రకారము కర్మసిద్ధి కొరకు పరమేశ్వరుడు బహుస్థలములందు బహురూపుడుగ నుంటున్నాడు. (ఋతంబృహత్) (ఈ మంత్రమందు అనేక ప్రదేశములందు తత్తత్ప్రకరణానుగుణముగ అర్థములు వ్రాయబడినవి.

"ఋచే త్వా రుచే త్వా సమిత్స్రవంతి సరితో న
ధేనాః । అంతర్హృదా మనసా పూయమానాః । ఘృతస్య
ధారా అభిచాకశీమి ।" (3. మం.)

తా॥ ఓ పరమాత్మా! ఋగ్వేదరూపుడ వగు నీకొరకు ఈ సమిధ అగ్నియందుంచబడుచున్నది. ఋగుపలక్షిత మగు వేదత్రయ ప్రాప్తి కొరకు నిన్ను ఉద్దేశించి ఈ సమిధ ఉంచబడుచున్నది. మరియు, దేవతలచే పానము చేయబడియెడి (నాచే అగ్నియందు హోమము చేయుబడిన) నదీసదృశము లగు ఆజ్యధారలు నిన్నుగూర్చి స్రవించుచున్నవి. (ధారావిశేషణం) హృత్కోశవర్తి యగు మనస్సుచే పవిత్రితము లైనవి. అనగా, అంతరంగపూర్వకముగ హోమము చేయబడుటవలన పవిత్రములైన ఆజ్యధారలు హృదయ

శుద్ధి లేనిచో అపవిత్రములగునని భావము. ఇట్టి ఆజ్యధారలను సర్వదేవతల కొరకు ఇచ్చెదను.

"హిరణ్యయో వేతసో మధ్య ఆసాం । తస్మిన త్సు
పర్ణో మధుకృత్కులాయీ భజన్నాస్తే మధుదేవతాభ్యః ।
తస్యాఽఽసతే హరయ స్సప్తతీరే స్వధాం దుహానా
అమృతస్య ధారాం ।" (3. మం.)

తా॥ జ్యోతిర్మయుడైనట్టియు, బహుద్రవ్యవంతుడైనట్టియు, మధురమగు స్వర్గాదిసుఖమును చేయునట్టియు, సర్వప్రాణులయొక్క దేహము లనెడి కులాయములను (గూళ్ళను) నివాసస్థానములను ఆశ్రయించినట్టి త్రిసుపర్ణుడు (పరమాత్మ), సర్వదేవతల కొరకు మధురమగు హవిస్సును విభజించి ఇచ్చుచున్న వాడగుచు పూర్వోక్తములగు ఆజ్యధారలయొక్క మధ్యభాగమందు, ఆ అహవనీయమందు ఉండెను. స్మరణమాత్రముచే పాపములను హరించువారును. అమృతధారాతుల్య మగు హవ్యద్రవ్యముల పరంపరను దేవతలకు అందచేయువారును అగు సప్తఋషులు, ఆ త్రిసుపర్ణునియొక్క (పరమాత్మ యొక్క) తీరమందు (సమీపప్రదేశము లందంతటను) నివసించుచుండిరి.

## త్రిసుపర్ణమంత్ర మహిమ.

"య ఇదం త్రిపర్ణ మయాచితం బ్రాహ్మణాయ
దద్యాత్ । వీరహత్యాం వా ఏతే ఘ్నంతి । యే బ్రాణా
స్త్రిసుపర్ణం పఠంతి । తే సోమం ప్రాప్నువంతి । ఆ
సహస్రా త్పఙ్క్తిం పునంతి । ఓం ।" ఇతి. (3. మం.)

తా॥ ఈ మూడవ త్రిసుపర్ణమంత్ర పాఠమువలన త్రిప్రకారులైన వీరుల హననపాపముల నుండి విముక్తుడగును. సోమయాగ ఫలమును పొందును. తన పంక్తి యందు భుజించువారిని సహస్ర తరములు పవిత్రులను చేయును. (ఇచ్చట వీరశబ్దమునకు మూడు అర్థములు. గుణవంతుడైన పుత్రుడు వీరుడు. అభిషిక్తుడైన క్షత్రియుడు వీరుడు. వేదశాస్త్ర సంపన్నుడై తదర్థానుష్ఠానపరుడగు బ్రాహ్మణుడు వీరుడు.

## త్రిసుపర్ణశబ్దార్థము.

తా॥ ముగ్గురు పక్షిస్థానీయు లగు బ్రహ్మ విష్ణు, మహేశ్వరులు గాని, విశ్వ తైజస, ప్రాజ్ఞులు గాని, విరాడ్ఢిరణ్యగర్భా ంతర్యాములు గాని ఎవనివలన ఉత్పన్నులైరో, అతడు త్రిసుపర్ణుడు. అనగా, సర్వదేవతా సమిష్టిస్వరూపు డగు పరమాత్మ. అట్టి పరమాత్మ యొక్క

మహిమను చెప్పుటచే ఈ మూడు మంత్రములు కూడ త్రిసుపర్ణ శబ్దముచే ఉపచరించ బడుచున్నవి. అనగా ఈ మంత్రములకు త్రిసుపర్ణ మంత్రములను పేరు వచ్చెను.

ఈ మూడు మంత్రములలోను ప్రథమ మంత్రములో పరబ్రహ్మ ప్రాప్తికి సాధన మగు ఉపాసన చెప్పబడినది. ద్వితీయ మంత్రములో జ్ఞానము చెప్పబడినది. తృతీయమంత్రములో కర్మకు పరమాత్మ ప్రాప్తి సాధనత్వము చెప్పబడినది.

'బ్రహ్మ మేతు మాం' అను మంత్రములో 'మేతు' అనుదానికి ప్రాప్నోతు అని అర్థము. ('మీ గతౌ' అను ధాతువు చౌరాదికము, ఆర్ధృషీయము, 'బహుళం ఛందసి' అను శాస్త్రానుసారము 'శప్' అను వికరణ ప్రత్యయమునకు 'లుక్') ఈ విధముగ పంక్తి పావనులు శ్రుతిచే బోధించబడుచుండిరి.





శ్రీ మహాగణాధిపతయే నమః ।

# వేదసార రత్నావళి

## 16. కన్యకాంబ చరిత్ర.

వైశ్యుల కులదేవత యగు కన్యకాంబ కుసుమశ్రేష్ఠి, కుసుమాంబ అను వైశ్యదంపతుల పుత్రిక. ఈమె మొదటిపేరు వాసవాంబ. ఈమె తండ్రి, పుత్రకామేష్టి యాగము చేయుటచే నాతని కీమెయు, విరూపాక్షుడను పుత్రుడును కల్గిరి. ఇట్లుండ నొకనాడు విష్ణువర్ధనుడను రాజు వారి నివాసస్థానమైన పెనుగొండగ్రామ సమీపమునకు వచ్చెను. ఆ మహారాజునకు వైశ్యు లెదురుగ బోయి, నాతని తమ నగరమునకు తీసికొనిపోయి యాతిథ్య మిచ్చి సత్కరించిరి. ఆ మహారాజు వారి సపర్యల గైకొని సంతసించి వారిలో ప్రతి యొక్కరికి తాంబూల మిచ్చుచుండ, ముందుగ దానిని కుసుమాంబ గైకొనెను. పిమ్మట వాసవాంబ తాంబూలమునకై గొనిరాబడెను. ఆమెను జూచి రాజు మోహితుడై యామెను తన కిచ్చి వివాహము చేయుమని కోరెను. అట్లు చేయుటకు వారంగీకరింపరైరి. అంతట నారాజు కుపితుడై, యుద్ధమున వారిని పరాజితులను గావించి యెట్టైన నామెను చేబట్టెదనని ప్రతిన బూనెను.

తుట్టతుదకు వాసవాంబను ఆరాజున కిచ్చుటకు కుసుమశ్రేష్ఠి సమ్మతించెనే గాని, వివాహమునకై ముహూర్తమును మాత్రము రెండు మాసముల వ్యవధిలో నిశ్చయించెను. దానికి అంగీకృతుడైన రాజు తన పట్టణమునకు తిరిగి పోయెను. ఇంతలో వైశ్యు లందరును ఈ విషయమును గూర్చి చర్చించి, విష్ణువర్ధనున కెట్టైనను వాసవాంబ నీయరాదని ఏకగ్రీవముగ నిశ్చయించి, ఆ విషయమును రాజునకు తెలియజేయుటకై రాయబారము నంపిరి. రాజువద్దకూడ కొంత వివాదము జరిగిన పిమ్మట ఆరాయబారులు వాసవాంబ నెన్నటికిని నాతని కీయరాదను తమ దృఢనిశ్చయమును తెలియజేసిరి. అంతట నారాజు వారిని బంధింప నాజ్ఞాపించి పెనుగొండపై దాడి వెడలెను.

అప్పు డారాయబారులు ధనముచే విష్ణువర్ధనుని సేవకుల నుండి తప్పించుకొని, స్వగ్రామమునకు చేరుకొని, తిరిగి ఆ విషయమై చింతింప సాగిరి. దానిపై కుసుమశ్రేష్ఠి

పుత్రుడైన విరూపాక్షుడు తన సోదరి యగు వాసవాంబను ఆ రాజున కిచ్చుటకంటె అగ్ని ప్రవేశమే శ్రేష్ఠ మని పలుకగా నచ్చటివారిలో కొందరు దానికి సమ్మతించిరి. మరియు, రాజు రాకకు ముందే వాసవాంబను అగ్నిప్రవేశము చేయించుటకు నిశ్చయించిరి. ఇట్టి ఘోరనిశ్చయమునకందరను కంట తడి పెట్టసాగిరి. అంతట వాసవాంబయు, తాను శాపవశమున నరజన్మ మెత్తిన శచీదేవి నని వారికి జెప్పెను. ఆమె వృత్తాంతమును వినిన వెంటనే వారందరును ధైర్యము వహించి, ఆమెతోపాటు వారుకూడ అగ్నిప్రవేశము జేసిరి. ఇట్లు వాసవాంబ కన్యావస్థయందే దేహ త్యాగము చేయుటచే ఆమెకు కన్యకాంబ యని పేరు వచ్చెను.

## శచీదేవి శాపము.

పూర్వము శతజిహ్వు డను రాక్షసుడు యజ్ఞములను పాడుచేయుచుండెను. అదిచూచి బ్రహ్మ అతని జంపుమని ఇంద్రుని పుత్రుడగు జయంతుని కోరెను. తన పుత్రుడు రాక్షసునితో యుద్ధము చేయుట కెంతయు భయపడి, శచీదేవి ఆతని నివారించెను.

అంతట బ్రహ్మ కుపితుడై ఆమె యట్లు భయపడుటచే యామెను భూలోకమున వైశ్యకాంత కమ్మని శపించెను. కాని, అంతలో శచీపతి ప్రార్థన విని, బ్రహ్మ ఆతని భయపడవలదనియు, శచీదేవి భూలోకమున నెవ్వరిని వివాహ మాడకుండగనే తిరిగి వచ్చుననియు, యాతనితో జెప్పెను. ఆ శచీదేవియే వాసవాంబగా వైశ్యకులమున జన్మించెను.





శ్రీ మహాగణాధిపతయే నమః ।

# వేదసార రత్నావళి

## 17. అథర్వ వేదము.

### వేదమన నేమి.

"ప్రత్యక్షే ణానుమిత్యా వా యస్తూపాయో న బుధ్యతే ।
ఏతం విదంతి వేదేన తస్మా ద్వేదస్య వేదతా ॥"

తా॥ ప్రత్యక్షాది లౌకిక ప్రమాణములచే తెలిసికొనుటకు శక్యము గాని అర్థమును బోధించు అక్షరరాశికి వేదమని పేరు.

### వేదమెన్ని విధములు.

*"ఋగ్యజు స్సామాథర్వాణ శ్చత్వారో వేదాః" (నృసింహపూర్వ తాపనీయోపనిషత్తు-1)*

*"తత్రాపరా ఋగ్వేదో యజుర్వేద స్సామవేదో-*
*థర్వవేదః ।" (ముండకోపనిషత్తు 1-1.)*

ఇత్యాదిశ్రుతులచే వేదము (ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వ వేదము అను నామలచే) నాలుగు విధములుగ విభజింపబడినది. ఇట్టి వేదములకు అపౌరుషేయత్వమును గూర్చి ఈ క్రింద వ్రాయబడినది.

### ఋగాదిమంత్రములకు లక్షణములు.

పూర్వమీమాంసాశాస్త్రములో -
"తచ్చోదకేషు మంత్రాఖ్యా"
"తేషా మృక్ యత్రార్థవశేన పాదవ్యవస్థా"
"గీతీషు సామాఖ్యా"
"శేషే యజుశ్శబ్దః" (జై. న్యా. మా. అధ్యా. 2. పా. 1. సూ. 32. సూ. 33.)

అని చెప్పబడి యున్నది. పై సూత్రములచే ఋక్సామ యజుర్మంత్రములకు లక్షణములు చెప్పబడినవి. పాదబద్ధములగు మంత్రములు ఋఙ్మంత్రములు. గానయుక్తము లగు మంత్రములు సామమంత్రములు. ఈ రెండిటికంటె భిన్నములగునవి యజుర్మంత్రములు.

ఈ విషయములో శ్రీ విద్యారణ్యస్వాములవారు (పూర్వ మీమాంసా) జైమినీయన్యాయమాలా అను గ్రంథములో ఈ క్రింది విధముగా జెప్పిరి.

"యాజ్ఞికానాం సమాఖ్యానం లక్షణం దోషవర్జితం " (జై. న్యా. మా. 2. అధ్యా. 1. పా.)

తా॥ లోకములో యాజ్ఞికులు మంత్రములను ఋఙ్మంత్రములు, సామమంత్రములు, యజుర్మంత్రములు అని వ్యవహరించుటయే వానికి నిర్దుష్టలక్షణము. అనగా (యాజ్ఞిక సమాఖ్యాసరూపమగు లక్షణము).

## ఋగ్వేదాది నామములు

**ఋ**క్ మంత్రములు బహుళముగ నున్న వేదభాగమునకు ఋగ్వేదమని పేరు. యజుర్మంత్ర బాహుళ్యము గల వేదభాగమునకు యజుర్వేద మని పేరు. గానయుక్త మంత్ర బహుళమగు వేదభాగమునకు సామవేద మని పేరు. ఈ విధముగ తత్తన్మంత్ర బాహుళ్యముచే మూడు వేదములకును పై నామములు వచ్చినవి.

## ఈ మూడు వేదమంత్రములకు వినియోగము.

**య**జ్ఞములో హోత, అధ్వర్యుడు, ఉద్గాత, బ్రహ్మ అను పేర్లతో ప్రధాన ఋత్విక్కులు నలుగురు ఉందురు. వారిలో హోత అను ఋత్విక్కు చేయవలసిన కర్మభాగము నంతను ఋగ్వేదమంత్రములతో చేయవలెను. ఇదే విధముగ అధ్వర్యుడు చేయవలసిన కర్మభాగమును యజుర్వేదముతోను, ఉద్గాత చేయవలసిన కర్మభాగమునంతను సామవేద మంత్రములతోను, బ్రహ్మ చేయవలసిన కర్మభాగము నంతను అథర్వ వేదమంత్రములతోను చేయవలెను.

కావుననే గోపథబ్రాహ్మణములో పూర్వభాగమునందు ప్రశ్నోత్తర పూర్వకముగ అథర్వవేద విదునకే యజ్ఞమునందు బ్రహ్మత్వము చేయుట కధికారము చెప్పబడినది.

"అథ హ ప్రజాపతి స్సోమేవ యక్ష్యమాణో వేదా
నువాచ కం వో హోతారం వృణీయాం । క మధ్వర్యుం ।
కముద్గాతారం । కం బ్రహ్మాణం ఇతి । త ఊచుః ఋగ్విద
మేవ హోతారం వృణీష్వ యజుర్విద మధ్వర్యుం సామ
విద ముద్గాతారం అథర్వాంగిరోవిదం బ్రహ్మాణం తథా
హాస్య యజ్ఞః చతుష్పా ప్రతితిష్ఠతీతి ॥" (గో. బ్రా. 2. 24)

తా॥ ప్రజాపతి సోమయాగమును (యజ్ఞమును) చేయనుద్యుక్తుడై వేదములను గూర్చి ఇట్లు ప్రశ్నించెను -

"ఓ వేదపురుషులారా! మీలో ఏ యే వేదములను చదివిన వారిని (యజ్ఞమునందలి నలుగురు ఋత్విక్కులలో) ఏ యే ఋత్విక్కుగ వరించవలెను? వేదము లీ క్రింది విధముగ జవాబు చెప్పెను -

"ఓ ప్రజాపతీ! మాలో ఋగ్వేదవిదుని హోతగను, యజుర్వేద విదుని అధ్వర్యునిగను, సామవేదవిదుని ఉద్గాతగను, అథర్వాంగిరోవిదుని బ్రహ్మగను వరించుము".

కావుననే అథర్వవేదమునకు బ్రహ్మవేద మని గూడ వ్యవహారము గలదు.

## అథర్వనామ నిర్వచనము.

**పూ**ర్వము 'అథర్వ' అను పేరు గల బ్రహ్మచే ఈ వేదభాగము చూడబడినది (దృష్టము) గాన, ఆ నామచేతనే ఈ వేదభాగము 'అథర్వ' అని వ్యవహరించ బడుచున్నట్లు గోపథబ్రాహ్మణములో ఇట్లు వర్ణింపబడియున్నది -

సృష్ట్యాదియందు స్వయంభుబ్రహ్మ (ప్రజాపతి) సృష్టికొరకు తపస్సును చేయుచుండగా అతని రోమకూపముల నుండి స్వేదధారలుత్పన్నము లైనవి. స్వేదోద్భవము లైన ఆ ఉదకములందు తన ఛాయను చూచుచున్న ప్రజాపతికి రేతస్సు స్ఖలన మాయెను. అట్టి రేతస్సుతో గూడిన ఉదకములు ద్విరూపము లయ్యెను. ఆ రెండింటిలో ఒక భాగమునం దున్న రేతస్సు ప్రజాపతిచే భృజ్యమాన (పచ్యమాన) మగుచు (అనగా, జాగ్రత్తగా రక్షింపబడిన దగుచు) భృగువు అను మహర్షి అయెను. వెంటనే ఆ భృగువు తనకు ఉత్పాదకుడై తిరోహితుడైన (అదృశ్యుడైన) ప్రజాపతిని చూడవలెనని కోరుచుండగా ఆకాశవాణి (అశరీరవాక్కు) ఈ విధముగ పలికెను.

'అ థార్వా గేనం ఏతా స్వేవా ప్స్విచ్ఛ ' (గో. బ్రా. 1-4).

తా॥ అనంతరము నీకు ఉత్పాదకు డగు ప్రజాపతిని ఈ ఉదకములందే అభిముఖముగ అన్వేషణ చేయుము.

ఈ విధమగు అశరీరవాక్కు యొక్క ఆదియందు 'అథార్వాక్' అని ఉండుటచే ఈ భృగువునకు 'అథర్వా' అను రెండవ పేరు గూడ లభించెను.

'అప్యక్షరసామ్యా న్నామనిర్వచనాని భవంతి' (ఆ. శ్రౌ. సూ.)

ఈ సూత్రానుసారము అర్థానుగతి లేకపోయినను అక్షర సామ్యమువలన గూడ నామ నిర్వచనము లుండును గావున, ఈ భృగువునకు 'అథర్వ' అను నామాంతరము లభించెను.

ఇక ప్రజాపతి రేతస్సుతో గూడిన రెండవ భాగములో నున్న జలముచే ఆవృతు డగుటచే (ఆవృతత్వా ద్వరుణః) వరుణశబ్ద వాచ్యుడై తపస్సును చేయుచున్న బ్రహ్మయొక్క సర్వాంగముల నుండియు రసము స్రవించెను. అది అంగరసరూపముగాన, (అంగానాం రసః అంగిరాః అను నిర్వచనముచే) అంగిరశ్శబ్దవాచ్యు డగు మహర్షిగా సంభవించెను.

అనంతరము ఈ ఇద్దరు మహర్షులను సృజించిన స్వయంభు బ్రహ్మ ఆ అథర్వ అంగిరోమహర్షుల కుభయులకు అభిముఖముగ తపస్సును చేయగా, అతని తపః ప్రభావముచే ఏకర్చుడు, ద్వ్యర్చుడు మున్నగు మంత్రద్రష్టలగు యిరువదిమంది అథర్వులు, అంగిరస్సులు ఉత్పన్నులైరి.

తిరిగి ఆ యిరువదిమంది అథర్వులు, అంగిరస్సులు, (ఏకర్చ ద్వ్యర్చాదులు) తపస్సును చేయుచుండగా, వారివలన నిస్సృతములైన (ఉద్భవించిన) ఏ మంత్రములను బ్రహ్మ చూచెనో, ఆ మంత్ర సంఘము అథర్వాంగిరశ్శబ్ద వాచ్య మగు అథర్వవేద మాయెను. అనగా, బ్రహ్మ చూచుచుండగా ఘోరతపోనిష్ఠలో నున్న ఆ యిరువది అథర్వాంగిరోమహర్షుల నుండి వెలువడిన మంత్ర సంఘములకే అథర్వవేదమనియు, అథర్వాంగిరస్సు లనియు రెండు నామలచే వ్యవహారమేర్పడెను.

ఈ విధముగ యిరువది మందివలన నిస్సృతము లగుటవలన ఆ అథర్వవేదము వింశతి కాండాత్మక మాయెను. (ఇరువది కాండలు కలదాయెను). తపస్సార మగుటవలన ఈ వేదము సర్వవేదములలో శ్రేష్ఠ మయినదిగా ఈ క్రింది శ్రుతి బోధించుచున్నది.

'శ్రేష్ఠో హి వేద స్తపసో హి జాతో బ్రహ్మజ్ఞానాం
హృదయే సంబభూవ' (గో. బ్రా. 1.9.)

ఏత ద్వై భూయిష్ఠం బ్రహ్మ య ద్భృగ్వంగిరసః
యే అంగిరస స్సరసః । యే అథర్వాణ స్త ద్భేషజం ।
య ద్భేషజం త దమృతం । య దమృతం త ద్బ్రహ్మ । (గో. బ్రా. 3.4.)

బ్రహ్మజ్ఞులగు మహర్షుల తపోమహిమవలన వారి హృదయములందు సంభూతమైనది. (ఉత్పన్నమైనది) గావున, ఈ అథర్వవేదము అన్ని వేదములలో శ్రేష్ఠమైనది. దీనిలో అంగిరశ్శబ్ద వాచ్యమగు భాగము సారము. అథర్వవాచ్య మగు భాగము భేషజము (చికిత్సకము) ఏది భేషజమో అది అమృతము (అమృతత్వప్రాపకము). ఏది అమృతమో అది బ్రహ్మస్వరూపము. ఈ విధముగ ప్రదర్శితగోపథ బ్రాహ్మణానుసారము ఈ అథర్వవేదము సారభూతమగు బ్రహ్మాత్మక మగుటవలనను, 'బ్రహ్మ' అను ఋత్విక్కుచే చేయదగిన

మంత్రభాగమును చెప్పుటవలనను, ఈ అథరవేదమునకు బ్రహ్మవేద మను నామచే కూడ వ్యవహారము కలదు.

"చత్వారో వా ఇమే వేదాః ఋగ్వేదో యజుర్వేద
స్సామవేదో బ్రహ్మవేద ।" ఇతి. (గో. బ్రా. 2.16.)

ఈ అథర్వవేదము బ్రహ్మ వేద మనుటలో ఈ శ్రుతియే ప్రమాణము. మరియు అథర్వవేదము అన్నిటిలోను సారమైనది. గావున, దీనికి సిద్ధమంత్రత్వము. అనగా, ఈ వేదములోని మంత్రములు సర్వకార్యసిద్ధులను చేకూర్చునవి యని చెప్పబడుచున్నది.

"న తిథి ర్న చ నక్షత్రం న గ్రహో న చ చంద్రమాః ।
అథర్వమంత్ర సంప్రాప్త్యా సర్వసిద్ధి ర్భవిష్యతి ॥" (ప. 2.5.)

తా॥ తిథి, వార, నక్షత్ర, తారా, చంద్రబలాదులతో నిమిత్తము లేకయే అథర్వ వేదమంత్రముల జపముచే సర్వకార్యసిద్ధులు కాగలవు.

దీనివలన, అథర్వమంత్రములు అఖండ మహిమోపేతము లని స్పష్ట మగుచున్నది. ఇదే విధముగ స్కాంధపురాణములో కమలాలయ ఖండమునందు అథర్వవేదమంత్రముల జపమాత్రము చేతనే అభిమత ఫలసిద్ధి యగు నని చెప్పబడుచున్నది.

"య స్త్వత్రా థర్వణాన్ మంత్రాన్ జపే చ్ఛ్రద్ధాసమన్వితః ।
తేషా మర్థోద్భవం కృత్స్నం ఫలం ప్రాప్నోతి స ధ్రువం ।" (స్కాం. పు.)

తా॥ మంత్రాధికారి యగు యే మానవుడు భక్తిశ్రద్ధలతో అథర్వవేదమంత్రములను జపించునో, అట్టి మానవుడు ఆ మంత్ర ప్రతిపాద్యమగు సంపూర్ణ ఫలమును నిశ్చయముగ పొందును.

## ఉపవేదములు.

ఇట్టి అథర్వవేదమునకు అంగములుగ ఐదు ఉపవేదములను బ్రహ్మ సృజించినట్లు ఈ క్రింది శ్రుతి బోధించుచున్నది.

"స దిశో౽న్వైక్షత ప్రాచీం దక్షిణాం ప్రతీచీం
ఉదీచీం ధ్రువా మూర్ధ్వాం ఇతి ప్రక్రమ్య పంచవేదా
న్నిరమిమీత సర్పవేదం, పిశాచవేదం, అసుర
వేదం, ఇతిహాసవేదం, పురాణవేద మితి ।" (గో. బ్రా. 1.10)

తా॥ సర్పవేదము, పిశాచవేదము, అసురవేదము, ఇతిహాస వేదము, పురాణవేదము అను ఐదు ఉపవేదములను బ్రహ్మ సృజించినట్లు ఈ శ్రుతి బోధించుచున్నది.

## అథర్వవేదప్రాశస్త్యము.

ఈ విధముగ ఆముష్మికఫలకము అగు (పరలోకములో అనుభవింపదగిన ఫలముల నిచ్చెడి) దర్శపూర్ణమాసేష్టులు లగాయతు గవామయనం సత్రిణా మయనం, ఉత్సర్గిణా మయనం, ఇత్యాది అశ్వమేధాంత మగు కర్మలందు 'బ్రహ్మ' అను ఋత్విక్కు చేయదగిన కర్మకలాపమును అథర్వవేదము ప్రథమములో కొంత భాగములో బోధించెను. అనంతరము ఐహికఫలసాధనము లగు శాంతికపౌష్టి కాదికర్మలును, పిత్త, జ్వర, శిరోరోగ, అక్షిరోగ, కాస, శ్లేష్మ, రాజయక్ష్మ (క్షయ) కుష్ఠాది సర్వరోగనివృత్తికి సాధనములగు కర్మలును, వృశ్చిక, సర్ప మశకాది సర్వవిషహరణసాధనములగు కర్మలును, ఇంకను ఇహలోకములో మానవునకు ఇష్టప్రాప్తికి, అనిష్ట పరిహారమునకు సాధనములగు సర్వకర్మలును అథర్వవేదమునందే ప్రధానముగ జెప్పబడినవి గాని, ఇతర వేదములందు ప్రధానముగ చెప్పబడలేదు. మరియు పౌరోహిత్యమును గూడ అథర్వవేదవేత్తయే చేయవలె నిన మత్స్య, విష్ణు, మార్కండేయ పురాణాదులందు చెప్పబడినది.

"పౌరోహిత్యం శాంతకపౌష్టికాని రాజ్ఞాం అథర్వవేదేన
కారయేత్, బ్రహ్మత్వం చ"(వి.పు.)

మరియు,

"శాంతిపుష్ట్యభిచారార్థా ఏకబ్రహ్మర్త్విగాశ్రయాః ।
క్రియంతేఽథర్వవేదేన త్రయ్యేవాత్మీయగోచరాః ॥" (భట్టాచార్యః)

తా॥ అనగా, బ్రహ్మనామకు డగు ఒక ఋత్విక్కుచే చేయదగిన శాంతిక, పౌష్టిక కర్మలను అథర్వవేదముచేతనే చేయవలెను. అనేక ఋత్విక్కులచే చేయబడు కర్మలు మూడు వేదములచే ఎట్లు చేయబడునో, అట్లే 'బ్రహ్మ' అను ఋత్విక్కుచే చేయదగిన శాంతిక పౌష్టికాది కర్మలు అథర్వవేదముచేతనే చేయదగినవి.

## అథర్వవేదవిదునకే పౌరోహిత్యము.

'పురోహితం తథాఽథర్వమంత్రబ్రాహ్మణపారగం' (మత్స్య.పు.)

తా॥ మంత్రబ్రాహ్మణాత్మక మగు అథర్వవేదమును అధ్యయనము చేసినవానిని పురోహితునిగా నుంచుకొనవలెను.

'అభిషిక్తో౽థర్వమంత్రైర్మహీం భుంక్తే ససాగరాం' (మార్కం. పు.)

తా॥ అథర్వవేదమంత్రములచే పట్టాభిషిక్తు డగు మహారాజు చతుస్సముద్ర సహిత మగు భూమిని పరిపాలించును.

"యస్య రాజ్ఞో జనపదే౽థర్వా శాంతిపారగః ।
నివస త్యపి త ద్రాష్ట్రం వర్ధతే నిరుపద్రవమ్ ॥

తస్మా ద్రాజా విశేషేణ అథర్వాణం జితేంద్రియమ్ ।
దానసన్మానసత్కారై ర్నిత్యం సమభిపూజయేత్ ॥" (అథ్వపరిశిష్టము)

తా॥ ఏ మహారాజుయొక్క జనపదములో సమగ్రముగ శాంతులను తెలిసిన అథర్వవేదవిదుడు నివసించునో, ఆ రాష్ట్రము, రోగ, దారిద్ర్యాద్యుపద్రవములు లేకుండ వృద్ధిని పొందును. అనగా, అథర్వ వేదవేత్త రాజధానిలో గాక, రాష్ట్రమందలి జనపదమందు నివాస మాత్రముచేతనే సంపూర్ణ రాష్ట్ర మంతయు ఉపద్రవములు లేకుండ వృద్ధి పొందును. అందుచే అనేక ఉద్గ్రంథములందు అథర్వవిదుని నివాసమునకు ఇంత మహాఫలము బోధింపబడుచున్నదిగాన, మహారాజు విశేషముగ ప్రయత్నించి, యోగ్యప్రవర్తన గల అథర్వవేదవిదుని పురోహితునిగ నుంచుకొని, దానసన్మాన సత్కారములచే ఆతని నిత్యము పూజించవలెను.

'త్రయ్యాం చ దండనీత్యాంచ కుశలస్స్యా త్పురోహితః ॥
అథర్వ విహితం కర్మ కుర్యాచ్ఛాంతిక పౌష్టికం ॥' (నీతి శాస్త్రము)

తా॥ మహారాజువద్ద నుండెడి పురోహితుడు వేదత్రయము నందును, దండనీతియందును నేర్పరి (కుశలుడు) కావలెను. అతడు, మహారాజుకు సంగ్రామాదిప్రసక్తి గలిగినపుడు శత్రుపరాభవ, స్వప్రభు విజయాదుల కొరకు అథర్వవేదవిహితములగు శాంతిక, పౌష్టిక కర్మల నాచరించి రాజును రక్షించవలెను.

ఈ విధముగ అనేక ప్రామాణిక గ్రంథములందు అథర్వవేదము రాజ్యస్థితికి అత్యవసర మని బోధింపబడుచున్నది. పూర్వకాలము మహారాజులు ఈ సూత్రము ననుసరించియే రాజ్యపరిపాలన మొనర్చినట్లు ఈ క్రింది గాధవలన స్పష్ట మగుచున్నది.

పూర్వము 'మురారి' అను సుప్రసిద్ధ మహాకవి తనచే ప్రణీతమగు అనర్ఘరాఘవ మను నాటకములో ఈ క్రిందివిధముగ వర్ణించెను.

రావణపురోహితుడగు శౌష్కలుడు రావణాసురుని కొరకు సీతను యాచించుటకు జనకచక్రవర్తి యొద్దకు వచ్చెను. అప్పుడు జనకుడు శౌష్కలుని గూర్చి ఈ విధముగ ప్రశ్నించెను.

'స్వాగతం పౌలస్త్యపురోహితస్య । ఇత ఆస్యతాం । అపి
కుశలం తే రాజ్ఞో రావణస్య? ।'

తా॥ రావణుని పురోహితులగు మీకు స్వాగతము. ఇచ్చట కూర్చొనుడు. తమప్రభువగు రావణుడు కుశలమా? జనకు డీవిధముగ ప్రశ్నించి, వెంటనే ఇట్లు పలికెను.

'అథవా, ఆపదాం ప్రతికర్తారో యస్యోపాయై రథర్వభిః ।
త్వాదృశా స్సంతి కిం తస్య కళ్యాణ మనుయుజ్యతే ॥'

తా॥ ఓ శౌష్కలా, పొరపాటున (మరచి) మీ రావణునకు క్షేమమా అని ప్రశ్నించితినిగాని, అట్లడుగ నవసరము లేదు. ఎందులకన, అథర్వవేదోక్తము లగు శాంతిక పౌష్టికసాధనములచే (ఉపాయములచే) సమస్త ఆపత్తులకు ప్రతిక్రియలను చేసి రక్షించెడి తమ వంటి అథర్వవేదవిదులగు పురోహితులు గల రావణునకు క్షేమమడుగవలెనా? అడుగ నవసరము లేదు.

దీనిని బట్టి చూడ, త్రేతాయుగమందు రాజ్యపాలన చేయు రావణుడు గూడ అథర్వవేదవిదునే పురోహితునిగ నుంచుకొని రాజ్యపాలన మొనర్చినట్లు స్పష్ట మగుచున్నది.

## సాయణాచార్యులు కూడ అథర్వవిదులే.

మరియు అన్ని వేదములకు భాష్యములను వ్రాసినట్టియు, సర్వశాస్త్రములలోను ఉద్గ్రంథములను వ్రాసినట్టియు, సర్వలోక ప్రసిద్ధులును నగు సాయణాచార్యులు బుక్కభూపాలుని యొద్ద అమాత్యులుగా నుండి, ధర్మాధర్మోపదేష్ట లగుచు, ప్రభువుయొక్క ఆజ్ఞచే మూడు వేదములకు భాష్యములను వ్రాసిరి. పిదప, బుక్క భూపాలుని పుత్రుడగు హరిహరక్ష్మాధీశుని వద్ద నుండగా, ఆతడు ఐహికాముష్మికఫలప్రద మగు అథర్వవేదమునకు భాష్యమును వ్రాయమని ఆజ్ఞాపించుటచే, ప్రభువు యొక్క ఆజ్ఞానుసారము అథర్వవేదమునకు భాష్యమును వ్రాసినట్లు గనపడుచున్నది. దీనివలన విద్యారణ్యులవారు అథర్వవిదులనుటలో నిర్వివాదము.

ఇట్టి విషయములును పరికింపగా, పూర్వకాలములో మహారాజులు అథర్వవేదవిదుల ద్వారా అథర్వవేదసహకారముచేతనే రాజ్యమును రక్షించుకొనెడి వారని స్పష్ట మగుచున్నది.

## అథర్వవేదమునకు శాఖా భేదములు.

యజుర్వేదమునకు 101 శాఖలును, సామవేదమునకు 1000 శాఖలును యెట్లు గలవో, అట్లే, ఐహికాముష్మిక సకలపురుషార్థపరిజ్ఞానమునకు ఉపాయభూత మగు అథర్వవేదమునకు ఈ క్రింద నుదహరించిన 9 శాఖలు గలవు.

| | | |
|---|---|---|
| 1. పైప్పలాదాః | 2. తైదాః | 3. మౌదాః |
| 4. శౌనకీయాః | 5. జాజలాః | 6. జలదాః |
| 7. బ్రహ్మవదాః | 8. దేవదర్శాః | 9. చారణవైద్యాః |

వీటిలో శౌనకీయాది నాలుగు శాఖలలో గల అనువాకములకు, సూక్తములకు, ఋక్కులకు గోపథబ్రాహ్మణానుసారము 5 సూత్రములచే వినియోగము చెప్పబడినది. ఈ విషయమునే ఉపవర్షాచార్యుల వారు కల్పసూత్రాధికరణములో చెప్పియుండిరి.

'నక్షత్రకల్పో వైతాన స్తృతీయ స్సంహితావిధిః ।
తుర్య ఆంగిరసః కల్పః శాంతికల్పస్తు పంచమః ॥'

సంహితామంత్రము లన్నిటికిని సంపూర్ణముగ శాంతిక పౌష్టిక కర్మలందు వినియోగము కౌశికసూత్రములో చెప్పబడుటచే 'సంహితావిధి' అను పదమునకు కౌశిక సూత్రము అర్థము. దీనిని అవష్టంభముగా (ఆధారముగా) చేసికొనియే ఇతరసూత్రము లన్నియు ఉండుటచే ఈ సూత్రము ప్రధానమైనది.

దీనిలో గ్రామ, నగర, దుర్గ, రాష్ట్రాది లాభార్థమైన కర్మలు; పుత్ర, పశు, ధన, ధాన్య, ప్రజా, స్త్రీ, కరి, తురగ, రథ, ఆందోళికాది సర్వసంపత్తులకు సాధనములగు కర్మలు; పాపక్షయార్థమైన నిర్‌ఋతి కర్మాదులును; పౌష్టికకర్మలను; గోసమృద్ధికరములు, లక్ష్మీకరములు, కృషిపుష్టికరములు, అనడుత్సమృద్ధికరములు, వృషోత్సర్జనము మున్నగు మానవునకు అపేక్షితములగు సర్వఫలములకు సాధనములగు కర్మలు ఈ కౌశిక సూత్రములో చెప్పబడినవి. ఇది గృహ్యసూత్రము.

ఇక వైతానసూత్రములో వేదత్రయ విహితములగు దర్శపూర్ణమాసేష్టులు మొదలు యజ్ఞములు, చైనములు, సత్రయాగములు మున్నగు సమస్త క్రతువులందును ఋత్విక్కులచే చెప్పదగిన శాస్త్ర మంత్రములు (యజ్ఞములో ఆరాధించబడు దేవతలను స్తుతి జేయు మంత్రములు) చెప్పబడును. గాన, ఇది యజ్ఞాదులకే ఉపయోగకరము గాని, లోకసామాన్యమున కుపయోగించునది గాదు.

ఇక నక్షత్రకల్పములో ఆదియందు కృత్తికానక్షత్రపూజా హోమాదికమును జెప్పి, అనంతరము అమృతాది అభయాంత మగు ముప్పది మహాశాంతులను జెప్పి, తదుపరి భయార్తులకు, రోగగృహీతులకు, బ్రహ్మవర్చసకాములకు, ప్రజా, పశు, అన్న లాభముల కొరకు, సంపత్కాముడు, ధనకాముడు, ధనక్షయనివృత్తికాముడు, మున్నగు వారలకు, సర్వఫలములకొరకును శాంతులు చెప్పబడినవి.

అంగిరసకల్పములో అభిచార (ప్రయోగ) సంబంధమగు శత్రుపదార్థ మగు కర్మలు మాత్రమే జెప్పబడినవి.

శాంతికల్పములో వైనాయకశాంతి ప్రభృతి ఆదిత్యాది నవగ్రహ శాంత్యాదికములు చెప్పబడినవి. ఇవిగాక, డెబ్బదిరెండు పరిశిష్టములు గలవు. వాటిలో వెనుకటి కల్పములలో జెప్పబడనివియు, మహారాజుచే ప్రతిదినము చేయు దగినవియు నగు సువర్ణ, దేను, తిల, భూ దానములును, కపిలదానము, కృష్ణాజినదానము, కనకాశ్వాది దశమహాదానములు, వృషోత్సర్జనము, కోటిహోమము, లక్షహోమము, అయుత హోమము, పాశుపతవ్రతము మున్నగు విషయములు చెప్పబడినవి. గ్రహయుద్ధము, రాహుచారకేతుచారములు మున్నగు విషయములుగూడ అనేకములు శాంతికల్పములో చెప్పబడినవి.

'శ్రుతిమూలకత్వేన స్మృత్యాచారయోః ప్రామాణ్యం'

అను పూర్వమీమాంసకుల సిద్ధాంతప్రకారము వేదములో చెప్పబడిన విషయములనే స్మృతులు, శిష్టాచారములు బోధించును. ఈ క్రింద నుదహరించిన శ్రుతివలన స్మృత్యాచారములు శ్రుతిమూలకము లని స్పష్ట మగుచున్నది.

## కప్పలు అరచుట.

**లో**కములో బోదురుకప్పలు అరచునపుడు వాటి యరపులు రాబోవు వర్షసూచనగా మానవులు భావించుట గతానుగతికముగ వచ్చుచున్నది. దీనికి మూలము అథర్వవేదములో గానవచ్చుచున్నది.

'ఖణ్వఖా 3 ఇఖై మఖా ఇ మధ్యే తదురీ । వర్షం
వసుధ్వం పితరో మరుతాం మన ఇచ్ఛత ।' (అ.వే. 4. 4. 15. 598 పే.వి.భా.)

తా॥ ఈ శ్రుతిలో 'ఖణ్వఖా', 'ఖైమఖా', 'తదురీ' అను మూడు పదములు మండూకజాతిలో ఒక జాతి ఆడకప్పలకు నామములు. ఆనామలచే వాటిని సంబోధించి, 'ఓ మండూకవిశేషములారా! ఘోషము (అరపు) చే వర్షము నిప్పించుడు (ప్రయచ్ఛత). వృష్టిద్వారా పాలకములగు లోకమును పరిపాలించెడి) ఓ మండూకములారా! మీ ఘోషముచే సృష్టికి అభిముఖ మగు మరుద్గణముల మనస్సును స్వాధీనము (వశీకరణము) చేసికొనుడు.

ఈ శ్రుతివలన మండూకఘోషము వృష్టికి కారణమని తెలియుచున్నది. ఈ శ్రుతిసిద్ధమైన విషయమునే లోకాచారములో మనము చూచుచుంటిమి. మరియు కొన్ని వ్యాధుల నివారణకై ఆశ్చర్య జనకములగు ప్రతిక్రియలు అథర్వవేదములో ప్రతిపాదించబడినవి.

# రోగచికిత్సలు

## హృద్రోగము.

"అనుసూర్య ముదయతాం" అను మంత్రముచే ఉదకము నభిమంత్రించి ఎఱ్ఱగోవు యొక్క రోమములతో మిశ్రితములగు ఆ ఉదకములను త్రాగవలెను.

## కామెర్లు.

పసుపుతో వండిన కుండ అన్నమును బెట్టి భాండోచ్ఛిష్ట పాత్రోచ్ఛిష్టములగు ఆ రెండు అన్నములను కలిపి, రోగికి శిరఃప్రభృతి పాదముల పర్యంతము లేపనము చేసి, మంచముపై బరుండబెట్టి, ఆ మంచము కోడుకు ఆకుపచ్చని దారముతో చిలుకయొక్క ఎడమ కాలును బంధించి, రోగిని స్నానము చేయించవలెను. చర్మను అరవేయుటకు గట్టిన శంకుచ్ఛిద్రచర్మభాగమును కాల్చి, ఆ చూర్ణమును నీటిలో వేసి, ఉషఃకాలమునందు ఆ ఉదకముచే రోగిని స్నానము చేయించవలెను.

## నిరంతర స్త్రీ సంగమజనిత రోగనివారణ.

"ముంచామి త్వా" అను మంత్రముచే దుర్గంధోపేత మగు చాపలతో గూడిన అన్నమును రోగికి బెట్టవలెను. లేక, అరణ్యా నువ్వుల కంపచే కాచబడిన ఉదకముచే గృహమందుగాని, అరణ్యమందుగాని, రోగిని స్నానము, ఆచమనము చేయించవలెను.

ఇంకను వీర్యస్తంభనకు, బొల్లెకు, పితృమాతృద్వారా సంక్రమించిన క్షయ, కుష్ఠు, మున్నగు సమస్త వ్యాధులకు చికిత్సలు చెప్పబడినవి.

## కృష్ణాజిన మహత్వము.

లోకములో సనాతనులు ఉపనయనము, యజ్ఞము, చైనము, మున్నగు సర్వకర్మలందును కృష్ణాజినమును వాడుచుండెడి సంప్రదాయము గలదు. వేదములలో దాని మహత్వము అత్యధికముగ చెప్పబడినది. కొన్ని వివరములీ దిగువ నీయబడినవి.

## క్షేత్రియవ్యాధుల చికిత్స

## మొదటి మంత్రము.

'హరిణస్య రఘుష్యదోధి వీర్షణి భేషజం ।
స క్షేత్రియం విషాణయా విషూచీన మనీనశత్ ।'

*(అ.వే.సం. 3. కాం 2. అను. 1.మం. భాష్యం. 371 పే)*

తా॥ శ్రీఘ్రముగ నడిచెడి లేడియొక్క శిరస్సుయందు రోగములను బారద్రోలెడి శృంగరూప మగు ఔషధము గలదు. అట్టి లేడి తన శృంగముచే తల్లిదండ్రులద్వారా సంక్రమించిన క్షయ, కుష్ఠు, అపస్మారము మున్నగు క్షేత్రియవ్యాధులను పూర్తిగ నశింప జేయుగాక.

భావము. దీనివలన, లేడికొమ్మునందు (దుప్పికొమ్ము) తల్లిదండ్రుల ద్వారా సంక్రమించిన మహావ్యాధులను తొలగించెడి ఔషధవిశేషము గలదని స్పష్టమగుచున్నది.

## రెండవ మంత్రము.

*'అను త్వా హరిణో వృషా పద్భి శ్చతుర్భి రక్రమీత్ ।*
*విషాణే విష్య గుల్ఫితం యదస్య క్షేత్రియం హృది ॥'*

*(అ.వే.సం. 3.కాం. 2.అను. 2.మం.భాష్యం 372పే.)*

తా॥ ఓకృష్ణవిషాణమా! క్షేత్రియరోగవినాశముకొరకు నీవు మణిరూపమున హస్తమందు ధరించబడితివి. నిన్ను అనుసరించి సేచనసమర్ధ మగు హరిణము నాల్గుపాదముల చేతను ఆవ్యాధులను తొలగించవలెను. అనగా, క్షేత్రియరోగములను పాదప్రహారములచే హరిణము పీడించుగాక.

ఓకృష్ణవిషాణమా! నీవును రుగ్ణుడైన (రోగగ్రస్తుడైన) ఇతని యొక్క (యజమానియొక్క) హృదయమందు శీలమండలవలె గ్రథితమైన (అనగా, దృఢముగ నాటుకొన్న) (గుల్ఫితం, గుల్ఫవత్ గ్రథితం) క్షేత్రియరోగములను నశింపజేయుము.

## మూడవమంత్రము.

*"అదో యదవరోచతే చతుష్పక్ష మివ చ్ఛదిః ।*
*తేనాతే సర్వం క్షేత్రియ మంగేభ్యో నాశయామసి ॥"*

*(అ.వే.సం. 3.కాం. 2.అను. 3.మం.భాష్యం 372 పే.)*

తా॥ దూరముగా నున్న యే హరిణరూప మగు వస్తువు చంద్రమండలమందు ప్రకాశించుచున్నదో, అట్టి చంద్రమండలగతమగు దూరస్థహరిణముచే ఓరుగ్ణుడా! క్షయకుష్ఠాదిరూపముగ బహువిధమగు నీక్షేత్రియరోగములను సర్వావయవములనుండి నశింపజేయు చున్నాము.

లేక,

భూమియందు పరువబడి మనచే చూడబడెడి ఏ లేడిచర్మము చతుష్కోణ మగు ఇంటికప్పువలె భాసించుచున్నదో, అట్టి కృష్ణమృగ చర్మముచేత ఓరుగ్ణుడా! క్షయకుష్ఠాదిరూపముగ బహువిధ మగు నీ క్షేత్రియరోగమును సర్వావయవముల నుండి నశింపజేయుచున్నాము.

## చికిత్సా విధానము.

పైన జెప్పబడిన 'హరిణస్య' అను సూక్తముచే రోగియొక్క హస్తమందు లేడికొమ్మును కట్టవలెను. మరియు, లేడికొమ్ము నీటిలో వేసి ఆఉదకమును పానమును, ఆచమనమును చేయించవలెను. శంకుచ్ఛిద్రభాగమును కాల్చి ఉదకమందు వేసి, ఆ ఉదకముచే ఉషఃకాలమందు రోగిని స్నానము చేయించవలెను. అనంతరము యవలను అన్నముగా వండి ఈ సూక్తముచే హోమముచేసి, శేషమును ఈ సూక్తముచే అభిమంత్రణ చేసి, రోగిచే భక్షింపజేయవలెను. ఈ విషయమే సంహితావిధి అను భాగములో ఈ క్రింది విధముగ జెప్పబడినది.

*'హరిణస్యేతి బంధన పాయనాచమనాని, శంకు*
*ధాన జ్వాలేన అపనక్షత్రే అవసించతి' ఇత్యాది. (అ.వే.సం.3.కాం.)*

కౌమారీమహాశాన్తియందు గూడ రుగ్ణుడైన బాలునకు రోగ నివృత్తికొరకు హరిణవిషాణము యొక్క వినియోగమును నక్షత్ర కల్పకారుడు ఈ క్రింది విధముగ వ్రాసెను.

*'హరిణ స్యేతి విషాణాగ్రం కౌమార్యాం' ఇతి । (అ.వే.సం.3.కాం.)*

## యజుర్వేదము నందలి కృష్ణాజినవృత్తాంతము.

యజ్ఞములో కృష్ణాజిన, కృష్ణవిషాణములయొక్క ఆవశ్యకతను గురించి ఈ క్రింది యజుర్వేదమంత్రములు బోధించుచున్నవి.

*"ఋక్సామే వై దేవేభ్యో యజ్ఞా యాతిష్ఠమానే*
*కృష్ణోరూపం కృత్వా ప్రక్రమ్యా౽_తిష్ఠతాం తే౽_మన్యంత*
*యం వా ఇమే ఉపావర్త్స్యత స్స ఇదం భవిష్యతీతి తే*
*ఉపామంత్రయంత తే అహోరాత్రయో ర్మహిమాన*
*మపనిధాయ దేవానుపావర్తే తా మేష వా ఋచో వర్ణో*
*యచ్ఛుక్లం కృష్ణాజినస్యైష సామ్నో యత్కృష్ణ*
*మృక్సామయో శ్శిల్పేస్థ ఇత్యాహార్క్సామే ఏవావరుంధ*
*ఏష వా అహ్నో వర్ణో యచ్ఛుక్లం కృష్ణాజినస్యైష*
*రాత్రియాయత్కృష్ణం యదేవైన యో స్తత్రన్యక్తం తదేవా*
*వరుంధే ।" (కృ.య.సం.6.కాం.1.ప్ర.3.అను.)*

తా॥ ఒకప్పుడు ఋక్సామదేవతలు (అనగా, ఋగ్వేదాభిమాని దేవతయు, సామవేదాభిమానిదేవతయు) ఏదో నిమిత్తముచే యజ్ఞము కొరకు తమ స్వరూపమును ప్రకాశింపచేయని వారై ఆత్మతిరోధానము కొరకు (అనగా, దేవతలకు తమ శరీరము

కనబడకుండ నుండుటకు) కృష్ణమృగరూపమును ధరించి, దేవతల నుండి వెడలి ఒక ప్రదేశమందు రహస్యముగ నుండిరి. అప్పుడు దేవత లీ క్రింది విధముగ విచారించిరి.

"ఋక్సామదేవతలు యే పురుషుని పొందునో ఆ పురుషుడు ఈ యజ్ఞఫలమును పొందును. అనగా, నిగూఢమైన ఋక్సామ దేవతలు లభించుటచే వేదత్రయముచేత యజ్ఞపూర్తి యగునుగాన, ఆయజమానుడు సంపూర్ణయజ్ఞఫలమును పొందును."

దేవతలు ఈ విధముగ నాలోచించి, ఆ ఋక్సామదేవతలను రహస్యమందు అభిమతమగు ఉత్కోచప్రదానముచేత స్వాధీనము చేసికొనిరి. అనంతరము, ఆ ఋక్సామదేవతలు అహోరాత్రముల మహిమరూపమగు శుక్ల, కృష్ణరూపద్వయమును స్వకీయ మగు మృగస్వరూపమునందు స్థాపన చేసి, దేవసమీపమును గూర్చి వచ్చినవి. అనగా, ఋగ్దేవత అహస్సుయొక్క శుక్ల రూపమును స్వీకరించి, కృష్ణాజినముపై శుక్లరేఖగా ఏర్పడెను. సామదేవత రాత్రియొక్క కృష్ణరూపమును స్వీకరించి కృష్ణాజినముపై కృష్ణరేఖగా నేర్పడెను. అందువలననే కృష్ణాజినముపై తెల్లని, నల్లని రెండు రంగుల చారలుండును. వాటిలో తెల్లనిచార ఋగ్వేదరూపము. నల్లని చార సామవేదస్వరూపము.

## కృష్ణాజినదీక్ష.

**ఋ**క్సామవేదముల స్వరూపమగు కృష్ణాజినముచే యజమానుని దీక్ష చేయించవలసినదిగా ఈ క్రింది శ్రుతి బోధించుచున్నది. అనగా, కృష్ణాజినమును అంతర్వేదియందు ఆస్తరణ జేసి (పరచి), దానిపై యజమానుడు కూర్చొనుట మున్నగు సంస్కారములు సమంత్రకముగా జరుపవలెను.

'కృష్ణాజినేన దీక్షయతి, బ్రహ్మణో వా ఏత ద్రూపం
యత్కృష్ణాజినం బ్రహ్మణై వైనం దీక్షయతి ।" (కృ.య.సం.6-1-3)

ఈ విషయమునే ఈ క్రింది సూత్రము బోధించుచున్నది.

"కృష్ణాజినేన యజ్ఞమానం దీక్షయతి ద్వాభ్యాగ్ం సమన్య
దీక్షేతాంతర్మాగ్ంసాభ్యాం బహిర్లోమాభ్యాం యద్యేకగ్గ్స్యా
ద్దక్షిణం పూర్వపాదం ప్రతిషేవ్యే దంతాన్ వాద్వే విఘూచీ
ప్రతిముచ్యేత పాదం వా ప్రతిషేవ్యే దిత్యేకే అంతర్వేది
కృష్ణాజినం ప్రాచీనగ్రీవ ముత్తరలోమస్తృణాత్యధ్వర్యు
స్తూష్ణీం । ఋక్సామయో రాది చ యాజమానం ।" (ఆ.శ్రౌ.సూ.)

తా॥ అధ్వర్యుడు ఒక కృష్ణాజినముచే గాని, రెండు కృష్ణాజినములచే గాని యజమానుని దీక్షాయుక్తునిగా చేయవలెను. రెండు కృష్ణాజినములచే దీక్షాపరునిగా చేయు కల్పములో

రెండిటియొక్కయు చర్మభాగములు లోపలకును, లోమభాగములు వెలుపలకును ఉండునట్లు వాటిని జోడించి, అంతర్వేదియందు పరువవలెను. ఒక కృష్ణా జినముచేతనే దీక్షను జరుపునపుడు పూర్వభాగముయొక్క దక్షిణ పాదమును మడచి కట్టవలెను. పిదప, దానిని కంఠభాగము తూర్పు దిక్కుగా నుండునట్లు అధ్వర్యుడు అంతర్వేదియందు పరువవలెను.

అనంతరము యజమానుడు ఈ క్రింది మంత్రముచే కృష్ణాజినముయొక్క శుక్ల, కృష్ణ రేఖలను స్పృశించవలెను.

"ఋక్సామయో శ్శిల్పేస్థస్తే వా మారభేతేమహిత
మాస్య యజ్ఞస్యోదుచః ।" (కృ.యు.సం. 1.కాం. 2.ప్ర. 2. అను.)

"ఋక్సామయో శ్శిల్పే స్థః' ఇతి శుక్లకృష్ణే రాజీ ఆల
భతే సంమృశతీ త్యే కే ।" (ఆ.శ్రౌ.సూ.)

తా॥ ఓ శుక్ల కృష్ణరేఖలారా! మీరు ఋక్సామదేవతల సంబంధమైన చిత్రములు. అట్టి మిమ్ములను స్పృశించుచుంటిని. అట్టి మీరు ఈ యజ్ఞ సమాప్తివరకు నన్ను పాలింతురుగాక.

భావము! పూర్వము దేవయజ్ఞమునుండి వెడలి కృష్ణమృగ రూపమును ధరించిన ఋక్సామదేవతలను దేవతలు ఉత్కోచముచే (అభిప్రేతప్రదానముచే) స్వాధీనము చేసికొనిరి. అనంతర మా ఋక్సామదేవతలు కృష్ణాజినమందలి శుక్ల, కృష్ణరేఖల రూపమును దాల్చి, దేవతలయొద్దకు వచ్చిరి. అందుచే పై మంత్రముచే ఆ రేఖలను యజమానుడు స్పృశించవలసినదిగా శ్రుతి విధించుచున్నది. అట్లు స్పృశించుటచే యజ్ఞమునుండి వెడలిన ఋక్సామదేవతలను స్వీకరించినట్లగును. ఈ అర్థమునే ముందు బ్రాహ్మణవాక్యము స్పష్ట పరచుచున్నది -

'ఋక్సామయో శ్శిల్పే స్థ ఇత్యాహ ఋక్సామే
ఏవావరుంధే' (కృ.యు.సం. 6.కాం. 1.ప్ర. 3. అను.)

విద్యారణ్యభాష్యం: న కేవల మృక్సామప్రాప్తిః కింతు అహోరాత్రసారప్రాప్తి శ్చేత్యాహ

'ఏష వా అహ్నో వర్ణో య చ్ఛుక్లం కృష్ణాజిన
స్యైషరాత్రియా య త్కృష్ణం య దేవైనయో స్తత్ర
న్యక్తం తదేవావరుంధే ' (కృ.యు.సం. 6.కాం. 1 ప్ర. 3. అను.)

తా॥ ఈ శుక్ల కృష్ణరేఖల స్పర్శచేత ఋక్సామదేవతాప్రాప్తియే గాక, ఋక్సామలందు నిగూడ మగు అహోరాత్రసంబంధమగు శుక్ల, కృష్ణవర్ణ రూపమగు సారమునుగూడ పొందినవాడగును.

ఈ క్రింది మంత్రముచే యజమానుడు కృష్ణాజినమును ఆరోహణము చేయవలెను.

'ఇమాం ధియగ్ం శిక్షమాణస్య దేవక్రతుం దక్షం
వరుణసగ్ం శిశాధి యయాతివిశ్వా దురితాతరేమ
సుతనిర్మాణమధినావగ్ం రుహేమ' (కృ. య. సం. 1. కాం. 2. ప్ర. 3. అను. )

పై మంత్రముచే యజమానుడు కృష్ణాజినమందు ఆరోహణమును, చేయవలసినదిగా ఈ క్రింది శ్రౌతసూత్రము బోధించుచున్నది.

'అథ ప్రాఙ్ముఖో జాన్వగ్నే్ఽభిసర్పతి కృష్ణాజినసమీపం
గత్వా ఇమాం ధియ మితి కృష్ణాజినం భసత్త అరోహతి' (ఆ. శ్రౌ. సూ. )

మం. తా. ఓ వరుణదేవుడా! ఈ అగ్నిష్టోమమును చేయవలెనను బుద్ధితో నున్న యజమానునియొక్క సమృద్ధమగు ఈ క్రతువును యోగ్యముగ ఉపదేశించి, విఘ్నములు లేకుండ సమాప్తిని పొందించుము. దానికి సాధనము కృష్ణాజినరూపమగు నావ. ఏ కృష్ణాజిన రూపమగు నావచే సకలదురితరూపములగు విఘ్నములను దాటితిమో, అట్టి (సుఖముగ) విఘ్నములను దాటుటకు సమర్థమైన కృష్ణాజిన రూపమగు నావను ఆరోహణము చేయుచుంటిని.

భావము: ఈ కృష్ణాజినము వేదరూపమైనది గావున, వేదోక్త మంత్రములచేతనే యజ్ఞము సమాప్తిని పొందవలెను గావున, కృష్ణా జినమును నావగా నిరూపించి, దానిని ఆరోహణము చేసి యజ్ఞపారమును (యజ్ఞసమాప్తిని) పొందవలె నని తాత్పర్యము.

## కృష్ణవిషాణము.

ఈ క్రిందిమంత్రముచే కృష్ణమృగముయొక్కకొమ్మును యజమానుడు గ్రహించి తన హస్తమునకు (మణికట్టుకు) కట్టు కొనవలెను.

"ఇంద్రస్య యోని రసి మా మాహిగ్ంసీః ।" (కృ. య. సం. 1. కాం. 2. ప్ర. 2. అను. )

"ఇంద్రస్య యోని రితి కృష్ణవిషాణం యజమానాయ
ప్రయచ్ఛతి ఆబధ్నాతీ త్యేకే ।" (ఆ. శ్రౌ. సూ. )

తా॥ ఓ కృష్ణవిషాణమా! నీవు ఇంద్రునికి కారణభూతమైన దానివైతివి. నన్ను హింసించకుము.

యజమానుడు తన దక్షిణహస్తమునకు దారముతో కట్టిన కృష్ణవిషాణముచే అంతర్వేది యొక్క లోష్టమును (బెడ్డను) త్రవ్వవలెను. త్రవ్వుటకు పూర్వము 'కృష్యైత్వా' అను ఈ క్రింది మంత్రమును ఉచ్చరించి అటుపిమ్మట త్రవ్వవలెను.

"కృష్యైత్వా సుసస్యాయై" (కృ.య.సం. 1.కాం. 2.ప్ర. 2.అను.)

"కృష్యై త్వా ఇతి తయా వేదే ర్లోష్ట ముద్దంతి ।" (ఆ.శ్రౌ.సూ.)

తా॥ ఓ అంతర్వేదీ! శోభనఫలోపేత మగు వ్యవసాయము కొరకు నిన్ను త్రవ్వుచుంటిని.

"కృష్ట్యై త్వా ససస్యాయా ఇత్యాహ తస్మా దకృష్ట
పచ్యా ఓషధయః పచ్యంతే ।" (కృ.య.సం. 6.కాం. 1.ప్ర. 3.అను.)

తా॥ 'కృష్యైత్వా' అను మంత్రము నుచ్చరించి యజ్ఞములో కృష్ణవిషాణముచే వేదిని త్రవ్వుటచే లోకములో అకృష్టపచ్యములగు ఓషధులు (దున్ననక్కరలేకుండ ఫలించెడి ఓషధులు) ఫలించుచున్నవి యజమానుడు కృష్ణవిషాణముచే తన శిరస్సును ఈ క్రింది మంత్రముచే కండూయనము చేసికొనవలసినదిగా ఈ క్రింది శ్రౌతసూత్రము బోధించుచున్నది.

## మంత్రము.

"సుపిప్పలాభ్య స్త్వౌషధీభ్యః ।" (కృ.య.సం. 1.కాం. 2.ప్ర. 2.అను.)

"సుపిప్పలాభ్య స్త్వౌషధీభ్య ఇతి అర్ధే ప్రాప్తే శిరసి కండూయతే ।" (ఆ.శ్రౌ.సూ.)

తా॥ ఓ శిరస్సా! శోభనఫలోపేత మగు ఓషధులకొరకు నిన్ను కృష్ణవిషాణముచే కండూయనము చేయుచుంటిని.

ఈ పై విధముగ శిరస్సును కృష్ణవిషాణముచే కండూయనము చేయుటచే లోకములో వ్రీహి, యవాద్యోషధులు శిరస్సునందు ఫలమును గ్రహించుచున్నవి.

ఈవిధముగ కృష్ణాజినమందు (ఉపవేశనాదికముచే) సర్వావయవగత మగు క్షయకుష్ఠాదిరోగనివారక మగు ఔషధ ముండుటచే మన పూర్వులు సర్వకర్మలందును కృష్ణాజినమును వాడుచుండిరి. మరియు, పూర్వోక్త మంత్రాదులచే లేడికొమ్ముయందు రోగనివారక మగు ఔషధ మున్నట్లు శ్రుతి చెప్పుటచే యజ్ఞాదిదీక్షలయందు కృష్ణ విషాణముచే శిరఃకండూయనము బోధింపబడుచున్నది.

ఇంతవరకు ఋక్సామదేవతలు కృష్ణమృగరూపమును ధరించి నట్లు శ్రుతి బోధించుటచే కృష్ణాజినము వేదస్వరూప మని నిర్వచింప బడినది. ఒకప్పుడు యజ్ఞపురుషుడు కూడ కృష్ణమృగరూపమును ధరించినట్లు ఈక్రింది శ్రుతి బోధించుచున్నది.

"యజ్ఞో దేవేభ్యో నిలాయత । కృష్ణో రూపం
కృత్వా ! యత్కృష్ణాజినే హవి రధ్యవహంతి । యజ్ఞా
దేవ త ద్యజ్ఞం ప్రయుజ్త్కే । హవిషో స్కందాయ ।" (కృ.య.బ్రా. 3.కాం. 2.ప్ర.అను.)

తా॥ యజ్ఞపురుషుడు ఏదో నిమిత్తముచే దేవతలనుండి విలీనుడై (అదృశ్యుడై) కృష్ణ మృగరూపమును ధరించెను. కావున, యజ్ఞకర్మలో కృష్ణాజినమందు హవిరర్థ మగు ధాన్యమును దంపవలెను. దీనివలన, కృష్ణాజినము వేదస్వరూపమే గాక, "యజ్ఞో వై విష్ణుః' అను శ్రుత్యనుసారము విష్ణుస్వరూప మని గూడ సిద్ధమగుచున్నది. గావున, కృష్ణాజినము అధికమహిమోపేత మని స్పష్టమగుచున్నది.

## అంజన మహిమ.

సర్వవైదికకర్మలందును కాటుకను ఉపయోగించు ఆచారము నేటివరకు ఆచరణలో నున్నది. దీనిని గురించి అథర్వవేదములో విశేషముగ జెప్పబడినది.

'ఏహి జీవ మిత్యాంజనమణిం బధ్నాతి' (కౌశికసూత్రము 7. 3.)

'ఏహి జీవం' అను మంత్రముచే అంజనమణిని హస్తమందు కట్టుకొనవలెను.

'ఏహి జీవం త్రాయమాణం పర్వతస్యాస్యక్ష్యం ।
విశ్వేభి ర్దేవై ర్దత్తం పరిధి ర్జీవనాయకం ॥' (అ.వే. 4.కాం. 2.అను. 1.మం. సూక్తము.)

తా॥ ఓ అంజనమా! ప్రాణధారి యగు యజమానుని పాలించు నిమిత్తము నీవు రమ్ము. నీవు త్రికకుత్ పర్వతమునకు చక్షురింద్రియమువు. అనగా,

'సర్వేంద్రియాణాం నయనం ప్రధానం' అను న్యాయానుసారము సర్వేంద్రియములలోను నేత్రము ఎట్లు ప్రధానమైనదో అట్లే నీవు త్రికకుత్ పర్వతమునకు ప్రధానమైనదానవు. రోగాదులు లేకుండ చిరకాలము జీవించేకొరకు ఇంద్రాది దేవతలచే మా కొరకు ఇవ్వబడిన దాన వగుచు పరిధి వైతివి. అనగా, పట్టణమునకు చుట్టుగ నున్న ప్రాకరము శత్రురాజులు రాకుండ ఎట్లు రక్షించునో, అట్లే నీవు మృత్యువు మావద్దకు రాకుండ రక్షించుదానవగు చుంటివి.

'పరిపాణం పురుషాణాం పరిపాణం గవా మసి
అశ్వానా మర్వతాం పరిపాణాయ తస్థిసే ' (అ.వే. 4.కాం. 2.అను. 2.మం. 4 సూ.)

ఓ త్రికకుదాంజనమా, నీవు మనుష్యులకు పరిరక్షణ సాధన మైతివి. గోవులకును రక్షణసాధన మైతివి. అశ్వములకు, ఆడగుఱ్ఱములకు రక్షణకొరకు నీవు ఉంటివి.

'ఉతాసి పరిపాణం యా తు జంభన మాంజన ।
ఉతామృతస్య త్వం వేత్థాథో అసి జీవభోజన మథో
హరిత భేషజం ' (అ.వే. 4.కాం. 2.అను. 3.మం. 4.సూ.)

తా॥ ఓ అంజనమా, నీవు రక్షస్సులు, పిశాచములు మున్నగు వానిచే చేయబడిన పీడలను నశింపజేయుదానవు. సర్వతః రక్షక మైనదానవు. ఇట్టి సామర్థ్యము అంజనము కెట్లు వచ్చెను? నీవు ద్యులోకమం దున్న అమృతత్వముకు సాధనమగు పీయూషము (అమృతము) యొక్కసారమును తెలిసికొన్నదానవు. ఇంతేగాక, నీవు ప్రాణులకు అనిష్టమును నివారణ చేసి పాలించుదానవు. లేక, భోగసాధనమైనదానవు. పాండురోగము మున్నగువానిచే జనించిన శ్యామలత్వమును నివర్తింపజేయుదానవు.

"యా స్యాంజన ప్రసర్పస్యంగ మంగం పరుష్పరుః ।
తతో యక్ష్మం విబాధస ఉగ్రో మధ్య మశీరవ ।" (అ.వే. 4. కాం. 2. అను. 4. మం. 4. సూ.)

తా॥ ఓ అంజనమా! నీవు ఏ పురుష శరీరము యొక్క సమస్తమైన హస్తపాదాద్యంగ ములను, ఆ అంగసంబంధమగు అన్ని పర్వలను లోపల ప్రవేశించి సూక్ష్మనాడులద్వారా వ్యాపించుచుంటివో, ఆ పురుష శరీరమునుండి వ్యాధిని నిశ్శేషముగ బారద్రోలుచుంటివి.

దృష్టాంతము: ఉత్కట మగు బలము గల అంతరిక్ష మందు సంచరించెడి వాయువుమేఘ సమూహాదికమును క్షణమాత్రములో పారద్రోలును.

"అరి ర్మిత్ర మరే ర్మిత్రం"

ఇత్యాది నీతిశాస్త్రోక్త మగు రాజమండల మధ్యవర్తి యగు రాజు ప్రబల మగు బలము గలవాడగుచు సమీపవర్తులగు శత్రువులను బాధించును. అట్లే నీవుగూడ పురుషశరీరము నుండి వ్యాధిని నిశ్శేషముగ బారద్రోలుచుంటివి.

నైనం ప్రాప్నోతి శపథో న కృత్యా నాభిశోచనం
నైనం నిష్కంధ మశ్నుతే యస్త్వా బిభర్త్యాంజన ।" (అ.వే. 4. కాం. 3. అను. 5. మం. 4. సూ.)

తా॥ ఓఅంజనద్రవ్యమా! నిన్ను ధరించిన పురుషుని పరకృతమగు శాపము పొందనేరదు. శత్రుకృత మగు అభిచారాదికృత్యము (ప్రయోగాదికము) ఇతనిచెంతకు చేరలేదు. ప్రయోగజనిత మగు శోకము ఇతనిని పొందనేరదు. ఇతని గతికి ప్రతిబంధకమగు విఘ్నజాతము కూడ ఇతనిని పొందదు.

"అసన్మంత్రాత్ దుష్వప్న్యాత్ దుష్కృతాచ్ఛమలా
దుత దుర్హార్ద శ్చక్షుషో ఘోరా త్తస్మా న్నః పాహ్యాంజన ।"
(అ.వే. 4. కాం. 2. అను. 6. మం. 4. సూ.)

తా॥ ఓ అంజనమా! అభిచారిక మంత్రములందలి దుఃఖము నుంచియు, దుస్స్వప్నముల వలన సంభవించెడి దుఃఖము నుంచియు జన్మాంతర కృతమగు పాపము నుండియు, ఇంకను ఇప్పుడు చేయ బడెడి పాపమునుండియు, దౌర్మనస్యము (దుర్హార్దము) నుండియు

(అనగా మనోవైకల్యమునుండియు), ఘోర మగు పరకీయదృష్టి నుంచియు (అనగా దృష్టి దోషమునుంచియు), దృష్టిదోషమువలన అనుక్రాంతములగు సర్వబాధల నుండియు మమ్ములను రక్షించుము.

'ఇదం విద్వా నాంజన సత్యం వక్ష్యామి నానృతం
సనేయమశ్వంగామహ మాత్మానం తవ పూరుష (అ.వే. 4.కాం. 2.అను. 7.మం. 3.సూ.)

తా॥ ఓ అంజనమా, నీమాహాత్మ్యమును గుర్తెరిగిన నేను సత్యమునే జెప్పెదను. అసత్యమును జెప్పువాడనుగాను. కావున, నీకు దాసుడనగు నేను (అనగా, నీ అనుగ్రహపాత్రుడనగు నేను) అశ్వమును, గోవును, నా ఆత్మను, సేవింతును గాక. అనగా, నీ అనుగ్రహముచే ఆరోగ్యయుక్తుడనై, అశ్వము మున్నగు సమస్తైశ్వర్యములను పొందెదను.

'త్రయో దాసా అంజనస్య తక్మా బలాస అదహిః
వర్షిష్ఠః పర్వతానాం త్రికకున్నామ తే పితా ।' (అ.వే. 4.కాం. 2.అను. 8.మం. 3.సూ.)

తా॥ ఆంజనద్రవ్యమునకు మూడు రోగములు దాసులు. అనగా దాసునివలె వశవర్తులు (స్వాధీనులు). మొదటిది 'తక్మా' లేక కృ చ్ఛ్ర జీవనహేతు వగు జ్వరము (జీవించుటకు కష్ట మగు జ్వరము). రెండవది 'బలాసః' లేక శరీరమందలి బలమును పోగొట్టెడి సన్నిహితము. మూడవది 'సర్పః' లేక సర్పజన్య మగు విషవికారము. లోకములో దాసుడు ప్రభువు యొక్క ఇచ్ఛానుసారము వర్తించునట్లు, ప్రాణముల నపహరించెడి ఈ మూడు రోగములును ఆంజనప్రభావముచే నివృత్తము లగును. (గాన, ఆంజనద్రవ్యమునకవి దాసులు). మరియు పర్వతములలో అత్యంతము ప్రవృద్ధమగు త్రికకుత్ పర్వతము (మూడు శిఖరములు గల పర్వతము) నీకు తండ్రి. అనగా పెద్దవంశములో బుట్టినదాన వని మహత్వోక్తి. ఇట్టి నీ ప్రభావముచేత విషజ్వరము, సన్నిపాతాదికము, పామువిషము మొదలగునవి నివృత్తము లగును.

"యదాంజనం త్రైకకుదం జాతం హిమవత స్పరి ।
యాతూంశ్చ సర్వాన్ జంభయన్ త్సర్వాశ్చ యాతుధాన్యః ।"
(అ.వే. 4.కాం. 2.అను. 9.మం. 3.సూ.)

తా॥ హిమవత్పర్వతముయొక్క ఉపరిభాగమందున్న త్రికకుత్పర్వతసంబంధమగు ఆంజనము (కాటుక) సమస్తమైన రాక్షసులను, రాక్షసస్త్రీలను నశింపజేయుచున్నది. ఈ కారణముచే మాసంబంధమగు రోగాదులను నశింపజేయుగాక.

'యదివాసిత్రైకకుదం యది యాముక ముచ్యసే
ఉభే తే భద్రే నామ్నీ తాభ్యాం నః పాహ్యాంజన ।'
(అ.వే. 4.కాం. 2.అను. 10.మం. 3.సూక్తం)

తా॥ ఓ ఆంజనమా! నీకు త్రైకకుదము (త్రికకుత్పర్వత సంబంధమైనది), యామునము (యమునాసంబంధమైనది) అను మంగళ ప్రదమగు రెండు నామములు గలవు. ఆ నామములచే మమ్ములను రక్షించుము.

## యజ్ఞములో ఆంజనధారణము.

యజ్ఞము చేయు యజమానుడు ఇంటివద్ద యజ్ఞసంకల్పము చేసి, అధ్వర్యుడు మున్నగు ఋత్విక్కులను వరించి, యజ్ఞశాలలో ప్రవేశించవలెను. అనంతరము దీక్షణీయేష్టి, క్షురకర్మ, స్నానము, దీక్షా వస్త్రధారణము, భోజనము, నవనీతాభ్యంజనము అయిన పిదప కాటుకను ధరించవలసినదిగ ఈక్రింది శ్రౌతసూత్రము బోధించుచున్నది.

"అథాస్యై తదాంజనంపిష్టం దృషదుపలే సతూలయా దర్భే
షీకయా శరేషీకయా వా దర్భపుంజీలేన వా.... ద్విర్దక్షిణ మని
ధావమానః ..........వోభే ।" (ఆ.శ్రౌ.సూ.)

తా॥ ఈ కాటుకను రాతిమీద మెత్తగ నూరి దర్భయొక్క గాని, రెల్లు (శరము) యొక్కగాని గర్భములోనున్న మృదువగు ఇషీక (లోపలిభాగము) యొక్క అగ్రభాగముచే యజమాని ధరించవలెను ఈ విషయవిభాగము నీక్రింది శ్రుతి బోధించుచున్నది.

"ఇంద్రో వృత్ర మహన్ తస్య కనీనికా పరాపత
త్తదాంజన మభవ ద్యదా జ్క్తే చక్షురేవ భ్రాతృవ్యస్య
వృఙ్క్తే దక్షిణం పూర్వ మాఙ్క్తే సవ్యగ్ం హి పూర్వం
మనుష్యా ఆంజతే న నిధావతే నీవహి మనుష్యాధావంతే
పంచకృత్వ అఙ్క్తే పంచాక్షరా పంక్తిః పాఙ్క్తో యజ్ఞో
యజ్ఞమేవావరుంధే పరిమిత మాఙ్క్తే పరిమితగ్ం
హి మనుష్యా అంజతే సతూలయాఙ్క్తే పతూలయా
హి మనుష్యా అంజతే వ్యావృత్త్యై యదపతూలయాం
జీత వజ్ర ఇవ స్యా త్సతూలయాఙ్క్తే మిత్రత్వాయ ।" (కృ.య.సం. 6-1-1.)

తా॥ పూర్వము ఇంద్రుడు వృత్రాసురుని కొట్టగా అతని నల్లగ్రుడ్డు (కంటిపాప) క్రిందపడి, అది ఆంజన మాయెను. అట్టి ఆంజనమును ధరించినచో శత్రువుయొక్క చక్షుస్సును నశింపజేయును. లోకములో స్త్రీలు యెడమకంటికి కాటుక ముందు ధరించెదరు. లోకముకంటె వైలక్షణ్యముకొరకు యజ్ఞములో యజమానుడు కుడికంటికి ముందు కాటుకను ధరించవలెను. మరియు, లోకములో స్త్రీలు కాటుక వ్రేలును చక్షుస్సునందు

అటూ, ఇటూ (పునః పునః) అనేకసార్లు శీఘ్రముగ సంచరింపజేతురు. యజ్ఞములో యజమానుడు ఆంజనోపేత మగు దర్భావయవమును రెండు నేత్రములందును మొత్తము ఐదు సారులు మాత్రమే సంచరింపజేయవలెను. అనగా, కుడికంటికి రెండు సార్లును, ఎడమకంటికి మూడు సార్లును సంచరింపజేయవలెను. యజ్ఞములో ధానాది హవిస్సులు (అనగా, ధానలు లేక వేపుడుబియ్యము, కరంభము లేక సత్తుపిండి, పరివాపము లేక పేలాలు, పురోడాశము, పయస్యా లేక విరుగుముద్ద) ఐదు ద్రవ్యము లుండుటచే యజ్ఞము పఙ్క్తియుక్త మైన దగును. పంచసంఖ్యాసామ్యముచే అట్టి యజ్ఞప్రాప్తి కొరకు ఆంజనమును ఐదు సార్లే ధరించవలెను.

## ఆంజనధారణమంత్రము.

"వృత్రస్య కనీనికాసి చక్షుష్పా అసి చక్షు ర్మే పాహి ।" (కృ.య.సం. 1.కాం. 2.ప్ర. 1.అను.)

"వృత్రస్య కనీనికేతి త్రైకకుదే నాంజనేనాఙ్క్తే యది త్రైక
కుదం నాధిగచ్ఛే ద్యేనైవ కేన చాంజనే నాంజీతేతి వాజన
నేయకం ।" (ఆ.శ్రౌ.సూ.)

తా॥ ఓ ఆంజనమా! నీవు వృత్రాసురుని యొక్క కనీనికవు. (నల్లపాపవు). నీవు చక్షుస్సులను రక్షించుదానవు. కాన, నా చక్షుస్సులను రక్షించుము. అనగా, ఆంజనము చక్షూరోగములను బారద్రోలి చక్షుస్సులను రక్షించు నని ఈ శ్రుతి స్పష్టముగా బోధించుచున్నది.

ఫలితము: ఆంజనము మృత్యువు రాకుండ రక్షించును. అది మనుష్యాదులకు రక్షణ సాధనమైనది. రక్షస్సులు, మరియు పిశాచాదుల పీడను నివర్తింపజేయును. ప్రాణులకు అరిష్టనివారకము. పాండ్వాదిరోగముల వలన వచ్చెడి కామెర్లకు నివారకము. హస్త పాదాది సర్వాంగములయందును సూక్ష్మనాడులద్వారా వ్యాపించి సర్వవ్యాధులను నశింపజేయును. శాపము, అభిచారము మున్నగు పీడలను నివారించును. దుఃస్వప్నాదిదుఃఖములను, మనోవైకల్యమును, దృష్టిదోషమును తొలగించును. ఆరోగ్యాదిహేతువు. విషజ్వరము, సన్నిపాతాది జ్వరము, సర్పవిషబాధ మున్నగువాటిని తొలగించును. సమస్త రక్షస్సులకు, సర్వరోగములకు నాశకము. సర్వకర్మలందును ధరించబడునది. దీనివలన, మన ప్రాచీనుల ఆచారములలో సమస్త శ్రేయస్సులు ఉండునని స్పష్ట మగుచున్నది.





శ్రీ మహాగణాధిపతయే నమః ।

# వేదసార రత్నావళి

## 18. దేవశునీ వృత్తాంతము.

### ఉపోద్ఘాతము.

ప్రకృతకాలములో ఆధునికులు ఉత్తమజాతికుక్కలచే దొంగలను పట్టించుట, గృహరక్షణ మున్నగునవి చేయించుట, ఆశ్చర్య జనకములగు ఇతరపనులను చేయించుట, మొదలగునవి వీరు క్రొత్తగ కనిపెట్టిన విషయములుగ లోకమునకు కనుపించవచ్చును. కాని, అవి అభూతపూర్వము లగు నూతనవిషయములు గావు. సర్వసృష్టి కారణములై అపౌరుషేయములుగ మహర్షులచేతను, సర్వప్రామాణికుల చేతను నిర్ణీతములైన వేదములలో ఇంద్రాదిదేవతలు ఈ శునకములను నష్టద్రవ్యాన్వేషణ మున్నగు సర్వకార్యములందును ఉపయోగించుకొనినట్లు స్పష్టముగ చెప్పబడుచున్నది.

### పరమ వృత్తాంతము (ఋగ్వేదము).

"ఇంద్ర స్యాంగిరసారం చేష్టౌ విద త్సరమా తన
యాయ ఘాసిం । బృహస్పతి ర్భిన దద్రిం విదద్గా
స్సముస్రియాభి ర్వా వశంత నరః।" (ఋగ్వేదప్రథమాష్టకం. 5. అధ్యాయం. 305. పే.)

తా॥ "ఇంద్రస్యాంగిరసాం" అను మంత్రములో ఈ అఖ్యానము చెప్పబడుచున్నది –

దేవలోకములో ఇంద్రుని యొద్ద 'సరమా' అను ఒక ఆడ కుక్క గలదు. అసురులు దొంగతనము చేసినపుడు ఇంద్రుడు ఆ జాడ తెలిసికొనుటకు దీనిని పంపెడి సంప్రదాయము కలదు. ఇట్లుండ, ఒకప్పుడు పణినామకులగు అసురులు గోవులను అపహరించగా, ఆ గోవులను వెదకుటకు ఇంద్రుడు ఈ 'సరమా' అను దేవశునిని (కుక్కను) పంపెను. లోకములో వ్యాధుడు (వేటకాడు) వనాంతర్గతము లగు మృగములను అన్వేషణ చేయుటకు కుక్కలను ఎట్లు పంపునో, అట్లే ఇంద్రుడు ఈ కుక్కను పంపెను.

అప్పుడు ఆదేవశుని ఇంద్రునితో నిట్లు పలికెను. "ఓ ఇంద్రా! ఆగోసంబంధ మగు క్షీరాద్యన్నమును నా శిశువుకు ఇచ్చే యెడల, ఆ గోవులను వెదకుటకు వెళ్ళెదను." ఇట్లు ఆసరమపలికినవెంటనే ఇంద్రుడు, "నా గోవులను నీవు వెదకినచో, తప్పక నీ సంతానమునకు ఆక్షీరాదికమును ఆహారముగ నిచ్చెద" నని పలికెను. వెంటనే ఆసరమ (కుక్క) బయలుదేరి వెడలి, ఆపణినామకు లగు అసురులచే గుప్తముగ నుంచబడిన గోస్థానమును తెలిసికొని, వెంటనే తిరిగి వచ్చి, ఆ వృత్తాంతమును ఇంద్రునకు చెప్పగా, ఇంద్రుడు అచట కేగి, ఆపణులను చంపి, ఆ గోవులను తీసికొనివచ్చెను.

భావము: ఈ మంత్రమువలన దేవలోకములో ఉత్తమజాతి కుక్క లున్నట్లునూ, అసురులచే అపహృతము లగు వస్తువుల జాడను ఇంద్రుడు ఆ కుక్కలవలన తెలిసికొని, ఆ వస్తువులను తిరిగి పొందు చున్నట్లును స్పష్ట మగుచున్నది.

"వీళౌ సతీ రభిధీరా అతృందన్ ప్రాచా హిన్వ
న్మనసా సప్త విప్రాః । విశ్వా మవింత
న్మనసా సప్త విప్రాః । విశ్వా మవింద న్పథ్యామృతస్య
ప్రజాన న్నిత్తానమసా వివేశ ।" (ఋగ్వేదం. 3. అష్టకం. 2. అధ్యాయం. 228. పే.)

తా॥ పూర్వము అంగిరస్సు లను మహర్షుల గోవులను పణి నామకులగు అసురులు అపహరించి రహస్యమగు ఒకానొక పర్వతమందు దాచిరి. అంత నా అంగిరస్సులు తమ గోప్రాప్తికొరకు ఇంద్రునియొద్దకు జని, ఆ వృత్తాంతమును మనవి చేసికొనగా, ఇంద్రుడు ఆగోవులను వెదకుటకు దేవశుని యగు 'సరమా' అను కుక్కను పంపెను. ఆ సరమయుకడు శ్రద్ధతో అన్వేషణమును చేసి, ఆ గోస్థానమును తెలిసికొని, ఇంద్రునకు విజ్ఞాపన చేయగా, వెంటనే ఇంద్రుడు వారిని జయించి, ఆ గోవులను తీసికొనివచ్చి అంగిరస్సుల కిచ్చెను. ఈ ఐతిహాసిక కథ ఈ ఋక్కునందు చెప్పబడినది.

భావము: లోకములో జనులు తన సొత్తులు పరులచే అపహరింపబడుట మున్నగు ప్రమాదములు సంభవించినపుడు ప్రభువుల యొద్దకు పోయి తమ వృత్తాంతమును విన్నవించుకున్న పిదప, వారు వెంటనే ఉన్నతజాతికి చెందిన కుక్కలను పంపి, ఆ జాడను వాటివలన తెలిసికొని, ఆ సొత్తులను వారికి అందజేయు సంగతి లోకవిదితమే. ఇంద్రుడు కూడ దేవలోకములో కుక్కలవలననే ఇట్టి గూఢవిషయములను తెలిసికొని నష్టద్రవ్యములను తిరిగి పొందుచున్నట్లు ఈ ఋక్కువలన కూడ స్పష్టముగ తెలియుచున్నది.

# ఋగంతరము (మరియొక మంత్రము).

'విదద్యదీ సరమా రుగ్ణమద్రే ర్మహిపాథః పూర్వ్యం
సధ్ర్యక్కః । అగ్రం నయత్సు పద్యక్షరాణా మచ్ఛారవం
ప్రథమా జానతీ గాత్ ।' (ఋగ్వేద. 3. అష్టకం. 288. పే.)

తా॥ పూర్వమంత్రములో అంగిరస్సుల గోవులను వెదకుటకు 'సరమా' అను దేవశునిని ఇంద్రుడు పంపిన తరువాత జరిగిన వృత్తాంతమును ఈ మంత్రము బోధించుచున్నది. ఆ దేవశుని గోవుల నిమిత్తము అన్వేషణ చేయుచు, ఒక పర్వతము యొక్క భగ్నమైన ద్వారమును చూచి, వెంటనే ఇంద్రుని ఆ స్థలమునకు తీసికొనివెళ్ళుటకు ఇంద్రసమీపమునకు వచ్చెను.

వెంటనే ఇంద్రుడు తాను పూర్వము చేసిన ప్రతిజ్ఞానుసారము (అనగా, సరమ తన సంతతికి క్షీరాదిద్రవ్యములను ఇచ్చు నెడల, తాను గోవులను వెదకెద నని కోరినపిమ్మట, ఇంద్రుడు ఇచ్చెదనని చేసిన వాగ్దానానుసారము) ఆసరముకు ఇతర భోజ్యములతో సమీచీన మైన అన్నమును ఇచ్చెను.

పిమ్మట ఆసరమ ఇంద్రుని వెంటబెట్టుకొని, క్షయరహితములగు గోవుల ప్రాంతమును చేరెను. ఎట్లు వెడలెనన, ఆ గోవుల హంభారవమును ముందుగ తెలిసికొని ఆశబ్దాభిముఖముగ జనెను.

భావము: ప్రకృతకాలములో ఉత్తమజాతి శునకములు వాటి ననుసరించి వెళ్ళినవారికి ఆ విషయమును తెలియజేయును. దేవశుని యగు సరమయో, తాను ముందుగ పోయి ఆ విషయమును అన్వేషించి తిరిగి వచ్చి యజమానికి తీసికొని పోయి ఆ వస్తువును తెలియజేయును. మరియు, ఇంద్రుడు ఆ దేవశునికి (ప్రతిజ్ఞానుసారముగ) గోక్షీరములు మున్నగు ఉత్తమజాతికి చెందిన ఆహారమును పెట్టెనని ఈ మంత్రములో చెప్పబడినది. దీనినిబట్టి, ఇప్పుడు కూడ లోకములో అట్టి ఉత్తమజాతికి చెందిన కుక్కలను క్షీరములు మున్నగు ఉత్తమాహారముచే పోషించుట అనుభవసిద్ధము. వాటి ఆహారమును కూడ వేదము బోధించుట ఆశ్చర్యకరమగు విషయము.

"అగచ్ఛదు విప్రతమః సఖీయ న్నసూద యత్సు
కృతే గర్భమద్రిః । ససాన మర్యో యువభి ర్మఖస్య
న్నథాభవ దంగిరా స్సద్యో అర్చన్ ।" (ఋగ్వేద. 3. అష్టకం. 229. పే.)

తా॥ అత్యంతమేధావి యైనట్టియు, అంగిరస్సులతోగూడ స్నేహమును కోరుచున్న ఇంద్రుడు. గోవుల నివసించిన పర్వతమును గూర్చి తక్షణమే వెడలెను. వెంటనే ఆ అద్రియు,

ఇంద్రునితో సఖ్యమును ఇచ్చయించుచు యోగ్యముగ యజ్ఞానుష్ఠాత యగు ఇంద్రునికొరకు గోరూప మగు గర్భమును (తన యందునివసించిన గోవులను) సమర్పించెను. అనంతరము అసురులను మారణము చేసెడివాడును, నిత్యయౌవను లగు దేవతలతో గూడినట్టియు, ఆ గోధనమును అంగిరస్సులకు ఇవ్వవలె నను తలంపుతో నున్న ఇంద్రుడు అసురులచే అపహృతము లైన ఆ గోవులను తన స్వాధీనము చేసికొనెను. పిమ్మట, సప్తసంఖ్యాకు లగు అంగిరస్సులలో ప్రవృద్ధుడగు అంగిరోఋషి ఇంద్రునివలన ఆ గోవులను పొంది, ఇంద్రుని పూజించుచు స్వనివాసమునకు పోయెను.

## ఋగంతరము.

*"అతిద్రవసారమేయౌ శ్వానౌ చతురక్షౌ శబలౌ*
*సాధునా పథా । అథాపితౄన్ త్సువిదత్రాగ్ం ఉపేహి*
*యమేన యే సధమాదం మదన్తి ।"* (ఋగ్వేద. 7. అష్టకం. 10. మం. 34. పే.)

తా॥ వెనుకటి మంత్రములలో ఇంద్రునియొద్ద 'సరమా' అను దేవశునిని గూర్చిన వృత్తాంతము చెప్పబడినది. ఇటుపైన మూడు మంత్రములలో ఆసరమయొక్క సంతానమగు రెండు పురుషశునకములు క్రిమినలుప్రభువగు యమునియొద్ద ఉన్నట్లు వర్ణింపబడుచున్నది. ఈ మంత్రములో అగ్నిని సంబోధించి ఈ క్రిందివిధముగ అర్థము ప్రవృత్తమైనది. 'ఓ అగ్నీ! ప్రేతలను బాధించునట్టి యమునియొక్క కుక్కలు ఈ ప్రేతను బాధించకుండునట్లు యోగ్య (మంచి) మార్గమున తీసికొనిపోయి, యే పితృదేవతలు యమునితో సంతోషముగ నుందురో, అట్టి అభిజ్ఞులగు పితరుల యొద్దకు (ఈ ప్రేతను) కొనిపొమ్ము.'

## ఋగంతరము.

*"యౌతే శ్వానౌ యమ రక్షితారౌ చతురక్షౌ పథిరక్షీ*
*నృచక్షసౌ । తాభ్యా మేనం పరిధేహి రాజన్ స్వస్తి చాస్మా*
*అనమీవం చ ధేహి ।"* (ఋగ్వేద. అష్టకం. 11. మం. 34. పే.)

తా॥ ఈ మంత్రములో యముని సంబోధించి అర్థము ప్రవృత్తమైనది. 'ఓయమా! ఓరాజా! గృహమును రక్షించునట్టివియు, నాల్గుకండ్లు కలిగినట్టివియు, (కొన్ని కుక్కలకు నేత్రముల ఉపరిభాగమున మరిరెండు నేత్రములవలె వర్తులాకార మగు చిహ్నాలుండును). మార్గ రక్షకము లైనట్టివియు, (శ్రుతి, స్మృత్యభిజ్ఞులద్వారా సర్వలోకప్రసిద్ధము లైన నీకుక్కలను ఈ ప్రేతకు రక్షణకొరకు ఇమ్ము. ఆ కుక్కలు ఇతనిని బాధించకుండ రక్షణ చేయునట్లు చేయుము. ఇతనికి క్షేమమును, రోగాభావమును సంపాదించుము. దీనిలో 'రక్షితారౌ' అను

విశేషణముచే యముని గృహమును రక్షించునట్టివి యని అర్థము. అనగా, అతడు క్రిమినలు ప్రభువు గనుక అతని గృహమునకు ఈ కుక్కలు రెండును కావలికాయుటకు నిర్ణీతములని స్పష్టమగుచున్నది.

## ఋగంతరము.

'ఉరుణసా వసుతృపా ఉదుంబలౌ యమస్య దూతౌ
చరతో జనాఁఅను । తావస్మభ్యం దృశయే సూర్యాయ
పున ర్దాతా మసుమద్యేహ భద్రం ।'

తా॥ యముని దూతలగు కుక్కలు (శ్వానములు) రెండును అవశులగు ప్రాణులకొరకు (స్వాతంత్ర్య రహితులగు ప్రేతలకొరకు) అంతటను సంచరించుచున్నవి (ప్రాణినః లక్ష్మీకృత్య సర్వత్ర చరతః). దీర్ఘములగు నాసికలతో కూడినవియు, (ఉరుణసౌ) పరుల ప్రాణములను స్వీకరించి వాటిచే సంతృప్తిని చెందునట్టివియు, గొప్పబలము కలవియు నగు ఆ శునకములు రెండును ఈ కర్మయందు సూర్యదర్శనముకొరకు సమీచీనమైన ప్రాణమును ఇచ్చుగాక. (మా ప్రాణమును ఇచ్చుగాక. (మా ప్రాణములను బాధించకుండ ఉండుగాక).

భావము. ఈ మూడు మంత్రములందును దేవలోక ప్రసిద్ధ మగు సరమ యను శుని యొక్క సంతానముకు చెందిన రెండు కుక్కలు శబలవర్ణము (చిత్రవర్ణము) గలవియు, పొడవైన ముక్కులు గలవియు, (నేత్రముల ఉపరిభాగమున గుండ్రముగ నేత్రములవలె భాసించుచుక్క లుండుటచే) నాల్గు నేత్రములు గలవియును, గృహమును రక్షించుచు రాజాజ్ఞానుసారము ప్రేతలను బాధించుచు యమలోకములో నున్నట్లు అతిస్పష్టముగ చెప్పబడియున్నది. ఇదే విధముగ కృష్ణయజుర్వేదములో గూడ యముని కుక్కలను వర్ణించు మూడు మంత్రములు గలవు.

## యముని కుక్కలు (కృష్ణయజుర్వేదము)

'అతిద్రవసారమేయౌమా శ్వానౌ చతురక్షౌ శబలౌ
సాధునా పథా । అథా పితౄన్ త్సువిదత్రాగ్ం అపీహి
యమేన యే సధమాదం మదంతి ।' (కృ.య.పితృమేధం. 3.అను. 4.ఋక్)

తా॥ ఓ అగ్నీ! యోగ్యమైన మార్గము ద్వారా యముని రెండు కుక్కలను అతిక్రమించి వెళ్లుము. అనగా, ప్రేతలను బాధించెడియు, దేవలోకములో సుప్రసిద్ధమగు సరమయను శునకముయొక్క సంతాన మైనట్టియు, నేత్రముల పై భాగమున రెండు నేత్రసదృశములగు గుండ్రములగు చుక్కలు గల యముని కుక్కలను పరిత్యజించి (తప్పించి) సమీచీన మగు

మార్గముద్వారా ఈ ప్రేతను తీసికొనివెళ్లుము. తీసికొని వెళ్ళినపిదప యే పితృదేవతలు యమునితో కూడ సంతసించుచుండిరో, అట్టి అభిజ్ఞులగు పితృదేవతలను పొందుము. (అనగా, అట్టి పితృదేవతలవద్దకు ఈ ప్రేతను గొనిపొమ్ము).

*"యౌ తే శ్వానౌ యమ రక్షితారౌ చతురక్షౌ పథి*
*రక్షీ నృచక్షసౌ । తాభ్యాగ్ం రాజ న్పరిధేహ్యేనగ్గ్ స్వస్తి*
*చాస్మా అనమీవంచ ధేహి ।" (కృ.య.పితృమేధం. 3. అను. 5. ఋక్.)*

తా॥ ఓయముడా! నీ గృహమును రక్షించునట్టివియు, పూర్వ విధముగ నాల్గు నేత్రములతో గూడినట్టివియు, మార్గములను రక్షించునట్టివియు నగు నీ కుక్కలకు ఈ ప్రేతను పరిచయము చేసి ఈ ప్రేతకు క్షేమమును, (రోగాభావమును) ఆరోగ్యమును సంపాదించుము.

*"ఉరుణసా వసుతృపా వులుంబలౌ యమస్య దూతౌ*
*చరతో__వశాగ్ం అను । తా వస్మభ్యం దృశయే*
*సూర్యాయ పునర్దత్తా వసుమ ద్యేహ భద్రం ।" (కృ.య.పితృమేధం. 3. అను 6. ఋక్.)*

తా॥ యముని దూతలను (ఆజ్ఞాకారులును), దీర్ఘములగు నాసికలు గలవియును, పాపాత్ములయొక్క ప్రాణములను స్వీకరించి వాటిచే తృప్తిని పొందున్నట్టివియును ("ఆవశాన్' ' – అస్వాధీను లగు ప్రాణులను గూర్చి అంతటను సంచరించుచున్నవి. లేక, "వశాన్" తమకు అభీష్టములగు ప్రదేశములను గూర్చి సంచరించుచున్నవి). అగు ఓశునకములారా! అట్టి మీరు మృతునియొక్క పుత్రాదుల మగు మాకు సూర్యునియొక్క దర్శనము కొరకు ఈ పిత్రాదులయొక్క మరణముచే గతప్రాయమగు మా ప్రాణమును ఇప్పుడు తిరిగి మా శరీరమునందు (ఈకర్మయందు) భద్రముగా సర్వోపద్రవములు లేకుండ ఇప్పించవలెను.

## అథర్వవేదములోని కుక్కల వృత్తాంతము.

ఇదే విధముగ అథర్వవేదములోగూడ యమునియొద్ద రెండు కుక్కలు ఉన్నట్లుగ ఈ దిగువ శ్రుతులు ఘోషించుచున్నవి.

*"అతిద్రవశ్వానౌ సారమేయౌ చతురక్షౌ శబలౌ*
*సాధునా పథా । అథాపితౄన్ త్సువిదత్రాగ్ం అపీహి*
*యమేనయే సధమాదం మదంతి ।" (అథర్వవే. భా. 18. కాం. 2. అ. 2. సూ. 94. పే.)*

తా॥ పితృలోకమును గూర్చి వెళ్ళెడి ఓప్రేతా! సరమయను దేవశుని యొక్క పుత్రులును, నాలుగు నేత్రములు కలిగి (శబల వర్ణము లగు) శ్యామ, శబల అను పేర్లు గల

రెండు కుక్కలను సమీచీన మగు మార్గము ద్వారా అతిక్రమించి వెడలుము. అనంతరము (విదత్రశబ్దో ధనవాచీ జ్ఞానవాచీవా) శోభనమైనహవిస్స్వరూపమైన ధనముగల, లేక సమీచీనజ్ఞానయుక్తులగు పూర్వజులగు యే పితరులు యమునితో గూడ సంతోషముగ నుండిరో, అట్టి పితృదేవతల సమీపమును గూర్చి వెళ్ళుము. అథవా, (అపశబ్దః వర్జనార్థః) మార్గమందున్న ఆ కుక్కలను తప్పించుకొని పితరులను పొందుము.

*"యౌ తే శ్వానౌ యమరక్షితారౌ చతురక్షౌ పథి సదీ*
*నృచక్షసౌ । తాభ్యాం రాజ న్పరిధేహ్యేనం స్వస్త్యస్మా*
*అనమీవంచ ధేహి ।"* (అ.వే.భా. 18.కాం. 95. పే.)

తా॥ ఓయముడా! యముడు రక్షకుడుగా కలిగినట్టివియు, యమపురమును పాలించునట్టివియు, నాలుగు నేత్రములు గలిగి నట్టివియు, పితరులు పోవు మార్గమునందు ఉండునట్టివియు, గంతలను (అనగా, పోవువారిని) చూచుచున్నట్టివియు నగు నీ కుక్కలను ఈ ప్రేతకు రక్షణకొరకు ఇమ్ము. మరియు, నాశము, రోగములు, బాధలు లేని స్థానమును గూడ ఈ ప్రేతకు ఇమ్ము.

*'ఉరుణసా వసుతృపా వుదుంబలౌ యమస్య దూతౌ*
*చరతో జనాఁ౽అను । తావస్మభ్యం దృశయే సూర్యాయ*
*పున ర్దాతా మసుమద్యేహ భద్రం ।'* (అ.వే.భా. 18.కాం. 2. అను. 2. సూ. 96. పే.)

తా॥ విస్తీర్ణమైన నాసిక గలిగినవియు, ప్రాణులయొక్క ప్రాణములచే తృప్తిని పొందుచున్నట్టివియు, అనగా ప్రాణములను అపహరించెడివియు, విస్తీర్ణమగు బలము గలవియు, యముని యొక్క దూతలయినట్టివియు, జనులయొక్క ప్రాణములను అపహరించుటకై అంతటను సంచరించుచుండెవియు నగు యముని కుక్కలు, సూర్యుని చూచుటకు భద్రమయిన ప్రాణమును మాశరీరమునందు తిరిగి ఇచ్చుగాక.

## ఇంద్రుడు కుక్కలచే వ్యవహరించుట (కృ.య.వేదము).

**ఇ**దే విధముగ కృష్ణయజుర్వేదములో గూడ ఇంద్రుడు కుక్కలను పంపి వ్యవహరించినట్లు గలదు.

*'విదద్యతీ సరమా రుగ్ణ మద్రేః । మహిపాథః*
*పూర్వ్యగ్ం సధ్రియక్కః । అగ్రం నయ త్సుపద్యక్ష*
*రాణాం । అచ్ఛారవం ప్రథమా జానతీ గాత్ ।'*

(కృ. య. బ్రా. 2. కాం. 5. ప్ర. 8. అను. 10. పనస)

తా॥ సరమా యను దేవశుని భూమియందు అన్నసంపాదన కొరకు ఇంద్రునిచే పంపబడిన దగుచు, మేరుపర్వతమునుండి భూమిని గూర్చి వచ్చుచు, అన్నము లేకపోవుటచే క్షుధాగ్రస్తమైన జనమును చూచెను. పిమ్మట ఆజనులకు అన్నసంపాదనకు సాధనమగు జలమును సర్వక్షేత్రసంచారి యగునట్లు చేసెను. అనగా, తాను యోగ్యముగ ముందు నడచుచు జలమును ముందుకు తీసికొని వచ్చెను. ఈ విధముగ జలోత్పాదనచే అన్నమును సంపాదించి, గోరసమును సంపాదించుటకు పురోభాగమందు హింసా అయోగ్యములగు గోవులయొక్క హంభారవమును విని, తదభిముఖముగ వెడలెను.

*"విదద్గవ్యగ్ం సరమా దృఢ మూర్వం యేనానుకం*
*మానుషీ భోజతే విట్ । ఆయేవిశ్వా స్వపత్యాని చక్రుః ।*
*కృణ్వానాసో అమృతత్వాయ గాతుం ।"* (కృ.య.బ్రా. 2.కాం. 5.ప్ర. 8.అను. 11.పనస.)

తా॥ స్వర్గరూప మగు కర్మఫలముకొరకు యే యజమానులు శోభనసంతానప్రదములగు కర్మలను చేయుచుండిరో, అట్టి యజమానరూప మగు ప్రజ యేగోసమూహముచే క్షీరాదికమును భుజించుచున్నదో, అట్టి దృఢము (అనుపాయము), అత్యంత సమృద్ధము నగు గోసమూహమును ఆ సరమ (దేవశుని) తెలిసికొనెను.

ఇట్లు దేవలోకములో ఇంద్రాదులు అసురులచే అపహృతము లైన గవాదిద్రవ్యముల జాడలను దేవశునియొక్క సహాయముచే తెలిసికొని, పిదప వారాద్రవ్యములను శత్రునిరసనద్వారా స్వీకరించి నట్లు స్పష్టమగుచున్నది.

## బృహస్పతియొక్క గోవుల జాడను సరమ తెలిసి కొనుట (ఋగ్వేదము). ఋగంతరము.

*"కి మిచ్ఛంతీ సరమా ప్రేదమాన డ్దూరే హ్యధ్వా*
*జగురిః పరాచైః । కాస్మే హి తిః కా పరిత క్యాసీత్*
*కథం రసాయా అతరః పయాంసి ।"* (ఋగ్వేద. 8.అష్టకం. 1.మం. 360.పే.)

తా॥ పూర్వము ఒకప్పుడు ఇంద్రపురోహితుడగు బృహస్పతి యొక్క గోవులను వలుడను పేరుగల అసురునియొక్క భటులగు పణులు అను పేరు గల అసురులు అపహరించి పర్వతగుహయందు దాచగా బృహస్పతి ఇంద్రునివద్దకు జని, ఆ వృత్తాంతమును నివేదించెను. వెంటనే ఇంద్రుడు ఆ గోవులను వెదకుటకు సరమ యను దేవశునిని పంపెను. ఆ దేవశునియు వలాసురుని పట్టణమునకు చుట్టును కందకముగా నున్న మహానదిని దాటి, వలపట్టణమును చేరి, గుప్తస్థానమునందుంచబడిన ఆ గోవులను

చూచెను. అనంతరము ఆ సమయములో వలాసురుని భటులగు పణులు ఈ వృత్తాంతమును తెలిసికొనినవారై, ఈసరమతో మైత్రిని చేసికొనుటకు సంవాదము సలిపిరి.

భావము: లోకములో కోర్టువారు సమనులు జారీ చేసినపుడును, పోష్టలు అధికారులు రిజస్టరీనోటీసులు పంపినపుడును, క్రిమినలు ప్రభువులు జమానులను పంపినపుడును, జప్తులు వగైరాల నిమిత్తము అమీనులు వచ్చినపుడును, అసలు యజమానులకు తెలియకుండ మధ్య వచ్చిన జనులతో మైత్రి చేసికొని, పైన ఉదహరించిన సమనులు వగైరాలు అమలు జరుగకుండ ఆ ప్రతినిధులను త్రిప్పివేయు సంగతి సర్వజనవిదితము. అట్లే, గోవులను వెదకుటకు ఇంద్రునిచే పంపబడిన దేవశునితో మైత్రి చేసికొని, ఇంద్రునకు ఈ గోవృత్తాంతమును ఈ దేవశుని ద్వారా తెలియకుండ నుండుటకై పణులు రాజీమాటలను పై మంత్రములలో ప్రశ్నప్రతివచన రూపముగ సలిపిరి.

## 'కిమిచ్ఛంతీ' అను ప్రథమమంత్రమున కర్థము.

వలాసురుని పట్టణమును గూర్చి వచ్చుచున్న ఆ సరమను చూచి తద్భటులగు పణులు పరస్పరము ఈ క్రిందివిధముగ మాట్లాడుకొనుచుండిరి.

## మాటల వివరములు.

ఈ సరమ ఎందునిమిత్తము మన నివాసస్థానమునకు వచ్చినది? ఈ మార్గము మహాప్రయత్నము చేతగూడ వచ్చుటకు శక్యముకానిది. మరియు, అతిదూరమయినది. వెనుకకు తిరిగి చూడకుండ బహువేగముగ వచ్చుచున్నది. సామాన్యముగ తిరుగుచు, యదృచ్ఛగా ఆ సందర్భములో వచ్చుటకు ఎంతమాత్రము ప్రసక్తి లేదు. కావున, ఈసరమను అడుగుదము.

పణులప్రశ్న: ఓదేవశునీ! మావద్ద నీకేమి అర్థము (వస్తువు, ప్రయోజనము) కలదు? ఎందుల కిచ్చుటకు వచ్చితివి? రాత్రియంతయు ఎట్లు గమనము (భ్రమణము) చేసితివి? నూరామడల వెడల్పు గలిగి మహాధ్వనితో గూడిన ఈ అంతరిక్షనదీజలమును ఎట్లు దాటితివి?

## సరమ జవాబు.

*"ఇంద్రస్య దూతీ రిషితా చరామి మహ ఇచ్ఛంతీ*
*పణయోనిధీ న్వః । అతిష్కదోభియసా తన్న ఆవత్తథా*
*రసాయాఅతరంపయాంసి ।"* (2 మం.)

తా॥ ఓపణులారా! నేను ఇంద్రుని దూతిని. ఇంద్రుడే నన్ను పంపుటచే తిరుగుచు బృహస్పతియొక్క గోసమూహములను మీ పర్వతమందున్న మీ గోశాలలందు వెదకుటకై వచ్చితిని. అమ్మహానదీ జలము, తరణమువలన భయము లేకుండ రక్షించుటచే దాటి వచ్చితిని.

## పణుల ప్రశ్న.

*"కీదృ జ్ఞింద్ర స్సరమే కాదృశీకా యస్యేదం*
*దూతీ రసరః పరాకాత్ । అచగచ్ఛా న్మిత్రమేనా దధా*
*మాథా గవాం గోపతి ర్నో భవాతి ।"* (3 మం.)

తా॥ ఓసరమా! ఏ ఇంద్రునికి దూతవై బహుదూరమునుండి మాస్థానమును గూర్చి వచ్చితివో, అట్టి నీస్వామి యగు ఇంద్రుడు ఎంత పరాక్రమము గలవాడు? అతని సైన్యము ఎంత గలదు?" ఈ విధముగ సరమను గూర్చిపలికి, పణులు పరస్పరము తాము మాట్లాడుకొనుచుండిరి.

## పణుల పరస్పరసంభాషణము.

ఈ సరమ వచ్చుగాక! ఇదికూడ ఈ గోవులకు స్వామి అగుగాక! దీనిని మిత్రునిగ ఇచ్చట ఉంచుకొందము. అనగా, ఈ గోవులలో ఈ సరమకు కూడ భాగము నిచ్చి స్వాధీనము చేసికొందము. వచ్చినను బాధ లేదు.

## సరమ జవాబు.

*'నాహం తం వేద దభ్యం దభత్స యస్యేదం దూతీ*
*రసరం వరాకాత్ । న తం గుహంతి స్రవతోగభీరా హతా*
*ఇంద్రేణ పణయ శ్శయధ్వే ।'* (4. మం.)

తా॥ ఓపణులారా! ఏ ఇంద్రునకు దూతినై నేను బహు దూరమునుండి మీ స్థానమునకు వచ్చితినో, ఆ ఇంద్రుడు ఇతరులను హింసించువాడుకాని, ఇతరులచే హింసింపబడువాడు కాదు. ఏ ఇంద్రుని మహిమచే ఈ పట్టణమునకు కందకముగ యున్న గంభీరములగు ఈ మహానదీజలములను ఆ ఇంద్రదూతి నగు నేను దాటివచ్చి తినో, అట్టి మాస్వామియగు ఇంద్రుని ఈ నదీజలములు ప్రతిబంధించనేరవు. అంతేగాక, అనుకూలించుననుటలో సంశయము లేదు. అట్టి ఇంద్రుని శక్తి సామర్థ్యములచే మీరు హతులై శయనించగలరు.

## పణుల ప్రశ్న.

*'ఇమా గావ స్సరమే యా ఐచ్ఛః పరిదివో అంతాన్*
*త్సుభగే పతంతీ । క స్త ఏనా అవస్సృజాదయుధ్వ్యుతా*
*స్మాక మాయుధా సంతి తిగ్మా ।"* (5. మం.)

తా॥ పణులు క్రోధయుక్తులై ఇట్లు పలికిరి. "సౌభాగ్యవతి యగు ఓసరమా! ఏ గోవులను వెదకవలెనను తలంపుతో స్వర్గప్రాంత ముల నుండి సర్వప్రదేశములను అన్వేషణ చేయుచు వచ్చుచుంటివో, ఆ నీగోవులు నీయెదుట కనుపించుచున్నవి. మాకు తీక్ష్ణములగు ఆయుధములు గలవు. అందుచే మాతో యుద్ధము చేయక యెవ్వడు ఈ గోవులను ఈ పర్వతమునుండి తీసికొని వెళ్ళును?

## సరమ జవాబు.

*'అ సేన్యా వః పణయో వచాం స్యనిషవ్యాస్తన్వ*
*స్సంతు పాపీః । అధృష్టో వ ఏతవా అస్తు పంథా బృహ*
*స్పతి ర్వ ఉభయా నమృళాత్ ।'* (6. మం.)

తా॥ ఓపణులారా!, మీ వాక్యములు సేనార్హములుగావు. మీ శరీరములును బాణార్హములు గావు. (పరాక్రమరహితు లగుటచే మీసేనలు, మీబాణములు నిష్ప్రయోజనములు) మీరు పాపయుక్తులగుటచే పరాజితులు కాగలరు. (యతో ధర్మ స్తతో జయః) మీ దుర్గములచే (కందకములచే) ఈ మార్గము ఇతరులకు వచ్చుటకు అశక్యమైనను, ఇంద్రుడు, బృహస్పతి, అగ్ని, మున్నగు వారు వచ్చి మీ సేనలను, మీ దేహములను బాధించెదరు.

## పణుల వచనము.

*'అయం నిధి స్సరమే అద్రిబుధ్నో గోభి రశ్వేభి*
*ర్వసుభి ర్న్యృష్టః । రక్షంతి తం పణయో యే సు*
*గోపారేకుపదమలక మాజగంథ ।'* (7. మం.)

తా॥ ఓ సరమా! మా సంబంధమగు గవాదుల ఉనికిస్థానము (కోశము) ప్రతిబంధకము లగు పర్వతములచే చుట్టును ఆవృతమై యున్నది. ఆ ప్రదేశము మాచే అపహరించి తీసికొని రాబడిన ఇతరుల గోవులచేతను, అశ్వములచేతను, మాధనములచేతను అత్యంతము వ్యాప్తమై యున్నది. ఆ ప్రదేశమును రక్షణమందు నేర్పరులగు 'పణులు' అను అసురులు

పాలించుచుండిరి. గోవులచే హంభారవములు చేయబడుచుండెడిది ఆ స్థానము. దానిని మేము పరిపాలించుచుంటిమి. నీవు వ్యర్థముగ ఇచ్చటకు వచ్చితివి.

*'ఏహగమ న్నృషయః సోమశివా అయాస్యో అంగి*
*రసో నవగ్వాః । త ఏత మూర్వం విభజంత గోనా మథైత*
*ద్వచః పణయో విమన్నిత్ ।'* (8. మం.)

తా॥ ఓపణులారా! సోమపానముచే మత్తులైన నవగ్వులు దశగ్వులు (అనగా, 9 నెలలు, 10 నెలలు, సత్రయాగానుష్ఠానము గావించినవారు) అయిన అంగిరస్సులలో మొదటి వాడగు ఆయాస్యుడును, మిగిలిన వారందరును ఇచ్చటకు వచ్చి, ఈ గోబృందము లోని వారి గోవులను వారే విభజించుకొనెదరు. అనంతరము ఓపణులారా! పూర్వము మీరు పలికిన వాక్యమును (అనగా. 'ఓసరమా! ఈ గోవులను మేము పాలించుచుంటిమి. నీవు వ్యర్థముగ ఇచ్చటకు వచ్చితివి అనుదానిని) మీరే ఉపసంహరించుకొనెదరు గాక!

## పణుల ప్రణయవాక్యము.

*"ఏవాచ త్వం సరమ ఆజగంథ ప్రబాధితా సహసా*
*దై వ్యేన । స్వసారం త్వా కృణవై మా పునర్గా అపతే*
*గవాం సుభగే భజామ ।"* (9. మం.)

తా॥ ఓసరమా! నీవు వలపురమును గూర్చి పోయి, అచ్చట నున్న గోవులను చూచివచ్చి మాకు చెప్పుము' అని దేవసైన్యముచే అత్యంతము పీడితురాలవై ఇచ్చటకు వచ్చినచో, ఇంద్రాదులను గూర్చి నీవు తిరిగి వెళ్ళకుము. నిన్ను మాకు సహోదరినిగా చేసికొనెదము. మీ సంబంధమగు గోసమూహమును పర్వతమునుండి ఈవలకు రప్పించి మనము (నీవు, మేము) విభాగమును చేసికొందము.

## సరమ జవాబు.

*"నాహం వేద భ్రాతృత్వం నో స్వసృత్వ మింద్రో*
*విదు రంగిరసశ్చఘోరాః । గోకామా మే అచ్ఛదయ*
*న్యదాయ మపాత ఇత పణయో వరీయః ।"* (10. మం.)

*"దూర మిత పణయో వరీయ ఉద్గావో యంతు మిన*
*తీర్ ఋతేన । బృహస్పతి ర్యా అవింద న్నిగూళ్హా స్సోమో*
*యావాణ ఋషయశ్చ విప్రాః ।"* (11. మం.)

తా॥ ఓపణులారా! మీ భ్రాతృత్వము, స్వసృత్వము నాకేమియు తెలియదు. శత్రువులకు భయంకరులగు అంగిరస్సులును, ఇంద్రుడును, మీ భ్రాతృత్వస్వసృత్వములను గుర్తెరిగినవారు. నేను ఇచ్చట నుండిపోయి ఇంద్రాదులకు ఈవృత్తాంతమును తెలియజెప్పగనే మీచే అపహృతములైన గోవులను కోరుచుండెడి ఇంద్రాదులు మీస్థానములను ముట్టడించెదరు. (అచ్ఛాదించెదరు). గాన, ఓపణులారా! విస్తీర్ణమగు యీగోబృందమును విడచి, అత్యంత దూరదేశమును గూర్చి వెళ్ళుడు. ఓపణులారా! మీచే అపహృతము లైన గోవులు ద్వారమునకు ఆచ్ఛాదకమగు పర్వతమును తమ సత్యబలముచే బ్రద్దలు చేసికొన్న వగుచు, బయటకు రాగలవు. అథవా, మీచే బాధింపబడుచుండెడి గోవులను, స్తుతి ప్రియుడగు ఇంద్రుని సహాయముచే బృహస్పతి మున్నగువారు పర్వతమునుండి బయటకు తీసికొనివచ్చెదరు. మీచే గుప్తముగ నుంచబడిన గోవులను బృహస్పతి పొందిన పిదప, సోముడు, సోమలతను దంపుటకు సాధనములగు గ్రావలు (రాళ్లు, తదభిమాని దేవతలు), మేధావులగు అంగిరస్సులు, (ఆగోవులను) పొందగలరు.

భావము: "బృహస్పతి తన గోవులను తీసికొనివెళ్ళిన పిదప అంగిరస్సులు మున్నగు మహర్షులు సోమయాగమును నిర్విఘ్నముగ నిర్వర్తించెదరు. మీ భ్రాతృత్వాది మాటలకు నేను లొంగెడిదానను గాను. నేను వెళ్ళి ఈ విషయమును తెలియజెప్పిన వెంటనే ఇంద్రాదులు వచ్చి మిమ్ములను బారద్రోలి గోవులను తీసికొనిపోయి యజ్ఞాదికర్మలను నిర్విఘ్నముగ సలుపుకొనెదరు" అని, గోరక్షకులగు పణులను గూర్చి దేవశుని యగు సరమ సమాధాన మొసంగి ఇంద్రసమీపమునకు జని, గోవృత్తాంతమును తెలియజెప్పెను.

ఈ వృత్తాంతమును తెలిసికొని, వెంటనే ఇంద్రుడు వలాసురుని పట్టణమునకు వచ్చి, వారలను జయించి, ఆ గోవులను తీసికొని వెళ్ళిన గాథ కృష్ణయజుర్వేదములో సంక్షేపముగ వర్ణింపబడినది.

## ఇంద్రుడు బృహస్పతిగోవుల జాడను తెలిసికొనుట.

## కృష్ణయజుర్వేదము.

*"ఇంద్రో వలస్య బిల మపోర్ణోత్సయ ఉత్తమః పశు*
*రాసీ త్తం పృష్ఠం ప్రతి సంగృహ్యోదక్షిదత్తగ్ం సహస్రం*
*పశవోసూదాయన్ త్స ఉన్నతో భవత్ ।"*

తా॥ కృష్ణయజుర్వేదసంహిత రెండవకాండ ప్రథమ ప్రశ్నలో కామ్యపశుకాండ ప్రకరణములో పశుకాముడు చేయవలసిన కర్మప్రకరణములో ఈదిగువ గాథ సంక్షేపముగ సూత్రప్రాయముగ వర్ణింపబడినది.

ఇంద్రుడు దేవశుని యగు సరమవలన గోస్థానమును తెలిసికొనిన వెంటనే వలాసురుని పట్టణమునకు జని, వానిని జయించి, పర్వతరక్షకులగు పణులను బారద్రోలి, గోనిక్షేపస్థానమగు పర్వతము వద్దకు పోయి, ద్వారభూతమగు బిలమునకు ఆచ్ఛాదకమగు పర్వతమును తీసివేసి, ఆ పశువులలో ఉన్నతమగు పశువును పృష్ఠ భాగమున గ్రహించి పర్వతబిలము నుండి బయటకు ఉత్క్షేపము చేసెను (విసరెను). దానిననుసరించి మిగిలిన సహస్రపశువులును బయటకు దానితో వెడలినవి. దీని పూర్వగాథ ఋగ్వేదములో వెనుక చెప్పిన రీతిని విపులముగ వర్ణింపబడినది.

ఫలితము: ఈ విధముగ మూడు వేదములందును దేవలోకములో గూడ క్రిమినలు ప్రభువును, పితృరాజును నగు యముని వద్దను, సివిలుప్రభువును దేవరాజును నగు ఇంద్రునివద్దను, ఉత్తమ జాతికి చెందిన శునకము లున్నట్లును, వాటి సహాయమున నష్టమైన గవాదులను (అన్వేషణ చేయించి) ఇంద్రాదులు ఆ వస్తువులను స్వీకరించినట్లును, మంత్రములచే చెప్పబడినది. దీనిని బట్టి, ప్రభువుల వద్ద రక్షణ వగైరాల నిమిత్తము శునకములు సృష్ట్యాదినుండియు నుండెడి వనియు, వాటివలన అన్ని కాలములలోను ప్రభువులు తమ రాజ్యరక్షణము చేయుచుండెడివారనియు స్పష్టమగుచున్నది. వర్తమానకాలములో గూడ ప్రభువులు అట్టి ఉత్తమజాతి కుక్కలచే నష్టద్రవ్యాన్వేషణాదికమును చేయించుచు ప్రజాపాలనమును గావించుట మనము చూచుచునేయుంటిమి.

## కుక్కల గృహరక్షణము.

ఇంతవరకు నష్టద్రవ్యాన్వేషణ కుపయోగించెడి కుక్కలను గూర్చిన వృత్తాంతమును బోధించెడి మంత్రములను ఉదహరించడమైనది. ఈ పైన గృహరక్షకము లగు కుక్కలను గూర్చిన వృత్తాంతమును బోధించెడి నాల్గు మంత్రములీక్రింద చెప్పబడుచున్నవి.

## మొదటి మంత్రము.

*"య దర్జునసారమేయ దతః పిశంగ యచ్ఛ సే ।*
*వీవభ్రాజంత ఋష్టయ ఉపస్రక్వేషు బప్సతో నిషు*
*స్వప ।"* *(ఋగ్వేద.భా. 5. అష్టకం. 4. అధ్యా. 22. సూ. పే. 114)*

తా॥ శ్వేతవర్ణమైనట్టియు, సరమ యను దేవశునియొక్క వంశమందు బుట్టినట్టియు కొన్ని అంగములందు పింగలవర్ణ మైనట్టియు, ఓశునకమా! నీవు మమ్ములను కరచుటక (దంశనము చేసే కొరకు) దంతములను ఎప్పుడు వివరించుచుంటివో, (వివృణోషి అప్పుడు నీదంతములు ఆయుధములవలె విశేషముగ భాసించుచున్నవి. మా సమీపమంద

భక్షణమును చేయుచున్న నీదంతములు ఓష్ఠప్రదేశ విశేషములందు (స్రక్వశబ్దః ఓష్ఠప్రదేశ విశేషవాచీ) ప్రకాశించు చున్నవి. అట్టి నీవు ఇప్పుడు సుఖముగ నిద్రించుము.

భావము. పూర్వము వసిష్ఠ డనువాడు ఒకనాడు రాత్రి వరుణుని ఇంటికి అన్నార్థియై వెడలెను. అప్పుడు వరుణుని గృహమును రక్షించెడి కుక్క వశిష్ఠుని చూచి, మొరుగుచు కరచుటకు దగ్గరకు వచ్చెను. అంతట వసిష్ఠుడు దాని నుద్దేశించి ఈపైన చెప్పిన రీతిని బల్కెను. దానినిబట్టి దేవతలగృహములందు కుక్కలను రక్షణార్థమై యుంచినట్లు స్పష్ట మగుచున్నది.

ఈ క్రింది మూడు మంత్రములను కూడ వసిష్ఠుడు ఉచ్చరించెను.

## రెండవ మంత్రము.

'స్తేనం రాయ సారమేయ తస్కరం వా పునస్సర ।
స్తోతౄ నింద్రస్య రాయసి కి మస్మాన్ దుచ్ఛు
నాయ సే నిషుస్వప ।' (ఋ.సం. 5. అష్టకం 4. అ. 22. సూ.)

తా॥ పురస్సర మనగా వెళ్లిన దేశమును గూర్చి తిరిగి వెళ్ళెడిది. అట్టి ఓశునకమా! నీవు రహస్యముగ దొంగిలించెడి దొంగలను గూర్చియు (గుప్తచోరులను గూర్చియు), ప్రకటముగ ధనములను అపహరించునట్టి దొంగలను (ప్రకటచోరులను) గూర్చియు వెళ్లుము. ఇంద్రుని స్తుతి చేయు మమ్ములను బాధించకుండ దొంగలను గూర్చి వెళ్లి వాళ్లను బాధింపుమని తాత్పర్యము). నీవు సుఖముగ నిద్రించుము.

## మూడవ మంత్రము.

'త్వం సూకరస్య దర్దృహి తవ దర్దర్తు సూకరః ।
స్తోతౄ నింద్రస్య రాయసి కి మస్మాన్ దుచ్ఛునా
యసే నిషుస్వప ।' (ఋగ్వే. సం. 5. అష్టకం. 22. సూ.)

తా॥ ఓశునకమా!, వరాహమునకును నీకును నిత్యవిరోధము గావున, నీవు వరాహమును విదారణమును చేయుము (కరువుము). వరాహము నిన్ను విదారణమును చేయుగాక. మమ్ములను మాత్రము కరువకుము. ఇంద్రుని స్తుతించు మమ్ములను బాధించకుము. నీవు సుఖముగ నిద్రించుము.

## నాల్గవ మంత్రము.

"సస్తు మాతా సస్తు పితా సస్తు శ్వా సస్తు విశ్పతిః ।
ససంతు సర్వే జ్ఞాతయః సస్త్వయ మభితో జనః ॥'

(ఋగ్వే. సం. 5. అష్టకం 4 అధ్యా. 22. సూ.)

తా॥ ఓ శునకమా! నీతల్లి సుఖముగ నిద్రించుగాక. నీతండ్రియు, నీ అల్లుడును, ప్రజలకు పాలకుడగు నీయజమానుడును, అందరు బంధువులను, జ్ఞాతులును, నీవును సుఖముగ నిద్రింతురుగాక. ఇంతేగాక, చుట్టుప్రక్కల నున్న ఈ సర్వజనము కూడ సుఖముగ నిద్రించుగాక!

ఈ విధముగ దేవలోకములో దేవతల ఇండ్లయందు గృహరక్షణ కొరకు శునకము లున్నట్లు ఈ మంత్రములు స్పష్టముగ వక్కాణించుచున్నవి.





శ్రీ మహాగణాధిపతయే నమః ।

# వేదసార రత్నావళి

## ౧౭. సువర్ణోత్పత్తి.

"అపో వరుణస్య పత్నయ ఆసన్ । తా అగ్ని
రభ్యధ్యాయత్ । తా స్సమభవత్ । తస్య రేతః వరా
పతత్ । త ద్ధిరణ్య మభవత్ । యద్ధిరణ్య ముపాస్యతి ।
స రేతస మేవాగ్ని మాధత్తే " (కృ. య. బ్రా. 1. కాం. 1. ప్ర. 3. అను. )

### ఉపోద్ఘాతము

ఆధాన మను శ్రౌతకర్మలో గార్హపత్యము, అహవనీయము, దక్షిణాగ్ని అను త్రేతాగ్నులను (3 అగ్నులను) ఉంచెడి స్థానమందు సప్తసంఖ్యాకము లగు పార్థివసంభారములను, సప్తవానస్పత్యసంభారములను ఉంచి, వాటిపై (అనగా, ఆ ఉభయ సంభారముల మీద) అగ్నుల నుంచవలెను.

### ఏడు పార్థివసంభారములు

ఇసుక, చవుడుమన్ను, ఎలుక త్రవ్విన మన్ను, పుట్టమన్ను,ఎన్నడును శోషించని జలప్రదేశమందలి బురదమన్ను, వరాహముచే త్రొక్కబడిన మన్ను, సువర్ణము, ఈ యేడును పార్థివసంభారములు.

### ఏడు వానస్పత్యసంభారములు

రావి, మేడి, మోదుగ, జమ్మి, కాంద్రేగు, పిడుగుపడిన చెట్టుయొక్క శకలము (ముక్క), తామరాకు ఈ యేడును వానస్పత్యసంభారములు.

ప్రకృతములో సువర్ణముపై సంభారములలో పడుటచే దాని ఉత్పత్తిని పై శ్రుతి వివరించుచున్నది.

శ్రుతి తా. పూర్వము అగ్ని వరుణపత్నులగు అబ్దేవతలను కామించెను. అప్పుడు అగ్నియొక్క రేతస్సు వ్యగ్రతచే (తొందరచే) భూమియందు పడి సువర్ణమాయెను. ఈ విధముగ సువర్ణము అగ్నిరేతస్సు గావున, సువర్ణమందు అగ్నిని ఉంచినచో, రేతోయుక్తుడగు అగ్నిని స్థాపించినవాడగును.

## హిరణ్యశుద్ధి.

పై విధముగ హిరణ్యమునకు అగ్ని తండ్రి, ఉదకములు తల్లి గావున, హిరణ్యము స్వతః పరిశుద్ధమైనది. అట్టి హిరణ్యమును రజస్వలాదిస్పర్శచే అపవిత్రమైనపుడు ఉదకములచేతనే శుద్ధి చేయవలెను. ఈ విషయములో –

'త ద్ధిరణ్య మభవ త్తస్మా దద్భ్యో హిరణ్యం పునంతి' (కృ.య.సం. 6.కాం. 1.ప్ర. 7.అను.)

'భస్మనా శుద్ధ్యతే కాంస్యం, తామ్ర మామ్లేన శుధ్యతి' అను స్మృత్యనుసారము కంచుపాత్రకు భస్మచే శుద్ధి ఎట్లు సంభవించునో, రాగిపాత్రకు చింతపండుచే శుద్ధి ఎట్లగునో, అట్లే సువర్ణముకు ఉదకముచేతనే శుద్ధియగును. కావుననే లోకములో రజస్వలాస్త్రీలు ధరించిన సువర్ణాలంకారములను రాత్రులందు ఇంటిలో భద్రపరచవలసినపుడు ఆభరణములపై ఉదకములను ప్రోక్షించి శుద్ధి చేసెడి ఆచారము శిష్టసంప్రదాయముగా వచ్చుచున్నది. (తిరిగి, ప్రసంగ సంగత్యా 1,2 విధముల సువర్ణోత్పత్తి ముందు చెప్పబడును.)

## సువర్ణదానము పవిత్రతాసంపాదకము.

*"వైశ్వానరం ద్వాదశకపాలం నిర్వపే ద్వారుణం*
*చరుం దధిక్రావ్ణ్ణే చరు మభిశస్యమానో య ద్వైశ్వా*
*నరో ద్వాదశకపాలో భవతి సంవత్సరో వా అగ్ని*
*ర్వైశ్వానర స్సంవత్సరే ణై వైనగ్గ్ం స్వదయ త్యపపాపం*
*వర్ణం హతే వారుణేనై వైనం వరుణ పాశా న్ముంచతి*
*దధిక్రావ్ణ్ణా పునాతి హిరణ్యం దక్షిణా పవిత్రం వై*
*హిరణ్యం పునాత్యేవైన మాద్య మస్యా___న్నం భవతి ।"*

*(కృ.య.సం. 2.కాం. 2.ప్ర. 5.అను.)*

తా॥ లోకములో మహాపాతకములను చేయుటచే దూషింపబడియెడి పురుషుడు (అనగా వెలివేయబడినవాడు) ఆదోషనివృత్తి ద్వారా పరిశుద్ధుడగుటకు వైశ్వానరపురోడాశము, వారుణచరువు, దధి క్రావదేవతకు చరువు (అన్నము) ఈమూడు హవిస్సులు కల ఇష్టిని చేయవలెను.

ప్రథమహవిస్సులో వైశ్వానరశబ్దమునకు సంవత్సరాభిమాని దేవత యగు అగ్నివిశేష మర్థము. తద్దేవతాక మగు పురోడాశముచే ఆ వైశ్వానరాగ్నిదేవత ఈపాతకిని (అనగా, పాతకి, యగు తనను) ఇతరులచే ఆరోపింపబడిన పాపమును నశింపజేసి, బంధువులకు రుచింపజేయును.

ప్రథమహవిస్సులో వైశ్వానరశబ్దమునకు సంవత్సరాభిమాని దేవత యగు అగ్నివిశేష మర్థము. తద్దేవతాక మగు పురోడాశముచే ఆ వైశ్వానరాగ్నిదేవత ఈపాతకిని (అనగా, పాతకి, యగు తనను) ఇతరులచే ఆరోపింపబడిన పాపమును నశింపజేసి, బంధువులకు రుచింపజేయును.

వారుణయాగము (రెండవహవిస్సు)చే పాపులను పాశముచే బంధించి తీసికొనివెడలుటకు వరుణునిచే ప్రసరింపజేయబడిన వరుణ పాశము నుండి ఈ పాతకి తన ఆత్మను విముక్తిని చేసికొనును (విడిపించుకొనును).

మూడవ హవిర్దేవత యగు దధిక్రావనామకు డగు దేవునిచే ఈపాతకి తన ఆత్మను పవిత్రమైనదానినిగ చేసికొనును. ఈ ఇష్టిలో హిరణ్యమును యాగదక్షిణగ నియ్యవలెనని శ్రుతి విధించుచున్నది. ఇతరద్రవ్యములనీయక, హిరణ్యమునే యాగదక్షిణగ నిచ్చుటకు కారణము నీక్రింది విధముగ పై శ్రుతి వక్కాణించుచున్నది.

హిరణ్యము పవిత్రమైన వస్తువు. అనగా, దాతను శుద్ధునిగను, పవిత్రునిగను చేయు వస్తువు. ఇంతేగాక, హిరణ్యదానముచే ఇతనికి మృదువగు అన్నము లభించును. మరియు, ఇంతకు పూర్వము పాపి యగుటచే (అనగా వెలివేయబడినవాడగుటచే) ఇతని అన్నమును శిష్టులు భుజించుట లేదు. ఇప్పుడన్ననో, ఈ కర్మలో హిరణ్యదానముచే ఇతడు పవిత్రుడయ్యెను గాన, ఇతని అన్నము శిష్టులచే భుజించుటకు యోగ్యమగును.

దీనివలన సువర్ణదానము పవిత్రతను, మృద్వన్నమును సంపాదించునని స్పష్టమగుచున్నది.

## సువర్ణదానము - మరియొక మంత్రము.

*వైశ్వానరం ద్వాదశకపాలం నిర్వపతి హిరణ్యం*
*దక్షిణా ।' (ధాత్రేపురోడాశంలో)* (కృ.య.సం. 1-8-0)

*'బహువై పురుషో_మేధ్యముపగచ్ఛతి । వై శ్వానరం*
*ద్వాదశకపాలం నిర్వపతి । సంవత్సరో వాఅగ్నిర్వైశ్వా*
*నరః । సంవత్సరే ణైవైనగ్గ్ స్వదయతి । హిరణ్యం*
*దక్షిణా । పవిత్రం వై హిరణ్యం । పునాత్యే వైనం ।'* (కృ. య.బ్రా. 1-7-2).

తా॥ లోకములో పురుషుడు అనేక విధములగు అశుచిత్వమును పొందును. అందుచే అభోజ్యమైన అన్నము కలవాడగును. వైశ్వానర పురోడాశము చేయుటచే సంవత్సరస్వామి యగు వైశ్వానరాగ్ని ఇతనిని పవిత్రునిగ చేయును. దానివలన భోజ్యమైన అన్నము కలవాడగును.

ఈ కర్మలో హిరణ్యమును దక్షిణగ నీయవలెను. హిరణ్యము పవిత్రమైన దగుటచే అపవిత్రుడగు యజమానిని పవిత్రునిగ చేయును. ఈ శ్రుతి హిరణ్యదానమునకు పవిత్రతా హేతుత్వమును బోధించుచున్నది.

## సువర్ణము మృత్యునివారకము.

రాజసూయాంతర్గతమగు అభిషేచనీయ మను సోమయాగములో మహారాజుకు అభిషేకము చేసెదరు. ఆ అభిషేకనిమిత్తమై అర్థేత స్థేత్యాది మంత్రములచే సరస్వతీనది, సముద్రము మున్నగు వాటి జలములను పదునారు లేక పదునేడు పర్యాయములచే (రోళ్లవంటి చిన్నదారుపాత్రలచే) అగ్నీధ్రమను శాలయందు గ్రహించవలెను.

అనంతరము వేతసవృక్షముచే చేయబడిన గుండ్రమగు ద్రోణ కలశ మను పేరు గల దారుమయ మగు తొట్టెలో అవాయవ్య పాత్రల లోని ఉదకములను పోయుట మున్నగు సంస్కారము లన్నియు మంత్రములచే చేయవలెను. పిదప, శతమాన మగు (నూరు గురివెంద గింజల యెత్తు ప్రమాణము) గల హిరణ్యమును ఆ ఉదకములందు ఈ క్రింది మంత్రముచే నుంచి, ఉత్పవనముచేయవలెను. హిరణ్యగత మగు శత సంఖ్యచే పురుషుడు సంపూర్ణాయుస్సు నందును ఇంద్రియములందును ప్రతిష్ఠితుడగును.

## హిరణ్యవంతుని మాట.

*'అని భృష్టమసి వాచో బంధు స్తపోజా స్సోమస్య దాత్ర మసి'* (కృ.య.సం. 1.8.12.)

*"అనిభృష్టమసీత్యాహ । అనిభృష్టగ్గ్ హ్యేతత్ । వాచో*
*బంధు రిత్యాహ । వాచో హ్యేష బంధుః । తపోజా ఇత్యా*
*హ । తపోజా హేతత్ । సోమస్య దాత్రమసీత్యాహ ।*
*సోమస్య హ్యేత ద్దాత్రం ।"* (కృ.య.బ్రా. 1.7.6.)

తా॥ ఓహిరణ్యమా! నీవు యవాది ధాన్యమువలె అగ్ని సంయోగ మున్నను పక్వ మగుదానవు కావు. వాక్కుకు బంధువైన దానవు. ధన ముండుటచే రాజులు, మంత్రులు మున్నగువారి వాక్కును అందరును ఆదరించెదరు. (హిరణ్యవత్తయా హి రాజా మాత్యాదీనాం వా క్సర్వై రాద్రియతే వి. భా.) సువర్ణము వాక్కుకు బంధు వను విషయము అనుభవసిద్ధమే.

సంతాపయుక్తుడగు వహ్నియక్కొరేతోరూపుడవు. "హిరణ్యేన క్రీణాతి" అను శ్రుత్యనుసారము సువర్ణముచే సోమలతను కొనెదరు. కావున, ఓ హిరణ్యమా! నీవు సోమలతను కొనుటకు సాధనమైన దానవు.

## హిరణ్యముచే ఉత్పవనము.

కర్మలలో హోమము చేసెడి ఆజ్యమును దర్భపవిత్రములచే ఉత్పవనము చేసెదరు. ఇచ్చట రాజసూయాంతర్గత మగు రాజాభిషేకము చేసెడి ఉదకములను లోకవిలక్షణముగ హిరణ్యముచే ఉత్పవనమును శ్రుతి విధించుచున్నది.

*"హిరణ్యే నోత్పునాతి । అహుత్యై హి పవిత్రాభ్యా*
*ముత్పనంతి వ్యావృత్త్యై । శతమానం భవతి । శతా*
*యుః పురుష శ్శతేంద్రియః ఆయుష్యేవేంద్రియే*
*ప్రతితిష్ఠతి ।"* (కృ.య.బ్రా. 1-7-6.)

తా॥ పరిమండలద్రోణకలశయందు సరస్వత్యాది నదీజలముల నుంచి శతమానప్రమాణ మగు హిరణ్యముచే ఉత్పవనము చేసి ఆ ఉదకములచే మహారాజును అభిషేకము చేసినచో, సంపూర్ణమగు ఆయుస్సు నందును, ఇంద్రియసామర్థ్యమందును మహారాజు స్థాపించబడిన వాడగును.

ఈ విధముగ అంగకలాపమును జెప్పి, అనంతరము సదస్సు అను శాలయందు 'ప్రశాస్తృధిష్ణియ' అను స్థానమునకు అగ్రభాగమందు చంద్రకఱ్ఱతోగాని, మేడికఱ్ఱతోగాని తయారుచేసి కుర్చీని ఉంచి, 'సోమస్య త్విషి రసి' అను మంత్రముచే వ్యాఘ్ర చర్మను తూర్పు శిరంబుగాను, లోమములు పై భాగమున కుండునట్లును ఆ కుర్చీమీద పరువవలెను. దీని సూత్రము -

"అగ్రేణ ప్రశాస్తు ర్ధిష్ణియం ఖాదిరీ మౌదుంబరీంవా౽౽
సందీం ప్రతిష్ఠాప్య సోమస్య త్విషి రసి ఇతి తస్యాం శార్దూల
చర్మ ప్రాచీనగ్రీవ ముత్తరలోమా౽౽స్తీర్య ।" (ఆ.శ్రౌ.సూ.)

అనంతరము ఆ కుర్చీమీద పరచిన వ్యాఘ్రచర్మయందు హిరణ్యస్థాపనమును అహిరణ్యప్రమాణమును ఈ క్రింది శ్రుతి సూత్రములు బోధించుచున్నవి.

'అమృతమసి మృత్యోర్మా పాహి' (కృ.య.సం. 1.కాం. 8.ప్ర. 14.అను.)

'అమృతమసీతి తస్మిన్ శతమానగ్ం హిరణ్యం నిధాయ ।' (ఆ.శ్రౌ.సూ.)

ఈ మంత్రముచే పై వ్యాఘ్రచర్మయందు శతమానహిరణ్యము నుంచవలెను.

తా॥ ఓహిరణ్యమా! నీవు యవాదిధాన్యములవలె అగ్ని సంపర్కమందుకూడ నాశము లేనిదాన వగుటచే అమృతమైతివి. (మరణ రహితమైనదానవైతివి. గాన మృత్యువు యొక్క దేహస్వరూపమగు ఈ వ్యాఘ్రచర్మనుండి నన్ను రక్షింపుము. ఈ విషయములో దిగువ శ్రుతి ప్రమాణము.

'మృత్యో ర్వా ఏష వర్ణః । య చ్ఛార్దూలః । అమృ
తగ్ం హిరణ్యం । అమృత మసి మృత్యో ర్మా పాహీతి
హిరణ్య ముపాస్యతి । అమృత మేవ మృత్యో రంతర్ధత్తే ।
శతమానం భవతి । శతాయుః పురుష శ్శతేంద్రియః ।
ఆయు ష్యేవేంద్రియే ప్రతితిష్ఠతి ।' (కృ. య. బ్రా. 1. కాం. 7. ప్ర. 8. అను)

తా॥ ఇట్లు కుర్చీమీద వ్యాఘ్రచర్మను పరచి, దానిపై శతమాన ప్రమాణము గల సువర్ణరుక్మము నుంచి, దానిపై మహారాజును కూర్చుండబెట్టవలెను. (ఇట్లు చేయుటచే మృత్యురూపమగు వ్యాఘ్ర చర్మకును మహారాజుకును మధ్య అమృతరూపమగు శతమానహిరణ్యము నుండుటచే మృత్యువు నుండి యజమానుని రక్షించినవాడగును.) పురుషుని దశేంద్రియములకు దశనాడులయ్యుదును సంచారముచే పురుషుడు శతేంద్రియుడు. ఉత్పత్తికాలమందు ప్రతిపురుషునకును శతాయుస్సు నియతము. వాని పుణ్యాపాపకర్మలచే అది న్యూనము, అధికము అగుచుండును.

పై హిరణ్యరుక్మము (నూరు గులివెందగింజల యెత్తు) శతమాన ప్రమాణ మగుటచే పురుషుడు గూడ శతాయువు, శతేంద్రియుడు గావున ఈ ప్రమాణముచే సంపూర్ణమైన ఆయుస్సు, ఇంద్రియసామర్థ్యము యజమానికి సంభవించును.

అనంతరము ఆ కుర్చీమీద కూర్చుండిన మహారాజుయొక్క శిరంబున సువర్ణవికార మగు శతచ్ఛిద్రపాత్రను ఉంచవలసినదిగ ఈ దిగువ శ్రుతి, సూత్రములు బోధించుచున్నవి.

"దిద్యో న్మా పాహి ।" (కృ. య. సం. 1. కాం. 8. ప్ర. 14. అను.)

దిద్యోన్మా పాహీతి సౌవర్ణేన శతమానేన శతక్షరేణ శతకృష్ణ
లేన యజమానస్య శీర్ష న్నధినిధత్తే ।" (ఆ. శ్రౌ. సూ.)

తా॥ ప్రకాశమానమైనట్టియు, (అభిషేకజల సేచనకొరకు) శిరస్సునం దుంచబడినట్టియు, నూరు రంధ్రములు కలిగినట్టియు ఓ సువర్ణపాత్రా! నన్ను రక్షింపుము.

"దిదో న్మా పాహీ త్యుపరిష్టా దధి నిదధాతి । ఉభ
యత ఏవాస్మై శర్మ దధాతి ।" (కృ. య. బ్రా. 1. కాం. 7. ప్ర. 8. అను.)

ఈ మంత్రముచే సువర్ణపాత్రను మహారాజు శిరస్సుమీద నుంచవలెను. ఈ విధముగ యజమానికి శిరస్సునందును, వృష్ఠభాగమందును అమృతరూప మగు సువర్ణ ముండుటచే మహారాజుకు సుఖము సంభవించును.

ఇట్లు రాజసూయాది మహాక్రతువులలో వినియోగద్వారా సువర్ణము అపమృత్యునివారకము, సుఖసంధాయకము అని శ్రుతులు ప్రశంసించుచున్నవి. కావుననే వివాహములందు సువర్ణ మంగళ సూత్రము (శతమానము) అపమృత్యునివారణ ద్వారా సుఖసంధానము కొరకు ధరించుట ఆచారప్రాప్త మగుచున్నది.

## హిరణ్యము అపమృత్యునివారకము.

*"దేవావైమృత్యో రభిభయు స్తే ప్రజాపతి ముపాధా*
*నన్ తేభ్య ఏతాం ప్రాజాపత్యాగ్ం శతకృష్ణలాం నిరవస*
*త్తయై వై ష్వమృత మదధా ద్యో మృత్యో ర్బిభీయా*
*త్తస్మా ఏతాం ప్రజాపత్యాగ్ం శతకృష్ణలాం నిర్వపే*
*త్ప్రజాపతి మేవ స్వేన భాగధేయే నోపధావతి స ఏవా*
*స్మిన్నాయు ర్దధాతి సర్వ మాయు రేతి శతకృష్ణలా*
*భవతి శతాయుః పురుష శ్శతేంద్రియ ఆయుష్యే*
*వేంద్రియే ప్రతితిష్ఠతి ।"* (కృ. య. సం. 2. కాం. 3. ప్ర. 2. అను.)

తా॥ పూర్వము దేవతలు అపమృత్యువునుండి బీతి జెంది తత్పరిహారోపాయముకొరకు ప్రజాపతి వద్దకు జనిరి. అప్పుడు ప్రజాపతి శతసంఖ్యాక మగు కృష్ణల సమిష్టిని ప్రజాపతికొరకు నిర్వాపము చేసెను. అనగా, మూడు యవగింజల యెత్తు పరిమాణముగల సువర్ణ శకలము (కృష్ణలము) లను అతీత సృష్టిగతుడగు ప్రజాపతి కొరకు నామనిర్దేశపూర్వకముగ పృథక్కరించెను. ఆకృష్ణలసమిష్టిచేతనే దేవతలందు (అపమృత్యు నివారణ రూపమగు) అమృతమును స్థాపన చేసెను.

## పై ఇష్టి విధానము.

*'యో మృత్యో ర్బిభీయా త్త స్మా ఏతాం ప్రాజా*
*పత్యాగ్ం శతకృష్ణలాం నిర్వపే త్ప్రజాపతి మేవ స్వేన*
*భాగధేయే నోపధావతి స ఏవాస్మి న్నాయు ర్దధాతి*
*సర్వ మాయు రేతి ।'* (కృ. య. సం. 2. కాం. 3. ప్ర. 2. అను.)

తా॥ లోకములో అపమృత్యువునుండి భీతి చెందిన అధికారి పురుషునికొరకు పూర్వోక్త మగు ప్రజాపతి దేవతాకమైన శతకృష్ణల సమిష్టిని నిర్వాపము చేయవలెను. ఆ నిర్వాపముచే ప్రజాపతిని స్వకీయ భాగముచే సేవించినవాడగును. అనంతరము ప్రజాపతి ఈయజమాని యందు సంపూర్ణమగు ఆయుస్సును స్థాపన చేయును. అనగా జననకాలమందు ప్రారబ్ధ కర్మవలన సంప్రాప్తమైన ఆయుస్సును అపమృత్యురహితముగ బొందునని తాత్పర్యము.

## కృష్ణలగత శతసంఖ్యా ప్రశంస.

*'శతకృష్ణలా భవతి శతాయుః పురుష శ్శతేంద్రియ*
*అయు ష్యేవేంద్రియే ప్రతితిష్ఠతి'* (కృ. య.సం. 2. కాం. 3. ప్ర. 2. అను.)

తా॥ పురుషునకు ఉత్పత్తి కాలమున సర్వసామాన్యముగ నూరు సంవత్సరముల ఆయుస్సు ప్రజాపతి ఏర్పరచెను. మానవుని పుణ్య, పాపకర్మల ననుసరించి అది మార్పు (తక్కువగాని, యెక్కువగాని) చెందుచుండును. అందుచే పురుషుడు శతాయుస్సు కలవాడని శ్రుతి బహుస్థలములలో చెప్పుచుండును.

అట్లే పురుషునకు పది ఇంద్రియములు దశనాడులయందు సంచరించుటచే (అనగా, ఒక్కొక్క ఇంద్రియము పదినాడులయందు సంచరించుటచే) శతేంద్రియు డని శ్రుతి చెప్పుచుండును. పైవిధముగ పురుషుడు శతాయస్సు కలవాడు, శతేంద్రియములు కలవాడు గాన ప్రకృతయాగములో కృష్ణలశకలములు శతసంఖ్యగలవిగాన, శతసంఖ్యాసామ్యముచే సంపూర్ణమైన ఆయుస్సు, ఇంద్రియసామర్థ్యము కలవాడగును.

ప్రకృతములో ప్రధానహవిస్సు సువర్ణ శకలములు గావున, హవిర్గతమగు సువర్ణముచే అపమృత్యునివారణను జెప్పుచు, శకలగతమగు శతసంఖ్యవలన శతాయుస్సు, శతేంద్రియములక్కు స్థైర్యమును శ్రుతి బోధించుచున్నది.

## సువర్ణశకలరూపపాకద్రవ్యము.

*"ఘృతే భవ త్యాయు ర్వై ఘృత మమృతగ్ంహిరణ్యా*
*మాయు శ్చైవా__స్మా అమృతం చ సమీచీ దధాతి ।"*

(కృ. య.సం. 2. కాం. 3. ప్ర. 2. అను)

యాగములలో చరువు అనగా అత్తెసరు అన్నము అర్థము. ఈ క్రతువులో ప్రధానహవిస్సు అగు సువర్ణ శకలములను ఘృతద్రవ్యముతో పక్వము చేయవలెను. ఇచ్చట సువర్ణశకలములకు శ్రపణ మాత్రమే పాకము. ఘృతముతో చేయుటకు కారణమేమన, 'ఆయుర్దా అగ్నే' అను మంత్రములో ఘృతప్రియుడగు అగ్ని ఆయుష్ప్రదుడు గాన ఘృతము ఆయుస్స్వరూపము.

లేక, ఘృతజన్యమగు బలముచే ఇంద్రియములు దేహమందు దృఢముగ బద్ధము లగుటచే ప్రాణములకు నిర్గమనము లేకపోవుట వలన ఆయుస్సు సంభవించునుగాన, ఘృతము ఈవిధముగ ఆయుస్సుకు హేతువు. అందుచే ఆయుస్స్వరూపము. హిరణ్యము అపమృత్యునివారకము గాన, అమృతస్వరూపము. ఈ విధముగ ఆయుస్స్వరూపమగు ఘృతమందు అమృతస్వరూపమగు హిరణ్యమును పాకము చేయుటచే ఈ ఘృతహిరణ్యములు రెండును మృత్యుపరిహారముకు అనుకూలములగును.

## అవదానపరిమాణము.

"చత్వారిచత్వారి కృష్ణలా న్యవద్యతి చతురవత్త
స్యాప్త్యై ।" (కృ. య. సం. 2. కాం. 3. ప్ర. 2. అను.)

తా॥ ఇతరయాగములలో పురోడాశమునుంచిగాని, చరువు (అన్నము) నుంచిగాని హోమము చేయుటకు రెండుసార్లు అంగుష్ఠ పర్వమాత్రము హవిస్సును స్రుక్కునందు అవదానము చేయవలెను. చరుపురోడాశాదులనుంచి ఖండించి స్రుక్కుయందుంచవలెను. అనగా, ఉపస్తరణము, ప్రధానహవిస్సును రెండుసార్లు అవదానము, అనంతరము అభిఘారణము, ఈవిధముగ నాలుగుసార్లు గ్రహించి హోమము చేయవలెను.

ప్రకృతయాగములో సువర్ణశకలములు చరువుగాన, నాలుగు కృష్ణలముల నొకసారియు మొత్తము యెనిమిది కృష్ణలములను పై విధముగ రెండుసార్లు స్రుక్కునందు అవదానము చేయవలెను.

వికృతీష్టులకు ప్రకృతి భూతమగు దర్శపూర్ణమాసాదులలో "చతురవత్తం జుహోతి" అను శాస్త్రానుసారము స్రుక్కునందు ఒకసారి ఆజ్యముచే ఉపస్తరణము, రెండుసార్లు ప్రధానహవిస్సును స్రుక్కుయందు గ్రహించుట (అవదానము), ఒకసారి అభిఘారణము మొత్తము నాలుగుసార్లు గ్రహణమైనది గావున, చతురవత్త సంపత్తి యగును. ఈ యాగములోనో కృష్ణలగత మగు చతుస్సంఖ్యచే నాలుగు కృష్ణలములను అవదానము చేయుటచే చతురవత్త సంపత్తి (అనగా, చతుస్సంఖ్యావదానము) సిద్ధించును.

"తాన ద్రవ త్యాజ్య ఆవపతి ధర్మమాత్రం శ్రపణం ।
ప్రచరణకాలే అష్టౌ దేవతాయా అవద్యతి చత్వారి స్విష్టకృతి
ద్వే ప్రాశిత్రే_ష్టా విడాయాం చతుర్థాకరణకాలే సర్వాణి
ప్రాశిత్రే సమోప్య ఏకధా బ్రహ్మణ ఉపహరతి తాని బ్రహ్మా
భక్షయతి భక్షా_పనయ ఇతరేషాం ।" (ఆ. శ్రౌ. సూ.)

తా॥ గార్హపత్యమను అగ్నియందు నూతనపాత్రను ఉంచి దానియందు దర్భపవిత్రము నుంచి దానిలో అజ్యమును పోసి దాని యందు కృష్ణలముల నుంచి, ధర్మమాత్రము శ్రపణము గావించి, ఎనిమిది కృష్ణలములు ప్రధానదేవతకును, నాలుగు కృష్ణలములు స్విష్ట కృత్తుకును, ఎనిమిది కృష్ణలములు ఇడకును, నాలుగు కృష్ణలములవాంతరేడకు మున్నగు విధముగ వినియోగించి మిగిలిన కృష్ణలములను చతుర్ధాకరణకాలమందు ప్రాశిత్రమను పాత్ర (అవుచెవివలె నుండెడి చంద్రకక్రపాత్ర) యందుంచి, బ్రహ్మ అను ఋత్విక్కున కివ్వవలెను. ఈ విషయమునే ఈ క్రింది శ్రుతి బోధించుచున్నది.

*"ఏకధా బ్రహ్మణ ఉపహరత్యేకధైవ యజమాన ఆయు*
*ర్దధాతి ।"* (కృ. య. సం. 2. కాం. 3. ప్ర. 2. అను.)

తా॥ హోమము చేయగా మిగిలిన హవిస్సును బ్రహ్మ, హోత, అధ్వర్యుడు, అగ్రీధ్రుడు అను నలుగురకు నాల్గు భాగములుగ చేయుట చతుర్ధాకరణము. ప్రకృతిలో దర్శపూర్ణమాసలలో అట్లు చేయుదురు. వికృతిభూత మగు ఈ ఇష్టిలో చతుర్ధాకరణము చేయు కాలమున (పై చతుర్ధాకరణమును చేయక) కృష్ణలముల నన్నిటిని ప్రాశిత్రపాత్రయందుంచి, బ్రహ్మ అను ఋత్విక్కునకే ఇవ్వవలెను. ఈ దానముచే యజమానియందు సర్వా ఽ ఽ యుస్సును ఏకముగ స్థాపించినవాడగును.

ఈ విధముగ శతకృష్ణలయాగమందు సువర్ణము అపమృత్యు నివారకము, అమృతము, అని సువర్ణమహత్వము చెప్పబడినది.

## సువర్ణము సోమునికి ప్రియశరీరము.

*"యస్య సోమ ఉపద స్యేత్ । సువర్ణగ్ం హిరణ్యం*
*ద్వేధా విచ్ఛిద్య । ఋజీషే ఽ న్యదా ధూనుయాత్ ।*
*జుహుయా దన్యత్ । సోమ మేవాభిషుణోతి । సోమం*
*జుహోతి ।* (కృ. య. బ్రా. 1. కాం. 1. ప్ర. 7. అను.)

తా॥ యజ్ఞములో యజమానుని సోమరసము ఉపక్షీణమగుచో సువర్ణశకలమును రెండు సమభాగములుగ ఖండించి ఆ రెండిటిలో ఒక భాగమును (శకలమును) ఋజీషమందు (అనగా, సోమలతను దంపి, రసమును తీసివేసిన పిప్పియందు ఉంచి, ఆ సువర్ణ శకలముతో మిశ్రితమగు ఋజీషమును దంపవలెను. రెండవ సువర్ణ శకలమును ప్రధానచమసయం దుంచి హోమము చేయవలెను.

ఇట్లు సువర్ణశకలములను ఋజీషమందుంచి అభిషవము చేయుటచే సోమలతనే అభిషవము చేసినట్లగును. రెండవసువర్ణశకలమును ప్రధాన చమసయందుంచి హోమము చేయుటచే సోమమునే హోమము చేసినట్లగును. (కాని, సువర్ణ శకలమును అభిషవము

చేసినట్లుగాని, సువర్ణశకలమును హోమము చేసినట్లుగాని కాదు). ఇది ఔపచారికము కాదని రుజువు చేయుటకు కారణమును ఈ శ్రుతి వివరించుచున్నది.

*"సోమస్య వా అభిషూయమాణస్య ప్రియా తనూ*
*రుదక్రామత్ త త్సువర్ణగ్ం హిరణ్య మభవత్ । యత్సు*
*వర్ణగ్ం హిరణ్యం కుర్వన్తి । ప్రియయై వై నం తను వా*
*సమర్ధయంతి ।"* (కృ.య.బ్రా. 1.కాం. 4.ప్ర. 7.అను.)

తా॥ యజ్ఞములో సోమరసమును హోమము చేయవలెను. కాన, సోమలతను అభిషవయను చేయవలెను. (అనగా, దంపవలెను.) అందు నిమిత్తము అభిషవము చేయబడుచున్న సోమునియొక్క ప్రియశరీరము నిర్గతమై సువర్ణరూపముగ నావిర్భవించెను. అందుచే సువర్ణమును ఋజీషమందును, ప్రధానచమసయందును ఉంచినచో, తన ప్రియశరీరముతో సోముని సంధానము చేసినవాడగును.

## ప్రకారాంతరముగ సువర్ణోత్పత్తి.

*"వరుణస్య వా అభిషిచ్యమాన స్యాపః । ఇంద్రియం*
*వీర్యం నిరఘ్నన్ । త త్సువర్ణగ్ం హిరణ్య మభవత్ ।*
*య ద్రుక్మ మంతర్దధాతి । ఇంద్రియస్య వీర్యస్యానిర్ఘా*
*తాయ ।"* (కృ.య.బ్రా. 1.కాం. 8.ప్ర. 9.అను.)

పూర్వము అభిషేకము చేయబడుచుండెడి వరుణునియొక్క చక్షురాదీంద్రియ సామర్థ్యమును ఉదకములు నిర్గమింపజేసినవి. అనగా, సామర్థ్యమును శరీరమునుండి బయటకు నిర్గతమగునట్లు ఉదకములు చేసినవి. నిర్గతమైన వరుణుని ఇంద్రియసామర్థ్యము సువర్ణరూపముగ నావిర్భవించెను. అందువలన రాజాసూయాంతర్గత మగు అభిషేచనీయ మనుసోమయాగములో మహారాజుకు (రాజాభిషేకములో) సువర్ణరుక్మమును శిరస్సున నుంచి అభిషేకము చేయవలెను. అనగా, రాజునకును ఉదకములకును మధ్య సువర్ణరుక్మమును వ్యవధానముగా జేసి అభిషేకము చేయవలెను.

పై విధముగ సువర్ణము వరుణుని సామర్థ్యరూపము గాన సువర్ణవ్యవధానముచే అభిషేకము యజమానుని ఇంద్రియసామర్థ్యము యొక్క అవినాశము కొరకగును.

## రుక్మపరిమాణ సచ్ఛిద్రత్వములు.

*'శతమానో భవతి శతక్షరః । శతాయుః పురుష*
*శ్శంతేద్రియః ఆయుష్యేవేంద్రియే ప్రతితిష్ఠతి ।'* (కృ.య.బ్రా. 1-8-9)

తా॥ అభిషేకకాలమున మహారాజు శిరంబున నుంచెడి సువర్ణ రుక్మము నూరు గుంజాబీజముల యెత్తు (పరిమాణము) గలదియు, శతచ్ఛిద్రములతో నున్నదియు కావలెను.

యజమానుడు శతాయుస్సు గలవాడు, శతేంద్రియుడు గావున రుక్మపరిమాణ, ఛిద్రగతము లగు శతసంఖ్యలచే యజమానుడు సంపూర్ణాయుస్సునందును, ఇంద్రియ సామర్థ్యము నందును ప్రతిష్ఠితుడగును.

*'ఆయు ర్వై హిరణ్యం । ఆయుష్యా ఏవైన*
*మభ్యతిక్షరంతి । తేజో వై హిరణ్యం । తేజస్యా ఏవైన*
*మభ్యతిక్షరంతి । వర్చో వై హిరణ్యం । వర్చస్యా ఏవైన*
*మభ్యతిక్షరంతి ।'* (కృ.య.బ్రా. 1-8-9.)

తా॥ హిరణ్యదానముచే అపమృత్యువును తొలగించుటకు శక్యమగును గావున, హిరణ్యము ఆయుస్స్వరూపము అట్టి హిరణ్య సంబంధమువలన ఆయుస్సంపాదకములగు ఉదకములే ఈ యజమానునిగూర్చి స్రవించుచున్నవి. మరియు సువర్ణము తేజస్స్వరూపము (అనగా దీప్తిగలది) అట్టి సువర్ణసంపర్కమువలన దీప్తి హేతువులగు ఉదకములే ఈయజమానికి అంతటను స్రవించుచున్నవి.

వర్చశ్శబ్దమునకు శరీరశోభ అర్థము. హిరణ్యము శరీరశోభా హేతువు. అనగా సువర్ణధారణముచే శరీరమునకు శోభ అనుభవ సిద్ధము. అట్టి శోభా హేతువగు సువర్ణ సంబంధముచే శోభాహేతువులగు అభిషేకోదకములే ఈ యజమానునిగూర్చి అంతటను స్రవించు చున్నవి.

ఈ విధముగ హిరణ్యము ఆయుస్సుకును, తేజస్సుకును, శరీర శోభకును హేతువనియు, అట్టి హిరణ్యసంపర్కమువలన శిరస్సున నున్న హిరణ్యరుక్మ ద్వారా స్రవించుచున్న ఉదకములకు గూడ ఆయురాది హేతుత్వమును శ్రుతి వక్కాణించుటచే లోకములో సువర్ణమును ధరించిన వ్యక్తికి స్నానసమయమున ఆ సువర్ణద్వారా స్రవించెడి ఉదకములచే ఆయుస్సు, తేజస్సు, వర్చస్సు, సంప్రాప్తమగు నని స్పష్ట మగుచున్నది.

## సువర్ణమునకు తేజస్స్వరూపత్వము.

**య**జ్ఞము ఐదు రోజులు చేయవలెను. దానిలో రెండవ రోజున సోమలతను గోవు, హిరణ్యము, మేక మున్నగు పది ద్రవ్యములచే కొనవలెను. వాటిలో హిరణ్యముచే సోమమును కొనెడి మంత్రములో హిరణ్యముకు తేజ, సుఖ, అవినాశరూపత్వములు చెప్పబడుచున్నవి.

'శుక్రం తే శుక్రేణ క్రీణామి చంద్రం చంద్రే ణామృత
మమృతేన ।' (కృ.య.సం. 1-2-7)

తా॥ ఓ సోమమును విక్రయించువాడా! నీవు అమ్మెడి సోమమందును, నేను మూల్యముగ ఇచ్చెడి హిరణ్యమందును, శుక్ర, చంద్ర, అమృతశబ్దవాచ్యములగు తేజస్సు, సుఖము, అవినాశము సమముగా నున్నవి. అట్టి హిరణ్యముచే నీసోమమును కొనుచుంటిని ఈ శ్రుతి హిరణ్యమునకు తేజస్స్వరూపత్వమును, సుఖహేతుత్వమును, నాశరహితత్వమును స్పష్టముగ చెప్పుచున్నది.

## సోమవిక్రేతనుండి హిరణ్యమును తిరిగి తీసికొనుట.

'దేవా వై యేన హిరణ్యేన సోమ మక్రీణన్ తద
భీషహా పున రాదదత కో హి తేజసా విక్రేష్యత ఇతి యేన
హిరణ్యేన సోమం క్రీణీయా త్త ద భీషహా పున రాదదీత
తేజ ఏవాత్మన్ ధత్తే ।' (కృ.య.సం. 6-1-10)

'అస్మే చంద్రాణి ఇతి సోమ విక్రయిణో హిరణ్య మపాదత్తే" (ఆ.శ్రౌ.సై.)

సూ.తా. ఇంతకుముందు సోమక్రయకాలమందు సోమ విక్రేతకు మూల్యముగ నిచ్చిన హిరణ్యమును 'అస్మే చంద్రాణి' అను మంత్రముచే తిరిగి తీసికొనవలెను.

మం. తా॥ హిరణ్యము తేజోరూపముగావున, తేజోరూపమగు హిరణ్యముచే ఎవడు సోమమును కొనును? అందుచే పూర్వము దేవతలు ఏ హిరణ్యముచే సోమమును కొనియుంటిరో, ఆ హిరణ్యమును బలాత్కారముగ తిరిగి సోమవిక్రేతనుండి తీసికొనిరి. అందుచే యజ్ఞము చేయు యజమానుడు ఏ హిరణ్యముచే సోమమును కొనునో ఆ హిరణ్యమును తిరిగి బలాత్కారముగ తీసికొనవలెను. అట్లు హిరణ్యమును తీసికొనుటచే తేజస్సును తనయందు ధరించినవాడగును.

పూర్వము సోమక్రకాలమందు "శుక్రం తే శుక్రేణ క్రీణామి" అను మంత్రములో "శుక్రేణ" అను పదముచే హిరణ్యమునకు తేజోరూపత్వము చెప్పబడినది. తిరిగి ఆ హిరణ్యమును తీసికొను సమయమున "కో హి తేజసా" అని తేజశ్శబ్దముచే హిరణ్యమును పరామర్శ చేయుటచే హిరణ్యముకు తేజోరూపత్వమును శ్రుతి స్పష్టముగ వక్కాణించుచున్నది.

## సువర్ణముకు అమృతత్వము.

అగ్నిచయన మను క్రతువులో ఉఖ్యాగ్నిని ముంజగడ్డితో తయారుచేసిన ఉట్టియందుంచి, ఆ కొలికెను యజమానుని కంఠమునకు కట్టవలెను.

(గమనిక: నలుపలకల గోలెము వంటి కుండను ఆహవనీయాగ్ని యందుంచి, దానిలో రంపపు పొట్టు వగైరాలనుంచి, దాని అడుగున (అనగా, అహవనీయాగ్ని యందు) జ్వాల అధికముగ చేసినచో, ఆ ఉఖలో నున్న రంపపుపొట్టు అంటుకొనును. ఆ ఉఖయందలి అగ్నినే ఉఖ్యాగ్ని అని వ్యవహరించెదరు).

అగ్ని వస్తువులను దహించి నశింపజేయును గావున, ఉఖ్యాగ్ని మృత్యుస్వరూపము. హిరణ్యమునకు అగ్నిసంపర్కమున్నను నాశము లేకపోవుటచే హిరణ్యము అమృతస్వరూపము.

ఇట్లు మృత్యురూప మగు ఉఖ్యాగ్నిని యజమాని మెడకు కట్టుటకు పూర్వము సువర్ణరుక్మమును (అనగా, ఇరువదియొక్క బిందుసదృశము లగు స్ఫోటలు కలిగి మంగళసూత్రమువలె నుండు దానిని), దాని తూమునకు సూత్రమును గ్రుచ్చి యజమానుని కంఠమునకు కట్టి, అనంతరము ఉఖ్యాగ్నిని యజమానుని కంఠమునకు కట్టవలెను.

ఇట్లు కట్టినచో, దాహకు డగు ఉఖ్యాగ్నికిని, యజమానుని వక్షస్థలమునకును మధ్య పైవిధముగ అమృతరూప మగు సువర్ణరుక్మముండుటచే, మృత్యురూపు డగు అగ్ని నుండి అమృతరూపమగు రుక్మమును వ్యవధానము చేసినవాడగును. దానిచే అగ్నివలన బాధ నివృత్తమగును. ఈ విషయము నీ క్రింది శ్రుతి బోధించుచున్నది.

*"మృత్యు ర్వా ఏష య దగ్ని రమృతగ్ం హిరణ్యగ్ం*
*రుక్మ మంతరం ప్రతిముంచతే__మృత మేవ మృత్యో*
*రంతర్ధత్తే ।"* (కృ. య. సం. 5. కాం. 1. ప్ర. 10. అను.)

ఈ మంత్రము సువర్ణమున కమృతరూపత్వమును చెప్పుచున్నది. ప్రసంగసంగత్యా ...ములో మంగళసూత్రముకు బొడ్డువంటి నిర్బాధముకు (బొటిమకు లేక స్ఫోటముకు) ఉపయోగమును చెప్పుటకు అగ్నిచయనములోని పూర్వోక్త రుక్మ స్వరూపము వివరించ వలసి యున్నది.

*"ఏకవింశతి నిర్బాధో రుక్మ స్సూత్రోతః"* (ఆ. శ్రౌ. సూ.)

*"ఏకవిగ్ం శతినిర్బాధో భవ త్యేకవిగ్ంశతి ర్వై దేవ*
*లోకా ద్వాదశమాసాః పంచర్తవ స్త్రయ ఇమే లోకా*
*అసా వాదిత్య ఏకవిగ్ంశ ఏతావంతో వై దేవలోకా*
*స్తేభ్య ఏవ భ్రాతృవ్య మంతరేతి ।"* (కృ. య. సం. 5. కాం. 1. ప్ర. 10. అను.)

తా॥ అగ్నిచయనములో, ఉఖ్యాగ్నిధారణ సమయములో యజమానుని కంఠమునకు కట్టెడి ఈ రుక్మమునకు (మంగళసూత్రమునకు ఇరువదియొక్క నిర్బాధము లుంచవలెను.

(సువర్ణరేకు పై నిమ్నోన్నతములుగా నుండి స్పృశించిన వానిని బాధించు నవిగావున, బిందు సదృశములగు స్ఫోటములు నిర్బాధము లనబడును.)

## నిర్బాధముల ఉపయోగము.

దేవలోకములు ఇరువదియొకటి (ఇచ్చట లోకశబ్దమునకు భోగసాధనము లర్థము). వీటినుండి శత్రువును అంతర్హితునిగా జేయును. ఇందులకు శ్రుతి ఈ క్రింద నీయబడినది.

"నిర్బాధై ర్వై దేవా అసురా న్నిర్బాధే<sub>2</sub>_కుర్వత
త న్నిర్బాధానాం నిర్బాధత్వం నిర్బాధీ భవతి భ్రాతృ
వ్యానేవ నిర్బాధీకురుతే ।" (కృ.య.సం. 5.కాం. 1.ప్ర. 10.అను.)

తా॥ పూర్వము దేవతలు చర్మకవచములను ధరించుచు, చర్మకు బహిఃప్రదేశమందు కంచు మున్నగు లోహములతో ప్రౌఢము లగు స్ఫోటములను ఖచితము చేసి, తమ్ములను పట్టుకొనుటకు వచ్చిన అసురులను ఆ స్ఫోటములచే అస్ఫాలనము చేసి (రాపుడు చేసి), భూమి పతనాదిరూప మగు నిర్బాధమందు ఉనికి గలవారినిగా చేసిరి.

అందుచే నిశ్చితమైన బాధ కలవిగావున నిర్బాధములు. ప్రకృతచయనక్రతువులో సువర్ణరుక్మము నిర్బాధములు కల దగుటచే యజమానుడు శత్రువులను నిశ్చితబాధయందు పతితులనుగ జేయును. దీనివలన శత్రువులను బాధాగ్రస్తులను చేయుటకు నిర్బాధములేర్పడిన వని ఫలితము. ఈ శ్రుతి ననుసరించి వివాహములో రుక్మశబ్దాభిధేయమగు మంగళసూత్రముకు ఒక బిందుసదృశమగు స్ఫోటను (నిర్బాధమును) ఈ లోకమునుండి శత్రువుల నిపాతనము కొరకు శిష్టులు ఆచరించుచున్నట్లు స్పష్టమగుచున్నది. వెనుక తురుష్కులు రాజ్యపాలనములో మంగళసూత్రమున్న స్త్రీల జోక్యము కలుగజేసికొనెడివారు కారను ఐతిహ్యము దీని మూలక మయే యుండవచ్చును.

## సువర్ణధారణము - ఉపోద్ఘాతము (తామ్రమసీసాద్యుత్పత్తి) జగత్సృష్టి ప్రతిపాదన ప్రక్రమములో పంచహోతృప్రశంస.

'స పంచహోతార మసృజత । స హవి ర్నా<sub>2</sub>_
విందత । తస్మై సోమ స్త నువం ప్రాయచ్ఛత్ । ఏత
త్తే హవిరితి । స పంచహోత్రా<sub>2</sub>_తప్యత । సో<sub>2</sub>_తా
మ్యత్ । స ప్రత్య జబాధత । సోసురా నసృజత ।
తదస్యా<sub>2</sub>_ప్రియ మాసీత్ । తద్దుర్వర్ణగ్ం హిరణ్య
మభవత్ । తద్దుర్వర్ణస్య హిరణ్యస్య జన్మ ।'

తా॥ అనంతరము ప్రజాపతి పంచహోత్రమంత్రమును సృజించెను. కాని, ఆ మంత్రముచే హోమము చేయుటకు హవిస్సు (అనగా హోమద్రవ్యము) లభింపలేదు. అప్పుడు సోముడు తన శరీరమును హవిస్సుగా నిచ్చెను. వెంటనే ప్రజాపతి పంచహోతృమంత్రముచే ఆ సోముని హోమము సలిపి అలసెను. (శ్రాంతు డాయెను). ప్రజాపతి అలసు డగుచు తన ప్రాణవాయువును అంతర్ముఖముగ నిరోధించి (అధోముఖ నిరోధముచే) గొప్పపీడను పొందెను.

## అసురసృష్టి.

అట్టి ఉపద్రవసమయమున అసురులను సృజించెను. ఆ అసురులకు సృష్టికారణమగు పీడాయుక్త శరీరము ఈ ప్రజాపతికి అప్రియమాయెను.

## తామ్రసీసాద్యుత్పత్తి

అప్రియమైన ఆ ప్రజాపతిశరీరము దుర్వర్ణహిరణ్యరూపముగ (సీసము, తామ్రము, మున్నగు నికృష్టలోహరూపముగ) నిష్పన్నమాయెను. ఈ విధముగ లోకములో తామ్రము, సీసము, మున్నగు నికృష్టలోహముల ఉత్పత్తి సిద్ధమైనది. (పురాణములలో తామ్రము కార్తికేయునివలన జనించినట్లు కలదు.)

## సువర్ణోత్పత్తి

*'స ద్వితీయ మతప్యత । సో౽తామ్యత్ । స ప్రాజ*
*బాధత । స దేవా నసృజత । త దస్య ప్రియ మాసీత్ ।*
*త త్సువర్ణగ్ం హిరణ్య మభవత్ । త త్సువర్ణస్య*
*హిరణ్యస్య జన్మ ।'* (కృ.య.బ్రా. 2. కాం. 2. ప్ర. 4. అను.)

తా॥ తిరిగి ఆ ప్రజాపతి రెండవమారు పంచహోతృమంత్రముచే సోమద్రవ్యహోమ రూపమగు తపస్సు జేసి అలసుడాయెను.

## దేవసృష్టి

ప్రజాపతి ఇట్లు శ్రాంతుడై ఊర్ధ్వ వృత్తిప్రాణుడగుచు శ్వాస నిరోధము లేకయే ఆ సమయమున దేవతలను సృజించెను. హోమశ్రమ మాత్రరూపమగు బాధను పొందెను. స్రష్టయగు ప్రజాపతికి దేవతోత్పాదక మగు అపూర్వోక్తశరీరమే ప్రియమాయెను. మరియు సువర్ణ (హిరణ్య) రూపముగ పరిణమించెను. లోకములో సువర్ణోత్పత్తి ఈ విధముగ ప్రవృత్తమైనది.

## సువర్ణోత్పత్తి వేదనఫలము.

'య ఏవగ్ం సువర్ణస్య హిరణ్యస్య జన్మ వేద ।
సువర్ణ ఆత్మనా భవతి । దుర్వర్ణో౽స్య భ్రాతృవ్యః ॥

(కృ. య. బ్రా. 2. కాం. 2. ప్ర. 4. అను)

తా॥ ఈ విధమగు సువర్ణజన్మను తెలిసికొనిన మానవుడు తన శరీరసౌందర్యము చేతను, మణిముక్తాద్యాభరణములచేతను, శోభనమైన వర్ణముకలవాడగును. ఇంతేగాక, ఇతని శత్రువు దుర్వర్ణుడగును.

## సువర్ణధారణ విధి

'తస్మా త్సువర్ణగ్ం హిరణ్యం ధార్యం । సువర్ణ ఏవ
భవతి । ఐనం ప్రియం గచ్ఛతి వ్యా౽ప్రియమ్ ।'

(కృ. య. బ్రా. 2. కాం. 2. ప్ర. 4. అను. )

తా॥ పై విధముగ సువర్ణము ప్రశస్తమైనది గావున, పురుషునిచే హస్తకర్ణాదులందు సువర్ణా౽౽భరణములను ధరించవలెను. ఈధారణముచే లోకద్వయమందు రమణీయుడగును. ఈసువర్ణధారి యగు పురుషుని సత్కారరూప మగు ప్రియమే పొందునుగాని, ఎన్నడును తిరస్కారాదిరూప మగు అప్రియము పొందదు.

## సువర్ణధారణము పురుషార్థము.

**"త**స్మా త్సువర్ణగ్ం హిరణ్యం ధార్యం" అను శ్రుతివిహితమగు సువర్ణధారణమును గూర్చి పూర్వమీమాంసాశాస్త్రములో "ఈ సువర్ణధారణము క్రత్వర్థమా, పురుషార్థమా" అని విమర్శించి, పురుషార్థమని సిద్ధాంతీకరించిరి. గాన, ఈ శ్రుతిచే లోకములో సువర్ణధారణము విహితమైనది.

## హిరణ్యదానవిధి

'**చా**తుర్ హోత్రియ' మను కాఠకచయనములో దక్షిణావిధాన ప్రకరణములో హిరణ్యదానము ఈ క్రింది శ్రుతిచే విధించబడుచున్నది.

'హిరణ్యం దదాతి । హిరణ్యజ్యోతి రేవ స్వర్గం
లోక మేతి' (కృ. య. బ్రా. 3. కాం. 12. ప్ర. 5. అను. )

తా॥ ఈ క్రతువులో హిరణ్యమును దక్షిణగ నివ్వవలెను. ఆ హిరణ్యదానముచే హిరణ్యసదృశ మగు జ్యోతిస్సు కలవాడై స్వర్గ లోకమును పొందును.

ఈ విధముగ సువర్ణదానమునకు మహాఫలమును శ్రుతి బోధించుచున్నది.

## పూర్వమీమాంసాశాస్త్రరీతిగ అచేతనసంబోధన సమర్థనము.

*"అచేతనేఽర్థబంధనాత్"*

*"శృణోత గ్రావాణః, స్వధితే మైనగ్ం హిగ్ంసీః ।"*

*(పూ.మీ. మంత్రలింగాధికరణము 1. అ. 2. పా. 4. అధికరణము)*

తా॥ యజ్ఞములో సోమలతను దంపెడి గ్రావలను (రాళ్లను) సంబోధించి "ఓ గ్రావలారా! మీరు వినుడు" అని అచేతనము లగు రాళ్లను సంబోధించు మంత్రము నిరర్థకము.

ఇట్లే యజ్ఞములో పశువును బంధించెడి కర్రకు (రాటకు) యూపమని పేరు ఆ యూపమును ఛేదించు మంత్రములో 'ఓస్వధితే! ఈ వృక్షమును హింసించకుము' (స్వధితి అనగా కత్తె) అని ఆచేతనమగు కత్తిని సంబోధించి ప్రవర్తించి మంత్రము నిరర్థకము. ఈ విధముగ పూర్వపక్షముచేసి, అనంతరము 'శృణోత గ్రావాణ' ఇత్యాదులందు అచేతనపదార్థము లగు గ్రావలను, (రాళ్లను), స్వధితిని (కత్తెను) సంబోధించుట స్తుత్యర్థము గావున, దోషము లేదని సిద్ధాంతీకరించిరి. (అచేతనములందు చైతన్యాఽఽరోపము చేసి అచేతనములను స్తుతి చేయుటకు సంబోధనము).

దీనివలన అచేతనములగు సువర్ణాదుల సంబోధనము స్తుత్యర్థము గావున, దోషావహము గాదని అచేతనసంబోధనస్థలములలో అంతటను ఊహించుకొనవలెను.

దృష్టాంతము – లోకములో సామాన్యమానవుని 'నీవు మహారాజువు' అని కార్యార్థము వానియందు మహారాజత్వమును ఆరోపించి స్తుతిచేయునట్లు, అచేతనపదార్థములందు చేతనత్వము నారోపించి స్తుతి చేయుట దోషము కాదని ఫలితము.

## హిరణ్య దాన ఫలము.

ఏదైనను యాగమును అనుష్ఠానము చేయుటకు 'యక్ష్యే' అని సంకల్పించిన పిమ్మట ఆ యాగమును సంపూర్ణముగ అనుష్ఠానము చేయనివానికి సంకల్పభ్రంశదోషపరిహారము కొరకు 'త్రైధాతవీయేష్టి' అను యాగము కామ్యేష్టికాండయందు విధించబడినది. ఆయాగములో హిరణ్యమును, నేతిచే తడపబడిన వస్త్రమును (తార్ప్యమును), ధేనువును (నూతనముగ ఈనిన ఆవును), దక్షిణగ ఇవ్వవలసిన దని ఈ దిగువ శ్రుతి బోధించుచున్నది –

'హిరణ్యం దదాతి తేజ ఏవా౽వరుంధే తార్ప్యం
దదాతి పశూ నేవావరుంధే ధేనుం దదా త్యాశిష ఏవా
౽వరుంధే సామ్నో వా ఏష వర్ణో యద్ధిరణ్యం యజు
షాం తార్ప్య ముక్థామదానాం ధేను రేతా నేవ
సర్వాన్ వర్ణా నవరుంధే ।' (కృ.య.సం. 2.కాం.ప్ర.అను. 11.)

తా॥ త్రైధాతవీయేష్టియందు హిరణ్యమును, తార్ప్యమును, ధేనువును దక్షిణగా ఇవ్వవలెను. ఆహిరణ్యదానముచే తేజస్సును పొందును. నేతితో తడపబడిన వస్త్రము (తార్ప్యము) యొక్క దానముచే పశుప్రాప్తి యగును. ధేనుదానముచే (కామధేను సాదృశ్యమువలన) ఆశీస్సుల ప్రాప్తియగును.

మరియు, హిరణ్యము సామవేదరూపము. ఘృతాక్తవస్త్రము యజుర్వేదస్వరూపము. ధేనువు ఋక్స్వరూపము కావున, ఈ వస్తువుల దానమువలన మూడు వేదముల ప్రాప్తి యగును. ప్రకృతములో హిరణ్యదానమువలన తేజఃప్రాప్తి, సామవేదప్రాప్తి రూప మగు మహాఫలము బోధించబడుచున్నది.

యజ్ఞములో రెండవ దినమున ప్రాయణీయేష్టి అను యాగానంతరము 'ధ్రువ' అను పాత్రలో నున్న ఆజ్యమును 'జుహువు' అను పాత్రలోనికి గ్రహించి, ఆ ఆజ్యములో 'ఇయం తే శుక్ర' అనుమంత్రముచే హిరణ్యము నుంచుట వలన లోకములో యెముకలు లేని వీర్యము వలన గర్భోత్పత్తియై, ఉత్పత్తి కాలమున యెముకలతో ప్రజలు పుట్టుచున్నట్లు లోగడ వ్రాయడమైనది. ఇప్పుడు, ఆ నేతిలో ఉంచిన హిరణ్యమును ఉద్ధరణ చేయు మంత్రము నీ దిగువ సూత్రము బోధించుచున్నది.

"శుక్ర మస్యమృత మసీతి హిరణ్యం ఘృతా దుద్ధృత్య"

మం. తా. ఓ హిరణ్యమా! నీవు తేజోరూపమైనదానవు, వినాశ రహితమైనదానవు. ఐతివి.

ఈవిధముగ హిరణ్యము అతిప్రశస్తమైనదిగావుననే స్మార్తకర్మలోగూడ దీనిని వినియోగించుట గలదు. అచ్చటి మంత్రములలో హిరణ్యమహత్వము తెలియజేయుటకు స్నాతకములోని ఆమంత్రములు కొన్ని యీదిగువ నుదహరించబడుచున్నవి -

"తస్య దశాయాం ప్రవర్తౌ ప్రబధ్య దర్వ్యా మాధాయా౽౽
జ్యేనాభ్యానయ న్నుత్త రా ఆహుతీ ర్హుత్వా జయాది ప్రతిపద్యతే
పరిషేచనాంతం కృత్వా ఏతాభిరేవ దక్షిణే కర్ణ అబధ్నీత
ఏతాభి స్సవ్యే ।" (ఆ. గృహ్యసూత్రము)

'ఆయుష్యం వర్చస్యగ్ం సువీర్యగ్ం రాయస్పోష
మౌద్భిద్యం । ఇదగ్ం హిరణ్యం జై త్ర్యాయా
విశతాం మాం ।'

బ్రహ్మచారి ఉపనయనానంతరము గురుకులములో వేదాధ్యయనాదులను సలిపి ఇంటికి వచ్చిన పిమ్మట స్నాతకవ్రతము (సమావర్తనము) అను కర్మను జరిపెదరు. అనగా, ఉపనయనము వేదాధ్యయనముకొరకు ఏర్పడిన సంస్కారము. అది అయినవెంటనే బ్రహ్మచర్యాశ్రమములో గురుకులమున కేగి వేదాధ్యయనాదులను పూర్తి జేసి ఇంటికి వచ్చినతోడనే బ్రహ్మచర్యాశ్రమఫల మగు అధ్యయనము పూర్తి అగుటచే) బ్రహ్మచార్యశ్రమమును వీడి స్నాతకము చేయవలెను. ఆస్నాతకములో బంగారు కర్ణాలంకారములు రెండు తీసికొని వచ్చి, 'దర్వి' అను హోమపాత్రయందు వాటిని ఉంచి, ఆదర్వియందు ఆజ్యమును పోసి, ఆ అజ్యమును 'ఆయుష్యం' ఇత్యాది మంత్రములచే హోమము చేయవలెను.

అనంతరము ఆ హోమపాత్రనుండి ఆకర్ణాభరణములను తీసిచెవులయందు ఈ క్రింది మంత్రములచే ధరించవలెను.

'ఆయుష్యం వర్చస్యగ్ం సువీర్యం రాయస్పోష
మౌద్భిద్యం । ఇదగ్ం హిరణ్యం జైత్ర్యా యావిశతాం
మాం ।' (మంత్రపన్నములు. 2. ప్రశ. 8. ఖం.)

తా॥ స్నాతకుడు తన చెవులయందు ధరించెడి కర్ణాభరణముల (కుండలముల) యందలి హిరణ్యమును ఈ మంత్రము వర్ణించుచున్నది.

హిరణ్యదానముచే అపమృత్యువు తొలగును గాన, హిరణ్యము ఆయుస్సుకు కారణము. హిరణ్యధారణచే శోభవచ్చునుగాన, అది వర్చో హేతువు. హిరణ్యవంతునకు కీర్తి యుండునగాన, అది కీర్తికి కారణము. హిరణ్యవంతునకు సర్వకార్యములందును విజయమును చూచుచునే యుంటిమి. గాన హిరణ్యము జయమునకే నన్ను పొందుగాక యని తాత్పర్యము.

'ఉచ్చై ర్వాజి వృతనాజి సత్రా సాహం ధనం
జయం । సర్వా స్సమృద్ధీర్ బుద్ధయో హిరణ్యేస్మిన్
త్సమాహతాః ।    (2 మం.)

తా॥ లోకములో హిరణ్యము కలవాడు గంభీరముగ మాట్లాడునుగాక, హిరణ్యము గంభీరముగ మాట్లాడించునది. శత్రుసేనలను జయించుటకు సాధనమైనది. లోకములో

హిరణ్యవంతుడు అసత్యము బల్కినను ప్రజలు నమ్మెదరు గాన (హిరణ్యము) సత్యమును తిరస్కరించునట్టిది. శత్రువుల ధనమును జయించుటకు సాధనమైనది. అనేకము చెప్పనేల? సర్వసమృద్ధులును సంపూర్ణముగ హిరణ్యమందు స్థాపితములైనవి. హిరణ్యమునకు ఈ గుణము లన్నియు నిత్యము అందరును చూచుచునే యుండిరి. ఇట్టి హిరణ్యము నన్ను పొందుగాక.

'శున మహగ్ం హిరణ్యస్య పితురివ నామాగ్ర
భైషం । తం మా హిరణ్యవర్చసం పూరుషు ప్రియం
కురు ।'  (3. మం.)

తా॥ లోకములో పుత్రుడు తండ్రియొక్క నామను తిరిగి తిరిగి ఫలానివారి కుమారుడనని ఎట్లు చెప్పుకొనునో, అట్లే ఓహిరణ్యమా, సుఖరూపమగు హిరణ్యానామను కీర్తనము చేయుచున్న నన్ను హిరణ్యమువలె ప్రకాశమానునిగ చేయుము. మరియు, ఓహిరణ్యమా, నీవు నన్ను అందరకును ఇష్టునిగా చేయుము. హిరణ్యము కల పురుషుడు అందరకును ఇష్టుడే యగుట అనుభవసిద్ధము.

'ప్రియం మా దేవేషు కురు ప్రియం మా బ్రహ్మణే
కురు । ప్రియం విశ్వేషు శూద్రేషు ప్రియగ్ం రాజసు
మా కురు ।  (4 మం.)

తా॥ ఓహిరణ్యమా! నీచే స్పృశించబడిన ఆజ్యహోమప్రభావముచే సమస్తబ్రాహ్మణులకు, సమస్త క్షత్రియులకు, సమస్త వైశ్యులకు, సర్వశూద్రులకు, సమస్త దేవతలకు ప్రియుడనుగ (ఇష్టుడను) నన్ను చేయుము.

'యా తిరశ్చీని పద్యసే__హం విధరణీ ఇతి । తాం
త్వాఘృతస్య ధారయా యజే సగ్ంరాధనీ మహం ।'  (5. మం.)

తా॥ సంరాధనీశబ్దమునకు భూమి అర్థమని కొందరును, వాక్కు అర్థమని కొందరును అనెదరు. భూపక్షములో – ఓభూమి! నేను సమస్త భూతములను ధరించుదాన నను బుద్ధిచే యే నీవు ప్రకృత హోమమునకు విఘ్నమును చేయువారిని ఇచ్చట ప్రవేశించకుండుటకు ద్వారదేశమందు అడ్డముగ శయనించుచుంటివో, అట్టి నిన్ను హిరణ్య సంపృక్తమగు ఘృతధారచే పూజించుచుంటిని.

వాక్పక్షములో – ఓవాగ్దేవతా! సర్వజగద్వ్యవహారము వాగధీనముగావున, యాగవిఘ్నమును చేసెడివారిని వాక్కుచే రావలదని నివారించెడిదాన నను బుద్ధిచే యే నీవు ముఖమధ్యయందుంటివో, అట్టి నిన్ను హిరణ్యసంపృక్తమగు ఘృతధారచే పూజించుచుంటిని.

'సగ్ంరాధన్యై దేవ్యై । ప్రసాధన్యై దేవ్యై ।'(6. 7.మం.)

ఈ దేవతాద్వయముకొరకు ఈహిరణ్యసంపృక్త మగు ఆజ్యము హుత మగుగాక.

'సమ్రాజం చ విరాజం చాభిశ్రీ ర్యా చ నో గృహే ।
లక్ష్మీ రాష్ట్రస్య యా ముఖే తయా మా సగ్ం సృజామసి ॥' (8. మం.)

తా॥ హిరణ్యకుండలముల యొక్క ధారణచే యోగ్యముగ ప్రకాశించుచున్నట్టియు, వివిధముగ ప్రకాశించుచున్నట్టి నన్ను నా యొక్కగృహమందలి లక్ష్మితోను, రాష్ట్రముఖమందలి లక్ష్మితోను సంబంధింపచేయుచుంటిని. అనగా ఈ సువర్ణాభరణధారణముచే దేదీప్యమానుడ నైన నాగృహమందు, రాష్ట్రమందు మహాలక్ష్మి నివసించుచున్నది.

## దక్షిణాప్రతిగ్రహ విషయము.

'ప్రజాపతి ర్వై ప్రజాకామ స్త పోత్_వ్యత । స
హిరణ్య ముదాస్యత్ । త దగ్నౌ ప్రాస్యత్ । త దస్మై
వాచ్ఛదయత్ । తద్వితీయం ప్రాస్యత్ । తదస్మై నైవా
చ్ఛదయత్ । తత్తృతీయం ప్రాస్యత్ । త దస్మై నైవా
చ్ఛదయత్ । తదాత్మ న్నేవ హృదయ్యేగ్నౌ వైశ్వానరే
ప్రాస్యత్ । తదస్మా అచ్ఛదయత్ । తస్మాద్ధిరణ్యం కనిష్ఠం
ధనానాం । భుంజ త్ప్రియతమం । హృదయజగ్ం హి ।
స వై తమేవ నావిందత్ । యస్మై తాం దక్షిణా మనే
ష్యత్ । తాగ్‌స్వాయైవ హస్తాయ దక్షిణాయానయత్ ।
తాం ప్రత్యగృహ్ణాత్ । దక్షాయ త్వా దక్షిణాం ప్రతిగృహ్ణా
మీతి । సో దక్షత దక్షిణాం ప్రతిగృహ్య । దక్షతేహ వై
దక్షిణాం ప్రతిగృహ్య । య ఏవం వేద ।" (కృ.య.బ్రా. 3.కాం. 11.ప్ర. 8.అను.)

తా॥ పూర్వ మొకప్పుడు ప్రజాపతి ప్రజలను ఉత్పాదన చేయవలెనని కోరుచున్న వాడగుచు తపస్సును చేసెను. అప్పుడు ప్రజాపతి తన అభీష్టమగు ఫలముకు సాధనముగ కొంచెము హిరణ్యమును ఉత్పాదన చేసెను ఆ హిరణ్యమును తన కార్యసిద్ధికొరకు అగ్నియందు ప్రక్షేపము చేసెను. అగ్నియందు ప్రక్షిప్తమగు ఆ హిరణ్యము ప్రజాపతికి కార్యప్రతిబంధమును తొలగించలేకపోయెను. ఈవిధముగ రెండవ పర్యాయము, మూడవపర్యాయముకూడ అగ్నియందు హిరణ్యమును ప్రక్షేపము చేసినను తన కార్యసిద్ధికి ప్రతిబంధము నివారణ కాకపోయెను. అనంతరము ఆ ప్రజాపతి బాహ్యాగ్ని యందు హిరణ్యా

ప్రక్షేపమును విడనాడి తన శరీరమధ్యయందే హృదయపుండరీకమునకు సమీపముగ నుండెడి సర్వపురుషులకు హితుడగు జాఠరాగ్నియందు ఆహిరణ్యమును ప్రక్షేపము గావించెను. ఆ జాఠరాగ్నియందు ప్రక్షిప్తమైన హిరణ్యము ప్రజాపతికి కార్యప్రతి బంధమును తొలగించెను. ఈ విధముగ బాహ్యాగ్నియందు ప్రక్షిప్తమగు హిరణ్యము కొంచెమైనను కార్యమును నెరవేర్చక, జాఠరాగ్నియందు నిక్షిప్తమైనదియే కార్యసాధక మగుటచే లోకమందుగూడ బాహ్యప్రదేశమందు (అనగా, భూమియందు, లేక పెట్టె మున్నగు వాటియందు నిక్షిప్తమైన హిరణ్యము భోగమున కుపకరించదు. కాన, అట్టి ధనము కనిష్ఠమైనది. (నికృష్టమైనది) ఏధనము భోగోపయుక్తమగునో (అనగా త్యాగభోగములకు వినియోగించబడునో) అట్టి ధనమే అందరకు చాల ప్రియమైనది. ప్రజాపతికి హృదయజ మగుచు (సంకల్పజన్య మగుచు) హృదయసంబద్ధ మగుచు ప్రీతిజనకమాయెనుగాన, ప్రజాపతికి వలెనే త్యాగభోగములతో కూడిన హిరణ్యము భోక్తలకు హృదయసంబంద్ధ మగుచు ప్రియతమ మగుట యుక్తము. ఈ విధముగ ప్రజాపతి చేతనమందు ప్రక్షిప్త మగు హిరణ్యమునకు ప్రియతమత్వమును పర్యాలోచన చేసి యెవడైన చేతను డగు పురుషునకు హిరణ్యరూప దక్షిణ నివ్వవలెనని అన్వేషణ చేసి, అట్టి చేతనుడగు పురుషుడు హిరణ్యమును ప్రతిగ్రహించెడివాడు లభించకపోవుటచే తన దక్షిణహస్తముకొరకే ఆ హిరణ్యరూపమగు దక్షిణ నిచ్చెను. అట్లు దక్షిణ నిచ్చి, 'ఓ హిరణ్యమా! దక్షిణారూపమగు నిన్ను కార్యసమర్థ్యముకొరకు ప్రతిగ్రహించుచుంటిని'. అని పలుకుచు ప్రజాపతి స్వయముగనే ఆదక్షిణను ప్రతిగ్రహించెను. అనంతరము ప్రజాపతి దక్షిణను ప్రతిగ్రహించి సమర్థుడాయెను.

ఇతరుడు కూడ యెవడు ఈ ప్రకారముగ హిరణ్యవృత్తాంతమును తెలిసికొని ప్రతిగ్రహించునో, అతడే కార్యసమర్థుడగును.

ఈ విధముగ ప్రజాపతి వృత్తాంతముచే దక్షిణను ప్రశంస చేసి మహర్షి వృత్తాంతముచే కూడ ప్రశంసించుచున్నాడు.

*"ఏతద్ధస్మ వై తద్విద్వాగ్ంసోవాజశ్రవసా గోతమాః ।*
*అప్యనూదేశ్యాం దక్షిణాం ప్రతిగృహ్ణంతి । ఉభయేన*
*వయం దక్షిష్యామహ ఏవ దక్షిణాం ప్రతిగృహ్యేతి । తే*
*ఽదక్షంత దక్షిణాం ప్రతిగృహ్య । దక్షతే వై దక్షిణాం*
*ప్రతిగృహ్య । య ఏవం వేద ప్రహాస్యం ప్లీనాతి ।"*

*(కృ.య.బ్రా.3.కాం.11.ప్ర.9.అను.)*

తా॥ అన్నదాననిమిత్త మగు కీర్తి గల వాజశ్రవస్సుయొక్క పుత్రులు (వాజశ్రవసులు) గౌతమగోత్రోత్పన్నులు ఈ దక్షిణా మాహాత్మ్యమును తెలిసికొని అనుదిష్టమగు (అముఖ్యమగు) దక్షిణను కూడ ప్రతిగ్రహించుచుండిరి. దక్షిణ రెండు విధములు. ప్రత్యక్ష దత్తము, అనుదిష్టము. 'అన్విష్టకం దక్షిణా దదాతి, హిరణ్యం దదాతి' అని ధనార్థక మగు ధాతువుచేతనే విహితమైన దక్షిణ ప్రత్యక్షదత్తము. 'వాయవే త్వా వరుణాయ త్వా' ఇత్యాది మంత్రములచే దేవతలకొరకు సమర్పితమైనది అనుదిష్టము. 'యదేవ మేతా అనుదిశతి యథా దేవత మేవ దక్షిణా గమయతి' అను శ్రుత్యనుసారము వాజశ్రవసులు అముఖ్యమైన దక్షణినుగూడ ప్రతిగ్రహించుచుండిరి. అనగా, ముఖ్యదక్షిణను యాగముద్వారా దేవతాప్రీతికొరకు ప్రతిగ్రహించుచుండిరని వేరుగ చెప్పవలెనా? అట్లు ప్రతిగ్రహించెడి వాజశ్రవస్సుల అభిప్రాయమేమన, 'ముఖ్యము, అముఖ్యము అగు రెండు దక్షిణలను ప్రతిగ్రహించి కార్యసమర్థులము కాగలము' అని. ఆ మహర్షులు అట్లే దక్షిణను ప్రతిగ్రహించి తమకార్యములందు సమర్థులైరి. ఇతరుడు కూడ ఈ ప్రకారము ఈ మహర్షివృత్తాంతమును తెలిసికొని దక్షిణా ప్రతిగ్రహమును చేసినచో ధనసమృద్ధిచే స్వకార్యసమర్థుడు తప్పక అగును. ఇతరుడగు ద్రవ్యరహితుడైన తన విరోధిని (ప్రతిగ్రహము లేనందున ద్రవ్యసంపత్తి లేమిచే యజ్ఞము చేయలేడుగాన), దేవతల కిచ్చుటకు హవిస్సులేనివానినిగా చేయును.

ఈ విధముగ సర్వలోహములలో ఉత్కృష్టమైన హిరణ్యము యొక్క దానమును ప్రతిగ్రహమునుకూడ విశేషించి విపులముగ చెప్పుచు, ప్రదర్శిత శ్రుతిజాతము హిరణ్యమును అనేక శ్రేయస్సులకు సాధనముగ వక్కాణించినది. హిరణ్యమహిమ ఇంతవరకు వర్ణితము.

పై మంత్రములలో ప్రత్యక్షదత్తము, అనుదిష్టము అను రెండు విధముల దానము శ్రుతిచోదితము గావుననే లోకములో ప్రత్యక్షముగ బ్రాహ్మణునకు పాదప్రక్షాళనాది పురస్సరముగ ప్రత్యక్షదానము చేయుటయు, "మానసోద్దిష్టబ్రాహ్మణాయ ప్రతిగ్రహీత్రే" అని మనస్సుచే సంకల్పించి ధారపోసికూడ అనుదిష్టదానమును చేయుటయు శిష్టాచారపరంపరా ప్రాప్త మగుచున్నది. దీనివలన ప్రత్యక్షముగ పాదప్రక్షాళన చేసి ఇచ్చినగాని దానము కాదు అని అనుకొనుటకు సావకాశము లేదు. పై రెండు దానములు కూడ సంపూర్ణ ఫలమును ఇచ్చునని స్పష్టమగుచున్నది.

## ప్రకారాంతరముగ సువర్ణోత్పత్తి.

*"అశ్వస్య వా అలబ్ధస్య రేత ఉదక్రామత్ । తత్సు*
*వర్ణగ్ం హిరణ్య మభవత్ । య త్సువర్ణగ్ం హిరణ్యం*
*దదాతి । రేత ఏవ త ద్దధాతి । ఓదనే దదాతి । రేతో వా*
*ఓదనః । రేతో హిరణ్యం । రేతసై వాస్మిన్ రేతోదధాతి ।"* (కృ.య.బ్రా. 3-8-2.)

తా॥ అశ్వమేధములో అధ్వర్యుడు, బ్రహ్మ, హోత, ఉద్గాత అను నలుగురు ముఖ్యులగు ఋత్విక్కులు ఉండెదరు. వారికి మహర్త్విక్కు లని వ్యవహారమును ఈ క్రింది శ్రుతి బోధించుచున్నది.

*"అశ్వస్య వా ఆలబ్ధస్య మహిమోదక్రామత్ । స మహా*
*ర్త్విజః ప్రావిశత్ । త న్మహర్త్విజాం మహర్త్విక్త్వం*
*య న్మహర్త్విజః ప్రాశ్నంతి । మహిమాన మేవాస్మిన్*
*త ద్దధతి । "* *(అశ్వమేధ ప్రశ్న 3. అను.)*

తా॥ పూర్వ మొకప్పుడు అశ్వమేధక్రతువులో ఆలబ్ధమైన, (ఉపాకరణాదిమారణపర్యంతో వ్యాపారః అలంభః) అనగా, ఉపాకరణాదులచే సంస్కృతమైన అశ్వముయొక్క మహిమ (సామర్థ్యాతిశయము) అశ్వమునుండి ఉత్క్రాంతమై, అధ్వర్యుడు మున్నగు మహర్త్విక్కులను ప్రవేశించెను. అశ్వముయొక్క మహిమ వీరియందు ప్రవేశించుటచే మహర్త్విక్కులు అను పేరు వీరికి వచ్చెను. ఇట్టి మహర్త్విక్కులు బ్రహ్మౌదనమును ప్రాశన చేసినచో యజమాని యందు మహత్త్వమును స్థాపనచేసినవారగుదురు.

ఈ ఓదనభోజనమందు హిరణ్యాదానమును ఈ శ్రుతి బోధించుచున్నది. అశ్వమేధక్రతువులో ఆలబ్ధమైన అశ్వముయొక్క రేతస్సు అశ్వమునుండి ఉత్క్రాంతమై సువర్ణ రూపము దాల్చెను. అందువలన, ప్రాశన చేసిన ఈ మహర్త్విక్కులకు హిరణ్యాదానము చేయుటచే యజమానియందు రేతస్సును స్థాపన చేయును. అన్నము రేతస్సుకు కారణమగుటచే అది (ఓదనము) రేతస్స్వరూపము. హిరణ్యము అశ్వముయొక్క రేతఃకార్యము గావున రేతస్స్వరూపము. అట్టి రేతోరూపమగు హిరణ్యమును రేతోరూప మగు అన్నమును భుజించిన మహర్త్విక్కులకు ఇచ్చినచో, ఉభయరేతస్సులను (ఓదన హిరణ్యములను) యజమానియందు స్థాపన చేయును.

ఫలితము: మహర్త్విక్కుల ప్రాశనచే మహత్త్వము సంప్రాప్త మగుచున్నది గావున, లోకములో అన్నదానము మహాత్ములకు చేసినచో మహాఫలము సంప్రాప్త మగునని సూచిత మగుచున్నది. మరియు, భోజనోత్తరమందు హిరణ్యదక్షిణ నివ్వవలసినదిగ శ్రుతి చెప్పుటచే మహాత్ములకు అన్నదానోత్తరమందు దక్షిణ నివ్వవలెనని గూడ సూచితమగుచున్నది. శిష్టాచారములో ఇట్లు దక్షిణ నిచ్చు ఆచారము గలదు.

## సువర్ణఖచితరజతపాత్రభోజనము.

**ఆ**ధానము, యజ్ఞము చేయు యజమాని (అహితాగ్ని) ఆయుష్కామేష్టి యనియు, కుండలేష్టి యనియు రెండు నామలచే వ్యవహరించబడియెడి ఇష్టిని చేసి చెవులకు

కుండలములను ధరించవలెను. ఆ ఇష్టిలో ఆజ్యములో సువర్ణకుండలముల నుంచి, ఆ హిరణ్యమునుండి ఘృతమును పానము చేయవలెను.

## హిరణ్యము నుంచి ఘృతపానము.

"హిరణ్యా ద్ఘృతం నిష్పిబ త్యాయు ర్వై ఘృత
మమృతగ్ం హిరణ్య మమృతా దేవాయు ర్నిష్పిబతి శత
మానం భవతి శతాయుః పురుష శ్శతేంద్రియ ఆయు ష్యే
వేంద్రియే ప్రతితిష్ఠ త్యథో ఖలు యావతీస్సమా ఏష్య
న్మన్యేత తావ న్మానగ్గ్ స్యా త్సమృధ్యా ఇమ మగ్న
ఆయు షే వర్చ సే కృధీత్యాహాయు రేవాస్మిన్ వర్చో
దధాతి విశ్వే దేవా జరదష్టి ర్యథా సదిత్యాహ జరదష్టి
మేవైనం కరోతి ।" (కృ. య. సం. 2. కాం. 3. ప్ర. 11. అను.)

తా॥ పై కుండలేష్టి, లేక ఆయుష్కామేష్టిలో సువర్ణకుండల ములను నేతిలో ముంచి ఆ హిరణ్యముద్వారా ఆ ఘృతమును యజమాని పానము చేయవలెను.

## ఘృతపానఫలము.

అట్లు ఘృతపానము చేయుటవలన ఘృతము ఆయుర్హేతువు గాన ఆయుస్స్వరూపము. అగ్నిసంపర్కమున్నను నాశము లేకుండటచే హిరణ్యము అమృతస్వరూపము గాన, అమృతమునుండి ఆయుస్సును పానము చేసినవాడగును. ఆ సువర్ణము శతమానప్రమాణ ముగ నూరు గుంజాబీజముల (గురివెందల) యెత్తుండవలెను.

## శతమాన ప్రమాణముకు కారణము.

పురుషునకు ఉత్పత్తి సమయమున నూరు సంవత్సరములు ఆయుస్సును ప్రజాపతి నిర్ణయించును. కాని, సుకృత దుష్కృత కర్మల ఫలితముగ ఆయుస్సు న్యూనము (తక్కువ) లేక, అధికము అగుచుండును. అందుచే పురుషుడు శతాయువు కలవాడు. మరియు దశేంద్రియములకు నాడీసంచారముచే పురుషుడు శతేంద్రియములు కలవాడగును. ఈ విధముగ పురుషుడు శతాయువు, శతేంద్రియుడు గావున పై సువర్ణగత మగు శతసంఖ్యచే పురుషుడు సంపూర్ణాయుస్సు నందును, ఇంద్రియసామర్థ్యమందును ప్రతిష్ఠితుడగును.

## శతసంఖ్యావికల్పము.

పైన చెప్పినవిధముగ సువర్ణము శతమాన ముండవలెను. లేదా, యజమానికి అప్పటి వయస్సుకు ఎంత సంఖ్య కలిపినచో నూరు అగునో అన్ని గుంజాబీజముల యెత్తు సువర్ణ ముండవలెను. అట్లు చేయుట సమృద్ధికి హేతువు.

మరియు ఘృతపానమంత్రములో "ఇమఘ్ణగ్న ఆయుషేవర్చసే కృధి" అని యుండుటచే ఈయజమాని యందు ఆయుస్సును, వర్చస్సును స్థాపన చేసినవాడగును. ఆమంత్రములోనే

"జరదష్టి ర్యథాసత్" అని యుండుటచే ముసలితనము సంపూర్ణముగ వచ్చువరకు జీవించువానినిగ జేయును. అథవా, ముదిమిచే భోజనము బాగుగ తగ్గిపోవువరకు జీవింపచేయును.

ఈ విధముగ అమృతరూపమగు హిరణ్యము నుండి ఘృతపానమువలన అమృతము నుండి ఆయుస్సును పానము చేసినవాడగునని శ్రుతి వక్కాణించుటచేతనే ప్రథమాన్నప్రాశనలో ఇట్లు చెప్పబడినది.

## అన్నప్రాశనలో హిరణ్యము.

*"దధి మధు ఘృత మితి సగ్ంసృజ్య తస్మిన్ దర్భేణ*
*హిరణ్యం నిష్టర్క్యం బధ్వావదాయోత్తరై ర్మంత్రైః కుమారం*
*ప్రాశయిత్వా ।" (సూ.)*

తా॥ పై రీతిని సువర్ణమునుండి పానము అమృతమునుండి పానము గనుకనే అన్నప్రాశనలో సువర్ణనిర్మితమైన అంగుళీయకమును (ఉంగరమును) దర్భచే జారుముడివేసి, ఆ ఉంగరముచే పై ద్రవ్యమును కుమారునిచే ప్రాశన చేయింతురు. ఇది ప్రాథమికాన్న ప్రాశన. అన్నప్రాశనలో ఇట్లు చేయుటకు కుండలేష్టియందలి శ్రుతియే మూలమని తెలియుచున్నది.

మరియు, ఆ హిరణ్యము శతమానప్రమాణ ముండవలెననియు, దానిచే సంపూర్ణమైన ఆయుస్సునందును, ఇంద్రియసామర్థ్యము నందును ప్రతిష్ఠితుడగునని చెప్పుటచే లోకములో శ్రీమంతులు తరచుగ నూరుతులముల యెత్తు గల రజతపాత్రలను చేయించి, దానియందు మధ్యభాగమున సువర్ణశకలమును ఖచితము చేయించి, ఆపాత్రయందు భుజించు నాచారము కలదు. ఈ సువర్ణ ఖచితమగు రజతపాత్ర 100 తులము లుండుటచే శతసంఖ్యాప్రమాణ మగు సువర్ణపాత్రయందు భుజించినట్లగును. దానివలన ఆయురాదికము సిద్ధించు నని తాత్పర్యము.

ఈ విధముగ మన పూర్వులు ఆచరించెడి సర్వలౌకిక వ్యాపార ములను విమర్శించినచో అవి యన్నియు శ్రుతి సిద్ధములే యని స్పష్టముగ తెలియుచున్నది.





శ్రీ మహాగణాధిపతయే నమః ।

# వేదసార రత్నావళి

## ౨౦. అన్నదానమహిమ.

### సంక్షేపముగ ఉపనిషద్విషయము.

'అహ మస్మి ప్రథమజా ఋతస్య । పూర్వం దేవేభ్యో
అమృతస్య నాభిః । యో మా దదాతి స ఇదేవ మావాః ।
అహ మన్న మన్న మదంత మద్మి ।' (తై.బ్రా. 2-8-8.)

### అన్నదేవతయొక్క మాహాత్మ్యము.

తా॥ అన్నదేవత ఈ విధముగ చెప్పుచున్నది. "నేను యజ్ఞమునకు ముందుగ ఉత్పాదన చేసెడిదానను. అనగా, దేవతను ఉద్దేశించి చరుపురోడాశాదిరూప మగు హవిస్సును త్యజించుటయే (ఇచ్చుటయే) యాగము గావున, చరుపురోడాశాదికము (అన్నరూపమే గావున), నాస్వరూపమే. కావున, నేను యజ్ఞమునకు నిష్పాదకమైన దానను.

మరియు, పూర్వము నేనే దేవతలకు అన్నవిశేషరూప మగు అమృతమునకు బంధకమైనదానను (సంపాదించెడిదానను). ఇట్టి అన్న రూపమగు నన్ను ఏ పురుషుడు దానము చేయునో, ఆ పురుషుడే కాలాంతరమందు నన్ను పొందును. అనగా, లోకములో దాతా, అదాత అని మానవులు రెండు విధములు. ఒకడు ఇతరులకు పెట్టి (అన్నదానము చేసి) తాను తినును. అట్టి పురుషుడే కాలాంతర మందు అన్నమును పొందును. అన్నదాతకే కాలాంతరమందు అన్నము పుష్కలముగ లభించునని యర్థము. ఇక రెండవ పురుషుడు ఇతరులకు పెట్టకుండ తానే స్వయముగ భుజించును. అట్టి అదత్త్రాభిమానిని అన్నదేవుడనగు నేను నశింపజేయుచున్నాను. ఆ దాతకు కాలాంతరమందు అన్నముండదని భావము.

"పూర్వ మగ్నే రపి దహ త్యన్నం । య త్తౌ
హా౨ ౨సాతే అహముత్తరేషు । వ్యాత్త మస్య పశవ స్సు
జంభం । పశ్యంతి ధీరాః ప్రచరంతి పాకాః ।" (తై.బ్రా. 2-8-8.)

తా॥ అదాతలచే భుజించబడియెడి అన్నము జాఠరాగ్నికంటె పూర్వము అభోక్తను దహించును. అనగా, నరకహేతువగు ప్రత్యవాయము వెంటనే సంప్రాప్తమగును. లోకములో మానవులచే భుజించబడియెడి అన్నమును జఠరాగ్ని నాల్గు యామములకు (పండ్రెండు గంటలకు) జీర్ణము చేయును. ఇతరులకు దానము చేయకుండ తానే భుజించువానికి ఆ భుజించిన అన్నము (జీర్ణము కాకుండగనే) కంఠము దిగిన వెంటనే నరకహేతువగు పాపమును ఉత్పాదన చేయును. అందుచే జాఠరాగ్నికంటె ముందుగనే వానిని దహించు నని తాత్పర్యము. ఈ అభిప్రాయము ననుసరించియే, 'అదాతా విష మశ్నుతే' (అనగా, ఇతరులకు పెట్టకుండ తినువాడు విషమును భుజించును) అని స్మృతులు ఘోషించుచున్నవి. మరియు, దాత, అదాత, (ఉభయులు) అన్నసంపాదనకు ప్రయత్నము చేయుదురు. అనగా, దాత ఇతరులకు దానము చేయుటకు ప్రయత్నము చేయును. అదాత, తాను భుజించుటకు అన్నసంపాదనకు యత్నము చేయును. వారిరువురిలో, దానముకొరకు అన్నప్రయత్నము చేయువారు ఉత్కృష్టులు. ఆదాతలయందు కాలాంతరమందు నేను (అన్నదేవత) అక్షీణముగ నుందును. అనగా, అట్టివానికి కాలాంతరమున అన్నము సమృద్ధిగ లభించును. అదాతలను పశువులని (మూఢులని) శ్రుతి పేర్కొనుచున్నది. అట్టి అదాతలను గూర్చి అన్నదేవునియొక్క తీక్ష్ణదంతములతో గూడిన ముఖము తెరువబడియుండును. అనగా, అదాతలను భక్షించుటకు అన్నదేవుడు ఎల్లప్పుడును ఉద్యుక్తుడై యుండును.

ఈవిధమగు అన్నదేవుని అభిప్రాయమును దాత లగు ధీరులును తెలిసికొందురు. అదాతలగు మూఢులు అన్నదేవుని అభిప్రాయమును తెలిసికొనలేక, వారు ప్రకర్షగా భుజింతురేగాని, కొంచెమైనను దానము చేయరు.

*'జహా మ్యన్యం న జహా మ్యన్యం । అహ మన్నం*
*వశ మిచ్ఛరామి । సమాన మర్థం పర్యేమి భుంజత్ ।*
*కో మా మన్నం మనుష్యో దయేత ।     (తై. బ్రా. 2-8-8)*

తా॥ అన్నదేవుడనగు నేను ఆదాతను విడచిపెట్టుచున్నాను. దాతను విడచుట లేదు. అన్నదేవరూపుడనగు నేను స్వవశముగానే సంచరించుచుంటిని. (అదాతను పరిత్యజించుటయు, దాతను స్వీకరించుటయే స్వవశత్వము). ఏ పురుషుడు భోగదానములందు సమాను డగుచు ధనమును కోరునో, ఆ పురుషుని పాలించుచు అంతటను (సర్వతః) పొందెదను. ఎవడు భోగమాత్రలంపటు డగుచు, ధనము నపేక్షించునో, ఆ పురుషుని పరిపాలింపను. అతనిని పొందను. ఈ విధముగ అదాతను పరిత్యజించుచు, దాతృపక్షపాతముతో నున్న నన్ను (అన్నదేవుడనగు నన్ను) ఏమనుజుడు వారింపగలడు? ఎవడును నన్ను నివారించుటకు సమర్థుడు కాడని భావము.

"పరాకే అన్నం నిహితం లోక ఏతత్ । విశ్వై ర్దేవైః
పితృభి ర్గుప్త మన్నం । య దద్యతే లుప్యతే య త్పరో
ప్యతే । శతతమీ సా తనూ ర్మే బభూవ ।" (తై.బ్రా. 2-8-8.)

తా॥ పూర్వమంత్రములో అన్నదేవుడు "నేను స్వతంత్రుడను. నన్ను ఎవరు నివారించగలరు?" అని బలికిన స్వాతంత్ర్యము నుపపాదన చేయుటకు తన మాహాత్మ్యమును వర్ణించుచుండెను. అన్నముయొక్క వ్యవహారము పారలౌకికము, ఐహికము అని రెండు విధములు. అన్నదాత దేవలోకమందు గాని, పితృలోకమందుగాని ఈ అన్నము తనకు అగుగాక యను అభిప్రాయముతో బ్రాహ్మణులకు అన్నదానము చేయును. అందువలన దత్తమైన అన్నము దూరవర్తియగు లోకమందు నిహితమగును (సంగ్రమించబడును). ఆ దూరలోకములందు నిహితమైన అన్నము విశ్వేదేవతలచేతను, పితృదేవతలచేతను స్వార్థము (దాతకొరకు) రక్షించబడును. అగ్నియందు హుతమైన అన్నమును, బ్రాహ్మణులకొరకు దత్తమైన అన్నమును సేవించి, దేవతలును, పితృదేవతలును వర్తింతురు. ఈ విధముగ పారలౌకికాన్నవ్యవహారము చెప్పబడినది.

ఐహికాన్నవ్యవహారముకూడ బహువిధముగ చెప్పబడుచున్నది. ఏ అన్నము ప్రాణులచే భక్షింపబడుచున్నదో: ఏ అన్నము మాడిపోయిన దగుచు కుండయందుండునో; పర్యుషిత మగుచు (నిల్వ ఉండి) దుర్గంధోపేత మగునో; (ఈ విధములుగ నష్టమగునో), ఏ అన్నము తన ఐశ్వర్యప్రకటనకొరకు గృహమునకు బయట పరిత్యజించబడునో; ఈ విధముగ ఐహికాऽముష్మికాన్నరూప మగు ఆసర్వమున్ను, అన్నదేవుడ నగు నాయక్కొ శతసంఖ్యాపూరకమగు శరీరము (ఆసర్వము నాయొక్క లేశమే). నామాహాత్మ్య మిట్టి దని అన్నదేవుని వాక్యము.

"మహాంతౌ చరూ సకృద్దుగ్ధేన వప్రౌ । దివం చ
పృశ్నిు పృథివీం చ సాకం । తత్సం పిబంతో న మినంతి
వేధసః । నైత ద్భూయో భవతి నో కనీయః ।" (తై.బ్రా. 2-8-8.)

అన్నదేవుని మాహాత్మ్యము దృష్టాంతరపురస్సరము విస్తరింప బడుచున్నది -

తా॥ లోకములో అధికక్షీరములను ఇచ్చెడి గోవుయొక్క సకృద్దోహనముచే రెండు కుంభములను మానవుడు ఎట్లు పూరించునో (అట్టి గోవును ఒకమారు పాలు పితికినచో రెండుకుండలు ఎట్లు నిండునో), అట్లే గోబ్రాహ్మణులయందు దత్తమైన అన్నము స్వల్పమైనను, లోకద్వయమును ఒక్కమారు పూరించును. అనగా, అగ్నియందును, బ్రాహ్మణులయందును దత్తమైన యన్నము మంత్రపూతమగుచు సహస్రప్రకారములుగ ఫలించునని తాత్పర్యము.

'యావ దేకా దేవతా కామయతే యావ దేకా' అనగా మనచే దేవతలకు ఈయబడియెడి ఆహుతి ఏ యే దేవతకు ఎంత కావలెనో అంతగా వృద్ధి పొందును. ఈ శ్రుత్యనుసార మధికమగునని భావము.

ఆ యన్నమును సమ్యగ్భక్షణము (అనగా, దానపూర్వకముగ భక్షణము) చేయుచున్న బుద్ధిమంతులు తమ ఆత్మను, అన్నమును నశింపచేయరు. ఆయన్నము వర్ధమాన మగును గావున, అన్నమును హింసించరు. అభివృద్ధి మైన అన్నమును చిరకాలము భుజింతురు గావున, తమ ఆత్మనుకూడ హింసించరు. ఇంకను భోజనార్థమగు నన్నము ఎక్కువయు, తక్కువయు కానేరదు. అన్న మధికమైనచో అజీర్తి యగును. తక్కువైనచో, క్షురన్నివృత్తి కానేరదు. ఈ అర్థమునే భగవద్గీత చెప్పుచున్నది.

'నాత్యశ్నత స్తు యోగోస్తి నచైకాంత మనశ్నతః ।'

తా॥ ఈ విధముగ దానపురస్సరముగ యుక్త ప్రమాణముగ భుజించెడి పురుషులను లోకద్వయమందును అన్నదేవత పాలించును.

*'అన్నంప్రాణ మన్న మపాన మాహుః । అన్నం*
*మృత్యుం తము జీవాతు మాహుః అన్నం బ్రహ్మాణో*
*జరసం వదంతి । అన్న మాహుః ప్రజననం ప్రజానాం ।'* (తై.బ్రా. 2-8-8)

సర్వవ్యవహారములకు కారణమగుటచే అన్నముయొక్క మహత్త్వము నిర్వివాదమైనది. ఎట్లన,

తా॥ ఊర్ధ్వవర్తి యగు ప్రాణవాయువు, అధోవర్తి యగు అపానవాయువు (రెండును) అన్నజన్యమైన బలము వలననే సంచరించు చున్నవిగాన, అన్నరూపములు. రసవైషమ్యముచే వ్యాధిద్వారా మారకము గావున, అన్నము మృత్యురూపమైనది. ఆ యన్నదేవతనే జీవనౌష ధముగ చెప్పుచుండిరి. ఆయుర్వేదశాస్త్రాభిజ్ఞులగు బ్రాహ్మణులు అన్నమునే జరాహేతువుగ చెప్పుచుండిరి. కొన్ని ఆహారములచే శీఘ్రముగ తల అతి పలితత్వమును పొందునని (నెరయు నని) ఆయుర్వేద ప్రసిద్ధి, మరియు, అన్నమే ఇంద్రియవృద్ధి ద్వారా సంతానముయొక్క ఉత్పత్తికి కారణమనియు చెప్పుదురు.

*మోఘ మన్నం విందతే అప్రచేతాః । సత్యం బ్రవీమి*
*వధ ఇ త్స తస్య । నార్యమణం పుష్యతి నో సఖాయం ।*
*కేవలాఘో భవతి కేవలాదీ ।'*

తా॥ లోకములో అదాత (ఇతరులకు పెట్టకుండ భుజించువాడు ప్రకృష్టజ్ఞానరహితుడు (మూర్ఖుడు) వ్యర్థమైన అన్నమునే పొందును. ఈ విషయమున సత్యము చెప్పుచున్నాను.

కేవలవైయర్థ్యమే కాదు. మరేమన, ఈ అదత్తమగు అన్నపదార్థము దానరహితుడగు పురుషునకు వధయే (మరణమే). వధవలె బాధకమే. వైయర్థ్యమును స్పష్టీకరించుచున్నది శ్రుతి. అదాత యగు పురుషుడు అగ్నియందు ఆహుతులను చేయకపోవుట వలన (దేవతలకు హవిర్దానము చేయక పోవుటచే) అర్యమాదిదేవతలను పోషించదు. దానము లేకపోవుట వలన అతిథ్యాదిరూప మగు మనుష్యుని పోషించదు. అందుచే పరలోకమున కుపయోగపడదు గనుక, అదాతయొక్క అన్నము వ్యర్థము.

## వధహేతుత్వ స్పష్టీకరణము.

ఇతరులకు దానము చేయకుండ తానే భుజించు మానవుడు పాపమునే సంపాదించును గాని, పుణ్యమును సంపాదించడు. ఇది నరక హేతువుగాన, వధయే -

*"అహం మేఘస్స్తనయన్ వర్షన్నస్మి । మా మద్యం*
*త్యహ మద్మ్యన్యాన్ । అహగ్ం స దమృతో భవామి ।*
*మదాదిత్యా అధి సర్వే తపంతి ।"* (*తై.బ్రా. 2-8-8.*)

తా॥ అన్నదేవుని వచనము: లోకములో గర్జనము చేయుచు వర్షించుచుండెడి మేఘుడను నేను (అన్నదేవుడనే) ఐతిని. ఎందులకన, అగ్నియందు హోమము చేయబడిన అన్నము మేఘరూపముగ పరిణమించుచున్నది. కావున, మేఘుడను నేనే యని యర్థము. దాతలగు పురుషులు నన్ను (అన్నమును) సుఖముగ భక్షించెదరు. దానరహితులగు మానవులను నేనే (అన్నదేవుడనే) నశింపజేయుచున్నాను. నేనే అన్నదాతలకు పథ్యరూపుడనగుచు అమరణహేతు వగుచుంటిని. దాతలను దేవత్వమును పొందించుచుంటిని. ఆదిత్యులందరును నావల్లనుంచియే (అన్నజన్యబలము నుండియే) అధికముగ లోకమును తపింపచేయుచుండిరి. అనగా, అన్నమేలేనిచో ఆదిత్యులే జీవించరు. ఇంక తపింపచేయుటెట్లు?

నారాయణ మను ఉపనిషత్తులో జ్ఞానసాధనములను చెప్పు ప్రక్రమములో సన్యాసము హిరణ్యగర్భప్రాప్తికి అంతరంగసాధనమని చెప్పుచు, ఆదిత్యుని గమనావృత్తిచే సంవత్సర కాలము నిష్పన్నమగుటవలన సంవత్సరమున ఆదిత్యరూపమగు ప్రశంస చేసి, ఆదిత్య మండల ద్వారా సంవత్సరమును సర్వవ్యవహారకారణముగ శ్రుతి ప్రశంసించుచున్నది. దానిలో అన్నదాన విషయముకూడ కలదు.

*"యాభి రాదిత్య స్తపతి రశ్మిభిస్తాభిః పర్జన్యో వర్షతి*
*పర్జన్యే నౌషధివనస్పతయః ప్రజాయంత ఓషధివన*

స్పతిభి రన్నం భవ త్యన్నే ప్రాణాః ప్రాణై ర్బలం బలేన
తప స్తపసా శ్రద్ధా శ్రద్ధయా మేధా మేధయా మనీషా
మనీషయా మనో మనసా శాంతి శ్శాంత్యా చిత్తం
చిత్తేన స్మృతిగ్గ్ స్మృత్యాస్మారగ్గ్ స్మారేణ విజ్ఞానం విజ్ఞా
నేనాత్మానం వేదయతి తస్మా దన్నం దదన్ త్సర్వా
ణ్యేతాని దదా త్యన్నా త్ప్రాణా భవంతి భూతానాం
ప్రాణై ర్మనో మనసశ్చ విజ్ఞానం విజ్ఞానా దానందో
బ్రహ్మయోనిః ।" (తై. ఉ. నా.)

ఈ పరిదృశ్యమాను డగు ఆదిత్యుడు ఉష్ణస్వరూపము లగు ఏ రశ్ములచే అధిక మగు సంతాపమును చేయుచున్నాడో, ఆ రశ్ములచే భూమిగతమగు జలమును స్వీకరించి (ధూమజ్యోతిర్మత్తులయొక్క సంమేళనచే) పర్జన్యుడై వర్షించుచున్నాడు. ఆపర్జన్యునిచే వృష్టిజల ద్వారా వ్రీహ్యాదోషధులు, అశ్వత్థపనసాదివనస్పతులు ప్రకర్షగ ఉత్పన్నము లగుచున్నవి. ఆ ఓషధుల చేతను వనస్పతులచేతను, భోజ్యమగు అన్నము సంపన్న మగుచున్నది. ఆ అన్నముచే ప్రాణములు పోషించబడుచున్నవి. పుష్టములగు ఆ ప్రాణములచే శరీరమందు బలము సంపాదించబడుచున్నది. ఆ బలముచే కృచ్ఛచాంద్రాయణాది రూపమగు తపస్సు సంపన్న మగుచున్నది. ఆ తపస్సుచే పరిశుద్ధమైన చిత్తము గలవానికి తత్త్వవిషయమగు శ్రద్ధ జనించుచున్నది. ఆ శ్రద్ధచే ఏకాగ్రచిత్తును గురువుచే ఉపదేశింపబడిన గ్రంథముల యొక్కయు, తదర్థములయొక్కయు ధారణసామర్థ్యరూప మగు మేధ జనించును. ఆమేధచే బుద్ధి ఉత్పన్నమగును. (పరోక్షజ్ఞానము). ఆ బుద్ధిచే నిరంతరము తత్త్వవిషయకమగు మననము ఉత్పన్నమగును. ఆ మననముచే (క్రోధాదిదోషములకు ప్రసక్తి లేకపోవుటవలన) శాంతి ఉత్పన్నమగును. ఆ శాంతిచే విక్షేపరహితునకు తత్త్వవిషయ ప్రమాణజనిత జ్ఞానము జనించును. ఆ జ్ఞానముచే (నిద్రాదివ్యవధాన మున్నను) తత్త్వవిషయకమగు స్మృతిని పొందును. నిద్రాऽనంతర భావి యగు ఆ స్మృతిచే (స్మారం) నిరంతర స్మరణను పొందును. ఆ స్మరణచే విజాతీయప్రత్యయవ్యవధాన రహితమగు సజాతీయజ్ఞాన సాంతత్యమును పొందును. ఆ విజ్ఞానముచే పరమాత్మరూపత్వమును ఎల్లప్పుడును (సర్వదా) అనుభవించును. ఈ విధముగ అన్నము ప్రాణబలాదిపరంపరచే పరమాత్మానుభవమునకు కారణము గావున, ఇట్టి అన్నదానము చేయు పురుషుడు ప్రాణ బలాది ఆత్మానుభవాంతము లగు సర్వవస్తువులను దానము చేసినవాడగును.

అన్నదానము సర్వదానరూపమను విషయమును స్పష్టము చేయుటకు ఇంతవరకు చెప్పబడిన అర్థమునే తిరిగి "అన్నా త్ప్రాణాభవంతి" ఇత్యాదివాక్యముచే సంక్షేపముగ శ్రుతి

ఉపన్యసించుచున్నది. పూర్వోక్తమగు అన్నమువలన ప్రాణాదిపరంపరగా ఉత్పన్నమైన విజ్ఞానమువలన ఆనందరూపుడై, స్వయముగ వేదాంతప్రతి పాద్యము, సర్వజగత్కారణము అగు బ్రహ్మరూపుడగును.

## అనువాకశేషము.

ఇంతవరకు "సంవత్సరోసావాదిత్యః" మొదలుకొని, "ఆనందో బ్రహ్మయోనిః" వరకు ప్రకృతమగు అన్నదానమహత్త్వమును ప్రతిపాదించుటకు అనువదించబడినది. ఈ గ్రంథముకు పూర్వము జ్ఞానసాధనములలో సన్యాసము ఉత్తమమైన దని సన్యాసమును గూర్చిశ్రుతి వివరించినది. (అనువాకవిశేషముచేతను) గమనింపుడు.

"న్యాస ఇత్యాహు ర్మనీషిణో బ్రహ్మాణం ।" ఇతి. (తై.ఉ.నా.)

తా॥ సంన్యాస మనునది హిరణ్యగర్భప్రాప్తికి అంతరంగసాధనము గావున, హిరణ్యగర్భరూపమైనది. అందుచే దానిని ఉత్తమమగు మోక్షసాధన మని మహర్షులు (స్మృతికర్తలు) చెప్పుచుండిరి. తథాచ, "సంన్యాసా ద్బ్రహ్మణః స్థానం" ఇతి.

ఇత ఉత్తరమందు పూర్వోక్తమగు సంన్యాసమును స్తుతి చేయుటకు సంన్యాసముచే తత్త్వజ్ఞానమును పొందిన పురుషుని శ్రుతి ప్రశంసించుచున్నది.

*"స వా ఏష పురుషః పంచధా పంచాత్మా యేన*
*సర్వ మిదం ప్రోతం పృథివీ చాంతరిక్షం చ ద్యౌశ్చ దిశ*
*శ్చావాంతర దిశాశ్చ స వైసర్వ మిదం జగ త్స సభూ*
*తగ్ం సభవ్యం జిజ్ఞాసకప్తఋతజా రయిష్ఠా శ్రద్ధా*
*సత్యోమహస్వాన్ తమసో వరిష్టాత్ ।"* (తై.ఉ.)

తా॥ ఏ పురుషుడు సంన్యాసపురస్సరముగ తత్వజ్ఞానమును సంపాదించునో, ఆ పురుషుడు పంచవింశతివస్తుస్వరూపు డగుచున్నాడు. శబ్దస్పర్శాదిగుణపంచకము, పృథివ్యాదిభూతపంకము. చక్షుశ్శోత్రాదిజ్ఞానేంద్రియపంచకము, వాక్పాణిపాదపాయూపస్థరూపమగు కర్మేంద్రియపంచకము, ప్రాణాపానాదివాయుపంచకము కలసి మొత్తము పంచవింశతి (25) వస్తువులు. తత్వజ్ఞానముచే బ్రహ్మరూపుడగుటవలన ఈ పంచవింశతి వస్తువుల స్వరూపుడగుచున్నాడు.

అథవా, పూర్వోక్తజ్ఞాని ఐదు ఆత్మలచే ఐదు ప్రకారము లగుచున్నాడు.

*"భూతాత్మా చేంద్రియాత్మా చ ప్రధానాత్మా తతో భవాన్ ।*
*ఆత్మా చ పరమాత్మా చ త్వ మేకః పంచధా స్థితః ।"* (పురా)

తా॥ ఏ బ్రహ్మరూపముచే ఈసర్వజగత్తు (పృథివి, అంతరిక్షము, ద్యులోకము, దిక్కులు, అవాంతరదిక్కులు) సూత్రమందు మణిగణములువలె ప్రకర్షగా వ్యాప్తమైనవో (సవై సర్వమిత్యాది), పృథివ్యాదిసర్వవస్తువ్యాపి యగు ఆ పురుషుడే వర్తమాన మగు జగత్తుయొక్కయు, అతీతజగత్తు యొక్కయు, భవిష్యజ్జగత్తుయొక్కయు రూపుడగుచున్నాడు.

ప్రశ్న: తత్వవేత్త యగు పురుషుడు అజ్ఞానివలె హస్తపాదాదులతో కూడిన దేహరూపుడుగనే చూడబడుచున్నాడు. కాని సర్వజగత్స్వరూపుడుగ చూడబడుటలేదుగదా! సర్వజగత్స్వరూపు డెట్లు?

జ: ఈ జ్ఞాని వేదాంతవిచారముచే సర్వాత్మకుడుగ నిశ్చితుడగుచున్నాడు. అనగా, జిజ్ఞాసాకాలమందు భ్రాంతిజ్ఞానరూపములగు పూర్వపక్షములు నిరాకృతములు కాగా, ప్రామాణిక మగు (సత్యమగు) సిద్ధాంతజ్ఞానముచే సర్వాత్మకు డగుచున్నాడు. మరియు నాతడు ధనరూపమగు గురూపదేశమునందున్నవాడు (రయిష్ఠాః). అనగా, గురుపూదేశరహితులకు ఇది లభించునది కాదు. ఇట్టి స్వరూప విజ్ఞానము శ్రద్ధచే లభ్యమగునుగావున శ్రద్ధారూపుడితడు "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం, ఇతి స్మృతే". కాలత్రయాऽబాధ్య మగు బ్రహ్మస్వరూపుడు గాన సత్యుడు. తేజస్వంతుడు, స్వయంప్రకాశ రూపుడు గావుననే సంసారకారణమగు అజ్ఞానముతో వియుక్తుడు. అందుచే దానికి (అనగా అజ్ఞానముకు) ఉపరిభాగమున నున్నవాడు.

## జ్ఞానయుక్తునకు ఫలము.

*"జ్ఞాత్వా త మేవం మనసా హృదా చ భూయోన*
*మృత్యు ముపయాహీ విద్వాన్ ।". (నారా.)*

తా॥ ఈ విధముగ సంన్యాసపూర్వకజ్ఞానయుక్తుడగు పురుషుని ప్రశంసించి ఆ జ్ఞానికి ఫలమును శ్రుతి చూపించుచున్నది. అనువాకాదియందు "ప్రాజాపత్యో హారుణిః" ఇత్యాది అఖ్యాయికచే ప్రజాపతీ సుపర్ణుల పుత్రుడగు అరుణి యనువాడు తన తండ్రివద్దకు (మోక్ష సాధనములలో ఉత్తమసాధనమును తెలిసికొను నిచ్చతో) వినయ పూర్వకముగ జని, ఉపసన్నుడై ఈ విధముగ అడిగెను. "ఓతండ్రీ! పూజ్యులగు మహర్షులు మోక్షసాధనములలో దేనిని ఉత్తమసాధనముగ చెప్పుచుండిరో దానిని శలవిండు" అని కోరగా, ప్రజాపతి ఆరుణికి సత్యము, తపస్సు, మున్నగు సాధనములను జెప్పి, అంతమున సంన్యాసమును ఉత్తమసాధనముగ జెప్పెను. జ్ఞానికి ఫలము నీ క్రింది విధముగ చెప్పెను.

"ఓ అరుణే! నీవు హృదయపుండరీకమం దుండుటచే హృదయరూప మగు మనస్సుచే పూర్వోక్తసంన్యాససాధనముచే పరమాత్మను తెలిసికొని, జ్ఞానయుక్తుడవగుచు, తిరిగి

పునర్మృత్యువును పొందకుము." అనగా, జ్ఞానికి వర్తమానదేహపాతానంతరము జన్మ లేకపోవటవలన పునర్మృత్యువు లేదని భావము.

## సంన్యాసోపసంహారము.

"తస్మా న్న్యాస మేషాం తపసా మతిరిక్త మాహుః ।" ఇతి. (ఉప.)

తా॥ సత్యము మున్నగుతపస్సులలో పురుషార్థముకు అంతరంగ సాధన మగుటవలన సంన్యాసమును ఉత్కృష్టసాధనముగ మహర్షులు చెప్పుచుండిరి. ఈ విధముగ ప్రజాపతి అరుణికి సంన్యాసమును ఉత్తమసాధనముగ చెప్పెను.

## అంతర్యామిస్తుతి.

**సం**న్యాసానంతరము ప్రణవముచే ఆత్మయందు సమాధిని విధించబోవుచు, విఘ్నపరిహారము కొరకు ఆదియందు అంతర్యామిని సర్వకారణమగు స్తుతిని శ్రుతి బోధించుచున్నది.

*ఉప: "వసు రణ్వో విభూ రసిప్రాణే త్వ మసి*
*సంధాతా బ్రహ్మన్ త్వ మసి విశ్వధృత్తేజోదా స్త్వమ*
*స్యగ్ని రసి వర్చోదా స్త్వ మసి సూర్యస్య ద్యుమ్నోదా*
*స్త్వ మసి చంద్రమస ఉపయామగృహీతోసి బ్రహ్మణే*
*త్వా మహసే ।"*

"ఓ అంతర్యామి! నీవు వస్తుతత్త్వమును గూర్చి మా అనుగ్రహము కొరకు ఉపదేష్ట వయితివి. హిరణ్యగర్భవిరాడాదివివిధ రూపముగ ఉత్పన్నుడవైతివి. ప్రాణరూపుడగు వాయువునందు జీవాత్మను యోజన చేయువాడవైతివి. బ్రహ్మాండధారకు దగువాయురూపుడవు. భూలోకవర్తి యగు అగ్నికి ప్రకాశ నిచ్చువాడవు. ద్యులోక వర్తి యగు సూర్యునకు ప్రకాశరూపధన ప్రదుడవు. చంద్రునకు కూడ ప్రకాశరూపధన ప్రదుడవు. మరియు, యాగములందు సోమలతారూపుడ వగుచు, మృన్మయ, దారుమయ పాత్రలచే గ్రహించబడుచుంటివి. ఈ విధముగ అంతర్యామిరూపుడ వగుచు సర్వకర్తవగు నిన్ను జ్యోతిస్స్వరూప మగు బ్రహ్మతత్త్వాభివ్యక్తి కొరకు సేవించుచుంటిని.

## సంన్యాసికి సమాధివిధానము.

*ఉప: "ఓ మిత్యాత్మానం యుంజీత ।"*

తా॥ త్రిమాత్రప్రణవోచ్చారణ పూర్వకముగ సర్వవేదాంత ప్రతిపాద్యుడగు పరమాత్మను స్వాత్మరూపముగ తన చిత్తమందు సంన్యాసి సంధానము చేసికొనవలెను.

## ఓంకారప్రశంస.

ఉప: "ఏత ద్వైమహోపనిషదం దేవానాం గుహ్యం ।"

తా॥ "సర్వే వేదా య త్పద మామనంతి" అను కఠవల్లీ శ్రుత్యనుసారము అనేకములగు ఉపనిషత్తులచే ప్రతిపాద్యమును, నిర్గుణతత్త్వప్రతిపాదకమును నగు ప్రణవరూపము ఇంద్రాదిదేవతలకు గోప్యమైనది. అనగా, ఆ ఇంద్రాదిదేవతలు శమదమాద్యధికార సంపత్తి రహితునకు ప్రణవమును ఉపదేశించరు.

## తత్త్వవేదనఫలము.

"య ఏవం వేద బ్రహ్మణో మహిమాన మాప్నోతి
తస్మా ద్బ్రహ్మణో మహీనం ।" (ఉప.)

తా॥ ఏ పురుషుడు సంన్యాసానంతరమున ప్రణవముచే బ్రహ్మ తత్త్వసమాధిని చేయుచు వేదాంతమహావాక్యోక్త ప్రకారముగ బ్రహ్మ తత్త్వమును తెలిసికొనునో, ఆ జ్ఞాని తనయందు అవిద్యచే కల్పితమైన జీవత్వాపాదక మగు పరిచ్ఛేదశూన్యు డగు బ్రహ్మయొక్క మహత్వమును పొందును. అనగా, తత్త్వవేదనముచే జీవత్వకృత్యభ్రమ నివృత్తమగును. బ్రహ్మ స్వరూపావిర్భావ మగును. దాని వలన జీవన్ముక్తు డగును. ప్రారబ్ధ భోగక్షయముచే దేహపాతానంతరము సంపూర్ణముగ అవిద్యానివర్తకమగు ఆ వేదనము వలన అవిద్యాతత్కార్య వాసనాలేశములు లేని ముఖ్యబ్రహ్మ యొక్క మహత్వమును పొందును. విదేహముక్తి సిద్ధించును. ఈ విధముగ అతీతగ్రంథముచే చెప్పబడినవిద్య రహస్యమైనది.

## నచికేతోపాఖ్యానము.

"ఉశన్ హ వైవా జశ్రవస స్సర్వవేదసం దదౌ । తస్య
హ నచికేతా నామ పుత్ర అస । తగ్ం హ కుమారగ్ం
సంతం । దక్షిణాసు నీయమానాసు శ్రద్ధావివేశ । స
హోవాచ । తత కస్మై మాం దాస్యసీతి । ద్వితీయం
తృతీయం ।" (తై. బ్రా. 3-11-8.)

తా॥ అన్నదానమహిమ ప్రసంగముచే అన్నదాననిమిత్తమగు కీర్తిశాలి యగు వాజశ్రవస్సు యొక్క పుత్రుడగు వాజశ్రవసుడు (ఉద్దాలకుడు) యొక్క పుత్రుడగు నచికేతునియొక్క ఉపాఖ్యానము చెప్పబడుచున్నది.

ఉద్దాలకుని తండ్రి యగు వాజశ్రవస్సు గొప్ప అన్నదాత యగుటచే అతనికి నచికేతు డను లోకవిఖ్యాతయశశ్శాలి యగు పౌత్రుడు జనించెను. అనగా, పితామహుడగు వాజశ్రవస్సు యొక్క అన్నదానప్రభావమువలన ఈతడు జనించెనుగాన, ఈతని ఉపాఖ్యానము ప్రసక్తము.

మం. తా॥ వాజశ్రవస్సు యొక్క పుత్రుడగు ఉద్దాలకుడు సర్వస్వదక్షిణాక మగు విశ్వజిద్యాగము యొక్క ఫలమును కోరుచున్న వాడగుచు, ఆ క్రతువును చేయనారంభించెను. అనగా, తనకు గల యావత్తు ధనమును దక్షిణగ నిచ్చెడి క్రతువునకు విశ్వజిద్యాగమని పేరు. ఆ క్రతువులో ఐదవ దివసమున "మాధ్యందినే సవనే దక్షిణా నీయంతే" అను సూత్రానుసారము మాధ్యందినసవనములో దక్షిణలను ఇవ్వవలెను గాన, తనకు ఉన్న యావత్తు ధనమును ఆ క్రతుమధ్యమందలి మాధ్యందినసవనములో దక్షిణగ నిచ్చెను.

ఆ ఉద్దాలకునకు నచికేతు డను కుమారుడుండెను. అప్పుడాబాలుడు ఉపనయనమునకు యోగ్యవయస్సుకలవాడుగ నుండెను. తన తండ్రి ఋత్విక్కులకు దక్షిణలను యథాశాస్త్రముగ నివ్వనిచో క్రతువైకల్యము సంభవించు నను బుద్ధి కుమారుడగు నచికేతునకు (దక్షిణాదానసమయమున) జనించెను. మరియు, శ్రద్ధావిశిష్టుడగు నాకుమారుడు తన మనంబున నిట్లు విచారణ చేసెను. "నా తండ్రి తనకు గల యావత్తు ధనమును దక్షిణగ నిచ్చెదనని క్రతు సంకల్పముచేసెను. ఆతనికి పుత్రుడనగు నేను పుత్రధనముగాన, ధనభూతుడ నగు నన్ను కూడ దక్షిణగ నొక ఋత్విక్కున కివ్వనిచో క్రతు సాద్గుణ్యము కానేర" దని యోచించి తండ్రిని గూర్చిఈ క్రింది విధముగ బల్కెను.

"ఓతండ్రీ! నన్ను ఏ ఋత్విక్కునకు ఇచ్చెదవు?" అనెను. అప్పుడు తండ్రి, 'వీడు బాలుడు మూఢుడు' అని పుత్రుని వచనమును ఉపేక్ష చేసి, జవాబు చెప్పక ఊరకుండెను.

ఇట్లు ప్రత్యుత్తర మీయక నూరకున్న తండ్రినిగూర్చి (ధనరూపుడగు తనను ఒక ఋత్విక్కున కీయకుండ క్రతుపూర్తి కానిచ్చినచో క్రతువైకల్యము సంభవించునను శ్రద్ధతో) రెండవమారును, మూడవమారును గూడ 'నన్ను యే ఋత్విక్కున కిచ్చెద' వని కుమారుడు ప్రశ్నించెను.

## తండ్రి ప్రత్యుత్తరము.

*"తగ్ం హ పరీత ఉవాచ । మృత్యవే త్వా దదామీతి ।" (తై.బ్రా. 3-11-8)*

తా॥ ఇట్లు కుమారుడు రెండు, మూడు పర్యాయములు ప్రశ్నించగనే తండ్రి కోపగ్రస్తుడై, వీడు బాలుడు కాదు, ధూర్తుడు అని యోచించి, కుమారునకు అభిముఖుడై,

కోపా౽౽వేశముతో 'నిన్ను మృత్యువుకు (యమునికి) ఇచ్చుచుంటిని' అని (కుమారుని గూర్చి) బల్కెను. ఆ సమయమున ఒక అశరీరవాక్కు బాలుడగు నచికేతును ఈ క్రింది విధముగ అనుగ్రహించెను.

## అకాశవాణి అనుగ్రహప్రకారము.

*'తగ్ం హ స్మోత్థితం వా గభివదతి । గౌతమకుమార*
*మితి । సహోవాచ । పరేహి మృత్యోర్గృహాన్ । మృత్యవే*
*వై త్వా౽దామితి ।* *(తై.బ్రా. 3-4-8.)*

తా॥ ఈ విధముగ కోపయుక్తమగు తండ్రియొక్క అవాక్యమును వినినతోడనే, తండ్రి సమీపమునుండి ఆవలకు పోవుటకు లేచిన కుమారుని కభిముఖముగ అనుగ్రహపరురాలగు దైవీవాక్కు (ఆకాశవాణి) ఈ విధముగ పలికెను.

'గౌతమగోత్రోత్పన్నుడ వగు ఓ నచికేతుడా! నీ తండ్రి ఈ విధముగ బల్కెను. 'ఓపుత్రా, నీవు మృత్యువుయొక్క గృహమును గూర్చి వెళ్లుము. మృత్యువుకే నిన్ను ఇచ్చితిని' అని నీ తండ్రి నిజము గనే బల్కెను. ఈ విధముగ తండ్రియొక్క అభిప్రాయమును విశదీకరించి ఆవాగ్దేవత కుమారు ననుగ్రహించుటకు బుద్ధిప్రదానము చేయుచున్నది.

## అకాశవాణిబుద్ధి ప్రధానము.

*'తం వై ప్రవసంతం గంతాసీతి హోవాచ । తస్య*
*స్మ తిస్రో రాత్రీ రవాశ్వాన్ గృహే వసతాత్ । స యది*
*త్వా పృచ్ఛేత్ । కుమార కతి రాత్రీ రవాత్సీ రితి । తిస్ర*
*ఇతి ప్రతిబ్రూతాత్ । కిం ప్రథమాగ్ం రాత్రి మాశ్నా*
*ఇతి । ప్రజాం త ఇతి । కిం ద్వితీయామితి । పశూగ్ స్త*
*ఇతి । కిం తృతీయామితి । సాధుకృత్యాం త ఇతి ।'(తై.బ్రా. 3-11-8)*

తా॥ ఓ నచికేతా! నీవు నీ తండ్రి వచనానుసారము యముని వద్దకు వెడలునపుడు యముడు తన గృహమునుండి బయలుదేరి ప్రవాసము వెడలిన వానినిగ తెలిసికొని యముని గృహమున కేగుము. మరియు, నీవు యముని గృహమునకు వెడలినపిమ్మట అతని భార్యాపుత్రాదులు భోజనముచేయమని నిన్ను ప్రార్థించినను నీవు భోజనము చేయకుండ మూడు రాత్రులు యముని ఇంట నివసించుము. పిమ్మట యముడు గ్రామాంతరమునుండి తన యింటికి వచ్చి, 'ఓకుమారా, నీవు ఎన్ని రాత్రులు మా యింట నివసించితివి?' అని నిన్నడిగినచో, 'మూడురాత్రులు ఉంటిని' అని సత్యమునే చెప్పుము.

అనంతరము, 'ప్రథమరాత్రియందు దేనిని భుజించితివి?' అని యముడు అడిగినచో, 'సంతానమును భుజించితిని' అని సమాధానము చెప్పుము.

(దీనివలన, అతిథి గృహస్థుయొక్క గృహమందు ఒక రాత్రి భోజనము చేయకుండ నుండినచో ఆ యజమానియొక్క సంతానము నశించుననిసూచితమగుచున్నది.)

ఇట్లే, రెండవదినమున ఏమి భుజించితివి?' అని యముడు ప్రశ్నించినచో, 'నీ పశువులను భుజించితి' నని చెప్పుము.

(దీనివలన, రెండవదినమందు అతిథి భోజనము చేయకుండ నుండినచో యజమాని యొక్క పశువులు నశించునని సూచిత మగుచున్నది)

తిరిగి, 'మూడవదినమున దేనిని భుజించితివి?' అని యముడు అడిగినచో, 'నీపుణ్య కర్మను భుజించితిని' అని చెప్పుము.

(దీనివలన మూడవదినమున అతిథి యజమానగృహమందు భోజనరహితుడుగ నుండినచో యజమానియొక్క పుణ్యకర్మ నశించునని సూచింపబడుచున్నది.)

## అశరీరవాణి వాగనుసారము నచికేతుడు వర్తించుట.

*'తం వై ప్రవసంతం జగామ । తస్య హ తిస్రో రాత్రీ*
*రనాశ్వాన్ గృహ ఉవాస । త మాగత్య పప్రచ్ఛ । కుమార*
*కతి రాత్రీ వవాత్సీ రితి । తిస్ర ఇతి ప్రత్యువాచ । కిం*
*ప్రథమాగ్ం రాత్రి మాశ్నా ఇతి । ప్రజాం త ఇతి । కిం*
*ద్వితీయా మితి । పశూగ్ స్త ఇతి । కిం తృతీయా మితి ।*
*సాధుకృత్యాం త ఇతి ।'*
*(తై. బ్రా. 3-11-8)*

తా॥ అనంతరము ఆ నచికేతుడు అశరీరవాణి చెప్పిన విధముగ యముడు ప్రవాసము వెడలిన సంగతి తెలిసికొని, యముని గృహమునకు వెడలి, భోజనము చేయకుండ మూడు రాత్రులు నివసించెను. అంతట యముడు ప్రవాసమునుండి ఇంటికి వచ్చి, ఆ నచికేతుని చూచి, 'వత్సా! నీవు ఎన్ని దినములు మా యింట నుంటివి?' అని ప్రశ్నించెను. వెంటనే నచికేతుడు 'మూడు రాత్రులుంటిని' అని జవాబు చెప్పెను. వెంటనే యముడు 'ప్రథమ దివసమున ఏమి భుజించితివి' అని నచికేతు నడిగెను. 'నీ సంతానమును భుజించితి' నని నచికేతుడు ప్రత్యుత్తరమిచ్చెను. 'రెండవరాత్రి యేమి భుజించితివి?' అని యముడు అడుగగా 'నీ పశువులను భుజించితి' నని నచికేతుడు సమాధానము చెప్పెను. 'మూడవ రాత్రి ఏమి భుజించితివని తిరిగి యముడు ప్రశ్నించగా, 'నీ పుణ్యకర్మను భుజించితి నని నచికేతుడు జవాబిచ్చెను.

## నచికేతునకు యముని సత్కారము.

"నమ స్తే అస్తు భగవ ఇతి హోవాచ । వరం వృణీ
ష్వేతి । పితర మేవ జీవన్నయానీతి ।" (తై.బ్రా. 3-11-8.)

తా॥ ప్రతివచనములకు పూర్వము నచికేతుని బాలునిగను మూర్ఖునిగను అనుకొనిన యముడాతనిని 'కుమారా!' అని సంబోధించెను. గాని, ఈ పై విధములగు నచికేతుని ప్రతివచనములను వినిన తోడనే యముడు అతనిని శాస్త్రార్థరహస్యా ఽ__భిజ్ఞునిగా గుర్తించి, 'ఈతడు సత్కరించదగిన వాడుగాని, మారణీయుడు (చంపదగినవాడు) కాడని నిశ్చయించి, ఈ క్రింది విధముగ సత్కరించెను.

## భగవల్లకస్త్రణము.

శ్లో॥ "ఉత్పత్తిం చ వినాశం చ భూతానా మాగతిం గతిం ।
వేత్తి విద్యా మవిద్యాం చ సవాచ్యో భగవా నితి ।"

తా॥ భూతముల యొక్క ఉత్పత్తి వినాశములను, గమనాగమనములను, విద్యాఽ__విద్యలను దెలిసికొనినవాడు భగవంతుడని చెప్పబడును. ఈ శాస్త్రానుసారము భగవల్లక్షణములతోగూడిన అభిజ్ఞునిగ దెలిసికొని నచికేతుని భగవచ్ఛబ్దముచే సంబోధించి, మూడు రాత్రులు తన యింట ఉపవాసము చేయుటచే సంప్రాప్తమయిన స్వాపరాధమును పరిహరించుటకు మూడు వరముల నిచ్చెను.

"షడ్గుణైశ్వర్యసంపన్నుడ వగు ఓ నచికేతా! నీ కొరకు నమస్కారము. నీవు భోజనరహితుడవై మూడు రాత్రులు నాయింట నుంటివి. ఈ ప్రత్యవాయపరిహారము కొరకు నీవు వరమును కోరుకొనుము" అని యముడు నచికేతుని గూర్చి బలికెను.

## నచికేతుని ప్రథమవరము.

"పితరమేవ జీవ న్న యానీతి ।" (తై.బ్రా. 3-11-8.)

తా॥ ఓయముడా! నీచే నేను చంపబడకుండ జీవించి యుండియే నాతండ్రిని పొందెదను గాక!

## ప్రశ్నోత్తరములచే ద్వితీయ వరప్రదర్శనము.

"ద్వితీయం వృణీష్వేతి । ఇష్టాపూర్తయో ర్మేఽ__క్షితిం
బ్రూహీతి హోవాచ । తస్మై హైత మగ్నిం నాచికేత
మువాచ । తతో వై తస్యేష్టాపూర్తే నాక్షీయేతే ।" (తై.బ్రా. 3-11-8.)

తా॥ అనంతరము రెండవవరము కొరకు యమునిచే ప్రార్థించబడిన నచికేతుడు తనకు శ్రౌత, స్మార్తకర్మఫలముల యొక్క అక్షయముకు సాధనము నుపదేశింపుమని కోరెను. పిమ్మట యముడు నాచికేతాగ్నిచయనము వలనను, ధ్యానమువలనను, క్షయరహితమగు శ్రౌత, స్మార్త కర్మలఫలము సంభవించు నని పలికెను.

"నా స్యేష్టాపూర్తే క్షీయేతే । యోగ్నిం నాచికేతం
చినుతే । య ఉ చైన మేవం వేద ।"

తా॥ ఇతరునకు గూడ ఈ నాచికేతాగ్ని చయనమువలనను, వేదనమువలనను శ్రౌత, స్మార్తకర్మ సుకృతముల యొక్క క్షయ రాహిత్యము సిద్ధించును.

## ప్రశ్నోత్తరములచే తృతీయ వరప్రదర్శనము.

"తృతీయం వృణీష్వేతి । పున ర్మృత్యో ర్మేపచితిం
బ్రూహీతి హోవాచ । తస్మై హైత మగ్నిం నాచికేత
మువాచ । తతో వైసో ప పునర్మృత్యు మజయత్ । అప
పునర్మృత్యుం జయితి । యోగ్నిం నాచికేతం చినుతే ।
య ఉచైన మేవం వేద ।" (తై. బ్రా. 3-11-8)

తా॥ "వర్తమానశరీరమున కొక పర్యాయము మృత్యువు సంప్రాప్త మగును. ఈ దేహ పాతానంతరము తిరిగి మరియొక జన్మను స్వీకరించినచో వచ్చెడి మృత్యువును పునర్మృత్యువందురు. వర్తమానదేహపాతానంతరము తిరిగి జన్మస్వీకారము లేకుండ ముక్తి సిద్ధించినచో, అదియే పునర్మృత్యువుకు అపక్షయము. అనగా, మృత్యువుకు అపజయమే పురుషునకు జయము. అట్టి పునర్మృత్యువుకు అపజయహేతువును జెప్పుము." అని నచికేతుడు మూడవ వరమును కోరెను. అనగా, వర్తమానదేహపాతానంతరము అర్వాచీన జన్మ స్వీకారము లేకుండ ముక్తి సిద్ధించు ఉపాయమును చెప్పుమని తాత్పర్యము.

ఈ విధముగ వరమును కోరిన నచికేతువునకు పూర్వోక్తమైన నాచికేతాగ్ని చయన ధ్యానములనే అట్టి ముక్తికి సాధనములనుగ యముడు బల్కెను.

ఫలితము: పూర్వము చెప్పిన నాచికేతాగ్నిచయన, ఉపాసనలలో చయనముకు ప్రాధాన్యము, ఉపాసనకు ఉపసర్జనత్వము ఏ మానవునకో, వానికి అక్షయ మగు శ్రౌత, స్మార్తసుకృతము లభించును. (అనగా, చిరకాలము పుణ్యలోకముల ననుభవించి తిరిగి జన్మను స్వీకరించుట).

ఏ మానవునకు పూర్వోక్తము లగు నాచికేతాగ్నిచయన, ఉపాసనలలో నాచికేతాగ్ని చయనమునకు ఉపసర్జనత్వము (అనగా, అప్రాధాన్యము), ఉపాసనకు ప్రాధాన్యము నుండునో, ఆ మానవునకు బ్రహ్మలోక ప్రాప్తి ద్వారా ముక్తియే గాని, జన్మాంతరము లేదు.

ఈ విధముగ వరముల విభాగము.

ఇట్లు నాచికేతాగ్ని యొక్క ఉపాసనకు ప్రాధాన్యము, నాచికేతాగ్ని చయనముకు ఉపసర్జనత్వము నచికేతువు అనుష్ఠానము చేసి పునర్మృత్యువును జయించెను. పునర్జన్మ లేకుండ ముక్తిని పొందెను. ఇతడు కూడ నాచికేతాగ్న్యుపాసనా ప్రాధాన్యముచే ముక్తిని పొందును.

ఈ విధముగ కృష్ణయజుర్వేదమందైన నచికేతోపాఖ్యానము అనువదింపబడినది. ఈ అనువాకశేషము హిరణ్యప్రకరణములో వ్రాయడమైనది. అన్నదానమును లోకోత్తరముగ చేయుటచే వాజశ్రవసునికి ఇట్టి నచికేతుడు జన్మించెను. దీనివలన అన్నదాన మహిమ జ్ఞాపిత మగుచున్నది.





శ్రీ మహాగణాధిపతయే నమః ।

# వేదసార రత్నావళి

## 21. వేదప్రాశస్త్యము

### వేదభాగములు.

"మంత్రబ్రాహ్మణయో ర్వేదనామధేయం" అను ఆపస్తంబ పరిభాషానుసారము మంత్రములు, బ్రాహ్మణము అను రెండు భాగములకు వేదమని పేరు.

### మంత్ర బ్రాహ్మణ లక్షణము.

కర్మాచరణకాలమున ఏ వేదవాక్యము నుచ్చరించి కర్మను చేయుదురో దానిని మంత్రమందురు. "అనుష్ఠేయార్థస్మారకత్వం మంత్రత్వం" అను లక్షణానుసారము మనచే అనుష్ఠానము చేయదగిన అర్థమును స్మరింపజేయునది మంత్రము.

"విధాయకం వాక్యం బ్రాహ్మణం" అను లక్షణానుసారము కర్మానుష్ఠానకాలమున ఉచ్చారణప్రసక్తి లేకయే కేవలము కర్మలను విధించెడి వేదవాక్యములను బ్రాహ్మణ మందురు. వేదాపౌరుషేయత్వప్రకరణములో లక్షణము, అపౌరుషేయత్వాదికము వివరణ చేయబడినదిగాన, ఇచ్చట సంక్షేపముగ సూచించబడును.

యాజ్ఞికులు వేటిని మంత్రములని వ్యవహరింతురో అవి మంత్రములు. ఏ వేదభాగమును బ్రాహ్మణ మని వ్యవహరింతురో అదియే బ్రాహ్మణము. అనగా, యాజ్ఞికుల సమాఖ్యను అనుసరించి మంత్రబ్రాహ్మణములను తెలిసికొనవలసినదిగ పూర్వమీమాంసలో నిర్ణయించబడినది.

*యాజ్ఞికానాం సమాఖ్యానం లక్షణం దోషవర్జితం ।"(పూ. మీ. జై. న్యా.)*

పూర్వమీమాంసకులు బ్రాహ్మణభాగమును విధి, నామధేయ, నిషేధ, అర్థవాద భేదములచే నాలుగు విధములుగ విభజించిరి. వీటిలో విధిభాగము నాలుగు విధములు: ఉత్పత్తి విధి, వినియోగవిధి, ప్రయోగవిధి, అధికారివిధి అని.

1. ఉత్పత్తి విధి: కర్మస్వరూపమాత్రమును బోధించును. ఉదా: 'అగ్నిహోత్రం జుహోతి' 'సోమేన యజేత' అను విధివాక్యములు కేవలము అగ్నిహోత్రనామక మగు కర్మను (సోమయాగమును) చేయవలసినదిగ బోధించును.

2. వినియోగవిధి: అంగాంగిభావసంబంధమును బోధించును. సర్వత్ర విధిస్థలములో 'కిం', 'కేన', 'కథం' అని మూడు అంశలు గలభావన చెప్పబడును.

ఉదా: 'సోమేన యజేత' 'దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామోయజేత' మున్నగు విధివాక్యములలో 'యజేత' అను పదములో యజధాతువు (ప్రకృతి), ప్రత్యయము అను రెండు అంశములు గలవు. (అఖ్యాతత్వము, లిఙ్త్వము). ఆ రెండింటిలో ఆఖ్యాతత్వాం శచే ఆర్థీభావన చెప్పబడును. లిఙ్త్వాంశచే శాబ్దీభావనచెప్పబడును. (భావనలో కిం, కేన, కథం, అను మూడంశ లుండును) (అనగా భావ్యము, కరణము, ఇతి కర్తవ్యతా).

అర్థీభావన పురుషప్రవృత్తిరూపము. శాబ్దీ భావన ప్రవర్తనా రూపము (అనగా పురుషప్రవృత్యనుకూల వ్యాపారము). లిఙ్‌యొక్క శ్రవణముచే "ఇది నన్ను ప్రవర్తింపచేయుచున్నది". అను జ్ఞానము కలుగును. గాన, శాబ్దీభావనలో లిజజ్ఞానము కరణము. (అంశత్రయోపేత మగు) ఆర్థీభావన భావ్యము. అర్థవాదులచే బోధించబడియెడి ప్రాశస్త్యజ్ఞానము ఇతికర్తవ్యతారూపము.

ఆర్థీభావనలో యాగము కరణముగా అన్వయించును. స్వర్గ పదవాచ్య మగు స్వర్గము భావ్యముగ అన్వయించును. ఇక, దీనికి కథంభావాऽऽకాంక్ష కలదు. ప్రకృతములో 'దర్శపూర్ణ మాసాభ్యాం స్వర్గకామో యజేత' అను వాక్యవిహితములగు "దర్శపూర్ణమాసేష్టులకు పై విధముగ కథంబావాऽऽకాంక్ష (అంగాऽऽకాంక్ష) కలదు. "సమిధో యజతీ" త్యాది వాక్యవిహితములగు ప్రయాజలకు ఇదే విధముగ 'కిం భావయేత్' అను భావ్యాऽऽకాంక్ష కలదు. ఈవిధముగ పరస్పరాऽऽకాంక్షా (ఉభయాऽऽకాంక్షా) రూపమగు ప్రకరణ ప్రమాణముచే ప్రయాజలు (అనేయాగములు) దర్శపూర్ణ మాసేష్టులకు అంగములు. ఈ విధముగ ప్రకరణప్రమాణముచే అంగాంగిభావనిర్ణయము.

ప్రయాజాదులచే ఉపకృతములైన దర్శపూర్ణమాసలచే స్వర్గమును భావన చేయవలెను. ఈ విధముగ వినియోగవిధి 'శ్రుతి, లింగ, వాక్య, ప్రకరణ, స్థాన, సమాఖ్యలు' అను షట్ప్రమాణములచే అంగాంగిభావమును బోధించును.

3. ప్రయోగవిధి: శ్రుతి, అర్థ పాఠ, స్థాన, ముఖ్య, ప్రవృత్తి అను ఆరు ప్రమాణములచే అవిలంబా పరపర్యాయ మగు ప్రయోగ ప్రాశుభావమును బోధించును.

ఉదా: "అగ్నిహోత్రం జుహోతి, యవాగూ పచతి" అను స్థలములో ముందు అగ్నిహోత్రహోమము విధించబడుచున్నది. అనంతరము యవాగూపాకము (గంజిని తయారుచేయుట) విధించ బడుచున్నది.

పై శ్రుతుల క్రమము ననుసరించి, ముందు అగ్నిహోత్ర హోమము చేసి, అనంతరము యవాగూపాకము చేయవలసివచ్చుచున్నది. పై శ్రుతి, అర్థ అనుషట్ప్రమాణములలోని అర్థ శబ్దమునకు ప్రయోజన మర్థము. గావున, ప్రయోజనము ననుసరించి, యవాగూపాకము ముందు చేసి, అనంతరము దానిచే అగ్నిహోత్ర హోమము (తరువాత) చేయవలెను. ఎందులకన, "యవాగ్వాగ్ని హోత్రం జుహోతి" అను విధివాక్యము ననుసరించి యవాగుచే అగ్నిహోత్ర హోమము చేయవలెను. అని యవాగూపాకము అగ్ని హోత్రహోమముకొరకే గావున, అగ్నిహోత్రహోమానంతరమున యవాగూపాకము వ్యర్థము. అందుచే అర్థశబ్దవాచ్య మగు ప్రయోజనము ననుసరించి, ముందు యవాగూపాకము, అనంతరము దానిచే అగ్నిహోత్రము అని సిద్ధమైనది. ఈ విధముగ శ్రుత్యర్థేత్యాది షట్ప్రమాణములచే ప్రయోగవిధి నిర్ణయము.

4. అ కారవి : ఫలసంబంధ మాత్రమును బోధించును.

ఉదా: 'దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామో యజేత' అను విధి వాక్యము దర్శపూర్ణమాసేష్టులకు స్వర్గఫలసంబంధమును బోధించు చున్నది.

ఈ విధులన్నియు బ్రాహ్మణ భాగములోనివియే. ఇట్లుండ, 'కర్మానుష్ఠాన సమయములో ఉచ్చరింతురు గావున మంత్రభాగమే వేదము. కర్మానుష్ఠాన సమయములో ఉచ్చారణ ప్రసక్తి బ్రాహ్మణ భాగమునకు లేదు గనుక, బ్రాహ్మణ భాగము వేదములోనిది కాదు' అని కొందరి ఆశయము.

ఆయా మంత్రములచే ఆయా కర్మలు చేయవలెనని బోధించునది గదా బ్రాహ్మణము! అది వేదములోనిది కానిచో, ఈ మంత్రములకు ఏకర్మలందు వినియోగమో తెలియచేయునది ఏది కలదు? తెలియజేయు వాక్యము వేదములో లేనిచో ఈ మంత్రములకు ఏ కర్మలందును ఉచ్చారణప్రసక్తి సంభవించదు. గాన మంత్రపాఠము వ్యర్థ మగును.

అందుచే మంత్రవినియోగాదికమును బోధించెడి బ్రాహ్మణ వాక్యములు వేదములోనివే యని పైన ఉదహరించిన 'మంత్ర బ్రాహ్మణయో ర్వేదనామధేయం' అను ఆపస్తంబపరిభాషావచనానుసారము అంగీకరించక తీరదు. అట్టి వేదములు నాలుగు: ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము.

# వేదశబ్దార్థము.

'ప్రత్యక్షే ణానుమిత్యా వా యాస్తూపాయో న బుధ్యతే ।
ఏతం విదంతి వేదేన, తస్మా ద్వేదస్య వేదతా ॥'

తా॥ ప్రత్యక్షాదిప్రమాణములచే తెలిసికొనుటకు శక్యముకాని అర్థమును బోధించునది వేదము.

# వేదములు అపౌరుషేయములు

'అస్య మహతో భూతస్య నిశ్వసిత మేవైత ద్య
దృగ్వేదో యజుర్వేద స్సామవేదో హ్యథర్వాంగిరాః ।

తా॥ మానవునకు నిశ్వాసము ప్రయత్న మక్కరలేకయే ఎట్లు వెడలునో, అట్లే పరమేశ్వరునివలన నిట్టూర్పురూపమున వేదములు బయలువెడలినవి.

'యా మృషయో మంత్రకృతో మనీషిణః । అన్వై
చ్ఛన్ దేవా స్త వసా శ్రమేణ ।'

తా॥ మంత్రసంప్రదాయ ప్రవర్తకులగు మహర్షులు శ్రమ సాధ్యమగు తపస్సుచే వేదవాక్కును అన్వేషణ చేసినట్లు ఈ శ్రుతి బోధించుచున్నది.

'యుగాంతేంతర్హితాన్ వేదాన్ సేతిహాసా న్మహర్షయః ।
లేభిరే తపసా పూర్వ మనుజ్ఞాతా స్స్వయంభువా ।'

తా॥ యుగాంతమందు అంతర్హితములగు వేదములను తపస్సుచే (బ్రహ్మచే అనుజ్ఞాతులగుచు) హర్షులు పొందినట్లు (ఈ స్మృతి) వక్కాణించుచున్నది.

'వాచా విరూపనిత్యయా' (తై. సం. 2-6-12)

తా॥ ఈ శ్రుతి స్పష్టముగ వేదవాక్కుకు నిత్యత్వము బోధించుచున్నది.

'అత ఏవ చ నిత్యత్వం" వేదవ్యాసుడు ఉత్తరమీమాంసలో ఈ సూత్రముచే వేదమునకు నిత్యత్వమును చెప్పెను.

'వేద మనుచ్యాऽऽచార్యోంతేవాసిన మనుశాస్తి ।' (శీక్షావల్లి)

తా॥ గురువు శిష్యునకు వేదమును చెప్పి, అనంతరము గురుకులమునుండి శిష్యుడు ఇంటికి వెడలిన పిమ్మట చేయవలసిన కృత్యములను ఈ శ్రుతి బోధించుచున్నది. ఈ శ్రుతిలో 'అనూచ్య' అనుటచే అనువచనమువలన అనాదినుంచియు వేదము గురుపంరపరగా వచ్చుచున్నదేగాని, గురువు లేకుండ ప్రాథమిక అధ్యేత ఉన్నట్లు గోచరించుటలేదు.

గురువు లేకుండ ప్రాథమిక అధ్యేత యున్నచో అతడే వేదములకు కర్త యనుటకు అవకాశము లభించి, వేదములు పౌరుషేయము లనుటకు వీలుండెడిది. అట్టి ప్రాథమికకర్త లేకుండ అనువచనము వలననే వేదములు వచ్చుచుండుటవలన, వేదములకు కర్త లేదు. అనగా, వేదము లపౌరుషేయము లని సిద్ధమైనది.

ప్రశ్న: లోకములో మానవుడు అన్యుని స్కంధమును (భుజమును) ఆరోహణము చేయ గలుగునేకాని, తన భుజమును తాను ఆరోహణము ఎట్లు చేయలేడో, అట్లే ఇతరగ్రంథములు వేదమును గూర్చి ప్రశంసించుట సమంజసము గాని,ప్రదర్శితశ్రుతి కదంబము వేదాంతర్భూత మగుచు వేదముయొక్క నిత్యత్వా౽పౌరుషేయత్వాదులను చెప్పుట అసంగతము.

జ: ఈ దృష్టాంతము వేదవిషయములో ప్రవర్తించదు. లోకములో స్వయంప్రకాశమాను డగు సూర్యుడు సర్వమును ప్రకాశింపచేయుచు, తననుకూడ ఎట్లు ప్రకాశింపచేసికొనునో, సూర్యుని ప్రకాశింపచేయుటకు మరియొక సాధనమెట్లు అనపేక్షితమో, అట్లే సర్వజ్ఞకల్పము లగు వేదములు ఇతరములగు త్రైకాలిక విషయములను ప్రబోధచేయుచు, సూర్యునివలె తమ మహత్త్వమును తాము ప్రశంసించుటలో విరోధప్రసక్తి ఎంతమాత్రము లేదు. ఈ విధముగ పరమేశ్వరునివలన బయలువెడలుటచే అపౌరుషేయము లగు వేదముల వలన యజ్ఞాదిద్వారా సమస్త జగత్సృష్టి, సూర్యచంద్రాదుల గమనము, సమస్త శ్రేయస్సులు సంప్రాప్త మగు నని శ్రుతులే సకారణముగ నిరూపించుచున్నవి.

## వేదమాహాత్మ్యపరములగు మంత్రములు.

*'బ్రహ్మే సదస్యా౽౽సీనో వైశ్వసృజాన్ వ్యాచష్టే ॥'* (ఆ.శ్రౌ.సూ.)

తా॥ బ్రహ్మ అను ఋత్విక్కు వేదమాహాత్మ్యపరము లగు వైశ్వసృజమంత్రములను సదస్సునందు కూర్చొని శంసించవలెను. (పఠించవలెను).

## 1వ మంత్రము.

*'ఋచాం ప్రాచీ మహతీ ది గుచ్యతే । దక్షిణా*
*మాహు ర్యజుషా మపారాం । అథర్వణా మంగిరసాం*
*ప్రతీచీ । సామ్నా ముదీచీ మహతీ ది గుచ్యతే ।'* (తై.బ్రా. 3-12-6).

తా॥ తూర్పుదిక్కు ఋగ్వేదాభిమానిదేవతలకు స్వభూతమైనది. సూర్యోదయమునకు ఆధారభూతమైన దగుటచే పూజ్యమైనది. ఋఙ్మంత్రములచే ఉత్తేజితమైన బలము కలదిగాను, వేదవేత్తలచే చెప్పబడుచున్నది. దక్షిణ దిక్కును యజుర్మంత్రములకు స్వభూతమైన దానిని గను, సమాప్తి రహితమైన దానినిగను వేదవేత్తలు చెప్పుచుండిరి. పశ్చిమదిక్కు అథర్వాంగిరో

మంత్రములకు స్వభూతమైనది. ఉత్తరదిక్కు సామవేదమునకు స్వభూతమైనది. సామసంబంధము వలనను, సామర్థ్యమువలనను మహత్త్వో పేతమైనది. ఈ విధముగ నాలుగు వేదముల వలనను దిక్కులకు వీర్యాతిశయము సంపన్న మగుచున్నదని తాత్పర్యము.

## 2వ మంత్రము.

'ఋగ్భిః పూర్వాహ్ణే దివి దేవ ఈయతే । యజు
ర్వేదే తిష్ఠతి మధ్యే అహ్నః । సామవేదేనా__స్తమయే
మహీయతే । వేదై రశూన్య స్త్రిభి రేతి సూర్యః ।' (తై. బ్రా. 3-12-9)

తా॥ ఆకసమునందు దీప్యమాను డగు సవిత పూర్వాహ్ణమందు ఋఙ్మంత్రములచే ఉత్తేజితమైన బలము కలవాడగుచు, గమనము చేయుచుండెను. అహస్సు యొక్కమధ్యయందు (మధ్యాహ్నమందు) యజుర్వేదమందు నివాసము చేయుచుండెను. అనగా యజుర్వేదాధీన మైన బలము కలవాడగును. అస్తమయకాలమందు సూర్యుడు సామవేదముచే ఉత్తేజితబలుడగుచు పూజింపబడుచున్నాడు. ఈ విధముగ సవిత వేదత్రయముచే ఉత్తేజితమైన బలము కలవాడగుచు, సర్వ జంతుజాతమునకు ప్రేరకు డగుచుప్రవర్తించుచుండెను. అథర్వ వేదమునకు త్రయ్యంతర్భావముచే త్రిత్వము.

## ద్రవ్య, గుణ, క్రియా రూపమగు జగత్తునకు వేదము వలన ఉత్పత్తి

## 3 మంత్రము.

'ఋగ్భ్యో జాతాగ్ం సర్వశో మూర్తి మాహుః ।
సర్వా గతి ర్యాజుషీ హైవ శశ్వత్ । సర్వం తేజ స్సామ
రూప్యగ్ంహ శశ్వత్ । సర్వగ్ం హేదం బ్రహ్మణా
హైవ సృష్టం ।' (తై.బ్రా. 3-12-9)

తా॥ జగత్తులో దృశ్యమాన మగుద్రవ్యజాతము నంతను ఋఙ్మంత్రములవలన ఉత్పన్నమైనదానినిగ వేదవిదులు చెప్పుచుండిరి. క్రియాజాత మంతయు ఎల్లప్పుడును యజుర్మంత్రములచే నిర్వృత్తమైనది. గుణజాత మంతయు నిరంతరము సామవేదముచే నిష్పన్నమైనది (అనగా సామరూపమందైనది. లేక, సామచేతనే నిరూపించ దగినది). ఈ విధముగ ద్రవ్య, గుణ, క్రియాత్మక మగు జగత్తంతయు వేదములచేతనే సృజించబడినది.

*'ఋగ్భ్యో జాతం వైశ్యం వర్ణ మాహుః । యజు*
*ర్వేదంక్షత్రియ స్యాహుర్యో । సామవేదో బ్రాహ్మణానాం*
*ప్రసూతిః । పూర్వే పూర్వేభ్యో వచ ఏత దూచుః ।' (4. మం.)*

## 3 వేదముల వలన బ్రాహ్మణాది వర్ణోత్పత్తి.

తా॥ ఋఙ్మంత్రములవలన వైశ్యజాతి ఉత్పన్నమైనది. యజుర్వేదమును క్షత్రియజాతికి ఉత్పత్తికారణముగను, సామవేదమును బ్రాహ్మణులకు ఉత్పత్తి కారణముగను చెప్పుచుండిరి. ఈ విధముగ పూర్వము ఋషులు వారికి పూర్వపు మహర్షుల వలన విని చెప్పిరి. లేక, అతీతులైన మహర్షులకు ఈ వేదత్రయమే సర్వముకు ఉత్పత్తి కారణమనుటకు ఈ శ్రుతి వాక్యమునే ప్రమాణముగ పూర్వులు పలికిరి.

## వేదమువలన రాష్ట్రముకు, ప్రజలకు క్షేమము.

## ఉపోద్ఘాతము.

పై అనువాకములో సమస్త జగత్సృష్టియు, బ్రాహ్మణాదుల ఉత్పత్తియు వేదముల నుండి అగుచున్నట్లు ప్రదర్శిత మంత్రములవలన స్పష్టము.

వేదమువలన రాష్ట్రములో సస్యాదిసంపత్తియు, ప్రజాక్షేమమును చూపబడును. అహితాగ్ని (ఆధానము, యజ్ఞము మున్నగు శ్రౌతకర్మలు చేసిన యజమాని) 'యావజ్జీవ మగ్నిహోత్రం జుహోతి' అను విధ్యనుసారము బ్రతికియున్నంతకాలము ఉదయము, సాయంకాలము అగ్నిహోత్ర మను శ్రౌతకర్మను చేయవలెను. అట్టి అగ్నిహోత్రారంభదినమున,

'అగ్నిహోత్రమేతాభి ర్వ్యాహృతీభి రుపసాదయేత్ ।' అను శ్రుత్యనుసారము 'భూర్భువస్సువః' అను వ్యాహృతులచే హవిరాసాదనమును విచు ప్రక్రమములో వేదములవలన రాష్ట్రములో సస్యాద్యుత్పత్తిని, ప్రజలకు క్షేమమును (ఆయురారోగ్యాదులను) ఈ క్రింది శ్రుతి వివరించుచున్నది.

*'య ద్వై యజ్ఞస్య సామ్నా క్రియతే రాష్ట్రం*
*యజ్ఞస్యాऽऽశీ ర్గచ్ఛతి య దృచా దిశం యజ్ఞ*
*స్యాऽऽశీ ర్గచ్ఛతి ।'* (తై. సం. 1-6-10)

తా॥ యజ్ఞములో ఏ అంగము సామవేదోక్తమంత్రములచే అనుష్ఠించబడునో, తజ్జన్య మగు ఫలము రాష్ట్రమును పొందును. అనగా యజ్ఞములో సామగానముచే రాష్ట్రములో సువృష్టి, సస్యాదులు సముత్పన్నము లగుచున్నవి. మరియు యజ్ఞములో ఋగ్వేద మంత్రములచే

చేయబడు కర్మల ఫలము (ఆశీస్సు) రాష్ట్రములోని ప్రజలను పొందును. అనగా, యజ్ఞములో ఋగ్వేదమంత్రప్రయోగముచే ప్రజలకు ఆయురారోగ్యాదులు సంభవించును.

ఈ విధముగ వేదమంత్రములను యజ్ఞములలో వినియోగించుటచే రాష్ట్రముకు ప్రజలకు క్షేమముగావుననే, యజ్ఞమును మూడు వేదములతో చేయవలెనని ఈ క్రింది శ్రౌతసూత్రము వివరించుచున్నది -

'ఋగ్వేదేన హోతా కరోతి యజు ర్వేదేనా౽ధ్వర్యు
స్సామవేదే నోద్గాతా సర్వై ర్బ్రహ్మా ।' (ఆ. శ్రౌ. సూ.)

తా॥ లోకములో సూర్యాకారము, గంధకము, బొగ్గు ఈ మూడు ద్రవ్యముల వివిధ సమ్మేళనల వలన వివిధ మగు బాణసంచా (అనగా, మతాబాలు, టపాకాయలు, పేకజువ్వలు, తారాజువ్వలు, చక్రకాయలు, మున్నగునవి) ఎట్లు తయారగునో, అట్లే మూడు వేదములచేతను యజ్ఞములను చేయవలెనని ఋత్విగ్విభాగపురస్సరముగ పై సూత్రము బోధించుచున్నది. 'హోత' అను ఋత్విక్కు ఋగ్వేదమంత్రలచేతను, 'అధ్వర్యుడు' అను ఋత్విక్కు యజుర్వేద మంత్రములచేతను, ఉద్గాత అను ఋత్విక్కు సామవేదమంత్రముల చేతను తమ తమ కృత్యములను నిర్వర్తించవలెనని చెప్పబడినది.

అగ్నిష్టోమము మొదలుకొని అశ్వమేధాంత మగు సమస్త ప్రౌఢ యజ్ఞకర్మలందును మూడు వేదములలోని మంత్రములు అనుష్ఠానములో నున్నవి. అగ్నిహోత్రము, దర్శపూర్ణమాసలు అను అల్ప యజ్ఞములలో ఋఙ్మంత్రములు, యజుర్మంత్రములు మాత్రమే యున్నవి. కాని, ముఖ్య సామమంత్రములు లేవు. అనగా, ముఖ్య సామమంత్రములచే అంగానుష్ఠానము లేదు. అందుచే వాటియందు ముఖ్యసామసంపత్తి లేకపోయినను, ఔపచారికసామ సంపత్తిని ఈ క్రింది శ్రుతులు బోధించుచున్నది. ఆఔపచారికసామలచే ఋగ్యజుస్సామరూపము లగు 3 వేదముల మంత్రములు సిద్ధించును వాటివలన తేజస్సు ప్రాప్తమగును.

## అగ్నిహోత్రకర్మలో సామసంపత్తి.

'ఆయజ్ఞో వా ఏషః । యో౽సామా । చతు రున్న
యతి । చతురక్షరగ్ం రథంతరం । రథంతర స్యైష
వర్ణః । ఉపరీవ హరతి । అంతరిక్షం వామదేవ్యం । వామ
దేవ్య స్యైష వర్ణః । ద్విర్జుహోతి । ద్వ్యక్షరం బృహత్ ।
బృహత ఏష వర్ణః । అగ్నిహోత్రమేవ త త్సామన్వ
త్కరోతి । (తై. బ్రా. 2-1-5.)

తా॥ ప్రసిద్ధములైన అగ్నిష్టోమాది యజ్ఞములు సామయుక్తము లగుట వలన వాటికి 'యజ్ఞ' శబ్దముచే వ్యవహారము యుక్తము. 'సామలు లేకపోవుటచే అగ్నిహోత్రకర్మ యజ్ఞమే కాదు. అని శంకించి, ముఖ్యసామలు అగ్నిహోత్రకర్మయందు లేకపోయినను, ఉపరిచితమైన సామలు (ఔపచారిక సామలు) ఉండుటవలన అగ్నిహోత్రకర్మకు యజ్ఞనామ యుక్తము. అగ్నిహోత్రకర్మయందు సామసంపత్తి ఈ శ్రుతిచే బోధిత మగుచున్నది.

## రథంతరసామసంపత్తి.

ఉపచార మెట్లన, 'చతు రున్నయతి' అను శ్రుత్యనుసారము అగ్నిహోత్ర మను కర్మలో అగ్నిహోత్రహోమార్థమగు హవిస్సును స్రువ మనెడి (చివరబిలముగల) దారుపాత్రచే 'అగ్నిహోత్రహవణీ' అను (మధ్యబిలము గల) దారుపాత్ర యందు నాల్గు పర్యాయములు ఉన్నయనము చేయవలెను. (గ్రహించవలెను).

ఈ ఉన్నయనమందలి చతుస్సంఖ్య 1,2,3,4 రథంతర సామాక్షరములందు ఉన్నది గావున, ఈ సామగతాక్షరసామ్యముచే అగ్నిహోత్రమందు చతురున్నయనము రథంతర సామస్వరూపము. ఈ విధముగ ఉన్నయనగత మగు చతుస్సంఖ్యచే అగ్నిహోత్ర కర్మ యందు రథంతసామసంపత్తిని చెప్పి, వామదేవ్య సామసంపత్తిని 'ఉపరీవహరతి' ఇత్యాది శ్రుతి చెప్పుచున్నది.

## వామదేవ్యసామసంపత్తి.

ఉక్త విధముగ 'అగ్నిహోత్రహవణి' అను పాత్రయందు గ్రహించబడిన హవిస్సును భూమి స్పర్శ లేకుండ అంతరిక్షమార్గమున (అహవనీయమందు హోమమును గూర్చి) తీసికొన వెళ్లుటచే ఈ హవిస్సు అంతరిక్షరూపము. 'అంతరిక్షం వామదేవ్యం' అను శ్రుత్యనుసారము వామదేవ్యసామ అంతరిక్షరూపము. ఈ సామ్యముచే హవిస్సుకు వామదేవ్యసామ రూపత్వోపచారముచే అగ్నిహోత్ర కర్మ వామదేవ్యసామ కలది.

## బృహత్సామసంపత్తి.

*"ద్విర్జుహోతి । ద్వ్యక్షరం బృహత్ । బృహత ఏష*
*వర్ణః । అగ్ని హోత్రమేవ తత్సామన్వత్కరోతి ।"* (తై.బ్రా. 2-1-5.)

తా॥ అగ్నిహోత్రకర్మలో హోమము రెండుసార్లు చేయవలెను. 'బృహత్' సామ రెండు అచ్చులు కలది. ఈ విధముగ ఆహుతిగతమగు ద్విత్వ సంఖ్య, 'బృహత్' అను సామయొక్క నామయందు కలదు గావున, ఈ సంఖ్యాసామ్యముచే ఆహుతి ద్విత్వముకు బృహత్సామత్వోపచారముచే అగ్నిహోత్రకర్మ బ్రహత్సామ కలది.

ఈ విధముగ ఉపచరితములైన రథంతర, వామదేవ్య, బృహత్, సామ లుండుటచే అగ్నిహోత్రకర్మ సామయుక్తమై యున్నది. 'సామలు లేకపోవుటచే అగ్నిహోత్ర కర్మ యజ్ఞము కాదు' అను ఆక్షేపణ పై విధమగు ఔపచారిక సామసంపత్తిచే పరిహృతమైనది.

## ప్రకారాంతరముగ సామసంపత్తి.

మరియు, అహితాగ్ని ప్రతిదినము సాయంప్రాతఃకాలము లందుచేసెడి అగ్నిహోత్రకర్మలో అగ్నికి మహోపస్థాన మను నామతో "ఉపప్రయంతో అధ్వరం" ఇత్యాది మంత్రములచే ఉపస్థానము చేయవలెను. ఆ ఉపస్థానమంత్రములలో "ఉపప్రయంతో అధ్వరం" అను మంత్రపాఠముచేకూడ అగ్నిహోత్రకర్మలో సామసంపత్తిని ఈ దిగువ శ్రుతి బోధించుచున్నది.

*అయజ్ఞో వా ఏషయో__సామోపప్రయంతో అధ్వర*
*మిత్యాహ స్తోమ మేవా__ స్మై యునక్తి ।"* (తై.సం. 1-5-7.)

తా॥ అగ్నిష్టోమములో (యజ్ఞములో) త్రివృత్‌స్తోమము, పంచదశస్తోమము, సప్తదశస్తోమము, ఏకవిగ్ంశస్తోమము, అను నామలతో సామగానము (స్తోత్రము) చేసెదరు. ఇట్లే అగ్నిహోత్ర కర్మయందు గూడ 'ఉపప్రయంత' ఇత్యాది మంత్రసంఘోపస్థానముచే త్రివృదాదిస్తోమసంపత్తి సంపాదిత మగుచున్నది. (ఉపచరిత మగు చున్నది).

ఋజ్మంత్రములు, అగ్నిహోత్రకర్మలో యజుర్మంత్రములు, సహజముగ నున్నవి. వెనుకటివలెనే "సామమంత్రములు లేవుగాన, ఇది యజ్ఞమే కాదు" అని ప్రారంభించి 'ఉపప్రయంతో అధ్వరం' అను మంత్రమును పఠించుటచే ఈ అగ్నిహోత్రకర్మకు త్రివృదాది స్తోమసంబంధమును కూర్చినవాడగును.

ఈవిధముగ సామస్తోమముల సంబంధముచే మూడు వేదములతో అగ్నిహోత్రమును కర్మ ప్రవృత్త మగుచున్నది.

ఫలితము: పూర్వము చెప్పిన రీతిగ రాష్ట్రములో 'సస్యాద్యభి వృద్ధికిని, ప్రజల ఆయురాద్యభివృద్ధికిని, ఋగ్యజుస్సామమంత్రో పేత మగు అగ్నిహోత్రకర్మ సాధన మని స్పష్ట మగుచున్నది.

## దర్శపూర్ణమాసేష్టులలో సామసంపత్తి.

"*అయజ్ఞో వా ఏషయో__సామ్నా__గ్న అయాహి*
*వీతయ ఇత్యాహ రథంతర స్యైష వర్ణస్తంత్వా సమిధ్ధి*

*రంగిర ఇత్యాహ వామదేవ్యస్యైష వర్ణో బృహదగ్నే*
*సువీర్య మిత్యాహ బృహత ఏష వర్ణో యదేతం తృచ*
*మన్వాహ యజ్ఞమేవ తత్సామన్వంతం కరోతి ।"* (తై.సం. 2-5-8.)

తా॥ 'దర్శపూర్ణమాసేష్టులలో కూడ సామలు లేకపోవుటచే యజ్ఞమే కాదు' అని పూర్వమువలెనే శంకించి, "అగ్న ఆయావీతయే" (తై.బ్రా. 3-5-2). అను మూడు ఋక్కులచే సామ సంపత్తిని శ్రుతి బోధించుచున్నది. "అగ్న ఆయాహి వీతయే" అను ఋక్కు రథంతరసామస్వరూపము. "తం త్వా సమిధ్భి రంగిరః" అను ఋక్కు వామదేవ్యసామ స్వరూపము. "బృహదగ్నే సువీర్యం" అను మంత్రము బృహత్సామస్వరూపము. అందుచే "అగ్న అయాహి" ఇత్యాది మూడు ఋక్కులను దర్శపూర్ణమాసేష్టులలో పఠించినచో, ఈదర్శపూర్ణమాసేష్టినామక మగు యజ్ఞమును సామయుక్తమైనదానినిగ చేయును.

ఫలితము: ప్రకృతదర్శపూర్ణమాసలలో పై తృచపాఠముచే సామసంపత్తి లభించుటచే త్రివిధమంత్రము లుండుటచే ఈ దర్శపూర్ణమాసానుష్ఠానముచే సామాదిద్వారా రాష్ట్రముకును, ప్రజలకును శ్రేయస్సు సంప్రాప్త మగు నని స్పష్ట మగుచున్నది. ఈ విధముగ అగ్నిహోత్రము మొదలు అశ్వమేధాంత మగు సమస్త కర్మలలోను, ఋక్, సామ, యజుర్మంత్రముల సద్భావముచే సస్యాదిసంపత్తి, ప్రజాక్షేమము సంపన్న మగుచున్నట్లు పూర్వోదాహృత శ్రుతులచే స్పష్ట మగుచున్నది.

## యజ్ఞఫలము.

*"యజ్ఞో రాయో యజ్ఞ ఈశే వసూనాం । యజ్ఞ*
*స్సస్యానా ముత సుక్షితీనాం । యజ్ఞ ఇష్టః పూర్వచిత్తిం*
*దధాతు । యజ్ఞో బ్రహ్మణ్వాగ్ం అప్యేతు దేవాన్ ।"* (తై.బ్రా. 2-5-5).

తా॥ యజ్ఞపురుషుడు మణిముక్తాదిరూప మగు ధనముకు ప్రభువు. మరియు, నివాసహేతువు లగు గృహములకు స్వామి యగుచున్నాడు. ఇంకను, సస్యములకును, వ్రీహియవాద్యోషధులకును, శోభనము లగు సస్యములు ఫలించెడి భూములకును స్వామి యగుచున్నాడు. ఇట్టి యజ్ఞ పురుషుడు మాచే పూజించబడినవాడగుచు, స్వర్గమును, వృష్టిని ఇచ్చుగాక. మంత్రయుక్త మగు ఈ యజ్ఞము దేవతలను పొందుగాక.

*'ఆయం యజ్ఞో వర్ధతాం గోభి రశ్వైః । ఇయం*
*వేది స్స్వపత్యా సువీరా । ఇదం బర్హి రతిబర్హిగ్*
*వృన్యా । ఇమం యజ్ఞం విశ్వే అవంతు దేవాః ।'* (2. మం.)

తా॥ మాచే అనుష్ఠించబడియెడి ఈ యజ్ఞము గోవులతోను, అశ్వములతోను వృద్ధి పొందుగాక! ఈ యజ్ఞవేది సుపుత్రులను, శోభనమగు భృత్యులను ఇచ్చుగాక! యజ్ఞవేదియందు ఆస్తీర్ణమైన (పరుపబడిన) దర్భ ఇతరయజమాని సంబంధమగు బర్హిస్సును అతిక్రమించుగాక! ఈ మా యజ్ఞమును సర్వదేవతలు రక్షించెదరుగాక!

పై రెండు మంత్రములను 'దివ శ్యేనీ' నామకమగు ఇష్టులలో 'యాజ్ఞయ చరుం' అను శ్రుత్యనుసారము యజ్ఞాభిమానిదేవతను ఉద్దేశించి చేసెడి ఇష్టిలో యాజ్యాపురోనువాక్యా మంత్రములు.

ఫలితము: లోకములో మానవునకు అపేక్షితము లగు సకలఫలములు అనగా, మణిముక్తాదిధనములు, నివాసకారణములగు గృహములు, వ్రీహి యవాదిసర్వధాన్యములు, మంచి భూములు, గోవులు, అశ్వములు, సువృష్టి మున్నగు ఐహికఫలములే గాక, ఆముష్మికఫలరూప మగు స్వర్గము కూడ యజ్ఞమువలన లభించునని కంఠోక్తిగ పై శ్రుతి వక్కాణించుచున్నది. ఇట్లు మనకు సమస్త ఫలములను ఇచ్చుటయే గాక, "ఈ యజ్ఞము దేవతలను పొందుగాక" యనుటవలన దేవతలకు కూడ తృప్తిజనక మని స్పష్ట మగుచున్నది. ఇట్లు యజ్ఞము పై ఫలముల నిచ్చుటయే గాక, యజ్ఞవేది (యజ్ఞము చేసెడి ప్రదేశము) కూడ సుపుత్రులను, అనుకూలురగు భృత్యులను ఇచ్చుచున్నట్లు శ్రుతి చెప్పుచున్నది.

## యజ్ఞము చేయకపోవుటచే దుర్భిక్షము.

'యజ్ఞపతి మృషయ ఏనసాహు రిత్యాడ్భ్రీయే పంచ
వైశ్వకర్మణాని జుహోతి ।' (ఆ. శ్రౌ. సూ.)

"యజ్ఞపతి మృషయ ఏనసాహుః । ప్రజా నిర్భక్తా
అనుతప్యమానా మధవ్యౌస్తోకా వపతౌ రరాధ । సంన
స్తాభ్యాగ్ం సృజతు విశ్వకర్మా ।" (తై.సం. 3-2-8.)

పై శ్రుతిలో యజ్ఞమువలన మానవునకు అపేక్షితములగు సమస్తైశ్వర్యములును సిద్ధించు నని చెప్పి, ఈ శ్రుతిలో యజ్ఞములు చేయకపోవుటచే దుర్భిక్షము, వర్షములు లేకపోవుట, అధికమగు ఎండలు మున్నగు అనర్థములు వాటిల్లునని చెప్పబడుచున్నది.

తా॥ యజ్ఞములో ఐదవరోజున "యజ్ఞపతి మృషయ" ఇత్యాది మంత్రములచే ఐదు వైశ్వకర్మణహోమములు చేయవలసి నదిగ పై శ్రుతి బోధించుచున్నది.

లోకములో ప్రజలు వృష్టి లేకపోవుటచే అన్నరహితులై తప్యమాను లగుచు నుండగా, దీనికి కారణమేమి యని మహర్షులు విచారించి, యజ్ఞపతియొక్క అపరాధముచేత నని బల్కిరి.

## అపరాధవివరణ.

"వసంతే వసంతే జ్యోతిషా యజేత" (అనగా, ప్రతి వసంత ఋతువునందు యజ్ఞము చేయవలెను) అను విధ్యనుసారము, యజ్ఞానుష్ఠానముచే దేవతలను స్తోత్రము చేయదగిన) వసంతృత్వవయవము లగు చైత్ర, వైశాఖమాసములందు (యజమానులు) యజ్ఞము చేయకపోవుటచే వృష్టి లేక, పంటలు లేకపోవుటచే అన్నము లేక ప్రజలు తప్యమాను లగుచుండిరి.

ఈ విధముగ మహర్షులు పలికిరి. అనగా, యజ్ఞము చేయకపోవుటయే యజమాని యొక్క అపరాధము. ఈ అపరాధమువలన ప్రజలకు అన్నాదికము లేదని తాత్పర్యము.

## యజ్ఞమువలన వర్షము.

*"సౌమ్యా ఖలు వా ఆహుతి ర్దివో వృష్టిం చ్యావయతి ।"* *(తై. సం. 2-4-9.)*

తా॥ యజ్ఞములో సోమరసమును హోమము చేయుటవలన వర్షములు కురియునని (అనగా, సోమరస సంబంధ మగు హోమము వృష్టిని ప్రవర్తింపచేయునని) ఈ శ్రుతివలన స్పష్ట మగుచున్నది. వర్షఋతువులో ఎండలు అత్యధికముగ నుండి, వర్షములు లేనిచో, "వృష్టికామః కారీర్యా యజేత' అను శ్రుతివిహితమైన కారీరీష్టిలో 'సౌమ్యా ఖలు' అను పై శ్రుతి ప్రవృత్తమైనది. 'యజ్ఞ ద్భవతి పర్జన్యః' అను స్మృతి కూడ యజ్ఞమువలన వృష్టిని బోధించుచున్నది.

## ప్రవర్గ్యవలన వృష్ట్యాదికము.

**య**జ్ఞములో ద్వితీయ, తృతీయ, చతుర్థ దినములందు రెండు పూటలును (అనగా, ఉదయసాయంకాలములందు) 'ప్రవర్గ్య' అను కర్మను చేసెదరు. దానిలో "మహావీరము" అను పేరు గల మృన్మయ పాత్రయందు ఆజ్యమునుంచి ఆ పాత్రకు నలువైపులను సమిధలచే వహ్నిని ప్రజ్వలింపజేసి, ఆ జ్వాలలచే ఆ మహావీరమందలి ఆజ్యమును అధికముగ మరగించెదరు. ఆ పాత్రను అధ్వర్యుడు, ప్రతిప్రస్థాత అను యిద్దరు ఋత్విక్కులు శఫలు అను దారుమయ మగు (పట్టకారు వంటి) దీర్ఘములగు సాధనములచే స్వీకరించి, ఉపయమన మనుదారుపాత్రను ఆ మహావీరమున కధోభాగమున ధరించి, ఆహవనీయమునకు దక్షిణోత్తరదిశలందు ఆ మహావీరమును పట్టుకొని నిలుచుండి శఫలు, ఉపయమున మను దారుమయసాధనములచే ఊర్ధ్వాధోభాగము లందు దృఢముగ స్వీకరించిన మహావీరమును ఆహవనీయాగ్ని కుపరిభాగమందు ధరించి ఆ మహావీరమందలి ఆజ్యమును ఆహవ నీయాగ్నియందు కొంత హోమము గావించెదరు. ఆహవనీయమున కుపరిభాగమందే ఆ

పాత్రను ధరించి ఆ మహావీరమందలి (హోమము చేయగా మిగిలిన) తప్తాజ్యమునందు ప్రతిప్రస్థాత అను ఋత్విక్కు పెరుగును పోయవలెను.

ఆ వేడినేతియందు పెరుగును పోయుటచే ఆ ఘృతము ఊర్ధ్వముగ ఉద్గమనమును చేయును (అనగా, పైకి పొంగును). అట్లు ఊర్ధ్వముగ వచ్చుచుండెడి ఘృతమును ప్రవర్గ్యను సంబోధన చేసి క్రింది మంత్రముచే అనుమంత్రణము చేయవలెను. దీనికి సూత్రము:

"ఉప ర్యాహవనీయే ధార్యమాణం ప్రతిప్రస్థాతా శృత
దధ్నాభిపూరయతి । ఇషే పీపి హ్యూర్జే పీపిహీతి విక్షరంత మను
మంత్రయతే ।" (ఆ.శ్రౌ.సూ.)

## అనుమంత్రణ మంత్రము.

"ఇషే పీపిహి । ఊర్జే పీపిహి । బ్రహ్మణే పీపిహి ।
క్షత్రాయ పీపిహి । అద్భ్యః పీపిహి । ఓషధీభ్యః పీపిహి ।
వనస్పతిభ్యః పీపిహి । ద్యావాపృథివీభ్యాం పీపిహి ।
సుభూతాయ పీపిహి । బ్రహ్మవర్చసాయ పీపిహి । యజ
మానాయ పీపిహి । మహ్యాంజ్యైష్ఠ్యాయ పీపిహి ।" (తై. ఆ. మం. బ్రా. 10. అను.)

ఆహవనీయమున కుపరిభాగమున మహావీరమును అధ్వర్యు ప్రతిప్రస్థాతలు (ఋత్విక్కులు) ధరించి ఆ పాత్రయందలి ఉష్ణఘృత మందు దధిని ఉంచుటచే ఆ నెయ్యి ఊర్ధ్వముగ పైకి అభివృద్ధమగును (పొంగును). ఈ అభివృద్ధి మంత్రోక్తమైన అన్నాది సంపత్తి కొరకని మంత్రమువలన స్పష్ట మగుచున్నది.

"ఆహవనీయ స్యోపరి మహావీరం ధారయిత్వా తత్రత్యే
తప్తే ఘృతే తప్తస్య దధ్నః ప్రక్షేపే సతి ప్రవర్గ్యో విక్షరతి
విశేషేణ పాత్రస్యోపరి యదోద్గచ్ఛతి తదానీం ఉద్గచ్ఛంతం
ప్రవర్గ్యం సంబోధ్యేద ముచ్యతే – హేప్రవర్గ్య ! ఇషే అన్నార్థం
పీపిహి త్వం ప్రవృద్ధో భవ । తథోర్జే రసార్థం బ్రాహ్మణా
ద్యర్థం చ ప్రవృద్ధో భవ । సుభూతం శోభనప్రాణిజాతం ।
మహ్యం జ్యైష్ఠాయ అధ్వర్యో ర్మమ ప్రశస్తత్వాయ । ప్రవర్గ్య
స్యాభివృధ్యా సర్వమిదం అభివర్ధత ఇత్యర్థః । (వి. భా.)

తా॥ ఈ మహావీరమందలి తప్తాజ్యము పైకి పొంగుటచే (ఊర్ధ్వోద్గమనముచే) అన్నము, క్షీరాదిరసము, బ్రాహ్మణాదులు, సర్వప్రాణిజాతము అభివృద్ధిని పొందుచున్నవి.

## ప్రవర్గ్యాభివృద్ధికి వృష్టిహేతుత్వము.

'య త్పిన్వతే । వర్షుకః పర్జన్యో భవతి ।" (పె. బ్రా. 8. అను.)

"పిన్వతే వర్ధతే । పాత్ర స్యోప ర్యుద్గచ్ఛతీత్యర్థః" (వి. భా.)

తా॥ ఈ ప్రవర్గ్యాజ్యము యొక్క ఊర్ధ్వోద్గమనముచే మేఘుడు వర్షశీలుడగును. అనగా, దీనిచే సువృష్టి సంభవించును.

ఈ విధముగ ప్రవర్గ్యోద్గమనము వీష్టి సంపాదక మని శ్రుతిచే స్పష్టముగ బోధింపబడుచున్నది.

## అగ్నిలో ఆజ్యహోమము నశించదు.

ప్రకృత కాలములో ఆంగ్లభాషావాసనావాసితులైన ఆధునికలలో కొందరు శ్రుత్యాదుల మహత్త్వమును గుర్తెరుంగకపోవుటచే, వైదికకర్మలలో అగ్నియందు హోమము గావించెడి ఆజ్యాదులను నిష్కారణముగ అగ్నియందు పోసి నాశము చేయుచుండి రనియు, అవి బీదలకు పెట్టినచో సుఖింతు రనియు నందురు. అట్టివారికి యాథార్థ్యమును తెలియజేసి, నాస్తిక్యమును బారద్రోలి, ఆస్తిక్యమును పెంపొందించుటకు శ్రుతి, స్మృతులే ఆ విషయమును విశకలితముగ వివరించుచున్నవి.

"అగ్నౌ ప్రాస్తా౽౽హుతి స్సమ్య గాదిత్య ముపతిష్ఠతే ।
ఆదిత్యా జ్జాయతే వృష్టి ర్వృష్టే రన్నం తతః ప్రజాః ।"

తా॥ విధ్యుక్త ప్రకారము అగ్నియందు హోమము చేయబడిన ఆజ్యము, పాలు, పెరుగు మున్నగు ద్రవ్యములు పై వచనానుసారము ఆహుతి, సూర్యద్వారా వృష్టిని, అన్నమును ప్రజలకు సంపాదించునని తేటతెల్ల మగుచున్నది. దీనివలన నశించుట లేకపోవుటయే గాక లోకమునకు జీవనాధార మగు ప్రధానద్రవ్యములను సంపాదించి, సమస్త ప్రాణులు జీవించుటకు హేతువు లగుచున్నవి యని స్పష్టమగుచున్నది.

ఈ మహోపయోగమును అనేకము లగు శ్రుతి, స్మృతి, శిష్టాచారప్రమాణముల వలన తెలిసికొనియే ఆస్తికశిఖామణులు వాటియందు పరిపూర్ణ విశ్వాసములో, కడు భక్తి శ్రద్ధలతో, లోకోపకారము కొరకు యజ్ఞముల నాచరించుచుండిరి.

## హోమద్రవ్యము.

'అగ్నిహోత్రం జుహోతి యదేవ కించ యజ
మానస్య స్వంతస్యైవ తద్రేత స్సించతి ప్రజననే

ప్రజననగ్ం హి వా అగ్ని రథౌషధీ రంతగతా దహతి తా
స్తతో భూయసీః ప్రజాయంతే ।'                    (తై. సం. 1-5-9.)

తా॥ అహితాగ్న ఆధానము, యజ్ఞము చేసినపిమ్మట,

'ఆజ్యేన జుహుయా త్తే జస్కామస్య... పయసా
పశుకామస్య... దధ్నేంద్రియకామస్య...' (తై. బ్రా. 2-1-5).

ఇత్యాది విధివాక్యములచే విహితమైన ఆజ్యము, క్షీరములు, పెరుగు మున్నగు ద్రవ్యములచే అగ్నిహోత్రనామక మగు కర్మను యావజ్జీవము, ప్రతిదినము, ఉదయము, సాయంకాలము చేయవలెను.

ఇట్లు అగ్నియందు హోమము చేయబడిన ద్రవ్యము మన లౌకిక దృష్టికి నశించుచున్నట్లు కనబడుచున్నను, వేద దృష్టిలో ఈ వస్తువు నశించదని పై శ్రుతి కంఠోక్తిగ చెప్పుచున్నది. ఆ ద్రవ్యము నశించకుండ యజమానియొక్క ధన మగుచు, భద్రముగ నుండును. ఇట్లు హుతమగు ద్రవ్యము నశించకుండ నుండుటను దృష్టాంతముచే శ్రుతి ఉపపాదన చేయుచున్నది.

లోకములో ప్రజోత్పాదక మగు యోనియందు పురుషునిచే నిషిక్తమైన రేతస్సు ఎట్లు నశించకుండ నుండునో, అట్లే ప్రజననరూపు డగు అగ్నియందు హుతమైన ద్రవ్యము నశించకుండ నుండును. ఇది ఎట్లు సాధ్యమగునను శంకకు ఈ క్రింది విధముగ శ్రుతి సమాధాన మొసంగుచున్నది.

(అథౌషధీ రిత్యాది) ఘర్మకాలములో దావాగ్ని తన సమీపమును పొందిన ఓషధులను దగ్ధము చేయుట సత్యమే. కాని, దగ్ధములైన ఆ ఓషధులు వృష్టికాలమందు పూర్వముకంటె అత్యధికముగ ఉత్పన్నము లగుచున్నవి. కావున, అగ్ని ప్రజననరూపు డనుటలో సందేహము లేదు.

ఎట్లన, ఒకే ద్రవ్యము స్థలభేదములచే నిక్షిప్త మగుచు, నశించుటను, అభివృద్ధి నొందుటను మనము చూచుచునే యుంటిమి. లోకములో ధాన్యాది ద్రవ్యము ఊషరక్షేత్రమందు నిక్షిప్త మగుచు నశించుచున్నది. సుక్షేత్రములలో ప్రక్షిప్త మగుచు అధికఫలముల నిచ్చుచున్నది. సుక్షేత్రములలో వెదజల్లిన ధాన్యమును నశించుచున్న దని ఎట్లనమో అట్లే అగ్నియందు శాస్త్రోక్తరీతిని హుత మగు ద్రవ్యము అధికఫలముల నిచ్చునని శ్రుతి చెప్పుచున్నది. కాన, అగ్నియందు శాస్త్రీయముగ హుత మైన ద్రవ్యము నశించదు. అశాస్త్రీయముగ అగ్నియందు హుత మగు ద్రవ్యఫలము బృహస్పతి పుత్రుడగు శంయువును పొందును. హోమకర్తకు ఫలముండదు. అని ఈ దిగువశ్రుతి చెప్పుచున్నది.

యదబ్రాహ్మణోక్తోఽ శ్రద్ధధానో యజతే శంయు
మేవ తస్య బార్హస్పత్యం యజ్ఞస్యాఽఽశీ ర్గచ్ఛతి ।"

## అన్నదానముచే అన్నము నశించదు.

ప్రసంగ సంగత్యా "వహ్నియందు శాస్త్రీయముగ హుత మగు ఆజ్యాది ద్రవ్యములు ఎట్లు నశించకుండునుండునో, అట్లే సత్పాత్రయందు దత్తమగు అన్నము కూడ నశించకుండ అభివృద్ధి చెందును" అని ఈ శ్రుతి బోధించుచున్నది.

"పరాకే అన్నం నిహితం లోక ఏతత్ । విశ్వై ర్దేవైః
పితృభిర్గుప్త మన్నం ।"

తా॥ దేవలోకములోగాని, పితృలోకములోగాని భోగముకొరకు మనము అన్నదానముచేసెదము. మనచే ఇచ్చుట దానము చేయబడియెడి అన్నము ఆ లోకములో దేవతలచేతను, పితృదేవతలచేతను రక్షించబడును.

ఫలితము: పై శ్రుతులవలన, యజ్ఞాదులందు మనచే అగ్నియందు హోమము చేయబడియెడి ద్రవ్యములు అగ్న్యాదిత్యాది పరంపరగ, వృష్ట్యాదిద్వారా సస్యాద్యభివృద్ధికిని, ప్రజోత్పత్తికిని, కారణములగుచు మహాఫలదాయకము లగు ననియు, అన్నదానము చేసిన అన్నము కూడ నశించకుండ పరలోకములలో అభివృద్ధి జెంది భోగకారణమగు ననియు, స్పష్టమగుచున్నది. కాన, ఆహుతద్రవ్యములు అగ్నియందు పోసి, వ్యర్థముగ నశింపజేయుట కాదని శ్రుతులు కంఠోక్తిగ చెప్పుచున్నవి.

## హోమానంతరమున అగ్న్యుపస్థానము.

"రేత స్సిక్తం న త్వష్ట్రా వికృతం ప్రజాయతే
యావ చ్ఛో వై రేతస స్సిక్తస్య త్వష్టా రూపాణి వికరోతి
తావ చ్ఛో వై తత్ప్రజాయత ఏష వై దైవ్య స్త్వష్టా
యో యజతే బహ్వీభి రుపతిష్ఠతే రేతస ఏవ సిక్తస్య
బహుశో రూపాణి వికరోతి ।" (తై. సం. 1-5-9.)

లోకములో స్త్రీ యొక్క గర్భాశయమందు పురుషునిచే నిషిక్తమైన వీర్యము విశ్వకర్మచే హస్తపాదాదిరూపముల నుద్దేశించి వివిధముగ చేయబడనిచో ప్రజ ఉత్పన్నము కానేరదు. కాన, అత్వష్ట (విశ్వకర్మ) ఎన్ని రూపముల నుద్దేశించి నిషిక్తమైన రేతస్సును వివిధముగ చేయునో, అన్నిరూపములు ఉత్పన్నము లగును.

అట్లే, ప్రకృతకర్మలో యజమానరూపు డగు త్వష్ట అగ్ని యందు హోమము చేయబడిన హవిస్స్వరూప మగు రేతస్సును వివిధ రూపకరణము కొరకు అనేకములగు ఋక్కులచే అగ్నిని ఉపస్థానము చెప్పవలెను. దానిచే, హవిస్స్వరూప మగు సిక్తరేతస్సుకు అనేక రూపములను వివిధముగ జేయును.

"సప్రైవ జాయతే శ్వశ్వో భూయా న్భశతియ
ఏవం విద్వా నగ్ని ముపతిష్ఠతే ।" (తై.సం. 1-5-9.)

తా॥ ఈ విషయమును తెలిసికొని ఉపస్థానము చేయువాడు (ఉపస్థాత) ప్రజను ఉత్పాదన చేసి ప్రతిదినము ధనాదులచే ఉత్తరోత్తరాభివృద్ధిగ నుండును. ఇట్లు అనేకమంత్రములచే ఉపస్థానము చేత సంతానాభివృద్ధియు, ధనధాన్యాభివృద్ధియు సంభవించునని పై శ్రుతి చెప్పుచున్నది. కాన, అనేక మంత్రములచే ఉపస్థానము చేయవలెను.

## శ్రుతి, స్మృత్యుల్లంఘనఫలము.

'పృచ్ఛామి త్వా పరం మృత్యుం । అవమం మధ్యమం
చతుం । లోకం చ పుణ్యపాపానాం । ఏత త్పృచ్ఛామి
సంప్రతి । అము మాహుః పరం మృత్యుం । పవమానం
తు మధ్యమం । అగ్నిరేవా వమో మృత్యుః । చంద్రమా
శ్చతు రుచ్యతే ।' (అరుణం)

'పృచ్ఛామి త్వా పరం మృత్యు మితి చతస్రో మృత్యు మతీః ।'

తా॥ అరుణ మను పేరు గల అరణ్యక ప్రశ్నలో 'అరుణ కేతుకము' అను చయనమునకు సంబంధించిన మంత్రజాతము పఠితమైనది. ఈ మంత్రములతో అబీష్టకలను అనగా ఉదకములను నాకబలి పిడతలతో ఉంచి, ఆ ఉదకములతో నున్న పిడతలను ఇష్టకాబుద్ధిచే ఉపధానము చేయవలెను. ఆ ప్రక్రమములో నాలుగు విధము లగు మృత్యువులను చెప్పి, పిదప పుణ్యాత్ములకును, పాపాత్ములకును లోకములను ఈ మంత్రములు వివరించుచున్నవి.

తా॥ ('పృచ్ఛామిత్వావర' మిత్యాది! జిజ్ఞాసువు అగు ఒక ముని అభిజ్ఞుడను మరియొక మునిని ప్రశ్నించెను. 'అభిజ్ఞుడ వగు ఓ మునీ! నిన్ను నాలుగు విధములగు మృత్యువులను గూర్చి ప్రశ్నించుచుంటిని. అనగా, పరమృత్యువు, అపమమృత్యువు, మధ్యమమృత్యువు, చతుర్థమృత్యువుల స్వరూపమును ప్రశ్నించుచుంటిని. మరియు, పుణ్యాత్ములకు, పాపాత్ములకు

సంప్రాప్తమగు లోకములను గూర్చి వివరములను అడుగుచుంటిని.

## అభిజ్ఞుని సమాధానము.

*'అము మాహుః పరంమృత్యుం । పవమానం తు*
*మధ్యమం । అగ్ని రేవా__ వమో మృత్యుః । చంద్రమా*
*శ్చతు రుచ్యతే ।'* (2. మం.)

తా॥ మనచే చూడబడియెడి ఆదిత్యునే పరమృత్యువుగా పూర్వపు మహర్షులు చెప్పిరి. అనగా ఆదిత్యుని గతిబాహుళ్యముచే ఆయుస్సు క్షీణము కాగా సంప్రాప్త మయ్యెడి మృత్యువు అలంఘనీయము. అనగా, (ఏ ప్రతిక్రియచేతను ఆమృత్యువు నివారించుకొనుటకు శక్యము కాదు. అందుచే ఆదిత్యుడు పరమృత్యువు. ప్రాణవాయువు మధ్యమమృత్యువు. అనగా, ప్రాణాయామము చేయునపుడు ప్రాణవాయువుకు నాడులయందు అన్యధా సంచారము కలిగినచో, ఆక్లేశముచే మృత్యువు సంప్రాప్త మగును. ఆ మృత్యువు ప్రాణాయామమందు కుశలులగు యోగులచే క్లేశముచే ప్రతిక్రియ చేసికొనుటకు శక్యమగును గాని, అందరకును శక్యము కాదు. అందుచే అది మధ్యమమృత్యువు.

జఠరాగ్ని మంద మగునపుడు వ్యాధి ద్వారా మృత్యువు సంభవించును. అది వైద్యులచే అల్పప్రయాస చేతనే ప్రతిక్రియ చేసి కొనుటకు శక్యమగుటచే జాఠరాగ్నిరూప మగు మృత్యువు అపమ మృత్యువు.

ఓషధులకు అధిపతి యగు చంద్రుని అనుగ్రహము లేనిచో, అన్నాభావముచే మృత్యువు సంప్రాప్తమగును గావున చంద్రుడు చతుర్థమృత్యువు. అది అల్పప్రయాసచేతనే ప్రతీకార్యము గావున చతుర్థమృత్యువు.

## కేవలపాపులకు పరమృత్యుప్రాప్తి.

*"అనాభోగాః పరం మృత్యుం । పాపా స్సంయంతి సర్వదా*
*ఆభోగా స్త్వేవ సంయంతి । యత్రపుణ్యకృతో జనాః ।"* (అరుణం. 3. మం.)

తా॥ పూర్వులు వేదములను, స్మృతులను తమకు అనుకూలముగ రచించుకొని రను భావముచే శ్రుతిస్మృతులను ఉల్లంఘనచేసి తమకు తోచినట్లు పాపమునే ఆచరించువారు కేవలపాపులు. అట్టి పాపులు సుఖలేశమైనను లేని క్రిమికీటాదిరూపులగుచు, ఎల్లప్పుడును పరమృత్యువునే పొందెదరు. అనగా, స్వల్పము లగు సూర్యగమనముల చేతనే అల్పాయుస్సు కలవారగుచు, తిరిగీ తిరిగీ పుట్టుచు, చచ్చుచు నుందురు. ఇదియే సర్వదా పరమృత్యు

ప్రాప్తి. కేవల పుణ్యాత్ములు (శ్రుతి, స్మృతుల ననుసరించి వర్తించువారు) శ్రుతి స్మృతి మార్గవర్తులు సర్వభోగసంపూర్ణులు అగుచు, పుణ్యకారు లగు దేవతలు నివశించెడి స్వర్గమందు నివసించెదరు.

"తతో మధ్యమ మాయంతి । చతు మగ్నించ సంప్రతి" (4. మం.)

తా॥ అత్యంత పాపకారులకంటెను, అత్యంత పుణ్యకారుల కంటెను విలక్షణులై మిశ్రమ లగు పుణ్యపాపకర్మల నాచరించెడి వారు మనుష్య జన్మను పొందుచు, మధ్యమ, అపమ, చతుర్థమృత్యువు లను ప్రతిక్రియలచే సమాధానము చేసికొందరు.

"పృచ్ఛామి త్వా పాపకృత ఇతి చతస్రో నిరయవతీః ।" (ఆ. శ్రౌ. సూ.)

"పృచ్ఛామి త్వా పాపకృతః । యత్ర యాతయతే
యమః । త్వం నస్తద్బ్రహ్మన్ ప్రబ్రూహి । యది వేత్థా
సతో గృహాన్ ।" (1. మం.)

ప్రకృతకాలములో నవనాగరికులు కొందరు స్వర్గ, నరక లోకములు లేవనియు, భూలోకసుఖమే స్వర్గమనియు, భూలోక దుఃఖమే నరకమనియు అనెదరు. అట్టివారికి ఈ శ్రుతులే ప్రశ్న ప్రతివచన రూపమున సమాధాన మొసగుచున్నవి.

తా॥ ప్రశ్న: ఓ బ్రహ్మా! పాపకారు లగు ప్రాణులను యముడు ఏ స్థానమందు క్లేశపెట్టునో, ఆ స్థానమును గూర్చి నిన్ను ప్రశ్నించుచుంటిని. పాపకారుల స్థానములను నీవు గుర్తెరిగినచో శ్రవణేచ్ఛగల నా కొరకు చెప్పుము.

"కశ్యపా దుదితాస్సూర్యాః పాపాన్నిర్ఘ్నంతి సర్వదా ।
రోదస్యో రంతర్దేశేషు తత్ర న్యస్యంతే వాసవైః ।" (2. మం.)

తా॥ మహామేరువునందు నిత్యము నివసించెడి కశ్యపు డను సూర్యునివలన ఉత్పన్ను లైన అరోగాదిసప్తసూర్యులును, ఆ ఆదిత్యుల సంబంధమైన మూర్తి విశేషము లగు ఇతరు లైన సహస్రసంఖ్యాకులగు సూర్యులును, ద్యావాపృథివుల మధ్యయందలి రౌరవాదినరక ప్రదేశము లందు పాపులగు ప్రాణులను ఎల్లప్పుడును మారణము చేయుచుందురు. ఇట్లు చంపబడిన ఆ ప్రాణులు నివాసహేతువులగు సూర్యరశ్మి రూపులగు దేవతలచే తిరిగి ఉత్పాదితు లగుచు, ఆనరక ప్రదేశములందే బాధితులగుచు, తిరిగి ఉత్పాదితు లగుచు స్థాపన చేయబడుచుందురు.

"తే౽_శరీరాః ప్రపద్యంతే । యథా౽_పుణ్యస్య కర్మణః ।
అపాణ్య పాదకేశాసః । తత్ర తే ౽_యోనిజాజనాః ।" (3. మం.)

తా॥ ఆ పాపులు ఈవిధముగ చిరకాలము జన్మమరణముల ననుభవించి, అనంతరము ఆనరకస్థానములందు సంపూర్ణావయవ రహితులగుచు, సమీచీనమైన అవయవములు లేనివారగుచు తాము చేసిన పాపకర్మకు అనుగుణమగు జన్మలను పొందెదరు. ఒకపాపుడు చేతులు లేనివాడు, మరియొకడు పాదహీనుడు, మరియొకడు కేశరహితుడు (బట్టతలవాడు)ను, ఈ విధముగ వికృత శరీరులగుచు పుట్టుచుందురు. మరియు, వారిలో కొందరు పాపులు నల్లులు, పేలుగను, మరికొందరు వృక్షములు, లతలుగను అగుచుండిరి. (అయోనిజులు, స్వేదజులు).

ఈ విషయమునే వాజసనేయులు పంచాగ్ని విద్యయందు దక్షిణోత్తర మార్గరహితు లగు పాపులకు ఇట్టి జన్మలను చెప్పి యుండిరి.

*'అథ య ఏతౌ పంథానౌ న విదు స్తే కీటాః పతంగా*
*య దిదం దందశూకం ।'* (వాజసనేయ)

*'తానీమాని క్షుద్రా ణ్యసకృదావర్తీని భూతాని*
*భవంతి ।'* (ఛందోగులు)

తా॥ ఈ విధముగ శుక్లయజుర్వేదములోను, సామవేదములోను (అనగా, ఛాందోగ్యము లోను) కూడ పాపులకు క్రిమి, కీటాదిక్షుద్ర జన్మలు సంప్రాప్త మగు నని కంఠోక్తిగ చెప్పబడుచున్నది.

*'మృత్వా పున ర్మృత్యు మాపద్యంతే । అద్య*
*మానా స్స్వకర్మభిః అశాతికాః క్రిమయ ఇవ । తతః*
*పూయన్తే వాసవైః ।'* (4. మం.)

తా॥ ఆనరకస్థానములందు ఉత్పన్నులైన ప్రాణులు ఒకసారి మరణమును పొంది మరల పుట్టుచుందురు. తిరిగి మరణమును పొందుచుందురు. ఈ విధముగ జన్మమరణ సహస్రములను పొందుచుందురు. మరియు తమ తమ పాపకర్మలచే భక్షితు లగుచు, జన్మ, మరణ పరంపరను పొందుచుందురు.

ఈ విషయములో నిత్యము మనకు అనుభవసిద్ధమగు దృష్టాంతమును శ్రుతి చెప్పుచున్నది. మనచే శిరస్సు, మంచములు మున్నగు వాటియందు పేలు, నల్లులు మున్నగునవి ఎట్లు చంపబడుచున్నవో, అట్లే ఇతరులగు పాపులు కూడ దేవతలచే చంపబడుచుందురు.

ఫలితము. ఈ విధముగ శ్రుతి, స్మృత్యుల్లంఘనచే స్వచ్ఛంద వృత్తిగా సంచరించు మానవులకు క్రిమికీటకాది జన్మలు మున్నగు దుష్ట ఫలములు బోధించబడినవిగాన,

వేదశాస్త్రములందు శ్రద్ధాళు రగుచు, నిషిద్ధాచరణమును వీడి అమూల్య మగు మానవజన్మను సత్కర్మానుష్ఠానముచే సఫలము చేసికొనవలె నను ధర్మము దీనివలన బోధిత మగుచున్నది.

## అపమృత్యుజయము.

*"అప్యైతం మృత్యుం జయతి । య ఏవం వేద । స*
*ఖల్వేవం వి ద్బ్రాహ్మణః । దీర్ఘశ్రుత్తమో భవతి ।*
*కశ్యప స్యాతిథి స్సిద్ధగమన స్సిద్ధాగమనః ।"* (బ్రాహ్మణం)

తా॥ ఈకశ్యపమహిమను తెలిసికొనిన పురుషుడు ఈ క్రిమి కీటకాదులందు చెప్పబడిన అపకృష్టమృత్యువును జయించును. అనగా విద్వాంసుడు (ఈ విషయమును తెలిసినవాడు) పాపములందు ప్రవర్తించడుగావున, ఆతనికి అపమృత్యు జయము యుక్తము.

మరియు, ఈ కశ్యపమహిమాభిజ్ఞుడు "ఈతడు యోగ్యముగ కర్మానుష్ఠాత" అని కశ్యపునిచే శ్రూయమాణు డగును. అనేకులగు దేవతలు కశ్యపుని వద్దకు జని, ఈతడు యోగ్యముగ అరుణకేతుక చయనమును ఆచరించినాడని తిరిగి తిరిగి చెప్పుచుందురు. ఇంతే గాక, ఇతడు కశ్యపసమీపమునకు గమనాగమనములలో స్వతంత్రుడగును. అనగా, తన ఇచ్ఛానుసారము కశ్యపసమీపమునకు వెడలుటకును, వచ్చుటకును సమర్థుడగును.

## నిందించువాడు మిత్రుడు.

*"దేవాసురా స్సంయత్తా ఆసన్ । త ఆదిత్యే వ్యాయ*
*చ్ఛంత । తం దేవా స్సమజయన్ । బ్రాహ్మణశ్చ శూద్ర*
*శ్చ చర్మకర్తే వ్యాయచ్ఛేతే । దైవ్యో వై వర్ణో*
*బ్రాహ్మణః । అసుర్య శ్శూద్రః । ఇమేఽరా త్సురిమే*
*సుభూత మక్ర న్నిత్యన్యతరో బ్రూయాత్ । ఇమ*
*ఉద్వాసీకారిణ ఇమే దుర్భూత మక్ర న్నిత్యన్యతరః ।*
*యదే వైషాగ్ం సుకృతం యా రాద్ధిః । త దన్యతరోభి*
*శ్రీణాతి । యదేవైషాం దుష్కృతం యాఽరాద్ధిః । తద*
*న్యతరోఽపహన్తి । బ్రాహ్మణ స్సంజయతి । అముమేవా*
*ఽఽదిత్యం భ్రాతృవ్యస్య సంవిందంతే ।"* (తై.బ్రా. 1-2-6.)

కర్మానుష్ఠాతలను నిందించువాడు నిందచే వారి పాపములను బారద్రోలు నని ఈ శ్రుతి బోధించుచున్నది.

తా॥ రాజసూయాంతర్గత మగు మహావ్రత మను కర్మలో (యజ్ఞములో) బ్రాహ్మణుడును, శూద్రుడును పరిమండలాకార మగు (గుండ్రమగు) చర్మఖండమును గూర్చి కలహము చేసెదరు.

## దీనికి ఉపోద్ఘాతము.

పూర్వము దేవతలును, అసురులును ఆదిత్యుని విషయములో యుద్ధమునకు సన్నద్ధులైరి. అనగా, ఆదిత్యుడు మాకే యుండవలయునని ఆదిత్యుని స్వాధీనమును గూర్చి పరస్పరము కలహించిరి. ఆ యుద్ధములో దేవతలు విజయమును పొందిరి. అందుచే ప్రకృత మహావ్రతక్రతువులో వేదిమధ్యయందు బ్రాహ్మణుడును, వేదికి బహిఃప్రదేశమున శూద్రుడును ఉండి, ఆర్ద్రము, గుండ్రమునగు చర్మఖండమును గూర్చి కలహము చేయవలెను.

## కలహ ప్రకారము.

ఆ కలహసమయమున బ్రాహ్మణుడు 'ఇమే౽రాత్సుః' అను మంత్రము నుచ్చరించవలెను.

'ఇమే౽రాత్సు రిమే సుభూత మక్ర న్నిత్యన్యతరో
బ్రూయాత్ । ఇమ ఉద్వాసీకారిణ ఇమే దుర్భూత
మక్ర నిత్యన్యతరః ।' (తై.బ్రా. మం. 1-2-9.)

తా॥ ఈ యజమానులు సత్రయాగమందు సమృద్ధిని పొందిరి. వీరు బహుశోభన మగు కర్మను చేసిరి. ఈ విధముగ వీరి కర్మను వీరలను, ప్రశంసించు మంత్రమును బ్రాహ్మణుడు పఠించవలెను. ఈ మంత్రపాఠమువలన యజమానులకు సుకృతమును, ఇహలోక సమృద్ధిని బ్రాహ్మణుడు సంపాదించును.

## శూద్రుని మంత్రము.

'ఇమ ఉద్వాసీకారిణః' అను మంత్రమును శూద్రుడు' పఠించవలెను. ఈ యజమానులు కర్మయొక్క మిషచే ధనహానిని చేసి, ఈ దేశమును నివాసశూన్యముగ చేయుచుండిరి. అనగా, వీరు ఈ కర్మ పేరుతో ధనమంతను వ్యయము చేసి దేశమునకు దారిద్ర్యము తెచ్చిరి. చాలా చెడ్డపనిని చేయుచుండిరి.

ఈ విధముగ వీరి కర్మను, వీరలను నింద చేయు మంత్రమును పఠించుటవలన ఈ నిందకుడు (కర్మానుష్ఠానకాలములో ఋత్విగ్యజ మానులచే ప్రమాదమువలన చేయబడిన) దుష్కృతమును, దారిద్ర్యమును నశింపజేయును.

ఈ విధమగు నిందాజనితమైన క్లేశముచే వీరి పాపము నశించి సంపూర్ణ క్రత్వనుష్ఠానఫలము వీరికి లభించును.

ఈ విధముగ మహావ్రత మను కర్మలో ఋత్విగ్యజమానులచే ప్రమాదమువలన చేయబడిన దుష్కృతములను, దారిద్ర్యమును నశింప చేసికొనుటకు శూద్రునిచే నింద చేయవలసినదిగ శ్రుతి స్పష్టముగ వక్కాణించుచున్నది. మనము ప్రేరణ చేయ నక్కరలేకయే ఈ కర్మానుష్ఠాతలను, కర్మానుష్ఠానమును నిందించెడి పురుషులు మనకు కర్మయందలి వైగుణ్యమును నశింపజేసి, మనకు సంపూర్ణ మగు కర్మఫలమును చేకూర్చెడి మహామిత్రులని పై శ్రుతులవలన తెలియ వచ్చుచున్నది. కాన, సత్కర్మానుష్ఠానమును నిందించువారుండుట మహాపుణ్య మని ప్రశంసనీయము. అట్టి వారలను మనము ద్వేషించరాదు.





శ్రీ మహాగణాధిపతయే నమః ।

# వేదసార రత్నావళి

## 22. ఉపోద్ఘాత (వేద) భాష్యమునకు ఆంధ్రానువాదము

శ్లో॥ వాగీశాద్యా స్సుమనస స్సర్వార్థానా ముపక్రమే ।
యం నత్వా కృతకృత్యా స్స్యుస్తం నమామి గజాననమ్ ॥
యత్కృపాలేశమాత్రేణ పురుషార్థ చతుష్టయమ్ ।
ప్రాప్యతే త మహం వందే గురు మానందరూపిణమ్ ।

### వేదస్వరూప నిరూపణము.

**ల**క్షణప్రమాణములచే వేదసిద్ధిని, అనుబంధచతుష్టయమును నిరూపించినగాని, వేదవ్యాఖ్యానము సంగతము కానేరదు. కావున, 'కోయం వేదో నామ' ఇత్యాదులచే వేదమునకు వ్యాఖ్యాన యోగ్యత నిరూపించబడుచున్నది.

మూలము: "నను కోయం వేదో నామ? కిం చ తల్ల
క్షణం? కేవా తస్య విషయసంబంధ ప్రయోజనాఽధికారిణః?
కథం వా తస్య ప్రామాణ్యం? న ఖల్వేతస్మిన్ సర్వస్మి న్నసతి
వేదో వ్యాఖ్యానయోగ్యో భవతి ।"

తా॥ వేదమునకు భాష్యమును వ్రాయబోవుచుండుటచే ప్రథమములో వేదస్వరూప నిరూపణ కొరకు కోయంనామేత్యాదులచే వ్యాఖ్యానయోగ్యత స్థిరపరచబడుచున్నది. వేద మనగా నేమి? దానికి లక్షణ మెద్ది? విషయసంబంధ ప్రయోజనాధికారిరూప మగు అనుబంధ చతుష్టయ మేది? ప్రమాణమెద్ది? ఇవి లేనిచో వేదము వ్యాఖ్యానయోగ్యము కానేరదు.

మూలము: "అత్రోచ్యతే, ఇష్టప్రాప్త్యనిష్టపరిహారయో
రలౌకిక ముపాయం యో గ్రంథో వేదయతి స వేదః।
అలౌకిక పదేన ప్రత్యక్షా__నుమానే వ్యావర్త్యేతే। అనుభూయ
మానస్రక్చందనవనితాదే రిష్టప్రాప్తిహేతుత్వం, ఔషధసేవాదే
రనిష్టపరిహారహేతుత్వం చ ప్రత్యక్షత స్సిద్ధమ్। స్వేన అనుభ
విష్యమాణస్య పురుషాంతరగతస్య చ తథాత్వ మనుమాన
గమ్యం। ఏవం తర్హి భావిజన్మగత సుఖాధీనా మప్యనుమాన
గమ్యతేతి చేత్ - న, త ద్విశేషస్యానవగమాత్। న ఖలు
జ్యోతిష్టోమాది రిష్టప్రాప్తి హేతుః। కలంజభక్షణ వర్జనాది
రనిష్టపరిహారహేతు రిత్యము మర్థం వేదవ్యతిరేకే ణా__నుమాన
సహస్రేణాపి తార్కికశిరోమణి రప్యనుమాతుం శక్నోతి।
తస్మా దలౌకికోపాయబోధకో వేద ఇతి న లక్షణ స్యాతి
వ్యాప్తిః।"

తా॥ ఈ విషయములో సమాధానము చెప్పబడుచున్నది. లోకములో ప్రతిమానవునకును ఇష్టము కావలెననియు, అనిష్టము వద్దనియు కోరిక స్వభావసిద్ధము గావున, అట్టి ఇష్టప్రాప్తికిని, అనిష్ట పరిహారమునకును అలౌకికము లగు సాధనములను ఏ గ్రంథము బోధించునో అదియే వేదము. అలౌకికోపాయము లను పదములో అలౌకిక పదమునకు ప్రత్యక్ష ప్రమాణముచేతను, అనుమానప్రమాణము చేతను (ఊహచేతను) తెలిసికొనుటకు శక్యముకాని దని యర్థము. అట్టి ఉపాయములను బోధించునది వేదము.

ఉపోద్ఘాత (వేద) భాష్యమునకు ఆంధ్రానువాదము.

అనగా, మానవునిచే వర్తమానకాలములో అనుభవించబడుచున్న పుష్పమాలిక, చందనము, స్త్రీ మున్నగునవి ఇష్టసాధనము లనియు, ఔషధసేవ మున్నగునవి అనిష్టములగు రోగాదుల పరిహారమునకు కారణము లనియు ప్రతివారికిని ప్రత్యక్షసిద్ధము. ఇక ముందు తనచే అనుభవించబడబోయెడి పుష్పమాలిక మున్నగునవియు, ఇతర పురుషగతము లగు పుష్పమాలిక మున్నగునవియు ఇష్టసాధనము లనియు, అట్టి ఔషధసేవాదికము అనిష్టపరిహార సాధన మనియు తెలిసికొనుటను అనుమానప్రమాణగమ్య మని యందురు.

అట్లైనచో ముందు జన్మగతము లగు సుఖాదికములు గూడ ఇట్లే అనుమానగమ్యము లనవచ్చును గదా! యనుటకు వీలు లేదు. ఎందులకన, సుఖసామాన్యము ఊహించుటకు శక్యమగునే గాని, సుఖ విశేషము ఊహింప శక్యము కాదు.

వివరణ: "జ్యోతిష్టోమాదికము ఇష్టప్రాప్తికి కారణము. కలంజ భక్షణవర్జనాదికము అనిష్టపరిహారమునకు కారణము" అను విషయమును, "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత, న కలంజం భక్షయేత్" అను వేదవాక్యములవలననే తెలిసికొనవలెనుగాని, వేదభిన్నము లగు అనుమాన (ఊహ) సహస్రములచే తార్కికశిరోమణి కూడ తెలిసి కొన సమర్థుడు కాడు. కావున, వేదము అలౌకికోపాయబోధకము. అనగా, వేదవ్యతిరిక్త ప్రత్యక్షాదిప్రమాణ ములచే తెలిసికొనుటకు శక్యముకాని అర్థమును (వేదము) బోధించు నను లక్షణము నిర్దుష్టము.

తథాచ: "ప్రత్యక్షాదిప్రమాణా౽నవగతార్థబోధకత్వం వేదత్వం."

శ్లో॥ "ప్రత్యక్షే ణానుమిత్యా వా య స్తూపాయో న బుధ్యతే ।
ఏనం విదంతి వేదేన తస్మా ద్వేదస్య వేదతా ॥"

తా॥ ప్రత్యక్షాదిప్రమాణములచే తెలిసికొనుటకు శక్యముకాని ఉపాయములను తెలిసికొనుటకు సాధనము గాన దీనికి 'వేదము' అని నిర్వచనము.

## అనుబంధచతుష్టయ నిరూపణము.

మూలము: "స ఏవోపాయో వేదస్య విషయః । తద్బోధ ఏవ ప్రయోజనం । తద్బోధార్థీ చా౽ధికారీ । తేన సహ ఉప కార్యోపకరాకభావ స్సంబంధః ।"

తా॥ అట్టి వేదముచే చెప్పబడియెడి ఉపాయమే వేదమునకు విషయము. అట్టి ఉపాయమును తెలిసికొనుటయే ప్రయోజనము (ఫలము). అట్టి వేదప్రతిపాద్యము లగు విషయములను తెలిసికొన గోరువాడు అధికారి. ఉపకార్యోపకారకభావము సంబంధము. అనగా, జ్ఞానము ఉపకారకము, అధికారి ఉపకార్యుడు.

మూలము: "నన్వేవం స్త్రీ శూద్రసహితా స్సర్వే అధికారిణ స్స్యుః । ఇష్టం మే స్యాత్ । అనిష్టం మా భూదిత్యాశిష స్సర్వ జనీనత్వాత్ ఇతిచేత్ ।"

తా॥ ప్రశ్న: వేదము ఇష్టప్రాప్తికిని, అనిష్టపరిహారమునకును ఉపాయమును బోధించునది గాన, జనసామాన్యమందరును ఇష్టప్రాప్తిని, అనిష్ట పరిహారమును గోరువారేగాన, స్త్రీ శూద్ర సహితులగుచు, సర్వ జనులకును వేదమందధికారము సంప్రాప్తమగుచున్నది.

ఉత్తరము: "మైవం । స్త్రీ శూద్రయో స్సత్యుపాయబోధా
ర్థిత్వే హేత్వంతరేణ వేధాధికార ప్రతిషేధాత్ । ఉపనీతస్యైవ
అధ్యయనాధికారి బ్రువ చ్ఛాస్త్రం అనుపనీతయోః స్త్రీశూద్ర
యోః వేదాధ్యయనం అనిష్టప్రాప్తి హేతు రితి బోధయతి ।"

తా॥ స్త్రీ శూద్రులకు ఇష్టప్రాప్త్య నిష్ట పరిహారములకు ఉపాయములను తెలిసికొనవలె నను కోరిక యున్నను, ఉపనయనసంస్కారము కలవానికే వేదాధ్యయనమందు అధికారమును చెప్పుచుండెడి శాస్త్రము ("అష్టవర్షం బ్రాహ్మణ ముపనయీత, త ముధ్యాపయీత") అనుపనీతులైన (ఉపనయనసంస్కార రహితులైన) స్త్రీ శూద్రులకు వేదాధ్యయన మనిష్ట ప్రాప్తికి కారణమని బోధించుచున్నది. కాన స్త్రీ శూద్రులకు వేదాధ్యయనాధికారము లేదు.

ప్రశ్న. "కథం తర్హి తయో స్తదుపాయావగమః ।"

తా॥ స్త్రీ శూద్రులకు వేదాధికారము లేనిచో, వారికి ధర్మా௨ధర్మప్రాప్తి పరిహారో పాయములను తెలిసికొను టెట్లు?

ఉత్తరము: పురాణాదిభి రితి బ్రూమః । అత ఏవోక్తం
"స్త్రీ శూద్రద్విజబంధూనాం త్రయీ న శ్రుతి గోచరా । ఇతి
భారత మాఖ్యానం మునినా కృపయా కృతం ।"

తా॥ ఈ వచనము వేదాధికారము లేని స్త్రీ శూద్రాదులకు ధర్మా௨ధర్మ పరిజ్ఞానము కొరకు వేదతుల్యమగు మహాభారతము (భారతః పంచమో వేదః) వ్యాసమహామునిచే రచించబడె నని బోధించు చున్నది. కాన, పురాణాదులచే వేదా௨నధికారులకు ధర్మా௨ధర్మ పరిజ్ఞానము సిద్ధించును. వేదాధికారము లేనంత మాత్రమున వారలకు కొరత లేదు. కాన, ఉపనీతు లగుత్రై వర్ణికులకు మాత్రమే వేదాధి కారమని సిద్ధమైనది.

## వేదప్రామాణ్యము.

మూలము: "తత్ర్పామాణ్యం తు బోధకత్వాత్ స్వత ఏవ
సిద్ధం । పౌరుషేయవాక్యం తు బోధక మపి సత్ పురుషగత
భ్రాంతి మూలకత్వ సంభవాత్ తత్పరిహారాయ మూలప్రమాణ
మపేక్షతే । న తు వేదః । తస్య నిత్యత్వేన వక్తృదోషశంకా௨
నుదయాత్ । ఏతదేవ జైమినినా సూత్రితం । తత్ప్రమాణం
బాదరాయణ స్యా௨నపేక్షితత్వాత్ ।"

(జై. న్యామా. పూ. మీ. 1. అధ్యా. 1. పా. 4. అధి. 5. సూ.)

తా॥ వేదము అర్థజ్ఞానజనకము కాన, స్వయముగనే ప్రమాణము. పౌరుషేయ వాక్యము లన్ననో, అర్థజ్ఞానజనకము లగుచున్నను లౌకికపురుషులు భ్రాంత్యాదిదోషయుక్తు లగుటవలన భ్రాంతి మూల కత్వము సంభవించవచ్చును. తత్పరిహారము కొరకు మూలప్రమాణము నపేక్షించును. వేద మన్ననో, అపౌరుషేయము, నిత్యము గావున, పౌరుషేయ వాక్యమువలె వక్తృదోషము లగు భ్రాంత్యాది మూలకత్వశంక లుదయించుటకు అవకాశము లేదు. వేదమునకు ప్రామాణ్యము పూర్వమీమాంసాశాస్త్రకర్తయగు జైమినిమహర్షిచే "తత్ప్రమాణం బాదరాయణ స్యా__నపేక్షితత్వాత్ ।" అను సూత్రముచే ప్రతిపాదిత మైనది.

## పౌరుషేయత్వపూర్వపక్షము.

మూలము: నను వేదోపి కాళిదాసాదివాక్యవత్ పౌరు
షేయ ఏవ । బ్రహ్మకార్యత్వశ్రవణాత్ । "ఋచ స్సామాని
జజ్ఞిరే । ఛందాగ్ంసి జిజ్ఞిరే తస్మాత్ । యజు స్తస్మా దజా
యత ।" ఇతి శ్రుతేః । అత ఏవ భగవాన్ బాదరాయణః
"శాస్త్రయోనిత్వాత్" (బ్రహ్మసూ. 1. అధ్యా. 1. పా. 3. సూ.)
ఇతి సూత్రే బ్రహ్మణః వేదకారణత్వ మవోచత్ ।"

పూర్వపక్షము: వేదముకూడ కాళిదాసాది వాక్యములవలె పౌరుషేయమే "ఋచ స్సామాని జజ్ఞిరే" ఇత్యాదిశ్రుతులు బ్రహ్మవలననే వేదములు ఉత్పన్న మైనట్లు చెప్పుచుండుటచే వేదములు బ్రహ్మకార్యములు గావున, పౌరుషేయములు.

## అపౌరుషేయత్వసిద్ధాంతము.

మూలము: "మైవం । శ్రుతిస్మృతిభ్యాం నిత్యత్వావ
గమాత్ । "వాచా విరూపనిత్యయా" ఇతి శ్రుతిః । "అనాది
నిధనా నిత్యా వా గుత్సృష్టా స్వయంభువా" ఇతి స్మృతిః ।
బాదరాయణోపి దేవతాధికరణే సూత్రయామాస "అత
ఏవ చ నిత్యత్వం" ఇతి॥"

తా॥ "వాచా విరూప" అను శ్రుతిలో "నిత్యయా" అను పదముచే వేదవాక్కు నిత్యమైన దని శ్రుతి చెప్పుట చేతను, "అనాదినిధనా నిత్యా" అను స్మృతిలో గూడ నిత్యపదమును ఉచ్చరించి, నిత్యమైన వేదవాక్కు బ్రహ్మవలన నిర్గతమైన దని చెప్పుట చేతను, వ్యాసమహర్షి ఉత్తరమీమాంసాశాస్త్రములో "అత ఏవ చ నిత్యత్వం" అను సూత్రముచే ప్రతిపదోక్తముగ వేదమునకు నిత్యత్వ మును వక్కాణించుటచేతను, శ్రుతి, స్మృతి, సూత్రములచే వేదమునకు

నిత్యత్వము ఏకగ్రీవముగ బోధిత మగుచున్నది. కావున, వేదమునకు కాళీదాసాది పౌరుషేయ వాక్యములకంటె వైలక్షణ్యము స్పష్టమగుచున్నది గాన, వేదము అపౌరుషేయము.

మూలము (ప్రశ్న): "తర్హి పరస్పరవిరోధః" ।

తా॥ ఋచ స్సామానీత్యాది పూర్వశ్రుతులకును, బాదరాయణుడు చెప్పిన శాస్త్రయోనిత్వాధికరణమునకును, ప్రకృతోదాహృత ములగు శ్రుతి, స్మృతి, వైయాసిక సూత్రము (అత ఏవ చ నిత్యత్వం) లకును పరస్పర విరోధముగదా! ఇది ఎట్లు సంగత మగును?

మూలము: (జవాబు): ఇతి చేన్న । నిత్యత్వస్య వ్యావ
హారికత్వాత్ । సృష్టే రూర్ధ్వం సంహారా త్పూర్వం వ్యవహార
కాలః । తస్మి న్నుత్పాదవినాశాదర్శనాత్ । కాలాऽऽకాశా
దయో యథా నిత్యా ఏవం వేదోపి వ్యవహారకాలే కాళి
దాసాదివాక్యవత్ పురుష విరచితత్వాభావేన నిత్యః । ఆది
సృష్టౌ తు కాలాకాశాదివ దేవబ్రహ్మణ స్సకాశాద్వేదోత్పత్తి
రామ్నాయతే, అతో విషయ భేదా న్న పరస్పర విరోధః ।
బ్రహ్మణో నిర్దోషత్వేన వేదస్య వక్తృదోషాऽసంభ
వా త్స్వతస్సిద్ధం ప్రామాణ్యం తదవస్థం । తస్మా ల్లక్షణప్రమా
ణసద్భావాత్ । విషయప్రయోజన సంబంధాధికారి సద్భా
వాచ్చ ప్రామాణ్యస్య సుస్థితత్వా దేవదో వ్యాఖ్యాతవ్య ఏవ ।
యథోక్త విషయాది సద్భావ మభిప్రేత్య స్వాధ్యాయో - ధ్యేతవ్య
ఇత్యధ్యయనం విధియతే ॥"

తా॥ వేదమునకు బ్రహ్మవలె నిత్యత్వము గాక, వ్యావహారిక నిత్యత్వము బోధిత మగుచున్నది గాన, పరస్పర విరోధము లేదు. వ్యావహారిక నిత్యత్వ మనగా, సృష్టి మొదలు కొని ప్రళయపర్యంతము (వ్యవహారకాలము అకాలమందు) వేదములకు ఉత్పత్తి వినాశములు లేకపోవుట. కనుక కాలము, ఆకాశము మొదలగునవి ఎట్లు వ్యావహారిక నిత్యములో అట్లే వేదముగూడ వ్యవహారకాలమందు (కాళిదాసు మున్నగు కవుల వాక్యములవలె) పురుషవిరచితము కాదు గాన నిత్యము.

ఆదిసృష్టియందుకాలము, ఆకాశము మున్నగునవి బ్రహ్మ వలన ఎట్లు ఉత్పన్నము లైనవో అట్లే బ్రహ్మవలన వేదముల ఉత్పత్తి శ్రుతులచే బోధింపబడుచున్నది. అందుచే విరోధము లేదు. అనగా, వేదములకు ఉత్పత్తిని బోధించెడి శ్రుతులు కాలాకాశాదులవలె

ఆది సృష్టియందు ఉత్పత్తిని బోధించుచున్నవి. నిత్యత్వమును బోధించు శ్రుతుల కాలాऽऽ కాశాదులవలె వ్యావహారిక నిత్యత్వమును బోధించుచున్నవి గాన ఎంత మాత్రము పరస్పర విరోధము లేదు.

బ్రహ్మ లౌకికపురుషునివలె భ్రమప్రమాదాదిదోషములు లేని వాడు గావున, బ్రహ్మ వలన ఉత్పన్నములైన వేదములకు వక్తృదోషములగు భ్రమప్రమాదాదులు సంభవించవు గనుక స్వతస్సిద్ధమగు ప్రామాణ్యము నిరాకరించుటకు శక్యము కాదు.

ఫలితము: ఈ విధముగ లక్షణప్రమాణము లుండుట వలనను, విషయ, ప్రయోజన, సంబంధాధికారి రూప మగు అనుబంధ చతుష్టయసద్భావమువలనను ప్రామాణ్యము సుస్థితమైనది గాన, వేదము వ్యాఖ్యానము చేయదగినదియే. ఈ విషయాదు లన్నియు ఉన్నవని యెడి తాత్పర్యము చేతనే "స్వాధ్యాయోऽధ్యేతవ్యః" అను శ్రుతి వేదాధ్యయనము చేయవలెనని అధ్యయనమును విధించుచున్నది.

మూలము (పూర్వపక్షము): "పాఠమాత్రస్యాऽధ్యయన
శబ్దవాచ్యత్వేన అర్థావబోధ స్యాऽవిహితత్వాత్ వేద
వ్యాఖాన మప్రసక్తం ।"

తా॥ అధ్యయనశబ్దమునకు పాఠమాత్రమే అర్థము గాన, పూర్వోక్త మగు "స్వాధ్యాయోऽధ్యేతవ్యః" అను అధ్యయన శ్రుతి వేదముయొక్క పాఠమాత్రమునే విధించుచున్నది గాని, అర్థజ్ఞానమును విధించుట లేదు గనుక, అర్థజ్ఞానము కొరకైన వేదవ్యాఖ్యానమునకు ప్రసక్తి గానవచ్చుట లేదు.

మూలము (జవాబు): "ఇతిచేన్న, । విధే ర్బోధ పర్యవ
సాయిత్వాత్ । ఏతచ్చ భట్టమతానుసారిభి ర్బహుధా ప్రపం
చితం । అమ్నాయతే చ, "యదధీత మవిజ్ఞాతం నిగదేనైవ
శబ్ద్యతే । అనగ్నా వివ శుష్కేంధో న త జ్జ్వలతి కర్హిచిత్ ॥
స్థాణు రయం భారహారః కిలాభూ దధీత్య వేదం న విజానాతి
యోऽర్థం । యోऽర్థజ్ఞ ఇత్సకలం భద్ర మశ్నుతే న నాక
మేతి జ్ఞానవిధూతపాప్మా । బ్రాహ్మణేన నిష్కారణో ధర్మ
ష్షడంగో వేదోऽధ్యేయో జ్ఞేయశ్చ ।"ఇతి.

తా॥ అధ్యయనవిధికి కేవల వేదపాఠమాత్ర విధానమందు తాత్పర్యము కాదు. అర్థజ్ఞానపర్యంతా ధ్యయనవిధానమందు తాత్పర్యమని పూర్వమీమాంసకులు విపులముగ విమర్శించి వివరించిరి. కావున, అర్థజ్ఞానమప్రసక్త మనుటకు వీలులేదు.

అర్థజ్ఞానావశ్యకత్వ విషయములో ఈ క్రిందివిధముగ చెప్పబడుచున్నది.

1. అగ్నిలేని ప్రదేశమందు ఎండు సమిధలను ఉంచినచో ఎట్లు ప్రజ్వలించవో, అట్లే అక్షరపాఠరూపముగ ఉచ్చరించబడియెడి అధ్యయనము అర్థజ్ఞానము లేనిదే ప్రకాశించదు.

2. ఏ పురుషుడు వేదాధ్యయనము చేసి అర్థమును తెలిసి కొనడో, ఆ మానవుడు బరువు మోసెడి స్థాణువువంటివాడు. ఏ పురుషుడు అర్థము తెలిసికొనునో అతడు సంపూర్ణమైన శ్రేయస్సును పొందును. మరియు సమస్త పాపముల నుండి విముక్తుడై స్వర్గమును పొందును.

3. బ్రాహ్మణుడు శిక్షాదిషడంగోపేత మగు వేదమును అధ్యయనము చేసి అర్థమును తెలిసికొనవలెను. ఇది బ్రాహ్మణునకు సహజమైన ధర్మము.

వీటివలన అధ్యయనవిధికి అర్థజ్ఞాన పర్యంత మగు అధ్యయన విధానమందు తాత్పర్యము గాని, కేవలపాఠమాత్రవిధానమందు తాత్పర్యము కాదని స్పష్ట మగుచున్నది.

మూలము: "ఏవంతర్హివిజ్ఞానస్య పృథగ్విధానాత్ అధ్య
యనం తస్య పాఠమాత్ర మితి చేత్ । అస్తునామ । వర్ణయంతి
చైవం శాంకరదర్శనానుసారినః । క్రతువి, ధి రేవ అనుష్ఠానా
న్యథానుపపత్యా వేదార్థజ్ఞానస్య ప్రాపితత్వాన్నైత ద్విధేయ
మితి చేత్ । తర్హి తద్విధిబలాత్ వేదనమాత్రేణ స్వతంత్రం
కించి దపూర్వ మస్తు । శ్రూయతే హ్యనుష్ఠానజ్ఞానయోః
స్వతంత్రం పృథ క్ఫలం । "సర్వం పాప్మానం తరతి తరతి
బ్రహ్మహత్యాం, యోऽశ్వమేధేన యజతే య ఉ చైన
మేవం వేద" ఇతి.

తా॥ (పూర్వపక్షము): ఇట్లైనచో జ్ఞేయశ్చేత్యాదినా అధ్యయనముకంటె వేరుగా జ్ఞానమును విధించుటవలన అధ్యయ మాత్రమే (అనగా వేదముయొక్క పాఠమాత్రమే) యని సిద్ధమైనదే?

జవాబు: అట్లే అవుగాక. శాంకరశాస్త్రానుసారులు ఇట్లే వర్ణించుచుండిరి. "సోమేన యజేత" ఇత్యాది క్రతువిధుల చేతనే (అర్థజ్ఞానము లేనిదే క్రత్వనుష్ఠానము చేయుట శక్యము కాదుగాన) వేదార్థజ్ఞానము ప్రాపిత మగుచుండగా, అర్థజ్ఞానము 'జ్ఞేయశ్చ' అని విధించ నవసరము లేదనినచో అర్థజ్ఞానవిధిబలమువలన వేదనమాత్రముచే స్వతంత్రమైన కొంచెము అపూర్వము అంగీకరించబడును.

స్ఫుటముగ కర్మానుష్ఠానమునకు, జ్ఞానమునకు వేరుగ స్వతంత్రమగు ఫలము శ్రుతులలో శ్రూయమాణ మగుచున్నది. "సర్వం పాప్మానం తరతి" అను శ్రుతి

అశ్వమేధయాగము చేసినవానికి, తెలిసికొనిన వానికి, వేరు వేరుగ సర్వపాపతరణమును, బ్రహ్మహత్యా తరణమును (ఈఉభయమును), చెప్పుటచే అర్థజ్ఞానమునకు స్వతంత్రమగు ఫలవిశేషము కలదని స్పష్ట మగుచున్నది.

మూలము: "అల్పప్రయాస సాధ్యేన వేదనేన తత్సిద్ధౌ
బహ్వాయాససాధ్య మనుష్ఠానం వ్యర్థ మితిచేన్న । తరణీ
యాయా బ్రహ్మహత్యాః మానసవాచికత్వాదిభేదేన తార
తమ్యోపపత్తేః । మనసా సంకల్పితా, వాచా అభ్యనుజ్ఞాతా,
పరహస్తేన కారితా, పునఃపునః కృతా చేత్యేవం తారతమ్యేన
వ్యవస్థితా బ్రహ్మహత్యాऽనేకవిధా । అత స్తత్తరణ మప్యనేక
విధం । యథా స్వర్గో బహువిధ స్తద్వత్ । అగ్నిహోత్రం
జుహుయా త్స్వర్గకామః । దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామో
యజేత । జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత ఇత్యా ద్యుచ్చా
వచకర్మణాం ఏకవిధఫలాసంభవాత్ స్వర్గో బహువిధః ।"

తా॥ (పూర్వపక్షము): అల్పప్రయాసచే సంపాదించుటకు శక్యమగు జ్ఞానము (వేదనము) చేతనే అశ్వమేధయాగానుష్ఠానముచే సిద్ధించెడి బ్రహ్మహత్యాదితరణ రూపఫలము సిద్ధించే యెడల బహు ప్రయాసచే సాధించదగిన అశ్వమేధయాగాద్యనుష్ఠానము వ్యర్థమని అందురేమో?

జవాబు: అట్లనుటకు వీలు లేదు. తరణీయ మగు బ్రహ్మ హత్య మానసికము (అనగా మనస్సుచే బ్రాహ్మణుని చంపవలెనని సంకల్పించుట), వాచికము (వాక్కుచే, ఇతరులను ప్రేరణ చేసి చేయించెడి బ్రహ్మహత్య), కాయికము (స్వయముగ తన హస్తముచే హత్యను చేయుట), పరహస్తముచే చేయించుట మొదలగు తారతమ్యములచే అనేక విధములుగ వ్యవస్థితమై యున్నది. కావున, అట్టి బ్రహ్మ హత్య యొక్క తరణము గూడ వేదనము (కర్మజ్ఞానము), కర్మానుష్ఠానము మున్నగు సాధనములచే (స్వర్గమువలె) అనేక విధములు.

దృష్టాంతము: అల్పప్రయాససాధ్య మగు అగ్నిహోత్రమను కర్మకు స్వర్గము ఫలము. దానికంటె అధికప్రయాసచే చేయదగిన దర్శపూర్ణమాసలనియెడి ఇష్టులకు కూడ స్వర్గమే ఫలము. వాటి కంటెను మిక్కిలి అధికప్రయాసచే సాధించదగిన జ్యోతిష్టోమయాగ మునకు (యజ్ఞమునకు) స్వర్గమునే ఫలమునుగ విధించెడి "అగ్ని హోత్రం జుహుయా" ది త్యాది విధివాక్యముల బలముచే (తార తమ్యోపేతము లగు అగ్నిహోత్రాదికర్మలకు ఒకేవిధమగు స్వర్గ రూపఫలము సంభవించుటకు వీలు లేదు. కాన, ఆయా కర్మలకు యోగ్య మగు స్వర్గము ఎట్లు అనేక విధములుగ అంగీకరించబడుచున్నదో, అట్లే అర్థజ్ఞానముచే తరించెడి

బ్రహ్మ హత్యాదోషమునకును, అశ్వమేధయాగానుష్ఠానముచే తరించెడి బ్రహ్మ హత్యాదోషము నకును, మానసిక, కాయికాదిరూపముచే భేదము సిద్ధించుచున్నది. అందుచే, వేదన, అనుష్ఠానములకు సమానఫలత్వదోషము లేదని స్పష్టమగుచున్నది.

మూలము: "యత్తు కర్మానుష్ఠానకాలీనం వేదనం తత్కర్మఫల
ఏవ అతిశయం జనయతి. "ఉభౌ కురుతో య శ్చైత దేవం వేద
యశ్చ న వేద ఇతి విద్వదవిద్వద్విషయౌ ప్రయోగౌ ప్రకృత్య
యదేవ విద్యయా కరోతి తదేవ వీర్యవత్తరం భవతి ఇత్యా
మ్నానాత్ । అంగోపాస్తి విషయ మేత ద్వాక్య మితిచేన్న ।
న్యాయస్య సమానత్వాత్ ।

తా॥ ఈ విధముగ వేదమునకు కర్మానుష్ఠానమునకు, సమాన ఫలత్వదోషమును నిరాకరించిన పిదప, వేదనమున కొక విశేషమును శ్రుతి బోధించుచున్నది.

శ్రుతి తా॥ "ఏకర్మను జ్ఞానపూర్వకముగ చేయునో, ఆ కర్మ జ్ఞానరహితముగ నాచరించెడి కర్మకంటె అధికసామర్థ్యము కలదియగును." అని శ్రుతి స్పష్టముగ చెప్పుటచే కర్మానుష్ఠానకాల మందలి వేదనము (అర్థజ్ఞానము) కర్మఫలమందే అతిశయమును (విశేషమును) పుట్టించును. అనగా, అర్థజ్ఞానము లేని కర్మానుష్ఠానము వలన సిద్ధించెడి ఫలముకంటె అర్థజ్ఞానముతో చేసిన కర్మానుష్ఠానమువలన అధికఫలము లభించుననుటచే కర్మానుష్ఠాన కాలమందలి అర్థజ్ఞానమునకు కేవల మగు అర్థజ్ఞానముకంటె విశేషము కల దని, అర్థజ్ఞానములకు గల వైలక్షణ్యము బోధితమైనది.

పూర్వపక్షము: "యదేవ విద్యయా కరోతి" అను శ్రుతి వాక్యము అంగోపాసనాప్రకరణము లోనిది గాన, ఉపాపనాకాలమందలి అర్థజ్ఞానము ఉపాసనయందే విశేషమును పుట్టించు నని చెప్పవలెనేగాని కర్మఫలమందు అతిశయమును పుట్టించు ననుటకు వీలులేదు కదా!

జవాబు: అట్లనుటకు వీలు లేదు. న్యాయము సమానము గావున, అర్థజ్ఞానముతో చేసిన ఉపాసనవలెనే అర్థజ్ఞానముతో చేసిన కర్మానుష్ఠానము అధికఫలము నిచ్చు ననుటలో విరోధము లేదు. "అర్థజ్ఞానముతో చేసిన దానికి ఫల మధిక" మను న్యాయము కర్మో పాసనలకు రెండిటికి సమానమే గాన, ఉపాసనా ప్రకరణములో చెప్పినను, ఈ కర్మ విషయములో ప్రవర్తించుటకు విరోధము లేదని తాత్పర్యము.

మూలము: "అస్తి హ్యస్యార్థ స్యోపోద్బలకం లింగం ।
ప్రజాపతిః కిల సోమయాగేభ్యోఽర్వాచీనాన్ అగ్నిహోత్ర
పౌర్ణమాస్యమావాస్యానామకాన్ పరస్పర ముచ్చావచాన్

యజ్ఞాన్ ససర్జ । సోమయాగాం శ్చాగ్నిహోత్రాదిభ్యః
శ్రేష్ఠాన్ అగ్నిష్టోమోక్థ్యాతిరాత్రనామకాన్ పరస్పర ముచ్చా
వచాన్ సృష్ట్వా ప్రథమసృష్టే ష్వగ్నిహోత్రాది ష్వభిమాన
విశేషేణ వర్గద్వయం తులయా ఉదమిమీత । ఏవం వృత్తాంతం
జానతః అగ్నిహోత్రాదిభి రగ్నిష్టోమాది ఫలం భవతి । తథా చ
బ్రాహ్మణం ।

"ప్రజాపతి ర్యజ్ఞా నసృజ తాగ్నిహోత్రం చాగ్ని
ష్టోమం చ పౌర్ణమాసీం చోక్థ్యం చామావాస్యాం
చా_తిరాత్రంచ తా సుమిమీత యావ దగ్ని హోత్ర
మాసీత్తావానగ్నిష్టోమో యావతీపౌర్ణమాసీ తావా నుక్థ్యో
యావ త్యమావాస్యా తావానతిరాత్రో య ఏవం విద్వా
నగ్నిహోత్రం జుహోతి యావ దగ్నిష్టోమే నోపా
ప్నోతి తావ దుపాప్నోతియ ఏవం విద్వా న్పౌర్ణమాసీం
యజతే యావ దుక్థ్యేనోపాప్నోతి తావ దుపాప్నోతి
య ఏవం విద్వా నమావాస్యాం యజతే యావ దతి
రాత్రేణో పాప్నోతి తావ దుపాప్నోతి ॥" ఇతి. *(తై.సం. 1.కాం. 6.ప్ర. 9.అను.)*

తదేత ద్వేదనస్య సర్వత్ర స్వతంత్రఫలత్వే లింగం।"

తా॥ అనుష్ఠానకాలమందలి అర్థజ్ఞానము ఫలాతిశయమును పుట్టించు నను న్యాయము ఉపాసనకును, కర్మానుష్ఠానమునకును సమానమను అర్థమునకు ఉపోద్బలక మగు (సాధకమగు) లింగము కలదు.

ప్రజాపతి సోమయాగములకంటె అల్పపరిమాణము గలవియును, ఉచ్చావచములైన (హెచ్చు తగ్గైన) అగ్నిహోత్రము, పౌర్ణమాసి, అమావాస్య అను యజ్ఞములను, మరియు అగ్ని హోత్రాదుల కంట్యె ఉత్కృష్టము లగు అగ్నిష్టోమము, ఉక్థ్యము, అతి రాత్రము అను పేరు గల ఉచ్చావచము లగు సోమయాగములను సృజించెను. అనంతరము ప్రజాపతి ప్రథమ సృష్టము లైన అగ్ని హోత్రాదులందు అభిమానవిశేషముచే వర్గద్వయమును (అగ్ని హోత్రాది వర్గమును, అగ్నిష్టోమాదివర్గమును) ఉన్మానము చేసెను (త్రాసుచే తూచెను). అప్పుడు చిన్న యజ్ఞములలో మొదటిది యగు అగ్నిహోత్రమును పెద్ద యజ్ఞములలో మొదటిది యగు అగ్ని ష్టోమమును సమముగ తూచెను. ఇదే విధముగ పౌర్ణమాసీనామకమగు ఇష్టిని ఉక్థ్యనామక మగు యజ్ఞమును సమముగ ఉన్మానము చేసెను. మరియు, అమావాస్యానామక మగు ఇష్టిని, అతిరాత్రమని యెడి సోమయాగమును సమముగా తూచెను.

ఈ వృత్తాంతమును తెలిసికొనిన యజమాని అగ్నిహోత్ర కర్మానుష్ఠానముచే అగ్నిష్టోమ యాగానుష్ఠానఫలమును బొందును. ఇదే విధముగ పౌర్ణమాసీ ఉక్థ్యక్రతువుల ఉన్మానమును దెలిసికొని, పౌర్ణమాసీకర్మానుష్ఠానముచే ఉత్కృష్ట మగు ఉక్థ్యమను సోమయాగ ఫలమును బొందును. పూర్వోక్తమైన అమావాస్యాఽతిరాత్రోన్మానమును తెలిసికొనిన యజమాని అమావాస్యేష్టియాగముచే ఉత్కృష్టమగు అతిరాత్రమను సోమయాగానుష్ఠాన ఫలమును పొందును.

ఈశ్రుతిలో ప్రజాపతి అగ్నిహోత్రాది స్వల్పకర్మలకు అగ్నిష్టోమాది సోమయాగములతో సమత్వమును సంపాదించెనని చెప్పి, ఈ విషయమును తెలిసికొని స్వల్పములగు అగ్నిహోత్ర, పౌర్ణమాసీ, అమావాస్యా క్రతువుల ననుష్ఠానము చేసినచో ఉత్కృష్టములగు అగ్నిష్టోమ, ఉక్థ్య, అతిరాత్ర క్రతువుల అనుష్ఠానముచే సిద్ధించెడి ఫలము పొందునని చెప్పుటచే కర్మానుష్ఠానకాలమందలి వేదనమున కధిక ఫలము బోధిత మగుచున్నది గాన, పూర్వోదాహృత మగు "యదేవ విద్యయా కరోతి" అను శ్రుతి బోధితమగు వేదనము, ప్రకరణ పాఠమువలన అంగోపాసనావిషయ మనుటకు అవకాశ మెంత మాత్రము కానరాదు. కర్మానుష్ఠానకాల మందలి వేదనమునకు గూడ అధికఫలము కలదను విషయములో ఈ శ్రుతి లింగము.

మూలము: "కించ తత్తద్విధిసమీపే "య ఏవం వేద"
ఇతి వచనాని వేదనాదేవ ఫలం బ్రువతే । తా న్యర్థవాద
రూపాణీతి చేత్ । అస్తు నామ । నహామహ ఏవైత మపరాధం ।
తేషాం వచనానాం విధేయార్థప్రశంసాపరత్వాత్ । తర్హి
యత్పర శ్శబ్ద స్స శబ్దార్థ ఇతి న్యాయేన స్వార్థే ప్రామాణ్యం
నాస్తీతిచేత్, న ।

తా॥ మరియు తత్తత్కర్మ విధుల సమీపములో "య ఏవం వేద" అను వచనములు వేదనమువలననే ఫలమును చెప్పుచున్నవి. ఆవచనములు అర్థవాదరూపము లనినచో అంగీకారమే. ఆ అర్థవాదలు సన్నిహితవిధివాక్యములచే విధించబడియెడి కర్మవిశేషము లందు ప్రాశస్త్యమును బోధించుచున్నవి గనుక వాటికి వైయ్యర్థ్యము లేదు. అట్లైనచో, 'శబ్దము యత్పరమో అదియే శబ్దార్థము' అను న్యాయానుసారము అర్థవాదవచనములు విధేయార్థప్రశంసాపర ములు గాన అర్థవాదలకు స్వార్థమందు ప్రామాణ్యము లేదు.

మూలము: "మహాతాత్పర్యస్య విధేయవిషయత్వేపి
అవాంతరతాత్పర్యస్య స్వార్థవిషయత్వాఽనివారణాత్ । గ్రా
వాణః ప్లవంతే ఇత్యర్థవాదస్యాపి స్వార్థే ప్రామాణ్యం ప్రసజ్యే

తేతి చేన్న । ప్రమాణాంతరబాధితత్వాత్ । "ద్వి స్సంవత్స
రస్య సస్యం పచ్యతే" ఇత్యాద్యర్థవాదస్య తు బాధాభావే౽
ప్యనువాదత్వా న్న స్వార్థే ప్రామాణ్యం ।"

తా॥ అర్థవాదల యొక్క మహాతాత్పర్యమునకు విధేయ విషయత్వ మున్నను, అవాంతర తాత్పర్యమునకు స్వార్థ విషయత్వములో బాధ లేదు కాన అది అనివార్యము. కాన అర్థవాదలకు ప్రామాణ్యము సుస్థితము. ఆ పక్షములో 'గ్రావాణః ప్లవంతే' (రాళ్లు తేలుచున్నవి) అను అర్థవాదకు గూడ స్వార్థమందు ప్రామాణ్యము ప్రస్త మగు ననుటకు వీలు లేదు. ఎందులకన, ప్రత్యక్షముగ చక్షురింద్రియముచే రాళ్ళు మునుగుట చూచుచుంటిమి. అందుచే రాళ్ళు తేలుట యనునది ప్రత్యక్షప్రమాణముచే బాధిత మగుచున్నది. కావున, 'గ్రావాణః ప్లవంతే' అను అర్థవాదకు స్వార్థమందు ప్రామాణ్యప్రసక్తి లేదు. అది కేవలము ప్రశంసాపరము. రాళ్ళు కూడ తేలు నంతటి నీరు కలదని చెప్పుటయందే ఈ అర్థవాదకు తాత్పర్యము గాని స్వార్థమందు తాత్పర్యము లేదు.

ఈ అర్థవాదవలె ప్రమాణాంతరబాధ లేకపోయినను "ద్విస్సంవత్సరస్య సస్యం పచ్యతే' ఇత్యాద్యర్థవాదలు అనువాద లగుటచే వాటికి స్వార్థమందు ప్రామాణ్యము లేదు (సిద్ధ స్యోపన్యాసో౽నువాదః). ప్రకృతములో సంవత్సరమునకు రెండు పంటలు పండుట లోకప్రసిద్ధమైన విషయము కావున ఇది సిద్ధమైన అర్థమును చెప్పునదిగాన అనువాదము.

మూలము: 'వేదనఫలవచనాని తు నా౽నువాదకాని ।
నాపి బాధ్యాని । తస్మా దర్థవాదత్వే ప్యస్త్యేషాం స్వార్థే
ప్రామాణ్యం । అన్యథా మంత్రార్థవాదాదిభ్యో దేవానాం
విగ్రహాదిమత్త్వం న సిధ్యేత్ । అత ఏవోక్తం । "విరోధే గుణ
వాద స్స్యా దనువాదో౽వధారితే । భూతార్థవాద స్సిద్ధానా
మర్థవాద స్త్రిధా మతః । ఇతి."

తా॥ "య ఏవం వేద" మున్నగు వేదనమువలన ఫలమును చెప్పెడి వాక్యములు అనువాదకములు గావు. ప్రమాణాంతరములచే బాధ్యములు గావు. కావున, అర్థవాద లైనను వీటికి స్వార్థమందు ప్రామాణ్యము తప్పక యున్నది. అందుచే అనుష్ఠానకాలమందలి వేదనమునకు అధిక ఫలప్రదాతృత్వము యుక్తము.

ఇట్లు కానిచో (అనగా, అనువాదకములును, ప్రమాణాంతర బాధ్యములు కానట్టివియు నగు అర్థవాదలకు స్వార్థమందు ప్రామాణ్యము లేనిచో) మంత్రములు, అర్థవాదలు మున్నగు వాటివలన దేవతలకు విగ్రహాది మత్త్వము (సహస్రాక్షుడు, వజ్రబాహుడు ఇత్యాది స్వరూపము లుండుట) అసంభవము.

కావుననే, "విరోధే గుణవాద స్స్యాత్" ఇత్యాది వచనముచే అర్థవాద మూడు విధములుగ విభజించబడినది: 1. గుణవాదలు, అనగా, ప్రమాణాంతర విరోధము గల వాక్యములు. (గ్రావణః ప్లవంతే) రాళ్ళు తేలుట ప్రత్యక్ష ప్రమాణవిరుద్ధము.

2. అనువాదము అనగా, సిద్ధమైనదానిని చెప్పునది. (యథా, 'దధ్నా జుహోతి' అను స్థలమున 'హు' ధాతువుచే 'అగ్ని హోత్ర హోమమును అనువదించి తదుద్దేశముచే దధిరూప, గుణవిధానము) ఇట్లే అర్థవాదవాక్యములలో గూడ చూచుకొనవలెను. 3. భూతార్థవాద, అనగా లోక ప్రసిద్ధమైన అర్థమును చెప్పునది. ద్విస్సంవత్సరస్య అనునది భూతార్థ వాద.

మూలము: "కింబహునా, విద్యత ఏవావవశ్యం వేదన
మాత్రా దపూర్వం । అతో వేదనాయ వేదో వ్యాఖ్యాయతే ।
యోఽయం విషయరూప ఇష్టప్రాప్త్య నిష్టపరిహారోపాయః
సామాన్యతో నిర్దిష్టః న విశేషేణ స్పష్టీక్రియతే । వేద స్తావ
త్కాండద్వయాత్మకః । తత్ర పూర్వకాండే నిత్య, నైమిత్తిక,
కామ్య, నిషిద్ధరూపం చతుర్విధం కర్మ ప్రతిపాద్యతే ।
"యావజ్జీవ మగ్నిహోత్రం జుహోతి" ఇత్యాదికం నిత్యం ।
తస్య నియతనిమిత్త త్వాత్ । "యస్య గృహాన్ దహత్యగ్నయే
క్షామవతే పురోడాశ మష్టాకపాలం నిర్వపేత్" ఇత్యాది నైమి
త్తికం । తాస్యాఽనియతనిమిత్తత్వాత్ । "చిత్రయా
యజేత పశుకామః" ఇత్యాదికామ్యం । "తస్మా న్మలవద్వా
ససా న సంవదేత న సహాఽఽసీత" ఇత్యాదికం నిషిద్ధం ।
తేమ నిత్య, నైమిత్తికాఽనుష్ఠానేన తదకరణే ప్రత్యవాయ
రూప మనిష్టం పరిహ్రియతే । స చ ప్రత్యవాయో యాజ్ఞ
వల్క్యేన స్మర్యతే । 'విహితస్యాఽననుష్ఠానా న్నిందితస్య చ సేవ
నాత్ । అనిగ్రహో చ్చేంద్రియాణాం నరః పతన మృచ్ఛతి ।"

ఇతి.

ఫలితము: (కిం బహునేత్యాది) అనేకముచే ప్రయోజనమేమి? వేదనమాత్రము (అర్థజ్ఞానము) వలన అపూర్వము ఆవశ్యముగ నున్నదిగాన, అర్థజ్ఞానముకొరకు వేదము వ్యాఖ్యానము చేయబడుచున్నది.

ఆదియందు వేదమునకు విషయ, ప్రయోజన, సంబంధా౽౽ధికార రూప మగు అనుబంధ చతుష్టయమును చెప్పు సందర్భములో "ఇష్టప్రాప్త్యనిష్టపరిహారోపాయము" వేదమునకు విషయమని జెప్పి, తద్విశేషమును వివరించుచున్నాడు.

వేదము రెండు కాండలు (భాగములు), కర్మకాండ, బ్రహ్మకాండ, ఆ రెండిటిలో పూర్వకాండయందు నిత్యకర్మలు, నైమిత్తిక కర్మలు, కామ్యకర్మలు, ప్రతిషిద్ధకర్మలు అను నాలుగు విధముల గు కర్మలు చెప్పబడినవి. "యావజ్జీవ మగ్నిహోత్రం కరోతి" ఇత్యాదికము నిత్యము. అగ్నిహోత్రకర్మకు నిమిత్తమగు జీవనము నిత్యముగావున, అగ్నిహోత్రాదికర్మలు నియతమగు జీవనరూప నిమిత్తము కలవి. అందుచే అగ్నిహోత్రాదికర్మలు నియత, నిమిత్తత్వ రూపమగు నిత్యకర్మ లక్షణము గలవి.

ఏ యజమానికి గృహములు దగ్ధ మగునో ఆతడు క్షామ వదిష్టి చేయవలెను. ఇచ్చట గృహదాహము నిమిత్తము. ఇది అనియతము. అనియత మగు గృహదాహరూప మగు నిమిత్తము కలది గనుక, క్షామవదిష్టి మున్నగు కర్మలు అనియతనిమిత్త త్వరూప మగు నైమిత్తిక కర్మలక్షణము కలవి. "చిత్రయా యజేత పశుకామః" ఇత్యాది వాక్యములచే విహితము లగు చిత్రాయాగము మున్నగు కర్మలు పశ్వాదిరూపఫలకామనచే చేయలసినవి గావున ఇవి కామ్య కర్మలు. "తస్మా న్మలవద్వాససా న సంవదేత" ఇత్యాది వాక్యములచే నిషేధింపబడిన రజస్వలాస్త్రీలతో సంభాషణ మున్నగునవి నిషిద్ధకర్మలు.

ఈ నాలుగు విధములగు కర్మలలో నిత్యనైమిత్తిక కర్మలు చేయుటచే, "అకరణే ప్రత్యవాయః" అను శాస్త్రానుసారము (నిత్య, నైమిత్తిక కర్మలు చేయకపోవుటవలన సంభవించెడి) ప్రత్యవాయ రూప మగు అనిష్టము పరిహరించబడును.

నిత్య, నైమిత్తిక కర్మలను చేయకపోవుటవలన "విహితస్యాననుష్ఠానాత్" ఇత్యాది వచనములచే ప్రత్యవాయమును యాజ్ఞవల్క్య స్మృతి బోధించుచున్నది.

ఆ స్మృతి తాత్పర్యము: శాస్త్రవిహితములగు నిత్యనైమిత్తి కాది కర్మల నాచరించక పోవుట వలనను, శాస్త్రముచే నిషేధింపబడిన కర్మలను చేయుటవలనను, ఇంద్రియ నిగ్రహము లేకపోవుట వలనను మానవుడు పతితుడగును.

## నిత్యకర్మలకు ఫలవిచారము.

మూలము: "యావజ్జీవ మగ్నిహోత్రం జుహోతీత్యాది
వాక్యే ష్వనుక్తో ప్యవర్జనీయతయా స్వాభీష్టః స్వర్గః ప్రాప్యతే ।
తథాచా౽౽పస్తంబః - "తద్యథా౽౽మ్రే ఫలార్థే నిర్మితే

ఛాయాగంధా వనూత్పద్యేతే ఏవం ధర్మమపి చర్యమాణ మర్థా
అనూత్పద్యంతే" ఇతి. కామ్య స్యేష్ట ఫలహేతుత్వం తద్విధి
వాక్యే స్పష్టమేవ । ఇష్టవిఘాతరూప మనిష్టం చార్థా త్పరి
హ్రియతే । నిషిద్ధవర్జనాచ్చ రాగప్రాప్తా౽నుష్ఠాన జన్యోనరకః
పరిహ్రియతే । న కేవలం నిత్యనై మిత్తిక కామ్యానా మాను
షంగికస్వర్గప్రాప్తిః । కింతు ధీశుధ్యా వివిదిషోత్పాదనద్వారా
బ్రహ్మజ్ఞాన హేతుత్వమపి తయో రస్తి । తథాచ వాజస
నేయిన స్సమామనంతి – "తమేతం వేదానువచనేన
బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన తపసా౽నాశకేన ।"

ఇతి.

తా॥ యావజ్జీవాదివాక్యములందు ఫలము చెప్పబడకపోయి నను కర్మకు ఫలము నిచ్చెడి శక్తి అనివార్యము (అవర్జనీయము). కావున, యజమాని ఫలమును కోరకపోయినను "సస్వర్గస్స్యా త్సర్వా న్ప్రత్యవిశిష్టత్వాత్" అను విశ్వజిన్న్యాయముచే తనకు అభీష్టమగు స్వర్గము సంప్రాప్త మగును. ఈ విషయములో ఆపస్తంబమహర్షి ధర్మసూత్రములలో ఈ క్రింది విధముగ చెప్పెను.

లోకములో మామిడిపండు నిమిత్తము మామిడిచెట్టును నిర్మించినను, తనచే కోరబడకపోయినను, నీడ, సుగంధము (అనివార్యములు గాన) ఎట్లు ఉత్పన్నము లగునో, అట్లే ధర్మము (పుణ్యకర్మ) ఆచరించబడినపుడు (తాను కోరకపోయినను) స్వర్గాదిఫలము లుత్పన్నము లగును. ఈ విధముగ, నిత్యకర్మలకు (కోరకపోయినను) స్వర్గాదిఫలము కలదని బోధిత మగుచున్నది.

## కామ్యప్రతిషిద్ధకర్మల ఫలము.

తా॥ చిత్రాయాగము మున్నగు కామ్యకర్మలకు పశ్వాదిరూపమగు ఫలసాధనత్వము అకామ్యకర్మలను విధించెడి "చిత్రయా యజేత పశుకామః" ఇత్యాది విధివాక్యములందే స్పష్టము. ఇష్ట విఘాతరూపమగు అనిష్టము కూడ అర్థాత్తు పరిహరించబడును. "న సురాం పిబేత్" ఇత్యాది నిషేధవాక్యనిషిద్ధములగు సురాపాన వర్జనాదికమువలన రాగప్రాప్తము లగు సురాపానము మున్నగువాటి వలన సంభవించెడి నరకము పరిహరించబడును.

## కర్మలకు బ్రహ్మజ్ఞానహేతుత్వము.

నిత్య, నైమిత్తికకర్మలకు అనుషంగిక మగు (అయత్నసిద్ధమగు) స్వర్గఫలమే గాక "త మేతం వేదానువచనేన" ఇత్యాది వాజన నేయశ్రుతివాక్య ప్రతిపాదితరీతిని చిత్తశుద్ధి ద్వారా

వివిదిషను (తత్వ జ్ఞానమును తెలిసికొనవలెనను ఇచ్ఛను) ఉత్పాదన చేసి, తద్వారా బ్రహ్మ జ్ఞానముకు కూడ ఇవి కారణము లని స్పష్ట మగుచున్నది.

మూలము: "ఏవం తర్హి పూర్వకాండ ఏవా__శేషపురు
షార్థసిద్ధేః కృత ముత్తరకాండే నేతిచేన్న । అపునరావృత్తి లక్షణ
స్యా__త్యంతికపురుషార్థస్య తత్రా__సిద్ధేః । అతేవా__
ధర్వణికాః కర్మిణః దక్షిణమార్గేణ చంద్రప్రాప్తిం పునరా
వృత్తిం చా__మనంతి । 'స సోమలోకే విభూతి మనుభూయ
పునరావర్తతే' ఇతి । అత ఉత్తరకాండ స్తదర్థకో ద్రష్టవ్యః ।"

తా॥ నిత్య, నైమిత్తిక కర్మలు బ్రహ్మజ్ఞానమునకు కూడ కారణము లైనచో పూర్వకాండమందే సంపూర్ణ పురుషార్థము సిద్ధించు చున్నది గాన, ఉత్తరకాండ మనవసర మనినచో అట్లనుటకు వీలు లేదు. కర్మలయొక్క ఆచరణము చిత్తశుద్ధి ద్వారా వివిధిషోత్పాదన ద్వారా జ్ఞానమునకు సాధన మగునేగాని, పునరావృత్తి (పునర్జన్మ) రహిత మగు మోక్షమునకు సాక్షాత్తుగ సాధనము కానేరదు. అందుచే పరమపురుషార్థ ప్రాప్తి కొరకు జ్ఞానకాండ అవసరము. పూర్వకాండయందు అపునరావృత్తి లక్షణ మగు అత్యంతిక పురుషార్థము సిద్ధించదు గనుకనే ఆధర్వణికులు కర్మానుష్ఠాతలకు దక్షిణమార్గముచే చంద్రప్రాప్తిని, పునరావృత్తిని చెప్పుచుండిరి. "స సోమలోకే విభూతి మనుభూయ పున రావర్తతే" (కర్మానుష్ఠాత చంద్రలోకములో ఐశ్వర్యము ననుభవించి తిరిగి వచ్చును). అందువలన ఉత్తర కాండ అపునరావృత్తి లక్షణమగు మోక్షముకొరకు అవసరము.

## ఆత్యంతిక పురుషార్థము

మూలము: "ఆత్యంతిక పురుషార్థశ్చ ద్వివిధః సద్యోముక్తిః,
క్రమముక్తి శ్చేతి । వర్తమానదేహపాతానంతరమేవ సిధ్యతి
సద్యోముక్తిః । ఉత్తరమార్గేణ గత్వా బ్రహ్మలోకే చిరం భోగా
ననుభూయ తత్రోత్పన్నజ్ఞానస్య బ్రహ్మలోకా__వసానే సిధ్యతి
క్రమముక్తిః । తస్మా దుత్తరకాండే బ్రహ్మోపదేశః బ్రహ్మో
పాస్తి శ్చేత్యుభయం ప్రతిపాద్యతే । బ్రహ్మోపాస్తి ప్రసం
గేన బ్రహ్మదృష్ట్యా ప్రతీకం ఉపాస్యత్వేన సాంసారికఫల
కామిన ముద్దిశ్య ప్రతిపాద్యతే । బ్రహ్మోపాసక ప్రతీకో
పాసకయో స్సమానే ప్యుత్తరమార్గే ప్రతీకోపానకస్య
విద్యుల్లోకా దూర్ధ్వం బ్రహ్మలోకగమనాభావేన క్రమ

ముక్తే రప్యసిద్ధత్వాదస్తి పునరావృత్తిః । ఏతచ్చ అప్రతీకా

లంబనా న్నయతీ త్యధికరణే (బ్ర.సూ.4.అధ్యా.3.పా.15.అధి.) ద్రష్టవ్యం।"

తా॥ అత్యంతిక పురుషార్థము సద్యోముక్తి, క్రమముక్తి యని రెండు విధములు. వర్తమానదేహముయొక్క పతనా౽నంతరముననే సిద్ధించును సద్యోముక్తి. క్రమముక్తియన్ననో ఉత్తర మార్గము ద్వారా వెడలి హిరణ్యగర్భలోకమందు చిరకాలము భోగముల ననుభవించి అచ్చట ఉత్పన్నమైన జ్ఞానముగలవానికి బ్రహ్మలోకావసాన మందు సిద్ధించును (క్రమముక్తి)

## ప్రతీకోపాసకునకు పునరావృత్తి.

**కా**వున ఉత్తరకాండయందు బ్రహ్మోపదేశము, బ్రహ్మోపాసన, (ఈ రెండును) ప్రధానముగ చెప్పబడును. బ్రహ్మోపాసనా ప్రసంగమున సాంసారిక ఫలకామునకు బ్రహ్మదృష్టిచే ప్రతీకోపాసనము చెప్పబడుచున్నది. బ్రహ్మోపాసక ప్రతీకోపాసకులకు ఉత్తరమార్గము సమానమైనను, ప్రతీకోపాసకునకు విద్యుల్లోకానంతరము బ్రహ్మలోకగమనము లేకపోవుటచే క్రమముక్తి కూడ సిద్ధించకపోవుట వలన పునరావృత్తి కలదు. ఈ విషయమును 'అప్రతీకాలంబనాత్' అను అధికరణములో చూడవలెను.

## ప్రకృతము.

మూలము: "నన్వస్త్వేవం పూర్వోత్తరకాండయో ర్విషయ

విశేషః ప్రయోజనవిశేషశ్చ । తథాపి పూర్వకాండస్యా౽దౌ

కర్మాంతరం పరిత్యజ్య దర్శపూర్ణమాసేష్టిరేవ కుతః ప్రతి

పాద్యత ఇతిచేత్, ప్రకృతిత్వాన్నిరపేక్షత్వాచ్చేతి బ్రూమః ।

ప్రకర్షేణా౽ంగోపదేశో యత్ర క్రియతే సా ప్రకృతిః ।

కృత్స్నాంగవిషయత్వ ముపదేశస్య ప్రకర్షః । వికృతిషు తు

విశేషాంగోపదేశ ఏవ క్రియతే । అంగాంతరాణి తు ప్రకృతే

రతిదిశ్యంతే । అతో౽తిదేశస్య ప్రకర్షా౽భావః ।"

తా॥ ఈ విధముగ పూర్వోత్తరకాండలకు విషయభేదము, ప్రయోజన భేదము ఉండుగాక. అయినను, పూర్వకాండయొక్క ఆదియందు ఇతరకర్మలను విడచి దర్శపూర్ణమాసేష్టియే ఏల చెప్పబడుచున్నది.

ఉత్తరము: ఇతర కర్మలన్నిటికిని దర్శపూర్ణమాసేష్టి ప్రకృతి యగుట వలనను, ఇతర కర్మల అపేక్ష దర్శపూర్ణమాసేష్టికి లేకపోవుట చేతను, దర్శపూర్ణమాసేష్టి ఆదియందు చెప్పబడుచున్నది.

## ప్రకృతి, వికృతి లక్షణములు.

తా॥ ఏ కర్మలందు అపేక్షితము లగు సర్వ అంగములు ఉపదేశించబడునో, ఆ కర్మలు ప్రకృతికర్మలు. ఏ కర్మలందు విశేషాంగములు మాత్రమే ఉపదేశించబడునో, మిగిలిన అంగములు ప్రకృతినుంచి "ప్రకృతిప ద్వికృతిః కార్యా" అను చోదకముచే అతిదేవించ బడునో అవి వికృతికర్మలు. ప్రకృతిలో సర్వాంగములు అచ్చటనే ఉపదేశించబడునుగాన, ఉపదేశమునకు ప్రకర్ష. వికృతిలో విశేషాంగములు మాత్రమే అచ్చట ఉపదేశించబడి, మిగిలిన అంగములన్నియు ప్రకృతినుండి అతిదేశముచే సంపాదించబడునుగాన అతిదేశమునకు ప్రకర్షాభావము అని విభాగము.

## ప్రకృతి విభాగము.

మూలము: "ప్రకృతి స్త్రిధా – అగ్ని హోత్ర మిష్టి స్సోమ ఇతి । త్రిష్వ ప్యేతేషు అన్యనై రపేక్ష్యేణ స్వాంగజాతం సర్వ ముపదిష్టం । తత్ర సోమయాగస్య స్వరూపేణా౽న్యనైర పేక్ష్యేపి అంగేషు ప్రాయణీయాదీక్షణీయాదిషు దర్శపూర్ణ మాసా౽పేక్షత్వా న్న పూర్వభావిత్వం యుక్తం । ఇష్టేస్తు సోమ యాగ నిరపేక్షత్వా త్సోమా త్ప్రాచీనత్వం యుక్తం । యద్య ప్యగ్నిహోత్రస్య స్వరూపే అంగేషు వా నా౽న్యాపేక్షా । తథా ప్యగ్ని సిద్ధ్యపేక్షత్వా దాహవనీయాద్యగ్నీనాం చ పావమా నేష్టిసాధ్యత్వా త్పానమానేష్టీనాం చ దర్శపూర్ణమాసవికృతిత్వా త్పరంపరయా అగ్నిహోత్రస్య దర్శపూర్ణమాసాపేక్షా౽స్తీతి ప్రథమభావిత్వం న యుక్తం । దర్శపూర్ణమాసయో రప్యగ్ని సాధ్యత్వా దగ్నిసాధక మాధానం ప్రథమం వక్తవ్య మితిచే న్నైవం ।"

తా॥ అహితాగ్నులచే యావజ్జీవము ఉదయము, సాయంకాలము చేయబడునట్టి "యావజ్జీవ మగ్నిహోత్రం జుహోతి" అను శాస్త్రవిహిత మగు కర్మకు అగ్నిహోత్ర మని పేరు. ఇట్టి అగ్నిహోత్రము, ఇష్టి, సోమయాగము అను మూడు కర్మలును అన్ని కర్మలకు ప్రకృతులు. ఈ మూడు కర్మలందును ఇతరాపేక్ష లేకుండ వాటి అంగము లన్నియు సంపూర్ణముగ ఉపదేశించబడినవి (గాన ప్రకృతులు).

ఈ మూడిటిలో సోమయాగమునకు అంగిస్వరూపములో ఇతర ఆపేక్ష లేకపోయినను, సోమయాగమునకు, అంగములగు దీక్షణీయా ప్రాయణీయాదీష్టులందు దర్శపూర్ణమాసేష్టుల

ఆపేక్ష ఉండుటవలన పూర్వభావిత్వము (ప్రథమములో చెప్పుట) యుక్తము కాదు. దర్శపూర్ణమా సేష్టి కన్ననో, సోమయాగముయొక్క ఆపేక్ష లేకపోవుటచే సోమయాగముకంటే పూర్వభావిత్వము యుక్తము. అగ్నిహోత్ర కర్మ కన్ననో, స్వరూప విషయములోను, అంగముల విషయములోను మరియొక దాని ఆపేక్ష లేకపోయినను అగ్నిహోత్ర కర్మకు ఆహవనీయ, గార్హపత్యదక్షిణాగ్నుల అపేక్ష కలదు. అహవనీయాద్యగ్నులు పావమానేష్టిచేగాని సిద్ధించవు. ఆ పావమానేష్టులు దర్శపూర్ణమాసేష్టి వికృతు లగుటవలన ప్రకృతి భూతములగు దర్శపూర్ణమాసల అపేక్ష పావనేష్టులకు కలదు. ఈ విధముగ పంపరపరగా అగ్నిహోత్రకర్మకు దర్శపూర్ణమాసల అపేక్ష యున్నది గాన, దర్శపూర్ణమాసలకు అగ్ని హోత్రకర్మకంటె ప్రథమ భావిత్వముయుక్తము గాని, అగ్నిహోత్ర కర్మకు ప్రథమ భావిత్వము యుక్తము కాదు.

పూర్వపక్షము: అగ్నిహోత్రకర్మకు వలెనే దర్శపూర్ణమాసేష్టులకు కూడ ఆహవనీయాద్యగ్నుల ఆపేక్ష యున్నది గాన, అగ్ని సాధక మగు ఆధానము అను కర్మను ముందు చెప్పవలెనని అనినచో -

మూలము: "నా౽౽ధానమాత్రే ణా౽గ్నయ స్సిధ్యంతి ।
కింతు పవమానేష్టిభిరపి । తా శ్చేష్టయో దర్శపూర్ణమాసవికృ
తిత్వా త్సాక్షాదేవ దర్శపూర్ణమాసా వపేక్షంతే । దర్శపూర్ణ
మాసౌ త్వగ్నిద్వారా పవమానేష్టిసాపేక్షా వపి న సాక్షాత్పవ
మానేష్టీ రపేక్షేతే । అతో నిరపేక్షత్వా ద్దర్శపూర్ణమాసేష్టిరేవ
ప్రథమం వక్తవ్యా । ఋగ్వేదసామవేదయో రాదౌ దర్శ
పూర్ణమాసేష్టి రనామ్నాతేతిచే ద్బాఢం ।"

తా॥ అట్లనుటకు వీలు లేదు. ఆధాన మను కర్మ మాత్రముచే ఆహవనీయాద్యగ్నులు సిద్ధించవు. పవమానేష్టులు కూడ చేయుట చేతనే అగ్నులు సిద్ధించును. అపవమానేష్టులు దర్శపూర్ణమాసలకు వికృతు లగుటవలన ప్రత్యక్షముగ దర్శపూర్ణమాసల నపేక్షించు చున్నవి.

దర్శపూర్ణమాసలన్ననో, అగ్నిద్వారా పవమానేష్టి యొక్క అపేక్ష కలవైనను, అవ్యవధానముగ (ప్రత్యక్షముగ) పవమానేష్టుల అపేక్ష దర్శపూర్ణమాసలకు లేదు. కావున, దర్శపూర్ణమాసేష్టియే ముందుగ చెప్పవలసియున్నది. ఋగ్వేద, సామవేదములలో ఆదియందు దర్శపూర్ణమాసేష్టి చెప్పబడలే దను మాట సత్యమే.

మూలము: యజుర్వేద మపేక్ష్య దర్శపూర్ణమాసయో
రాదిత్వముక్తం । కర్మకాండవిషయో యజుర్వేదస్యైవ ప్రధాన

త్వాత్ । అనుపూర్వ్యాత్ కర్మణాం స్వరూపం యజుర్వేదే సమా
మ్నాతం । తత్ర తత్ర విశేషాऽపేక్షాయాం అపేక్షితా
యాజ్యానువాక్యాదయ ఋగ్వేదే సమామ్నాయంతే । స్తోత్రా
దీనితు సామవేదే । తథాసతి భిత్తిస్థానీయో యజుర్వేద శ్చిత్ర
స్థానీయా వితరౌ । తస్మా త్కర్మసు యజుర్వేదస్యైవ
ప్రాధాన్యం । తస్మింశ్చ దర్శపూర్ణమాసేష్టి రాదౌ సమామ్నాతా ।
యద్యపి మంత్రబ్రాహ్మణాత్మకో వేదః । తథాపి బ్రాహ్మ
ణస్య మంత్రవ్యాఖ్యానరూపత్వా న్మంత్రా ఏవాऽऽదౌ సమా
మ్నాతాః । తే చ త్రివిధాః । ఋచః, సామాని, యజూంషి
చేతి । తత్ర యజుషాం అధ్వర్యువేదే బహులత్వాత్ క్వచి
దృచాం సద్భావేపి యజుర్వేద ఇత్యేవాऽऽఖ్యాయతే । అధ్వర్యు
వేదత్వం చాన్య అనాదిసిద్ధ యాజ్ఞికసమాఖ్యయా ऽవగం
తవ్యం ।"

తా॥ ఋగ్వేదసామవేదముల ఆదిలో దర్శపూర్ణమాసేష్టి చెప్పబడలేదు. అనుక్రమముగ కర్మలయొక్క స్వరూపము యజుర్వేద మందు చెప్పబడుచున్నది. కాన, కర్మకాండవిషయములో యజుర్వేదమునకే ప్రాధాన్యమువలన యజుర్వేదము నపేక్షించియే దర్శ పూర్ణమాసలకు ఆదిత్వము చెప్పబడినది.

యజుర్వేదోక్తమైన కర్మలలో అచ్చటచ్చట విశేష మంత్రముల అపేక్ష యున్నపుడు అపేక్షితము లగు యాజ్యాऽనువాక్యాదిమంత్రములు ఋగ్వేదమందు చెప్పబడుచున్నవి. స్తోత్రాదులు సామవేదమందుచెప్పబడుచున్నవి. ఈ విధముగ వేదత్రయమందు గుణప్రధాన భావముగ విషయవిభాగమువలన యజుర్వేదము భిత్తిస్థానీయము. (గోడవంటిది). ఋక్సామ వేదములు చిత్రస్థానీయములు (గోడమీది చిత్తరువులవంటివి). కావున, కర్మల విషయములో యజుర్వేదమునకే ప్రాధాన్యము. ఆ యజుర్వేదమందు దర్శపూర్ణమాసేష్టి ఆదియందు చెప్పబడుచున్నది.

విమర్శించినచో, వేదము మంత్ర, బ్రాహ్మణరూపము. అయినను, బ్రాహ్మణము మంత్రములకు వ్యాఖ్యానరూపము గావున, మంత్రములే ఆదియందు చెప్పబడినవి. ఆ మంత్రములు ఋక్కులు, సామలు, యజుస్సులు అని మూడు విధములు.

అధ్వర్యువేదమందు (యాజ్ఞికసమాఖ్యతే యజుర్వేదమునకు అధ్వర్యువేద మని పేరు) యజుర్మంత్రములు అధికముగ నుండుట వలన కొంచెముగ ఋఙ్మంత్రము లున్నను, యజుర్వేద మనియే చెప్పబడుచున్నది.

ఈ యజుర్వేదమందు చెప్పబడిన దర్శపూర్ణమాసేష్టిమంత్రములు, అధ్వర్యవములు, యాజమానములు, హౌత్రములు అని మూడు విధములు. 'ఇషేత్వా' అను ప్రథమ ప్రశ్నయందు (పన్నమందు) పఠితములైన మంత్రములు ఆధ్వర్యవములు (అనగా, అధ్వర్యుడు చెప్పవలసిన మంత్రములు). 'సం త్వా సించామి' అను ప్రశ్నయందు పఠితములైన మంత్రములు యాజమానములు (యజమాని చెప్పవలసిన మంత్రములు). 'సత్యం ప్రపద్యే' అను ప్రశ్న యందు పఠితములైన మంత్రములు హోత్రములు. (హోత చెప్పవలసిన మంత్రములు).

ఈ మూడు విధములగు మంత్రములలో యాజమాన మంత్రములు, హౌత్రమంత్రములు చిత్రస్థానీయము లగుటవలన భిత్తి స్థానీయము లగు ఆధ్వర్యవమంత్రములకు ఆదియందు పాఠము యుక్తము. ఆ అధ్వర్యవమంత్రములు ఇషేత్వా మొదలు పదమూడు అనువాకములలో చెప్పబడినవి.

ఇంతవరకు ఆంధ్రానువాదము చేయబడినది.





శ్రీ మహాగణాధిపతయే నమః ।

# వేదసార రత్నావళి

## 23. జ్ఞానులు, యోగులు

### ఉపోద్ఘాతము.

మానవునకు సద్గురు కటాక్షముచేతనే మోక్షము లభించుననియు, జ్ఞాని యైన పిదప ఆ దేహపాత మైన వెంటనే దేహాంతరమును (మరి యొక దేహమును) స్వీకరింపనక్కరలేకయే మోక్షము సంప్రాప్త మగు ననియు శ్రుతులు బోధించుచున్నవి.

"బ్రహ్మవి దా ప్నోతి వరం"

"తస్య తావదేవ చిరం యావ న్న విమోక్ష్యేఽథ సంపత్స్యే" (ఉ.)

ఇత్యాదిశ్రుతులు వెంటనే మోక్షమును బోధించుచున్నవి. ఇట్లుండ, లోకములో కొందరు జ్ఞానులు వర్తమానదేహపాతానంతరము వెంటనే ముక్తిని బొందక మరికొన్ని దేహములను ప్రవేశించుచున్నట్లు దెలియుచున్నవి. జ్ఞానులకు వర్తమానదేహపాతానంతరము మోక్షమే యని పై శ్రుతుల వలన స్పష్టమగుచున్నది గదా! ఆ శ్రుతులు ఎట్లు సమన్వితము లగును? అను సంశయము కలుగుటకు అవకాశము లభించుచున్నది.

ఈ విషయము ఉత్తరమీమాంసాశాస్త్రములో విచారితమైనది. దానిని పరికించినచో, సంశయము లన్నియు నిశ్శేషముగ తొలగి పోవును. అందులకై ఆ అధికరణ విషయము సంక్షేపముగ అనువదించబడుచున్నది.

### అధికరణ లక్షణము.

1. విషయము, 2. సంశయము, 3. పూర్వపక్షము, 4. సిద్ధాంతము, 5. ప్రయోజనము, 6. సంగతి (పూర్వాధికరణముతో). ఈ యారును అధికరణస్వరూపము గాన, యథావసరముగ వివరించ బడుచున్నది.

### విషయము.

"తస్యతావదేవ" ఇత్యాది శ్రుతులవలన 'జ్ఞానము ముక్తికి సాధనము' అనునది ఈ అధికరణములో విచారణీయమైన విషయము.

కొన్ని శ్రుతులు వర్తమానదేహపాతానంతరమున జ్ఞానికి ముక్తిని బోధించుట చేతను, మరికొన్ని శ్రుతులు, స్మృతులు, జ్ఞానులగు కొందరు మహర్షులకు దేహపాతానంతరమున తిరిగి అనేక దేహములను స్వీకరించిన పిదప మోక్షమును బోధించుటచేతను, జ్ఞానము మోక్షమునకు సాధనమా, కాదా? యని సంశయము.

## పూర్వపక్షము.

"వశిష్ఠాదయః తత్వజ్ఞానిన ఏవ సంతః తత్రతత్ర శాపాద్వా,
పరాద్వా, స్వేచ్ఛయా వా శరీరాంతరాణి జగృహుః ।" (ఉ.మీ. 3.3.19.అ.32.సూ.)

తా॥ వశిష్ఠాదిమహర్షులు జ్ఞానులగుచు నుండియు, శాపము వలనగాని, వరదానమువలన గాని, స్వేచ్ఛచేతగాని, శరీరాంతరములను ధరించినట్లు కనిపించుటచే జ్ఞానికి వర్తమానదేహపాతా_నంతరమున ముక్తి నియతము కాదని పూర్వపక్షము.

## సిద్ధాంతము.

"యావ దధికార మవస్థిత రాధికారికాణాం ।" (ఉ.మీ. 3.3.19.32.సూ.)

తా॥ ఈ అధికరణములో ఇట్లు చెప్పబడినది.

"య ఏతే త్వయోదాహృతాః పురుషాః తే సర్వే జగ
న్నిర్వాహకారిణః తే చ పూర్వస్మిన్ కల్పే మహతా తపసా
పరమేశ్వర ముపాస్య, అస్మిన్ కల్పే నానాదేహోపభోగ
యోగ్యం అధికారపదం లేభిరే । క్షీణే చ ప్రారబ్ధే కర్మణి
మోక్ష్యంతే । తథా అనారబ్ధకర్మణాం తత్వజ్ఞానేన దాహస్య
నివారయితు మశక్యత్వాత్ తత్వవిదో ముక్తి ర్నియతైవ ।"

భావము: నీచే ఉదహరించబడిన జ్ఞానులగు వసిష్ఠాదు లందరును జగన్నిర్వాహము చేయుటకు వచ్చిన మహాపురుషులు, వీరందరును పూర్వకల్పమునందు గొప్ప తపస్సుచే పరమేశ్వరు నుపాసించి, అనేక దేహధారణములచే ఉపభోగ్య మగు (అనుభవింపవలసిన) అధికారపదమును పొందిరి. అనేకదేహధారణయోగ్య మగు ప్రారబ్ధ కర్మము క్షీణమగుటతోడనే ముక్తులగుదురు. ప్రారబ్ధకర్మ వ్యతిరిక్తము లగు అగామి, సంచితకర్మలు తత్వజ్ఞానముచే నశించును. కాన, జ్ఞానికి మోక్షము నియతమేగాని, పాక్షికము ఎన్నడును కానేరదు.

ఫలితము:ఈ మహాపురుషులు జగజ్జీవుల నిర్వాహము కొరకు దయచేసిరిగావున, వారి ఇచ్ఛానుసారము వర్తమానదేహమునుంచి, అనేక దేహములను ధరించి, తమ కర్తవ్యము (చేయవలసిన పని) పూర్తికాగానే ముక్తులగుదు రని ఈ అధికరణ సిద్ధాంతము.

ఈ సిద్ధాంతమును పరికించినచో మనకు స్పష్టమగు విషయమేమన, సంతులు జగజ్జీవుల కళ్యాణముకొరకు దేహధారణమును చేసి జగత్తునందవతరించి జీవకళ్యాణము పూర్తి యగువరకు ఇచ్చట అనేక దేహములను ధరించి యుండి పని పూర్తి యైనవెంటనే వారు ముక్తులగుదురు. మరియు, సంతులు కలియుగావసానమువరకు దేహధారణము చేయుచు జీవకళ్యాణ మొనరింతు రను విషయము ఈ అధికరణములోనే సూర్యదృష్టాంతము వలన తెలియుచున్నది. శారీరక మీమాంసాభాష్యములో శ్రీమచ్ఛంకరభగవత్పాదులు ఇట్లు సెలవిచ్చిరి.

'న తేషాం అపాంతరతమః ప్రభృతీనాం వేదప్రవర్తనాదిషు
లోకవ్యవహారేషు నియుక్తానాం అధికారతంత్రత్వాత్ స్థితేః ।
యథా౽సౌ భగవాన్ సవితా సహస్రయుగపర్యంతం జగతో౽ధి
కారం చరిత్వా తదవసానే ఉదయాస్తమయవర్జితం కైవల్య
మనుభవతి ।" (ఉ.మీ. 3.అ. 3.పా. 19.అధి. 32.సూ.)

"అథ తత ఊర్ధ్వ ముదేత్య నైవోదేతా, నాస్తమే
తైకల ఏవ మధ్యే స్థాతా ।" ఇతి శ్రుతేః, (ఛాం. ఉ. 3-11-1)

భావము: జ్ఞాని యగు సూర్యభగవానుడు వేయి యుగములు ఉదయాస్తమయములచే లోకోపకారము గావించి, అనంతరము ఉదయాస్తమయరహిత మగు కైవల్యమును ఎట్లు పొందునో, అట్లే అపాంతరతమస్సు మున్నగు జ్ఞానులగు మహర్షులు లోకస్థితికారణము లగు అధికారములందు నియుక్తులై యుండుటచే అట్టివారికి వర్తమాన దేహపాతానంతరమున దేహాంతర ప్రవేశము అధికారము ననుసరించి సంప్రాప్త మైనది. కావున, ప్రకృత సిద్ధాంతముకు (అనగా, జ్ఞానికి వర్తమానదేహపాతానంతరము ముక్తి నియతము అను సిద్ధాంతము నకు) విరోధించదు.

ఫలితము: జగన్నిర్వాహము కొరకు అవతరించిన జ్ఞాని యగు సూర్యుడు ఒక యుగములోనే గాక, సహస్ర యుగములు సూర్యరూపములో దేహమును ధరించి ఉదయాస్తమయ రూప మగు స్వకార్యమును నిర్వర్తించి, అనంతరము ఉదయాస్తమయములు లేని ఆత్మ స్వరూపస్థితిని (అనగా ముక్తిని) పొందెను. ఇట్లు ఛాందోగ్యశ్రుతి ప్రదర్శనపురస్సరముగ పై యావదధికారాధికరణములోని సిద్ధాంత మును తెలిసికొనిన పిదప, 'సంతులు యుగావసానమువరకు సద్గురు రూపములగు దేహములను ధరించి జీవకళ్యాణ మొనరింతు' రను వాక్యము సత్యబద్ధమును,అనుభవసిద్ధమునని విస్పష్టముగ తెలియుచున్నది.





శ్రీ మహాగణాధిపతయే నమః ।

# వేదసార రత్నావళి

## 24. మేఘాది వివరణము.

### ఉదకమునుండి విద్యుచ్ఛక్తి.

మన వైజ్ఞానికులు గొప్ప జలపాతములలో చక్రముల నుంచి విద్యుచ్ఛక్తిని ఉత్పాదన చేసి దానివలన ప్రజలకు సమస్త సౌకర్యము లను చేకూర్చుచున్న విషయము సర్వజనవిదితము. ఇట్టి విద్యుచ్ఛక్తి ఉదకమధ్యమునుంచి ఉత్పన్న మగు నని కృష్ణయజుర్వేద తైత్తిరీయ ఆరణ్యకములో (4వ ప్రశ్నలో 10వ అనువాకములో) వర్ణితమై యున్నది.

*"అపాం మధ్య ఉద్వాసయేత్ । అపాం వా ఏత*
*న్మధ్యా జ్జ్యోతి రజాయత । జ్యోతిః ప్రవర్గ్యః । స్వ*
*ఏవైనం యోనౌ ప్రతిష్ఠాపయతి ।"* (కృ.య.ఆ.4.ప్ర.10.అనుమంత్రబ్రాహ్మణ.)

తా॥ యజ్ఞములో ప్రవర్గ్యోద్వాసనకు స్థానములను చెప్పు సందర్భములో ఉదకముల మధ్య నుంచి జ్యోతిస్స్వరూప మగు విద్యుచ్ఛక్తి ఉత్పన్న మైనది గావున జ్యోతిరుత్పత్తికి స్థాన మగు ఉదక మధ్యయందు జ్యోతిస్స్వరూపమగు ప్రవర్గ్యను ఉద్వాసన చేయవలెను. అట్లు చేయుటచే జ్యోతీరూపమగు ఈ ప్రవర్గ్యను ఉద్వాసన చేయవలెను. అట్లు చేయుటచే జ్యోతీరూపమగు ఈ ప్రవర్గను స్వకీయ మగు స్థానమందు ప్రతిష్ఠితునిగ చేసినవాడగును. ఇట్లు శ్రుతి ఉదకమధ్య నుండి విద్యుచ్ఛక్తి యొక్క ఉత్పత్తిని ప్రశంసించుచున్నది. కాన, అనాదినుండియు ఈ విషయము మన పూర్వులకు తెలిసినదేగాని, అభూతపూర్వము కాదు.

### మేఘాదివివరణము.

మేఘము వృష్టిద్వారా సమస్త జగత్తుకు ఉత్పత్తి మొదలు ఆత్యంతికి పురుషార్థరూప మగు ఆత్మావబోధవరకు కారణముగ శ్రుతి బోధించుచున్నది. విద్యుత్తు (మెఱుపు) ను గుఱించి గూడ వేదములో వర్ణించబడియున్నది.

## మేఘము.

'మిహ సేచనే' అనుధాతువుకంటే మేఘశబ్దము నిష్పన్నమైనది. అనగా, వృష్టిచే భూమిని తడుపున దని యర్థము. ఇట్లే, 'అపః బిభర్తీ త్యభ్రం' అని అభ్రశబ్దముకు వ్యుత్పత్తి. అనగా, ఉదకములను ధరించునది యని వ్యుత్పత్తి. ఈ రెండు శబ్దములును మేఘ పర్యాయములే. ఇట్టి మేఘములను గూర్చి వేదములో ప్రశ్నప్రతి వచనములు కలవు.

*'క్వేద మభ్రం నివిశతే ।'* (కృ.య.ఆ. అరుణం. 8 అను.)

తా॥ ఈ మేఘస్వరూపము నిరాలంబ మగు అంతరిక్షమందు చూడబడుచున్నదే! దీనికి ఆధారమేది? కారణమేది? అనగా, దేని వలన మేఘ ముత్పన్నమగుచున్నది?

*'అభ్రా ణ్యపః ప్రపద్యంతే ।'* (కృ.య.ఆ.అరుణం. 8. అను.)

తా॥ మేఘములు సూర్యరశ్మివలన జలమును పొందుచున్నవి. కావున, మేఘములకు సూర్యరశ్మిగతములగు ఉదకములే కారణము. మరియు ఆధారమని ఈ శ్రుతియే ప్రశ్నప్రతివచనరూపమున బోధించుచున్నది. అనగా, సూర్యరశ్ములు తమయందున్న జలమును ధూమ, జ్యోతి, వాయువుల సమ్మేళనచే మేఘరూపత్వమును పొందిందుచున్నవి. అందువలన మేఘమునకు రశ్మిగతము లగు ఉదకములే కారణము, ఆధారము.

## సూర్యరశ్మ్ములయందు జలము.

*'క్వేమా అపో నివిశంతే । యదీతో యాంతి*
*సంప్రతి । ఆప స్సూర్యే సమాహితాః ।'* (కృ.య.ఆ.అరుణం. 8.అను)

తా॥ సూర్యరశ్ములందు ఉదకమును గూర్చి ప్రశ్నప్రతివచనములచే (శ్రుతి) నిర్వచనము చేయుచున్నది.

ప్రశ్న: ఘర్మకాలమందు తీక్ష్ణమగు సూర్యరశ్ములచే అంతటను జలశోష కనిపించుచున్నదే! ఈ జలము ఎచ్చట నుండును?

జ: ఈ జలమంతయు రశ్మిద్వారా సూర్యునియందు ఉండును. ఈ జలమే మేఘమునకు ధూమాదిమేళనచే కారణభూతము.

ఈ అర్థమునే కాళిదాసు రఘువంశములోని ఈ క్రింది శ్లోకములో నుదహరించెను.

'సహస్రగుణ ముత్స్రష్టుం ఆదత్తే హి రసం రవిః ।' (ర. వం. కా.)

తా॥ సూర్యుడు వేయి రెట్లు ఉదకమును వృష్టిరూపముగ మనకు ఇచ్చుటకై ఘర్మకాలములో భూమియందలి జలమును స్వీకరించుచుండెను.

—

# వర్షము.

'యాభి రాదిత్య స్తపతి రశ్మిభి స్తాభిః పర్జన్యో వర్షతి
పర్జన్యే నౌషధివనస్పతయః ప్రజాయంత ఓషధివన
స్పతిభి రన్నం భవ త్యన్నేవ ప్రాణాః ప్రాణై ర్బలం
బలేన తపస్తపసా శ్రద్ధా శ్రద్ధయా మేధా... ఆత్మానం
వేదయతి ।" (కృ.య.నారాయణం ఉ.)

తా॥ సూర్యుడు యే కిరణములచే జగత్తును తపింపచేయు చుండెనో, ఆ రశ్మలచే పర్జన్యరూపుడై వర్షించుచున్నాడు. ఈపర్జన్యునిచే వృష్టిద్వారా ఓషధులు, వనస్పతులు ఉత్పన్నము లగుచున్నవి. వాటిచే అన్నము, అన్నముచే ప్రాణిపోషణ, దానిచే శరీరసామర్థ్యము, బలముచే తపస్సు మున్నగునవి పరంపరగా ఉత్పన్నము లగు చున్నవి. అనంతరమందు విజ్ఞానముచే ఆత్మావబోధ కలుగుచున్నది. ఈ విధముగ మేఘములు వృష్టిద్వారా ఆత్మావబోధ పర్యంత మగు పురుషార్థమునకు సాధనము లగుచున్నవి. ఈ వర్షమును గూర్చి శ్రుతి.

"త్యుగ్రోహ భుజ్యు మశ్వినోదమే ఘే । రయిం న
కశ్చి న్మ మృవాజ్ ఆవాహాః । త ముహోధు ర్నౌభి రాత్మ
న్వతీభిః । అంతరిక్షప్రుద్భి రపోదకాభిః ।ష తిస్రః క్షప
స్త్రిరహాతివ్రజద్భిః । నాసత్యా భుజ్యు మూహధూః
పతంగైః । సముద్రస్య ధన్వ న్నార్ద్రస్య పారే । త్రిభీ రథై
శ్శతపద్భి ష్షడశ్వైః । సవితారం వితన్వంతం । అను
బధ్నాతి శాంబరః । అపపూర్ ఫంబర శ్చైవ । సవితా__
రేపసో భవత్ । త్వగ్ంసుతృప్తం విదిత్వైవ । బహు
సోమగిరం వశీ । అన్వేతి తుగ్రో వక్రియాం తం । ఆయ
సూయాన్ థ్సోమతృప్సుషు ।" (అరుణం)

తా॥ అరుణకేతుక మను పేరు గల కాఠకచైనములో నాకబలి పిడతలవంటి మృన్మయపాత్రలలో ఉదకమునుంచి (ఇతర చైనములలో ఇటుకలను ఎట్లు ఉపధానము చేయుదురో, అట్లే) ఆ ఉదకయుక్త మగు పిడతలను మంత్రములచే ఉపధానము చేయుదురు. వీటినే అభీష్టక లందురు. ఆ ప్రక్రమములో శ్రౌతసూత్రము:

"సహస్రవృ దియ మిత్యష్టౌ సంయానీః ఇతి॥" (ఆ.శ్రౌ.సూ.)

తా॥ సంయానులు అను పేరుగల యెనిమిది అభీష్టకలను ఉపధానము చేయు మంత్రములలో పైన ఉదహరించిన 'త్యుగ్రోహ' ఇత్యాది నాలుగు మంత్రములు మేఘముల వర్షణవృత్తాంతమును చెప్పుచున్నవి.

1. మం. తా॥ ఓ అశ్వినీ దేవతలారా! మీరు ఉదకయుక్తమగు మేఘమందున్నట్టియు, సర్వజగత్తుకు పాలక మగు ఉదక సంఘమును సంపాదింతురుగాక! మేఘములందున్న ఉదకసంఘ మెట్టిదనిన, దృఢమైనట్టివియు, అంతరిక్షమందు (జలములో) సంచరించు నట్టివియు, ఛిద్రములు లేనట్టివియు నగు నావలచే దాటదగిన జలసంఘమును (మీరు) సంపాదించుచుండిరి.

ఉదక సంపాదనలో దృష్టాంతము: లోకములో అజ్ఞాని యగు లోభి (తన మరణ సమయమందు కూడ) అత్యాదరముతో ధనమును ఎట్లు సంపాదించునో, అట్లే ఓ అశ్వినీదేవతలారా! మీరు కూడ అత్యాదరముతో వృష్టిని సంపాదించుచుండిరి.

2. మం. తా॥ (త్రిస్రఃక్షపః) ఓ అశ్వినీదేవతలారా! మీరు మూడు అహస్సులును, మూడు రాత్రులును విరామము లేకుండ (అవిచ్ఛిన్న ముగ అంతరిక్షమందు పక్షుల వలె సంచరించుచున్నట్టియు, తత్త్త దేశముల ననుసరించి ఉత్తమ, మధ్యమ, అధమ భావములచే త్రివిధము లైనట్టివియు, అనంతము లగుజలధారలతో గూడినట్టియు, రథముల జలధారలతో గూడినట్టియు, రథములవలె గొప్ప జలభారమును వహించుచున్నట్టి) మేఘముల ద్వారా సముద్రపరభాగమున నిర్జన ప్రదేశములందు పాలకమగు జలసమూహమును సంపాదించు చుండిరి. ఈ రెండు మంత్రములలోను దేవభిషజు లైన అశ్వినీదేవతలు జలపూర్ణము లగు మేఘముల ద్వారా నిర్జల ప్రదేశములందు సమృద్ధమైన ఉదకమును సంపాదించుచున్నట్లు స్పష్టమైనది.

3. మం.తా. (సవితారం). వృష్టికొరకు కిరణములను ప్రసరింపజేయుచున్న ఆదిత్యుని ఆశ్రయించుచు జలపూర్ణమైన మేఘుడు సర్వప్రాణులకు సుఖకరము, పాపరహితము నగు వృష్టిని ఉత్పాదన చేయుచున్నాడు.

4. మం.తా. (త్వగ్ం సుతృప్తం) అనేకములగు గర్జితములను చేయుచు ఉదకపూర్ణ మయి వర్షించుటకు విముఖుడుగా నున్న మేఘుని చూచి రశ్మి యుక్తు డగు ఆదిత్యుడు స్వాధీనమైన మేఘములు కలవాడు గాన సోమయాగములను చేయు యజమానుల నిమిత్తమై వృష్టిని చేయించదలచి మేఘములను అనుగమనము చేయుచున్నాడు. దీనినిబట్టి మేఘములు ఆదిత్యుని ఇచ్ఛానుసారము వర్షించవలసినదే యని సూచిత మగుచున్నది.

ఈ రెండు మంత్రములలోను ఆదిత్యప్రేరణవలన జలపూర్ణము లగు మేఘములు సర్వప్రాణిసుఖకరము లగు జలసమూహమును ఇచ్చుచున్నట్లు పర్యవసితమైనది.

లోకములో ఏ ఆఫీసులకుగాని, మరి యే యితరులకుగాని సొమ్ము కావలసి యున్నపుడు ట్రెజరీలోనుండి మినిష్టర్లు, కమిషనర్లు మున్నగువారు ప్రయత్నించుటచే

ఆధనము ఎట్లు లభ్యమగునో అట్లే అశ్వినీదేవతలు, ఆదిత్యుడు, ఇంద్రుడు, మరుద్గణములు మున్నగువారి ద్వారా ప్రయత్నించుటచేతనే మేఘములవలన వృష్టి సిద్ధించును. అనగా, వృష్టి మాత్రము మేఘముల ద్వారా రావలెనుగాని, వేరు మార్గము లేదు. దానికి అశ్విన్యాదులు, సిఫార్సు చేయు మినిష్టర్లువంటివారని తాత్పర్యము.

"మేఘో విద్యుత్ స్తనయిత్ను ర్వృష్టిః ।" (కృ.య.ఆ.)

తా॥ మేఘము, మెరపు, గర్జనము, వృష్టి (ఈనాలుగే) ఉదక ప్రాప్తికి సంపాదకము లని శ్రుతి వక్కాణించుచున్నది. (ఇచ్చట స్తనయిత్నుశబ్దమునకు గర్జనము అర్థము.)

'చత్వారి వా అపాగ్ం రూపాణి' అనగా, 'మేఘాదీని చత్వార్యేవ అపాం నిరూపణ కారణాని।' అందుచే ఒక్కొక్క ప్రకరణములో ఒక్కొక్క దేవతద్వారా పై మేఘాధికమువలననే వృష్టి కావలెనని స్పష్ట మగుచున్నది.

## వాయుగణములద్వారా వృష్టి

కారేరీష్టిప్రకరణములో వాయుగణములద్వారా వృష్టి చెప్పబడుచున్నది.

"పశ్చా ద్వాతం ప్రతిమీవతి పురో వాత మేవ జన
యతి వర్ షస్యావరుద్ధ్యై వాతనామాని జుహోతి వాయు
ర్వై వృష్ట్యా ఈశే ....... స ఏవాస్మై పర్జన్యం
వర్ షయతి ।" (కృ.య. సం. 2.కాం.4. ప్ర.)

తా॥ "వృష్టికామః కారీర్యా యజేత" అను విధ్యనుసారము వృష్టికాముడు కారేరీష్టి చేయవలెను. ఈ ఇష్టిలో.

"అగ్నయే ధామచ్ఛదే పురోడాశ మష్టాకపాలం నిర్వపే
న్మారుతగ్ం నప్తకపాలగ్ం సౌర్య మేకకపాలం ।"

అను శ్రుత్యనుసారము ఈ మూడును (అనగా, అగ్ని, మరుద్గణములు, సూర్యుడు) ప్రధాన దేవతలు, ఈ ఇష్టిలో వృష్టిహేతువగు పురోవాతమును (తూర్పు గాలిని) ఉత్పాదన చేయుటకు "పురోవాతో వర్షన్ జిన్వరావృ త్స్వాహా" ఇత్యాది యెనిమిది మంత్రములచే ఈ వాతనామసంజ్ఞకము లగు యెనిమిది ఉపహోమములను చేయవలసినదిగా ఈ శ్రుతి విధించుచున్నది. ఈ ఉపహోమసామర్థ్యముచే వృష్టి ప్రతిబంధక మగు పశ్చాద్వాతమును (పడమటి గాలిని) ప్రతిబంధించి, వృష్టికారణ మగు పురోవాతము ఉత్పన్న మగును. దానివలన సువృష్టి సంపన్న మగు నని ఈ శ్రుతి బోధించుచున్నది. లోకములో

పురోవాతము వృష్టిని ఉత్పాదన చేయును. కావున, ఈ హోమములచే వాయువు సంతృప్తుడై ఈ యజమానికొరకు మేఘుని వర్షింపజేయును.

ఈ విధముగ శ్రుతిప్రమాణపూర్వకముగ మేఘముల ఉత్పత్తియు, వృష్టిద్వారా లోకమునకు ఆత్యంతిక పురుషార్థము వరకును వీటివలన ఉపకారరీతియు సంగ్రహముగ నిరూపించబడినది.

## విద్యుత్ (మెరపు).

*"విద్యు త్సూర్యే నమాహితా ।"* (అరుణం.)

తా॥ ప్ర: మనచే మేఘములందు చూడబడియెడి మెరపు యెచ్చట నున్నది? దీనికి కారణ మెద్ది?

జ: సూర్యరశ్మియె విద్యుదాకారముగ పరిణమించినది గాన, మెరపు సూర్యరశ్మియందే యున్నది. సూర్యరశ్మియే మేరవునకు ఉత్పత్తి కారణము.

మరియు 'చిత్తి'లో "సేనేంద్రస్య" అను (9వ) అనువాకములో దేవపత్నులను చెప్పు ప్రక్రమములో "పర్జన్యస్య విద్యుత్" అని చెప్పబడినది. అనగా, మేఘ దేవునకు "విద్యుత్' ' పత్నిగా చెప్పబడినది. కావుననే లోకములో హంభారవముతో గోవు వత్సను కల్గియున్నట్లు, మరుత్సంబంధ మగు వర్షము ప్రారంభమగునపుడు మేఘపత్ని యగు మెరపు మేఘమును కలిసికొనును.

"ఓ మరుద్గణములారా! మీరు ఉత్సాహముచే క్రీడించునపుడు మీ గర్జితములవలన ప్రవృద్ధము లగుపర్వతములు కూడ భయపడుచున్నవి. పర్వతచరియలు కూడ కంపించుచున్నవి" అని అధ్వర్యుడు ఈ క్రిందిశ్రుతిచే మరుద్గణములను సంభోదించును.

*'వాశ్రేవ విద్యున్మిమాతి వత్సం న మాతా సిషక్తి ।*
*య దేషాం వృష్టి రసర్జి । పర్వత శ్చిన్మహి వృద్ధో*
*భిభాయ దివశ్చిత్సాను రేజత స్వనేవః యత్క్రీడథ*
*మరుతః ।"* (కృ.యు.సం. 3.కాం. 1.ప్ర. 11.అను.)

## ఇంద్రధనుస్సు.

*"విశ్వేదేవా విప్రహరంతి । అగ్నిజిహ్వా అసశ్చత ।*
*నైవ దేవో న మర్త్యః । న రాజా వరుణో విభుః । నాగ్ని*
*ర్నేంద్రో న పవమానః । మాతృక్కచ్చున విద్యతే । దివ్య*

*స్యైకా ధను రార్త్నిః । పృథివ్యా మపరాశ్రితా ।*
*తస్యేంద్రో వమ్రిరూపేణ । ధను ర్జ్యా మచ్ఛిన త్స్వ*
*యం । త దింద్ర ధనురిత్యజ్యం । అభ్రవర్ణేషు చక్షతే ।"* (అరుణం. 5. అను)

తా॥ పూర్వము శిశరర్త్వ భిమానిదేవత లగు విశ్వేదేవతలు అరుణకేతు కాగ్ని జిహ్వో ముఖమున ఈ క్రింది విధముగ బల్కిరి. "దేవుడు గాని, మనుష్యుడు గాని, వరుణుడు గాని, వాయువుగాని, యెవ్వరును మాతో సమానులు లేరు." ఇట్లు పలుకగా, ధనుస్సు యొక్క క్రింది యంచును భూమియందును, ఊర్ధ్వ కోటిని ద్యులోకమందును ఉంచి నిలువబడియున్న అరుణకేతుకాగ్నియొక్క గర్వోక్తిని సహింపజాలక, ఇంద్రుడు ఆరూపమును జూచి భీతిచెంది వమ్రి (అనగా చదపురుగులు) రూపమును ధరించి, భూమియందున్న ధనుష్కోటి యొక్క నారిని ఛేదించెను. ఆనారి ఛిన్న మగుటచే ఆ ధనుస్సు పైకి వెడలి, మేఘస్థిత ప్రకాశలయందు చూడబడుచున్నది. ఆ ధనుస్సు యొక్క నారి ఇంద్రునిచే ఛేదింపబడుటచే దానికి ఇంద్ర ధనుస్సు అను పేరు వచ్చెను.

## పిడుగు.

*"మరుతో౽ద్భి రగ్ని మతమయన్ । తస్య తాం*
*తస్య హృదయ మాచ్ఛిందన్ । స్యా౽వని రభవత్ ।"* (తై. బ్రా. 1.కాం. 1. ప్ర.)

తా॥ మేఘ స్వరూపములో అంతర్భూతము లగు ధూమ, జ్యోతి, సలిల, మరుత్తులలో మరుత్తులకును అగ్నికిని కలహము వచ్చెను. ఆ కలహములో అగ్ని అలసిపోయెను. అంతట నా మరుత్తులు అగ్ని యొక్క హృదయమును ఛేదించిరి. ఆ హృదయమే అశని (పిడుగు) అయెను. ఈ పిడుగు విషయములో పరాశరపుత్రుండగు వ్యాస మహర్షి ఈ క్రింది విధముగ బల్కినట్లు మరియొక శ్రుతి చెప్పుచున్నది.

*"సహోవాచ వ్యాసః పారాశర్యః । విద్యుద్వధ మేవా*
*హం మృత్యు మైచ్ఛ మితి ।"* (అరుణం.)

లోకములో మరణములు అనేక విధులుగ కానవచ్చుచున్నవి. వాటి అన్నిటిలో విద్యుత్సంబంధ మగు మరణము అతికష్టమైనదిగాన, తదపేక్షయా ఇతరవధలు మరణములే కాదు. విద్యుద్వధయే మృత్యు శబ్దమునకు ముఖ్యార్థమని వ్యాసుడు పలికినట్లు పై శ్రుతి బోధించుచున్నది.

లోకములో ఎలక్ట్రిక్ షాకు వలన కలిగెడి మరణము అతికష్టమైనదిగ వ్యవహరించ బడుచునే యున్నది. అట్లే పిడుగువలన సంభవించెడి మరణము కూడ అతి కష్టమైనది యని తాత్పర్యము.

ఇవ్విధముగ సంక్షిప్తముగ మేఘాది వివరణ చేయబడినది.

## వృష్ట్యుదకములకు శాంతత్వము.

ఈ విధముగ ఉదకముల నుండి విద్యుచ్ఛక్తి ఉత్పన్న మైనట్లు ప్రదర్శిత శ్రుతివలన స్పష్టమైనది.

లోకములో ఎలక్ట్రీతీగ విచ్ఛిన్నమై ఉదకమందు పడినచో అవిద్యుచ్ఛక్తి ఉదకములందు వ్యాపించి, ఆ ఉదకమును స్పృశించిన వానికి 'షాకు' వచ్చి ప్రమాదము సంభవించుచున్నది. అట్లే, మేఘ స్థిత జలమందుండెడి విద్యుచ్ఛక్తి ద్యులోకమందలి మేఘమునుండి వృష్టిద్వారా ఈ లోకమునకు వచ్చెడి వృష్ట్యుదకములందు సంవరితమై యుండుటచే అశాంతములగు వృష్ట్యుదకములు ద్యులోకమునుండి ఈ లోకమును గూర్చి వచ్చును. అట్టి ఉదకముల వలన ప్రజలకు అపాయము సంభవించునని ఈ క్రింది మంత్రముచే హోమమువలన (దారువునందు అగ్నివలె వృష్ట్యుదకమందలి విద్యుచ్ఛక్తిని సూక్ష్మ రూపములోనుంచి) వృష్ట్యుదకములను శాంతములైన వాటినిగ (అనగా, విద్యుచ్ఛక్తి రహితము లైన వాటినిగ) చేయునని ఈ క్రింది శ్రుతి బోధించుచున్నది.

"అపో దేవీ ర్బృహతీ ర్విశ్వశంభువో ద్యావా పృథివీ
ఉర్వంతరిక్షం బృహస్పతిర్నో హవిషా వృధాతు స్వాహా ।"

(తై. సం. 1. కాం. 2. ప్ర. 2. అను.)

"ఐద్గ్రహణాని జుహోతి స్రువేణా౽ధ్వర్యు స్స్రుచా
యజమాన అప్యాయనాని తూష్ణీం । ఆకూత్యై – గృహీత్వా
స్రుక్స్రువయోర్వ్యత్యాసః । అపోదేవీ – స్వాహా ।" (ఆ. శ్రౌ. సూ.)

తా॥ యజ్ఞములో అధ్వర్యుడు "ఆకూత్యై ప్రయుజే" ఇత్యాది మంత్రములచే ఔద్గ్రహణనామకము లగు హోమములను చేయవలెను. ఈ ఔద్గ్రహణ హోమముల ననుసరించి అధ్వర్యుని అన్వారంభము చేసి (అనగా, అధ్వర్యుని హస్తమును గ్రహించి) యజమానుడు కూడ ఐదు హోమములను చేయును. అనగా, అధ్వర్యుడు తన మంత్రముచే ప్రథమహోమము చేయగనే యజమాని తన మంత్రముచే హోమము చేయవలెను. ఇదే విధముగ నాల్గు హోమములు చేసిన పిమ్మట ఐదవ హోమమునకు స్రుక్స్రువములను అధ్వర్యుయజమానులు మార్చుకొని, పైన ఉదహరించిన "అపో దేవీ" అను ఐదవమంత్రముచే అధ్వర్యుడు హోమము చేయవలెను.

ఆ మంత్రార్థములో 'ఉదకదేవతలు వృద్ధి పొందుగాక' యని చెప్పి ఆ అబ్దేవతలకు విశేషములో 'విశ్వశంభువః' (జగత్తుకు సమస్త సుఖమును చేకూర్చెడి ఉదకములు వృద్ధి

పొందుగాక) అని చెప్పుటచే, ఈ లోకమునకు శాంతము లైన వాటినిగ వృష్ట్యుదకములను చేయును. అట్లు చేయుటచే నిగూఢమైన విద్యుచ్ఛక్తి కయుతములగుచు శాంతములైన ఉదకములు ద్యులోకమునుండి వృష్టిరూపముగ వచ్చునని ఈ క్రింది శ్రుతి బోధించుచున్నది.

'అపో దేవీ ర్బృహతీ ర్విశ్వశంభువ ఇత్యాహ యా
వై వర్ష్యా స్తా అపో దేవీ ర్బృహతీ ర్విశ్వశంభువో య
దేత ద్యజు ర్న బ్రూయా ద్దివ్యా అపో్ఽశాంతా ఇమం
లోక మాగచ్ఛేయు రాపో దేవీ ర్బృహతీ ర్విశ్వ శంభువ
ఇత్యాహాస్మా ఏవైనా లోకాయ శమయతి తస్మా
చ్ఛాంతా ఇమం లోక మాగచ్ఛంతి ।" (తై. సం. 6. కాం. 1.ప్ర. 2.అను.)

తా॥ ఈ మంత్రములో 'అపో దేవీ ర్బృహతీ ర్విశ్వశంభువః' అను బాగముచే వృష్ట్యుదకములు వివక్షితములు. అనగా, ద్యులోకమున ఉండి వృష్టిరూపముగ వచ్చెడి ఉదకములు నిగూఢమైన విద్యుచ్ఛక్తి సహితములై సమస్త జగత్తుకు సుఖమునుసంపాదించునవి, బహుళములు, అధికములును అయి వృద్ధిపొందుగాక! అనగా వృష్ట్యుదకముల నుద్దేశించి ఈ మంత్రము ప్రవర్తించుచున్నది గాని, తటాకోదకములు మున్నగువాటిని గూర్చి కాదని తాత్పర్యమును పై శ్రుతియే వ్యాఖ్యానము చేసినది.

## ఈ మంత్రోచ్చారణ లేనిచో అశాంతత్వము.

**'య** దేతత్' ఇత్యాది అర్థము - ఈమంత్రముచే హోమమును చేయనిచో ద్యులోకమునుండి వృష్ట్యుదకములు అశాంతములుగ (అనగా, బాధకమైన విద్యుచ్ఛక్తి సహితములై ఈ లోకమునకు వచ్చును. రాగలవు).

## మంత్రోచ్చారణ ఫలము.

**'అ**పో - శంభువ ఇత్యాహాస్మావా - మాగచ్ఛంతి ॥ అర్థము -

ఈ మంత్రోచ్చారణ పూర్వకహోమముచే ఈ లోకమును గూర్చి వచ్చెడి వృష్ట్యుదకములను శాంతములనుగ చేయును. అందుచే శాంతములైన వృష్ట్యుదకములే ఈ లోకమును గూర్చి వచ్చును.

ఫలితము: ఈ మంత్రహోమముచే వృష్ట్యుదకములందు విద్యుచ్ఛక్తి సంపూర్ణముగ నశించునని తాత్పర్యము కాదు. లోకములో అరణులు మున్నగు సర్వదారువులందును అగ్ని నిగూఢముగ నుండి ఆ దారువునుగాని, దానిని స్పృశించినవానినిగాని దహనము చేయ

కుండ సూక్ష్మరూపములోనుండి సంఘర్షణవలన ( ఆఅగ్ని) స్థూల రూపమును దాల్చి (వెలువడి) దగ్ధము చేయుట మనము చూచుచునే యుంటిమి.

అట్లే, వృష్ట్యుదకములందు వైద్యుతాగ్ని ఈ మంత్రప్రభావముచే సూక్ష్మరూపములో నుండి స్పృశించినవానిని దగ్ధము చేయకుండ శాంతముగ నుండు ననియు, (మథనముచే అరణుల నుండి అగ్ని కేంద్రీకరించి స్థూలరూపములోనికి వచ్చి దహనము చేయునట్లు) యంత్రసంఘర్షణచే ఆ ఉదకములనుండి కేంద్రీకరించి స్థూలరూపము లోనికి వచ్చి 'విద్యుచ్ఛక్తి' అను నామను దాల్చి లోకమున కుపకరించుటకు విరోధము లేదనియు తాత్పర్యము.





శ్రీ మహాగణాధిపతయే నమః ।

# వేదసార రత్నావళి

## ౨౫. సద్గురువుల విశిష్టత

### జ్ఞానికి విధినిషేధ సంబంధ రాహిత్యము

శ్రీ కృష్ణభగవానుడు ఇట్లు ఉపదేశించెను.

"న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినాం ।"

తా॥ కర్మాసక్తు లగు అజ్ఞానులకు జ్ఞానమార్గ ముత్తమమైన దని బోధించి బుద్ధిభేదమును కలుగజేయరాదు. అనగా కర్మలందు దృఢసంస్కారము గల అజ్ఞానులకు జ్ఞానబోధ చేసిననాడు కర్మశ్రద్ధ తగ్గిపోవుటయు, జ్ఞానమందు మార్గము దొరకకపోవుటయు తటస్థించును. కాన, అట్టివారికి కర్మమార్గమే ప్రశస్త మైనదిగ బోధించవలెను. అట్టి వారికి జ్ఞాన ముపదేశించి వారిని ఉభయభ్రష్టులనుగ చేయరా దని శ్రీకృష్ణభగవానుడుపదేశించెను.

ఇట్లు అజ్ఞాని విషయములో వేదబోధితము లగు విధినిషేధములును, ప్రసక్తాను ప్రసక్త విషయములును ఇంతవరకు ఉల్లేఖన చేయబడినవి. ఈ గ్రంథములోని వేదప్రతిపాద్యము లగు ధర్మాధర్మములు ద్వైతవాసనావాసితులై కర్మ మార్గమందు అభిరుచి గల వ్యక్తులకే గాని సద్గురువులు, యోగులు, జ్ఞానులు మున్నగువారికి గాదు.

ఇక శ్రీ మచ్ఛంకరభగవత్పాదులు త్రైగుణ్యాతీత మగు జ్ఞాన మార్గమందు సంచరించెడి మహాపురుషులకు వేదములచే బోధించబడియెడి విధినిషేధములు సంబంధించ వని యీ క్రింది విధముగ సెలవిచ్చిరి.

శ్లో॥ "నిస్త్రైగుణ్యే పథి విచరతాం కో విధిః కో నిషేధః ।"

మరియు ఈ క్రింది తైత్తిరీయబ్రాహ్మణ శ్రుతి గూడ జ్ఞానులకు పుణ్యాపాపకర్మల సంబంధరాహిత్యమును బోధించుచున్నది.

*"ఏష నిత్యో మహిమా బ్రాహ్మణస్య న కర్మణా*
*వర్ధతే నో కనీయాన్ । తస్యై వాత్మా పదవిత్తం విదిత్వా ।*
*న కర్మణా లిప్యతే పాపకేన ।"* (తై. బ్రా. 3.12.9.)

తా॥ జ్ఞానియొక్క మహిమ, మాహాత్మ్యము నిత్యమైనవి. (వికారము లేక మార్పులేనివి.) ఇతడు పుణ్యకర్మ లగు జ్యోతిష్టోమాదులచే వృద్ధిని బొందడు. పాపకర్మ లగు బ్రహ్మహత్యాదులచే క్షీణుడును కాడు. (అల్పుడు కాడు). ఆ పరమాత్మను తెలిసికొనిన జ్ఞాని, "బ్రహ్మవి ద్బ్రహ్మైవ భవతి, బ్రహ్మవి దాప్నోతి పరం।" అను శ్రుత్యనుసారము పరమాత్మరూపు డగును. అతడు బంధకములగు పుణ్యపాపకర్మలచే స్పృశించబడడు.

ఈ శ్రుతి స్పష్టముగ పుణ్యపాపకర్మలు జ్ఞానిని స్పృశించవని చెప్పుచున్నది. అనగా, వేదబోధితవిధినిషేధములతో జ్ఞానికి సంబంధము లేదు.

## గురువుయొక్క ఆవశ్యకత.

ఇచ్చట గురుశబ్దమునకు జ్ఞాని యగు మహాపురుషుడే (అనగా, అనుభవజ్ఞానము గలవాడే) అర్థముగాని, వాచికజ్ఞాని (అనగా, వేద శాస్త్రాదుల నభ్యసించి పఠనపాఠనముల నొనర్చెడి పురుషుడు) అర్థము కాదని గ్రహించవలెను.

"త్రైగుణ్య విషయా వేదా ని స్త్రైగుణ్యో భవార్జున ।" (భ.గీ.)

తా॥ "ఓ అర్జునా! వేదములు త్రైగుణ్య విషయములు (అజ్ఞాని విషయములు) గాన, నీవు త్రిగుణాతీతుడ వగుము," అని శ్రీకృష్ణ భగవాను డుపదేశించెను.

ఛాందోగ్యములో ఆరుణి పుత్రుడగు శ్వేతకేతువునకు వేద వేదాంగములు సంపూర్ణముగ నభ్యసించినను అజ్ఞానము తొలగలేదనియు, గురువువద్ద జ్ఞానోపదేశము పొందవలసిన వాడయ్యెననియు చెప్పబడినది.

ఇదే ఉపనిషత్తులో యేడవ అధ్యాయములో నారదు డను చతుర్వేదవిదుడు అజ్ఞాన నివృత్తిద్వారా శోకనివారణ కొఱకు యోగీశ్వరుడును బ్రహ్మవేత్తయు నగు సనత్కుమారునివద్దకు వెళ్ళినట్లు ఉల్లేఖించబడినది. కావున వేదశాస్త్రాదుల నభ్యసించిన విద్వాంసునకు గూడ జ్ఞానోపదేశమును పొందవలసిన ఆవశ్యకతయు, జ్ఞానమును ఉపదేశించు గురువుయొక్క ఆవశ్యకతయు నున్న వని స్పష్ట మగుచున్నవి.

ఈ విధము లగు ప్రమాణములచే మనకు స్పష్టమగు విషయమేమన, ఎన్ని వేదశాస్త్రముల నభ్యసించినను, జ్ఞాని యగు గురువు లభించకపోయినచో, మానవునకు ఆత్యంతిక పురుషార్థము సిద్ధించదు. మరియు, శ్రీమద్భాఘవతములో సద్గురుచరణ మహిమనుగూర్చియు, సద్గురువు యొక్క ఆవశ్యకతను గూర్చియు ఈ క్రింది విధముగ జెప్పబడినది.

"విజితహృషీకవాయుభి రదాంతమనస్తురంగం య ఇహ
యతంతి యం తు మతిలోల ముపాయఖిదః । వ్యసనశతా
న్వితా స్సమపహాయ గురో శ్చరణం వణిజవావిశం త్యకృత
కర్ణధరా జలధౌ ।" (శ్రీ. భా.)

ఇచ్చట శ్రుతిగీతలలో శ్రుతులు శ్రీకృష్ణుని స్తుతిజేయు సందర్భములో పరమేశ్వరుని యందు భావముచేతగాని మానవుడు సంసార సముద్రమును దాటలేదనియు, అట్టి భగవద్జ్ఞానము మనోనిగ్రహముచేత గాని సిద్ధించ నేరదనియు, అట్టి మనో నిగ్రహము గురూ పసదనము చేతనే సంప్రాప్త మగును గాని, ప్రకారాంతరముచే సంప్రాప్తము కానేరదు గాన గురూపసదనము అవశ్యకర్తవ్యమనియు ఇచ్చట శ్రుతులు చెప్పుచున్నవి.

శ్లో. తా. ఇంద్రియములను, ప్రాణములను జయించిన వారలచే దుర్నిగ్రహంబగు (నియమించుటకు శక్యముకాని) మనస్సు అను అశ్వమును నియమించుటకు యే మానవులు సద్గురుచరణమును విడచి వేఱు ఉపాయంబులందు క్లిశ్యమాను లగుచు ప్రయత్నింతురో, అట్టి మానవులు అనేక వ్యసనములచే వ్యాకులు లగుచు ఈ సంసార సముద్రమందు మగ్నులగుదురు. అనగా దుఃఖములనే పొందెదరు.

దృష్టాంతము: లోకములో నావికుని స్వీకరించని వణిజులు (అనగా, పడవను నడపువాడు లేని నావయందు సముద్రపయనము చేయు వర్తకులు ఎట్లు సముద్రమునందు మగ్నులగుదురో, అట్లే) సద్గురుచరణముల నాశ్రయించని మానవులు గూడ అనేక వ్యసనముల పాలై సంసారసాగరమున మగ్నులగుదురు.

ఈ విధముగ శ్రీమద్భాగవతప్రతిపాదిత మగు సద్గురుచరణ మహిమ నుల్లేఖించి ఇత ఉత్తరమందు ఉపనిషత్తులందు శ్రుతి ప్రతిపాదిత మగు సద్గురుమాహాత్మ్యాదికము అనువదించబడును.

"భృగుర్వై వారుణిః । వరునం పితర ముపస
సార । అధీహి భగవో బ్రహ్మేతి ।" (తై. ఉ. భృగువల్లి)

తా॥ వరుణపుత్రుడగు భృగువు తన తండ్రి యగు వరుణుని యొద్దకు వినయపూర్వకముగ బ్రహ్మజ్ఞానముకొరకు వెడలినట్లు ఈ శ్రుతి బోధించుచున్నది.

'తద్విజ్ఞానార్థం స గురమే వాభిగచ్ఛే త్సమిత్పాణి
శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం ।' (ముం. ఉ.)

తా॥ బ్రహ్మజ్ఞానముకొరకు నియమోపేతుడై నిష్ణాతు డగు గురువునే సేవించవలసినదిగ ఈ శ్రుతి ప్రతిపాదించుచున్నది.

'అధీహి భగవో బ్రహ్మ విద్యాం వరిష్ఠాం సదా సద్భి
స్సేవ్యమానాం నిగూఢాం । యయా__చిరా త్సర్వ
పాపం వ్యపోహ్య పరాత్పరం పురుష ముపైతి
దివ్యం ॥" (కై. ఉ.)

తా॥ అశ్వలాయనుడు బ్రహ్మవిద్యకొరకు ప్రజాపతి యొద్దకు వెడలి, సర్వపాపవినాశద్వారా పరమాత్మ ప్రాప్తికి సాధన మగునట్టియు, సత్పురుషులచే సేవ్యమాన, మైనట్టియు, రహస్య మగు బ్రహ్మవిద్యనుపదేశింపు మని ప్రార్థించెను.

*'అహింసాసత్య మస్తేయం.... అక్రోధో గురుశుశ్రూషా చ,*

*ఇత్యాది ఈ శ్రుతి గూడ గురువుయొక్క ఆవశ్యకతను బోధించుచున్నది.*

*'మరుజ్జయో యస్య సిద్ధః సేవయే త్తం గురుం సదా ।   (యో. శి. ఉ.)*

తా॥ ఏ మానవునకు వాయుజయము కలదో అట్టి యోగి యగు గురువును ఎల్లప్పుడును సేవించవలెను.

*'ప్రాక్కర్మపరిపాకేన ఆవర్తాంతరకీటవత్ । విశ్రాం*
*తిం నై వ గచ్ఛతి । సత్కర్మ పరిపాకతో బహూనాం*
*జన్మనా మంతే వృణాం మోక్షేచ్ఛా జాయతే । తదా*
*సద్గురు మాశ్రిత్య చిరకాల సేవయా బంధమోక్షం*
*కశ్చి త్ప్రయాతి ।'   (పైం. ఉ.)*

తా॥ మానవుడు పూర్వకర్మప్రాబల్యముచే నీటిసుడి (ఆవర్తము) మధ్య నున్న కీటము వలె విశ్రాంతి లేకుండ-నుండును. అట్టి మానవునకు సత్కర్మ పరిపాకమున అనేక జన్మలు గడచిన పిమ్మట మోక్షేచ్ఛ జనించును. అప్పుడు సద్గురువు నాశ్రయించి చిరకాలసేవచే సంసార బంధమునుండి ముక్తుడగును.

*'ఇత్థం భూతమతి శ్శాస్త్రగురు సజ్జనసేవయా । అధి*
*గచ్ఛతి .... ।'   (అ. ఉ.)*

తా॥ ఈ విధముగ యోగభూమి నభ్యసించిన మానవుడు శాస్త్రముల యొక్కయు, సద్గురువుల యొక్కయు, సత్పురుషుల యొక్కయు సేవచేతను పరమాత్మను తెలిసికొనును.

ఈ శ్రుతి సద్గురుసేవను చెప్పుచు, శాస్త్రసేవను కూడ చెప్పు చున్నది. అందువలన సద్గురు సేవతో సమానముగ శాస్త్రసేవకు కూడ ఆవశ్యకత్వ మున్నట్లు కనిపించుచున్నది. అట్లు సామ్యము లేదని విస్పష్టముగ మరియొక శ్రుతిలో నిట్లు చెప్పబడినది.

"పలాల మివ ధాన్యార్థీ త్యజే చ్ఛాస్త్రమశేషతః ।"

తా॥ లోకములో ధాన్యముకొరకు వ్యవసాయముచేయు కృషికుడు పొల్లును ఎట్లు త్యజించునో, అట్లే శాస్త్రముల వలన పరోక్ష జ్ఞానమును సంపాదించి సంపూర్ణముగ ఆశాస్త్రమును విడచిపెట్టవలెనని పై శ్రుతి బోధించుచున్నది. అందుచే శాస్త్రాదులవలన

ఆత్మా_పరోక్షజ్ఞానము సంభవించదనియు, అట్టి అపరోక్షజ్ఞానము గురువ వలననే సిద్ధించును గాని, వేరు ఉపాయము లేదనియు, శాస్త్రములను పరోక్షజ్ఞాన మాత్రమునకే ఉపయోగించుకొని నిశ్శేషముగ వాటిని విడచిపెట్టవలసిన దనియు పైశ్రుతి స్పష్టముగ బోధించుచున్నది.

## ఉత్తరమీమాంస.

శ్రీ వేదవ్యాస భగవానుడు ఉత్తరమీమాంసా శాస్త్రములో అధ్యాసభాష్యములో "పశ్వాదిభి శ్చా_విశేషాత్, యథా పశ్వా దయః శబ్దాదిభి శ్శ్రోత్రాదీనాం సంబంధే నతి శబ్దాదివిజ్ఞానే ప్రతికూలే జాతే తతో నివర్తంతే । అనుకూలే చ ప్రవర్తంతే । యథా దండోద్యతకరం పురుష మభిముఖ ముపలభ్య మాం హంతు మయ మిచ్ఛతీతి పలాయితు మారభంతే । తృణ పూర్ణపాణి ముపళబ్య తం ప్రత్యభిముఖీభవంతి । ఏవం పురుషా అపి వ్యుత్పన్నచిత్తాః క్రూరదృష్టీన్ ఆక్రోశతః ఖడ్గోద్యతకరాన్ బలవత ఉపలభ్య నివర్తంతే । తద్విపరీతాన్ ప్రవర్తంతే। అత స్సమానః పశ్వాదిభిః పురుషాణాం ప్రమాణ ప్రమేయవ్యవహారః । పశ్వాదీనం ప్రసిద్ధ ఏవా_వివేక పూర్వకః ప్రత్యక్షాదివ్యవహారః । తత్సామాన్య దర్శనాత్ । వ్యుత్పత్తి మతామపి పురుషాణాం ప్రత్యక్షాదివ్యవహార స్తత్కాల స్సమాన ఇతి నిశ్చీయతే ... ప్రాక్చ తథాభూతాత్మవిజ్ఞానా త్ప్రవర్తమానం శాస్త్రం అవిద్యావద్విషయత్వం నాతివర్తతే ।"

తా॥ అధ్యాసభాష్యములో శ్రీ శంకరాచార్యులవారు వేద శాస్త్రములందు నిష్ణాతులైన విద్వాంసులకును, పశువులకును విశేషము లేదని విద్వాంసులకు పశువులతో సామ్యమును ఈ క్రింది విధముగ నుడివిరి.

లోకములో పశువులు ఫలించిన చేలలో సస్యమును తినుటకు ఉద్యుక్తమైనపుడు 'ఆ, ఆ' అని ప్రతికూలధ్వని వినబడిన వెంటనే ఆ పశువులు మరలిపోవును. ఇదే విధముగ 'దా, దా,' అని అనుకూల శబ్దము వినినచో ప్రవర్తించును.

మరియు దండము చేతులతోనెత్తి తన కభిముఖముగ వచ్చెడి పురుషుని చూడగనే నాతడు తనను చంప నిశ్చయించుచున్నా డని పశువులు పరుగిడ నారంభించును. తృణమును చేతబూని వచ్చు మనుజుని చూడగనే పశువులు వాని కభిముఖముగ పోవును.

ఇట్లే వ్యుత్పన్నచిత్తులు (అనగా కూలంకషముగ వేదశాస్త్రముల నభ్యసించిన పండితులు) తమ యెడ క్రోధదృష్టిని గలిగి నట్టియు, తమ్ములను నిందించునట్టియు, బలశాలులును నగు మనుజులను చూచినతోడనే పశువులవలె పరుగిడ నారంభింతురు. వీరికి విపరీతులగు వారలు అనగా తమ యెడ శాంత (సంతోష) దృష్టియుతులును, తమ్ములను స్తుతి చేయు వారును, పుష్పహారములను చేత ధరించి తమ కంఠమందు అలంకరించుటకు అభిముఖముగ

వచ్చెడి వారును, సాత్వికులును నగు పురుషులను చూచి పూర్వోక్త పండిత ప్రకాండులు వెనుక చెప్పిన తృణపూర్ణపాణులను జూచిన పశువుల వలె వారి కభిముఖులై ఉపన్యాసములను చెప్ప దొడంగుదురు.

ఈ విధముగ పండితులకు ప్రమాణ ప్రమేయవ్యవహార మంతయు అజ్ఞానపూర్వక మని లోకములో సుప్రసిద్ధమైనదియే. అట్లే పండితుల యొక్కయు ప్రత్యక్షాదివ్యవహారము పశుసమాన మని నిశ్చయింప బడుచున్నది.

ఈ విధముగ ఉత్తరమీమాంసలో శ్రీ ఆచార్యులవారు వేదశాస్త్రములు అజ్ఞాని విషయములుగాని, జ్ఞానివిషయములు గావని స్పష్టపరచిరి. దీనిని బట్టి గురుత్వముకును వేదశాస్త్రాది విద్యలకును సంబంధము లేదని స్పష్ట మగుచున్నది. కాన గురుత్వముకు అపరోక్షజ్ఞానము అవసరము గాని, వేదశాస్త్రాదివిద్యలు కావని పర్యవసన్న మగుచున్నది.

ఈవిధముగ నమస్త గ్రంథములలోను విద్యాభ్యానముతో (అనగా వేదశాస్త్రాధ్యయనముతో) నిమిత్తము లేకుండ అనుభవజ్ఞానము గల గురువు లేనిదే యెంత ఉత్తమాధికారికిని ఆత్మాపరోక్షజ్ఞానము సిద్ధించదని తెలియుచున్నది. ఇంకను అనేక గ్రంథములలో సద్గురువు యొక్క ఆవశ్యకతయు విశిష్టతయు కలదు. గ్రంథవిస్తరభీతిచే దిఙ్మాత్రము ఉదాహరణ చూపబడినది.

## గృహస్థులు, యోగులు గురువులా?

"తతో హిరణ్య నాభోఽభూ ద్యోగాఽఽచార్య స్తు జైమినేః ।
శిష్యః కౌసల్య అధ్యాత్మం యాజ్ఞవల్క్యోఽధ్యగా దృతః ।
యోగం మహోదయ మృషి ర్హృదయగ్రందిభేదనం । ఏతే
వై మిథిలా రాజ న్నాత్మ విద్యావిశారదాః । యోగీశ్వర ప్రసాదేన
ద్వంద్వై ర్ముక్తా గృహేష్వపి ।" (శ్రీ. భా. 9 స్కం. 12. అధ్యా.)

తా॥ శ్రీ మద్భాగవతములో తొమ్మిదవ స్కంధములో పన్నెండవ అధ్యాయములో శ్రీరాములవారి వంశములో హిరణ్యనాభు డను మహారాజు జనించెననియు, ఆతడు జైమినికి యోగాచార్యుడనియు, ఆహిరణ్యనాభుని వలననే యాజ్ఞవల్క్యమహర్షి హృదయగ్రంథి భేదక మగు గొప్ప యోగము నభ్యసించె ననియు చెప్పెను.

అనంతరము 3వ అధ్యాయములో చివర ఈ విధముగ చెప్పబడెను.

"ఓ పరీక్షన్మహారాజా! ఆత్మవిద్యయందు నిష్ణాతులగు జనక వంశస్థు లందరును యోగీశ్వరు లగు యాజ్ఞవల్క్యాదుల కటాక్షముచే గృహస్థాశ్రమములో నున్నను ద్వంద్వ నిర్ముక్తులైరి, (ద్వంద్వా తీతులైరి)".

దీనినిబట్టి చూడగ, ఒక భార్యయేగాక, మైత్రేయి, కాత్యాయని అను ఇరువురు భార్యలతో గూడి గృహస్థాశ్రమి యగు యాజ్ఞవల్క్యుడు జనకవంశజులకు గురువు. ఆతని కటాక్షముచేతనే ఆవంశ స్థులు గృహస్థాశ్రమములోనుండి తీర్ణులైరి. మరియు, వ్యాసాది మహర్షులు ముక్తి సాధననిమిత్తము సద్గురు వగు వశిష్ఠు దగ్గరకు జనుదెఇంచినట్లు చెప్పు సందర్భములో గురువగు వశిష్ఠునకు "అరుంధతీ పతిం"అనుటచే అరుంధతీసతీమణి యను భార్య యున్నట్లు సర్వ లోకవిదితము. పిమ్మట నామహర్షులను దోడ్కొని తనకు గురువగు బ్రహ్మవద్దకు జనుదెంచెను. ఈ సందర్భములో "వాణిపతిం" అనుట చేతను, సర్వలోక ప్రసిద్ధిచేతను, గురువగు బ్రహ్మకు సరస్వతీదేవి యను భార్య యున్నట్లు స్పష్టము.

ఈ విధముగ యాజ్ఞవల్క్యుని గురువగు హిరణ్యనాభుడు మొదలుకొని వసిష్ఠువరకు గురువరులందఱు గృహస్థులే యగుట వలన గృహస్థులు గురువులగుదురా యని శంకింప నవకాశము లేదు. జ్ఞానులైన వారు ఏ ఆశ్రములైనను గురువు లగుటకు విప్రతిపత్తి కానరాదు.





శ్రీ మహాగణాధిపతయే నమః ।

# వేదసార రత్నావళి

## ౨౬. ఉపనిషద్వివరణము.

### ఉపోద్ఘాతము.

శ్లో॥ "అనంతగుణసంపన్న మనంత భజనప్రియం ।
అనంతరూపిణం వందే గురు మానందరూపిణం ॥
యత్కృపాలేశమాత్రేణ పురుషార్థ చతుష్టయం ।
ప్రాప్యతే త మహం వందే సద్గురుం భక్త వత్సలం ॥"

### ఉపనిషత్తులు.

ఉపనిషత్పదమునకు వక్ష్యమాణరీతిగ బ్రహ్మవిద్య అర్థము. పరమాత్మను గూర్చి జెప్పుట అశక్యమని (దుర్లభమని) ఉపనిషత్తులు కంఠోక్తిగా బోధించుచున్నవి.

"ఆశ్చర్యోస్య వక్తా కుశలః" (క. ఉ. 2.7)

తా॥ పరమేశ్వరుని జెప్పుటకు కుశలు డగు వక్త దుర్లభుడు. ఈవిధముగ వక్తృ దౌర్లభ్యమును శ్రుతులు చెప్పుటచే బ్రహ్మవిద్య చాల దురవగాహ మని స్పష్ట మగుచున్నది. కాని కఠోపనిషత్తులో ఆనందగిరులవారిట్లు శెలవిచ్చిరి.

"పరమేశ్వరాచార్యానుగ్రహేణ తు లభ్యత ఇత్యాహ ।" అనగా, పరమేశ్వరుని యొక్కయు, సద్గురువు యొక్కయు అనుగ్రహముచే మాత్రము పరమాత్మ లభ్యుడని బోధంచుటచే తదుభయులకు వందన మొనర్చి తదుభయానుగ్రహసామర్థ్యముచే యథామతి ఉపనిషద్విషయము సంక్షేపముగ అనువాద చేయబడుచున్నది.

### ఉపనిషత్పదమునకు ముఖ్యార్థము.

'ఉపనిషత్' అను పదమునకు బ్రహ్మవిద్య (అనగా బ్రహ్మ జ్ఞానము) అర్థము. ఎట్లన.

"షద్ విశరణ గత్యవసాదనేషు"

అను వ్యాకరణశాస్త్రానుసరణముచే 'సద' ధాతువునకు మూడు అర్థములు : 1.విశరణము – అనగా విశ్లేష, లేకశైథిల్యము. 2. గతి – అనగా ప్రాప్తి. 3. అవసాధనము – అనగా నాశము. వీటిలో మొదటి ధాత్వర్థము ననుసరించి బ్రహ్మజ్ఞానము గర్భవాస, జన్మ, జరా, రోగాది అనర్థసంఘమును శైథిల్యమును పొందించునది (నిశాత యతి) గావున, ఉపనిషత్ (బ్రహ్మవిద్య) అని అర్థము. రెండవ ధాత్వర్థము (గతి) ననుసరించి, ముముక్షువులను పరబ్రహ్మను పొందించునది గావున ఉపనిషత్, (బ్రహ్మవిద్య) అని రెండవ అర్థము. మూడవ ధాత్వర్థము (నాశము) ననుసరించి, సంసారబీజ మగు అవిద్యాదికమును నశింపజేయునది గావున ఉపనిషత్తు (బ్రహ్మవిద్య) అని మూడవ అర్థము.

పై మూడు ధాత్వర్థములచేతను ఉపనిషత్పదమునకు బ్రహ్మ జ్ఞానము అర్థము. మరియు, "ఉప సమీపే నిషణ్ణం అస్యాం పరం శ్రేయ ఇత్యుపనిషత్" అనగా, ఉత్కృష్ట మగు శ్రేయస్సుకు సాధనముగాన ఉపనిషత్. ఈవిధముగ శ్రీమచ్ఛంకరభగవత్పాదుల వారు, శ్రీ సురేశ్వరాచార్యుల వారు, శ్రీ విద్యారణ్యయతీంద్రులవారు మున్నగు పూజ్యయతిసార్వ భౌములు ఉపనిషత్పదమునకు, బ్రహ్మజ్ఞానమును ముఖ్యార్థముగా శలవిచ్చిరి.

## ఉపనిషత్పదమునకు గౌణార్థము.

బ్రహ్మజ్ఞాన ప్రతిపాదక మగు గ్రంథమునకు ఉపనిషత్ అను వ్యవహారము గౌణము (అనగా లాక్షణికము). లోకములో 'లాంగలం జీవనం' అను లౌకిక ప్రయోగములో ఆ శబ్దమువలన 'నాగలి జీవనము' అను అర్థము సిద్ధమగుచున్నది. కాని, నాగలి యెన్నడును జీవనము కానేరదు. కాన, లక్షణావృత్తిచే జీవనవాచక మగు జీవన శబ్దమునకు జీవనసాధన మను అర్థమును యెట్లు చెప్పుచుందురో, వేదములో 'ఆయు ర్వై ఘృతం' (కృ.య.సం. 2.3.11.) అను మంత్రములో (ఆయుష్కామేష్టి అను కర్మలో బంగారపు కుండలము లను ఘృతములో నుంచి విధ్యనుసారము ఆ కుండలములతో ఘృతమును పానము చేయు సందర్భములో) ఘృతము ఆయుర్హేతు వను అర్థమును యెట్లు చెప్పుచుందురో, అట్లే ప్రకృతములో ముఖ్యవృత్తిచే బ్రహ్మజ్ఞానమును చెప్పెడి ఉపనిషత్పదముచే (లక్షణావృత్యా) బ్రహ్మ విద్యాప్రతిపాదక మగు వేదభాగము చెప్పబడుచున్నది.

ఈ విధముగ ఉపనిషచ్ఛబ్దార్థనిర్వచనానంతరము ఉపనిషత్ప్రతి పాద్యమగు ఆత్మజ్ఞానము మానవునకు అన్నిటికంటె సర్వోత్తమ మైనది గాన, అట్టి ఆత్మను తెలిసికొనుటకు ఉపాయ మేది యను విచికిత్సపై యీ క్రింది ఉపనిషత్తులు ఆ విషయమును బోధించుచున్నవి.

"నాయ మాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న
బహునా శ్రుతేన ।" (ముం.ఉ.2.ఖం.2.మం.) (క.ఉ.2.వల్లి.23.మం.)

తా॥ ఆత్మ దుర్విజ్ఞేయము. అనగా తెలిసికొనుటకు శక్యమయినది కాదు. అట్టి ఆత్మ, వేదశాస్త్రాదుల అధ్యయనముచేతగాని, గ్రంథ తదర్థధారణాశక్తిచే గాని ఉపనిషద్విచారాతిరిక్త శాస్త్రశ్రవణ ముచే గాని, జ్ఞేయము కాదు. అనగా, వీటివలన ఆత్మజ్ఞానము లభించదు. పరమేశ్వరా౽౽చార్యానుగ్రహీత మగు ఉపనిషద్విచారము చేతనే లభించును. అందుచే ఆత్మజ్ఞానము కొరకు ఉపనిషద్విచారము చేయవలెనని ఫలితార్థము.

ఇట్టి ఉపనిషద్విచారణకు సాధనములు బహిరంగ, అంతరంగ భేదములచే రెండు విధములు. సామాన్యముగ మానవునకు సంచితము లగు మహాపాపములచే ఆత్మవిద్యయందు అరుచి పుట్టునని పురాణము లందు చెప్పబడినది.

"మహాపాపవతాం పుంసాం జ్ఞానయజ్ఞో నర రోచతే ।
ప్రత్యుత జ్ఞానయజ్ఞస్తు ప్రద్వేష్యో భాసతే స్వతః ।"

తా॥ సంచితమహాపాపములు గల పురుషులకు జ్ఞానమార్గము రుచింపకపోవుటయే గాక, దానిని గూర్చి స్వతః ద్వేషము జనించును. అట్టి మానవులకు బహిరంగ సాధనములను యజ్ఞాదులు ఆత్మవేదన మందు వివిదిషను పుట్టించునని శ్రుతులు బోధించుచున్నవి.

## బహిరంగసాధనములు.

'త మేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి
యజ్ఞేన దానేన తపసా౽నాశకేన ।'

తా॥ వేదాధ్యయనము, యజ్ఞము, దానము, తపస్సు, అనశనవ్రతము (ఇవి) బహిరంగ సాధనములు. వీటిచే మానవునకు ఆత్మ వేదనమందు వివిదిష (రుచి) కలుగు నని ఈ శ్రుతి బోధించుచున్నది. అనగా, యజ్ఞాదులు చిత్తశుద్ధి ద్వారా ఆత్మవేదనమందు అరుచిని తొలగించి రుచిని బుట్టించి నని తాత్పర్యము.

ప్రశ్న: యజ్ఞాదులు స్వర్గాదిఫలములకు సాధనములు గదా! అవి వివిదిషకు ఎట్లు కారణ మగును?

జ: ఫలకామనచే చేయబడు యజ్ఞములు సాంసారికఫలములకు సాధనము లైనను ఫలాభిసంధి (అనగా ఫలకామన) లేకయే ఈశ్వరార్పణ బుద్ధిచే చేయబడు యజ్ఞాదికర్మలు ఆత్మవేదనమందు అరుచి రూపమగు విఘ్నమును కలుగజేయు మహాపాపములను నశింపజేయునని శ్రీకృష్ణభగవానుడు భగవద్గీతలో చెప్పెను –

"బ్రహ్మ ణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః ।
లిప్యతే న స పాపేన పద్మపత్ర మివాంభసా ॥' (భ. గీ.)

తా॥ తామరాకునకు ఉదకలేపము ఎట్లుండదో అట్లే ఈశ్వరార్పణబుద్ధిచే కర్మలను చేయు మానవునకు పాపలేపముండదు. అనగా, ఇట్టి కర్మలచే పాపములు నశించు నని తాత్పర్యము.

ఇట్టి కర్మలచే సిద్ధించెడి పాపక్షయమునకు వైరాగ్యము చిహ్నమని నైష్కర్మ్యసిద్ధియందు ఈ క్రింది విధముగ చెప్పబడినది.

"శోధ్యమానం తు తచ్చిత్త మీశ్వరార్పితకర్మభిః ।
వైరాగ్యం బ్రహ్మలోకాదౌ వ్యన క్త్యథ సునిర్మలం ।"

తా॥ ఈశ్వరార్పణబుద్ధిచే చేయబడిన కర్మలచే పాపక్షయ ద్వారా చిత్తశుద్ధి కలిగి బ్రహ్మ జ్ఞానమునకు అంతరంగసాధన మగు నిర్మలవైరాగ్యము లభించును. అనగా లోకములో వహ్నికార్య మగు ధూమమును చూడగనే దానికి కారణ మగు వహ్ని కలదని ఊహించినట్లు, నిర్మలవైరాగ్యరూప మగు ఫలమును జూడగనే దానికి కారణమగు పాపక్షయము సిద్ధించినట్లు మానవుడు తెలిసికొనుటకు వైరాగ్యము చిహ్నము.

శ్రేయోమార్గే వ్యహిమితం :-

"బ్రహ్మాదిస్తంబాంతే సంసారేస్మి న్నసారాతాబుద్ధిః ।
అంతర్యామిణి దేవే సమర్పితస్వక్రియావిపక్తి రియం ॥"

తా॥ హిరణ్యగర్భుడు మొదలు స్తంబము వరకు గల సంసారమునందు (అనగా సమస్త జగత్తునందును) వైరాగ్యము ఈశ్వరార్పణ బుద్ధిచే చేసిన కర్మల ఫలము.

"పూర్వజన్మకృతం పాపం వ్యాధిరూపేణ బాధతే ।
తచ్ఛాంతి రౌషధై ర్దానై ర్జపహోమార్చనాదిభిః ।"

అను అభియుక్తోక్తి ననుసరించి లోకములో జన్మంతరపాప ముచే అజీర్ణవ్యాధిగ్రస్తుడగు మానవునకు అన్నమందలి అరుచిని దానజపాదులచే (పాపక్షయద్వారా) తొలగించి, రుచిని పుట్టించునట్లు, ప్రకృతములో జన్మాంతర సంచితమహాపాపములచే జన్మించిన ఆత్మ విద్యయందలి అరుచిని, నిష్కామకర్మాదులు అరుచికి కారణములగు పాపములను క్షయము చేసి చిత్తశుద్ధి సంపాదనద్వారా వివిదిషను (ఆత్మవిద్యయందు రుచిని) పుట్టించును గాన వేదాధ్యయనము, నిష్కామకర్మ, దానము, తపస్సు, అనశనము బహిరంగ సాధనములని సిద్ధము.

# అంతరంగ సాధనములు.

పూర్వోదాహృతరీతిని నిష్కామకర్మాదుల అనుష్ఠానముచే ఆత్మ విద్యయందు రుచి జనించినపిదన అంతరంగ సాధనము లగు నిత్యానిత్య వస్తువివేక వైరాగ్యాదులు గల మానవునకే ఆత్మవిద్యయందు అధికారము గాన, అంతరంగ సాధనముల వివరణము చేయవలసి యున్నది. అంతరంగ సాధనములు నాలుగు: 1. నిత్యానిత్యవస్తు వివేకము. 2.విషయవైరాగ్యము, 3. శమాదిసాధనసంపత్తి, 4. ముముక్షుత్వము (మోక్షేచ్ఛ).

1. నిత్యానిత్యవస్తువివేకము.

*"త ద్య థేహ కర్మచితో లోకః క్షీయతే ఏవ మేవా*
*ముత్ర పుణ్యచితో లోకః క్షీయతే ।"*

తా॥ ఈ లోకములో వ్యవసాయము మున్నగు లౌకిక కర్మలచే సంపాదింపబడిన ధాన్యాదిఫలములు ఎట్లు క్షీణించునో అట్లే యజ్ఞాది కర్మలచే పరలోకములో సంపాదింపబడిన స్వర్గాదిఫలములు క్షీణించును.

ఇట్టి శ్రుత్యాదులవలన నిత్య, అనిత్య వస్తువులను వివేచన చేయుట యనగా వేరుచేయుట నిత్యానిత్యవస్తువివేకము.

2. వైరాగ్యము.

*"పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రామ్మణో నిర్వేద*
*మాయా న్నా స్త్యకృతః కృతేన ।"* ఇత్యాది.

తా॥ కర్మలచే సంపాదించబడిన ఫలములు అనిత్యము లనియు, కర్మచే మోక్ష మెన్నడును సిద్ధించదనియు తెలిసికొని కర్మ, తత్ఫల ముల యెడ వైరాగ్యమును బొందవలెను. అనంతరము బ్రహ్మజ్ఞాన సంపత్తి కొరకు సద్గురుసమీపమునకు వెళ్ళవలెను. ఈ విధముగ వైరాగ్యము జనించిన పిదప శమాదిసాధనసంపత్తి.

3. శమాదిసాధనసంపత్తి

*"శాంతో దాంత ఉపరత స్తితిక్షు స్సమాహిత శ్రద్ధా*
*విత్తో భూత్వా ఆత్మ న్యేవాత్మానం పశ్యేత్ ।"*

తా॥ అంతరింద్రియనిగ్రహము, బహిరంద్రియనిగ్రహము, సంన్యాసము, శీతోష్ణాదిద్వంద్వ సహనము, చిత్తసమాధానము (ఏకాగ్రత) శ్రద్ధ. ఈ ఆరింటితో గూడిన మానవునకు ముముక్షత్వము.

4. ముముక్షుత్వము (మోక్షేచ్ఛ).

మానవునకు అపేక్షితములగు సర్వపురుషార్థములలో మోక్షము అత్యుత్తమ మయినది గావున దానిని గూర్చి ఇచ్ఛ అందరకును ఉండునుగదా! అట్టి మోక్షేచ్ఛను అంతరంగసాధనములలో నొకటిగా జెప్పుట ఎందులకని శంకింపరాదు. ఏలనన, మోక్షేచ్ఛ రెండు విధములు: 1. సఫలేచ్ఛ, 2. విఫలేచ్ఛ. లోకములో మహారాజునకు పుత్రుడై, రాజ్యప్రాప్తికి అర్హుడై యుండి, కారణాంతరములచే రాజ్యము సంప్రాప్తము కానివానికి రాజ్యము కావలెనను ఇచ్ఛ ఎట్లు సఫలేచ్ఛయో, తద్విపరీతముగ నీచవంశమందు బుట్టి యేవిధముగను రాజ్యప్రాప్తికి అర్హత లేని మానవునకు జనించిన రాజ్యేచ్ఛ ఎట్లు విఫలేచ్ఛయో అట్లే, మోక్షేచ్ఛ సర్వజనసాధారణమైనను నిత్యా__నిత్యవస్తువివేకాదిసాధనసంపత్తి లేకయే మోక్షమును గోరు వాని యిచ్ఛ విఫలేచ్ఛ గావున, సాధనసంపత్తితో గూడినవాని మోక్షేచ్ఛయే (అనగా సఫలేచ్ఛయే) ఇచ్చట ముముక్ష అనబడును గాన, విరోధము లేదు.

ఇట్టివానికే బ్రహ్మవిద్యయం దధికారమని శ్రీవ్యాసమహర్షి ఉత్తరమీమాంసాశాస్త్రములో "అథాతోబ్రహ్మజిజ్ఞాసా" అని జెప్పి యుండెను అనగా సాధనచతుష్టయ సంపత్త్యనంతరమున బ్రహ్మ జ్ఞానముకొరకు విచారణ చేయవలెను. అని సూత్రార్థము.

## బ్రహ్మ లక్షణము.

"లక్షణప్రమాణాభ్యాం వస్తుసిద్ధిః" అను తార్కిక సమయానుసారము ఏ వస్తువునైన తెలిసికొనదలచినచో ఆ వస్తువుకు దోషత్రయ (అవ్యాప్తి, అతివ్యాప్తి అసంభవరహిత మగు (అనగా నిర్దుష్టమగు) లక్షణమును, ప్రమాణమును జెప్పినచో, ఆ వస్తువును తెలిసికొనుట శక్యము. ఎట్లన, "గోః కిం లక్షణం? సాస్నాదిమత్త్వం లక్షణం ।" అనగా గోవును ఎరుగనివానికి దానిని తెలియజెప్పవలె నన్న, "గంగడోలు మొదలగునవి కలది గోవు. చక్షురింద్రియ ప్రమాణముచే తెలిసికొనదగినది." అని చెప్పినచో, గోరూపవస్తుజ్ఞాన మెట్లు గల్గునో అట్లే ప్రకృతములో బ్రహ్మజ్ఞానము కావలెనన్న బ్రహ్మకు లక్షణ ప్రమాణములు చెప్పుట అవసరము.

బ్రహ్మకు లక్షణములు రెండు: 1. తటస్థలక్షణము. 2. స్వరూపలక్షణము.

## తటస్థలక్షణము.

ఉపనిషత్తులలో ఇట్లు చెప్పబడినది.

"యతో వా ఇమాని భూతాని జాయంతే । యేన
జాతాని జీవంతి । యత్ప్రయం త్యభిసంవిశంతి । త
ద్విజిజ్ఞాసస్వ । త ద్బ్రహ్మేతి ।" (తై. ఉ. 4.1.)

తా॥ మనచే జూడబడుచున్న సమస్త భూతములును యెవని వలన పుట్టుచున్నవో, ఉత్పన్నములైన సర్వభూతములును యెవనిచే జీవించుచున్నవో, వినాశమును పొందుచున్న సర్వభూతములును యెవని యందు లీన మగుచున్నవో అదియే బ్రహ్మ. అనగా, జగత్తు యొక్క ఉత్పత్తి, స్థితి, లయములకు కారణమైనదియే బ్రహ్మ. ఈ విధముగ వరుణుడు తన పుత్రు డగు భృగువునకు బ్రహ్మలక్షణ మును జెప్పెను. (తథాచ, సృష్టి, స్థితి, లయకారణత్వం బ్రహ్మత్వం; ఇతి ఫలితం).

దీనినే ఉత్తరమీమాంసాశాస్త్రములో ఈ క్రింది విధముగ జెప్పిరి.

"జన్మా ద్యస్య యతః" (ఉ. మీ. 1.1.2.)

తా॥ ఈ జగత్తు యొక్క ఉత్పత్తి, స్థితి, లయములకు కారణమగునది బ్రహ్మ.

ఇట్లు చెప్పి, ఈ సూత్రమునకు విషయవాక్యముగ పూర్వో దాహృత (యతో వా ఇమానీత్యాది) శ్రుతి వాక్యము నుల్లేఖించిరి.

## దృష్టాంతత్రయము.

**ఇ**దే విధముగ బ్రహ్మకు భూతకారణత్వమును ప్రసిద్ధ దృష్టాంతత్రయముచే ముండకోపనిషత్తు చెప్పుచున్నది.

*"యథోర్ణనాభి స్సృజతే గృహ్ణతే చ యథా పృథివ్యా*
*మోషధయ స్సంభవంతి । యథా సతః పురుషా త్కేశ*
*లోమాని తథాక్షరా త్సంభవతీహ విశ్వం ।"* *(ముం. ఉ. 1.2.)*

ప్ర: కారణమాత్రము సహాయము లేనిదే కార్యమును సృజించలేదు' అను నియమానుసారము లోకములో మన్ను, నీరు, చక్రము మున్నగు సహాయములు లేకుండ కుమ్మరివాడు ఒక్కడును కుండనుయెట్లు నిర్మించలేడో అట్లే సహాయశూన్యు డగు బ్రహ్మ ఒక్కడును జగత్తును యెట్లు సృష్టించగలడు?

జ: కారణమాత్రము సహాయము లేనిదే కార్యమును సృజించ లేదు అను వ్యాప్తి 'దోషగ్రస్తము' అని ఊర్ణ నాభిదృష్టాంతముచే జగత్కారణత్వమును బ్రహ్మకు శ్రుతి చెప్పుచున్నది.

లోకములో ఊర్ణనాభి (సాలెపురుగు) ఇతరసహాయము నపేక్షింపకయే స్వయముగ దారమును నెట్లు సృజించునో, అట్లే పరమేశ్వరుడుకూడ ఇతరసహాయము నపేక్షింపకయే జగత్తును సృజించును.

ప్ర: లోకములో కార్యోత్పత్తి స్థలములో కార్యముపుట్టిన తరువాత కారణమునకు పూర్వావస్థయొక్క మార్పుగాని పూర్వాకారము యొక్క తిరోధానముగాని చూడబడుచున్నది.

ఎట్లన, మట్టిఉండచే కుండను నిర్మించినపిదప కారణ మగు మట్టిఉండయొక్క పూర్వావస్థ యెట్లు మారునో; మరియు, నలుపలకలు గల ఇటుకలచే గోడను నిర్మించిన తరువాత గోడకు కారణమగు ఇటుకల పూర్వపు చతుష్కోణాకారము ఎట్లు కనిపించదో (తిరోహిత మగునో); అట్లే, బ్రహ్మ జగత్తుకు కారణమైనచో భూతసృష్టి అయినపిదప కారణమగు బ్రహ్మకు (మృత్పిండాదులవలె) పూర్వావస్థయొక్కమార్పుగాని, పూర్వాకారతిరోధానముగాని (నిర్వికారత్వాదిశ్రుతులచే) లేదు గదా! లేనినాడు బ్రహ్మ జగత్తుకు కారణమెట్లగును?

జ: ఈ శంకపై శ్రుతి పృథివ్యోషధిదృష్టాంతములచే బ్రహ్మకు జగత్కారణత్వమును జెప్పుచున్నది (యథాపృథి...వంతి) ఓషధులకు కారణమగు పృథివికి ఓషధులు పుట్టిన పిదప వెనుకటి మృత్పిండము వలె (పూర్వావస్థోపమర్దము) మార్పు గాని, ఇటుకలవలె ఆకారతిరో ధానముగాని లేకయే ఓషధులను గూర్చి పృథివి ఎట్లు కారణమగుచున్నదో, అట్లే జగత్కారణమగు బ్రహ్మ కూడ పృథివివలె ఉపమర్దతి రోధానములు లేకయే జగత్తుకు కారణ మగుచున్నాడు.

ప్ర: మట్టితో చేయబడిన కుండనుగూర్చి దారములు విలక్షణములగుటచే కారణము ఎట్లు కానేరవో, అట్లే అచేతన మగు జగత్తుకు తద్విలక్షణుడగు (చేతనుడగు) బ్రహ్మకారణ మెట్లగును?

జ: ఈశంకపై శ్రుతి కేశ నఖ దృష్టాంతముచే బ్రహ్మకు జగత్కారణత్వమును జెప్పుచున్నది. (యథా నత ఇతి) లోకములో చేతను డగు పురుషునివలన అచేతనములగు కేశములు, నఖములు యెట్లు పుట్టుచున్నవో, అట్లే చేతను డగు బ్రహ్మ నుండి జగత్తు పుట్టుటలో విరోధము కానరాదు.

ఈ విధముగ మూడు దృష్టాంతములచే (సాలెపురుగు, పృథివి, పురుషుడు) ముండక శ్రుతి జెప్పిన బ్రహ్మకు జగదుత్పత్తి, స్థితి, లయ కారణత్వమను తటస్థలక్షణము సంగత మయినది.

భావము: లోకములో దేవదత్తుని యింటికి గుర్తును జెప్పునపుడు "కాకవ ద్దేవదత్తగృహం" (కాకులువాలినది దేవదత్తుని యిల్లు) అని చెప్పినచో, లక్ష్య మగు దేవదత్త గృహముతో కాకాశ్రయత్వరూపధర్మమునకు అవయవావయవిభావ సంబంధము లేకయే తటస్థముగా నుండి ఇంటినిఎట్లు తెలియజేయునో, అనగా దేవదత్తగృహములో కొంత భాగము స్పష్టమయినపుడు దేవదత్త గృహైక దేశము భగ్నమైన దనునట్లు, కాకులు యెగిరిపోయినను దేవదత్తుని యింటిలో కొంతభాగము యెగిరిపోయిన దను వ్యవహారము లేకయే కాకాశ్రయత్వ ధర్మము తటస్థముగా నుండి ఇంటిని ఎట్లు తెలియజేయునో, అట్లే

ప్రకృతములో లక్ష్యమగు బ్రహ్మతో సంబంధము లేకయే జగజ్జన్మాదికారణత్వము బ్రహ్మను తెలియజేయును గాన, బ్రహ్మకు ఇది తటస్థలక్షణ మని భావము.

ప్ర: అట్లయినచో జగత్తునకు బ్రహ్మ ఉపాదానకారణ మను వ్యవహార మెట్లు సంగత మగును?

## ఉపాదానకారణ విమర్శ.

జ: భ్రాంతిస్థలములలో ఉపాదానకారణము రెండు విధములు: పరిణామ్యుపాదనము, వివర్తోపాదానము.

## 1. జగత్తునకు మాయ పరిణామ్యుపాదానకారణము.

లోకములో కుండకు మట్టివలె జగత్తునకు సత్త్వరజస్తమో గుణాత్మక మగు మాయ పరిణామ్యుపాదానము కావున (అనగా, మాయయే జగద్రూపముగ పరిణమించినదిగావున), కుండకు కారణమగు మృత్తుయొక్క యెరుపు, నలుపు మున్నగు గుణములు కార్యమగు కుండయందు సంక్రమించినట్లు, కారణమగు మాయయొక్క ధర్మములు (సత్త్వరజస్త మో గుణములు) కార్యమగు జగత్తునందు సంక్రమించుచున్నవి. కావున, మాయ (జగత్తునకు) పరిణామ్యుపాదాన కారణము.

## 2. జగత్తునకు బ్రహ్మ వివర్తోపాదానకారణము.

రజ్జుసర్పస్థలములో త్రాడును చూచి (అధిష్ఠానము యొక్క అజ్ఞానముచే) సర్ప మనుకొనినపుడు (అనగా, అధిష్ఠాన మగు త్రాడు నందు పామును కల్పించినపుడు), ఈ కల్పనకు అధిష్ఠాన మగు త్రాడు కల్పితమైన సర్పమునకు వివర్తోపాదానకారణము. అధిష్ఠాన మగు త్రాడు లేనిచో సర్పమనుకొనుటయే సంభవించదు. సర్పకల్పనకు అధిష్ఠానమైన త్రాడు మాత్రము సత్యము. కల్పితమైన సర్పము అసత్యము. ఇదే విధముగ శుక్తి రజతస్థలములో ముత్యపు చిప్పను చూచి వెండి అనుకొనినపుడు అధిష్ఠాన మగు ముత్యపు చిప్ప యందు (అధిష్ఠానము యొక్క అజ్ఞానముచే) వెండిని కల్పించినపుడు ఈ కల్పనకు అధిష్ఠాన మగు ముత్యపుచిప్ప కల్పితమైన వెండికి వివర్తోపాదానకారణము. అధిష్ఠానమగు ముత్యపు చిప్ప లేనిచో వెండి అనుకొనుటయే తటస్థించదు. అధిష్ఠానమగు ముత్యపు చిప్ప మాత్రము సత్యము. కల్పితమైన వెండి అసత్యము. ఇట్టి భ్రాంతిస్థలములలో అన్నిటిలోను అధిష్ఠానము సత్యమైనది ఉండి తీరవలెను. దానియందు కల్పితమైనది అసత్యము.

ప్రకృతములో సత్యమగు బ్రహ్మయందు మాయచే కల్పితమైన జగత్తునకు బ్రహ్మ విర్తోపాదానకారణ మనబడును. కాన, అధిష్ఠాన మగు బ్రహ్మ సత్యము, కల్పితమైన జగత్తు అసత్యము అని తాత్పర్యము.

ఫలితము: వెనుకటి రెండు ఉదాహరణలలో కల్పితములైన పాముకును, వెండికిని వివర్తోపాదానకారణములు త్రాడుయు ముత్యపు చిప్పయు గావున, అధిష్ఠానము లగు ఆ త్రాడును, ముత్యపుచిప్పను తెలియజెప్పుటకు "దేనిని పాము అని అనుకొంటిమో అది త్రాడు. దేనిని వెండి అనుకొంటిమో అది ముత్యపుచిప్ప" అనునట్లు, ప్రకృతములో సత్యమైన అధిష్ఠానము, వివర్తోపాదానకారణము అగు బ్రహ్మయందు మాయచే కల్పితమైన జగజ్జన్మాది కారణత్వమును పురస్కరించుకొని ఏది జగజ్జన్మాది కల్పనాధిష్ఠానమో, అది బ్రహ్మ అని బ్రహ్మకు తటస్థలక్షణము జగజ్జన్మాదికారణత్వము. ఈ లక్షణము వెనుకటి కాకవద్దేవదత్త గృహన్యాయముగా బ్రహ్మను స్పృశించకయే బ్రహ్మను తెలియజేయునుగాన తటస్థలక్షణ మని వ్యవహారము. వివర్తోపాదానముగాన, ఉపాదానకారణ మను వ్యవహారము సంగతము.

## బ్రహ్మకు స్వరూపలక్షణము.

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ ।' (తై. ఉ.)

తా॥ ఈ శ్రుతిలోని సత్య, జ్ఞాన, అనంతపదములు మూడును కూటస్థము, చిద్రూపము, అద్వితీయము అగు బ్రహ్మను చెప్పుచున్నవి. (తదుక్త పూర్వాచార్యైః)

"కౌటస్థ్యమేవ సత్యత్వం స్ఫురణం జ్ఞాన ముచ్యతే ।
అనంత్య మేకతా చైవం బోధ్యతే బ్రహ్మ తై స్త్రిభిః ।"

ఈ మూడును ప్రత్యేకముగ ఒక్కొక్కటియే బ్రహ్మకు లక్షణమని కొందరి మతము.

ప్ర: సత్యత్వాదిధర్మములు బ్రహ్మకు స్వరూపలక్షణ మగుచో, బ్రహ్మకు సత్యత్వాదిధర్మసంబంధ ముండవలెను గదా! అట్లైనచో 'అసంగో హ్యయం పురుషః' ఇత్యాది శ్రుతివాక్యములచే బ్రహ్మకు యే సంబంధమును లేనట్లు బోధించెడి శ్రుతులతో విరోధము కాదా?

జ: లోకములో భుజించిన అన్నమును జీర్ణము చేయుటకు సేవించబడిన ఔషధము అన్నమును జీర్ణము గావించి తానుకూడ యెట్లు జీర్ణమగునో, మరియు నీటియొక్క కాలుష్యమును తొలగించుటకు నీటియందుంచిన ఇండుగచూర్ణము కాలుష్యమును తొలగించి తాను కూడ యెట్లు నివృత్త మగునో, అట్లే సత్యజ్ఞానాది శబ్దములచే జెప్పబడు సత్యత్వాది ధర్మములు బోధరూప మగుబ్రహ్మకు ఉపలక్షకము అగుచు (బోధకము లగుచు) సత్యత్వాది ధర్మములు కూడ (అవిద్యాకార్యము లగుటచే) మిథ్యాభూతములు గాన, ఆ ధర్మములు కూడ నివృత్తము లగును. అందుచే బ్రహ్మ నిర్ధర్మక మయినదిగాన, అసంగత్వాది శ్రుతులతో విరోధము లేదు.

ప్ర: బ్రహ్మనుండి సత్యత్వ ధర్మము నివృత్తమైనచో, బ్రహ్మకు మిథ్యాత్వము సంభవించదా?

జ:లోకములో నీటియందుంచిన ఇండుగచూర్ణముచే తొలగి పోయిన నీటికాలుష్యము, ఇండుగచూర్ణము నివృత్తమైన పిదప తిరిగి యెట్లు రాదో, మరియు ఔషధముచే జీర్ణమైన అన్నము, ఔషధము జీర్ణమైన తరువాత తిరిగి ఆ అన్నము అజీర్ణము ఎట్లు రాదో; అట్లే, ప్రథమములో సత్య జ్ఞానాదిపదములచే బ్రహ్మయందు నివృత్తమైన అజ్ఞానాదులు, సత్యత్వాది ధర్మములు నివృత్తములైన పిదప నీటి కాలుష్యాదులవలె తిరిగి రానేరవుగాన, బ్రహ్మకు మిథ్యాత్వము ప్రసక్తము కానేరదు.

ప్ర: ఇచ్చట సత్య, జ్ఞాన, అనంత శబ్దములు మూడును ప్రత్యేకముగా బ్రహ్మకు మూడు లక్షణములు చెప్పబడినవి. ఇదేవిధముగ ఇతరశ్రుతులలో (అనగా, "విజ్ఞాన మానందం బ్రహ్మ", "అయం పురుష స్స్వయంజ్యోతి ర్భవతి", "పూర్ణమదః పూర్ణమిదం" అను వాటిలో) ఆనంద, స్వయంజ్యోతి, పూర్ణాదిశబ్దములు బ్రహ్మకు ప్రత్యేకము లక్షణములుగా చెప్పబడుచున్నవిగదా! బ్రహ్మ ఒక్కడే యగుచో ఇన్ని లక్షణములు బ్రహ్మకు చెప్పుట ఎందులకు? అనేక లక్షణములు చెప్పుటచే బ్రహ్మకు నానాత్వము (అనేకత్వము) సంభవించుచున్నదే.

జ: విద్యారణ్య భాష్యములో ఈ క్రింది విధముగ జెప్పబడినది.

"బ్రహ్మణి నివర్తనీయానాం పురుషభ్రాంతీనాం బహువిధ
త్వేన లక్షణ బాహుళ్యం । న త్వేతావతా బ్రహ్మణో వివిధత్వ
మస్తి । నిర్విశేషమేవ సర్వైరపి లక్షణ్యైః ప్రతిపాద్యతే ।"

తా॥ బ్రహ్మ విషయములో నివారింపదగిన పురుషభ్రమలు బహువిధము లగుటచేత అన్ని భ్రమలను తొలగించుటకు చాల లక్షణములు చెప్పబడినవి. ఇంత మాత్రముచే బ్రహ్మకు బహువిధత్వము సంభవించదు. ఎందులకన, సర్వలక్షణములచేతను నిర్విశేషమగు బ్రహ్మయే చెప్పబడుచున్నది. కాని సవిశేషము చెప్పబడుట లేదు. లోకులకు సుఖముగ తెలిసికొనుటకే అనేక లక్షణములు గాన, బ్రహ్మకు భేదము, నానాత్వము సంభవించదు.

## బ్రహ్మకు ప్రమాణము.

**వ**స్తుసిద్ధి సాధనములగు లక్షణప్రమాణములలో బ్రహ్మకు లక్షణములను జెప్పిన పిదప బ్రహ్మ విషయములో ప్రమాణ నిరూపణము చేయవలసి యున్నది.

లోకములో వస్తుజ్ఞానమునకు సాధనముగ వ్యవహరింపబడుచున్న ఇంద్రియమనస్సుల చేతనే సర్వవస్తువులను తెలిసికొనవలెను గాని వేరు ఉపాయము లేదు. చక్షుస్సు, శ్రోత్రము,

వాక్కు మనస్సు మున్నగు యే ఇంద్రియములకును ఆత్మ గోచరించునది కాదు. ఉపనిషత్తులలో ఈ క్రింది విధముగా చెప్పబడినది -

*"న తత్ర చక్షు ర్గచ్ఛతి న వా గ్గచ్ఛతి నో మనః । న*
*విద్మో న విజానీమో యథైత దనుశిష్యాత్ ॥"* (కే. ఉ.3.)

*"య చ్చక్షుషా న పశ్యతి "*

*"య చ్ఛ్రోత్రేణ న శృణోతి"* (కే. ఉ.7.8.)

*"న చక్షుషా పశ్యతి క శ్చనైనం"* (తై. ఉ. 5.)

*"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ"* (తై. ఉ. 3.11.)

*'యదా హ్యేవైష ఏతస్మిన్నదృశ్యే__నాత్మే ్యే__నిరుక్తే ।'* (తై. ఉ.3.)

ఈ విధముగ సమస్త శ్రుతులు బ్రహ్మకు ఇంద్రియాగోచరత్వమును చెప్పుచున్నవి. అట్టి ఆత్మను ఎట్లు తెలిసికొనగలము? ప్రత్యక్ష, అనుమానాది ప్రమాణములచే బ్రహ్మ తెలిసికొనుటకు శక్యమయినది కాదని పై శ్రుతి కదంబ మంతయు స్పష్టముగ నొక్కి వక్కాణించుచున్నది. బృహదారణ్యకములో ఇట్లు చెప్పబడినది:

"తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి ।"
ఉపనిష త్స్వే వాధిగతః ఔపనిషదః ।" (బృ. ఉ.)

తా॥ శాకల్యుని గూర్చి యాజ్ఞవల్క్యునిచే పలుకబడిన ఈ వాక్యమునందు పరబ్రహ్మ రూపుడగు పురుషుని తెలిసికొనుటకు ఉప నిషత్ప్రమాణముచేతనే తెలిసికొనవలె నని ప్రతీత మగుచున్నది మరియు,

"అణో రణీయాన్ ... ధాతుః ప్రసాదా న్మహి
మాన మీశం ।" (తై. ఉ. నారా. 12. అను.)

తా॥ అధికార సంపత్తి గల పురుషుడు ఈశ్వర కటాక్షమువలన పరమాత్మను తెలిసికొనును. (పూర్వాచార్యైరప్యుక్తం )

"ఈశ్వరానుగ్రహా దేషాం పుంసా మద్వైతవాసనా ।
మహాభయకృతత్రాణా ద్విత్రాణాం యది జాయతే ।"

ఈశ్వరానుగ్రహమువలన మానవునకు ఆత్మసాక్షాత్కారము లభించునని పూర్వాచార్యులు కూడ శలవిచ్చిరి.

*"తద్విజ్ఞానార్థం స గురు మేవాభిగచ్ఛేత్ ।"*

తా॥ ఆత్మజ్ఞానముకొరకు సద్గురుసన్నిధికే వెళ్ళవలెను. సద్గురు కటాక్షమువలన ఆత్మజ్ఞానము లభించునని ఈ శ్రుతి బోధించుచున్నది.

ప్ర: బ్రహ్మ విషయములో ప్రమాణ (నిరూపణ) మును చెప్పుట ప్రకృతము గదా! "ఔపనిషదం" అను శ్రుతి, బ్రహ్మ ఉప నిషత్తులచే తెలిసికొనదగినవాడని చెప్పుచున్నది. "ధాతుః ప్రసాదాత్" అను శ్రుతి, ఈశ్వరానుగ్రహముచే బ్రహ్మజ్ఞానమును బోధించుచున్నది. "గురు మేవాభిగచ్ఛేత్" అను, శ్రుతి, ఆచార్య కృపచే బ్రహ్మజ్ఞానమును బోధించుచున్నది. ఈ మూడు శ్రుతులు బ్రహ్మను తెలిసికొనుటకు వేరు వేరు ఉపాయములను విరుద్ధముగ చెప్పినవి. ఉపనిషత్తులు, ఈశ్వరానుగ్రహము, ఆచార్యానుగ్రహము ఈ మూడిటిలో దేనివలన ఆత్మజ్ఞానము లభించును?

జ: "న బహునా శ్రుతేన" అను శ్రుతి వ్యాఖ్యలో ఆనందగిరులవారు "పరమేశ్వరాచార్యాను గ్రహీతేన తు లభ్యత ఇత్యాహ" అని చెప్పిరి. అనగా, ఈశ్వరానుగ్రహము, ఆచార్యాను గ్రహములతో గూడిన ఉపనిషద్జ్ఞానము చేతనే ఆత్మజ్ఞానము లభించునని వ్రాయుటచే పై శ్రుతులకు విరోధము లేదనియు, మూడును ఉండవలెననియు స్పష్ట మగుచున్నది.

ఫలితము: బ్రహ్మజ్ఞానమునకు ముఖ్య ప్రమాణము ఉపనిషత్తులనియు, ఈశ్వరా చార్యానుగ్రహములు సహకారు లనియు ఈ విధముగ మొత్తము మూడును ఉండవలె ననియు సిద్ధమైనది గాన, విరోధము లేదు.

ఈ విధముగ తెలిసికొనదగిన (లక్ష్యమగు) బ్రహ్మకు లక్షణ ప్రమాణములు చెప్పిన పిదప ఆ బ్రహ్మకు స్థాన నిర్ణయము ఉపనిషత్తులలో ఈ క్రింది విధముగ చెప్పబడినది -

*'యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్న్ ।* (తై. బ్రహ్మవల్లీ)

*'ఆత్మా గుహాయాం నిహితోస్య జంతోః ।'* (తై. ఉ.నారా. 12)

*'పరేణ నాకం నిహితం గుహాయాం'* (తై. ఉ. నారా. 4.)

ఇత్యాది ఉదాహృతశ్రుతులన్నియు గుహయందు ఆత్మదర్శనము లభించు నని నిర్విశేషముగ చెప్పుచున్నవి. అనగా, సర్వజగదాదార మగుబ్రహ్మకు బుద్ధిగుహయందు కూర్చుండుట సంభవించదు గాన, ఆధారాధేయభావరూపముగ ఆత్మ అచ్చట కూర్చెండె నని తాత్పర్యము గాదు. మరేమన, సూర్యరశ్మి అంతటను వ్యాపించినను దర్పణమందే ప్రతిఫలించునుగాని, కట్టలు, రాళ్లు మున్నగు వాటి యందు ఎట్లు ప్రతిఫలించదో, అట్లే ఆత్మ అంతటను వ్యాపించి యున్నను, గుహయందు అభివ్యక్తమగును (గోచరించును) గాని, ఇతరత్ర దృశ్యము కాదని తాత్పర్యము.

# గుహాశబ్దార్థము.

వ్యాకరణశాస్త్ర ప్రక్రియానుసారము -

'గుహూ సంవరణే' అను ధాతువుకు జెందిన గుహాశబ్దమునకు సంవృత మయిన దేశము అర్థము. కావుననే పర్వతగుహా అనుపదమునకు సంవృతమైన పర్వతబిలమందు లోకములో వ్యవహారము కలదు. ప్రకృతములో శ్రీ విద్యారణ్య యతీంద్రుల వారిట్లుసెలవిచ్చిరి.

'దేహా దభ్యంతరః ప్రాణః ప్రాణా దభ్యంతరం మనః ।
తతః కర్తా తతో భోక్తా గుహా సేయం పరంపరా ॥'

అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ, కోశములు ఐదింటియొక్కయు పరంపరయే ఇచ్చట గుహాశబ్దమునకు అర్థమని సెలవిచ్చిరి. పర్యవసాన మేమన, మనుష్య దేహములో అన్నమయాదిపంచకోశములకు లోపల ఆత్మ అభివ్యక్త మగు నని స్పష్ట మగుచున్నది గాన, కోశముల స్వరూపము సంకుచిత ముగ వివరించబడును.

# అన్నమయకోశము.

స్థూలదేహమునకే అన్నమయకోశ మని వ్యవహారము సుప్రసిద్ధము. ఇది పంచీకృత పంచమహాభూతములచే నిర్మితమైనది గాన, దృష్టికి కనుపించును. ఇక సత్త్వరజస్తమోగుణాత్మక మగు మాయ యొక్కతమోగుణభాగముచేతనే ఇది సృజించబడినది గాన, ఈ స్థూలదేహమందు తమోగుణధర్మ మగు జాడ్యమే గన్పట్టుచున్నది గాని, క్రియాశక్తిగాని, జ్ఞానశక్తిగాని లేదు. దీనిని గూర్చి ఛాందోగ్యోపనిషత్తులో ఈ క్రింది విధముగ చెప్పబడినది.

"అన్న మశితం త్రేధా విధీయతే తస్య యః స్థవిష్ఠో
భాగ స్త త్పురీషం యో మధ్యమ స్త న్మాంసం యోఽణిష్ఠః
స్తన్మనః ।" (ఛాం. ఉ. 6.5.1.).

తా॥ మనచే భుజించబడిన అన్నము శరీరములో మూడు విధములుగ విభజించబడును. ఆ మూడు భాగములలో అన్నము యొక్క స్థూలభాగము పురీషముగను, మధ్యభాగము మాంసముగను, అతిసూక్ష్మభాగము మనస్సుగను మారును. అనగా, మనస్సుకు బలము నిచ్చును.

ఈ విధముగ ఇతరత్ర బహువిపులముగ స్థూలదేహమునకు అన్నమయకోశ మని వ్యవహారమును స్థిరపరచిరి.

## ప్రాణమయకోశము.

ప్రాణాపానాదివృత్తి సమూహరూపమైనది ప్రాణమయకోశము. ఈ కోశము మొదలు అన్ని కోశములకు అపంచీకృత భూతములచే సృష్టి గావుననే స్థూలదేహమువలె ఇది దృష్టికి గోచరించదు. ఈ కోశము అపంచీకృత పంచమహాభూతములయొక్క కేవలరజోగుణభాగ ముచే నిర్మింపబడినది గావున దీనియందు చలనాత్మక క్రియ కనబడుచున్నది. దీనిని గూర్చి ఛాందోగ్యములో చెప్పబడినది –

*"అపః పీతా స్త్రేథా విధీయంతే తత్ర య స్థవిష్ఠో*
*ధాతు స్త న్మూత్రం । యో మధ్యమ స్తల్లోహితం*
*యోఽణిష్ఠ స్స ప్రాణః ।* (ఛాం. ఉ.)

తా॥ మనము త్రాగిన ఉదకములో స్థూలభాగము మూత్రము గను, మధ్యమభాగము రక్తముగను, అతిసూక్ష్మభాగము ప్రాణము గను మారును. అనగా ప్రాణమునకు వృద్ధి నిచ్చును.

## మనోమయ కోశము.

మనోమయాదికోశములు మూడిటికిని అవశిష్టసత్వగుణభాగమే కారణము గాన ఆ మూడు కోశములందును జ్ఞానశక్తి ఉపలభ్యమాన మగుచున్నది. సంకల్ప వికల్పాది సమూహాత్మక మగు మనోమయ కోశము తమోగుణమిశ్రమమయిన సత్వగుణాంశచే నిర్మించబడినది గావున దీనికి రాగద్వేషాది తామసధర్మములే గానవచ్చును. ఈ విషయమునే వేదాంత పరిభాషలో ఈ క్రింది విధముగ పరిగణించిరి.

*"కామ స్సంకల్పో విచికిత్సా శ్రద్ధా_శ్రద్ధా ధృతిరధృతిగ్*
*హ్రీ ర్ధీ ర్భీరి త్యేత త్సర్వం మన ఏవ ।" ఇతి.* (వే. ప.)

ఈ కోశములో సర్వజ్ఞానేంద్రియములకు కర్మేంద్రియములకు అంతర్భావ మైనను మనస్సునకు ప్రాధాన్యముచే మనోమయశబ్దముచే వ్యవహారము.

## విజ్ఞానమయకోశము.

రజోగుణమిశ్ర మగు సత్వగుణము విజ్ఞానమయ కోశమునకు కారణము. ఈ కోశము నందు యజ్ఞాది వైదిక కర్మలకును, కృష్యాది లౌకిక కర్మలకును కర్తృత్వము గనుపించుచున్నది. అనగా, 'అహం కర్తా' అని అనుభూయమాన మగుచున్నది. ఈ విషయమే తైత్తిరీయ ఉపనిషత్తు (బ్రహ్మవల్లి)లో ఈ క్రింది విధముగా చెప్పబడినది –

*"విజ్ఞానం యజ్ఞం తనుతే । కర్మాణి తనుతేపి చ ।* (తై. ఉ. బ్రహ్మవల్లీ)

సత్వగుణకార్య మగు జ్ఞానశక్తియందు రజోగుణముతో కలిసిన భాగము రాజస మగు కర్తృత్వాది ధర్మముతో గూడినదై విజ్ఞానమయ మైనది.

"మనోవృత్తీనాం మధ్యే విశిష్టం అహంకర్తేత్యేవం రూపం
వృత్తింజ్ఞానం యస్య కర్తృత్వోపాధికస్య వస్తునః గ్రాహకం
భవతి తద్వస్తు విజ్ఞానం । తస్య వికారః విజ్ఞానమయః ।
తథాచ సర్వ వ్యవహార గోచర జ్ఞానక్రియాశక్తియుక్తో విజ్ఞాన
మయ ఇతి సిద్ధం । (వి. భా.)

తా॥ సర్వవ్యవహార గోచర మగు జ్ఞానశక్తి, క్రియాశక్తులతో గూడుకొనినది విజ్ఞానమయ కోశ మని తాత్పర్యము.

ప్ర: వృత్తి మాత్రరూపములగు మనోమయ, విజ్ఞానమయ కోశములకు అన్నమయ ప్రాణమయములకు వలె పృథక్స్వరూప త్వము (భిన్న రూపత్వము) లేకపోవుటవలనను, (వృత్తిరూపము లగుటచే అనేక వృత్తులు ఏకకాలమునందు జీవించవుగావున) వేరు వేరు కాలములందు జనించునవి అగుటవలనను, ఈ గుహలో అంతర్బహిర్భావము ఈ రెండు కోశములకు ఎట్లు యుక్తమగును?

జ: రెండు కోశములు వృత్తిరూపము లైనను, మనోమయ కోశమును కరణరూపముగను, విజ్ఞానమయకోశమును కర్తృరూపము గను నిరూపించుటచే కరణత్వకర్తృత్వ ధర్మములు ఒక వస్తువునందు ఉండవుగాన, భిన్ననిష్ఠములు. గాన, ఈ రెండింటికిని వేరు వేరు తత్వములుగ వ్యవహారము, అంతర్బహిర్భావము సిద్ధించుటలో విరోధము లేదు.

## ఆనందమయ కోశము.

శుద్ధసత్వగుణము ఆనందమయకోశమునకు కారణము గాన, అచ్చట ప్రియాదిశబ్దములచే వ్యవహరించబడియెడి సుఖవిశేషములే కనుపించును.

వాస్తవములో మనోమయాదిమూడు కోశములందును జ్ఞానశక్తి ఒక్కటియే అవాంతర భేదములచే కరణశక్తి, కర్తృశక్తి, భోగశక్తి, అని (మూడింటియందు) మూడు విధములుగ వ్యవహరించబడుచున్నది.

ఈ విధముగ గుహాశబ్ద వాచ్యమగు పంచకోశ వివరణానంతరము శరీరములో పరమేశ్వరుని ఉపాసనకు –

## స్థాననిర్దేశము.

"అనంత మవ్యయం కవిగ్ం సముద్రేంతం విశ్వశంభువం ।
పద్మకోశప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖం ॥

అధొ నిష్ట్యా వితస్త్యాంతే నాభ్యా ముపరి తిష్ఠతి ।
జ్వాలమాలాకులం భాతి విశ్వస్యాయతనం మహత్ ॥
సంతతగ్ం శిలాభిస్తు లంబత్యా కోశసన్నిభం ।
తస్యాంతే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్ థ్సర్వం ప్రతిష్ఠితం ॥
తస్య మధ్యే మహా నగ్ని ర్విశ్వార్చి ర్విశ్వతో ముఖః ।
సోఽగ్రభు గ్విభజన్ తిష్ఠ న్నాహార మజిరః కవిః ॥
తిర్య గూర్ధ్వ మధ శ్శాయీ రశ్మయ స్తస్య సంతతా ।
సంతాపయతి స్వం దేహ మాపాదతలమస్తగః ॥
తస్య మధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః ।
నీలతోయదమధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా ॥
నీవారశూకవ త్తన్వీ పీతా భాస్వ త్యణూపమా ।
తస్యా శ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః ॥
స బ్రహ్మ స శివ స్స హరి స్సేంద్ర స్సోక్షరః పరమ స్స్వరాట్ ।" (తై.ఉ.నారా.)

తా॥ 'సహస్రశీర్షమిత్యాది అనంతమవ్యయంకవిం' వరకును గల మంత్రములచే ఉపాసన చేయదగిన పరమేశ్వరుని స్వరూపమును జెప్పి, 'పద్మకోశప్రతీకాశం' మొదలు 'పరమాత్మా వ్యవస్థితః' వరకును ఉపాసనకు స్థానమును శ్రుతి వర్ణించుచున్నది.

ఈ శరీరములో కంఠముడికి క్రిందుగను, నాభికి పంద్రెండు అంగుళములు (అనగా మూడు బెత్తలు) ఊర్ధ్వభాగముననను లౌకిక పద్మకోశ (ముకుళ) సదృశ మగు హృదయ పుండరీకము అధోముఖ ముగ నుండును. అది జ్వాలామాలలచే వ్యాప్తమై ప్రకాశించుచుండును. అది సమస్త జగత్తుకును స్థానము. అనగా, సమస్త జగత్తుకును ఆధారమగు పరమేశ్వరుని అభివ్యక్తి స్థానము గాన, సమస్త జగత్తుకును స్థానము, అది 101 ప్రధాన నాడులచే వ్యాప్తమైనట్లు శ్రుతి వర్ణించుచున్నది.

*'శతం చైకా చ హృదయస్య నాడ్య స్తాసాం*
*మూర్ధాన మభి నిస్సృతైకా । తయోర్ధ్వమాయ న్నమృ*
*తత్వ మేతి ।'*

అట్టి హృదయసమీపమున సూక్ష్మరంధ్రము (అనగా సుషుమ్నానాడీనాళము) కలదు. సుషుమ్నానాడిని గూర్చి అధర్వవేద భాష్యములో –

'మధ్యస్థాయా స్సుషుమ్నాయాః పంచపర్వసు సంస్థితాః ।
శాఖోపశాఖతాం ప్రాప్తా స్సిరా లక్షత్రయా త్పరం ॥
అర్థలక్ష మితి ప్రాహుః శరీరార్థవిచారకాః ।'

తా॥ హృదయపుండరీక మధ్యమున నున్న సుషుమ్నానాడికి ఐదు పర్వలందు శాఖోపశాఖలుగా నున్న నాడులు మూడు లక్షలకు పైన గలవనియు, శరీరమందలి పదార్థ విమర్శకులు యేబదివేలు గల వనియు చెప్పుచుండిరి. అట్టి సుషుమ్నానాడీ రంధ్రమున మనస్సు ప్రవేశించగనే, అచ్చట సర్వజగత్తుకును ఆధారమగు బ్రహ్మ అభివ్యక్త మగును గాన, ఆ నాళము యొక్క మధ్యయందు బహుళ జ్వాలోపేతమగు ప్రౌఢమైన అగ్ని సర్వనాడు లందును సంచరించుటచే, బహువిధములైన ముఖములు గలిగి, తనకు పురోభాగమందు ప్రాప్తమైన అన్నమును భుజించుచు భుక్తమైన ఆహారమును సర్వావయవము లందును విభజించుచు అనగా, ప్రసరింపజేయుచు నుండెను. ఈ అర్థమునే భగవద్గీతలో –

"అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః ।
ప్రాణాపానసమాయుక్తః పచా మ్యన్నం చతుర్విధం ॥"

అను విధముగ శ్రీ కృష్ణభగవానుడు శెలవిచ్చెను. ఇట్టి అగ్ని, పాదతలము మొదలు శిరస్సు పర్యంతము (అనగా దేహమంతను) ఎల్లప్పుడును తపింపజేయుచున్నది. శరీరగతమగు బాహ్యసంతాపమే అంతర్యమందు అగ్ని కలదనుటకు చిహ్నము.

ఈవిధముగ జ్వాలావిశేషములచే సంపూర్ణదేహమును వ్యాపించి యున్న అగ్ని మధ్య యందు అత్యంత సూక్ష్మమగు ఒక జ్వాల సుషుమ్నా నాళముద్వారా ఊర్ధ్వముగ బ్రహ్మ రంధ్రపర్యంతము వ్యాపించి యున్నది. ఆ అగ్నిజ్వాల, నీలమేఘమధ్యమున నున్న మెరుపుతీగ వలె ప్రకాశించుచున్నది. మరియు నివరధాన్యముయొక్క అగ్రమువలె బహుసూక్ష్మమై, అత్యంత సూక్ష్మవస్తువులకు ఉపమానమగుచు, పచ్చగా ప్రకాశించుచున్నది. పూర్వోక్త వహ్నిశిఖయొక్క మధ్యమందు పరమాత్మ ఉండెను. (అనగా ఆస్థానమందు అభివ్యక్తమగును.)

సర్వజగత్కారణు డగు పరబ్రహ్మ యొక్క ఉపాసనకు అల్పస్థానము చెప్పబడినను, అతడు స్వయముగ అల్పుడు కాడనియు, సర్వదేవతాస్వరూపు డనియు శ్రుతి చెప్పుచున్నది.

'న బ్రహ్మ – స్వరాట్ ।'

తా॥ ఆ పరమాత్మయే చతుర్ముఖబ్రహ్మయు, శివుడు, విష్ణువు, ఇంద్రుడు, అక్షరుడు (అనగా, జగత్కారణమగు మాయావిశిష్టమైన అంతర్యామి), శుద్ధచిద్రూపుడు గావుననే పారతంత్ర్యము లేదుగాన స్వయముగా విరాజమానుడు. ఈ శ్రుతివలన అన్నమయాదికోశ పంచ కములోపల హృదయపుండరీకమునందు పరమేశ్వరుని సాక్షాత్కారమగుననియు, శమాదిసాధనసంపన్ను డగు అధికారిపురుషునకు పరమాత్మసాక్షాత్కారముచే పునరావృత్తి రహితమగు మోక్షరూప పురుషార్థము సిద్ధించుననియు, దీనికి మూలప్రమాణము సర్వప్రమాణ మూర్ధన్యము లగు ఉపనిషత్తులన్నియు సిద్ధమైనది.





శ్రీ మహాగణాధిపతయే నమః ।

# వేదసార రత్నావళి

## 27. సంస్కృతము. దేవభాష

### వాఙ్మయము.

వేదమునుండి సంస్కృత వాఙ్మయము బయలువెడలెనా? సంస్కృత భాష యెట్లు సంప్రాప్తమాయెను? అను విషయమును గూర్చి ఈ క్రింది శ్రుతిజాతము వివరించుచున్నది.

*'గౌరీ మిమాయ సలిలాని తక్షతీ । ఏకపదీ ద్విపదీ*
*సా చతుష్పదీ । అష్టాపదీ నవపదీ బభూవుషీ । సహస్రా*
*క్షరా పరమే వ్యోమన్ ।'* (కృ. య. బ్రా. 2. కాం. 4. ప్ర. 6. అను.)

తా॥ బ్రహ్మయందు ప్రతిష్ఠితమైన గౌరవర్ణమగు వాగ్దేవత సృష్ట్యాదియందు వర్ణములను (అక్షరములను), పదములను, వాక్యములను సృజించుచున్న దగుచు, శబ్దమును జేసెను.

### శబ్ద వివరణము.

అనగా ప్రథమములో వాగ్దేవత ప్రణవరూపముగ బ్రహ్మ ముఖమునుండి ఏకప్రకారముగ నిర్గతమైనది (ఏకపదీ). అనంతరము వ్యాహృతిరూపముగను, సావిత్రీ రూపముగను రెండు విధములుగ నిర్గతమైనది. (ద్విపదీ). అనంతరము వేదచతుష్టయ రూపముగ నాల్గు విధములుగ నిర్గతమైనది (చతుష్పదీ). పిమ్మట

'సిక్షా, వ్యాకరణం, ఛందో, నిరుక్తం, జ్యోతిషం, తథా ।
కల్ప శ్చేతి షడంగాని...................................॥'

అను రీతిగ షడంగములతోను, పురాణధర్మశాస్త్రములతోను యెనిమిది విధములుగ సరస్వతి బ్రహ్మముఖము నుండి నిస్సృతమైనది. అనంతరము మీమాంసా, న్యాయ, సాంఖ్య, యోగ, పాంచరాత్ర, పాశుపత, ఆయుర్వేద, ధనుర్వేద, గాంధర్వములచే నవవిధముగ బయలువెడలెను. పిమ్మట అనంతము లగు వాక్యసందర్భములచే అనేకవిధము లైనది.

*'తస్యాగ్ం సముద్రా అధివిక్షరంతి । తేన జీవంతి*
*ప్రదిశ శ్చతస్రః । తతః క్షర త్యక్షరం । తద్విశ్వ*
*ముపజీవతి ।'* (2. మం.)

తా॥ ఆ వాగ్దేవతయందు సముద్రసమానము లైన (అనంతములైన) వేదములు వివిధముగ ప్రవర్తించుచున్నవి. ఆ వేదోక్త కర్మాను ష్ఠానముచే సర్వదిక్కుల నున్న ప్రాణులందరును ఐహికా___ముష్మిక ఫలములను పొందుచుండిరి. ఆ వేదమునుండియే ప్రణవము సారరూపముగ నిర్గతమైనది. ఆ ప్రణవోపాసనచే అధికారి పురుషులు ఆత్యంతిక పురుషార్థమును పొందుచుండిరి.

ఫలితము: ప్రథమ మంత్రములో అంగోపాంగసహిత మగు శబ్దజాత మంతయు అక్షర, పద, వాక్య, రీతిగ బ్రహ్మనుండి వెలువడినట్లు స్పష్టముగ ప్రతిపాదిత మైనది. రెండవ మంత్రములో అనంతములగు వేదములు వివిధముగ ప్రవర్తించుచున్నవి. అనగా నిశ్వసిత రూపముగ బయలు వెడలినట్లును, తదుక్తకర్మానుష్ఠానముచే సర్వపురుషార్థములను సర్వప్రాణులు పొందుచున్నట్లును చెప్పబడుచున్నది.

## పూర్వమంత్రము.

'దేవీం వాచ మజనయంత దేవాః తాం విశ్వ
రూపాః పశవో వదంతి । సా నో మంద్రేష మూర్జం
దుహానా । ధేను ర్వా గస్మానుపసుష్టు తైతు ।'

తా॥ ఉత్తరమంత్రములో "గౌరీమిమాయ । పరమే వ్యోమన్న్" అని చెప్పబడియున్నది. అనగా బ్రహ్మ ముఖమునుండి సరస్వతి అక్షర, పద, వాక్యాది రూపముగ నుద్భవించినట్లు చెప్పబడినది. 'దేవీం వాచం' అను పూర్వమంత్రములో దేవతలందరును వాగ్దేవతను పుట్టించిరను అర్థమును గ్రహించరాదు. స్వభాషారూపముగ వాగ్దేవతను వ్యవహరించిరని యర్థము. 'తాం విశ్వరూపాః పశవో వదంతి' అను మంత్రభాగము ఈ యర్థమునే దృఢపరచుచున్నది. అనగా సంస్కృత భాషచే దేవతలు వ్యవహరించిరని యర్థము.

భావము: ద్విపా చ్చతుష్పాద్రూపము లగు సర్వప్రాణులు ఆ వాగ్దేవతను స్వస్వభాషారూపముగ వ్యవహరించుచుండిరి. దేవతలు స్వభాషారూపముగ వాగ్దేవతను వ్యవహరించిరి. అని యనుటచే 'దేవతలభాష యేది?' అను శంక జనించుచున్నది. శ్రుత్యంతరము సంస్కృతమును దేవభాషగా తెలియజేయుచున్నది.

'అనృతా త్సత్య ముపైమి । మానుషా ద్దై వ్య
ముపైమి । దై వీం వాచం యచ్ఛామి ।' (కృ. య. బ్రా. 1. కాం. 2. ప్ర. 1. అను.)

'అథ యజమానో వ్రత ముపైతి అనృతా త్సత్యమితి ।
వాచం చ యచ్ఛతి దైవీం వాచం యచ్ఛామీతి ॥' (ఆ. శ్రౌ. సూ.)

తా॥ యజ్ఞమునకు పూర్వము అహవనీయము, గార్హపత్యము, దక్షిణాగ్ని అను పేరుగల త్రేతాగ్నులను ఉత్పాదన చేసెడి ఆధానమను శ్రౌత్రకర్మానుష్ఠానములో 'అనృతాత్సత్య ముపైమి' అను మంత్రముచే వ్రతస్వీకరణమును, 'దైవీం వాచం' అను మంత్రముచే వాఙ్నియమమును శ్రౌత్రసూత్రము బోధించుచున్నది.

మం. తా. అగ్నిరాహిత్య లక్షణమగు అనృతమునుండి అగ్ని మత్వలక్షణమగు సత్యమును బొందుచుంటిని. అనగా, ఈ ఆధానముకు పూర్వము త్రేతాగ్నులు లేవు. ఈ అధానకర్మచే త్రేతాగ్నులు సంప్రాప్త మగును. కావున అగ్నియుక్తుడ నగుచుంటి నని అభిప్రాయము.

మరియు మనుష్యాచరణమువలన దేవయోగ్య మగు కర్మా చరణమును పొందుచుంటిని. అనగా, ఈ ఆధాన మను శ్రౌతకర్మాచరణకు పూర్వము త్రేతాగ్నులు లేవుగాన, మనుష్యకర్మాచరణమే గాని. దేవ కర్మాచరణము లేదు. ఇప్పుడు ఆధానముచే అగ్నిసిద్ధి యగుచున్నది గాన, త్రేతాగ్నిసాధ్యము లగు యజ్ఞాది దేవకర్మలకు మూలభూత మగు ఆధానమను దేవయోగ్యకర్మాచరణను పొందుచుంటి నని తాత్పర్యము.

## సంస్కృతము - దేవభాష

'దైవీం వాచం యచ్ఛామి' (మం.)

వి. భా. ॥దైవీం దేవసంబంధినీం, వాచం, యచ్ఛామి నియతాం కరోమి । సంస్కృతభాషయైన వ్యవహారామీ మిత్యర్థః ।" ఇతి. అనగా, దేవసంబంధ మయిన వాక్కును నియతమైనదానినిగ చేయుచుంటిని. ఈ కర్మానుష్ఠానకాలమందు (ఇత ఊర్ధ్వమున) దేవభాషయగు సంస్కృత భాషచేతనే వ్యవహరించెదను. ఈ శ్రుతి, దేవభాష సంస్కృతమనియు, (అనగా) సంస్కృత భాషచేతనే దేవతలు మాట్లాడుకొనెదరనియు స్పష్టముగ చెప్పుచున్నది.

"వాచే వేహతం" అను విధివాక్యము వాగ్దేవతకు ఈచుకు పోయినగోవును (వేహత్ - గర్భఘాతినీ) ఆలంభము చేయవలసినదిగ విధించుచున్నది.

ఈ యాగములో పురోడాశయాగముకు పురోనువాక్యాయాజ్యా మంత్రములలో లౌకిక, వైదిక శబ్దములకు ఆనంత్యము, భాషాభేదములు వర్ణించబడుచున్నవి -

*'అనంతా మంతాదధి నిర్మితాం మహీం । యస్యాం*
*దేవా అదధు ర్భోజనాని । ఏకాక్షరాం ద్విపదాగ్ం*
*షట్పదాం చ । వాచం దేవా ఉపజీవంతి విశ్వే ।'* (కృ.య.బ్రా. 1.8.8.)

తా॥ ఇంద్రాది దేవతలు 'ఇంద్రాయ స్వాహా' ఇత్యాది మంత్రములచే హోమము గావింపబడిన హవిస్సునే భుజించెదరు. కావున, దేవతల భోజనమునకు వాక్కు నిమిత్తము. ఇట్టి వాక్కు పరమేశ్వరుని వలన అధికముగ నిర్మితమైనది. ప్రణవరూపముచే ఏకాక్షరముగను, సంస్కృతా_పశబ్దభేదముచే ద్విప్రకారముగను, ప్రాకృత, పైశాచికాదిభాషా భేదముచే షడ్విధముగను నిర్మిత మగుటచే అత్యధిక మైనది.

మరియు, లౌకిక, వైదిక శబ్దములకు అంతము లేదు. (అనంతాం) ఇట్లు శ్రుతి చెప్పుచున్న అనంత్యమును వ్యాకరణ మహాభాష్య సూక్తులచే వివరించిరి.

## మహాభాష్యోక్తి.

దేవతలకు గురువగు బృహస్పతి దేవలోకములో వ్యాకరణ శాస్త్రమును చెప్పెడి గురువు. ఇంద్రుడు బృహస్పతి వద్ద వ్యాకరణశాస్త్రమును అధ్యయనము చేసెడి శిష్యుడు. ఇట్టి ఇంద్రుడు బృహస్పతి వద్ద వ్యాకరణశాస్త్రమును దేవమానముచే సహస్ర సంవత్సరములు అధ్యయనము చేసెను. అయినను, వ్యాకరణ శాస్త్రము నంతను పూర్తిగ అధ్యయనము చేయలేకపోయెను.

ఈ భాష్యమువలన వేదములోని వైదిక సంస్కృత శబ్దములు గాక, లోకములో గూడ వేరుగ సంస్కృత శబ్దము లున్నట్లును, అలౌకిక, వైదిక శబ్దములకు హద్దు లేదనియు, 'న హి లౌకిక, వైదిక శబ్దానాం పారోస్తి' అను విద్యారణ్య భాష్యము వలన స్పష్ట మగుచున్నది.

ఈ శబ్దము లన్నియు పరమేశ్వరుని వలన వచ్చినట్లు పై శ్రుతి చెప్పుటచే వైదిక సంస్కృత శబ్దముల నుండి లౌకిక సంస్కృత శబ్దములు వచ్చినవా? లేక, లౌకిక సంస్కృత శబ్దముల నుండి వైదిక సంస్కృత శబ్దములు నిష్పన్నములైనవా? అనుశంకలకు తావులేదు.

## మనుష్యులలో భాషాభేదములు.

మరియు, ఆధునికులలో వ్యవహరించుచుండెడి ప్రాకృతము, పైశాచికము (అసగా అరవము) మున్నగు ఆరువిధము లగు భాషా భేదములు గూడ 'షట్పాదాం చ' అను పై శ్రుతివలన పరమేశ్వరునుండి వచ్చినవే యని స్పష్టమగుచున్నది.

## కొన్ని జాతులలో అపశబ్దములు.

మానవులలో కొందరు అపశబ్దములతో మాట్లాడుట అందఱకును తెలిసిన విషయమే. ఈ అపశబ్దములు గూడ పరమేశ్వరునిచే సృజించ బడినట్లు పైన ఉదహరించని 'ఏకాక్షరాంద్విపదాం' అను శ్రుతిసంస్కృతా పశబ్దరూపముగ ద్విప్రకారమైన వాక్కును పరమేశ్వరుడు సృజించె నని స్పష్టముగ వక్కాణించుచున్నది.

# పశుపక్ష్యాదిభాషలు.

'వాచం దేవా ఉపజీవంతి విశ్వే । వాచం గంధర్వాః
వశవో మనుష్యాః । వాచీమా విశ్వా భువనా న్యర్పితా ।
సా నో హవం జుషతా మింద్రపత్నీ ।' (కృ. య. బ్రా. 2. కాం. 8. ప్ర. 8. అను.)

తా॥ పూర్వమంత్రములో చెప్పిన రీతిగ సర్వదేవతలును ఆహుతిప్రదానకాలమందు ఉచ్చరించెడి 'ఇంద్రాయస్వాహా' ఇత్యాది మంత్రరూప మగు వాక్కును అనుసరించి జీవించుటయే గాక, గంధర్వులు, పశుపక్ష్యాదులు మున్నగు సర్వలోకములందలి ప్రాణులు (సర్వజీవులు) స్వస్వభాషారూప మగు వాక్కును ఆశ్రయించియే ప్రవర్తించుచుండిరి. తిర్యగ్జంతువు లగు పశువులు గూడ స్వభాషారూపమగు హంభా రవముచేతనే వ్యవహరించుటను మనము చూచుచునేయుంటిమి.

ఇదివరలో లోకములోను, వేదములోను సంస్కృతభాషను గూర్చి పరస్పరనిరపేక్షగా రెండును ప్రవర్తించుచున్నట్లు వ్రాసి యుంటిమి. ఇప్పుడు సింహావలోకనన్యాయముగ తిరిగి పూర్వ మీమాంసాశాస్త్రానుసారము దానిని స్థూణానిఖననన్యాయముగ దృఢము చేయడ మగుచున్నది.

సూ. 'ప్రయోగ చోదనాభావా ద ర్థై కత్వ మవిభాగాత్ ।'
శ్లో॥ "లోకే పదపదార్థా యౌ న తౌ వేదేథ వాత్ర తౌ ॥" (పూ. మీ. జై. న్యా. మా.)

ఈ అధికరణములో లోకములో నుండెడి పదపదార్థములును, వేదములోని పదపదార్థములును, భిన్నములా? లేక ఏకములా? యని శంకించి, అవి రెండును ఒక్కటియే గా ని భిన్నములు గావని సిద్ధాంతీకరించిరి.

దీనిని బట్టి, లోకములోని సంస్కృత పదములును, వేదములోని సంస్కృతపదములును వేరుగా నున్నట్లు విమర్శించుటచే, వేదము లోని సంస్కృతపదముల నుండి లోకములోని సంస్కృతపదములు వచ్చినవని గాని, లోకములోని సంస్కృత పదముల వలన వేదములోని సంస్కృతపదములు వచ్చిన వని గాని అనుటకు వీలులేదు.

లోకములోను, వేదములోను అన్యోన్యాపేక్షలేకయే సంస్కృతపదములు వ్యవహారములో నున్నట్లు స్పష్ట మగుచున్నది.

ఇట్లు వైదిక లౌకిక పదపదార్థములు మాత్రమే ఏకవిధములే గాని, లోకములోనివి, వేదములోనివి, వేరుమాత్రము కాదని అధికరణ సిద్ధాంతము. అచ్చటచ్చట క్వాచిత్కముగ రూపభేద మున్నను అత్యధికముగ పదైక్య ముండుటచే లోకములోను వేదములోను

పదములకును తదర్థములకును ఏకత్వమే కాని భేదములేదని పూర్వమీమాంసలో సిద్ధాంతితము.

'లోకములో వ్యవహరించబడియెడి సంస్కృత పదజాల మంతయు బ్రహ్మముఖము నుండి నిర్గతమైనచో వేదములవలె లౌకిక పదజాలమునకు కూడ అపౌరుషేయత్వ మేల సంభవించదు?' అని శంకింప వీలులేదు. ఎట్లన,

'సోఽ_కామయత । బహు స్యాం ప్రజాయేయేతి ।'

'స ఐక్షత । ఇమాన్ లోకా న్ను సృజా ఇతి ।'

ఇత్యాది శ్రుతిజాతమువలన ప్రజాపతి, సృష్టికి పూర్వము ప్రథమములో సృష్టి చేయవలెనని సంకల్పించి, అనంతరము సృష్టి చేయుచున్నట్లు తెలియుచున్నది. అనగా, ఈక్షాపూర్వకముగ సృష్టియే గాని, సంకల్పరహితమగు సృష్టి గానవచ్చుట లేదు. ఈవిధముగ సర్వప్రాణులను సృజించినపిమ్మట ఆ ప్రాణుల వ్యవహారము కొఱకు పూర్వోక్త విధముగ సంస్క-తాది భాషారూపముగ బ్రహ్మముఖము నుండి సరస్వతి (వాక్కు) నిర్గత మైనది. అనగా, సంస్కృతాది భాషలను ప్రాణుల వ్యవహారము కొరకు సృజించెను. వేదము లన్ననో –

'అస్య మహతో భూతస్య నిశ్వసిత మేవైత ద్య

దృగ్వేదో యజుర్వేద స్సామవేదో హ్యథర్వాంగిరసః '

తా॥ ఇత్యాది శ్రుతులవలన వేదములు అప్రయత్నముగ బ్రహ్మనుండి నిట్టూర్పు రూపముగ (నిశ్వసితము) బయలువెడలినవిగావున అపౌరుషేయములు, నిత్యములు, సంస్కృత భాషాదులు ముఖమునుండి ప్రయత్నపూర్వకముగ నిష్పన్నములు గావున, వేదసామ్యము లేకపోవుటచే వేదములవలె లౌకిక సంస్కృతపదజాతమునకు అపౌరుషేయత్వ ప్రసక్తి లేదు.

సమాప్తము

ఓం తత్సత్.

# సత్యదేవుని సన్నిధిని నిరంతర సేవలో తరిస్తున్న అధికార యంత్రాంగం

## వేదపండితులు

1. ఉపాధ్యాయుల నాగ యజ్ఞేశ్వర సోమయాజి ఘనాపాఠి
2. కపిలవాయి రామశాస్త్రి
3. ముష్టి కామశాస్త్రి
4. శ్రీపాద రాజశేఖరశర్మ
5. గొర్తి వెంకట విశ్వేశ్వర ఘనాపాఠి
6. చింతా వెంకటచలపతి శర్మ అవధాని
7. వేదుల సూర్యనారాయణ అవధాని
8. గంగాధరభట్ల గంగబాబు
9. చిట్టి శివరామశర్మ
10. వేదుల సూర్యనారాయణ శర్మ
11. జి.వి.ఆర్. సుబ్రహ్మణ్య శర్మ
12. ఉపాధ్యాయుల వెంకటలక్ష్మి నరసింహ సోమయాజి ఘనాపాఠి

## అర్చక స్వాములు

13. దేవులపల్లి సత్యనారాయణ, ప్రధాన అర్చక
14. ఇంద్రగంటి గోపాలకృష్ణ, "
15. ప్రయాగ లక్ష్మీనారాయణ
16. పెంద్యాల భాస్కర శర్మ
17. శ్రీకాకుళపు వరదయ్య
18. కొండవీటి కృష్ణమూర్తి
19. కొడమంచిలి సర్వేశ్వర రావు
20. యడవిల్లి సత్యనారాయణ
21. నాగాభట్ల సత్యనారాయణ
22. గాడేపల్లి వెంకటేశ్వర రావు
23. కంచిభట్ల వరప్రసాద్
24. బలుసు సుబ్రహ్మణ్యం
25. చాడ శేషగిరిరావు
26. ఇంద్రగంటి లక్ష్మీనరసింహ మూర్తి
27. కొండవీటి సత్యనారాయణ
28. ఇంద్రగంటి వెంకటేశ్వర్లు
29. కంచిభట్ల వెంకటరమణ
30. గాడేపల్లి సత్యనారాయణ
31. ఎస్.వి.ఆర్. సుబ్రహ్మణ్య శర్మ
32. కోట వి.వి.ఎల్.ఎన్. శర్మ
33. కోట వి.వి. సుబ్రహ్మణ్యం
34. చిట్టెం వి.ఎస్.ఎస్. హరగోపాల్
35. గంగాధరభట్ల శ్రీనివాస్
36. చేబ్రోలు కృష్ణమోహన్
37. పాలంకి పఠాభిరామ మూర్తి, బ్రహ్మ
38. నాగాభట్ల కామేశ్వర రావు, ఉపబ్రహ్మ
39. తొయ్యేటి సుబ్రహ్మణ్యం, ప్రధాన పర్యవేక్షకులు
40. చామర్తి వెంకట్రావు, "
41. ముత్యా సత్యనారాయణ, "
42. నాగాభట్ల పెదవీరభద్ర శర్మ, "
43. మంధా సోమనాధం, పర్యవేక్షకులు
44. కర్రి వెంకట్రావు, "
45. ఆకుండి వ్యాసమూర్తి, "
46. కర్రి వైకుంఠరావు, "
47. ముక్కరాల వెంకట్రావు, "
48. చామర్తి కన్నబాబు, "
49. నాగాభట్ల రవి వెంకట్రామ సత్యనారాయణ
50. కొడుకుల శ్రీనివాసరావు, "
51. వారణాసి సత్యనారాయణ, "
52. ద్విభాష్యం సుబ్రహ్మణ్య శర్మ, "
53. అల్లంరాజు సత్య శ్రీనివాసులు, "
54. ప్రయాగ ఆంజనేయులు, "
55. మంధా శ్రీరామమూర్తి, "

## పాలనా విభాగము.

1. ఎస్. రామచంద్రరావు, పి.ఏ.
2. పోల్నాటి గోవిందరావు, పి.ఏ.
3. ఏ. రాఘవాచార్యులు, పి.ఏ.
4. ఇవటూరి సూర్యకాంత శర్మ, పి.ఏ.
5. సత్యవోలు వెంకటరామ సుబ్బారాయుడు, సూపరింటెండెంట్
6. మోకా భాస్కర అమ్మిరాజు, "
7. చేబ్రోలు రామ్మోహనరావు, "
8. ఎస్. రామశాస్త్రి, "
9. పి. సత్యనారాయణమ్మ, "
10. కోన రామారావు, "
11. రెబ్బాప్రగడ పాటీవరప్రసాదరావు, "
12. లంకలపల్లి వి.ఎస్. రమణరావు, "
13. యేడిద లక్ష్మీనారాయణ, "

14. కె. బ్రహ్మరాజు, "
15. డి.బి.ఆర్. సింగ్, "
16. కొంపెల్ల రామ్మోహనరావు, ఛీఫ్ రిసెప్షనిస్ట్
17. ఈవూరి వెంకటరాజు
18. జి.వి. ప్రసాదరావు
19. చిలుకూరి సూర్యనారాయణ
20. వెలగా సత్యనారాయణ మూర్తి
21. ఎస్. సత్తి అబ్బాయి
22. వై.వి.ఎస్.ఎస్. బ్రమరాంబ
23. బి.ఏ.ఎల్. సత్యవతీదేవి
24. కోటగిరి వి.ఎస్.ఎస్.ఆర్.కె. కొండలరావు
25. సి.ఏ.వి.జి.ఎస్. శంకర రావు
26. మలిశెట్టి శ్రీనివాసరావు
27. బి. శ్రీనివాసరాజు
28. డి.వి.ఎస్. కృష్ణారావు
29. తులా రాముడు
30. కె. సుబ్రహ్మణ్యం
31. డి. సురేంద్రనాథ్
32. ఆర్.ఎస్.ఆర్. లక్ష్మణస్వామి
33. ఎల్. శ్రీనివాస్
34. కె.వి.ఎన్.భూపాల్
35. పి.వి.ఎస్.ఎస్. భాస్కర్
36. బి.ఎస్. శ్రీనివాస్
37. చల్లా జె. వీర్రాజు
38. పి. కృష్ణప్రసాద్
39. పి. సత్యకుమార్
40. రాజవరపు సత్య శ్రీనివాస్
41. జి. హృషీకేశం
42. పి. స్వామిజీ
43. కె. సతీష్
44. కె.వి.యస్.యన్. మూర్తి
45. పి.వి. రమణ
46. సి.హెచ్. సాయిబాబా
47. ఎమ్.వి.కె. సుబ్రహ్మణ్యం
48. టి. సత్యనారాయణ

ఏ.టి.జి. విజయసారథి, సీనియర్ ఆడిటర్ (స్పెషల్ గ్రేడ్)

## సాంకేతిక విభాగం

1. కె. వెంకటేశ్వర రావు, ఇ.ఇ. (సివిల్)
2. ఎన్. జగన్నాథం, ఇ.ఇ. (ఎలక్ట్రికల్)
3. డి.జి. శ్రీనివాసరాజు, డిప్యూటీ ఇ.ఇ.
4. బి. ప్రసాదరావు, "
5. పి. గుర్రాజు, ఏ.ఇ.
6. శ్రీమతి వి. నూకరత్నం, ఏ.ఇ.
7. వి. రామకృష్ణ, డ్రాఫ్ట్‌మెన్
8. మాదన వీరస్వామి, వర్క్స్ ఇన్‌స్పెక్టర్
9. సి.హెచ్. రతన్ రాజు, "
10. వి.ఎస్. రాంబాబు, "
11. ఆర్.వి.వి.ఎస్. సుధాకర్, "
12. పి. రాజబాబు, "
13. ఇ.వి.ఎస్. శ్రీనివాస్, "

## మెడికల్ అండ్ హెల్త్

1. డా॥ ఏ.వి. సూర్యారావు
2. డా॥ శంకర శెట్టి కొండలరావు (ఆయుర్వేద)
3. జె.ఎస్. రత్నం
4. వి. మాధవి
5. ఆర్. నూకరాజు
6. టి. వెంకటేశ్వర రావు (శానిటరి)

## రికార్డు అసిస్టెంట్స్

1. డి. రమణారావు
2. అల్లం గోపాలకృష్ణ
3. అనిశెట్టి సత్యనారాయణ
4. వర్రే రామకృష్ణ
5. డి.వి.యన్. రాము
6. సోమురాయుడు
7. జి.వి.వి. సుబ్రహ్మణ్యేశ్వరరావు
8. టి. గుర్రాజు
9. ఐ.వి. రామారావు
10. రావు సత్యనారాయణ
11. వెదురుపాక సత్యనారాయణ
12. జె. సత్యనారాయణ మూర్తి
13. ఆర్.వి. రమణమూర్తి
14. వి. జగన్నాథం
15. ఎమ్. నాగేశ్వరావు
16. కె. సూర్యనారాయణ

## ఎలక్ట్రికల్

1. ఎమ్. గోపాలరావు
2. ఎమ్.జి. వెంకటేశ్వరరావు

3. సుంకర సత్యనారాయణ
4. ఎ. శ్రీనివాసరావు

## ట్రాన్స్పోర్టు

1. పి.వి.ఎ.యస్.కె. వర్మ
2. యల్. చక్రం
3. యన్. సత్యనారాయణ
4. జి. బాబ్జి
5. పి.సి.హెచ్. మరిడియ్యి
6. జి. సూర్య సత్యనారాయణ
7. కె. కొండలరావు
8. కె. రామారావు
9. కె. నాగేశ్వర శర్మ
10. జె. నరసింహమూర్తి
11. ఆర్. సత్యనారాయణ
12. బి.యస్.యన్. రాజు
13. పి. వెంకటేశ్వరరావు
14. ఎమ్.వి.ఆర్. మోహన్‌రావు
15. పి.యల్. నారాయణ
16. అత్తి బాబూరావు
17. బి. హరిహరబాబు
18. డి. సత్యనారాయణ
19. టి. బాబూరావు

## వంట స్వాములు

1. ఎ. శీతారామయ్య
2. డి. కామేశ్వర శర్మ
3. అనిశింగరాజు సత్యనారాయణ
4. చామర్తి రాజారావు
5. శ్రీమతి ఎమ్. అన్నపూర్ణమ్మ
6. శ్రీమతి యన్. శ్యామలాదేవి

## తీర్థపు బిందె క్యారియర్

1. సాగి శ్రీనివాస రావు.

## ప్రసాదం పేకర్లు

1. డి.వి.ఆర్. శర్మ
2. యస్. కృష్ణమూర్తి
3. సాగి శ్రీనివాసరావు
4. యన్.వి.యస్. కామేశ్వర రావు
5. యస్. మాణిభూషణరావు
6. ఎస్.ఎస్.ఆర్. ప్రసాద్.

## అటెండర్లు

1. యస్. సూర్యనారాయణ
2. పొన్నాడ సత్యనారాయణ
3. ఐ.వి. రమాదేవి
4. కొండి కృష్ణమూర్తి
5. ఆర్. సత్యనారాయణ
6. కె. బుజ్జమ్మ
7. జి. రామచంద్రరావు
8. యల్. సోమన్నదొర
9. పి. ఆదినారాయణ
10. టి.వి. రమణ
11. యస్. కృష్ణమూర్తి
12. యల్. రాముడు
13. సి.హెచ్. రమణమ్మ
14. కె. కృష్ణ
15. పి. సూర్యనారాయణ
16. నెల్లిపూడి సత్యనారాయణ
17. సి.హెచ్. సత్యనారాయణ
18. పి. చక్రం
19. పి. సత్తిబాబు
20. పి. సత్యం
21. కె. రమణబాబు